# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఏ.,

సంపుటము 4. సంచిక-2. | బుధవారము, జనవరి 17, 1951. | ప్రతి బుధవారము వెలువడును.


## విషయానుక్రమణిక

—$—

## ప్రకటన.

జమ్మలమడుగు కాంగ్రెసు ఎన్నికలు.

జమ్మలమడుగులో జరుగబోవు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యుని ఎన్నికలు జమ్మలమడుగు ముసాఫర్ బంగళాలో 21-వ తేది జరుగునని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ ఎన్నికయుద్యోగియైన శ్రీ. మహాశాబ్దేగారు, జిల్లా కాంగ్రెసు కార్యాలయమునకు తెలియజేసియున్నారు. పంచాయితీదార్లు గమనింపవలెను.

## ప్రకటన.

సిద్ధవటము కాంగ్రెసు ఎన్నికలు— 23-1-1951

శ్రీ. నాగిరెడ్డి సుబ్బారెడ్డిగారికి కాంగ్రెసు పంచాయితీదార్లు తమఓటునిచ్చి కాంగ్రెసు గౌరవమును కాపాడవలెను.

సిద్ధవటము.                కాంగ్రెసు వర్కర్లు.

(Space donated by Congressmen).

చిత్తూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో.

E. P. 249/50—O. S. 263/41.

యస్. క్రిష్ణయ్యశెట్టి వగైరా ... ... ... వాదులు.

And

కొళందగాడు అనే చంద్రపిళ్లె వగైరా......ప్రతివాదులు.

ఏలపు నోటీసు.

పై నెంబరు డిక్రీ బాకీకిగాను, అడుగున వివరించగల ప్రతివాదుల సొత్తులను 5-2-1951 తేదీన పగలు 10 గంటలకు బహిరంగమైన ఏలం వేయబడును. కావలసినవారు కోరవచ్చును. సొత్తులు వివరం.

| | | | |
|---|---|---|---|
| 1) | స. పుంజ | 751/A | ఎ 1.27 |
| 2) | ,, | 757/1 | ,, 0.9 |
| 3) | ,, | 757/3 | ,, 0.35 |
| 4) | స. నంజ | 757/A | ,, 0.43 |
| 5) | ,, | 757/B2 | ,, 0.46 |
| 6) | ,, | 757/5 | ,, 0.31 |
| 7) | ,, | 757/8 | ,, 0.26 |
| 8) | ,, | 757/9 | ,, 0.11 |
| 9) | ,, | 757/6 | ,, 0.6 |
| 10) | స. పుంజ | 751/B | ,, 0.17 |
| 11) | ,, | 751/1 | ,, 0.14 |
| 12) | ,, | 751/2 | ,, 0.8 |

చిత్తూరు, 12-1-1950.        కె. సి. శ్రీనివాసాచారి, వాదుల వకీలు.



అమెరికా దేశములో స్థిరనివాసము లేర్పరచుకొన్న హిందూదేశీయులకు ముఖ్యఆహారము "సాలమన్" అను చేపలే. ఇదే వారికి ముఖ్యపరిశ్రమ. ఈ చేపలను పట్టుటకు అమెరికా ప్రభుత్వమువారినుండి వీరు స్పెషల్ హక్కులను పొందగలిగియున్నారు.

U. S. I. S.

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 2. | వికృతి సం॥ పుష్య శు ౧౦, జనవరి 17, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## యూనియన్ హోంశాఖ — శ్రీ. సావార్కారుగారు.

శ్రీ. వినాయక దామోదర సావార్కారుగారు భారతదేశ స్వాతంత్ర్యమునకై గావించిన త్యాగము, సేవ, నిరుపమానమైనది. ఇండియా ప్రభుత్వ మంత్రి వర్గములో మంత్రులుగా నియమింపబడుటకు, దేశసేవయే ఒక యోగ్యతగా భావించిన చో,— శ్రీ వినాయక దామోదర సావార్కారుగారికి మించిన దేశసేవా ధురంధరుడీ భారత దేశమున మఱియొక వ్యక్తి కానరాడు. ఇప్పుడు ఇండియా యూనియన్ లో పనిచేయుచున్న ఏ మంత్రి పుంగవుకిని తీసిపోరు. ఇండియాలో 1946 సం॥ సెప్టంబరు నెలలో తత్కాలిక జాతీయ మంత్రి వర్గము నేర్పరచినప్పుడుకాని లేక 1947 సం॥ స్వతంత్ర ఇండియా మంత్రివర్గము నేర్పరచినపుడుగాని, ఈ విషయము గాంధిజీకి తట్టకపోవుటయే ఒక దౌర్భాగ్యము. సర్వసమత్వము గల శ్రీ. జవహరిలాలుగారికి తట్టకపోవుట కూడ ఒక విషాదమే.

ఇండియా మంత్రివర్గములో స్థానమిన్వకున్ననుమానె. బ్రిటీషువారి పరిపాలన క్రింద రాజకీయ ద్రోహిగా పరిగణింపబడి, అండమానుదీవులలో పడరాని కష్టము లనుభవించిన వీరశిఖామణికి —ఎన్నియో సంవత్సరముల పోరాటమునకును, త్యాగమునకును ఫలితముగా లభించిన స్వాతంత్ర్య ఇండియాలో, స్వతంత్ర పౌరుడుగా జీవించుటకు కూడ స్థానము లేక పోయెనుకదా!

బ్రిటీషువారి పరిపాలనా కాలములో, పోలీసువారనినను, వారి రహస్య రిపోర్టులన్నను, సి. ఐ. డీలన్నను, వారి డైరీలనినను, కేవలము హేయ భావముగాను —అసత్యపు రిపోర్టులుగాను భావించుచున్న కాంగ్రెసు నాయకులు, స్వాతంత్ర్యము లభించి, అధికార పదవులు చేబట్టగనే —అదే పోలీసువారి రహస్యరిపోర్టులను, డైరీలను, సి. ఐ. డి. వారి కుతంత్రములను వేదవాక్యములుగా భావించుటకన్న గొప్ప పొరపాట్లున్నవా? గాంధీజీ హత్యకేసులో, దేశసేవా పరాయణుడగు శ్రీ. సావార్కారుగారికి ఏమో ప్రత్యక్ష జోక్యమున్నదని పోలీసు రిపోర్టులపై అధారపడి, అతనినికూడ ముద్దాయిగా చేర్చిరి. కాని అదృష్టవశమున గాంధీజీ హత్యకేసును విచారించిన న్యాయమూర్తి శ్రీ. సావార్కారుగారు నిర్దోషియని తీర్పుచేసి, వెంటనే విడుదల చేయుట కుత్తరవు గావించిరి.

ఈ విడుదలను పోలీసువారు వారిప్రతిష్టకు కళంకమని భావించిరి. ఇండియా కంతటికిని ఏకైక నాయకుడును, ప్రధాన మంత్రియు అగు శ్రీ. జవహరిలాలుగారి మీదకూడ కుట్రజరుగు చున్నదనియు; ఆకుట్రతో శ్రీ. సావార్కారుగారికి కూడ సంబధమున్నదనియు మఱియొక వదంతిని లేవదీసిరి. దీనిని కీ॥ శే॥ సర్దారు పటేలుగారు కూడ నమ్మిరి. శ్రీ. సావార్కారు పై నిషేధములను బొంబాయి ప్రభుత్వ హోంశాఖవారు ప్రవేశపెట్టగనే కీ॥ శే॥ సర్దారు పటేలుగారు కూడ కండ్లుమూసుకొని కూర్చొనిరి. పాకీస్తాన్ ప్రత్యేక దేశముగా ఏర్పడి, స్వతంత్రము లభించినతర్వాత, స్వాతంత్ర్య సమరములో భాగస్వాములైన

ఖాన్ అబ్దుల్ గఫ్ఫూర్ ఖాన్ గారిని, అతని సోదరుని ఏ విధముగా నిర్బంధములపాలుజేసి, పాకిస్థాన్ మంత్రివర్గమువారు పరిపాలనము సాగించుచున్నారో, భారత ప్రభుత్వమువారుకూడ దేశ సేవయందు మహాయోధులని చెప్పబడు శ్రీ సావార్కారుగారిని అస్వతంత్ర పౌరునిగా ఒనర్చి పరిపాలన సాగించు చున్నారు.

శ్రీ వినాయక దామోదర సావర్కారుగారు హిందువులై యుండవచ్చును. భారతీయ విజ్ఞానమునందును, ప్రతిభ యందును, హిందూమతమునందును, ఎక్కువ విశ్వాసముండవచ్చును. ఇంతమాత్రముచేత ఇతడు స్వమతమునందు అమితమైన మూఢవిశ్వాసము కలవాడని భావించుట పొరబాటు. దేశస్వాతంత్ర్యమునకై తపించి, జపించి, త్యాగము గావించిన ఋషితుల్యుడగు శ్రీ సావార్కారుగారు అపూర్వ నాయకుడును, శాంతిదూతయు అగు గాంధీజిని హత్యగావించుటకు పాలుపడునంత దేశద్రోహియా? ముప్పదిఐదు కోట్ల భారతీయులకు ఏకైక నాయకుడై, ప్రపంచ రాజకీయవేత్తలలో ఒకడుగా పరిగణింపబడుచు, దేశీయులకందరికి ఆశాజ్యోతిగా వెలయుచున్న శ్రీ జవహరిలాలుగారిపై కుట్రపన్ను నంతటి హీన మానవుడా ఈ సావార్కారు? పోలీసుశాఖవారి కల్పిత రిపోర్టును నమ్మి బొంబాయి హోంశాఖా మంత్రిగారు ఈ మహావ్యక్తిపై ఇంకనునిర్బంధములుంచుటయు; వానిని కేంద్రప్రభుత్వ హోంశాఖవారు ఆమోదించుటయు విచిత్రముగ నున్నది.

ప్రతిభాశాలురైన శ్రీ రాజగోపాలాచార్యులవారు యూనియన్ హోంశాఖా మంత్రిగా నియమింపబడి యున్నారు. వీరు మత విచక్షణ జ్ఞానమును ఉపయోగించి, కీ॥ శే॥ సర్దారు పటేలుగారు శ్రీ సావార్కారు విషయమై గావించిన తప్పును సరిదిద్దుదురుగాక! ఇందువలన ఇండియా ప్రభుత్వముపైనను, స్వాతంత్ర్యము పైనను ఏర్పడిన మచ్చను తుడిచివేయుటకై, శ్రీ సావార్కారుగారిని స్వేచ్ఛా పౌరునిగా యొనర్చెదరు గాక! యని కోరుచున్నాము:

—*—

## పాఠకులకు విజ్ఞాపన.

ఫిబ్రవరి నెలనుండి ఈ "భారతజ్యోతి" వారపత్రిక 1/8 రాయల్ సైజులో పుస్తక రూపమున సర్వాంగ సుందరముగ ప్రకటించుటకై వలయు ఏర్పాటులన్నియు చురుకుగా జరుగుచున్నవి. ఎక్కువ పుటలుకూడ చేర్చబడును. సామాన్య ప్రజల విజ్ఞానాభివృద్ధికై వలయు విషయము లనేకములు ఇందు చేర్చబడును. పాఠకులుకూడ ఈ అవకాశమును గైకొని, వారి వారికి అభిమానమైన విషయములపై వ్యాసములను, ప్రజల కష్టములకు సంబంధించిన లేఖలను వ్రాయుచు మాకు వలయు ప్రోత్సాహ మొసగ ప్రార్థించు చున్నాము.

అన్ని ముఖ్యమైన పట్టణములలోను, ప్రదేశములలోను, మా పత్రికలను విక్రయించుటకు ఏజంట్లు కావలయును. ఏజంట్లుగా ఉండదలచిన వారు వెంటనే దరఖాస్తులను పంపుకొనవలెను.

పోష్టుబాక్సు నెం. 10, కడప.

మేనేజరు, "భారత జ్యోతి"

## గాంధీజీ జ్ఞాపకార్థము

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్నిపనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసికొందురు గాక !!

తెర విమర్శనము :

# జెమినీవారి మంగళ.

దక్షిణ ఇండియాలో జెమినీవారి తెరచిత్రము లెక్కువ ప్రఖ్యాతి కొచ్చినవి. ఫోటోగ్రాఫింగులో నేమి, సందర్భాను సారముగ ఫోటోచిత్రములను కూర్చుటలో నేమి, దృశ్యములను తయారుచేయుటలో నేమి, ఇతర సాంకేతిక విషయములలో నేమి, శ్రీ వాసన్‌గారి మేధాసంపత్తి మెచ్చతగినది. పాటలు సర్వజనాంగీకారముగ నుండును. వీరి 'చంద్రలేఖ' ప్రజాసమూహములో అత్యద్భుతమైన ఆకర్షణను సంపాదించినది. ఇప్పుడు విడుదల కాబడిన "మంగళ" సాధారణ చిత్రములకన్న రెండంతలు పొడవుగలదైనను, ఇందులో వాడబడిన కథావస్తువు, అచ్చటచ్చట తప్ప, మొదటినుండి కడవఱకును ప్రేక్షకుల నాకర్షింపజాలకున్నది.

మానవాతీతమైన శక్తులు, మానవ శక్తులతో కలిసి, ప్రకృతి కతీతమైన దృశ్యములను చూపు, "ప్రహ్లాద — సత్యహరిశ్చంద్ర — శ్రీ కృష్ణ జననము" మొదలగు పురాణచిత్రము కాదు. ఈ "మంగళ" — ప్రస్తుత ప్రజాజీవితమును ప్రతిబింబించు సాంఘికచిత్రము కాదు. సాధారణముగ సినిమాలను చూచుటకై వెళ్ళు సామాన్య ప్రజలలో రాజులుండరు. అటువంటి రాజులను ఇటువంటి చలనచిత్రములలో చూచుట ప్రకృతి యనుకరణము కాజాలదు. మంగళ స్వగృహమునుండి, బంధింపబడిన కోటలోనికి ఒక సొరంగమును ఏర్పాటుచేయు కథాసందర్భము, ప్రేక్షకులను మెప్పింప జాలకున్నది. ఒప్పింపజాలకున్నది. ఒక సామాన్య రైతుకుటుంబమునకు సంబంధించిన వ్యక్తులు ఎవ్వరికంట పడకుండ కోటలోనికి సొరంగము త్రొవ్వించుట ఈ కాలములో కాని లేక గతించిన కాలములోకాని సంభవమా అని [illegible]లున తట్టుచున్నది. అందువలన కథయంతయు సంపూర్ణముగ కల్పితమనియు, ప్రకృతి అనుకరణము కాదనియు ప్రేక్షకులకు జ్ఞాపకము చేయుచున్నది.

సారంగధర లోని కథాసందర్భములో, సారంగధరుడు పావురములను పెంచుటయు, ఆకస్మికముగ ఒకనాడు ఒక పావురము, తన పినతల్లియైన చిత్రాంగి గృహముపై వ్రాలుటయు, ఆ పావురమును తెచ్చుకొనుటకై అమాయకముగ సారంగధరుడు పినతల్లి గృహము ప్రవేశించుటయు, కొడుకని యైన జ్ఞానములేక, చిత్రాంగి సారంగధరుని మోహించుటయు, కలదు. అదే విధముగ ఒక సామాన్యరైతుకు ఏకైక పుత్రికయగు "మంగళ" పావురములను పెంచుటయు, ఆ పావురములలో నొకటి రాజభవనము ప్రవేశించుటయు, దానిని తెచ్చుకొనుటకై నవకోమలవతియైన "మంగళ" రాజభవనము త్రొక్కుటయు, రాజు దృష్టి వెంటనే ఆయువతిపై పడుటయు, ఆకర్షింపబడుటయు; వెంటనే ఆ పడుచును బలవద్గమనముచేయ ప్రయత్నించుటయు; "మంగళ" నిరాకరించుటయు, అందువలన రాజునకు పౌరుష మతిశయించుటయు; ఒకనాడు పొలములో నొంటరిగా మంగళ యున్నదని తెలిసికొని, రాజు వెళ్ళి రమించుటకు ప్రయత్నించుటయు; ఈమారుకూడ "మంగళ" తో చీవాట్లుతిని, విఫలమనోరథుడై, మంగళను చెఱయందు బెట్టుటయు; మంగళను పెండ్లియాడి తీరుదునని రాజు పందెము బలుకుటయు: తన్ను పెండ్లియాడిన, తనకు కలిగిన పుత్రునితో రాజును కొరడాదెబ్బలు కొట్టించెదనని "మంగళ" ప్రతి సవాలు చేయుటయు; ఎట్టకేలకు వివాహమునకు "మంగళ" లోబడుటయు; కారాగృహము నుండి తన యింటికి సొరంగము వేయించుకొని, దానిగుండా తన యింటికి పోయి, దొమ్మరవారితో చేరి, దొమ్మరవిద్యనంతయు నేర్చుకొని, రాజుయెదుటనే వినోదములను గావించి, రాజు నాకర్షింప చేయుటయు; వారి కలయికవలన కలిగిన కుమారుని, తనతండ్రి పెంచుటయు; వాడు పెద్దవాడైన పిదప తల్లి పంతము చెల్లించుటకై రాజ సభా భవనములో కొరడాతో రాజును కొట్టుటయు మొదలగు విషయములచే కథావస్తువు, కథా దృశ్యములు నింపబడినవి.

ఈ కథ సర్వసాధారణముగ గ్రామసీమలలో వాడుకలో నున్నది. ఎప్పుడును దాసీజనముచే చూడబడుచుండు "మంగళ" తన గర్భమును ఏ రీతిగా దాచగలిగినది, ప్రసవమును వారికి తెలియక యెటుల దాచగలిగినది సహేతుకరముగా తెలుపబడలేదు. కథా వస్తువులో యిట్టి లోపములు పలుచోట్ల గలవు. అందువలన యిందౌచిత్య మెక్కువగ లేదు. వాస్తవిక పరిస్థితులకు వ్యతిరేకముగా నున్నది.

ఈ మంగళలో కథానాయకి శ్రీమతి భానుమతి. సుప్రసిద్ధ నటపురాలు. "మంగళ" పాత్రను శ్లాఘనీయముగ నిర్వర్తించినది. కథానాయకుడైన రంజన్‌ను కూడ తన కౌశలముచే భానుమతి మఱుగుపఱచినది. చిత్రనిర్మాతల సాంకేతిక ప్రతిపత్తిచేతను, శ్రీమతి భానుమతి నాయికాపాత్రను ధరించుటచేతను, సామాన్య ప్రజలెల్లరికి ఈ చిత్రము వినోదముగనే యుండునని చెప్పుటకు సందేహము లేదు.

—లీలావతీ నారాయణ.

# సంపాదకీయ లేఖలు.

## ప్రొద్దుటూరు మునిసిపాలిటి పొదుపు.

ఆర్యా,

ప్రభుత్వ నిబంధనల ప్రకారము 25 రోలు సంఖ్య, 20 హాజరు సంఖ్యలకు, ఒక ఉపాధ్యాయుని నియమించవచ్చును. కాని ఈ ప్రొద్దుటూరు మునిసిపాలిటీలో, పై నిబంధనల ప్రకారము ఉపాధ్యాయుల నియమించుట లేదు. రామేశ్వరము, మోక్షగుండము, హోమ్సుపేట, వసంతపేట, బొల్లవరము, మోడమీదిపల్లె స్కూళ్ళలో విద్యార్థులరోలు— హాజరుసంఖ్యలకు తగినట్లు - ఉపాధ్యాయులు లేరు. బాల బాలికల స్కూళ్ళను కలిపివేయుటతో, టీచర్లు తమ శ్రమను ఎక్కువ కర్చుపెట్టవలసి వచ్చుచున్నది. కాని జీతములు మాత్రము పెంపుదలలేదు.

అదనముగా 8_9 మంది ఉపాధ్యాయుల నియమించవలసియుండగా ఉన్న ఉపాధ్యాయులకే ఉద్వాసన చెప్పుచున్న దీ మునిసిపాలిటీ. గోరుచుట్టపై రోకలిపోటన్నట్లు, అర్థాకలిచే చచ్చుచున్న ఉపాధ్యాయులను నిరుద్యోగరాక్షసికి బలియొనర్చుచున్నది. క్రిస్మస్ శెలవులలో ముగ్గురిని ఇంటికి పంపి, తన పొదుపుస్కీమును ఈ విధముగా ఆచరణలో పెట్టుచున్నది.

విద్యార్థుల సంఖ్యకు తగినట్లు టీచర్లను వెంటనే నియమించి, స్వల్పవేతనములతో అలమటించుచున్న ఉపాధ్యాయులను, అధికశ్రమనుండి తప్పించవలెనని కోరుచున్నాను.

యం. సి. వెంకటరెడ్డి.

## తెలంగాణా రైతునాయకులకు ఉరిశిక్షలను రద్దుచేయుడు.

ఆర్యా,

మూడు సంవత్సరముల క్రిందట నైజాంనిరంకుశ పరిపాలనకు — రజాకార్ల అరాచక, అమానుష కృత్యములకు — జమీందారీ దోపిడీ విధానమునకు వ్యతిరేకముగా పోరాడడము అను నేరమునకు, ముద్దాయిలకు డిఫెన్సు అవకాశములను నిరాకరించుటయేగాక, కనీసము తమ తరఫున వాదించుటకు వక్కీలును సైతము పెట్టుకునే అవకాశమును కల్పించక, వారికి తెలియని ఇంగ్లీషు భాషలో విచారణ జరిపి, వారికి మరణశిక్షలు విధించుట అన్యాయము. వారికి ఉరిశిక్షను రద్దుచేయవలెనని ఇండియా యూనియన్ అధ్యక్షునకును, నైజాము రాజప్రముఖునకు తంతిద్వారా విజ్ఞాపన చేసుకొనియున్నాము.

జె. సి. సుబ్బన్న.

## కోర్టు నోటీసులు:

కడప అడిషనల్ డిస్ట్రిక్టు మునసపుకోర్టులో.

O. S. No. 312 of 1950.

యస్. యస్. అబ్దుల్ ఖాదర్ ... ... ... వాది.

Vs.

వహాబ్ బేకు, పాళెంపాపయ్యవీధి, కడప ... ప్రతివాది.

పై కోర్టులో వాది, ప్రతివాదిపైన ప్రోనోటుబాపతు అస్సలు, వడ్డీ చేరి రు. 1017_11_7లు రాబట్టుకొనుటకు దావా దాఖలుచేసి ఉన్నాడు. దావా 6_2_1951 తేదీకి వాయిదా యున్నది. ప్రతివాది సదరు దావాలో తనకు యేదైనా ఆక్షేపణ యున్నయెడల 6_2_1951 తేదీన హాజరయి తెలుపుకొన వచ్చును. లేనంతట నెంబరు ప్రతివాది పరోక్షమున తీర్మానించబడును.

కడప, 9_1_1951.

టి. యస్. క్రిష్ణస్వామి, వాది అడ్వకేటు.

## విజ్ఞప్తి

మా "భారతజ్యోతి" పాఠకులు వారికి అభిమానమైన విషయములను ఈ పత్రికకు ద్వారా చర్చించుటకు మేము అన్ని అవకాశములను ఒసగెదము.

ప్రజా నాయకుల పైనను, దేశనాయకుల పైనను, మంత్రుల పైనను ఇతరుల పైనను వ్యక్తిగతమగు దూషణలు కల జాబులను, వ్రాతలను మాత్రము ప్రకటింపజాలము.

కాగితములకు ఒక్కవైపు విడి అక్షరములతో స్పష్టముగా వ్రాయప్రార్థన.

సంపాదకులు.

# సంపాదకీయ లేఖలు.

## బేసిక్ విద్యా విధానము.

ఆర్యా,

పై శీర్షికక్రింద అక్టోబరు 11-వ తేది 'భారతజ్యోతి' పత్రికలో నేను వ్రాసిన లేఖను శ్రీ పి. వి. సుబ్బయ్యగారు నవంబరు 8-వ తేది, ఆదేపత్రికలో విమర్శించుచు ఒక లేఖను వ్రాసిరి. వివాదాస్పదమైన ప్రతి చిన్న అంశముపై ప్రతి విమర్శ చేయడము నా అభిమతము కాదు. ముఖ్యాంశముపై మాత్రమే వ్రాయదలచితిని. "పారిశ్రామికముగా పురోగమింప చేయవలెనని ఈ విలేఖరి" అని శ్రీ పి. వి. సుబ్బయ్యగారు నన్ను విమర్శించిరి. కాని యీ రీతిగా ఆశించేది నేను ఒక్కడనే కాదు. భారత ప్రధానమంత్రి శ్రీ జవహరిలాలు నెహురుగారుకూడా, ప్రపంచములోని యితర పారిశ్రామిక దేశాలతో సరిసమానముగా మన దేశమునుకూడా ముందుకు నడుపవలెనని అనేక పర్యాయములు చెప్పి యుండుటను మన మిత్రులు మరచి యుండవచ్చును.

ఇప్పటికే మనదేశములో పారిశ్రామిక పరిజ్ఞానము కలవారు చాల తక్కువ. ఇది పరిపాలకులు చేసిన ద్రోహము. పారిశ్రామికముగ దేశమును తయారుచేయవలెనని చెప్పుచున్న మన ప్రభుత్వము ఆ లోపమును తీర్చవలెనని మాత్రమే నేను చెప్పుచున్నాను. భావిపౌరులు కాబోవు నేటి విద్యార్థులకు, పారిశ్రామికముగ మంచి తర్ఫీదు నిచ్చిననేగాని ముందునకైనా ప్రధానిగారి ఆశయము నెరవేరదు.

శ్రీ పి. వి. సుబ్బయ్యగారు 'యంత్రములవలన మనకు ఉపయోగమున్నది' అని ఒక వైపు అంగీకరించుచు, రెండవ వైపు యిప్పటికే నెలకొనియున్న యంత్రపరిశ్రమలవలన గ్రామములు నిర్మానుష్యమైనవని, వ్యవసాయము కుంటుపడినదని వెలిబుచ్చిరి.

గ్రామములు నిర్మానుష్యమైనవని నమ్మమన్నచో కండ్లున్నవారెవ్వరు నమ్మలేరు. పల్లెలనుండి పట్టణములకు తరలివచ్చినవారు ధనికులే.

వ్యవసాయము కుంటువడినదనిన, దానికి కారణము యంత్రపరిశ్రమలు అభివృద్ధి యగుట కాదు. మీదుమిక్కిలి భూస్వామ్య సంస్కరణలను ప్రవేశపెట్టి, యంత్రపరిశ్రమలను వ్యవసాయములో ప్రవేశపెట్టక పోవుటయే, వ్యవసాయము కుంటుపడుటకు ప్రధానకారణము. కౌలు, గుత్తదార్లు పేదవారగుటచే, మంచి ఎరువులు, విత్తనములు, సకాలమునకు వేయలేకపోవుట, కష్టపడి పండించువారికి యిది "మా భూమి" కాదను నిరుత్సాహము, ప్రాజెక్టుల వసతి లేకపోవుటచే వర్షముపై ఆధారపడుట, అదియు సకాలమునకు రాకపోవుట,— ఇవన్నియు వ్యవసాయము కుంటుపడుటకు అసలు కారణములు.

పరిశ్రమలు వ్యక్తి ఆధీనమందుండిన, అవి తప్పనిసరిగా ప్రజలను నిరుద్యోగ రాక్షసికి బలిచేయును. సంపద యొక వైపు, దారిద్ర్యము ఒకవైపు అంతులేకుండా పెరిగిపోవును. అందుకే ప్రజాక్షేమమును కోరువారందరు పరిశ్రమలను ప్రభుత్వ పరము చేయవలెననుచున్నారు. పరిశ్రమలు ప్రభుత్వపరమైనపుడు వ్యవసాయము, బట్టలు, ఇతర నిత్యజీవితావసర వస్తువులకును, ఎన్ని యంత్రపరిశ్రమలు స్థాపించినను ఏలాటి నష్టము లేదు.

ప్రభుత్వపరమైన పరిశ్రమలు సంఘాభివృద్ధికి పాటుపడును. అందువలన సంఘమును తీర్చిదిద్దు భావిపౌరులైన విద్యార్థులకు, పారిశ్రామికముగ తర్ఫీదు ఇవ్వవలెననుటలో అసందర్భము ఏమీ లేదు. ఇక గ్రామములలో ప్రస్తుతము ప్రవేశపెట్టబడిన బేసిక్ విద్యావిధానము వలన విద్యార్థులే విధముగా స్వయంపోషకత్వమును పొందెదరో ఆ దేవునకే తెలియవలెను.

శ్రీ పి. వి. సుబ్బయ్యగారు నా వెంటవచ్చిన ఈ జిల్లాలో ప్రవేశపెట్టబడిన బేసిక్ స్కూళ్ళకు వెళ్ళి, అచ్చట విద్యావిధానము— వానివలన లాభములు— స్వయముగ విద్యార్థులను, ఉపాధ్యాయులను, విచారించి తెలిసికొనుటకు అవకాశముండును. కాగితముపై ప్రణాళికలుగాక ఆచరణలో అది ఏ విధముగా లాభించుచున్నదనూ దృష్టితో చూడవలెనని నేను శ్రీ పి. వి. సుబ్బయ్యగారిని కోరుచున్నాను.

వి. విజయరామరాజు.

## సంపాదకీయలేఖల సారాంశము.

రేషనింగు విధానమును రద్దుగావింప వలయునని, తాళ్ళప్రొద్దుటూరువాస్తవ్యులు, శ్రీ ఎ. లక్ష్మీనారాయణగారును, రేషనింగు విధానములో కొన్ని సవరణలు చేయవలయునని, వేంపల్లెవాస్తవ్యులు, జనాబ్ ఖాజీ మస్తాన్ సాహెబుగారును సంపాదకలేఖలను పంపియున్నారు. ఈనెల 1-వ తేదీ నుండి పట్టణములలో తప్ప, ఇతర గ్రామాదులలో రేషనింగు విధానము, కంట్రోళ్ళు, ప్రొక్యూరుమెంటులు తొలగింపబడునట్లు ఉత్తర్వులు జారీకాబడియున్నవి, కనుక పై లేఖలు ప్రకటింప నవసరము లేనందున ప్రకటింపలేదు. [సం॥ భా॥ జ్యో॥]

# స్వాతంత్ర్యము—బాగోగులు

మూలము:— శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు. అనువాదకులు:— శ్రీ. పి. వి. సుబ్బయ్యగారు.

[ఈ వ్యాసము ఇండియా పార్లమెంటు సభ్యులును, ఆర్థిక, రాజకీయరంగములలో అనుభవజ్ఞులును అగు శ్రీ. టి. టి. కృష్ణమాచార్లు గారు, ఆంగ్ల "స్వతంత్ర" దీపావళి సంచికకు వ్రాసియున్నారు. ఇండియా దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించి మూడు సంవత్సరములైనది. ఈ మూడు సంవత్సర కాలములో కాంగ్రెసు పార్టీ వారి యాజమాన్యము క్రింద దేశములకు కలిగిన లాభనష్టములను విపులముగా చర్చింప బడియున్నది. "భారతజ్యోతి" పత్రికా పాఠకుల ఉపయోగార్థమై ఆవ్యాస మిందు భాషాంతీకరింపబడి యున్నది:—

సం॥ "భారతజ్యోతి"]

భారత దేశము స్వతంత్ర ప్రభుత్వాధికారమును చేపట్టి నాలుగు వర్షములు గతించినవి. 1947 ఆగష్టు 15 నకు పూర్వము 11 మాసములు ప్రభుత్వాధికారమును కాంగ్రెసు, ముస్లిం లీగుతో కలిసి నిర్వహించుటచేత, తనకుగల అధికారము విశృంఖలము గాకపోగా శక్తివంతమైనది కూడ కాకపోయినది. లీగుతో భాగస్వామ్యము గలిగి దేశమును పరిపాలించి నపుడు, మననాయకులు గడించిన విషయానుభవము దృష్ట్యా 1947 జూన్‌లో దేశవిభాగమున కంగీకరించుట, న్యాయసమ్మతమై, తప్పనిసరియైనది. కాంగ్రెసు విశృంఖలముగా పరిపాలించిన శుభాశుభము లెట్లుండినను, కాంగ్రెసు— లీగు ఉమ్మడి పరిపాలన సాగియున్నచో, దేశమున రాజకీయ, ఆర్థిక పరిస్థితి నేటికంటె భరింపరాని అధ్వాన్నపు స్థితిలో నుండెడిది. విభాగము జరిగిన వెనుక మౌంటుబ్యాటన్ ప్రణాళికను ఆమోదించి నందులకు, కాంగ్రెసును నిందించుచు, బుద్ధిమంతులుగా లెక్కింపఁబడఁ గోరు మననాయకులు కొందఱు, మనము ముస్లిము లీగుతో చేయిఁగలిపి ఈ మూడు సంవత్సరములు పరిపాలన సాగించినట్లయితే, అట్టి ప్రమాదము వలన కలిగియుండు ముప్పుతిప్పలు, ఇప్పుడు మన మెదుర్కొనుచున్న సమస్యలకంటె, పదియంత లధికముగానుండి యుండునని, దూరదృష్టి లేని వారగుటచే తెలిసికొనలేక పోయిరి. ప్రకృతము భారతదేశ మనుభవించు చున్న ఆర్థిక దుస్థితి యొక్క చరిత్రకు వ్రేళ్ళు యుద్ధకాలమున పాతుకొనినవి. పైకమత్యధికముగా (కరెన్సీ —currency ) చలామణి యందుండుటకు కారణము యుద్ధము. అప్పటి ప్రభుత్వము ఆర్థిక పరిస్థితి నాలోచింపక, పైకమును (కరెన్సీని) ఎక్కువగా చలామణి యందుంచుటచేత, ఆర్థిక దుస్థితి మఱింత హైన్యము జెందినది. అయినప్పటికిన్ని ప్రభుత్వము తానుతీసికొను అప్పులద్వారాను, రిజర్వుబ్యాంకు నందెక్కువ నిల్వలుంచుటచేతను, ఈ యదనపు ద్రవ్యమును ఉపసంహరింపఁబడు ప్రయత్నములు జరిగినవి. అందుకుతోడు అన్నివిధములైన వస్తూత్పత్తి ఉచ్ఛస్థితిలోనే యుంచఁబడినది. అదియట్లుండ 1943—1945 సం॥ ల మధ్య 20 నెలల కాలములో, ధరల ఇండెక్సు 21 పాయింట్ల యందు మాత్రమే నిలిచి యుండుటవలన, ధరల కంట్రోలు చేయుట బాగుగనే సాగినదని చెప్పవచ్చును. ఆంగ్లో —అమెరికనుల యుద్ధప్రణాళికకు భారతదేశము ధనసహాయము చేయవలయునని పెద్దపెద్ద నివేదికలు పంపఁబ

డుచుండినను, సర్ ఆర్చిబాల్డు రౌలాండ్సు ఆర్థిక శాఖాధిపత్యమును వహించునప్పటికి, భారతదేశము యుద్ధానంతరము స్థిరమగు ఆర్థిక స్థితిలో వెలువడ గలదని భావింపబడినది. ఆర్థిక శాఖామాత్యుఁడుగా రౌలాండ్సు చేసిన పరిపాలనను నేను తడవుట, యుద్ధానంతరం భారతదేశపు ఆర్థిక స్థితికిని దానికిని ప్రబల సంబంధ ముండుటచేతనే, భారతదేశము యొక్క ఆర్థిక స్థితిని యుద్ధ ప్రణాళికలకు ముడివెట్టుట తరువాత కష్టనష్టములకు కారణమని సర్ జెరిమి రెయిస్‌మన్ను దుయ్యబట్టినను, అతఁడు తన వ్యవహారములందు దక్షుఁడని మాత్రము ఒప్పుకొనక తప్పదు. తన అధికారులగు బ్రిటీషువారు, అత్యాశాపూరితమగు కోరికలు చలామణి కావలయునని కోరుచున్నను, భారతదేశపు శ్రేయస్సు దృష్ట్యా అతిధైర్య స్థయిర్యముల ప్రదర్శించి నిశ్చయించుచు, మనమేలును కోరెను. రౌలాండు అధికారమును స్వీకరించిన తదుపరి భారతదేశ ఆర్థిక వ్యవస్థయను నావను నడుపుటకు పూనిన ప్రారంభికులు తమ వాస్తవిక స్థితిని గుర్తించిరి.

సకాలమున కెదురుజూడకయే రౌలాండ్సు 1946 లో రెయిస్ మన్ సిద్ధాంతములను మార్చుట అనునది, వ్యక్తిగత కార్యములందు జోక్యము జేసికొనరాదను ప్రభుత్వపు టార్థికవిధానముపై తనకుగల ద్వేషభావముచే జరిగెను. సలహాల నొసఁగఁజాలు అనుభవజ్ఞులుగాని, శక్తిగల మేధావులుగాని, అమాత్యులక్రింద పనిజేయు ఉద్యోగులలో కొద్దిగా నుండుటచేతనో, లేక బొత్తిగా లేనందుననో, అట్టి సలహానిచ్చుట జరగలేదు. భారతప్రభుత్వమున, ఆర్థికశాఖకు సంబంధిచిన సలహాదారుల వలనగాని, ఐ. సి. యస్. ఉద్యోగుల వలనగాని, నిపుణత్వమగు సలహాలు రౌలాండ్సు పరిపాలనలో, పరంపరంగా అధికారనకు వచ్చిన మంత్రులకు లభింపలేదు. ఆమంత్రులు స్వయముగా ఒక విధానము గలిగి గాని, దేశములో సహాయము పొందగలుగు పలుకుబడి, విజ్ఞానము గలిగిగాని యుండలేదు. ప్రకృతము స్టేట్సనబడు రాష్ట్రములకు ఏప్రెలు 1946, ప్రజామతీగల మంత్రులు పదవీ స్వీకార మొనర్చినట్లు గమనింపదగిన విషయము. ఈ పదవీస్వీకార మొనర్చిన వీరిలో రాజకీయముగా మెచ్చదగిన త్యాగశీలములు గలిగి యుండినప్పటికిన్ని, ఏ మంత్రివర్గములోనైనా, రాష్ట్రములలో తాను జేయగోరిన విషయముల గుఱించి విశిష్టములగు నిశ్చితాభిప్రాయముగలవారు, మచ్చున కొక్కరు కూడ లేకపోయిరి. యుద్ధకాలములో శిథిలమైన ఆర్థికవిధానమును, చక్కబఱచుట యందుగాని, లేక దానిని యుద్ధానంతర పరిస్థితులకు, అవసరములకు అనుగుణ్యముగా పునర్నిర్మాణ మొనర్చుటలో కేంద్రమునందేమి యొనర్పవలసినది వీరికి తెలియలేదు. నూతన రాజ్యాంగ చట్టమును నిర్మించు విషయములో రాష్ట్రప్రధానులను, ఆర్థిక శాఖామంత్రులను, వారి సెక్రిటరీలను, సలహాదారులను కేంద్రమునందు సమావేశములకు పిలిపించినపుడు, రచయితకు వీరిని కలుసుకొను సదవకాశములు లభ్యమయ్యెను. కాని ఒకవ్యక్తి యందైనను, వ్యక్తుల సమూహము నందైనను ప్రమాద పరిస్థితులలో పరిపాలన సేయు పాటవము రచయితకు కానుపింపలేదు. [సశేషము]

# ప్రపంచ రాజకీయములు.

ప్రపంచ రాజకీయములు చాల నిరాశా జనకముగ నున్నవి. ఆసియా ఖండములో చిన్న ప్రదేశమైన కొరియా దేశమునందు ప్రారంభమైన చిన్న కలహము, ఏ క్షణమున ప్రపంచ యుద్ధముగ పరిణమించునో యను భీతి తొలగలేదు. ఉత్తర కొరియాను, దక్షిణ కొరియాను ఏకముచేయు ప్రయత్నములటుండ, ఉత్తర కొరియన్‌లు దక్షిణ కొరియాలో ప్రవేసించి, పెద్ద పెద్ద పట్టణములను ధ్వంసముచేయుట; ఉత్తర కొరియావారు దక్షిణ కొరియాపై దురాక్రమణ చర్యను జరిపిరను కారణమున, ఒక్క క్షణములోపలనే అమెరికా దేశము తన సైనిక బలమును పంపి, ప్రపంచ ఐక్య దేశముల సమితి పేరుతో, ఉత్తర కొరియన్లను వెనుకకు తరిమి వేయుటతో తృప్తినొందలేదు. ఉత్తర కొరియాలో ప్రవేశించి, ప్రతీకార చర్యను సలుపుచు, ఉత్తర కొరియాలోని పట్టణములను అగ్నిపాలు చేయుట, పౌరులను అమానుష కృత్యములకు బలి చేయుట; మిలిటరీ నేరములక్రింద ఉరి శిక్షలు సాగించుట మొదలగునవి సాగించినది. ఇంతలో చైనాబలము ఉత్తర కొరియన్లకు లభించుటచే, ఆ బలముతో వారు ఐక్య దేశముల సమితి సైనికులను (అమెరికా సైనికులను) వెనుకకు మరల కొట్టునపుడుకూడ, వెనుకకు పరుగెత్తుకొని పోవుచు, వీలుండినపుడంతయు బాంబులు ప్రయోగించి, ఉత్తర కొరియాలో మిగిలియున్న పట్టణములను, రహదారులను, వంతెనలను, భూమి మట్టము చేసిరి. ఉత్తర కొరియన్‌లు, చైనావారు, అమెరికా సైనికులను 38—వ అక్షాంశ రేఖకు దక్షిణముగా తరమ కొట్టుటతో తృప్తిపడక, దక్షిణ కొరియాలో రెండవమారు ప్రవేశించి, అమెరికా సైన్యమును వెనుకకు నెట్టుచు, యిప్పుడు కూడ మిగిలియుండిన పట్టణములను, పరిశ్రమలను నాశన మొనర్చు చున్నారు.

ఇప్పుడు దక్షిణ కొరియా యున్ను, ఉత్తర కొరియా యున్ను, శ్మశానములై పోయినవి. వీనిని పునర్నిర్మాణము గావించుటకు ఎన్నియో సంవత్సరములు పట్టును. కోట్ల కొలది ద్రవ్యము కావలసి యున్నది. ఇప్పటికైనను కొరియా దేశములో శాంతి చేకూరునను ఆశ కనిపించలేదు.

* * * *

## అమెరికా.

అమెరికా ప్రజల మనో తత్వము సులభముగా అర్థమగునదికాదు. మార్షల్ ప్రణాళికక్రింద అనేక దేశముల ఆర్థిక పునర్నిర్మాణమునకై, తామే ముందునకొచ్చి, సహాయ మొనర్చి యున్నామనియు; ప్రపంచ శాంతి భద్రత యంతయు తమ పైననే ఆధారపడి యున్నదనియు భావించు చున్నారు. ప్రపంచ ఐక్యదేశముల సమితి యాజమాన్యమున, పేరుకు మాత్రము కొరియాలో యుద్ధము సాగుచున్నను, అందు ఎక్కువగా జోక్యము కలిగించుకొనినది అమెరికా దేశము ఒక్కటే. యుద్ధములో తమ సైనికుల చావులకు సంబంధించిన లెక్కలు ఎక్కువగ వారికి చేరు చున్నవి. అందువలన పౌరుషము ఎక్కువగుచున్నది. దక్షిణ కొరియానుండి తమ సైనికులను ఉప సంహరించుకొనుటకు వారిష్టపడుటలేదు. చైనా కమ్యూనిష్టుల ఉధృతమునకు ఒగ్గి, కమ్యూనిష్టుచైనా ప్రభుత్వమును అంగీకరించుటకు సహించుటలేదు. అట్లు చేయుట వారు అపజయమును అంగీకరించినట్లేనని భావించు చున్నారు. ఇది ప్రపంచ యుద్ధముగా పరిణమించునను భయము అమెరికావారికి బొత్తిగాలేదు. కమ్యూనిష్టు చైనాను తృప్తిపఱచు సూచన లెవ్వరు గావించినను, వారికి సహించు నటువంటి మనస్తత్వము లేదు. ఆటం బాంబులను ప్రయోగించి, కమ్యూనిష్టు చైనాను లొంగతీసి, తమ పౌరుషమును చెల్లించుకొనవలెననియే కలవరించు చున్నారు.

రూజువెల్టురీతి, ప్రజాభిప్రాయమును అరికట్టుశక్తి ట్రూమన్‌కు లేదు. తనకు ముందు జరుగు ఎన్నికలలో ఆధ్యక్ష పదవి వచ్చినను, రాక పోయినను, చింతింపవలసిన పనిలేదని, తాను న్యాయమని తలచు దానిని చేయు నైతికశక్తి ట్రూమన్‌కు తక్కువ. అధికారాపేక్షయే ఎక్కువ. దురదృష్ట వశమున కొరియాలో అమెరికా సైనికులకు పరాజయము కలిగినా, ప్రపంచ యుద్ధము తప్పని సరిగా యేర్పడవచ్చునని రాజకీయ నాయకులు భావించు చున్నారు.

* * * *

## యుగోస్లావియా.

యుగోస్లావియా, ఐరోపా ఖండములో ఒక చిన్న స్వతంత్ర దేశమైనను, ప్రజలలో కమ్యూనిష్టు భావము ఎక్కువగా యున్నను, ధైర్యముతో, రష్యాను ధిక్కరించినది. సాధారణముగ క్షామ దేశము. రష్యా దేశముతో స్నేహ సంబంధములను వదలుకొనిన తర్వాత, పరిశ్రామికముగ చాల దెబ్బ తినినది. కాని అమెరికా, బ్రిటీషు దేశముల సానుభూతిని సంపాదించుకొని, ఆర్థిక పురోభి వృద్ధికి పాటుపడు చున్నది. బాగుగ తరిబీదుపొంది సామర్థ్యముగల 5,00,000 సైనికులను మార్షల్ టిటో సమకూర్చుకొని యున్నాడు. గ్రీసు దేశముతో రాజకీయ సంబంధమును కలుగజేసికొనియున్నాడు.

ప్రజల నిత్య జీవితములకు ఉపయోగపడు వస్తువులెంతమాత్రము యుగోస్లావియాలో లేవు. రైతాంగము ఎక్కువగా పండించుట మానుకొని యున్నారు. భూములు లేని

వారిని బ్రతికించుటయే కష్టముగా యున్నది. రష్యా వొత్తిడి చాల తీవ్రముగా నున్నను, దేశ జాతీయ స్వాతంత్ర్యమును రక్షించుటకై మార్షల్ టిటో చాల ధైర్య సాహసమును చూపుచున్నాడు. దక్షిణ కొరియాపై ఉత్తరకొరియా దురాక్రమణను సమర్థించెను. అందువలన అమెరికానుండి ఆర్థిక సహాయమును పొందెను. తన రాష్ట్రములో వివిధ వర్గములవారి సహకారమును పొందుటకై, రాజకీయ ఖైదీలను విడుదల చేయుట కుత్తరువు చేసియున్నాడు. అందువలన రైతులు ఎక్కువ ఉత్సాహముతో ఎక్కువ ఉత్పత్తి చేయుటకై పాటు పడెదరని తలంపబడు చున్నది. టిటో గొప్ప సాహసమైన రాజకీయ వ్యక్తిగా ఎల్లరిచే ఎంచబడు చున్నాడు.

* * * *

## జర్మనీ దేశము.

జర్మనీ దేశమును రెండవ ప్రపంచ యుద్ధములో ఎవరు ఓడించి వారిని నిరాయుధులనుచేసి, కేవలము దీనులుగా నొనర్చిరో అట్టివారే ఈ దినము మరలా జర్మనీవారికి సర్వ విధమ్ము న ఆయుధముల నొసగి శక్తివంతమైన దేశముగా మార్చుటకై యాతురత చూపుచున్నారు. దీనికి కారణమేమి? తూర్పు దిశన రష్యా దేశమునుండి, పశ్చిమ దేశములకు ఏ క్షణములో యేమి ముప్పు వాటిల్లునో అను భయమే యిందులకు కారణము. రష్యాదేశము పశ్చిమ దేశములపై దాడి సాగించినచో, జర్మనీ దేశముతప్ప, మరేదియు ఎదుర్కొనజాలదని అమెరికా, బ్రిటీషు, ఫ్రెంచి దేశములకు ఇప్పటికి స్పష్టముగా అర్థమైనది. పశ్చిమ జర్మనీ దేశములో, అందు ముఖ్యముగ రూర్ (Rhur) ప్రాంత్యములోని పరిశ్రమలను, కార్మాగారములను విధ్వంసమొనర్చి, ఎన్నియో యుగముల వఱకును జర్మనీని నిర్వీర్యమైన దేశముగా నొనర్చి, ప్రపంచములో తల యెత్తకుండ చేయవలెనని అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు దేశీయులు తలచిరి. కాని ఇప్పుడు ఆ భావములన్నెల్ల మార్చుకొనిరి. కర్మాగారములను విధ్వంసమొనర్చు విధానమును నిలిపివైచిరి. అందువలన యుద్ధమునకు ముందు ఎంత ఉక్కును, ఇతర పరిశ్రామిక వస్తువులను జర్మనీ దేశము తయారు చేయు చుండెనో, ఇప్పుడుకూడ అదే పరిమాణమును ఉత్పత్తి చేయు స్థితికి జర్మనీ దేశము మరలా వచ్చినది.

పశ్చిమ జర్మనీ దేశము ఆక్రమిత దేశమై ఆక్రమిత చట్టమునకు లోనై యుండినను, కడచిన సెప్టంబరు నెలనుండి అధికారమును చలాయించు దేశములు జర్మనీ శాసనములపై వీటి నుపయోగించు హక్కును సడలించి యున్నారు. జర్మనీలో ఫెడరల్ కోర్టు త్వరలోనే స్థాపింపబడ నున్నది. అప్పుడు న్యాయ పరిపాలన యంతయు సంపూర్ణముగ దానికే ఒప్పగింపబడును. దేశ ఆర్థిక విధానముపైకూడ జర్మనీ దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము చేకూర నున్నది. అంతర్జాతీయ నిధిలోను, అంతర్జాతీయ వ్యాపార సంస్థలోను సభ్యత్వము చేకూరగనే దిగుమతి ఎగుమతులపై సుంకము పైన, మారకపు రేటుపైన (exchange) కంట్రోలు వైతొలగును. దీనికితోడు విదేశాంగ శాఖలో ఫెడరల్ ప్రభుత్వమునకే పూర్తి స్వతంత్ర మొసగబడును.

బ్రిటను, ఫ్రాన్సు దేశములకన్నను, అమెరికా దేశమువారే జర్మనీ విషయములో చాల ఆతురతతో ముందుకు పోవుచున్నారు. పశ్చిమ జర్మనీ సంపూర్ణ స్వాతంత్ర్యమును అంగీకరించు విషయమై అమెరికా ప్రతినిధియైన మెక్‌క్లాయ్ (McCloy) కిని జర్మనీ ఛాన్సిలర్ కును త్వరలో సంప్రతింపులు జరుగనున్నవి. జర్మనీని పూర్వపు స్థితికితెచ్చి, రష్యా మధ్యను, పశ్చిమ ఐరోపా దేశముల మధ్యను ఒక కోటగా తయారు చేయవలెనని అమెరికా దేశము చూపుచున్న ఆతురతవలన బ్రిటీషు, ఫ్రాన్సు దేశములు సమ్మతింపకున్నను, అమెరికావారు మాత్రము సర్వహక్కులు, స్వాతంత్ర్యము బాన్ (Bonn) ప్రభుత్వమువారికి ఇచ్చుటకు సంసిద్ధులై యున్నారు.

---

# ఇండియా రాజకీయములు.

నూఢిల్లీ పట్టణమునుండి లండన్ నగరములో కామన్ వెల్తు ప్రధాన మంత్రుల సభకు ఇండియా ప్రధాన మంత్రిగారైన శ్రీ జవహరిలాలుగారు జనవరి 1_వ తేది ప్రయాణమై వెళ్లిరి. లండన్ నగరమునకు ప్రయాణమై పోవుటకుముందు డిశంబరు 31_వ తేది రేడియోద్వార దేశీయుల కెల్లరికి శ్రీ జవహరిలాలుగారు ఒక సందేశము నొసగిరి. దానిలో జాతీయ, అంతర్జాతీయ సమస్యలను, హృదయావేదనతో చర్చించిరి. ఆహారము జాతీయ సమస్యలలో చాల ప్రాముఖ్యమైనది. దానిని గుఱించి మాటలాడుచు:_

"మనకు కావలసినంత ఆహారము విదేశములనుండి రానిచో, మన దేశములోని ఆహార కొరతను దేశమున కంతయు వర్తింప జేయవలెను. ఒక ప్రదేశములో అత్యధికముగా ఆహార ధాన్యముండుట, మఱియొక ప్రదేశములో ఒక్క గింజయైనను లేకుండుట మనము చూచి ఓర్చుకొనకూడదు. దేశములో అనేక ప్రదేశములలో రేషనింగును రద్దుచేసి, బాధ్యతను తగ్గించుకొనవలెనని కొందఱు సలహా యొసగుచున్నారు. ప్రభుత్వమువారు తమ బాధ్యతను తప్పించుకొనుటకది అనుకూలమైన మార్గము. అట్లు చేయుటవల్ల ప్రభుత్వము నేరము చేసినదగును. ప్రజల పక్షము నిర్వహింపవలసిన ధర్మమును, బాధ్యతను తప్పించుకొనినదగు"నని చెప్పిరి.

పై వాక్కులు మామూలు ధోరణిలో రాలేదు. కొంత తీవ్రమైన ఆవేదనతోనే వెలువడినది. కఠినమైన పదములనే ఉపయోగించి యున్నారు. ఈ ముఖ్య సమస్యపై ఆహార శాఖా మంత్రియు, వాణిజ్య శాఖా మంత్రియు, రాష్ట్రమంత్రి వర్గములు అవలంబించుచున్న, అవలంబింపనున్న విధానముతో తృప్తిలేక పై భావములు శ్రీ జవహరిలాలుగారి నోటినుండి వెలు వడినవని స్పష్టమగు చున్నది.

* * * *

అంతర్జాతీయ విషయములలో ప్రస్తుతము కొరియాలో కొనసాగుచున్న యుద్ధ సమస్యయే ప్రపంచ రాజకీయములలో ప్రాముఖ్యమైన సమస్య. ఈ సమస్య పరిష్కారము పైననే ప్రపంచ శాంతి ఆధారపడి యున్నది.

"ప్రపంచ సమస్యలను శాంతి యుతముగా పరిష్కరింపవలెనను దృష్టితోనే చూడవలెను. శాంతి స్థాపనకై భారత దేశము గావించుచున్న ప్రయత్నములను ఒకొక్కప్పుడు మన మిత్రులే దురభిప్రాయ పడుచున్నారు. కాని ప్రపంచ శాంతిని నెలకొల్పుటయే భారత దేశము యొక్క ముఖ్యాశయమని వారందరు ఇప్పుడిప్పుడు గ్రహించు చున్నారు. లండన్ నగరములో జరుగనున్న కామన్ వెల్తు ప్రధాన మంత్రుల సభ, ప్రపంచములో వ్యాపించిన నిరాశను తొలగించుటకు తోడుపడునని ఆశించు చున్నాను. సరియైన మార్గములో ఒక్క చిన్న కార్యమును సాధించినను, ఆ సమావేశము ఎంతో ఘన కార్యము సాధించినటుల భావింపవచ్చు"నని, ఇండియా ప్రధాన మంత్రిగారు నుడివిరి. ఇంతలో అమెరికా దేశము ఐక్యదేశముల సమితిలో చేరిన రెండు దేశములకు కమ్యూనిస్టు చైనా కొరియాలో దురాక్రమణ గావించినదనియు, ఆంక్షలు ప్రయోగించుటకు సమ్మతింపవలె ననియు సూచనలను గావించినది. ఈ సూచనలు లండన్ పట్టణములో జరుగుచున్న కామన్ వెల్తు దేశముల ప్రధాన మంత్రులకు చేరినది.

ఈ సూచనలపై శ్రీ జవహరిలాలుగారు తమ అభిప్రాయమును వెలిబుచ్చుచు:_

"చైనాపై పరిమిత యుద్ధము జరుపుటవల్లకాని, ఆ దేశములపై ఆర్థిక ఆంక్షలను ప్రయోగించుటవల్లకాని దూర ప్రాచ్య సమస్య పరిష్కరించుటకు వీలుండదు. అటువంటి ఆలోచనలను నేను పూర్తిగా నిరసించు చున్నా" నని ఖండితముగా తమ వ్యక్తిగతయభిప్రాయమును ఇతర కామన్ వెల్తు మంత్రులకు తెలియజేసిరని వార్తలు వచ్చినవి. వీరు వెలుబుచ్చిన నిర్మొగమోటమైన అభిప్రాయము అమెరికా వారికి నచ్చక పోవచ్చును. కాని ప్రపంచ శాంతిని కాపాడవలెనన్న కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును అంగీకరించి, ఐక్యదేశ సమితిలో స్థాన మొసగుటకన్న వేరు గత్యంతరము లేదు.

* * * *

ఒక విపరీతమైన వార్త ప్రకటింప బడినది. ఆహార సమస్య విషయమై ఇండియా ప్రధాన మంత్రిగారికెట్టి నిష్కర్షగల అభిప్రాయ మున్నదో పైన వివరింపబడినది. చైనా ప్రభుత్వమువారు 10 లక్షల టన్నుల బియ్యమును ఇండియాకు పంపగలమనియు; అందుకు బదులు డాలర్లుకాని, స్టర్లింగులు కాని, బంగారుకాని వదలదనియు; 7,50,000 బేళ్ళ జనప నార సంచులు ఎగుమతి చేసిన చాలునని ఇండియా ప్రభుత్వమువారికి తెలియజేసిరి. కొరతపడు ఆహార ధాన్యమును బర్మానుండికాని లేక అమెరికానుండికాని దిగుమతి చేసుకొనవలెనని ఇంతవఱకు ఇండియా ప్రభుత్వమువారు తహ తహ పడుచుండిరి. చైనానుండి 10 లక్షల టన్నుల బియ్యము పంపుదుమని లేఖ వచ్చి రాకమునుపే, ఇండియా ప్రభుత్వము వారు అంగీకారమొసగి _ 7 లక్షల 50 వేల బేళ్ళ సంచులను ఎగుమతి చేయుదుమని ఒడంబడిక గావించుకొన వలసి యుండినది. కాని అటుల జరుగలేదు.

కలకత్తాలో జనపనార సంచులతో వ్యాపారముచేయు ఆంగ్లేయ వర్తకులు, హైందవ వర్తకులు గలరు. వారు హాంకాంగుద్వారా ఆ సంచులను చైనా దేశమునకు పంపుచు, అత్యధికమైన లాభములను సంపాదించుకొనుచున్నారు. చైనా ప్రభుత్వమువారు కోరినన్ని సంచులను ఇండియా ప్రభుత్వము వారు కంట్రోలు ధరలకు ఎగుమతి చేయుచో, తమ చీకటి వ్యాపారమునకు భంగము కలుగునని తలచి, కలకత్తా వ్యాపారస్తులు 7 లక్షల 50 వేల బేళ్ళ సంచులు ఎగుమతిచేయ కష్టమని ఇండియా ప్రభుత్వ వాణిజ్య శాఖలోని యుద్యోగులకు తెలియ జేసిరనియు, వారిని లోబఱచు కొని రనియు, అందువల్ల ఈ యొడంబడిక త్వరలో జరుగుటకు కాల యాపన మయ్యె ననియు తెలియుచున్నది.

కట్టకడపటికి ఈ రహస్యమంతయు లండన్ నగరమునకు ప్రయాణము కానున్న శ్రీ జవహర్లాలుగారి దృష్టికి తే బడెననియు, అందుపై వారు కోపించుకొని, త్వరలో బియ్యము దిగుమతికై, చైనా ప్రభుత్వమువారితో ఒడంబడిక గావించుకొనవలెనని కఠినముగా తెలిపిరి. అందువల్ల విధిలేక చైనా ప్రభుత్వమువారు కోరినన్ని గోనె సంచులు ఎగుమతి చేయుటకు లేవను నెపమున 37,000 బేళ్ళ సంచులను ఎగుమతి చేసి, 50,000 టన్నుల బియ్యమును మాత్రమె దిగుమతి చేసు కొనుటకు ఇండియా—చైనా ప్రభుత్వములమధ్య ఒడంబడికలు జరిగినవనియు తెలియుచున్నది.

స్వార్థ లాభపరులు దేశ సౌభాగ్యమును, దేశ ప్రజల కష్ట నిష్ఠురములను గమనింపక ఎటుల ప్రవర్తించెదరో ఇందు వలన తెలియనగును.

ఈ రీతిగా ప్రకటింపబడిన వార్తలో నిజముండవచ్చును. లేకుండవచ్చును. ఇండియా ప్రధాన మంత్రిగారు లండన్ పట్టణమునుండి రాగనే, ఆహార శాఖా, వాణిజ్యశాఖా మంత్రులతో పై విషయములను చర్చించి, సమగ్రమైన విచారణ సలిపెదరని తలచు చున్నాము:—

---

విద్యార్థులకు — విద్యార్థినులకు:

# మీ భారతదేశమును గూర్చి తెలుసుకొనుడు.

## ఇండియా యూనియన్ ప్రభుత్వము.

ఇండియా దేశము విభజన చేయబడిన తర్వాత 12,20,099 చదరపుమైళ్ళ విస్తారము కలిగియున్నది. (1948-వ సం॥) 33,70,00,000 జనసంఖ్య కలదని అంచనా వేయబడినది. కీ॥ శే॥ సర్దారు వల్లభభాయి పటేలుగారి కృషివల్ల 566 స్వదేశ సంస్థానములు 15 రాష్ట్రములుగ చేయబడినవి. నూతన రాజ్యాంగ చట్టము క్రింద 9 రాష్ట్రములు (స్టేట్సు), 5 స్టేట్సు యూనియన్‌లు, 3 చిన్నరాష్ట్రములు, 11 చీఫ్ కమిషనర్ల రాష్ట్రము లున్నవి.

డా॥ రాజేంద్రప్రసాద్ గారు — ఇండియా యూనియన్ అధ్యక్షులు.

మంత్రులు — శాఖలు :

1. పండిత జవహర్లాల్ నెహురు — ప్రధానమంత్రి, విదేశాంగశాఖ. 2. శ్రీ రాజగోపాలాచారి — హోముశాఖ. 3. మౌలానా అబుల్ కలాం అజాద్ — విద్య. 4. సర్దార్ బలదేవసింగ్ — రక్షణ. 5. శ్రీ జగజీవన్ రామ్ — కార్మిక. 6. జనాబ్ రాఫీ అహమ్మద్ కిద్వాయ్ — తంతి, తపాలు. 7. శ్రీమతి రాజకుమారి అమృతకర్ — ఆరోగ్యము. 8. డా॥ బి. ఆర్. అంబేద్కర్ — న్యాయము. 9. శ్రీ సి. డి. దేశముఖ్ — ఆర్థికము. 10. శ్రీ హరికృష్ణ మెహతాబ్ — పరిశ్రమలు, వాణిజ్యము. 11. శ్రీ యన్. వి. గాడ్గిల్ — వర్క్సు, ఉత్పత్తి, బట్వాడా. 12. శ్రీ శ్రీప్రకాశ — సహజసంపద, శాస్త్రీయపరిశోధన. 13. శ్రీ యన్. గోపాలస్వామి అయ్యంగారు — రాకపోకలు, సంస్థానములు. 14. శ్రీ కె. యం. మున్షీ — ఆహారము, వ్యవసాయము.

స్టేటు మంత్రులు.
(Ministers of State)

16. శ్రీ అజిత్ ప్రసాద్ జెయిన్ — శరణార్థుల పునరావాసము. 17. శ్రీ ఆర్. ఆర్. దివాకర్ — ప్రచురణ. 18. శ్రీ కే. సంతానము — రైల్వే (రవాణ). 19. శ్రీ సత్యనారాయణ సిన్హా — పార్లమెంటరీ. 20. శ్రీ సి. సి. బిస్వాస్ — అల్పసంఖ్యాకుల సమస్యాపరిష్కారము.

డిప్యూటీ మంత్రులు.

21. శ్రీ ఖురిషిడ్ లాల్ — తంతి, తపాలా. 22. శ్రీ బి. వి. కేస్‌ఖార్—విదేశాంగము. 23. శ్రీ డి. పి. కర్‌మార్‌కర్ —వాణిజ్యము. 24. మహారాజశ్రీ హిమ్మతసింగ్ జీ—రక్షణ, 25. శ్రీ యస్. యన్. బురగోహైన్ — పనులు, గనులు, విద్యుచ్ఛక్తి. 26. శ్రీ. యం. తిరుమలరావు — ఆహారము, వ్యవసాయము (ఇండియన్ అఫేర్సు).

# మాతృ ఆదేశము (లేక) అహల్య.

శ్రీ వనమాలి.

(గత సంచిక తర్వాత.)

14

తల్లికి యవకాశము కలిగెను. యశోధర మోకాళ్ళపై కూర్చుండి, రెండు హస్తములను జోడించి, పుత్రుని ముఖమును చూచుచు, కన్నీరు ధారాపాత్రగ కార్చుచు, "తండ్రీ! నా కన్న తండ్రీ! నాకు పుత్రభిక్ష పెట్టుము. పుత్రభిక్ష పెట్టుము. పుత్రభిక్ష పెట్టుము" అని దీనస్వరముతో ప్రార్థించెను. కువలయానందా! నీది నా దేహములోని దేహము. నా మాంసములోని మాంసము. నా ఎముకలోని యెముక. నా రక్తములోని రక్తము. ఇట్టినీకు నాపైనను, మీ తండ్రిగారిపైనను కనికరములేక, నొకయువతిపైగల మోహమునకై, విషమును త్రాగి ప్రాణహత్యకు సాహసించితివికదా? మా కెట్టిఘోరమైన యపచారమును చేయ సమకట్టితివి. తొమ్మిదినెలలు నా గర్భమున నిన్ను మోసితిని. మూడు సంవత్సరములు నా స్తన్యపాన మొసగి నిన్ను పెంచితిని. ఆనాడు యా యువతి యెక్కడనుండెను? ఆ యువతి యెక్కడనుండెను? అహల్య యేమైన యానాడు నీపుట్టుకకై నేనుపడిన గర్భవేదన తానుపడినదా? నీకు స్తన్యపానమిచ్చి పెంచినదా? ఇప్పుడు మేమందరము నీకు మఱుపునకొచ్చితిమి. నీసోదరీ సోదరులు మఱుపునకొచ్చిరి. అత్యంత ప్రేమతో పోషించి, పెద్దచేసి, విద్యాబుద్ధులు గఱపిన తండ్రిగారు మఱుపున కొచ్చిరి. ఆహా! ఏమి యీ స్త్రీ మోహము! ఏమి బలిష్ఠమైనపాశము! తండ్రీ! నావైపు కన్నెత్తి చూడుము. నాకు పుత్రభిక్ష పెట్టుము. వెయ్యి జన్మములెత్తినను నీవు తల్లిఋణమును తీర్చుకొనజాలవుసుమీ! నాయనా! నీవు ప్రయత్నమును మానుకొనము" అని దీనముగ ప్రార్థించెను.

కువలయానందుడు విజ్ఞానవంతుడు. పామరహృదయుడు. కన్నతల్లి యాకస్మికముగ యాసమయమునకు ప్రత్యక్షమైన యావిధము; తనసాహసకృత్యమునకై, పరితాప మొందుచుండుట కన్నులార గాంచెను. తనతల్లి కన్నీరు పెట్టిన దృశ్యము తనజీవితములో తానంతవఱకును చూచినదిలేదు. ఆమె ముఖారవిందము వాడి దీనముగా తనకంటె యెదుట కనబడినదిలేదు. ఆనాడు తలవని తలంపుగ అట్టి దృశ్యమును చూచుటచే, మనస్సు కరిగి, సిగ్గుకలిగి, మంచము పైనుండిలేచి, తల్లి పాదములపై వ్రాలి, తన్ను క్షమింప బహువిధముల ప్రార్థించెను. ఇకముందెప్పటికిని అట్టి సాహసమునకు బాలుపడనని ప్రమాణముచేసెను. మోహమును తల్లిప్రేమ జయించెను.

15

తల్లీపుత్రులైన యశోధర, కువలయానందుల సంభాషణ పూర్తియాయెను. కన్నకొమారునికి ప్రాణగండము తప్పెనుగదా, తాను కన్నకొమారుడు తనకు దక్కెనుగదాయను ఆనందము, యశోధరను తన్మయురాలిని గావించెను. కొమారుని తొడపై గూర్చుండబెట్టుకొని గాఢాలింగనమొనర్చుచు, మాతృప్రేమయొక్క మహిమామేతమును, కుమారుడు గ్రహించునటుల చేసెను. ఆమెముఖారవిందము దివ్యకాంతులతో వెలుగొందెను. ఇట్టి పరమానందదాయకమైన

క్షణములో యశోధరాదేవి, తనకుసకాల మునకు టెలిఫోనువార్తను పంపి, తనపుత్రుని చావును తప్పించుటకు ముఖ్యకారణ భూతురాలైన ఉషను ఆ తరుణమున ఆ సాధ్వీమతల్లి తలంచుకొని వేనోళ్ళ స్తుతించెను. ఉషయే పుత్రభిక్ష పెట్టెనని తన కొమారునితో చెప్పి, ఆమెను తన యెదటికి తక్షణమే పిలుచుకొని రావలెనని సేవకుని కాజ్ఞాపించెను.

దాసీ వృత్తియందున్నను, తనయజమానులయందు అత్యంత ప్రేమ వాత్సల్యములుగల ఉషకు, కువలయానందుడు తనమనోనిశ్చయమును మార్చుకొని, ఇల్లికి మరలా కొడుకై, తల్లిఒడిలో చేరెనను వార్తను విని, గదిలో ప్రవేశింపగనే యశోధరాదేవి ఆమెకు (ఉషకు) యెదురేగి, రెండుచేతులు జోడించి నమస్కరించి "ఉషా! నీవు నాపాలిటికి భాగ్యదేవతవు. నాకు పుత్రభిక్షను పెట్టినదానవు. నీకునేను నాకృతజ్ఞతా సూచకముగ ఈ నా కంఠహారమును నీ మెడలోవైచుచున్నాను. దానిని గొప్పగా గ్రహింపు" మని తన బంగారు కంఠహారమును ఉష మెడలో వైచెను.

ఒకవైపు సంతోషము, మఱియొకవైపు ఆశ్చర్యము ఒకే పర్యాయము తన్నావరించుటచే ఉషవెంటనే ప్రత్యుత్తర మివ్వజాలదయ్యెను.

సేపునిదానించి, తల్లీకొడుకులు కూర్చున్న మంచము దగ్గఱికిచేరెను. క్రిందకూర్చొనెను. కువలయానందుని ముఖమును చూచుచు, "తానాయువకుని ఆతరుణములో రక్షింప గలిగితినిగదా యను సంతృప్తి వలనకలిగిన యనిర్వచనీయమైన ఆనందము ననుభవించుచు, యశోధరాదేవిని చూచి "తల్లీ! ఈ కంఠహారమును మీరు నాకొసగుట తగదు, నా ప్రేమకును, భక్తికిని, మీరు విలువ కట్టినవారయ్యెదరు. నేను నా యజమానుల యెడ నిర్వర్తింపవలసిన ధర్మమునకంటె ప్రత్యేకముగ నేనేమియు చేయలేదు. నాకు "అహల్య" సోదరి. నాసోదరి ప్రేమమూర్తి — ఈ కువలయానందుడు. మనోవైపరీత్యముచే ఆత్మహత్యకు పాలుపడనున్న ఈ మీ పుత్రునికి సేవచేయగల మహాభాగ్యము నాకు అబ్బినందులకు నా యిలవేల్పుకు నేను కృతజ్ఞురాలను. ఇతనిని, నేను ప్రాణములతో చూడగలుగుటయే నాకు భగవంతుడు పారితోషికము నొసగుట. నాజన్మమే ధన్యతగాంచినది. మీపుత్రుని బ్రతుకుకన్న నాకీ అభరణము ఎక్కువనా? తల్లీ దీనిని ధరించుయోగ్యత దాసినైననాకున్నదా? తల్లీ! నాకిదివలదు. దీనిని నామెడలో వేయుటకు ముందు నాకు గలిగిన ఆనందము మీరీ యాభరణము వేసినతర్వాత కలుగకున్నది. అని చెప్పుచు, "త్వరలో పెండ్లికొడుకు వగుదువు గాక!" అని చెప్పుచు, తనమెడలోని కంఠహారమును తీసి ఉష కువలయానందుని కంఠమునందు వైచెను. కువలయానందుని ముఖమును చూచెను. తనకన్నులనుండి బాష్పబిందువులను జటజట రాల్చెను. అప్రయత్నముగ ఆనందమును పట్టజాలక, కువలయానందుని నొసటికి తన నొసలు యానించెను. తనముఖము పైయుండిన కుంకుమ కువలయానందుని ముఖమున కంటుకొనెను. అది చూచి, "ఇప్పుడే పెండ్లి కొడుకాయె" నని చప్పట్లువైచెను.

ఆహా! ఏమి విచిత్రము. ఈ రంగము పూర్తియైపూర్తికాకమునుపే, ఉష నోటనుండి "ఇప్పుడే పెండ్లికొడుకాయె" నను పదములు వచ్చిరాకమునుపే, తంతివార్తను గైకొని ఒక జమానులోనికి వచ్చెను. దానిని చించిచూడ 'అహల్య' క్షేమముగా న్యూఢిల్లీ పట్టణములో నున్నదనియు; నాలుగు రోజులలో వచ్చుననియు అందుండెను. కృష్ణప్రసాద్ కిశోర్ గారి పేరనుండెను. ఇదే తంతివార్త గోపీనాధ శ్రీవత్సగారికిని వచ్చెను. ఎల్లరును ఆనంద పారవశ్యులైరి. (సశేషము)

# భా రత జ్యో తి.

( ప్రతి బుధవారము ప్రకటింపబడు తెలుగు, ఆంగ్ల, రాజకీయ వార పత్రికలు. )

## చందా వివరములు.

| | | | |
|---|---|---|---|
| తెలుగుప్రతి:- | సంవత్సర చందా | రూ | 9—0—0 |
| | విడి సంచిక | ... | 0—3—0 |
| ఆంగ్లప్రతి:- | సంవత్సర చందా | ... | 4—8—0 |
| | విడి సంచిక | ... | 0—1—6 |
| రెండుచేరి:- | సంవత్సర చందా | ... | 12—0—0 |
| | విడి సంచిక | ... | 0—4—0 |

## ప్రకటన రేట్లు

| | | | |
|---|---|---|---|
| పూర్తి పేజి | ఒకదఫాకు | ... ... ... | రూ 40—0—0 |
| అర్థపేజి | ,, | ... ... ... | రూ 20—0—0 |
| ఒక అంగుళము | ,, | ... ... ... | రూ 3—0—0 |

కంట్రాక్టు రేట్లకు, ఇతర వివరములకు:

257, ట్రంకు రోడ్డు,
పోష్టు బాక్సునంబరు 10,
కడప.

మేనేజరు,
" భారత జ్యోతి "

Printed at the "BHARATHA JYOTHI" Printing Press and Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRITIG & PUBLISHING CO.
PRINTER: K. R. JOSHEE. :: PUBLISHER: V. R. GOPALAKRISHNA

# భారతి జ్యోతి.

సహాయ సంపాదకులు:- పి. రమణారెడ్డి, బి. ఏ., :: సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.

సంపుటము — 5.

సంచిక — 7.

✻

ప్రతి బుధవారము

ప్రకటింపబడును.

✻

సంవత్సర చందా రు. 9-0-0

విడి ప్రతి ... రు. 0-3-0





కుమారి సరోజ. బీద పరిసరములలో పెరుగుచున్న విద్యార్థిని. హరిజన హాస్టలునందుండినది. పార్వతి పాత్రను ధరించిన దృశ్యము

# విషయానుక్రమణిక

# భారత జ్యోతి.

| సంపుటము. 5. సంచిక 7. | శ్రీ ఖరనామ సంవత్సర ఫాల్గుణ బ. ౮లు, మార్చి 19, 1952. | ప్రతి బుధవారము ప్రకటింపబడును. |
|---|---|---|


## స్వాగతము.

చెన్నరాష్ట్ర గవర్నరుగ శ్రీ. శ్రీ ప్రకాశగారు ఈనెల 12-వ తేది అధికారమును స్వీకరించిరి. ఇదే తరుణములో రాయలసీమ జిల్లాలలో క్షామ దేవత భయంకర రూపముతో నృత్యము చేయుచున్నది. దరిద్ర నారాయణులు అన్నమో రామచంద్రా అని కావించుచున్న దీనాలాపములు వార్తాపత్రికలంతయు నిండిపోయి, న్యూఢిల్లీ, చెన్నపురి మొదలైన పట్టణములలో ప్రతిధ్వనించుచున్నది. ఇటీవల(ఈ నెల 9-10 తేదీలలో) యూనియన్ ప్రభుత్వ ఆహారశాఖామంత్రి, శ్రీ. కే. యం. మున్షిగారు విద్యుత్తీగె పరుగువలె, క్షామ ప్రాంత్యములలో పర్యటనము గావించిన సందర్భములో క్షామదేవతకు ముఖ్య క్షేత్రములైన రాజంపేట, రాయచోటి తాలూకాల కున్ను, అనంతపురము, కర్నూలుజిల్లాలలోను మఱికొన్ని ప్రదేశములను చూడరైరి. ఈలోటు ప్రజలలో చాల ఆశా భంగము కలిగించినది. ప్రభుత్వమును నిర్వహించుచున్న మంత్రులు మానవ మాత్రులే కాని మానవాతీతమైన శక్తికల దేవతలు కారు. అందువల్ల క్షామ ప్రదేశములలో పర్యటించినంత మాత్రమున వర్షములులేని ప్రదేశములలో వర్షములు తక్షణమే కురియవు. ఎండిపోయిన బావులలోను, నీటికాలువలలోను, చెఱువులలోను లోనుండి నీరు ఉప్పొంగి బయటికి రాదు. కాని అన్నములేక ఆకలిబాధచే అలమటించి పోవుచున్న ఆర్తుల మధ్యలో మంత్రులు, గవర్నర్లు నిలిచి దర్శనమిచ్చి, వారి దీనాలాపములను విని, ప్రోత్సాహకరమైన మాటలు చెప్పినచో, ఆవాక్యములే వారికెంతో ఆనందము కలిగించి, ఆశను రేకెత్తించి, ముఖమునుండి చిరునవ్వు వెలువడింప చేయును. ఇంతమాత్రము చాలును. ఇదే ప్రజలలో ఎంతో తృప్తిని కలుగజేయును. ఈమాత్రము తృప్తిని శ్రీ మున్షిగారు ఇవ్వజాలక పోయిరి.

ఈ లోటును బాపుటకై శ్రీ. శ్రీ ప్రకాశగారు ఈనెల 23-న తేది రాయలసీమ జిల్లాలలోని రాజంపేట, రాయచోటి, పెనుగొండ, కదిరి, గిద్దలూరు, మార్కాపురము తాలూకాలలో పర్యటన సలిపెదరని ప్రకటింప బడినది. ఇది వారియొక్క దూరదృష్టిని, ఊహాశక్తిని, ప్రజాసేవానిరతిని చాటు

చున్నది. గంజకేంద్రములు, గోడ్లమరమ్మతులు, గవర్నరులు, యూనియన్ ప్రభుత్వ మంత్రులు చూడవలసిన అవసరమే లేదు. వానిని చూచుటకై విలువగల కాలము, రాకపోకల ఖర్చులు ఇతర ఉద్యోగులకగు ప్రయాణ ఖర్చులు వృధాచేయ పనిలేదు. ప్రజల మొఱలను వినిన చాలును.

రాయల సీమలో పర్యటన నిమిత్తమై రానున్న శ్రీ. శ్రీ ప్రకాశగారికి ఈ సందర్భములో హృదయ పూర్వకమైన స్వాగత మొసగు చున్నాము. వీరి రాకవల్ల రాయల సీమ గ్రామప్రజలకు సంపూర్ణ సహాయము లభించుగాక!

# దేశ ఆహార పరిస్థితులు.

(పి. రమణా రెడ్డి.)

ఉన్న పరిస్థితులున్నట్లు వ్రాసిన పలువురకు కోపము రావచ్చును. అట్లని వాస్తవ పరిస్థితులను ప్రజల యెదుట పెట్టి చర్చింపకుండుట నీతి మార్గముకాదు. ఇప్పుడు కొన్ని ముఖ్య వస్తువులపై ధరలు తగ్గుదల చూపు చున్నవి. ఈ తగ్గుదల నిలకడగ నిలిచి, మానవ జీవితమున కత్యంత అవసరమగు ఆహార ధాన్యముల ధరలను కూడ క్షుద్బాధతో అలమటించి పోవుచున్న బీద ప్రజల అందుబాటులోనికి తెచ్చునో లేదో ఇప్పుడే స్పష్టముగ చెప్పుటకు వీలులేదు. ధరలు పడిపోవుట, ప్రజల రక్తమును పీల్చి, అధికలాభములు గడించిన ఏ కొద్దిమంది వ్యక్తులకు సంకటముగ ఉండునేమో కాని, ఇందువలన కోట్లకొలదిగ నుండు బీద ప్రజానీకమున కెంత మాత్రము నష్టము రాబోదు. మీదుమిక్కిలి ధరలు తగ్గుదల వారికి మేలు కలిగించును. రాసులు రాసులుగ దాచి యుంచిన ఆహార ధాన్యమంతయు ఈ తరుణములో బహిరంగ మార్కెట్టులకు వచ్చును. పాటియాల, తూర్పు పంజాబుస్టేటు యూనియన్‌లోను, దాచి యుంచబడిన గోధుములన్నియు బహిరంగ మార్కెట్టులకు వచ్చినవని ఈ నెల 9-వ తేది వార్తలు చేరినవి. ఇది ఒక శుభ వార్త.

ఇటీవల న్యూఢిల్లి పట్టణమున జరిగిన ఆహారమంత్రుల సమావేశములో, ఇండియా ప్రధానమంత్రిగారు మాటలాడుచు:—

> 'ఆహార విషయమై అచింతితమైన విధానము నవలంభించుటకు వీలుకాదు' అని తెలిపిరి.

ఈ వాక్యములు ఇండియా ప్రధాన మంత్రిగారి నోటి నుండి వచ్చి నందువల్ల, ఆహారపరిస్థితులు దేశములో తప్పక చక్కబడునని ఆశ జనించెను. కాని ఇండియా యూనియన్ ప్రభుత్వ ఆహార శాఖామంత్రిగారైన శ్రీ. కన్యాలాల్ మున్షిగారు పార్లమెంటు సభలో ఆహారసమస్యపై మాటలాడుచు "ఆహార ధాన్యము ధరలు హెచ్చకుండ ప్రభుత్వము వారు అదనపు ద్రవ్యమును వెచ్చించుచుండిరి. ఇప్పటి నుండి ఆపద్ధతి విరమింప బడు"నని తెలిపిరి. నిజమే. ప్రతి సంవత్సరము కొన్నికోట్ల రూపాయలు ఆహార ధాన్యముల ధరలు అందుబాటులో ఉంచుటకై ఇండియా ప్రభుత్వమువారు ఖర్చుపెట్టవలసిన కష్టమే. కడచిన సంవత్స

రము రు 50 కోట్లు ఆహార ధాన్యమును తక్కువ ధరలకు ప్రజల కందజేయుటకు గాను ఇండియా ప్రభుత్వమువారు కర్చుపెట్టిరి. ఈ సంవత్సరము రు 50 కోట్లు కాదు, రు 90 కోట్లు సబ్ సిడీ క్రింద కర్చు పెట్టవలసి యుండును. కాని ఈ పద్ధతిని నిలిపి వేసినామని చెప్పుటవల్ల, రు 90 కోట్లు మిగల వచ్చును. కోట్లకొలది గల ప్రజల గతి ఏమికావలెనో ఇండియా ప్రభుత్వమువారు ఊహింపజాలక పోయిరి కదా?

ఇండియా యూనియన్ లో 35,70,000 ప్రజలున్నారు. ఆహారధాన్యము ధరలను అదుపులోనుంచుటకై ఈ సంవత్సరము రు 90/- కోట్లు కర్చుపెట్టినను, మనిషి ఒక్కరికి 4 అణాలకన్న ఎక్కువరాదు. ఈ మహావిపత్తు కాలములో ఇండియా ప్రభుత్వమువారు సంవత్సరమునకు ఒకొక్క మనిషికి గాను 4 అణాలు కర్చుపెట్టజాలరా? ఈ రు 90 కోట్లు ఆహార ధాన్యము ధరలు పెరుగకుండ హద్దులో నుంచుటకై కర్చుపెట్టుటకు మారుగ శాశ్వతమైన వ్యవసాయ ప్రాజక్టుల పైనను (ఇరిగేషన్ ప్రాజక్టుల పైనను), నూతన పరిశ్రమలపైనను కర్చుపెట్టిన లాభదాయకము కదాయని ప్రభుత్వమువారి అభిప్రాయమై యున్నది. ఈ అభిప్రాయము ఎవ్వరు మంచిది కాదనరు. కాని ముందు ఈ కష్టకాలములో ప్రజలు జీవించిన కదా తర్వాత ప్రాజక్టులు, పరిశ్రమలు. ఇప్పుడు అమలులో నున్న ధరలను చెల్లించి ఆహార ధాన్యమును కొని తినుటకే గతిలేక, గంజి కేంద్రముల చుట్టు పరుగెత్తుచున్న ప్రజలు సబ్ సిడీ తొలగించినచో, ఇంకనూ ఎక్కువగు ధరలను పెట్టి కొని తినగలరా అనునది సామాన్యమైన విషయము కాదు. కష్టములతో కూడుకొనిన పెద్దసమస్య. ఇండియా ప్రభుత్వమే సబ్ సిడీ ఇవ్వజాలక పోయిన, రాష్ట్ర ప్రభుత్వములు సబ్ సిడీ భరింపగల స్థితిలో ఉండునా? అటుల సబ్ సిడీ ఇవ్వవలెనన్న కొన్ని అభివృద్ధి ప్రణాళికలు నిలుపుదుల చేసియే తీరవలెను. బ్రిటను దేశములో యుద్ధమునకు పూర్వము ముఖ్యాహారమైన రొట్టె వెల ఎంత యుండినదో అదే వెలకు మించకుండ యుద్ధకాలములోను, యుద్ధము ముగిసిన తర్వాతను ప్రజలకు రొట్టె లభించునటుల ప్రభుత్వమువారు కఠినమైనకట్టుబాట్లు చేసియున్నారు. ఈ దినమునకుకూడ బ్రిటనులో రొట్టెధర ఎక్కలేదు. ప్రజలకిచ్చు పరిమాణము కూడ తగ్గలేదు, ఇందుకై బ్రిటీషు ప్రభుత్వమువారు ప్రతి సంవత్సరము పౌ॥ 45,00,00,000 సబ్ సిడీ క్రిందకర్చుపెట్టుచున్నారు. ఇవి 45/- కోట్లరూపాయలు కావు. 45 కోట్ల పౌనులు. బ్రిటనులోని జన సంఖ్య ఎంత? ఇండియాలోని జన సంఖ్య ఎంత? దీనికిని దానికిని ఏమైన సాటువున్నదా! బ్రిటనులో కార్మిక ప్రభుత్వము పోయి, టోరి ప్రభుత్వము అధికారమునకు వచ్చినది. ఆయుధ నిర్మాణముపై కర్చు ఎక్కువైనది. కాని టోరీ ప్రభుత్వము వారు ఆహారధరలలో ఎక్కువ కాకుండ ప్రజలను కాపాడుటకై 30 కోట్ల పౌనులు ఈ సంవత్సరము సబ్ సిడీక్రింద కర్చుపెట్టదలచియున్నారు. శ్రేయోప్రభుత్వము (వెల్ ఫేర్ స్టేటు) అనిన బ్రిటను కదా అనిపించుకొనుట శ్లాఘ్యమైనది.

శ్రీ మున్షిగారు విదేశములనుండి దిగుమతియైన ఎఱ్ఱజొన్నలకు సబ్ సిడీ ఇచ్చి, ధరలు అదుపులో నుంచెదమనియు, తిరువాన్కూరు-కొచ్చిను రాష్ట్రమునకు అధికసహాయముచేసెదమనియు పార్లమెంటులో తెలియ

జేసిరి. ఈ సహాయము ఎంతమాత్రము చాలదు. బియ్యము పైనను, గోధుమలపైనను ధరలు ఎక్కువ కాకుండా సబ్సిడైజు చేయనిచో, వానిపై ధర లెక్కువై ఉపయోగదారులైన ప్రజల పైననే పడును. సామాన్య ప్రజలయొక్క స్థితి ఇంకను దుర్భరమగును. ఇప్పుడు కొన్నివస్తువులపై తగ్గుచున్న ధరలవల్ల దాచి యుంచబడిన ఆహారధాన్యము బయటికి వచ్చి, వాని ధరలు కూడ ప్రజల హద్దులోనికి వచ్చినచో సంతోషమే. లేనియెడల ఇండియా ప్రభుత్వమువారు కొంతధనమును సబ్సిడీ క్రింద కర్చుపెట్టి వాని ధరలు ఎక్కువకుండు లాగున చూచి దూరదృష్టిని ప్రదర్శింతురని ఆశించుచున్నాము.

# మన ఆర్థిక సమస్యలు.

(శ్రీ. పి. వి. సుబ్బయ్యగారు, ఎం. ఎల్., ఏ.)

భారత దేశమున ముఖ్యవృత్తి వ్యవసాయము. కొద్ది మంది నగరవాసులు తప్ప తక్కినవారు పల్లెపట్టుల నివసించి కర్షక వృత్తిచే బ్రతుకు చున్నారు. యంత్రముల ప్రయోగించి వస్తువుల ఉత్పత్తి చేయనికాలములో పల్లెలు స్వయం పోషకముగా నుండెడివి. ఆనాడు కుటీర పరిశ్రమల మూలమున తమకు వలయు వస్తు సంచయమును ఉత్పత్తి చేసి కొనుచుండిరి. నేడు కాలము మారినది. భూములు నిస్సారములయినవి. ఇతర దేశములనుండీ యంత్రముల సహాయమున ఉత్పత్తి యగు వస్తువులు దిగుమతియగుచున్నవి. మన దేశమున తయారుచేయబడు వస్తువుల ధర లెక్కువగుట వలన కుటీరపరిశ్రమలు కూలిపోయినవి.

ఈ పరిస్థితులలో మన జీవన భృతిని హెచ్చించు కొనుట ఎట్లు? ముందువలె కుటీర పరిశ్రమలపై నాధార పడుటయా? లేక యంత్ర పరిశ్రమల నెలకొల్పి, వస్త్రోత్పత్తి నధికము చేసి దేశీయ సంపద నెక్కువ చేసి కొనుటయా? ఈ విషయమున విభిన్న దృక్పథములు గలవు: కొందఱు రెండవ మార్గమును బలపరచుచున్నారు. అధునాతన కాలములో అనాగరకమగు వస్తువుల నుపయోగించుటగాని, ఉన్నదానితో తృప్తిపడి అపూర్వ విలాసములకు అజ్ఞుజాపక యుండుటగాని వీరికి గిట్టదు. ప్రపంచమున అన్ని జాతులు యంత్రముల మూలమున అభ్యున్నతి గాంచుచుండ, మనమేల కొన్ని శతాబ్దములు వెనుక పడి యుండవలెనని వీరు వాదింతురు. అవును. అభ్యున్నతి గాంచవలసినదే. యంత్రోత్పత్తిని అన్నిరంగములలో మొదలిడిన పల్లెపట్టుల చేతి పనులతో జీవించువారేమి గావలయును? కొందఱు, మోటారు కారులు, అతంత్రీగానములు, విమాన ప్రయాణములు, చేయుచుండ పల్లెసీమలో నివసించు వారీ నూతనానుభవములను ఏలపొందకూడదు అని యడుగ వచ్చును, పొందవచ్చును, ఆనందివవచ్చును. ఆస్థితి వచ్చునప్పటికి ఇంక సేద్యము చేయు వారెవరు? సేద్యమును యంత్రములతో నడుపుదు మందురు కాబోలు. యంత్రములతో వ్యవసాయమును సాగించిన, కర్షకవృత్తినే ప్రధానముగా గల

లక్షలాది జనులు నిర్వ్యాపారులుగారా! వీరి నెచ్చటికి పొమ్మనుట? ఏవృత్తిని చేయమనుట? వీరినందఱిని కర్మాగారముల నిలిపిపనిచేయింతు మన వచ్చును. కార్మాగారములు విరివిగా ఉత్పత్తి చేసిన వస్తువుల నేయంగడిలో నమ్మట. బ్రిటీషువారు, అమెరికనులు, రష్యనులు, జపానీయులు అంగడి వీధులకొరకై యుద్ధరంగముల దిగిరి. మన మొకరితో యుద్ధము సలిపి ఎవరిని జయించుట సాధ్యము గాని పని. కనుక యంత్రముల ప్రతివృత్తి యందును ప్రయోగించిన లాభము లేదు. మీదు మిక్కిలి ఏబది సంవత్సరములుగా యంత్ర పరిశ్రమలు మన దేశములో ఉపయోగింపఁబడుచున్నవి. 2½ మిల్లియనుల కూలి పనివారికి మాత్రమే ఉద్యోగముల చూపగలిగిరి. రైలుకంపెనీలు, ఇతర అధునాతనపరిశ్రమలలోకి ఆకర్షింపఁబడిన వారందఱు కలిసినట్లయిన ఐదుమిల్లియన్లకు మించరు. 130 మిలియన్ల వరకును గల కూలీల సంగతి యేమి! వారేవృత్తిని స్వీకరింప వలెను. ఇది నేడు భారత ప్రభుత్వము నెదుర్కొనుచున్న గడ్డు సమస్య.

పాశ్చాత్య దేశములు యంత్రములను వ్యవసాయము నందును, కర్మాగారములందును ఉపయోగించి, వస్తోత్పత్తి నధికము జేసి భాగ్యవంతమైనవి. అమెరికా బ్రిటనులు అన్ని రంగములలో పురోగమించినవి. రష్యా దేశము ముప్పది సంవత్సరములలోనే వాటిని తెలదన్నునట్లుగా పురోగమించినది. మనము మాత్రము ఆస్థితికి రాలేమా? యంత్రముల మూలమున పురోగమింప లేమా? అని పలువురు వాదించుచున్నారు. వాస్తవము, మనకు యంత్రముల ఉపయోగము అత్యవసరము. కాని పాశ్చాత్య దేశములు యంత్రముల ఉపయోగించు నప్పటికి తదితర దేశములందు యంత్రములు లేవు. తమచే సృష్టింపఁబడిన వస్తువుల నమ్ముటకు ఇతర దేశములందు మార్కెట్లు తయారుగా నుండినవి. బ్రిటీషు వారికి పెద్దసామ్రాజ్యమే యుండినది. రష్యనులు సామ్యవాదములను, అములుకు దెచ్చునప్పటికి ప్రజలు అనాగరికులుగా నుండిరి. జనసంఖ్య తక్కువగా నుండి భూభాగ మెక్కువగుటచేత యంత్రముల ప్రయోగించుటచే నిరుద్యోగులైన వారిని ఒక చోటినుండి మఱియొక చోటికి పొమ్మనిరి. పరిపాలనా విధానము నియంతృత్వము కనుక, ఆజ్ఞను శిరసావహించి ప్రజలు తరలిపోయిరి, సైబీరియా, యూరల్సు అను దూర ప్రాంతములకు వెళ్లిరి. భారత దేశమున కట్టియనుకూలములు లేవు. యంత్రములను కీలక పరిశ్రమల యందు మాత్రముపయోగించి పల్లెపట్టులందు కుటీర పరిశ్రమలను వృద్ధికి దెచ్చుట మంచిది.

అమెరికా దేశమునందు వ్యక్తివ్యాపారము గుర్తింపఁబడినది. ఆకారణముచేత వ్యక్తులు సాయ శక్తులా కృషిచేయునర్చి దేశ సౌభాగ్యమును సాధించిరి. రష్యా దేశమున వ్యక్తివ్యాపారమునుఖండించి, ప్రభుత్వవ్యాపారమును అములు పఱచి దేశసౌభాగ్యమును పెంపొందించిరి. ఈ రెండు పద్ధతుల లో దేనిని భారతదేశ మనుసరించుట యనునది మఱియొక సమస్య. స్వార్థపరులు కాని వ్యక్తులు, వ్యక్తివ్యాపారమును సాగించి ధనమును గడించి, బ్యాంకులయందు నిల్వచేయునర్చిరి. దేశ సౌభాగ్యమునకు మూలమగు పరిశ్రమల నెలకొల్పియు, జాతికి మేలొనర్చిరి. అది యటుండ నూటికి 90 మంది చదువుకొన్నవారగుట, దొంగవ్యాపారస్థులచే

మోసగింపఁబడు అసహాయక ప్రజలు లేరనుట యదార్థము. భారతదేశమున వ్యక్తివ్యాపారము వలన అమాయక ప్రజలు వంచింపబడుచున్నారు. ధనము సంపాదించిన వారు భూగర్భమున పాతిపెట్టిరో లేక బంగారమునుకొని తమవారికి నగలుచేయించిరో, ద్రవ్యమును నిరుపయోగమైనదిగాఁ జేయుచున్నారు. కనుక ఇట్టి వ్యక్తివ్యాపారము వలన భారతావని ముందుకు రాగలదా?

ప్రభుత్వవ్యాపారమును గూర్చి యాలోచింతము. రష్యాదేశమున ఈ పద్ధతి రాణించినది. ఈ విధానమువలన ప్రప్రథమమున కొందరు నష్టపడవలసి యుండును. రష్యాదేశమున ఇయ్యది గుర్తించిన పౌరులు, "ఇదిగో మేము నష్టపడుటకు సిద్ధముగా నున్నాము. మున్ముందు దేశము సౌభాగ్యవంతమగుటయే మాలక్ష్యమని" ముందుకు వచ్చిరి. భారతావని యందు త్యాగమునకు బదులు స్వార్థము నిండుకొనియున్నది. వ్యాపార సంస్థలను, ఆస్తిపాస్తులను ప్రభుత్వవశము చేయగలరా? ఒకవేళ చేసినను సాంకేతిక విజ్ఞానముగల నిపుణులు ప్రభుత్వము నునడుపు వారిలో లేరు, కనుక పెద్దపెద్ద పరిశ్రమలను ప్రభుత్వము నడుపుచు, చిన్న చిన్న కుటీరపరిశ్రమలను, మధ్యతరగతి పరిశ్రమలను వ్యక్తులే నడిపించులాగున సిద్ధాంతీకరించుట ఉత్తమము.

---

సాహిత్య చర్చలు—విద్యార్థులకు:

# కావ్యరసము

(శ్రీ బిరుదు వెంకటశేషయ్యగారు.)

లోకము పంచేద్రియములచే గ్రహింపఁదగినదిగా నున్నను, అన్ని యింద్రియములలోను కన్ను ప్రధానమైనదని సర్వత్ర సంగీకరింపఁబడుటచే, అది దృశ్యముగా మానవునిచే ఎన్నఁబడుచున్నది. అందుచే లోకము "దృశ్యము". మానవుడు ద్రష్టయగుచున్నాడు. కాని లోకమునందలి అన్నిప్రదేశముల యందును మానవుఁడు—పరిచ్ఛిన్నుఁడు గనుక, సర్వవ్యాపి కాఁడుగనుక, ఏకకాలమున నే దర్శించుటకువీలుకలుగక పోవుటచే అతఁడు లోకము నందలి కొంత భాగమునకే ద్రష్టయయి,కడమ భాగమును గూర్చి విని,యూహించుకొని చూచినట్లు తృప్తిపడ వలసిన వాఁడగుచున్నాడు. అప్పుడు లోకమతని దృష్టిలో "శ్రవ్యము"ను, తాను శ్రోతయు నగుచున్నాఁడు. అందుచే మానవుని 'లోక' పరిజ్ఞానము ప్రధానముగా 'దృశ్యశ్రవ్య' రూపముగా నుండుననుచో, కాదనుట కవసరము కనఁబడదు.

మానవుడు సహజముగా సుఖాభిలాషి, అందుచే సుఖాన్వేషి; తానుస్వయముగా సుఖస్వరూపుఁడు గనుక. ఇందలి వేదాంత తత్త్వము మనకిప్పు డప్రస్తుతము గనుక, తడవక విరమించెదను. తాను నిజముగా ఆనంద రూపుఁడేయైనను, త్రిగుణాత్మికయగు ప్రకృతికి వశుఁడై, "ఉయ్యాలలో బిడ్డనుపెట్టుకొని ఊరెల్ల వెదకి"నట్లు, తన మనస్సు. పంచేంద్రియములతో, లోకమునందలి

వస్తుసముదాయము నాశ్రయించి, తన ఆనందాన్వేషణము సాఁగించుచున్నాఁడు. లోకములో తాను కాపురము చేయునది, ఒక్క ఆనందోపలబ్ధికొఱకై కాని, మఱియొకటికాదు. అందుచే లోకమునందలి వస్తుజాలమతనికి ఆనంద సాధక మైనప్పుడే దానియందతనికి ప్రీతికల్గును. లోకమును లోకము కొఱకు మానవుఁడు ప్రేమింపడు; లోకమును తనకొఱకై, తన ఆనందోత్తేజనము కొఱకై ప్రేమించును. అందుచే మానవునికిని ఈ లోకమునకును ప్రేమ్యప్రేమిక భావము కలదనవచ్చును, ఆదృష్టితోనే యతడు లోకము నారాధించుచున్నాఁడు – కాదు, ఆరాధించుకొనుచున్నాఁడు. కాని సత్త్వము, రజస్సు, తమస్సు, అను మూఁడుగుణముల ఆవరణమువలన, ఆనందమునకు ప్రకాశ – ప్రవృత్తి, మోహములను వానిధర్మములు సంక్రమించి, కొన్ని యెడల తదనుభవమునకు అడ్డుదగులుచున్నవి.

'దృశ్యశ్రవ్య' రూపమైన లోకమును యథాస్థితముగా తిలకించి – ఆలకించి ఆనందమనుభవించు మానవుడు అంతటితో తృప్తి పొందక లోకమునకు ప్రతిబింబములను కూడ సృష్టించుకొని కని, విని ఆనందింపసాఁగినాఁడు. అట్టి ప్రతి బింబముకూడ 'దృశ్యశ్రవ్య' రూపములుగనే సిద్ధమైనవి. వానికే శిల్పములనియు, కళలనియు పేరు ప్రసిద్ధమై నిలిచిపోయినవి. శిల్పముల ప్రశంస నటుంచి, కళల గూర్చి ముచ్చటించుచు, ప్రస్తుత విషయమునకు వత్తును. శిల్పమునందు కళయు, కళయందు శిల్పమును కలిసి మెలసి యుండునట్లును చివరకు శిల్పము కళయందు లీనమైనట్లు భావుకుడగు నతనికి గోచరించినది. అంతే గాక లోకముయొక్క తత్త్వమును గూర్చి విభజన పూర్వకముగాఁ జేసిన పరిశీలనములన్నియు 'శాస్త్ర' రూపమును ధరింపగా, సమ్మేళన పూర్వకముగాఁ జేసిన దర్శనములన్నియు కళారూపములై వెలసినవి. శాస్త్రమునకు సత్యమాధారము కాగా, కళకు సౌందర్యమాధారమైనది. 'సత్యం శివం సుందర'మనునది యొక్క వస్తువును గూర్చియే ప్రతిపాదింపబడినది. కళలలో కొన్ని కేవల దృశ్యములుగను, కొన్ని కేవల శ్రవ్యములుగను, కొన్ని దృశ్యశ్రవ్యములుగను, ఏర్పడినవి. చిత్రరచన మొట్టమొదటి కక్ష్యయందును; కవిత్వము, గానము, మొదటి రెండవ కక్ష్యయందును; నాట్యము, మొదటి మూఁడవదానియందు చేర్చఁబడినవి. వీనిలో ఎక్కువ యింద్రియముల ప్రవృత్తితో గ్రాహ్యములగు కళలకన్న తక్కువ యింద్రియ ప్రవృత్తితో గ్రాహ్యములనునవి శ్రేష్టతరములనియు, కేవలము భావమయములైనవి శ్రేష్ఠతరములనియు, కళాభిజ్ఞుల అభిప్రాయము. అట్టిచో, గాన – చిత్ర కళలకన్న కవిత్వమునకు, ప్రాశస్త్య మొదవుచున్నది. నాట్యకళకుఁ గూడ కవిత్వాశ్రయమును బట్టియే తల యెత్తి తిరుగ వీలగుచున్నది. విశేషమేమనగా వానికన్నిటికి 'లోకానుకరణ'మే ప్రాణము. 'లోకవృత్తానుకరణం నాట్య'మని భరత మహర్షి మఱొకచో 'లోకోపదేశ జననం నాట్య'మని కూడ అతడు నిష్కర్షించినాఁడు. ఇక కావ్యమును గూర్చి విచారింతము.

కవిత్వము, లేక కావ్యము ప్రధానముగా 'శ్రవ్య'మైనను, నాట్యముతో సంబంధపడి, దృశ్యముగాఁ గూడనైనది. అందుచేతనే ప్రాచీనులు కావ్యమును మొదట దృశ్య–శ్రవ్యములని ద్విధాకరించిరి.

కవి దర్శి—అందుచే ఋషి. 'నానృషిః కురుతే కావ్య' మ్మనుసూక్తి. శాస్త్రకారుఁడు సత్యదర్శి; కవి సౌందర్యదర్శి, కావ్యము కడమ కళలతో పాటు 'లోక వృత్తానుకరణ'మైనను, కవి తాను దర్శించు లోక వృత్తము నంతటిని కావ్యమున నిబద్ధము చేయ సంకల్పింపఁడు. తన దృక్పథమునకువచ్చు వస్తుసౌందర్యమును, శబ్దార్థ సౌందర్యములతో మేళగించి, భావనాసౌందర్యమునకు త్రోవఁదీసి, సర్వమును సౌందర్యమయముగ మనకు చూపప్రయత్నించును అందుచే లోకములో జుగుప్సాకరములై, అసుందరములై, అనిష్ట ప్రాయములైన వస్తువుల దోషలోపములను తలపోయక, వాటికి తానొక సృష్టపటె క్రొత్త సౌందర్యములిచ్చి, సృష్టియందలి వంకలనుగూడ దిద్దఁబ్రయత్నించును. దూరదూరముగా లోకమునఁ గానవచ్చు సుందర వస్తువుల నొక్కచోటికి కవ సరమును బట్టిమార్చుకొనుచు, కవి,తనచే సృజింపఁబడిన లోకము, బ్రహ్మసృష్టికి భిన్నమయ్యును, సౌందర్యము నపరిచ్ఛిన్నముగా వెలార్చునని నిరూపించును. ఇచ్చట 'నిరంకుశాఃకవయ' అనునదియు.' 'అపారే కావ్యసంసారే కవిరేవప్రజాపతిః, యథాస్మైరోచతే విశ్వం। తథేవం పరివర్తతే' అనునదియు; "శృంగారీచేత్కవిః కావ్యం జాతం రసమయం జగత్!" అనునదియును, మనకు సుసంబద్ధములుగాఁ గానవచ్చును. అందుచే కావ్యము లోకానుకరణమైనను,లోకమునుండి కొంత భిన్నపడినచో, దుష్టముకాదు. ఆ భిన్నతను-కవి సమయములలో మనము గుర్తింప వచ్చును.

భరతముని 'లోకస్యానుకృతిర్నాట్య'మ్మని తన నాట్యశాస్త్రమున నాట్య స్వరూపమును నిర్ణయించినట్లుగా, మన తరువాత ఆలంకారికులు కావ్యస్వరూప నిర్ణయము సేయఁజాలక పోయిరి. కొంచెము హెచ్చు తగ్గులతో అందరి నిరుక్తియు వకరూపముగనే యున్నది. శబ్దార్థములే కావ్యమని పెక్కండ్రయూహ. అవి రమణీయములు కానిండు, (రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్-జగన్నాథుఁడు); అదోషములై సగుణములై సాలంకారములు కానిండు (అదోషౌ, సగుణౌ, సాలంకారౌ శబ్దార్థౌ), రసాత్మకములు కానిండు (వాక్యం రసాత్మకం కావ్యం), యిష్టార్థములతో కూడిన పదావళి కానిండు (ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళి-దండి): కాని, అట్టిశబ్దార్థముల కాధారభూతమైన 'లోకవృత్తానుకరణము' వారి కావ్య నిర్వచనమున చేరకపోవుట సమంజసము గాలేదు. ఒక వేళ 'అర్థరూపమున లోకము భాసించును గదా!' యని యనుకొన్నను, అది 'లోకవృత్తానుకరణమే' కావలయునని నిర్బంధమును తెల్పదుగదా! అందుచే 'లోకవృత్తానుకరణములై, లోకోపదేశకములైన సుందర శబ్దార్థములు కావ్య''మని నిర్వచించినచో, ఎక్కువ తృప్తికరమైన నిరుక్తి యగునేమో యని నేననుకొందును. 'సుందరశబ్దార్థము' లని యనుటచే, ప్రాచీనలంకారికుల నిరుక్తులన్ని తడవినట్లేయగును. 'లోకవృత్తానుకరణ'మని యనుటచే, కావ్యవస్తువును, దానియనుకృతి ధర్మమును ఉగ్గడించినట్లగును. 'లోకోపదేశ'' మనుటవలన, కావ్య ప్రయోజనమును గూడ నిశ్చయించినట్లు తెలియును. అనుకృతి'యగుటచే, బింబప్రతిబింబ న్యాయము పూర్తిగాపట్టక, భిన్నతకు కొంత తావొసగుచున్నది. ఆ భిన్నతయు కావ్యరామణీయకమును పెంపుచేయునే కాని, తెంపు చేయదు. ('సుజాత'నుండి)

# లంచగొండితనమును నిరోధించుటెట్లు?

(జి. డి. కర్కార్రి.)

దేశములో జనరలు ఎన్నికలు అయిన తర్వాత కల్మషమైన సంస్థను పరిశుభ్రము చేసెదనని ఇండియా ప్రధాన మంత్రి జవహరిలాలుగారు ఇటీవలనే మాట ఇచ్చియుండిరి. తగినంత అవధి లేనందువలన, ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులుగా నియమింపబడిన వారిలో "సామర్థ్యము", "నీతి" ఉండవలెనని తాను ఏర్పరచిన ఆదర్శములకు తూగజాలని వారుకూడ కొందరున్నారని నిష్కపటముగా ఆయన అంగీకరించెను. ఆయన పిలుపునకు దేశమెప్పుడు కాని ఆలకింపనిది లేదు. అటులనే ఇప్పుడు కాంగ్రెసు సంస్థను పరిశుభ్రము చేయ తలపెట్టినచో, ప్రజలయొక్కయు, శాసనసభ్యులయొక్కయు సహకారము ఆయన తప్పక పొందగలడు. మన దేశము రిపబ్లిక్ దేశమై మూడు సంవత్సరములైనది. స్వాతంత్ర్యము లభించి ఐదు సంవత్సరములైనది. కనుక ప్రతి ఒక్కొక్కరు ఈ విషయములో కొంచము కృషి చేయవలెనని ప్రత్యేకముగ చెప్పుట అనవసరము.

ప్రభుత్వము వారు అనేక విషయములలో సలహాల నొసగి దారి చూపవలసి యున్నది. కాని ప్రజలే ముందుకు వచ్చి, ప్రారంభింపవలసిన విషయములు అనేకములు కలవు. పెద్ద స్థళములలోను, చిన్న చోట్లను లంచగొండితనమును ఎదిరించుట ఇందులో చేరిన ఒక పని.

అధికారమును దుర్వినియోగము చేయుచున్నారని ప్రభుత్వోద్యోగులను అనడము సులభము. ప్రభుత్వమునగా "మంత్రులే" అని మనము తెలిసికొనవలెను. 'ఇది చేయకూడదు' అని ప్రతి శాఖలోను కొన్ని కంచలు ఏర్పరచుట వల్ల, మంత్రుల ఆజ్ఞలకు భిన్నముగ ఏ ఉద్యోగియు, ప్రజాస్వామ్య పరిపాలన క్రింద తన అభిప్రాయ స్వాతంత్ర్యమును (Discretionary powers) చలాయించుటకు వీలులేదను విషయమును మనము జ్ఞాపక ముంచుకొనుట మంచిది. "నా మేజా మీద నున్న టెలిఫోను ఏమి చెప్పునో అదే నా స్వేచ్ఛాభిప్రాయము (Discretion) అని ఉద్యోగులు బదులు చెప్పుట సర్వ సాధారణమైనది. ఈ ఉద్యోగి, ఆ మంత్రి, ఈ ఆహార శాఖ ఇన్‌స్పెక్టరు, ఆ టికెట్ కలెక్టరు సులభముగా ద్రవ్యము సంపాదించుకొని, ధనికులై, బలిసియున్నారని మనము విశేషముగా వినుచున్నాము. ఇందులో ఆశ్చర్యమేమనిన మనకు తెలిసిన ఒక్క కేసులలో కూడ నూటికి ఒక్క భాగము ఋజువు పెట్టజాలకున్నాము. దీని ఫలితమేమనగా అనేక నేరములలోని లోతు తెలియకనే నిలిచిపోవుచున్నవి. దయ్యము కథలుగా మారి, రహస్యముగా ప్రజలు కూడు సమావేశములలో "వదంతులు, గాలిమాటలు, అపవాదములు" గర్వముతో చెప్పువారి సొత్తులగుచున్నవి.

భాగస్వామ్యము చట్ట ప్రకారము ఇండియన్ శిక్షాస్మృతి 161 సెక్షను క్రింద లంచమును తీసుకొను వ్యక్తి ఎంతటి నేరస్థుడో లంచమును ఇచ్చు వ్యక్తికూడ సమానమైన నేరస్థుడుగా పరిగణింపబడును. ఆ నేరము ఇద్దరికి సమానముగ అన్వయించును. అందువలననే ఈ నీచకార్యములు బయలు పడకున్నవి.

కొన్ని కేసులలో మధ్య తరగతికి చేరిన వ్యక్తులున్నారు. అదే వృత్తిగా "మాకు వారు తెలుసును." "వీరు తెలుసును." "వారు నా జోబీలో ఉన్నారు" "వీరు నా జోబీలో ఉన్నా"రని బడాయి కొట్టుకొనుచు, క్రొత్త చేపలకు ఎర వేయుటకై (క్రొత్త వారిని మోసగించుటకై) ప్రయత్నించుచుదురు. వారి వదరుపోతుతనము వల్లను, రహస్యమైన ఉత్తర ప్రత్యుత్తరముల

వల్లను, యోచన లేకుండ అప్పుడప్పుడు కావించు వ్యాఖ్యానములవల్లను, అనుమానాస్పదమైన చెక్కులవల్లను, ముఖ్యమైన సమాచారము బయటపడును. విచారణ ప్రారంభమగును.

అమెరికాలో ఉద్యోగులను, రాయబారులను యఫ్. బి. ఐ. (F. B. I.) వారు రహస్యముగా గమనించు చుండు రీతి, మన ప్రభుత్వోద్యోగులపైనను గూఢచారులను ఉంచవలెనని కొందఱు సలహా యిచ్చియున్నారు. ఈ విధానమును అమలులో నుంచవలెనని తీవ్రముగా ఆందోళణ చేయుటకు ముందు, మనము సూచించిన ఉపాయము చెడ్డకన్న ఎన్నో రెట్లు ఎక్కువగ ఉన్నదా లేదా అని యోచింపవలెను. ఈ విధానము అమలులో పెట్టుట వల్ల ఫలితము చేకూరునను తృప్తి ముందుగా మనకు కలుగవలెను. ప్రభుత్వోద్యోగుల యొక్క నైతిక ప్రవర్తనమును ఈ విధానము తారుమారొనర్చునను విషయమును మనము గమనింపకుండుటకు వీలులేదు. ప్రభుత్వోద్యోగుల నెల్లరిని మనము అనుమానముతో చూచుటకు ప్రారంభించుచో, వారి సామర్థ్యము మఱింత హీనదశకు వచ్చును.

బ్రిటీషువారి మొట్ట మొదటి రాయబారియైన సర్ థామస్ రో, పాదూషా జహంగీరు దర్శనమునకై, నూర్జహాను తమ్మునికి రు 25 లక్షలు ఇచ్చి, రెండు విలువైన మౌక్తికములను మొఘలు రాణీగారికి బహూకరించెను. అందువల్ల పరిపాలనలో లంచగొండితనము విధిలేక ఉండునని ఒక్క విరాగి మాత్రమే చెప్పును. దేశమునకు స్వతంత్రము వచ్చిన తర్వాత సంవత్సరము పొడుగునకు క్రిస్మస్ కానుకలు చెల్లుబడుటకు ఆక్షేపింపకూడదని మనము సమాధానము చెప్పకొనగలమా?

ఒక అమెరికా సినిమాలో లంచము ఇచ్చుట ప్రభుత్వ యంత్రమునకు "గ్రీజు పూయుట" అని వర్ణింపబడినది. పరిస్థితులు హద్దుమించిపోలేదు. కనుక తొందర పడవలసిన అవసరములేదు. ఇటువంటి లంచగొండితనమును నిత్యకృత్యములలో ఒకటని మనమంగీకరించి నప్పుడే మనము నిరాశ పొందవలసియున్నది. తాంబూలము కూడ ఇచ్చుట, పుచ్చుకొనుట నేరముగ మనము ఎంచి నిరాకరింపవలెను.

యుద్ధములో మొట్ట మొదట దెబ్బతినునది "సత్యము". రెండవ ప్రపంచయుద్ధములో లంచగొండితనమునకు ప్రోత్సాహము లభించెను. బ్రిటీషు దేశము యుద్ధములో జయము పొందెను. యుద్ధములో జయింపవలెనను ప్రయత్నములో బ్రిటను ఇండియాలో నైతిక ఔన్నత్యమును కోలుపోయెను. ఇండియాను కూడ కోలుపోయెను. రైళ్ళలో సరుకులు రవాణా చేయుటలో ముఖ్యమైన వస్తువులను ముందుగ రవాణా చేయవలెనని ఒక నిబంధన ఏర్పరుపబడెను. ఒక పచ్చ కరెన్సీ నోటు వల్ల ఆలస్యముగ రవాణా చేయవలసిన వస్తువులకు ముందు స్థానము అబ్బుచూ వచ్చెను. కనుక లంచగొండి తనము మొట్ట మొదట రైల్వేలలో ప్రారంభమాయెను. క్రమక్రమముగా ఈ లంచగొండితనము ఇతర ప్రభుత్వ శాఖలకు ప్రవేసించి, ఇప్పుడు ఆయువుపట్లలోనికి జొచ్చినది.

మునుపుండిన ప్రభుత్వము నుండి సంక్రమించిన ఈ లంచగొండి తనమును తుడిచి వేయుటకై మన మెల్లరము ఎక్కువ పట్టుదలతో పాటుపడ వలెను. లంచగొండితనమును ఎదురించుట కన్న ఊరకుండుట మేలను పద్ధతి వహించినచో ఒక జాతిగా మన భవిష్యత్తుకే ప్రమాదము కలుగుట గాక, మన స్వాతంత్ర్యమునకు కూడ ప్రమాదము వాటిల్లును.

కంట్రోళ్ళన్నియు తొలగించినచో, పరిపాలనలో లంచగొండితనము పూర్తిగ తొలగిపోవునని కొందఱు తలచు చున్నారు. ఈ సూచనలో కొంత బలమున్నది. కాని ప్రభుత్వము కంట్రోళ్ళు తొలగింపజాలనందున మనము దానిని సాకుగా తీసుకొని ఉపేక్షాభావముతో నుండరాదు. మన ఆర్థిక అభివృద్ధి యంతయు ఒక ప్రణాళికపై ఆధారపడి యుండుట అవసరము. అందువలన ఈ దినము అమలులోనుండు కంట్రోళ్ళన్నియు తొలగింపబడినను, క్రొత్త విధమైన కంట్రోళ్ళు

వాని స్థళములో ప్రవేశ పెట్టవలసి యుండును.

ఈ అత్యవసరమైన సమస్యను ఏ దృష్టితో మనము చూచినను, లంచగొండితనమును, చీకటి వ్యాపారమును రూపుమాపు విషయములో ప్రజలే ముందుకు రావలెనని తేలుచున్నది. ఈ గొలుసులో కట్టకడపటి అతుకే చాల ముఖ్యమైనది. ఎందుకనగా ఆ కడపటి భాగమైన ప్రజలయొక్క అవసరములపైన, ఇతరులు భాగ్యవంతులగుట ఆధారపడి యుండును. వస్తువును కొను వారి రక్తమును పూర్తిగ పీల్చి, వారి దేహమునంతయు తెల్లగా చేయగలుగుటకు నేర్చుకొని నందువల్లనే బ్లాకు మార్కెటు వ్యాపారస్తుడు లంచమిచ్చుటకు పూనుకొనును. "కాలము"నకు ఎక్కువ ప్రాధాన్యమున్నదని నది ఉద్యోగులకు తెలిసినందుననే, వ్యాపారస్తులపై "ఆలస్యము"ను ఆటలు ఆడుటకు పూనుకొందురు. ఆలస్యము చేయు పద్ధతులు ఉద్యోగులలో ఉడుకు పుట్టించునట్లును, లంచగొండినము, చీకటి వ్యాపారులకు లాభదాయముగ ఉండకుండు రీతిని మనము చేయవలెను. కొంత కాలము వఱకు ఇబ్బందులకును, అభావమునకును మనంతకు మనము సిద్ధపడిన కాని ఇది నెఱవేరదు. గొలుసులో కట్ట కడపటి అతుకులగు ప్రజలు నిరోధించుటకు ప్రారంభించుచో, ఇతరులు లంచమడుగుటకు కూడ సందేహించెదరు. మనము న్యాయముగ రావలసిన దానిని మాత్రమే కోరవలెను. ప్రత్యేకమైన అనుగ్రహములకు కాని, ముందుగా పొందవలెనను ఆతురతకు కాని లోను కాగూడదు. మన హక్కులపైననే మన పనులు నెరవేర్చుటతో తృప్తిపడవలెను. అధికారమును చేపట్టుకొన్న వారి దయాదాక్షిణ్యములకు లోనై, మన మేమియు ఇవ్వవలసిన ప్రమేయముండదు. చైనా చరిత్రనుండి మన మీ సంగతులు నేర్చుకొనవలెను. మన జాతి యొక్క క్షేమమునకై లంచగొండితన మెచ్చట ఉన్నను రూపుమాపుటకు ప్రయత్నింపవలెను. ఒక్కసారి ఈ విషయమై నిశ్చయమైన తీర్మానమునకొచ్చినచో ప్రతి వారును కొంచముగనో, గొప్పగనో ఈ విషయములో జయమును సాధింప గలరు.

("హిందూ పత్రిక.")

---

1. మనము విచారకరమైన సంఘము మధ్యలో నున్నాము. పైకి ప్రేలాడుచుండు లంచగొండితనము నుండి "గెలుపు" అనే ఉపదేశము చుక్క చుక్కగా పడుచున్నది.

* * *

2. గెలుపు అనునది ఒక భయంకరమైన వస్తువు అని మనము చెప్పవచ్చును. యోగ్యతకు పరస్పర విరోధమైన కృత్రిమమైన వస్తువు గెలుపు. అది ప్రజలను మోసపుచ్చుచుండును. "గెలుపు" అనిన సామాన్యమైన ప్రజలెల్లరికి అధిపత్యమను భావము కలదు. సామర్థ్యమునకు నటనమైనది గెలుపు. దానిలో వంచకత్వమున్నది.

—విక్టర్ హ్యూగో.

# నిర్భాగ్యజీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ., బి.ఎల్.,)

(న్యాయశీలుడు — మిరిల్.)

—(9)—

వృద్ధుని ముఖమున చిరునవ్వట్లే యుండెను.

"అయిన, నాకాచార్యులు?"

"కావచ్చు."

"దయచేయండయ్యా" అని సంఘీయుడు చేయి చాచెను. ఆచారుడా కరస్పర్శ చేయగనే, "నాకు వచ్చిన దసత్య వార్త యైనందుకు సంతోషము. మీరు చాల జబ్బుగా ఉన్నట్లు కన్పట్టుట లేదు." అనెను.

"అయ్యా, త్వరలోనే ఇప్పటికంటె బాగగుదును." అని ఒకింత "మూడు గంటలలో నేను మరణింతును. నేనును కొంతకు కొంత వైద్యుడను. మృత్యువు అడుగుల సవ్వడి నే నెఱుగుదును. నిన్న నా పాదములే చల్లగ నుండినవి. ఈ రోజు మోకాళ్ళకు ప్రాకినది. ఇప్పుడు నడుముల కెక్కినది. గుండె తాకినప్పు డంతయు ఐపోవును. సూర్యాస్తమయమున మనోహరముగానున్నది. కాదూ? నా యంతకు నేనే ఈ కుర్చీని వెలుపలికి దొరలించుకొని వచ్చితిని — కడపటి సారి ప్రకృతి శోభను చూచుటకు మీరు నాతో మాటాడవచ్చు. అది నాకాయాసము కల్గింపదు. చావ సిద్ధమైన వానిని చూడవచ్చుట చాల మంచి పని. ఈ సమయమునకు సాక్షులుండుట మంచిది. ఒక్కొక్కరికి ఒక్క మోజుండును. సూర్యోదయము వరకు బ్రతుక వలెనని నా కోరిక. కాని మూడు గంటలలో నా బ్రతుకు ముగియునని నాకు తెలియును. అప్పుడు రాత్రిసమయము. అయిన నేమి? ముగింపు చాల సులభము. దాని కుదయమక్కర లేదు. అట్లే జరగనీ. నేను నక్షత్ర కాంతిలో మరణింతును. అని చెప్పి, ఆ పిల్లవాని వంక తిరిగి "నాయనా, నీవుపోయి పడుకో. నిన్న రాత్రి యంతయు కాచితివి. అలసియున్నావు." అనెను.

పోవుచున్న బాలకు నట్లె చూచుచు, వృద్ధుడు తనలో మాట్లాడు కొనుచున్నట్లుగా "వాడు నిద్రించునపుడు, నేను మరణించెదను. రెండు నిద్రలొకటి కొకటి తోడు." అని మందస్వరమున పలికెను.

ఆచార్యుని యభిప్రాయము ననుసరించి యిది ఉత్తమ మరణముకాదు. కావున, ఈ దృశ్య మతనిని కదలించ లేదు. మన మంతయు చెప్పదలచుకొన్నప్పుడు, మహాత్ములలోని చిన్న పరిపడని సంగతులు కూడ వివరించి తీరవలెను. డాక్టర్లలో, మతాచార్యులలో సామాన్యముగ కాఠిన్యము కనబడును. మిరిల్ కది యలవాటు లేదు. ఆ కాఠిన్య ప్రేరణ కలిగిన మాట వాస్తవము.

ఎన్ని చెప్పినను, ఈ సంఘీయుడు, ఈ ప్రజాప్రతినిధి ఒక నాదధికారయుతుడు. బిషప్‌కు, తన జీవితమున బహుశా ప్రథమమున ఇప్పుడే కాఠిన్యమును వహించుట వినోదకర మైనది. సంఘీయుడు వినయ సద్భావములతో సన్మానించెను. మట్టిలో కలియుటకు సిద్ధమైయుండు వారిలో ఇట్టి యణకువ యుండునేమో.

బిషప్పు, సాధారణముగా, ఒకరి విషయములు తెలిసికొన ఉత్సుకుడు కాడు. ఆ యుత్సుకత్వము తప్పని యతని భావము. కాని ఈ సంఘీయుని పరిశీలింపకుండుట కతని చేతకాలేదు. ఈ పరిశీలనకు మూలము సానుభూతి కాదు. ఇంకొక రిట్లు చేసియుండిన,

ఆయన యంతరాత్మ నిరసించి యుండెడిది. కాని జాతీయ సంఘ సభ్యుడు సంఘ ద్రోహి యని, దాతృత్వమునకును అర్హుడు కాడని అతని యభిప్రాయము.

ఆత్మ నిగ్రహము, వంపులేని మూర్తి, కంపిత స్వరమును కల ఈ యెనుబదేండ్లు కడచిన సంఘీయుడు, మానవ దేహతత్వజ్ఞులకు అద్భుతము గొల్పు వ్యక్తి. సమయమునకు తగినట్లు విప్లవ మిట్టివారిని, పెక్కుర నుత్పత్తి చేసినది. మృత్యువు నింత దగ్గరుంచియు, ఆరోగ్య చిహ్నములనట్లే నిలిపికొన్నాడు. అతనిని చూచిన, ఇదిగో పరీక్షలకు నిలచిన వాడనిపించును. చూపులలో ప్రకాశము, పలుకులలో ప్రతిష్ఠత. బుజములలోని కండల కదలికలు మృత్యువు ప్రయత్నమును విఫలము సేయ సమర్థములనిపించును. మహమ్మదీయ మతము నందలి, సమాధి దేవతయగు అజ్రేల్, పొరపడితినను కొని, యీ మూర్తిని చూచి వెనుదిరుగ నోపు. అతడు తానై కోరి మరణించుచుండినట్లుండినది. అతని వ్యథయందును స్వాతంత్ర్యముండినది. కాళ్ళే కొరడువారి చల్లబడి, చచ్చిపోయినవి. తల పూర్ణపాటవ ప్రకాశములలో జీవించుచునేయున్నది. ప్రాచ్యవాఙ్మయము నందలి, నడుముపైన కండలు, క్రింద శిలగా వర్ణింపబడిన యలౌకిక ప్రాణివలె, ఈ గంభీర సమయమున సంఘీయుడు కన్పట్టు చుండెను. బిషప్పొక రాతిపైన కూర్చుండి, తడాలున, నిందాస్వరముతో "రాజ హత్యకై మీరు వోటు చేయనందుకైన మిమ్మభినందింతును." అని పలికెను.

"ఏని" యని యాది పల్కుటలోని కాఠిన్యమును సంఘీయుడు గమనించినట్లు కన్పట్ట లేదు. అతని ముఖము నందలి చిఱునవ్వం తరించినది.

"ఎక్కువగా అభినందించ వలదయ్యా! ఆ రాక్షస నాశనమునకు నేను వోటు చేసితిని" అని తప్త కంఠము బదులు పలికెను.

"ఏమి మీ అభిప్రాయము?"

"నా యభిప్రాయమా, మానవునిలో ఒక రాక్షసుడున్నాడు — అజ్ఞానము. ఆ రాక్షస నిర్మూలమునకు నేను ఓటు చేసితిని. ఆ రాక్షసునికి రాచరిక మబ్బినది. అది యసత్యమునుండి యుత్పన్నమగు అధికారము. మానవుడు, సైన్సుచేత పాలింపబడవలెను."

"అంతరాత్మ చేతను—"

"అవునదియే. అంతరాత్మ మనలోనివిజ్ఞానము."

ఇది బిషప్పుకు క్రొత్తి భావ. ఆశ్చర్యము కలిగించినది. సంఘీయుడు మఱల మాటాడసాగెను. "పదునారవలూయి వధ కూడదని నే నంటిని. ఒక మనుష్యుని చంపు అధికారము నాకు లేదని నాకు నమ్మకము. కాని, చెడ్డను నిర్మూలించుట నా ధర్మ మనుకొందును. రాక్షస పతనమునకు సమ్మతించితిని. అనగా, వేశ్యా వృత్తి నిర్మూలింప వలెనని, బానిసత్వమును తుడిచి వేయవలెనని, శిశువులకు విద్య నీవలెనని వోటు చేసితిని. మూఢ్య భ్రమలను తొలగింప సాయ మొనర్చితిని. వాని పతనము వికాసమును తెచ్చును! ప్రాంత ప్రపంచమును పడద్రోసితిమి. అది దుఃఖాలవాలము. దానిని తల క్రిందు చేయనిదే మానవ జాతికి హాయి కలుగదు."

"ఆ హాయి మిశ్రమము."

"కష్ట సహితమని మీరనవచ్చును. 1814 అనబడు మారణ మహావాయువు వీచిన తరువాత, హాయి బొత్తుగా అంతరించినది. అయ్యో! ఆపని పూర్ణత్వ సిద్ధి లేనిదని యంగీకరింతును. పూర్వ విధానము యొక్క ఆకారమును మాత్రమే మేము పడగొట్టితిమి. అభిప్రాయ మింకను గెలిచి యుండినది. దురాచారము మాన్పిన చాలదు. అలవాటు మార్చవలెను. గాలికి తిరుగు యంత్రము పోయినది. గాలి యింకను ఉన్నది."

(సశేషము.)

# స్త్రీ తత్వములోని ప్రతిభ.

శ్రీమతి యస్. పద్మావతీదేవి గారు.

ఒక యువతి ఈ క్రింది లేఖను నాకు వ్రాసినది.

సోదరీ!

మీరు "భారతజ్యోతి" పత్రికలో స్త్రీలకు సంబంధించిన వివిధ విషయములపై మొదటి నుండి యు వ్రాయుచున్న వ్యాసములను యెక్కువ శ్రద్ధతో జదువుచున్నాను. "పత్నులు — దాంపత్య ధర్మములు" అనే శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసములు నాకత్యంత యాశ్చర్యమును కలుగ జేసినవి. మీ విజ్ఞానమును, సూక్ష్మబుద్ధిని, పరిశోధన శక్తిని వేనోళ్ళ చాటుచున్నవి. ఆంగ్ల విద్యలో పాండిత్యమును సంపాదించి, ఇంగ్లాండు, ఐర్లాండు దేశములకు పోయి వైద్య విద్య నభ్యసించి, ఈ దేశములో వైద్య వృత్తి నవలంభించుచున్న సోదరివని మీరు తెలుపకనే మీ వ్యాసములు చాటుచున్నవి. పాశ్చాత్య దేశములలో స్త్రీ లెట్టి స్వాతంత్రము ననుభవించుచున్నారో మీరు స్వయముగా చూచి యుందురు. మన దేశము యొక్క కాన్‌స్టిట్యూషన్‌లో, ఓటింగు హక్కులలోను, ఉద్యోగములలోను, ఇతర యవకాశములలోను పురుషులతో సమానముగ స్త్రీలకు హక్కులు, స్వతంత్రము యివ్వబడినదని చెప్పుచున్నారు. శాసన సభ్యురాండ్రుగ స్త్రీలు నిలుచుటకు స్వతంత్రమైన హక్కులున్నవని చెప్పుచున్నారు. మీ వ్యాసములు చదువునప్పుడు ఆడవారలలో నింతటి విజ్ఞానవతి యున్నది కదా అనే సంతోషమొకతట్టు కలుగుచున్నది. మగవారి పొగురుపోతు తనమునకును, దాసిత్వమునకును స్త్రీలు అంటిపెట్టుకొన వలెనని మీరు గావించే ప్రబోధము చూడ పట్టరాని కోపము వచ్చుచున్నది. పెండ్లిండ్ల విషయములో స్త్రీలకు స్వేచ్ఛ యుండవలెనని మీ వంటి విజ్ఞానులు చెప్పక పోతే స్త్రీల గతి యేమి? ఎప్పటికి స్వతంత్రము లేక మగవారి క్రింద దాసురాండ్రుగ పడి యుండుటయేనా స్త్రీల పుట్టుక యొక్క అర్థము. సంతాన నిరోధన విషయములో సైన్సు యెక్కువ అభివృద్ధి నొందినది. సంతానము కలుగునను భయము లేక యవసరమున్నపుడు, యిష్టము వచ్చిన మగవారితో యుండి, మిగత వేళలలో స్వేచ్ఛగ జీవించుటకు వీలున్నది. పుట్టినది మొదలు చచ్చువరకు మగవాండ్ల దౌర్జన్యములకు, పొగరుబోతు తనములకు లోబడి, బిడ్డలను కనుచు, స్వేచ్ఛలేక బ్రతుకుట కంటె స్త్రీలందరు వొకసారి సముద్రములో పడి చచ్చుట మేలు. "స్త్రీలకు బిడ్డలే ఆనంద" మని పాటలను కూడ చేర్చి మీరు వ్రాయుట నాకు సరిపోలేదు. "పెండ్లిండ్లు", "సంతానము" యను నవి లేకుండ, మగవారి దాస్యమునుండి భారతీయ స్త్రీల నుద్ధరించుటకై మీ వంటి విజ్ఞానులు పాటు పడవలెనని కోరుచున్నాను.

మీ ప్రియ సోదరి.

*　　*　　*

పాతివ్రత్య ధర్మములో ప్రపంచమున కంతయు ధృవ తారయని వేలకొలది సంవత్సరములుగ విఖ్యాతి గాంచిన ఈ దేశములో ఇవ్వడెట్టి విప్లవాత్మకమైన భావములు మనయువతుల యందు — ముఖ్యముగ హిందూ యువతులందు అంకురించుచున్నవో ఆడ పిల్లలు కనిన తల్లిదండ్రులు గమనించెదరు గాక. పై ఉత్తరమును వ్రాసిన యువతి పేరును, నివాస స్థలమును వదలి మిగత భాగములను చాల నొప్పితో ప్రకటనార్థము వదలి యున్నాను. నైతిక దృక్పథమునుండి మన హిందూ యువతులు క్రింది కెటుల పడిపోవుచున్నారో గమనింపుడు. ఈ యుత్తరమును నొక హెచ్చరికగా గైకొందురు గాక.

ప్రకృతి విరుద్ధమైన కొన్ని విపరీత భావములు, కొన్ని పొరబాటు అభిప్రాయములు ఈ యువతి కలిగి యున్నది. ఇట్టి యభిప్రాయములు యింకెంత మంది యువతులలో జనించి యున్నవో కదా!

ఈ ప్రపంచములో కంటికి కనపడ నటువంటి అణు ప్రమాణమైన జీవులనుండి బ్రహ్మాండమును వ్యాపించియున్న జీవరాసులలో నన్నిటి యందును స్త్రీ, పురుష శక్తులున్నవి. వీని కూడిక వలననే సృష్టి క్రియ యంతయు కొనసాగుచున్నది. సృష్టి గొనసాగవలె నను సంకల్పమే లేని యెడల స్త్రీ, పురుష విభేదము లు ప్రకృతిలో నుండి యుండవు. పురుషుడు లేనిదే స్త్రీ పరిపూర్ణురాలు కాదు. స్త్రీ లేనిదే పురుషుడు పరిపూర్ణుడు కాడు. ఒకరితో నొకరు సహకరింపవలసిన (Complimentary) జీవశక్తులు. ఒకటితో మఱియొకటి చేరి సమైక్యతను పొందుట కనుకూలించు విధమున స్త్రీ, పురుష దేహ నిర్మాణములు సృష్టింపబడినవి. వీని నన్నిటిని కాదని త్రోసివేసి, పురుషుల చేతులలో స్త్రీలుండకూడదని వాదించుట ప్రకృతి ధర్మమునకే విరుద్ధము.

ఈ యువతి కళాశాల విద్యార్థిని. ఈమె ఎట్టి పరిస్థితులలో కూడ పురుషుల ముఖమును చూచుట లేదనియు; పురుషుల స్పర్శ లేకనే అక్షతయోని కలిగి, విరాగిణియై జీవితమును గడిపెదననియును వ్రాసి యుండిన నే నెంతో ఆనందించి యుండెడి దానను. ఈ యువతి యభిప్రాయ మట్లు లేదు. కామేచ్ఛ కలిగి నపుడు తన కిష్టము వచ్చిన పురుషునితో రతి సౌఖ్యమును అనుభవింపవలెనట. ఆ కూడిక ముగిసిన వెంటనే ఆ పురుషుడు పనికిరాడట. పురుషులకు స్త్రీలు కావలసి నప్పుడు స్త్రీలు వారికి దాసులై వారి దౌర్జన్యములకును, పొగరుబోతు తనమునకును లోబడకూడదట. ఇది ఎంత మాత్రము సహేతుకముగ ఉన్నదో తెలియుట లేదు.

బిడ్డలు, స్త్రీ, పురుషుల ప్రతిబింబములు. ప్రకృతి దత్తమగు రతి సౌఖ్యము యొక్క ఫలములు. "బిడ్డలో", "బిడ్డలో" అని సంతానములేని వారొక వైపు నోములు, వ్రతములు, తపస్సులు చేయుచున్నారు. బిడ్డలు కనగలిగిన వారు కృత్రిమ పద్ధతుల ననుసరించి నిరోధించుట పాడియగునా? స్థావరములైన వృక్ష జాతులు కూడ తమ సంతానము నెగడు కొఱకై విత్తనములను భూమిపై వదలు చున్నవి. ఇక మానవు లా సంతానమును నిరోధించుటకు పూను కొనుట? సంతాన విహీనులై యుండుటకా స్త్రీలు వివాహములు వలదని కోరుట? ఎట్టి స్వతంత్రభావము లివి.

హిందూ ధర్మ శాస్త్రములును, క్రైస్తవుల ధర్మ శాస్త్రమైన బైబులు, సంతాన నిరోధమును తీవ్రముగ ఖండించి యున్నవి. సంతాన నిరోధక సాధనములను గాంధీజీ కూడ పలుమారు ఖండించుచు, అనేక వ్యాసములను వ్రాసియున్నాడు. కామోద్రేకులకు భయము, లజ్జలునవి యుండజాలవు. కామోన్మత్తు స్త్రీ, పురుషులలో నెవరిని పైగొనినను, తమ్ము తాము మఱచెదరు. సంతాన నిరోధక సాధనములు, యుక్తులు అప్పుడు జ్ఞాపకమునకు రావు. అట్టి తరుణములో యోనిలో వీర్యస్ఖలనమైన వెంటనే శోభోత్పత్తి ప్రారంభమగును. దానిని దిగజారుటకు ప్రయత్నించుట శిశుహత్యయగును. కృత్రిమములైన సంతాన నిరోధక పద్ధతుల వలన ప్రకృతి యొసగిన ఆనందమును స్త్రీలు కాని, పురుషులు కాని పూర్ణముగ అనుభవింపజాలరు.

పాశ్చాత్య దేశములలో స్త్రీలకు పురుషులతో సమానమైన రాజకీయ హక్కులున్నందున వారు గృహ జీవితములకు దూరులై, స్వేచ్ఛా జీవితములకు దాసులై స్వేచ్ఛా విహారము ననుభవించుచు, కామ తృప్తిని మాత్రము పొందుచు, అవివాహితులై స్వతంత్ర రాండ్రుగ యున్నారను అభిప్రాయము ఎక్కువగ వ్యాపించు చున్నది. అమెరికా స్త్రీలు కాని, ఆంగ్ల స్త్రీలు కాని అవివాహిత జీవితములను అంగీకరింపరు. స్వేచ్ఛా విహారముల కంగీకరింపరు. ఇటీవల న్యూఢిల్లీ పటణములో లేడీ ఇర్విన్ కళాశాలలలో మహిళా సభ జరిగినది. రూజీవెల్టు సతి అందుపన్యాసకురాలు. రాజకీయ రంగములలో అమెరికా స్త్రీలు ఎక్కువగ ఎందుకు పా

ల్గొనుటలేదని అడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తర మొసగుచు "అమెరికా స్త్రీలు గృహజీవితములనే ఎక్కువగ వాంఛించెదరు. రాజకీయ రంగములకును, గృహ జీవితములకును దూర మెక్కువని వారికి బాగుగ తెలియును. అందు వల్లనే రాజకీయ రంగములలో ఎక్కువగ పాల్గొనరని చెప్పెను.

వేద యుగమునకు పూర్వము మన దేశములో కూడ స్వేచ్ఛా విహారములు ఎక్కువగ ఉండినవి. స్త్రీ పురుషుల మధ్య వివాహమను కట్టుబాట్లు లేకుండెను. అప్పుడు తమకు పుట్టిన బిడ్డలకు తండ్రులెవరో చెప్ప జాలని స్థితిలో స్త్రీలుండిరి. ఈ విషయమై ఉపనిషత్తులలో వర్ణింపబడిన "సత్యకాముని కథ"ను ఇదివరకే వ్రాసి యున్నాను. "పక్షులు—దాంపత్యధర్మములు, అని వ్రాసిన వ్యాసములలో నోరులేని పక్షులు, పావురములు, గోరువంకలు, మొదలగు వానిలో స్త్రీ, పురుష పక్షులు ఒకసారి కూడెనా — అవి జీవించియుండు నంత కాలము ఆడ పక్షి పాతివ్రత్య ధర్మమును, మగపక్షి ఏకపత్నీవ్రతమును ఎట్లు నెరవేర్చుచున్నవో విపులముగ వ్రాసియున్నాను. ఈ సత్యమును ఈ దినమునకుకూడ కండ్లు కలిగిన యువతులు, యువకులు చూడవచ్చును. నోరు లేని పక్షులే ఈ దాంపత్య ధర్మ సూత్రములను ఇంత ఆదర్శ ప్రాయముగ నెరవేర్చుచుండ, మహా జ్ఞానత్వము కలిగి, సృష్టికంతయు అధినేతలైన మానవులు ఎట్లు ప్రవర్తింపవలెనో వేరుగ వ్రాయవలెనా? చెప్పవలెనా?

మన యువకులలో ఇట్టి విప్లవాత్మకమైన భావము లంకురించుట వారి తప్పుకాదు. ఇది తల్లి దండ్రుల తప్పై యున్నది. బిడ్డలను పెంచుట సులభమైన పని పనికాదు. స్త్రీలకు ఉన్నత విద్యలు చెప్పించుట హానికరమని కొందరు తల్లి దండ్రులు భావించుచున్నారు. విద్యలో తప్పేమియు లేదు. తప్పంతయు తల్లులు తమ నిత్య జీవితములలో భావముల వల్ల కాని, మాటలవల్ల కాని, కార్యముల వల్ల కాని, నీతి మార్గములను తప్పినటుల బిడ్డలు తలంచుట కవకాశ మొసగ కూడదు. క్రమశిక్షణ మొసగి, గొప్ప ఆదర్శ గ్రంథములు ముందు పెట్టి నీతి ప్రతిపాదికములైన కథలను, జీవ చరిత్రలను చెప్పుచూ బిడ్డలను పెంచవలెను.

యువతులకు వివాహమువలన జీవితములకు భద్రత ఏర్పడును. బిడ్డలను కనుట వల్ల తమ ప్రతిబింబములను తామే చూడగలుగుదురు. బిడ్డలను ప్రక్కలో పరుండ పెట్టుకొని, చనుబాలిచ్చునప్పుడును, చంక నెత్తుకొని ముద్దాడు నపుడును, తల్లులకు కలుగు ఆనందము స్వీయముగ అనుభవించు వారికి తప్ప, ఇతరులకు ఎంతగ వ్రాసినను అర్థము కాదు. దానినే యోగీంద్రులు ఈశ్వరానందమందురు. అదియే స్త్రీ తత్వము యొక్క ఔన్నత్యము. ఘనత. పూర్ణత్వము.

---

కడప డిస్ట్రిక్టు మునసబు కోర్టులో.

S. C. No. 18 of 1952.

బొందగల పిచ్చయ్య — వాది

Vs.

పీరబోయిన రామకృష్ణయ్య — ప్రతివాది

పై నెంబరులో వాది ప్రతివాదిపైన 466/— రూపాయలకు దాఖలు చేసినాడు. 24—3—1952 తేదీని ప్రతివాది హాజరు కానందున ప్రతివాదిని ఎక్సుపార్టీ చేసి తీర్మానించడమువునని తెలుపడమైనది.

కడప. కె. గుండురావు,
వాది అడ్వకేటు.

---

## నోటీసు.

కడప ప్రిన్సిపల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో

O. S. No. 9/1952.

ఉయ్యాల సుబ్బన్న — వాది

Vs.

1. సూరకొక్కగారి వెంకటరెడ్డి,
2. సూరకొక్కగారి తిప్పారెడ్డి, } ప్రతివాదులు.

ఈ నెంబరు వాది మీపైన దావా రు 1306-14-0 లు రాబట్టుకొను నిమిత్తము, దాఖలు చేసినాడు. ఆ దావా 3—4—1952 తేదికి మీరు హాజరు కాగలందులకు వాయిదా వేయబడినది. కనుక సదరు తేదీకి మీరు స్వయముగా గాని, లేక వకీలు ద్వారా గాని హాజరు కావలెను. లేని యెడల మీ పరోక్షమందు దావా తీర్మానించడమూనని తెల్పడమైనది.

కడప. ఆర్. రంగనాథం, బి.ఏ., బి.యల్.,
వాది తరఫు అడ్వకేటు.

# నృత్య ప్రదర్శనము.

ఏప్రెలు నెల 12-వ తేది, శనివారము కడప శ్రీ రామకృష్ణ హైస్కూలు నందు

## కుమారి వారిజా

( చెన్నపట్టణము. )

నృత్యప్రదర్శన మొసగును.

చూడతగినది.

# ప్రకటన.

12-3-52 నుండి "భారతజ్యోతి" పుస్తక రూపమున వెలువడుచున్నది. అన్ని ప్రాంతములలోను ఏజంట్లు కావలయును. వివరములకు ఈ క్రింది అడ్రసుకు వ్రాయుడు.

మేనేజరు.

19—3—1952. "భారతజ్యోతి." కడప.



భారత దేశమునకై ఇంగ్లాండులో మొట్టమొదట తయారు చేసిన రైల్వే ఇంజను

—బ్రిటీషు ఇన్ ఫర్మేషన్ సర్వీసువారి సౌజన్యము వలన.

Printed at the "BHARATHA JYOTHI" Printing Press, Published and issued at 257, Trunk Road, Cuddapah,
for the BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE
*Printer :* K R Joshee : *Publisher :* V. R Gopalakrishna
*Editorial Office :* 16/92 Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక.

REGISTERED No. M. 5285

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

| సంపుటము 4. సంచిక-15. | బుధవారము, మే 2, 1951. | ప్రతి బుధవారము వెలువడును. |
|---|---|---|

## విషయానుక్రమణిక.



'భారతజ్యోతి' త్వరలో 1/8 రాయల్ సైజులో పుస్తకరూపమున ఎక్కువ పుటలతో ప్రకటింపబడనున్నది. అన్ని ప్రదేశములలో ఏజంట్లు కావలయును. వివరములకు మేనేజరుతో సంప్రదింపుడు.

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 15. | శ్రీ ఖర సం॥ చైత్ర బ. ౧౨, మే 2, 1951. | ప్రతి బుధవారము ప్రకటింప బడును


## శ్రీ జవహరిలాలుగారు అంతర్వీక్షణ చేయవలెను.

—0—

తన తప్పులనుకాని, తన ప్రభుత్వముచేయు లోటుపాట్లను కాని ఏలాటి దాపరికము లేకుండ బహిరంగముగ వెలిబుచ్చుటయందు, రాజకీయ నాయకులలో గాంధీజీ తర్వాత, శ్రీ జవహరిలాలుగారు ఒక్కరే కనపడుచున్నారు. ఇది చాల శ్లాఘనీయమైన గుణము. కాని తాను ప్రధానమంత్రి కాకముందు రాజకీయ నాయకుడుగ యుండెను. మునుపటి వలెనే ఇప్పుడుకూడ రాజకీయ నాయకుడనని కాని, లేక ఒక మత సంస్థకు అధిపతినని కాని తలచుచు, తప్పుచేసినవారిని క్షమించుచుండుట వలన అది విపరీత పరిణామములకు దారితీయును. శ్రీ జవహరిలాలుగారు ఒక అఖండమైన భూభాగమున కంతయు వర్తించు, ఒక గొప్ప ప్రభుత్వమునకు నాయకుడు. తన హృదయము ఎంత మెత్తనిదైనను, తన ప్రభుత్వములో తప్పుచేసినవారిని క్షమించుట తగదు. నిరపరాధులను శిక్షించుట తగదు. ప్రస్తుత జాతీయ ప్రభుత్వములో, మొట్టమొదట ఆర్థికశాఖామంత్రిగానుండిన సర్ షన్ముఖము చెట్టిగారు తప్పుచేసెనని తోచగనే, తన ప్రభుత్వము నుండి పొమ్మని చెప్పలేదా? అప్పుడు శ్రీ జవహరిలాలుగారు అతనిని పొమ్మని చెప్పుటయు, సర్ షన్ముఖము చెట్టిగారు పోవుదునని చెప్పుటయు, ఈ రెండు కార్యములను, దేశము కొనియాడినది. ఇద్దరిని మెచ్చుకొనినది.

ప్రధాన ఆర్థిక శాఖామంత్రి, కేంద్ర ప్రభుత్వ మంత్రివర్గమునుండి వెడలి పోయిన తర్వాత, చక్కెర విషయములోనేమి, ఎరువుల విషయములోనేమి, అధికాహార ఉత్పత్తి విషయములోనేమి, జీపుల విషయములోనేమి, దామోదర ప్రాజెక్టు విషయములోనేమి, వివిధ శాఖలకు చెందిన మంత్రులపై పార్లమెంటు సభలోనే బహిరంగముగ కొన్ని ఆరోపణలు చేయబడెను. ప్రజల కష్టార్జితముల నుండి వసూలు చేసి, ప్రభుత్వ కోశాగారములో చేర్చిపెట్టిన ధనమున కెంతో లోటు కలిగినది. రైల్వే ఉద్యోగిపై అవినీతి నేరమునకై ఒక ఉన్నత పోలీసు అధికారి జరుపు విచారణనుకూడ ఆపుదల చేయవలసినదని మఱియొక ప్రభుత్వోద్యోగి చెప్పినటుల కూడ పార్లమెంటు సభలో బహిరంగముగా అంగీకరింప బడెను. పై ఆరోపణలకు సంబంధించిన మంత్రులనెల్లరిని తన మంత్రివర్గమున ఉండ వలదని చెప్పుటకు శ్రీ జవహరిలాలుగారు ఎందుకు వెనుకాడు చున్నారో అర్థము కాకున్నది. సర్. షన్ముఖము చెట్టిగారి విషయములో చూపబడిన పట్టుదల ఈ మంత్రుల యెడల ఎందుకు చూపజాలకున్నారు? అవినీతి పరులైన ఉద్యోగుల నెల్లరిని త్వరలో బహిరంగ న్యాయస్థానములకు విచారణకై ఒప్పగింపక, వారలకు శ్రీ జవహరిలాలుగారి పరిపాలనక్రింద రక్షణ లభించుట ప్రజలలో చాల ఆశ్చర్యము కలుగజేయు చున్నది. ఇది సహజము.

దీనికి తోడుగా సామాన్య ప్రజలయొక్క జీవితములు రానురాను దుర్భరములగు చున్నవి. ఒక మూల పరోక్షమున వేయబడుచున్న పన్నుల భారము ఎక్కువగు చున్నది. వేరొక మూల, ప్రజల నిత్య జీవితముల కవసరమైన ఆహార ధాన్యము, గుడ్డలు, మొదలగు వస్తువులు కఱువగు చున్నవి. వాని ధరలు దిన దినమునకు విపరీతముగ హెచ్చి పోవుచున్నవి. దీని ననుసరించి ప్రజల జీవితపు ఖర్చులు హద్దు లేకుండా పెరిగి పోవు చున్నవి. అవినీతి పరులు, లంచగొండులు, చీకటి వ్యాపారస్థులు చేయుచున్న కార్యములపై, కాంగ్రెసు ప్రభుత్వముల వారు మెత్తని మనస్సు చూపు చుండుటచేత, సామాన్య ప్రజలకు ప్రభుత్వముపై ఆగ్రహము మఱింత హెచ్చుచున్నది.

ఈ దినమునకు కూడ ఇండియా దేశములో కాంగ్రెసు బలమైన రాజకీయ సంస్థయనుటకు సందేహము లేదు. కాని పై కార్యముల యొక్క సమిష్టి ఫలిత మంతయు చేరి, దేశములోని సామాన్య ప్రజల కెల్లరకిని కాంగ్రెసు అనినను, కాంగ్రెసు ప్రభుత్వము అనినను, ఒక విధమైన అసంతృప్తిని, అసహనమును కలిగించినదను సత్యమును ఎవ్వరును చులకన చేయకూడదు. కాంగ్రెసు వారిలోనే అధికార పదవులపై వ్యామోహము ఎక్కువగుటయు, వానికై తీవ్రమైన పోటీలు జరుగుటయు అసహ్యకరములగు కార్యములుగ పరిణమించు చున్నవి. కాంగ్రెసు సంస్థలోనే విధ్వంసక శక్తులు బయలు దేరుచున్నవి.

ఇండో-పాకిస్థాన్ ఒడంబడికపై అభిప్రాయ భేదములు కలుగుటచే ఇదివఱకే కేంద్ర మంత్రి వర్గమునుండి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ, శ్రీ. నియోగిగార్లు రాజీనామా

ఒసగి బయటకు వచ్చిరి. వీరిద్దరు కాంగ్రెసువారు కాదని చెప్ప వచ్చును. తత్కాలిక పార్లమెంటుకు స్పీకరుగా నియామకముపై మిస్టర్ షాఫీఅహమద్ కిద్వాయిగారు ఇప్పుడు తనమంత్రిపదవికి రాజీనామా యొసగియున్నారనియు, శ్రీ జవహారిలాలుగారి ముఖ దాక్షిణ్యమువలన, ఇంకను అతడు మంత్రివర్గము నుండి పోలే దనియు వార్తలు వచ్చుచున్నవి. మిస్టర్ కిద్వాయిగారు కాంగ్రెసువారు కాదని చెప్పుటకు వీలులేదు. జాతీయ ప్రభుత్వములో రెండవ ఆర్థిక శాఖా మంత్రిగా ఉండిన డా॥ జాన్ మత్తాయ్‌గారు కూడ ప్లానింగు కమిటీకి ఒక ప్రభుత్వోద్యోగిని ఉపాధ్యక్షునిగా నియమించిరను కారణముచేత అభిప్రాయ భేదము కలిగి తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చెనన్న విషయముకూడ ఈ సందర్భములో జ్ఞాపక ముంచుకొనవలెను. డా॥ అంబేద్కరుగారు కూడ తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చుటకు సంసిద్ధుడుగ నుండి నారనియు, ప్రధానమంత్రి మధ్యను, ఆయన మధ్యను, జరిగిన ఉత్తర ప్రత్యుత్తరముల వల్ల అతడు మంత్రివర్గమునుండి వెడలి పోవునంతటి పరిస్థితి తప్పినదనియు తెలియుచున్నది.

దీనినంతయు చూచిన ఉత్తర ధృవతారను చూపు ముల్లు మఱి ఏదోవైపు చూపుచున్నదని స్పష్టమగు చున్నది. కాంగ్రెసు, కాంగ్రెసు ప్రభుత్వములు సామాన్య ప్రజలపై పలుకు బడిని కోలుపోయినవని ఋజువగుచున్నది.

కాంగ్రెసు సంస్థయు, కాంగ్రెసు ప్రభుత్వములు ప్రజలపై పోగొట్టుకొనిన పలుకుబడిని అవకాశముగ గైకొని, కొందఱు క్రొత్త రాజకీయ పార్టీలను స్థాపించుటకై ప్రయత్నించుచున్నారు. కనుక ఈ విషయముల నన్నిటిని శ్రీ. జవహారిలాలుగారు ప్రశాంతముగ సింహావలోకనము గావించుకొన వలెను. అంతర్వీక్షణ చేసుకొన వలెను. ఎచ్చటెచ్చట లోపములున్నవో తెలుసుకొని, వానిని తక్షణమే సరిదిద్దుటకు కృషి చేయవలెను కాంగ్రెసు సంస్థయున్ను, కాంగ్రెసు ప్రభుత్వములున్ను కోలుపోయిన ప్రతిష్ఠను పునరుద్ధరింపగల సామర్థ్యము ఈ తరుణములో శ్రీ జవహారిలాలు నెహురు గారొక్కరికేగలదు. వారు ఈ కార్యమునకు త్వరలో పూనుకొందురుగాక యని కోరుచున్నాము:—

---

# యువకులను రాజకీయ నాయకులుగా తయారు చేయవలసిన అగత్యము:—

(డా॥ యన్. వి. రాజకుమార్, ఎం. ఎ., ఎల్. ఎల్. బి., పి. హెచ్. డి.) న్యూఢిల్లీ.

[గత సంచిక తరువాత]

ఈ విషయమున మన నాయకులు మనల వెనుక వేసి రనుట ఒప్పుకొనవలసి యున్నది. వారి స్థానము నాక్రమింపఁదగు యువకులకు పరిపాలనా విషయములో తర్బీదు నిచ్చుట యవసరమని వీరికి తోపలేదు. శిధిలావస్థయందుగల దేశమును పునర్నిర్మాణము సేయుటయందు లీనమగుట చేతపై సమస్యను పూర్తిగా వెనుకకు నెట్టివేసిరి. ఇది చేయఁదది చేయఁడని యువజనుల ప్రబోధించుచున్నారు. భారతదేశ భవిష్యత్తు యువజనుల చేతులలో నున్నదనియు, అద్దానిని పురోగమింపఁ జేయడమో, తిరోగమింపఁజేయడమో వీరి శక్తిపై ఆధారపడి యున్నదనియు హెచ్చరించుచున్నారు. ఈ నాయకు ననుసరింపుమనియో, ఆ నాయకు ననుసరింపుమనియో ఉపన్యసించుచున్నారు. అంతియేఁగాని ఆచరణకు పూనలేదు. సమీప భావికాలములోనే ఈ బాధ్యత వహింపఁగలుగు యువకులను తర్బీదు చేయలేదు. యువజనుల భవిష్యత్తులో రాజ్యపరిపాలనా భారమును మోయవలసి వచ్చుననుట అందరికి తెలిసియుండియు ప్రయత్నములు జరుపలేదు. రాబోవు సమస్యల నెదుర్కొను తాహతు వారియందు కలిగింపలేదు.

మనసూర్తిగా కాకపోయినప్పటికిన్ని, అక్కడక్కడ యువకులు తమశక్తి సామర్థ్యములు జూపుటకు కొన్ని యనుకూలములు కల్పింపఁబడినవి. శ్రీ జవహరిలాల్ నెహురుగారు దూరదృష్టితో మన దేశమునకు భావికాలమునకు కావలసిన నాయకుల నేర్పరచుటకు ప్రయత్నించిరి. ప్రకృత నాయకులలో వీరొక్కరే ఈ సమస్యపట్ల కొంత శ్రద్ధవహించిరని చెప్పవలసి యున్నది. తాను 1946 లో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులైనప్పుడు, యువకులైన 1. డాక్టరు కేస్కర్, 2. శ్రీమతి మృదుల సారాబాయీలను కాంగ్రెసు కార్యదర్శి పదవులందు నియమించెను. నాఁడు అట్టి చర్య విప్లవాత్మకమైనదిగా గణింపఁబడెను. కాని వార్తాపత్రికలీచర్యను ప్రశంసించినవి. మఱి కొందఱీ యువకులను రాజకీయ విషయములందారితేరిన వారినిగాజేసి సిద్ధముగా నుంచుకొనుట మంచిదని కొందఱు సూచించిరి.

ఈ ప్రయత్నము కొద్ది కాలమునకే మూల బడియెను. కాంగ్రెసు అధ్యక్షులలో మార్పు రాగానే దక్షత చేకూర్చుకొన్న ఈ ఇరువురిని జారవిడచిరి. సంస్థ పూర్వమార్గముల ద్రొక్కెను. అధ్యక్షులుగా ఎన్నుకోబడిన వారు అయోగ్యులని వచించుటలేదు. ఈ నా విమర్శనము ఏ ఒక వ్యక్తికిగాని సంబంధించినది కాదు. రాజకీయ రంగమున బాధ్యతగల పదవులకు యువజనుల నియమించుట సమంజసమని మాత్రమే నేను నొక్కి వక్కాణించుచున్నాను. ఈ విషయమున శ్రీ జవహారిలాలుగారు చేపట్టిన విధానమునకు దూరదృష్టి లేనివారై అంత్యక్రియల జరిపించిరే! యని వగచుచున్నారు.

క్షేత్రయ్యలే. త్యాగయ్య వాఙ్మయ సృష్టి భక్తి జ్ఞానముగలవాళ్ళు. క్షేత్రయ్యది భాగవత, గీతగోవిందములు కలిపికట్టిన కావ్యం-ఈ రెంటికిని మూలకందము అన్నమయ్య - వేదములు అంతరించినట్లే వీరి బహుళ సృష్టి శేషభాగములు అంతరించినవి. వెంకటేశ్వరస్వామి మాత్రము తన అంకితములను చాలా భాగం భద్రంచేసుకున్నారు.

### కర్ణాటక సంగీతం

సంగీతమును మన పూర్వులు పలువురు పలువిధములుగ నిర్వహించిరి - సామవేదములలో నెచ్చటను సంగీతము నిర్వచింపబడినట్లు కనబడదు-తరువాత లక్షణ కర్తలలో అందరికిని పూర్వులును, ఇప్పటికి వేయి సంవత్సరముల క్రిందటివాడును అగు భరతముని, తననాట్య శాస్త్రమను గ్రంథములో భావ రాగ తాళములు సంగీతమని చెప్పివున్నాడు-ఈ నిర్వచనము ఆయన పేరును బట్టి యేర్పడిన భరత శాస్త్రమను మాటను సంగీతమున కొక పేరుగా నెంచి భ-ర-త- అను మూడక్షరములు వివరముగా భావ, రాగ, తాళములు గలది సంగీతమని భావించినట్లు కన్పట్టుచున్నది- ఎందుకనగా, తరువాత వచ్చిన లక్షణ కర్తలెవ్వరును భావము అనుదానిని సంగీతములోని అవశ్యభాగముగా చెప్పివుండలేదు - సంగీత రత్నాకర కర్తఅయిన శార్ఙ్గదేవుడు 'గీతం వాద్యం తథానృత్తంత్రయం సంగీత ముచ్యతే' అని చెప్పినాడు. 'గీత వాదిత్ర నృత్యానాంత్రయం సంగీత ముచ్యతే' అనియు 'గానస్యాత్ర ప్రధానత్వాత్ తత్సంగీతమితీరితం' అనియు, సంగీత పారిజాతము నందు చెప్పబడినది. 'గీతం, వాద్యం, నర్తనంచ త్రయం సంగీతముచ్యతే' అని సంగీత దర్పణము నందున్నది. ఇవి సుప్రసిద్ధ గ్రంథములు. గీత వాద్యోభయం యత్ర సంగీతమితి కేచన' అని 'రాగస్వరశ్చ తాళశ్చ త్రిభిః సంగీతముచ్యతే' అని మరికొందరు నృత్యమును వదలివేసి చెప్పిరి గాని వీరు సుప్రసిద్ధులుగారు.

గీతవాద్య నృత్యాలలో తాళము చేర్చబడకున్నను 'తాళప్రతిష్ఠాయాం' అను వ్యుత్పత్తి చెప్పి, గీతం వాద్యం తథా నృత్యం యతస్తాలే ప్రతిష్ఠితం అని ఇవి మూడును తాళమందున్నవని చెప్పుటవలన తాళము అవశ్యకత స్పష్టీకరించబడింది.

* * * *

### మన వాగ్గేయ సాహిత్య విశిష్టత

భరతాచార్యుని మతము ప్రకారము అభినయ యుక్తమయిన నృత్యము భావప్రకటనకు ప్రబల సాధనము. కనుక, భావమును జంత్రగాత్ర సంగీతయుక్త ఛందోబద్ధ సాహిత్యమును అభినయయుక్త నృత్యమును కలిసిననే సంపూర్ణమయిన సంగీతమగును. అలంకారములని ఒక్క తాళమునకే పేరున్నది గాని భావమునకు తక్కిన వన్నియు అలంకారములే. ఈ సంగీతము భావముతో చేరకున్న నగలవలె స్వయముగనే రమ్యముగా నుండును. కాని నగలు శరీరము నలంకరించినపుడే సార్థకములగును, అట్లే సంగీతాలంకారమంతయు, భావమును చెందినపుడె సార్థకమగును.

ఈ దృష్టితో చూచిన క్షేత్రయ్య ఉత్తమ వాగ్గేయకారుడు. త్యాగయ్య కృతులు రాగరూప లక్షణములను ప్రస్తరించి చూపడానికి ఉత్తమ సాధనాలే అయినా, నృత్యమునకు అనువయినవి గావు. తన పదములలో రాగమును ప్రస్తరించి చూపడానికి క్షేత్రయ్య యొక్కడే త్యాగయ్యతో తులదూగగలడు. నృత్యమునకు అనువయిన గేయములను వ్రాసినవాడు క్షేత్రయ్య యొక్కడే. కర్ణాటక సంగీతమున క్షేత్రయ్య యొక్కడే అభినయ నృత్యములకు పనికివచ్చు గేయ వాఙ్మయమును సృష్టించినవాడు. ఇకను భాషలో వీరితో సమానముగా తెనుగులో వ్రాసినవాడుమఱియొకడు లేడు. కావున కర్ణాటక గానమున వీరిస్థానము ఇతరులెవ్వరును అందుకొనజాలరు.

("కృష్ణా పత్రిక")

# స్వప్నముల అర్థము

పి. వి. సుబ్బయ్యగారు, కోడూరు.

మనుజుడు కలలు కనడము సహజము. రానున్న మహదానందకరమైన ఒకవిషయమును పగలంతయు తలపోయుచున్నకతమున, నిద్రావస్థయందు దానిని అనుభవించుచున్నాడు. క్రొత్తవిషయములు కూడా స్వప్నములో సాక్షాత్కరించుచున్నవి. ఈస్వప్నములు రా కారణమేమి? వీనికిని, మనజీవితములోని సంఘటనములకును సంబంధము కలదా? విచారింతము.

పూర్వకాలము నుండియు ఒక భారత దేశముననే కాక సయాం, గ్రీసు దేశములలో కూడ కలలకు విచిత్రార్థములను జెప్పుచుండిరి. భక్తులగు వారికి దేవుడు స్వప్నముల ద్వారా రానున్న విషయములఁ దెలుపుచుండెనని నమ్మిరి. జ్యోతిష శాస్త్రిజ్ఞులు కూడా ఈ స్వప్నములకు, భవిష్యత్కాలములో జరుగఁబోవు పనులకు, సంబంధము కల్పించి, ప్రజలను నమ్మించి, ధనము సంపాదించుచుండిరి. విద్యావివేకము కలిగిన మేధావంతులుకూడా ఈవిషయమును నమ్ముచుండిరి.

ఈ స్వప్నములను గురించి విదేశములలో పరిశోధనలు జరిగినవి. విద్యా విశారదుడైన ప్లేటో "హృదయము కోరికలకు జన్మభూమి; ఆ స్థానమునుండి నిద్రావస్థలో దర్శనమగు స్వప్నములు రాబోవు విషయములను సూచించునవై యున్నవి" అని అభిప్రాయపడెను. సిసిరో "బుద్ధి యొక్క స్వాభావిక సిద్ధమైన అవస్థాభేదము తప్ప మరేమియు లేదు. జాగ్రదావస్థయందు మనము జేయుపను లెంతో, నిద్రావస్థయందుఁ దోఁచునవి యునంతే"యనెను. డెమోక్రిటిస్ "వాతావరణములోఁగల కంటికి కగపడని కొన్నిరూపములు నిద్రావస్థయందు మనస్సు నెదుర్కొను సంఘటనములే కలలు" అని వ్రాసెను.

ప్లేటో వలెనే పలువురు భారతీయులు కలలు రాబోవు విషయములను సూచించునని నమ్మిరి. పల్లెపట్టుల నుండువారు, ప్రస్తుత ఆధునిక యుగములో కూడా, ఈ యుద్దేశమునే కలిగి యున్నారు. ఈ నమ్మకము సరియైనదా? కాదు. కలలు గనుటకు కారణము వేరు. అది బుద్ధి పరిణామమును బట్టి యుండును.

ఒకడు చిన్నతనమున అవ్వ తాతల వలన దేవేంద్రలోక మున్నదనియు, అందు దేవతలు విచిత్ర భూషణభూషితులై యుందురనియు, చక్కని చుక్కలగు దేవతాకన్యలు విలాస నృత్యముల మహదానందమును కలిగింతురనియు, వినియెనను కొందము. ఆబాలునిహృదయము అట్టిసన్నివేశము నకై యెదురుచూచుచుండును. కోరికల పెంచుకొనును. ఆ సంకల్పముబుద్ధియందు ముద్రింపఁబడును.

బుద్ధి యనుదానిని పొరలు పొరలుగాఁగల ఒక ఉల్లిపాయకు పోల్చవచ్చును. ఒక పొరపైన ముద్రింపఁబడిన విషయము మీఁదకలుగు పొరల యందిమిడిన భావముల కడుగున నుండుటచే కొంతకాలము క్రిందఁగలవి మఱపునకు వచ్చును. అందుచేతనే మనముక్రొత్తక్రొత్త కలలను గనుచుందుము. అనగా ముందు బుద్ధియందు ముద్రింపబడిన విషయము స్మృతిపథము దప్పినందున ఆ విషయమే ఈనాడు కలలయందు కనుపడినప్పుడు క్రొత్త విషయమని భ్రమించుచున్నాము. అంతేగాని యెన్నడు తలంపని విషయములు కలల యందు గోచరము గావు.

బుద్ధియందు దేవేంద్రలోకమును కల్పించుకొన్నబాలుని విషయమాలోచింతము. ఆబాలుడు పెద్దవాడై, విద్యావంతుడై, భారతముపఠించుచు, దేవేంద్ర లోకమును గురించి చదివెనను కొందము. అప్పుడు ఇంతకు పూర్వమే చిత్తమున ముద్రింపఁబడిన కోరిక లెఁగప్రాకును. బాలుఁడా

రాత్రి నిద్రావస్థలో నున్నప్పుడు అదే దేవేంద్ర లోకము చిత్రపటము నందువలె చూచినట్లును, తాను దేవేంద్ర లోకమునకు పోయినట్లును, దేవతా స్త్రీల నృత్యమును చూచినట్లును గోచరమగును.

అనగా బాల్యావస్థయందుఁదోచిన కోరికలు, యవ్వన ప్రాయములో వానిని స్ఫురణకుఁదెచ్చు యితర వస్తు సముదాయమును గాని, కథా విషయముగాని చూచుట, చెవులఁబడుట తటస్థించు నేని, అసలుఁదేరి కలలయందు ఫలించును. సాధించుటకు వలనుపడు కోరికలు జీవితమునందే సాధింపఁబడును. ప్రతి కోరికయు జీవితమునందు సాధించుకొనఁగల వ్యక్తి కలలను గనడు. చిత్తశుద్ధి కలిగి, అందని మ్రాని ఫలంబుల కఱ్ఱుఁజాపక, ఉన్నదానితోఁ దృప్తిబడు మానవుడు స్వప్నమనునది యెఱుగఁడు. కలలఁగను వారందరు గొంతెమ్మ కోరికలు కోరువారనుటలో సందియము లేదు. ఫలియింపని కోరికలు కలల రూపమున నిద్రావస్థయందుఁదోచిన, మనసున కొకవిధమగు ఆనందమును కలిగించుచున్నది. కోరికల కోరుట యందసమానుఁడైన వ్యక్తి కలల మూలమున తన కోరికల సాధింపక పోయినచో దుర్భర వ్యసనాక్రాంతుఁడై, ఏమూతనో ఏగోతనో పడవలసి యుండును. స్వప్నములు చిత్తమును ఒక విధమగు స్థాయిలో నుంచుచున్నవి.

సర్వాంగ సుందరియగు నొక వనితారత్నమునుగాంచిన పురుషుడు వ్యామోహాగ్రస్తుఁడై ఆమె కౌగిట సుఖింపనెంచును. ఆమె అందుబాటులోఁగల వ్యక్తియైనప్పుడు తన ప్రయత్నము కొనసాగును; కాని ఆమె కొరకరాని కొయ్య యైనప్పుడు ఇఁక చెప్పెడిదేమి? తీరని బాధ యనుభవించును. అట్టి పురుషుడు స్వప్నమున సాక్షాత్కరించిన తన వలపు కత్తెను ఆలింగన చుంబనాది క్రియల పరవశఁగావించి తృప్తిగాంచును. వీటినే నైట్ మేర్స్ (Night Mares) అందురు.

అనగా తన మెదడులో చిత్రించుకొన్న రూపముయొక్క ప్రతిబింబము తన దృష్టిపథమున నిద్రలో సాక్షాత్కరించును. అంతేగాని ఆమెను భావికాలమునఁ బడయఁగల సూచనయనుటకల్ల.

స్వప్నములో పీనుగను గాంచిన పెండ్లి యగుననియు, కోతులను గాంచిన అపాయము కలుగుననియు, పుష్ప ఫలముల గ్రహించినట్లు గాంచిన శుభావహ మనుటయు, బూటకపు మాటలు. పూర్వము భక్తాగ్రేసరులు తమదైవతముల కలలలో దర్శించి వలయు ఫలములఁ బొందిరి కదా? ఏ నికే మందురని ప్రశ్నింపవచ్చును. భక్తుడు తాను సంకల్పించుకొన్న దేవతను అహర్నిశలు భావించుటచేత బుద్ధి తెరలయందు తాను భావించుకొన్న రూపము బలకరమగు ముద్రయై పోవును. ఆ ముద్రింపఁబడిన రూపము ఏనాటికైనను బహిర్గతము కావలసియున్నది. అట్లుఁగాక అందే యిమిడి యున్నచో, నావ్యక్తి చిత్తశుద్ధిని గోల్పోయి ఉన్మత్తుఁడై పోవును. కనుక దైవము నిజముగ మానవ నిర్మాణమునందు జీవితము యథావిధి సాగుటకు వలయు తంతు నిర్మించి యున్నాడు. బండి చక్రములు వడివడిగాఁ బోవునప్పుడు ఉష్ణాధిక్యముచేత దహింపఁబడుట మనముచూచుచునే యున్నాము. అట్లు దహింపఁబడ కుండుటకు ఇరుసున కందెన పెట్టుచున్నాము. అటులనె నే మన జీవిత రథము కాలచక్రమున నడుచునప్పుడు సంకల్పములను వికల్పకములచేత దహింపఁబడ కుండుటకు ప్రకృతి కందెనవంటికలలను కల్పించియున్నది.

ఈ స్వప్నములను అపార్థముఁ జేసికొని లేనిపోని సంఘటనముల కల్పించుకొని దుఃఖభాజనులు గాక చిత్తశాంతిని బొందవలయును. చిత్తశుద్ధిఁగల వ్యక్తికి కలలు రావు. కలలు రాక పోవడమునకు మూలము కోరికలు లేకపోవుట. ఇంద్రియ నిగ్రహమును బడయుట మోక్షసాధనము. కనుక మోక్షసాధనమునకుఁబూను మనము కలలను గనడము, లేనిపోని యర్థములఁ జేయడము. ప్రజా సామాన్యమును మోసగించడము తగదు.

# సంపాదకులకు లేఖలు.

## మన మంత్రులు—బ్రిటీషు మంత్రులు.

ఆర్యా!

మన మంత్రులకును—బ్రిటీషు దేశములోని మంత్రులకును చాల భేదమున్నది. దేశభక్తి మన మంత్రులకు ఒక్కరికే కాదు. బ్రిటీషు మంత్రులకు యెక్కువనే కలదు. వారి దేశభక్తి ముందగ మంత్రి పదవులు కాబట్టవు. మరేవి కాబట్టవు. మన వారి కట్లాకాదు. మంత్రి పదవులను విడచకుండా దేశభక్తి మాటలు ఎన్ని చెప్పమన్నను చెప్పగలరు. సర్కారు పని లేనప్పుడు, బ్రిటీషు ప్రధానమంత్రి తన సొంత గ్రామానికి పోవలెనంటే—సర్కారువారు యిచ్చిన మోటారు కారులో పోడు. పాత తుక్కైన తన సొంత మోటారు కారులో పోతాడు. వేరే డ్రైవరు లేడు. అట్లీకి అట్లీభార్యయే డ్రైవరు. మన మంత్రులు చూడండి. ఒక్కరైనా అట్ల నడిచేవారున్నారా? సొంత పనులపై పొయ్యేటప్పుడు సర్కారు కారులలో కాక వారి సొంత కారులలో పొయ్యే ఒక్క మంత్రి మనదేశాన చూస్తామన్నా వున్నాడా?

నేషనల్ హెల్తుస్కీము క్రింద (ఉచిత వైద్య చికిత్సా పద్ధతి) ప్రజలకు ఏమి కర్చులేకుండ కండ్లకు సులోచనాలు కావలసిన వాండ్లకు సులోచనాలు, పండ్లు చెడిపోయిన వారికి కృత్రిమ దంతములను బ్రిటీషు దేశములో సర్కారు వారు యిచ్చే పద్ధతి కలదు. ఈ పద్ధతి మన దేశములో ప్రవేశ పెట్టుటకు యింకెన్ని సంవత్సరాలు కావలెనో.

యుద్ధయంత్ర సామానును ఎక్కువగా కొనుటకు, తయారు చేసుకొనుటకు బ్రిటీషు దేశములో ఈసారి పన్నులు ఎక్కువ చేసినారు. అందువల్ల యీ సారి బడ్జటు తయారు చేయడములో, సర్కారు వాండ్లు వుచితముగా యిస్తూవుండే సులోచనాలు, కృత్రిమ దంతములు అర్ధము ఖరీదు పెట్టి కొనవలెనని అన్నారు. అట్లా ప్రజలనుండి వానిపై అర్ధంటకీమ వసూలు చేస్తే, పౌ 25,000,000, వస్తుందని ఆర్థిక మంత్రి లెక్క పెట్టినాడు.

ఆరోగ్య శాఖామంత్రి బెవాన్ ఇందుకు వొప్పుకోలేదు. ఆయుధబలమును ఎక్కువచేయ వలెనను సాకుతో ప్రజలకు చేసే సాంఘిక సేవను తారు మారు చేయకూడదన్నాడు. ఎట్టా పరిస్థితులు వచ్చినా ప్రజల జీవిత ప్రమాణమును, ప్రజలకు సర్కారువారు చేసే సంఘ సేవ తక్కువ చెయ్యకూడదని చెప్పినాడు. దానికి బ్రిటీషు క్యాబినేటు వారు వినలేదు. అందుకు కారణముగా తన మంత్రిపదవికి బెవాన్ రాజీనామా యిచ్చినాడు. ప్రజల కోసరమై ఏమి త్యాగమో చూడండి.

మన చెన్నరాష్ట్రములో ప్రజలకు సర్కారు సంఘసేవ చేయడము అట్లుండనీ. బీద వాండ్లు తినే తిండిగింజల పైన, ఇతర అవసర వస్తువులపైనా ఢిల్లీ ప్రభుత్వము సేల్సు టాక్సు తీసి వేయవలెనంటే—ససేమిరా వద్దు. మా రాష్ట్రానికి రు 6 కోట్లు నష్టంవస్తుంది, తీసివెయ్యకూడదని శ్రీ గోపాలరెడ్డి గారు హటముగా మాటలాడుతారు. ఇదేమిరా బీద ప్రజలనుండి పన్ను వసూలు చేయడము. వారి రక్తముపీల్చినట్లుకాదా అని ఒక మంత్రి పుంగవునికి కాకుంటే వొక మంత్రి పుంగవునికైనా తట్టినదా? తినుగింజలపై సేల్సు టాక్సు తీసివెయ్యకపోతే మంత్రిపదవికి రాజీనామా ఇస్తానని ఒక మంత్రి కాకుంటే వొక మంత్రియైనా అన్నాడా? ఇదే మన మంత్రులకు—బ్రిటీషు మంత్రులకు వుండే వ్యత్యాసము. వారి దేశభక్తికి, మన మంత్రులకుండే దేశ భక్తికిని భేదము.

బాచేపల్లె, యస్. వెంకటాద్రి.

## మంత్రుల మీద విశ్వాసము ఉండే దెట్లు?

ఆర్యా!

పార్లమెంటు సభలో జరుగుతూవుండే చర్చలు పత్రికలలో చూస్తె, ప్రతిదినను ఏదోఒక మంత్రిమీద ఆరోపణలే కనిపించుచున్నవి. ఎరువులు విషయములో వొక మంత్రిపైన ఆరోపణ, ఇండ్లస్కీములపై ఒక మంత్రిపైన ఆరోపణ, చక్కెరకు ఒక మంత్రి పైన యారోపణ, జీపులపై మరొక మంత్రిపై యారోపణ, దామోదర వ్యాలీస్కీముపై వేరొక మంత్రిపై యారోపణ ఎడతెగకుండా వినిపించుచున్నవి. ఒకొక్క దానిలో కోట్లకొలది ప్రజల ద్రవ్యాన్ని నిప్పులో వేయుచున్నారు. సరిగా అడిగేవారులేరున్నారు. అనవా ఆడిగినా తృప్తికరముగా మంత్రులదగ్గరనుండి బదులు రావడము సున్న. కార్యాలు చేసిన మంత్రులకు నోరుండదు కాని, పదేపదే ఇండియా ప్రధానమంత్రి పార్లమెంటు యెదుట నిలబడడము, యీ మంత్రులకు కాని సంజాయిషీ ఇవ్వడము, ఈవిధము గానాటకము జరుగుచున్నది. మంత్రులకు వారు ఇచ్చె సంజాయిషీ పార్లమెంటు మెంబర్లను, ప్రజలను మెప్పించదని వారికి బాగా తెలును. అందుకనే ప్రతి విషయము ప్రధానమంత్రి నోటిలోనుండి చెప్పించుతారు. ఈ విషయాలలో నిజముందో అబద్ధముందో. అందులో సంబంధము ఉండే మంత్రులకందరిని ప్రధానమంత్రిగారు వెంటనే సస్పెండు చేసి, బహిరంగ విచారణకై కోర్టులకు వొప్పగించుతే యెంతో బాగుండును. ఆ విధముగా పండిట్ జీ యెందుకు చేయడో. నేను ఫైల్సు స్వయముగా చూచినా

నంటాడు. అందులో యేమి లేదంటాడు. మంత్రులకు తన చెయ్యి అభయ మిస్తాడు. తీరా విచారణ జరుగుతే కట్ట కడాపటికి పెద్దవారంతా తప్పించుకొంటారు. చిన్న గుమాస్తామీదకి వచ్చును. అతనిని సెక్రిటరేటు ఆఫీసులనుంచి పంపివేయడమో లేక డిస్‌మిస్ చేయడమో జరుగుతుంది. దేశములో పత్రికలు చదువు ప్రజలంతా యీ విషయాలను గురించి యేమని అనుకొనుచున్నారో, ఇండియా ప్రధాన మంత్రికి తెలిపే దెట్లు? ఆయనకు ప్రజల అభిప్రాయము తెలిసినచో ఒక్క నిమిషమైనా ప్రభుత్వములో వుండడు. కేదా మంత్రులను వుండనీయడు. అనుమానాలకు అవకాశాలు ఇచ్చే మంత్రులపై, ప్రజలకు విశ్వాసముండే దెట్లు?

తిరుపతి.                                        యం. ఆర్. గణపతి పిళ్ళై.

---

## జంతు ప్రదర్శన శాలలు.

ఆర్యా!

ఐరోపాఖండములోని దేశములను, అమెరికా దేశమును చూచి వచ్చినవారు మన దేశములోని జంతు ప్రదర్శన శాలలను చూచినచో నవ్వెదరు. అనేక విధములైన జంతువులకు, పక్షులకు మనదేశము జన్మస్థానము. కాని మన దేశములోని జంతు ప్రదర్శన శాలలను ఒకసారి చూచివస్తె, మన ప్రభుత్వముల అశ్రద్ధ, యూహాబుద్ధిలో యేర్పడిన కొఱవు బయటపడును. అస్సలు మన దేశములో ఏ పట్టణములలో జంతు ప్రదర్శన శాలలు ఉండేది చదువుకున్నామని చెప్పుకునే వాండ్లలో చాల మందికి తెలియదు. విద్యార్థులకు కూడ తెలియదు. ఇంతకన్నా విచారము ఏమున్నది?

విదేశములలో నుండి ఈ దేశమునకు అపరూపమైన జంతువులను, పక్షులను, జలచరములను తెప్పించి, ప్రదర్శనాలయములలో పెట్టుకున్నారు మాసె. మన దేశములో చిక్కే అపరూపమైన జంతువులను కూడ తెప్పించి పెట్టుట లేదు. ఈ విషయములో ప్రజలు కాని, మంత్రులు కాని, కొంచమైనా శ్రద్ధ చూపుటేలేదు. మంత్రులకు నానుండే పనులలో వానంలకు అవే వారి బుద్ధికి తట్టవు. ప్రజలు ఆందోళన చేయరు. వారికి చెప్పరు.

నక్షత్రమువలె చెన్నపట్టణములో ఒక జంతు ప్రదర్శన శాల యున్నది. కార్పొరేషన్ వారు మేనేజిమెంటు చేయుచున్నారు. యుద్ధకాలములో చెన్నపట్టణమునకే ఉపద్రవము కలుగునని వదంతులు బయలుదేరినప్పుడు అపూర్వమైన విలువగల అనేక అడవి మృగములను కాల్చి చంపినారు. ఇప్పుడు వాని నన్నిటిని భర్తీ చెయ్యలేదు. ఎట్టికొంగ లేదు. తెల్ల ఎలుముగొడ్డు లేదు. నిప్పుకోడి లేదు. ఖడ్గమృగము లేదు. నీటి గుఱ్ఱము లేదు. ఇంకా కొన్ని సింహములు కావలెను. వీని నన్నిటిని తెప్పించుటకు కార్పొరేషన్ అధికారులు త్వరలో ప్రయత్నించవలెను.

దండిగా జంతు ప్రదర్శనశాలలో కావలసినంత స్థలమున్నది. కోతులు, నల్లమూతి కోతులు స్వేచ్ఛగా చెట్ల మీద తిరిగే జంతువులు. వానికి "శాఖా మృగము" లనిపేరు కూడ యున్నది. ఆ కోతులను చిన్న చిన్న బోనులలో పెట్టియుంచుట మంచిది కాదు. పెద్ద పెద్ద చెట్లకు వలతంతెలు వేసి, వానికి ఎక్కువ స్వేచ్ఛ ఇవ్వవలెను. అక్కడ ఉండే జంతువుల ఫొటోలు తీయించి ప్రజలు ప్రదర్శనశాలపై ఎక్కువ శ్రద్ధ చూపకీతిగాను, ఎక్కువ మంది వచ్చి చూచే టట్టున్ను ప్రచారము చేయవలెను. ఈ ఒక్క జంతు ప్రదర్శన శాల నైనను ఆకర్షవంతముగా చేయుటకు మంత్రులు ఎక్కువ శ్రద్ధ పూనవలెను.

ట్రిప్లికేను,                                        బి. రామమూర్తి.

---

## ప్రభుత్వ నర్సులు.

ఆర్యా!

స్త్రీల ఆర్థికాభివృద్ధికి నర్సింగు సర్వీసు ఎంతగనో తోడ్పడుచున్నది. వేలకొలది యువతులు దేశసేవ, ప్రజోపకారాది ఉత్తమ కార్యములు చేయుటేగాక, ఆర్థికముగా నర్సువృత్తి వారిని పురుషులతో సమానులనుగను, మానవ ప్రపంచములో స్వతంత్ర జీవులుగను చేయుచున్నది. పశ్చిమ దేశములందు స్త్రీలకు పెద్దపదవులు, ఉద్యోగములు, పారిశ్రామికవిద్యలు, సమాజిక స్వాతంత్ర్యము-సమ గౌరవము-ఘోషా పదతిరద్దు, మొదలగు చైతన్యము కలిగినది. వారుముందుకు పోతు స్త్రీ పురుషులలో లింగ వ్యత్యాసము తప్ప మరొకటి లేక బాగుపడుచున్నారు.

మన భారత ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వము, ప్రాంతీయ స్త్రీ జనాభ్యుదయ శాఖల నేర్పఱచి, స్త్రీలకు అపార సేవ జేయుచున్నారు. కాని చెన్నరాష్ట్ర ప్రభుత్వము నర్సింగు సర్వీసులో క్రొత్తపద్ధతిని తెచ్చిపెట్టి తద్వారా వేలకొలది నర్సులకు, ఆర్థికభంగము కలుగజేయు ఒక భేషైన పథకమును ప్రవేశపెట్టినారు. ఈ మధ్య, 2 లేక 3 సం॥ లోపు సర్వీసుగల నర్సులను, మూల మూలలనుండి చెన్నపట్టణమునకు వారి స్వంత ఖర్చులలో రప్పించి, వింతైన పరీక్షను జరిపినారు. వారిలో వందల కొలది నర్సులు ఉద్యోగము పోగొట్టుకొని తిరిగి తమ కులవృత్తి (వంటలు కడుగు కొనుటకు) పోవలసిన వారైయున్నారు. మరియు ప్రస్తుతము ట్రెయినింగు అయ్యేడి నర్సులకు ఉద్యోగము ప్రభుత్వము చూపించదట. కాని, ట్రెయినింగు మాత్రంవుంటుందట. ఇదియేమో అర్థముకాని యేర్పాటుగ వున్నది..ఒక విధముగా మంత్రిగారి సమాధానము ప్రకారము, నర్సు పనికి అందరు ఎగబడుచున్నారు. ఆస్పత్రులు తక్కువ, గవర్నమెంటుకు డబ్బులేదు అనవచ్చు. ఈ కుంటిసాకు అందరికి తెలిసినదే. సమర్థించుటకు ఈ విధముగా చులకనగా, సులభముగా

నూట్లాడి వేయడము అందరివల్ల కాదా? స్త్రీలకు నర్సు ఉద్యోగము అన్నివృత్తులకన్నా వుత్తమమైనది. సరియైన మాతృ మూర్తియైన స్త్రీ, ఆ పనికి లాయకైనది. అట్టి దానియందు వున్న చక్కని అవకాశమును విడనాడి, అబలలను వేరే పని చూచుకోమని కఠినముగా చెప్పడము, వారి అభ్యుదయాన్ని ప్రభుత్వమే నాశనము చేయుచున్నదనక తప్పదు.

ఇంత సులభముగా ఇంటికి పొమ్మనుటకు, అనవసరముగా యేదో పరీక్షకు చెన్నపురికి రమ్మని, రాను పోను ద్రవ్యము ఖర్చు చేయించడము ఏల? ఉన్న వారిని యే విధముగనో సర్ది, ఇక మీదట ఎంతమంది కావలసి ఉండునో అంతమందిని మాత్రమే ట్రెయినింగులో చేర్చుకొనవచ్చును గద. ఒక వేళ యిప్పటికే అధికముగ వున్నవారిని తీసివేయుట చేత ప్రభుత్వమునకు లాభదాయకమగునా? ఇదియా స్త్రీ అభ్యుదయమునకు ప్రభుత్వము చేయు సహకారము? అనవసరముగా తింటున్న పోలీసు, ప్రొహిబిషన్, మిలిటరీ, వగైరా అవసరములేని డిపార్టుమెంటులను తగ్గించడము వలన, ప్రభుత్వమునకు కోట్ల రూపాయలు లాభము వచ్చును. నర్సులు చేయునది మానవ సేవ, దేశ సేవ, దైవ సేవ. అంటు వ్యాధులు, క్షయ, కుష్టు మొదలగు భయంకర రోగ పీడితదేశమైన మన దేశమున, నర్సుల సంఖ్య అధికమైనదా? జిల్లా, తాలూకా ఆస్పత్రిలలో నర్సుల సంఖ్య హెచ్చించుట చేతను—స్త్రీల పనికి పోటీగావున్న మొగ నర్సుల (Male-Nurse)ను కంపౌండర్లుగ చేసి, ఆ స్థానములు స్త్రీలకు యిచ్చుటచేత ఎంత మంది నర్సులను ప్రభుత్వము భరించలేదు? తప్పక యిప్పుడున్న వారికన్న హెచ్చు సంఖ్య కావలసి వుండును. ప్రయివేటు ఆస్పత్రులందు నర్సు, మంత్రసాని వుండవలెనని ఖచ్చితమైన వుత్తర్వు చేసిన, వందల మందికి ఉద్యోగము దొరకగలదు కదా? ఇట్టి తారుమారులలో ఇప్పుడు మంత్రసానులగతి యేమగునో.

ఈ విధముగ యువతులైన స్త్రీలను నర్సు పని నుండి తొలగించుట చేతను, నిరుద్యోగులుగ చేయుట చేతను, కాంగ్రెసు మంత్రివర్గమునకు రాబోయే ఎన్నికలలో పలుకుబడి తగ్గుటకు ఒక కారణమగును. కాన మంత్రులు యిదంతయు గ్రహించి, చక్కని యేర్పాటుగా అందరిని పర్మనెంటుగా వుంచుకొని ఇక మీదట కావలసినంత మందికి ట్రెయినింగు యేర్పాటు చేయునట్లు, చూచెదరని మా కోరిక.

కడప. కె. పి. దేవరాజు,

## రాబోవు ఎన్నికలు—బ్యాలట్ పెట్టెలు.

ఆర్యా!

డా॥ అంబేడ్కరు గారు వచ్చే ఎన్నికలను గూర్చి ఏప్రిల్ 21—వ తేదిన పార్లమెంటులో ఒక కథ చెప్పినారు. పార్లమెంటుకు, రాష్ట్ర శాశనసభలకు ఒకే తూరి యెన్నికలు జరుగుతాయి. గుర్తుపట్టుటకై పార్లమెంటు ఎన్నికలకు ఒక విధమైన రంగుగల బ్యాలట్ పెట్టెలను, రాష్ట్ర శాసన సభలకు మరొక విధమైన రంగుగల పెట్టెలను ఏర్పాటు చేస్తామన్నారు. ఇక ఒకొక్క నియోజక వర్గానికి నిలిచే అభ్యర్థుల పెట్టెలను గుర్తుపట్టుటకై వానిమీద గుడిసెలు, చెట్లు, పుష్పములు, బొమ్మలు, జంతువులను చిత్రించెదరు. ఎన్నికకు పోటీచేసే ఒకొక్క అభ్యర్థికి ఒకొక్క చిహ్నముగల బ్యాలట్ పెట్టె ఇచ్చెదరట. ఓటర్లు వారి వారికి కావలసిన అభ్యర్థులకు, బ్యాలట్ కాగితములలో ఏలాటి గుర్తులు, మార్కులు, టిక్కు మార్కులు పెట్టకుండా, వారికి ఇచ్చిన బొమ్మలుగల బ్యాలట్ పెట్టెలలో పడవేయవలెనట. ఇది చదువురాని ఓటర్లకై చేయబడిన ఏర్పాటట.

ఈసారేమో ప్రతి ఎన్నికస్థానానికి చాలామంది పోటీ చేసేమాట మాత్రము నిజము. వేల కొలది చదువురాని వారు ఓటర్లుగా ఉండేది నిజము. కనుక ఎన్నికలకు నిలువదలచుకున్న ప్రతివారును ఇప్పటినుండే ఈ విషయాలన్నిటిని ఓటర్లకు చెప్పుతూ రావలెను.

దొంగ ఓట్లను వేయకుండాను, ఒకడే రెండు మూడు సార్లు ఓట్లను వేయకుండాను చూడవలెనంటే, బ్రొటన వ్రేలి గుర్తు ఒక్కటే మంచి ఉపాయమన్నారు. మన దేశములో క్రిమినల్ నేరస్థులకు ఈ బొటన వ్రేలి ముద్రలకు ఎక్కువ సంబంధము వున్నందున దానిని అందరు నీచముగా తలచెదరు. ఎన్నికల సమయములో బొటన వ్రేలి ముద్ర యిచ్చుట నీచమైన పని కాదని కూడ ఓటర్లలో ప్రచారము చేయవలసి యుండును.

ఎలెక్షనులు ఏదో కారణము పెట్టి వెనుకకు నెట్టివెయ్య వలెనని మన రాష్ట్ర మంత్రులు ప్రయత్నము చేయుచున్నారు. మొన్న ఉన్నట్లు ఉండి కౌన్సిలు సభలో ఒక తీర్మానమును ప్రయివేటు సభ్యుల చేత పెట్టించినారు. ఆమోదింప చేసినారు. ఢిల్లీకి పంపినారు. ఈ ఎలెక్షన్లు ఏప్రిలు—మే నెలలో జరగవలసినవి. అది పోయినది. నవంబరు—డిశంబరులో తప్పక జరుగుతాయని ఢిల్లీనుండి నెహరూ పండితుడు రెండు మూడు సార్లు చెప్పినారు. మన రాష్ట్రీయ మంత్రులు 1952 సం॥ ఫిబ్రవరి నేలలో ఎన్నికలు జరపవలెనని సలహా యిచ్చినారు. ఎవ్వరు దీనికి వొప్పుకోరు. ఇంక ఏమైనా సాకుపెట్టి నవంబరు—డిశంబరులో ఎన్నికలు జరపకపోతే ఢిల్లీప్రభుత్వానికి అవమానకరము. జనులంతా నవ్వి పోతారు. మన కౌన్సిలువారు పాసు చేసి పంపిన తీర్మానాన్ని ఖండించె దక్కకూడా ఈ రాష్ట్రములో లేకున్నారే. ఏమి యీ కాల మహాత్యము.

కర్నూలు. ఏ. ఆంజనేయులు రెడ్డి.

## అనంతరాజుపేట పరశురామప్రీతి.

ఆర్యా!

అనంతరాజుపేట (కడపజిల్లా) ఈ నెల 23-వ తేది ఉదయము 10 గం||లకు ప్రమాద వశాత్తు తగులబడి గ్రామంలోని ¾ వంతు పూర్తిగా కాలిపోయినది. పేద రైతులు, కూలీల ఇండ్లు 150 వరకూ భస్మీపటలము అయినవి. సుమారు 600 మందికి నిలువ నీడ లేకుండా పోయినది. అప్పటప్పుడే కటామణిగియై యిండ్లలో యుండిన పసుపు, కొద్దిగా పండిన గింజలు సర్వ నాశనమైనవి. రు 50 వేల వరకూ నష్టము కలిగినది. గత సంవత్సర మసతే వర్షము లేక పోవడము, ఈ సంవత్సరం యింతవరకూ తొలకరి కురువక పోవుటవలన, పైర్లు, తోటల విషయమటుంచి, మనుష్యులకు, పశువులకు త్రాగుటకే నీటి కొరత ఏర్పడినది.

పంచాయతీ బోర్డుప్రెసిడెంటు శ్రీ పి. చంగల్ రెడ్డి గారు ధైర్యసాహసాలతో పనిచేసి మనుష్యులు, పశువులు చావకుండా కాపాడ గలిగినారు. కడపనుంచి రెండు ఫైర్ యింజనులతోటి వచ్చిన ఫైర్ సర్వీస్ దళము ప్రశంసనీయముగాపనిచేసి, ఇతరఇండ్లకు అగ్నిప్రమాదము లేకుండాచేసిరి.

ఈ 600 మంది ప్రజానీకము "అన్నమో రామచంద్రా యంటూ" చంటి బిడ్డలు, ముసళ్ళతోటి మండుటెండలలో మల మల మాడి పోవుచున్నారు. వీరికి తక్షణమే సహాయ మవసరము.

తక్షణమే ప్రభుత్వము వీరికి వారము రోజులకు సరి పోయే రేషన్ను వుచితముగా యిస్తూ, తిరిగి పంట పండే వరకూ కంట్రోల్ రేటుకు అమ్మవలెను. స్త్రీ పురుషు లందరికి కంట్రోల్ రేటుకు రెండు జతల బట్టలు సరఫరా చేయ వలెను. ప్రక్కనే వుండే అడవిలో ఇండ్లకు కొయ్యలు, బోద తెచ్చుకొనుటకు పర్మిట్లు యివ్వవలెను. ఇది కనీస, తక్షణ కర్తవ్యము.

రెండు లక్షల జనాభా గలిగిన యీ తాలూకాలోని గ్రామాలన్నీ పూరి ఇండ్లు గలవే. నిత్యమూ అగ్ని భయంతో వీరు దిగులు పడివుంటున్నారు. కనుక ప్రభుత్వమువారు, తక్షణమే రాజంపేటలో ఒక ఫైర్ సర్వీస్ దళాన్ని నెలకొల్పుట అవసరము.

అనంతరాజుపేట. పి. నరసింహారెడ్డి.

## ఏటూరు గ్రామము, కాలువ తగాదా

ఆర్యా!

జమ్మలమడుగుతాలూకా యేటూరుగ్రామము, భద్రావతీ నది యొడ్డున యున్నది. ఈ నది నుంచి త్రవ్వి తీయబడిన, ఊటకాలువ మూలమున ప్రతి సంవత్సరము, వర్షాకాలమున సుమారు 250 యకరములు; ఎండ కాలమున సుమారు 150 యకరములు సాగుకాబడి, యకరము 1 కి తక్కువ పంట అంచనా వేసినప్పటికి 2 పుట్లు ధాన్యం ప్రకారం, 800 వందల పుట్ల వడ్లు పండుచూ స్వయం సమృద్ధముగా యున్నది.

ఈ గ్రామములో 100 కి 75 మంది బీద ప్రజలు యున్నారు. వీరికి కుటుంబము 1 కి ఈ కాలువక్రింద ¼ యకరము మొదలు 1 యకరము వరకు భూమి మాత్రమే యున్నది. ఈ భూమియే వీరికి జీవనాధారము. ఇతర మెట్ట పైరు పండు భూములు కూడా లేనందున, కూలి వలనను, పై భూముల నమ్ముకొని జీవనము జేయుచుందురు. ప్రతి సంవత్సరము సకాలములో పైరుపెట్టి, వర్షాకాలములో తక్కువ యైనను, ఎండాకాలములో, అమిత కష్టముజేసి కాలువ త్రవ్వినగాని వీరికి గింజలు వుండవు. ఈ విధముగనే కష్టపడుచూ జీవనము గడుపుకొనుచున్నారు.

సుమారు 15 సంవత్సరములుగా ఈ గ్రామములో పెద్దస్తులైన వారికి తగాదాలు యుంటూయున్నవి. ఈ యిరు పార్టీల నాయకులే కాలువ త్రవ్వించుటకు పెద్దలు. ప్రతి సంవత్సరము వీరి దయా ధర్మముపైన కాలువ ఆధారపడి త్రవ్వడమో, మానడమో, జరుగుచున్నది. అప్పుడప్పుడు వీరి స్పర్థల కారణముగా కాలువ త్రవ్వక పోయినప్పుడు బీద ప్రజలు నానా అవస్థలు పడుట తరుచు తటస్థించుచున్నది.

ఈ సంవత్సరము పూర్వముకన్న రెండు పక్షముల వారు రాజీపడి ఒకటికాగా, వీరికి ఎదురుగా ఇంకొక పార్టీ ఏర్పడినది. క్రొత్తగా ఏర్పడిన, పార్టీ వారికిన్నీ, పూర్వము రెండుగా యుండి ప్రస్తుతము ఒకటిగా మారిన వారికిన్ని, కాలువ పెద్దల విషయమో, ఉభయులు కలిసి త్రవ్వించుటకు ఒప్పుకొనక పోవడము మూలమున కాలువ త్రవ్వడము నిలుపుదల కాబడినది. ఈ విషయము పోలీసు సబ్ యిన్స్పెక్టరుకు తెలిసి ఆయన వచ్చి విచారించి, ఉభయులు రాజీకి అంగీకరించని కారణముచేత గాబోలు కాలువ త్రవ్వ కూడదని గ్రామములో డండోరా మూలముగా ప్రకటించి యున్నారు.

40 యకరములలో చాలా వరకు ఇరుపార్టీల వారివి. అవి వారికి సంబంధించిన వారికి ఇచ్చి సాగుచేయించి యున్నారు. ఇక వూరికి తూర్పు దిశనవున్న 100 యకరములు భూమి చాలా వరకు బీద ప్రజలదిగా యున్నది.

తమ భూములు సాగు జేయుదుమను నమ్మకముతో కొద్దిగా వుండిన తమ పంటను గూడా, బాకీలకో ఇతర విధముగనో కర్చు పెట్టుకొన్నారు. ఇప్పుడు తమ భూములు సాగుకాని కారణమున, ఈ కరువు కాలములో, ముందు కాలమును తలంచుకొని ఖిన్నవదనులై యున్నారు. వీరికి భవిష్యత్తు అగమ్యగోచరముగా యున్నది. ముఖ్యముగా గ్రామములో పెద్దలు దారి తప్పినప్పుడు, ప్రభుత్వము గూడా ఏమి చర్య తీసికొనన నందుకు ఈ బీద ప్రజల అలజడి ఎక్కువ యైనది.

అధికాహారోత్పత్తికి అఖండ కృషిజేయు ఈ సమయములో తక్కువ పంట నాశించినప్పటికీ సుమారు రెండువందల పుట్ల పరిధాన్యమును (నమ్మకముగ పండును) నాశనము చేసిన వారిని ప్రభుత్వము తగు విచారణ జరిపించి, దోషుల నిర్ణయించి, వారిపై తగు చర్య ఎందుకు తీసికొనకూడదు. ఇటువంటి పరిస్థితులలో, బీద ప్రజల ఆలజడిని గుర్తించికూడ, తాత్కాలికముగనైనను (అనగా తగాదాలు పరిష్కారమగు వరకు) గ్రామోద్యోగులకుగాని లేక ప్రభుత్వము తరపున యొకరిని నియమించి, వారి ఖర్చులు, అలజడికి కారణభూతులైనవారి నుండి ఎందుకు వసూలుచేసి కాలువ త్రవ్వుటకు అనుమతించ కూడదు?

ఇప్పటికైన ఈ విషయమై కలెక్టరువారు తగు విచారణ జరిపించి, తగు చర్య తీసికొనవలెనని కోరుచున్నాము.

ఏటూరు. కె. నారాయణరెడ్డి.

---

## కడప జిల్లా కమ్యూనిష్టు పార్టీ - రాబోవు ఎన్నికలు.

రాబోవు జనరల్ ఎన్నికలలో, ప్రజాపార్టీతో చేరుకొని జిల్లాలోని చాలా స్థానములకు కమ్యూనిష్టు పార్టీవారు పోటీ పెట్టుటకై నిర్ణయించుకొనినటుల తెలియుచున్నది.

---

# ప్రార్థనాదికము.

శ్రీ. అవధానము చంద్రశేఖరశర్మగారు,
( శిరోమణి, అష్టావధానులు )

---

సీ॥ శ్రీకిఁ దన పేరురము పూలసెజ్జగాగ
కౌస్తుభము దివ్యమణి దీపకళికగాగ
ప్రేమమయమూర్తియగు పరంధాముఁ డెపుడు
నిందుమనమున మమ్ము మన్నించుఁగాక.

శా॥ పూవుంబావియఁబోలె మామక మనంబున్ బాయకానందరూ
పావిర్భూతి నెసంగి యేకొఱలు మాయందాయనీ కుండువ
డ్బావోల్లాస విదూరుఁ డార్తజన జీవంజీవ జైవాతృకుం
డా వైదేహసుతా మనోభవుఁడు శ్రేయః ప్రేయములో గూర్చుతన్.

శా॥ ఏనాఁడే నుదరం భరిత్వమునకై యీ విద్య చూపింపఁగాఁ
బూనక బాండితి చండిమంపు పెనుమంపుఁ గాదు త్వత్పాదని
ధ్యానానంద పిచండిల ప్రతిభ మిత్రశ్రేణికిఁ జూపి బ్ర
హ్మానందంబునఁ గన్ను మోడ్చుటకునై యత్నింతు రామ ప్రభో!

చ॥ తుదియవధానముఁ సలిపి తొమ్మిది యేండ్లు గతించె భారతా
భ్యుదయము నేఁడు సన్నవడునో యను సందియమేల! నాకు నే
యదనుననైన మత్ప్రతిభ నా యశముం గడియించుకొంటి భ
ద్రదమగు త్వత్కృపారస నిధానము బ్రాపునఁగాక! రాఘవా!

---

# మాతృ ఆదేశము (లేక) అహల్య

శ్రీ వనమాలి.

(గత సంచిక తర్వాత)

రెండవ భాగము.

## అహల్యా వివాహము.

ఆరాత్రి ఆకాశమంతయు మేఘరహితమై నిర్మలముగ నుండెను. నీలాకాశములో దివ్య మణులు చెక్కినరీతి నక్షత్రములు మిణుక్కు మిణుక్కుమని ప్రకాశించుచు, ప్రకృతి శోభను అతిశయింపజేయుచుండెను. ఆ వనభూమిలో నలుదిశలనుండి చల్లనిగాలి వీచుచుండెను. వనమహోత్సవమున కొచ్చిన వారెల్లరు హాయిగ నిద్రించుచుండిరి. ఉషా అహల్యలు పాటల పోటీలో పాల్గొని, చాల ప్రొద్దుపోయిన తర్వాత తమ గుడారమును జేరుకొనిరి. అహల్య పడకపై పరుండెను. కాని నిద్ర పట్టలేదు. ఎడమ కన్ను కొట్టుకొనుచుండెను. ఆ ప్రశాంతమైన రాత్రిలో ప్రకృతి శోభనంతయు అనుభవించుచు, నక్షత్రములవైపు చూచుకొనుచుండెను. కడఝామము సమీపించుచుండుటచే పక్షులు కిలాకిల రావములు జేయుచుండెను. ఆ కోకిలల గానామృతమును గ్రోలుచు, కొంతసేపైన పిదప అహల్య లేచి, యహర్ముఖోచిత కృత్యముల నిర్వర్తించుకొని పాకశాలవైపు పోదలచుకొని, గుడారమునుండి బయటికి వచ్చెను. తల్లి యెదురుపడెను. వెంటనే అహల్య నమ్రతతో భక్తిపూర్వకముగ ఆమెకు సాష్టాంగ నమస్కృతులొనర్చెను. తల్లి మందస్మిత వదనముతో 'త్వరలో పెండ్లికూతురవు కమ్మని' నుడివెను. ఈ వాక్కులా తల్లి నోటినుండి యెందుకు వచ్చెనో ఆమెకే తెలియదు. అహల్య దానినిగూర్చి యెక్కువగా యోచింపలేదు.

ఇంతలో తూర్పుదిశ ఎఱ్ఱబారెను. సూర్యభగవాను డుదయగిరి శిఖరముల నలంకరించుచుపుట్టుచుండెను. ఎవ్వరు తలవని తలంపుగా న్యూఢిల్లీ పట్టణమునుండి, క్రిష్ణప్రసాద్ కిశోర్, రమాదేవిగార్లును, భార్గవరాం కేసరిగారును వనభూమి ప్రవేశించిరి. మోటారుకారు శబ్దమును విని అహల్య వంటశాలనుండి బయటికి వచ్చెను. మేనమామయైన కృష్ణప్రసాద్ కిశోర్ ఆమెకెదురేగి కౌగిలించుకొని, ముద్దాడి, తాను తెచ్చిన పుష్పమాలలో నొకదానిని రమాదేవిని తెమ్మని చెప్పి మేనకోడలి మెడలోవైచి "అమ్మా! నీ కళ్యాణము చూచు భాగ్యమెప్పుడ"ని ఆ బిడ్డను ప్రశ్నించెను. అహల్య సిగ్గుతో తల వంచుకొనెను. అత్తగారిని, మామగారిని, కువలయానందుని తండ్రియైన భార్గవరాం కేసరిగారిని వారిగుడారములకు పిలుచుకొనిపోయి, అహల్య తగు మర్యాదలతో వారికి పరిచర్య చేసెను. ఆకస్మికముగ అన్న, వదినగార్ల రాకచే, శర్మిష్ఠాదేవి ఉప్పొంగి పోయెను. భార్గవరాం కేసరిగారి రాకచే యశోధరాదేవి తృప్తినొందెను.

వీరెల్లరు స్నానము లాచరించి, ఉపహారములను గైకొని, వృక్షచ్ఛాయలలో గూర్చొని వినోదముగ మాటలాడుకొనుచుండగా, ఒక ఉడుత మామిడిపండును తినబోయి, దాని బరువును భరింపలేక చెట్టునుండి ఆ పండును క్రింద పడవేసెను. అది క్రిందనుండిన మన అహల్య యొడిలో పడెను. అచ్చట నున్నవారినెల్ల ఆ దృశ్య మాకర్షించెను. అందఱును వారి వారి మాటలను చాలించి, దీనిని శుభ చిహ్నముగా గైకొని అహల్య వివాహవిషయమై ప్రస్తావన తీసుకొని వచ్చిరి. కృష్ణప్రసాద్ కిశోర్ గారు "ఇంకను నాలుగైదు నెలలు జరుపుటకన్నను త్వరలో శుభముహూర్త మున్నచో,

చూచి ముగించుట యుత్తమము. 'నేను త్వరలో అమెరికా దేశమునకు పోవలసి యుండును. నేను పోవులోపలనే అహల్యా పెండ్లిచూచి పోవలెనని కుతూహలుడనై యున్నాను. వధువుకు వరుడు సిద్ధముగానున్నాడు. వరునకువధువు సిద్ధముగానున్నది. వారిని కూర్చు భారము మన యందఱి యందున్న ద''ని చెప్పిరి. మా మామగారు పెద్దలు. వారేమి చెప్పెదరోఅనియు, భార్గవరాం కేసరిగారేమి చెప్పెదరోఅనియు కృష్ణప్రసాద్ కిశోర్ గారనిరి. అచ్చట నేచేరియున్న శ్రీవిష్ణుభట్టారకులు, కొంచెముతల పైకెత్తి యిటునటు చూచి, వధూవరుల నక్షత్రముల నడిగి తెలుసుకొని, "రేపుఉదయలగ్నము వీరి వివాహమునకు చాల ప్రశస్తముగ నున్నది. తారాబల చంద్రబలములు సరిపోయినవి. బృహస్పతియు, ఇతర శుభగ్రహములు లగ్నమును చూచుచున్నారు. లగ్నమునకు పాపగ్రహముల వీక్షణ లేదు. తిథి, వార, నక్షత్ర, యోగ కరణములు సరిపోయినవి. వధూవరుల తల్లిదండ్రు లంగీకరించు-చో రేపు ఉదయము ఈ పుణ్యవనము నందే అహల్యా- కువలయానందుల పాణిగ్రహణ మహోత్సవము జరుగుగాక'' యనెను. కృష్ణ కుమార్ కిశోర్‌గారు ఆనందమును పట్టజాలక ''పెద్దల సంకల్పము అమోఘమైన''దనిరి. తాత గారు పంచాంగమును చూచి, విష్ణుభట్టారకులు అతీంద్రియజ్ఞానులు. వారు చెప్పినదంతయు సరి పోయినది. రేపు ఉదయలగ్నమునకే, ఇదే వనములో మా అహల్య కంకణవతి యగునుగాక'' యని శుభవాక్కు నొసగిరి. అనుజ్ఞను ప్రసాదించిరి. వెంటనే అందు కూర్చొనియున్న ఉషయు, శర్మిష్ఠాదేవియు అహల్యను వచ్చి కౌగలించుకొనిరి. ఉష ఆనంద పారవశ్యురాలై, ఎంతో సేపటికికాని అహల్యను విడువజాలక పోయెను. భార్గవరాం కేసరిగారు, పెద్దల నిశ్చయమును త్రోసివెయ్య జాలననిరి. భార్యను వివాహమునకు వలయు సర్వవస్తువులను తక్షణమే తయారు పెట్టమని ఆజ్ఞాపించిరి.

ఈ కార్యకలాపమంతయు ఈరీతిగ అనుకొననట్లు సాగుచుండెను. అహల్య మాత్రము యేమియు మాటలాడక తలయొంచుకొని అచ్చట నుండిలేచిపోయెను. తన తల్లిని దూరముగ పిలుచుకొనిపోయి యేమేమో చాలాసేపు దీర్ఘముగ చర్చించెను. ఇంతలో ఉషనుకూడ అక్కడికి పిలిపించుకొనెను. ఉష కానాదానమును పట్టుటకు యెంత మాత్రము వీలుకాదనియు, తాను కువలయానందుని వివాహమాడుటకు అంగీకరింపననియు, అహల్యకాళ్లపైబడి ఏడ్చుచు, అహల్యను ఆ విషయమై యోచింప వలదని ప్రార్థించెను. కువలయానందుని మనస్సు తెలియువఱకును అహల్యకు తృప్తిలేదు. తన గుడారముకడకు వచ్చి, కొంత సేపు యేమో యోచించుకొని కువలయానందునితో మాటలాడవలెనను తలంపుతో ఏదో సాకుపెట్టుకొని వారి గుడారమునకు వెళ్లెను. అహల్య రాకను గమనించి యశోధరాదేవి కొడుకును కనుసన్నజేసి, వేరొక గదిలోనికిపంపి, "అమ్మా! నీమోచేతి కంకణము ముంజేతికి వచ్చినది. ఈ శుభసమయము నెన్న రాపగలరు.నీవు మా యింటికి కోడలవై వచ్చు భాగ్యము మాకు లభించినందులకు నా నక్షత్ర తారాగ్రహములకు నమస్కరించు చున్నాను. నీవు మాపాలిటి భాగ్యదేవతవు. మాగృహము పావనమగును. మా పితృదేవతలు సంతృప్తినొందెదరు. నా పుత్రుడు నీవల్ల నీతిపరుడై, కీర్తి వహించును. ఇప్పుడిచ్చటికి వచ్చిన కారణము నాయూహకు దట్టినది. కువలయానందుడు అహల్యను తప్ప మఱియే యితర స్త్రీని కన్నెత్తి చూడడు. తన కంటికి గోచరమగు ప్రతిస్త్రీయందును, మాతృభావముతో, నన్నే వారియందు చూచును. ఉషను మాతృభావముతో పూజించును. మోహదృష్టితో నికజూడడు. వాని విషయమై నీవన్యథా భావింపకుము. నీ యెదుటికి వచ్చుటకు సిగ్గుపడుచున్నాడు. నామాట నమ్ముము. నేను వానికెంతో ఉష వానికంతే. అదేభావము వానికి కలదు.

వాని పక్షమున నేను నీకు అభయ మిచ్చుచున్నాను. సాయంకాలము వానిని నీ దగ్గరకు పంపెదను. వానిలో కలిగిన అద్భుత మార్పును నీవే మెచ్చుకొందువు గాక! నా చెయ్యి తాకుము. ఇదో ఈ కంఠాభరణమును కోడలవగుదానవు నీవు ఇప్పుడే ధరించి, నా కన్నుల కానంద మిమ్మని" అహల్యను కౌగలించుకొని ముద్దాడెను. అహల్య, అత్తగారు చూపిన వాత్సల్యమునకు ముగ్ధురాలై పాదము లంటి నమస్కరించి, సెలవు గైకొని తన గుడారమునకు పోయెను.

వివాహ కార్య కాలాపములన్నియు, చురుకుగ జరుగుచుండెను. వనములో విశాలముగ పందిళ్లువేసిరి. తల్లియెంతగా చెప్పినను కువలయానందుడు అహల్య దగ్గరకుపోయి మాటలాడుటకు సిగ్గుపడుచుండెను. అహల్యతో మాటలాడుటకు నాకు ముఖము రాలేదు. నైతిక బలము లేదని తల్లితో వాదింపసాగెను. "నీ మనస్సులో కలిగినమార్పు నీకుబలమొసగును. సిగ్గుపడకు"మని తానే కువలయానందుని వెంటబెట్టుకొని అహల్య గదిలోనికి పోయెను. అహల్యను చూడగనే కువలయానందునికి అప్రయత్నముగ రెండు చేతులు, హస్తములు యొకటిగా చేరిపోయెను. అహల్య లేచి, వారిని కూర్చోనమని ఎంతగ చెప్పినను, కువలయానందుడు వినక "అహల్యా! పురుషులకన్నను స్త్రీలే యెక్కువనైతిక బలముకలవారు. నేను నాయున్నత స్థానమునుండి క్రిందపడితిని. నా తప్పును తెలిసికొంటిని. ఇప్పుడు నన్ను లేవదీసి యుద్ధరింపగలవారు, నాతల్లియు, నీవునుతప్ప యన్యులెవ్వరు లేరని" అహల్యను కౌగలించుకొని ఏడ్వసాగెను. అహల్య కువలయానందుని కన్నీటిని తన చెరుగుతోదుడిచి, "మీరింతగా వ్యధపడుటకు కారణములేదు. బిడ్డలకు తల్లి యెంతో, భర్తలకు భార్య యంతే. ఇద్దరియందును అవ్యాజమైన ప్రేమ, శాంతము, ఓర్పు, క్షమ, యుండినకాని స్త్రీలు భార్యస్థానమునకును, మాతృ స్థానమునకును అర్హులుకారు. మీరింకే విషయమును మనస్సునందుంచుకొనవలదని" అహల్య యతనిగడ్డము పట్టుకొని యోదార్చెను. కువలయానందుని కిప్పటికి మనస్సు శాంతించెను. అహల్యవద్ద సెలవు గైకొని ఆరాత్రి జరుగబోవు శాస్త్రోక్త వివాహ కార్యకలాపములకు సంసిద్ధుడగుటకు తన గుడారమునకు పోయెను. తల్లికూడ కొమారుని వెంబడించెను.

రాత్రి యెనిమిదిగంటలకు అలహాబాదుపట్టణములోనున్న సుప్రసిద్ధపౌరోహితులెల్లరు వచ్చిరి. నాంది, పుణ్యాహవాచనము, స్నాతకము మొదలగు వేదోక్త వివాహ విధులన్నియు, జరుపబడెను. నిర్ణయము ప్రకారము మఱుదినము ఉదయలగ్నమునకే, కన్యాదానము, మాంగల్యధారణ, అక్షతారోపణ జరిగెను. ఆ పుణ్యావనమునందు అగ్నిసాక్షిగ, పెద్దవారల యొక్కయు, బంధుమిత్రాదుల యొక్కయు, ఆశీర్వచనములతో అహల్యా - కువలయానందుల పాణిగ్రహణము జరిగిపోయెను. తల్లి ప్రేమ ముందఱ పుత్రుని కామాగ్ని నిలువజాలదయ్యెను. స్త్రీపై మోహమును తల్లి ప్రేమయే జయించెను.

భారతదేశములో ఆదర్శయువతియైన అహల్య వివాహోముతో ఈ కథ ముగిసినది. ఉపసంహారము మాత్రము మిగిలియున్నది.

---



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE."
PRINTER: K. R. JOSHEE :: PUBLISHER: V. R. GOPALAKRISHNA
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4.
సంచిక-16.

బుధవారము మే, 9, 1951.

ప్రతి బుధవారము
వెలు వడును.

## విషయానుక్రమణిక.

—§—

సిద్ధవటము ఉన్నత పాఠశాల వార్షికోత్సవ సందర్భమున జరిగిన

# అష్టావధానములోని సమస్యలు - వానిపై పద్యములు.

(శ్రీ అవధానము చంద్రశేఖరశర్మ గారు, శిరోమణి, అష్టావధానులు).

1. వర్ణనము — (బుద్ధుని తపము.)

ఉ॥ జాలును జెమ్మగిల్లినవిరా! కనుదమ్ములలోన నుగ్రతే
జోలవ దీధితుల్ జగము శూన్యత! జక్కఁగ నిర్వచించునో!
చాలుమనంబులోఁ బ్రణవసారము దోఁచిన చందమయ్యెవా
గ్జాలము విస్మితమ్మును జగంబుల గౌతమ! రాకుమారకా!॥

2. నిషేధాక్షరి (పినాకినీ నదివర్ణనము)

కం॥ పువు(త)వి(శ)లు(క)తు(ని)గా(క)చు(ప్ర)నే(న)ర్పు(త)న.
(చ)భవు(చ)లఁ(స)చు(చు)నో!(క)ర్పు(ర)న(ర్భ)ను
(ధ)శు(మ)భ(బు)ద(చు)లౌ(స)నీ(చ)కుఁ
(న)భవు(ని)త(న్మ)ల(చు)పూ(వ)తి(వ)ను(చ్చ)న(ల)తి(త)ను(త)
ము.
(న)అవ(గ)న(త)ము(గ)న(గ)ద(గ)యన్(త)ద(గ)లం(ప)చు
(చు)మా!(మ)స(త)రి(త)దం(బు)బా!

కం॥ పువువిలుతుఁగాచునేర్పన
భవులఁదెలచునోర్పునను శుభదవానీకున్
భవుతల పూతెనునతిమము
అవనమునదయఁ దలంచుమాసరిదంబా?

3. సమస్య (పాతివ్రత్య విభంగభీతివిటులన్ బైకొందు గర్భానలల్)

శా॥ చేతోజాతరుజన్ భరింపక చలచ్చిత్తంబు కల్లోలమై
కాతర్యంబు నిరాకరించి యెటుదుష్కార్యంబులన్ బూను, వా
రేతన్మాత్రులె! లోకవంచనకుఁ దామెంతేని చూపింత్రుబో
(పాతివ్రత్య విభంగ భీతివిటులన్ బైకొందు రజ్ఞానల్)

4. దత్తాక్షరి (తుంటరి, ఒంటరి, మంటిరి, కంటిరి)

ఉ॥ తుంటరియైననూతసుతుతో నపయోజనచేసి బాలుని
బ్లొంటరిజేసి చంపిన సదోద్ధతులార! యెఱుఁగుఁడింతకున్,
మంటిరిగారు పాండుసుత మధ్యము కోలలుతాకనాఁడిమిన్
గంటిరిగాదె! యేల పెనుగంతులు వైవఁగఁగౌగవాధముల్॥

5. అప్రస్తుతప్రశంస.

సీ॥ తాకడెన్నండును ప్రస్తుత ప్రశంస
వివిధ సంస్కారనిధి బుధవినుత చరితుఁ
డౌర! మాచంద్రశేఖరయ్యరు కడంక
సలుపున ప్రస్తుత ప్రశంసకుముదంబు.

6. వ్యస్తాక్షరి.

చండీశచండ కోదండదండ ఖండన పండితమ్.
పుండరీక విశాలాక్షిం.



(మిగత 11 వ-పేజీలో)

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 16. | శ్రీ ఖర సం॥ వైశాఖ శు. 3, మే 9, 1951. | ప్రతి బుధవారము ప్రకటింప బడును


# ప్రస్తుత కేంద్ర మంత్రివర్గమునకు రాజ్యాంగ చట్టమును సవరించు హక్కు లేదు.

—o—

ప్రాథమిక హక్కులను సవరించుటకు కాని, సంక్షేపము చేయుటకుకాని, అవకాశమొసగుచో, అది శ్రీ జవహరిలాలుగారి జీవితగాథలో నల్లనిమచ్చగా ఏర్పడును.

—o—

ఇండియా యూనియన్ మంత్రివర్గమువారు ప్రస్తుతరాజ్యాంగ నిర్మాణచట్టమునకు కొన్నిసవరణలు ఈ నెలలో, పార్లమెంటుసభలో, ఉపపాదింప తలపెట్టియున్నారు. ఆ సవరణలు పార్లమెంటు సభలో ఏ దినము ఆమోదింపబడునో, ఆ దినము ఈ స్వతంత్ర భారతదేశ చరిత్రలో ఒక కారు మొబ్బులతో నిండిన దినముగా పరిగణింపబడును. మానవ ప్రాథమిక హక్కులనిన అవి ఏవో ఎల్లరికిని తెలియుటకై, ఊహా ప్రపంచమునుండి వానిని పదములుగను, వాక్యములుగను మార్చి, వానికిఒక ప్రత్యక్షరూపము కల్పింపబడినది. అవి రాజ్యాంగ చట్టములో చేర్పబడినవి. వాని పవిత్రతను కాపాడబడునని, భారతజాతికంతయు ఒక హామీ ఇవ్వబడినది. అట్టి హక్కులను తారుమారు గావించుటకై, కొందరి వ్యక్తులనుండి ఒత్తిడులు రావచ్చును. అంతరంగిక ఒత్తిడులుకాని, లేక బాహ్య ఒత్తిడులుకాని కల ... ం. కాని ఆ మానవ స్వతంత్ర అధికా ... ము అపవిత్రత ఏర్పడుటకు ఏలాటి అవ ... ము ఒసగుచో, అది శ్రీ జవహరిలాలు ... రి ... చరిత్రలో ఒక నల్లని మచ్చగా ఏర్పడ ... "లక్ష్య నిర్వచన తీర్మానము ... ర్ టివ్ రెజల్యూషన్)ను శ్రీ జవ ... రే తయారుచేసిరి. 1946 సం॥ డిశంబరు 13-వ తేది సమావేశమైన రాజ్యాంగ పరిషత్తు సభలో ఆ తీర్మానమును వారే ఉపపాదించుచు, ఆశాపూరితముగ భావములను వెల్లడించిరి. 1947 సం॥ జనవరినెల 22-వ తేది కూడిన రాజ్యాంగ పరిషత్తు సభలో ఆ తీర్మానమును అంగీకరింపమని సభ్యులను కోరుచు ఆ తీర్మానములో ఇమిడియున్న గొప్ప ఆదర్శభావములను విశదీకరించిరి. ఇప్పుడు ప్రాథమిక హక్కులను సవరించుటకు ప్రయత్నించినచో, ఆదినములలో ఆ 'లక్ష్య నిర్వచన తీర్మానము'పై వెలిబుచ్చిన భావములన్నియు ఈ దినము మంట కలసినట్లగును. 36 కోట్ల భారత ప్రజానీకము యొక్క బాగోగులను లక్ష్యము చేయక, ఇండియా రాజ్యాంగ చట్టముపై దౌర్జన్యము చేయ సమకట్టబడినది. ఈ తరుణములో ప్రతి ఒక్క పౌరుడును, స్త్రీ కాని, పురుషుడుకాని, అందు ముఖ్యముగా విద్యావంతులు, తమ అసమ్మతిని బహిరంగముగా వెలిబుచ్చనిచో, అట్టి వారు సిగ్గుతో తలలు వంచుకొన వలసియుండును. ప్రాథమిక హక్కులను సవరించుటకై ఇప్పుడు ఉపపాదింపనున్న సవరణ తీర్మానముల ఫలితము ఏ రీతిగా పరిణమించునో తెలుసుకొన జాలని ప్రజలు కోట్లకొలది కలరు. వారికి విద్యగాదు, సంస్కృతి

లేదు. కాని విద్య యు, విజ్ఞానమును కల ఏ పౌరుడు కాని ఈ తరుణములో ఉపేక్షాభావము వహించి, నోరు మూసికొని యుండుట క్షమింప రాని విషయము. అట్టివారు ప్రస్తుతము మన దేశములో అస్పష్ట వాక్కులుగల ప్రజలకే కాక, రాబోవు సంతతి వారికికూడ ఉత్తర వాదులై యుందురు.

కాంగ్రెసుపార్టీలోనున్న కొందఱు పెద్దలు ప్రాథమిక హక్కులను సవరించుటకై ప్రయత్నించు చున్నారని, రెండు నెలల క్రిందట నే కొన్ని వార పత్రికలలో ప్రకటింపబడెను. అట్టి ప్రకటన లన్నియు కేవలము ఊహాలని అభిప్రాయపడబడెను. ఈ దినము ఆ "ఊహ" లన్నియునిజ మేనని అందరికిని ఆశ్చర్యము కలిగించు చున్నది. ఇండియా రాజ్యాంగ చట్టములో 379 సెక్షను ఒకటి కలదు. ప్రస్తుతము "పార్లమెంటు" అని వ్యవహరింప బడు చున్నసంస్థ అశాస్త్రీయమైనదై నను, ఎన్నికలలై, శాస్త్రీయమైన పార్లమెంటు ఏ విధముగా వ్యవహ రించుటకు రాజ్యాంగ నిర్మాణ చట్టముక్రింద హక్కు కలిగియుండునో, అట్టి హక్కులనే ఈ "అశాస్త్రీయమైన పార్లమెంటు" కూడ చెలా యింప వచ్చునని ఆ సెక్షనులో నిర్వచింప బడినది. అందువలన ఈ సెక్షనును శ్రీ జవహరిలాలు గారి మంత్రివర్గమువారు అవకాశముగా గైకొని, ఇప్పుడే పరిమితి చేయబడిన మానవ ప్రాథమిక హక్కులను ఇంకనూ తగ్గించుటకు ప్రయత్నించు చున్నారు.

రాజ్యాంగ నిర్మాణ సభయెదుట, 1946 సం॥ డిశంబరు 13-వ తేది నిలువబడి "లక్ష్య నిర్వచన తీర్మానమును" ఉపపాదించుచూ శ్రీ జవ హరిలాలుగారు ఎట్టిమాటలను చెప్పిరో చూడుడు:—

"మేము తలచినరీతిగా ఈ రాజ్యాంగ నిర్మాణ సభ యేర్పడలేదు. కొన్ని ప్రత్యేక పరిస్థితు లలో దాని నిర్మాణము జరిగినది. దాని నిర్మా ణములో బ్రిటీషువారి హస్తముకూడవున్నది.

"అసంఖ్యాకులైన ప్రజానసమూహము యొక్క బలము మన వెనుక ఉన్నదని ఈ దినము మనము ఇచ్చట కూడి యున్నాము. ఏ పార్టీకి కాని లేక ఏ వర్గమునకుకాని సంబంధము లేకుండ, భారతప్రజలెల్లరు సమిష్టిగా ఎంత దూరము పొమ్మని ఆదేశించెదరో అంతదూరము మేము పోవుటకు సిద్ధముగ ఉన్నాము.

"ఎటు తిరిగి ఒక్కటి మాత్రము సత్యము. లక్ష్య నిర్వచన తీర్మానము వ్యవహార సంబం ధమైన విషయము కాదు. మానవ హృదయ ములకు ఆవేశముకలుగ జేయగలదై యున్నది. ఈ దేశములో ఉన్న లక్షలాది సోదరీ సోదరుల తో మనము గావించుకొను ఖరారు అది. ఆ 'లక్ష్య నిర్వచన తీర్మానమును' మనమంగీక రించిన చో, అందులోని ఆదర్శములను నెర వేర్చుటకు అది ఒక జామీను పత్రముగా (తాకట్టు పత్రముగా) పరిణమించును".

రాజ్యాంగచట్ట నిర్మాణమునకై, 1946సం॥ ఏర్పాటు చేసిన రాజ్యాంగనిర్మాణ సభ, శాస్త్రీ యమైనదా లేక అశాస్త్రీయమైనదా అనియు; ఇప్పుడు 'ఇండియా పార్లమెంటు' అని వ్యవహరింప బడుచున్న సంస్థ సరియైన ప్రజా ప్రాతినిధ్యము కలిగినదా లేదా అనిచర్చించుటకన్న, మనఎదుట ప్రత్యక్షముగానున్న విషయములను శాంతముగా చర్చించుటయే ముఖ్య కర్తవ్యము. శ్రీ జవహరి లాలుగారు రాజ్యాంగ నిర్మాణసభయెదుట గావిం చిన ప్రసంగములోని ముఖ్యభాగములను పైన పేర్కొనియున్నాము. లక్ష్య నిర్వచన తీర్మాన మును ఆధారముగా చేసికొని, నిర్మింప బడిన రాజ్యాంగ చట్టము ఏ ఒక్క రాజకీయపార్టీలాభ మునకో లేక ఏ ఒక్క రాజకీయ వర్గము లాభము కొఱకో తయారు చేయబడ లేదు. భారత దేశ

ప్రజానీకమున కంతయు వర్తించులాగున తయారుచేయబడినదని స్పష్టమగుచున్నది. శ్రీ జవహరిలాలుగారి మాటలప్రకారము "ఈ దేశములో నివసించుచున్న లక్షల కొలదిగాగల సోదరీ సోదరులకు, లక్ష్య నిర్వచన తీర్మానములో సూచింపబడిన భావములనెల్ల కార్యరూపమున పెట్టబడునని'' తానున్ను, రాజ్యాంగనిర్మాణ సభ్యులున్ను ఒసగిన హామియని స్పష్టమగుచున్నది.

రాజ్యాంగ చట్టములో మొట్టమొదటి సూత్రము పీఠిక. ఆ పీఠికలో "లక్ష్య నిర్వచన తీర్మానములోని సారాంశము చేర్చబడియున్నది. అందులో:—

"ఇండియా దేశప్రజలైన మేము, (కాంగ్రెసు పార్టీసభ్యులు మాత్రమేకాదు,) ఇండియా దేశమును సర్వసంపూర్ణ ప్రజాస్వామిక రిపబ్లిక్ దేశముగా ఏర్పాటు చేసుకొనుటకును, ఈ దేశములో ఉండు ప్రతి వ్యక్తికిని ఈ క్రింది హక్కులను కలుగజేయుటకును, పవిత్రమైన భావముతో తీర్మానించుకొని.........ఈ రాజ్యాంగ చట్టమును ఆమోదించుచున్నాము. శాసనముగా ఒనర్చుచున్నాము. ఆశాసనము ప్రకారము ప్రవర్తించుటకు మాయంతటకు మేమే అంగీకరించుచున్నాము''అని యున్నది.

ఇండియా దేశములోని ప్రజలెల్లను చేరి ఈ రాజ్యాంగ చట్టమును అంగీకరించి, అమలులో నుంచుటకు ఆమోదించినటుల పై పీఠిక స్పష్టము చేయుచున్నది. కనుక రాజ్యాంగ చట్టములో ఏ భాగమునైనను సవరింపవలెనన్న, ఒక్క కాంగ్రెసుపార్టీకే సవరించుటకు హక్కులేదు. 36 కోట్ల భారతీయప్రజల అంగీకారము లేనిదే రాజ్యాంగ చట్టమును సవరించుట శాస్త్ర సమ్మతము కాజాలదు.

మానవ ప్రాథమిక హక్కులనగా ఏమి? ఇప్పుడు ఏర్పడిన ప్రభుత్వమేకాక, ఇకముందు ఈ దేశములో ఏర్పడు ప్రభుత్వము లన్నియు మానవ ఔన్నత్యమును అంగీకరించినవని అర్థము. ప్రభుత్వమునకన్న ప్రజలే ఎక్కువని అర్థము. ప్రభుత్వములకు ఎంతటి నిరంకుశాధికారములున్నను, కనీసమైన మానవప్రాథమిక హక్కులను అతిక్రమించు అధికారము లేదని అర్థము. ఆ ప్రాథమిక హక్కులకు, ప్రభుత్వములు లోబడి దేశపరిపాలనమును సాగించునని అర్థము. పౌరులమధ్యను, ప్రభుత్వము మధ్యను, ఏర్పరచిన హద్దులు—కోటలు—గోడలు అని అర్థము. వానిని ఏ ప్రభుత్వముకాని అతిక్రమింపజాలదని స్పష్టమైనపదములతో హామీ ఒసగబడినదని అర్థము. కార్య నిర్వాహక వర్గమువారి దౌర్జన్యములకు హద్దుగా ఏర్పరుపబడిన పరిధి అని అర్థము. మానవ జీవితమును ఆశాజనకముగా ఒనర్పుటకై ఇవ్వబడిన శాశ్వత హక్కులని అర్థము. ఇప్పుడు మనకు ఒసగబడి, రాజ్యాంగచట్టములో చేర్చబడిన మానవ ప్రాథమిక హక్కులకు కొన్ని నిషేధముల నేర్పరిచి యున్నారు. అయినను చింతలేదు. ఏ పౌరునికైనను ఒసగబడు హక్కులను కార్య నిర్వాహక వర్గమువారు వారికి ఇష్టమొచ్చినప్పుడంతయు దానిని మార్పుచేయుటకుకాని, సవరించుటకు కాని అనుకూలమైనదగుచో, అట్టి హక్కు ప్రాథమిక హక్కుగా పరిగణించుటకు వీలులేదు. ఇప్పుడు పార్లమెంటు అని వ్యవహరింప బడుచున్న సంస్థ రాజ్యాంగ చట్టముక్రింద ఎన్నికలు జరిగినతర్వాత ఏర్పడిన పార్లమెంటుకాదు. అయినప్పటికిని శాస్త్రీయమైన పార్లమెంటు రీతి, ప్రస్తుత అశాస్త్రీయమైన తత్కాలిక పార్లమెంటు కూడ వ్యవహరించుటకు హక్కుకలదని రాజ్యాంగ చట్టము 379 సెక్షనులో నిర్వచింప బడినది. ఇట్టి ప్రమాదకరమైన హక్కును, ప్రస్తుత పార్లమెంటుకు కలుగ

జేయుచున్నను, ఒక్క సంవత్సరము నడిచీ నడవక ముందే, ప్రాథమిక హక్కులను సంకుచిత పఱచుటకై కార్యనిర్వాహక వర్గమువారు, పార్లమెంటు ఎదుట కొన్ని సవరణలు ఉపపాదించుటకు ముందు కొచ్చెదరని ఎవ్వరు తలచియుండలేదు. రాజ్యాంగ చట్టమును తమకాళ్ళక్రింద వైచుకొని తొక్కి వేయుదురని తలచలేదు.

ప్రస్తుత రాజ్యాంగ చట్టమును తయారు చేయుటకు మూడుసంవత్సరముల కాలము పట్టినది. ఈ దేశములో న్యాయశాస్త్ర విజ్ఞానములో మేధావులని ప్రఖ్యాతిచెందిన న్యాయశాస్త్ర నిపుణులందరును చేరిరి. ప్రపంచములోని ఇతర దేశముల రాజ్యాంగ చట్టములను సహాయముగా గైకొనిరి. ప్రతి పదమును, దాని భావమును, ప్రతి సెక్షనును, అన్ని దృక్పథములనుండి ఆమూలాగ్రముగ చర్చించి, రాజ్యాంగ చట్టములో నిర్వచించిరి. సభ్యులెల్లరు సావకాశముగ తర్కవితర్కములను జరిపిరి. పిదప చట్టమును ఆమోదించిరి. ప్రస్తుత రాజ్యాంగ చట్టము కేవలము ఒక కాగితపు చింపికాదు. కాంగ్రెసుపార్టీ వారుకాని లేక అధికారములోనున్న పార్టీ వారు కాని, వారి వారికి ఇష్టమొచ్చిన రీతి మార్పు చేయుట కనుకూలపడు చింపికాగితము కాదు. అది సర్వ సంపూర్ణ స్వాతంత్ర్య పౌరుల యొక్క హక్కు పత్రము.

కాంగ్రెసు, దేశములో ఒకబలమైన రాజకీయ పక్షమేకాని, భారతజాతి కంతయు ప్రాతినిధ్యము వహించిన సంస్థ కాదు. చిహ్నము కాదు. అధిక సంఖ్యాకులగు విద్యావంతులును, యోగ్యులును కాంగ్రెసుసంస్థకు వెలుపలనున్నారు. విద్యావిహీనులై, దుర్భర దారిద్ర్యము తోను, వ్యాధులతోను పీడింపబడుచున్న కోట్ల కొలది జనులు ఏ రాజకీయ పార్టీలోను లేరు. కనుక ఇప్పుడు అధికారములోనున్న కాంగ్రెసు పార్టీకి 36 కోట్ల భారత పౌరుల పక్షమున ప్రాతినిధ్యము వహించుయోగ్యత లేదు. కనుక అన్ని ఆకారములును, సర్వశక్తిత్వమును తమకేకలదను భావముతో కాంగ్రెసు పార్టీ, మానవహక్కు పత్రము యొక్కపవిత్రతను భంగపఱచి, మానవ హక్కుల పై దౌర్జన్య మొనర్పబూనుట అక్రమమైన కార్యము.

విశాల భావపూరితములై, శాశ్వతములై, ప్రస్తుత సంతతివారికే గాక ఈ దేశములో ఇక ముందు పుట్టబోవు అనేక సంతతుల వారికి అన్వయించు దానినే మానవ హక్కు పత్రమని చెప్ప తగును.

అనేక వేల సంవత్సరముల క్రిందట, బహుశా మానవ చరిత్ర ప్రారంభమగు కాలములో, శాశ్వతమైన సత్యములను మహర్షులు ఉపనిషత్తులలో నిర్వచించియున్నారు. అవి ఈ దినమునకు కూడ దేశకాలముల కతీతములై, ప్రపంచములో నుండు ప్రజలెల్లరకును వర్తించునట్టివై యున్నవి. వేలకొలది సంవత్సరములుగ కాలప్రవాహములో జరిగిన మార్పులు ఆసత్యముల నంటజాలక పోయినవి. ఈ విధముగనే, కాలముగడుచు కొలదియు, ఇప్పుడు పరిమితి చేయబడిన మానవ ప్రాథమిక హక్కులు విశాలములై, పరిపూర్ణత గలిగి, మానవ ఆశలను, భావములను ప్రతిబింబింప జేయు స్వయం ప్రకాశమైన సత్యములుగా ఉండవలెను. అప్పుడే అవి మానవ ప్రాథమిక హక్కులని పిలువబడుటకు తగియుండును.

దేశములో ప్రభుత్వాధికారము లోనికి వచ్చు ప్రతిరాజకీయ పార్టీయున్ను, దానికి సరిపోవునటుల, ప్రాథమిక హక్కులను సవరించుటకు కాని, మార్పుచేయుటకుకాని లేక సంకోచపఱచుటకుకాని తలచినచో, ఇక దానికి అంత్యమనునది ఉండనే యుండదు. ఆ హక్కులను వివిధ రాజకీయ పార్టీలవారు, వారివారి కాళ్ళక్రింద వేసుకొని తొక్కుటకు బదులుగ, శ్రీ జవహరిలాలు గారి ప్రభుత్వము కొనసాగుచున్న ఈ తరుణములోనే, రాజ్యాంగ చట్టములోని మూడవ అధ్యాయము నంతయు రద్దుచేయుట మేలుకదా?

ఇప్పుడు ఒక్క రాజకీయ పార్టీ (అధికారము లోనున్న రాజకీయ పక్షము-) ప్రస్తుత రాజ్యాంగ చట్టములో ఒసగబడిన అవకాశములకును, పరిమితముగా ఒసగబడిన ప్రాథమిక హక్కులకును లోనై, దేశపరిపాలనము కొనసాగించుట కష్టమని భావించినది. ఇది న్యాయ సూత్రమునకును, నైతిక సిద్ధాంతములకును విరోధముగ నున్నది. ఎన్నికలు నవంబరు — డిశంబరు నెలలలో తప్పక జరుగుననియు, ఇక ఆపుదల కావనియు, పార్టినాయకులు పలుమారు ప్రకటించుచు నేయున్నారు. కాంగ్రెసుపార్టి తలపెట్టిన జమీందారి రద్దుచట్టము మొదలైన సంస్కరణములు ఇంత కాలము వఱకే వేచియున్నవి. ఇక వయోజన ఓటింగు పద్ధతి పై నూతన ఎన్నికలు జరిగి, రాష్ట్రశాసన సభలును, పార్లమెంటు సభయు ఏర్పడువఱకు వేచియుండగలవు. అప్పుడు వాని నన్నిటిని కార్యరూపమున పెట్టవచ్చునుకదా?

ఏమో బడాయి కొట్టుకొనుచున్న ఈ కాంగ్రెసు పార్టి, దేశ స్వాతంత్ర్యమునకై విదేశీయులతో పోరుసాగించినంతకాలము, వ్యక్తిస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, సంఘ స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము పైననే ఎక్కువ పట్టుదల చూపుచూవచ్చినది. ఈ ప్రాథమిక హక్కుల సంపాదనకై గాంధిజీ దేశమంతటను సత్యాగ్రహమును ప్రారంభించెను. ఇప్పుడు దేశమునకు స్వాతంత్ర్యము లభించెను. ఈ కాంగ్రెసు పార్టి వారి యాజమాన్యముక్రింద తయారు కాబడిన రాజ్యాంగ చట్టములోనే ఈ మానవ ప్రాథమిక హక్కులు అంగీకరింప బడెను. ఇంత లోపలనే ఏమో మించి పోయినటుల వాక్స్వాతంత్ర్యమును భావస్వాతంత్ర్యమును సంకుచిత పరచుటకు కాంగ్రెసు పార్టిముందుకు వచ్చుచో అది రాజ్యాంగ చట్టముపై దౌర్జన్యము చేయుటకాదా?

"ఒక పార్టీకిని లేక ఒక వర్గమునకును అనుకూలమగు రీతిగాక జాతికంతయు అనుకూలమగు రీతిగా రాజ్యాంగచట్టము తయారుచేయ బడునని" పార్టినాయకుడైన శ్రీ జవహరిలాలుగారు 1946 సం॥ డిశంబరు నెల 13–వ తేది ఒక వాగ్దాన మొనర్చిరి. ఆ వాగ్దానమును ఇప్పుడు భంగపరచుట కాదా?

కోట్లకొలది ప్రజలెల్లరికి శ్రీ జవహరిలాలుగారు ఆశాజ్యోతిగ ఉన్నారు. ఆయనను చూచి, ఆయన ప్రభుత్వము క్రింద జరుగుచున్న అవకతవకల నన్నిటిని ప్రజలు ఓర్చుకొని యున్నారు. ఇంకెవరైనను ప్రభుత్వమునకు నాయకుడుగా ఉంచినచో ఒక్క క్షణకాలముకూడ ఆ ప్రభుత్వమును ప్రజలు ఓర్చుకొని యుండెడి వారు కారు. అందుకనియే, జనరల్ ఎన్నికలు జరుగులోపలనే, ప్రాథమిక హక్కులను సంకుచిత పరచుటకై రాజ్యాంగ చట్టమును సవరించుచో, అది శ్రీ జవహరిలాలు గారి జీవిత చరిత్రలో ఒక నల్లని మచ్చగా ఏర్పడుననియు, ఈ దేశచరిత్రలో ఆ దినము ఒక గాఢాంధకారమైన దినముగా పరిగణింప బడుననియు మేము తెలియ జేయుచున్నాము.

ప్రస్తుత యూనియన్ ప్రభుత్వము వారికి పార్లమెంటులో గొప్ప పక్షబలము కలదు. (మెజారిటీ కలదు). సభ్యులెల్లరు కాంగ్రెసు పార్టి వారిచే నియమింపబడిన వారే. ప్రజాభిప్రాయమును వ్యక్తీకరించుటకై సరియైన ప్రతిపక్ష పార్టి పార్లమెంటులో లేదు. కార్యనిర్వాహక వర్గము వారు ఏమైనను ప్రవేశ పెట్టవచ్చును. పార్లమెంటు సభ్యులచే అంగీకరించునటుల చేయవచ్చును. అందువలన పార్లమెంటులో గల కాంగ్రెసుపార్టీ సభ్యులున్ను, కేంద్ర మంత్రి వర్గములోని మంత్రులున్ను డా॥ యం. ఆర్. జయకరు గారున్ను శ్రీ పి. ఆర్. దాసుగారున్ను గావించిన హెచ్చరిక గమనింపక ప్రజా ప్రాథమిక హక్కులతో జోక్యము కలిగించుకొనవలెనని పట్టుదల చూపుచో, ఈ కాంగ్రెసు పార్టీకిని, ఆ పార్టి కార్యనిర్వాహక వర్గమునకును శాపము (శోకము) తగులు గాక!

---

# సంపాదకులకు లేఖలు.

## అసెసర్ల ప్రయాణ బత్తాలు.

ఆర్యా!

సెషన్సు కోర్టులన్ని జిల్లా ముఖ్యపట్టణములోనే యున్నవి. అసెసర్లను జిల్లాలలో మారు మూలలనుండి సెషన్సు కేసులకు హాజరుకమ్మని సమనులు పంపుతారు. పోకపోతే తప్పు, కోర్టుధిక్కారాలు, జులుమానాలు. పోవాలంటే కోర్టువాండ్లు యిచ్చే ప్రయాణ ఖర్చులు, బత్తాలు, ఒక్కపూట తిండికి చాలదు. ఎన్నిఏండ్ల క్రిందట నిర్ణయించినారో కాని కోర్టులకు హాజరయ్యే అసెసర్లకు మూడవ తరగతి ప్రయాణీకుల ఛార్జి యిస్తారు. రోజుకు పండ్రెండు అణాలు తినే తిండికి బత్తాగా యిస్తారు.

సాధారణముగా సర్కారు జవానులు నౌకర్లు, బయటికి పోయినారంటే—వారికి యింతకన్న ఎక్కువ ప్రయాణ ఖర్చు, తిండి బత్తాలు యిస్తారు. అసెసర్ల పనికిని, యితర సర్కారు నౌకర్ల పనికిని భేదములేదా? అసెసర్లు కొనా మొదలు కేసును వినవలె. న్యాయమును పరిశీలించవలె. మంచో చెడో తీర్పు చెప్పవాలె. ఇట్లు న్యాయవిచారణకై ఉపయోగించే అసెసర్లకు ఇట్లు నికృష్టమైన దారిబత్తా—తిండి బత్తా ఇస్తె, వారు చేతినుండి ఎక్కువగా ఖర్చు పెట్టుకొని వచ్చి న్యాయము చెప్పవలెనని సర్కారువారి అభిప్రాయమా ఏమి? ఈ దినములలో జిల్లా పట్టణములలో ఒక్క రోజు గడపవలెనంటే తిండికి కేసుపూర్తి అయ్యేవఱకు ఉండేందుకు, ఫలహారానికి కనీసము దినానికి రు 5— తక్కువ కాదు. ఇవి మునుపటి రోజులు కావు. అసెసర్లకు కోర్టు వాండ్లు యిచ్చే బత్తాలు సరిపోనందువల్ల సాధారణముగా వారు పార్టీదారులు పెట్టె ఖర్చుపై భోజనాలు మొదలైనవి చేసుకొంటారు. కేసు ముగిసి తీర్పు చెప్పేసమయములో పార్టీదారులు పెట్టిన ఖర్చును జ్ఞాపకము చేసుకొని ముద్దాయికి అనుకూలముగా యభిప్రాయము చెప్పుతారు. ఇది ప్రతి కోర్టులోను జరుగుచుండే నిత్య వ్యవహారము.

కనుక సర్కారువాండ్లు అసెసర్ల పద్ధతినైనా కొట్టి వెయ్య వలెను. లేదా పార్టీలవారి ఋణము క్రిందికి పోకుండా గౌరవమైన ప్రయాణపు ఖర్చులు, గౌరవమైన భోజన ఖర్చులకైనా యివ్వవలెను. లేకుంటే న్యాయము సున్న. రెండవతరగతి ప్రయాణీకులదారి ఖర్చులు యిస్తూ దినమునకు తిండి ఖర్చుకుగాను ప్రతి అసెసరుకు రు 5— యివ్వవలెను. ఈ విషయాన్ని కాంగ్రెసు మంత్రులు గమనించెదరా?

గుంతకల్లు. యం. వీరారెడ్డి.

---

## ఉపాధ్యాయులు దోపిడీ దారులా?

ఆర్యా!

విజ్ఞాన ప్రదాతలైన బడి పంతుళ్లు ఈ నాడు ఆకలి మంటలతో కడుపులను అరచేత బట్టుకొని, నిరాశా నిస్పృహలతో దరిద్రదేవత ఆవహించి క్రింగ దీస్తూయుంటే, భారత జాతి సిగ్గు పడుచున్నది.

దుర్భర దారిద్ర్యంతో అనుదినము సంఘటితమయ్యే కడగండ్ల ప్రవాహంతో మునిగి తేలుచున్న నిరాశా నిస్పృహాదులు, ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించుటకు ప్రభుత్వము, విద్యా క్షేత్రాలు తక్షణము సమాలోచించ వలసి యున్నది. ఈ నాడు ఒక ప్రక్క అనారోగ్యము తోను, ఆకలిమంటలతోను, తమ ఆలుబిడ్డలు భగ్నకుటీరములో చచ్చేటంత స్థితిలో వుండినాకూడ, మందిప్పించే శక్తికూడ లేక, తమ పిల్లల ఉన్నత విద్యకు కూడ నోచుకో లేక, కడగండ్లు పడుచున్నారు.

ఉపాధ్యాయుల ఈ ఆర్త నాదాలకు, పరిష్కార మార్గాలను అరయలేక నిర్హేతుకములైన ఆరోపణలు చేయుట నాయకులకు ఆరోపించడము పరిపాటైనది.

శ్రీ రంగా గారు ఇటీవల ఉపాధ్యాయులను దోపిడీదారుల ముఠాలో చేర్చి మాట్లాడినారు. ఇది శోచనీయమైన విషయము.

పూర్వము గురుకులాశ్రమాలకు ఆనాటి ప్రజలు, రాజులు సమస్త సౌకర్యములనొనగూర్చుచుండిరి. ఆ ఫలితముగా నాటి గురువులకు జీతాలతో అవసరము లేకపోయినది. అటువంటి ప్రజాపోషణ, ఆదరణాభిమానాలు ఈ నాడు కూడ వుంటే, నేటి ఉపాధ్యాయులు కూడ రెక్కలెగరేస్తూ సంతోషముగా జీతములడుగకుండానే చదువు చెప్పేందుకు సిద్ధంగావున్నారు. అటువంటి వసతి సౌకర్యములను వేటినీ యేర్పాటు చేయించక, పోగా నాటివలెనే నేడుకూడ వుచితముగా విద్య గరపమనటము, క్షణ క్షణము జీవితాన్ని గడపడమే మహాదుర్భరమై పోతున్న ఈ సమయములో, దీన ప్రజల రక్త మాంసాలను పీల్చుటే యగును.

విజ్ఞాన భిక్ష పెట్టే పంతుళ్ళ ఆర్థిక పరిస్థితులు చక్కపడినప్పుడే మన బిడ్డలు, మన జాతి, మన దేశము నవ్య దృక్పథముతో విశ్వమానవ ప్రపంచములో, ఒక స్వర్గభూమియై వెలుగ గలదన్న సత్యాన్ని గ్రహించి, ఈ నాటి ఉపాధ్యాయుల హేయ జీవితములోని విషాదమును పరికించి, తమ సహాయ సహకారములను ఉపాధ్యాయులోకానికి నాయకులు వినియోగిస్తారని మిక్కిలి ఆశించుచున్నాను.

కపులాపురము. శ్రీ... వెంకటప్ప.

# ప్రేమ.

శ్రీ పి. వి. సుబ్బయ్యగారు, కోడూరు.

పసిపాప మూడేండ్లు నిండునప్పటికి ఇది నాది, అది నాది అను మాటలు నేర్చుకొనుచున్నది. తెల్లటి కాగితముమీద ఈగవాలిన గుర్తులు పడునట్లుగా వినిర్మలమగు మెదడుపైన 'నా' అను స్వార్థము ముద్రింపఁబడుచున్నది. ఆముద్ర వయస్సు వచ్చుకొలఁది నా నాన్న, నా యమ్మ, నా అన్న, నా అక్కలలోనుండి నా స్నేహితురాలు వఱకు పెరిగి బలీయమైన ముద్రగా మాఱుచున్నది. బాల బాలికలకు క్రమముగా పదునారు, పద్దెండేండ్లు వచ్చునప్పటికి 'నా' అనునది పూర్తిగా బలపడి, కొనకొమ్మన కూర్చున్న కోతి బలీయమైన వేరొక కొమ్మమీఁదికి లంఘింపనున్న కైవడి ఆధారమును వెదకుకొనుచుండును.

దేనిపైఁ గాలుమోపుట! కొంతకాలము తలిదండ్రులందును, కొంతకాలము విద్యావివేకములందును కాలూని దేనిపైనను పట్టుదొరకక సంచరించుచుండును. పేదకు పెన్నిధి చందమున తనకు వలయు పీఠము మానస వీధిఁ దోఁచగనే అమందానందమున దానిపై నుపవసించును. అప్పటి ఆవలపు, ఆవాంఛ వర్ణింప నలవికానిది. మేరు పర్వత శిఖరము కొలువవచ్చును. సముద్రములలోతు కనిపెట్టవచ్చును. వేయేల సూర్యచంద్రాదుల గమనికలను, పరిధి పరిమాణములను, నిర్ణయింప నగునుగాని ఈవలపు నెట్లుతూచుట. సాధ్యముగాని పని.

అట్టి స్థితిలోనున్న జవ్వనులు ఒంటరిగా నివసింపలేరా? నివసింపలేరు. ప్రకృతి సిద్ధాంతము సృష్టిలోఁగల జీవరాసులయందుఁ బొడకట్టుచుండుటలేదా? పోఁతు పెంటి జంట జంటలుగా తిరుగుచున్నవి. ఒకదాని నొకటి వదలలేక తపించుచున్నవి. పెంటి పావురము మగదాని నుండి విడఁదీసిన, తన సర్వస్వముఁ గోలుపోయిన భాతి విలవిల తన్నుకొనుచున్నది. ఈ పరితాపమునకు కారణమేమి? ఋతుకాలమున కామకార్య నిమగ్నులగు పురుగులు జంతువులు తన్నిమిత్తమే తహ తహ పడుచున్నవా? అట్లగుచో సంగ్రహించిన దానియందు తను కోర్కెఁదీర్చుకొని విచ్చలవిడిగా సంచరింపఁగూడదా? కాదు, కామకార్య కలాపము గిందులకు కారణము. వేఱొక్కటియున్నది.

జవ్వనములో నుత్పన్నమగు కామము, తత్కాలిక సాఫల్యమునకు తృప్తిని వెల్లడించుచున్నది. ప్రజా బాహుళ్యమున ఇప్పుడు అనేకులపట్ల జరుగుచున్నదిదియే కదా? ఈనాటికరణా ప్రేమలీనమైన తన్మయులై, లేసింకొకరి వెంటఁబడుచున్నారు. లెక్కలేనంత మందిని చవిఁజూచిన వారును కలరు. అట్టిగుటు చంచలమగు ఈవాంఛ ప్రేమయనఁ జెల్లునా? చెల్లదు.

ప్రేమ యనునది వెనుక పేర్కొన్న రీతిగా పసిబిడ్డనుండి జవ్వన ప్రాయమువరకుఁ బెరిగి బలిసి, వ్రేళ్లుపాదుకొన్న ఒక ప్రకృతి సిద్ధాంతమగు వలపు. అవల పెవరిపై నధివసించునో ఆవ్యక్తిని విడువనోర్వదు. ఎడబాటు కలిగిన తపించి ఆహార పానీయముల విసర్జించి, కుళ్ళి కృశించిపోవును. అవ్యక్తి కనులఁబడుటతోడనే ఆప్యాయముగ ఆలింగనముఁజేసికొని హృదయవాదులు పరిశాంతినొంద తన్మయత్వమును బొందును. కనుల కద్దుకొనును. బ్రహ్మానందమున నోలలాడును.

ఈస్థితి యెందెందు కాననగునో ఏ దంపతుల యందు పొడకట్టునో ఆయువతీ యువకులే ప్రేమను గుర్తించినవారు. అవ్వారిదే సార్థక జీవితము.

ఇక్కడ ఒక అనుమానము తోచుచున్నది. ఒకప్రశ్న తల యెత్తుచున్నది. ప్రతి పసిబిడ్డకు క్రమేపి యెదిగి బలీయమగు అనురాగాను బంధమగు వలపు కొందరియందు లేక పోవుటయేమి? లేకపోలేదు. అందరియందును కలదు. కాని ముండ్ల పొదలయందుఁబడిన విత్తనము మొలకెత్తినను యెదిగి ఫలవంతము కాజాలదు. ముండ్ల పొదలయందే అణగిపోవును. అట్లే సక్రమ జీవితమును జీవింపఁజాలని వ్యక్తియందు అనగా బాల్యమాది దుర్మార్గప్రవృత్తియందుఁ బెరిగిన వారిలో యీ వలపు యెదుగఁజాలదు. అట్లుండినను ఒకానొక సమయములో ఎఱుకకు వచ్చుచున్నది. అప్పుడు తన ప్రేమ పాత్రమైన వస్తువును వెదకులాడికొని అందువసించి తృప్తిగాంచును.

ఈ నాఁడు కామతృప్తికొఱకు యువకులు యువతీ జనములవెంటఁబడుట (Love) ప్రేమ యని చెప్పుచున్నారు. ప్రేమ కల్మష భూయిష్టము కానిది. నిర్మలమైనది. అరిషడ్వర్గాలకు వెలియైనది. ఒకరిపై లగ్నమైన ప్రేమ ఎన్ని యవాంతరములు కలిగినను తల్లిదండ్రులు తిరస్కరించినను, మఱి యొకరిపైకేఁజనదు. ఒకవేళ తనప్రేమించిన వ్యక్తి తన ప్రేమను గుర్తింపక పోయినను ఆవ్యక్తిని భావమునందధిష్ఠాన దేవతఁజేసికొని పూజించుచుండును. దైవవశాత్తు ఏదేని ఆపద ఆవ్యక్తికి సంభవించిన తనకు వాటిల్లినట్లు భావించి తపించును. తార్కాణముగ నెన్నేని యుదాహరణ లివ్వవచ్చును. స్థలాభావమున ఒకటిచూపి మానుకొందును. ఆదవ

(మిగత 15 వ పేజీలో)

# ప్రపంచ రాజకీయములు.

జెర్మనీ దేశముయొక్క అజేయమైన శక్తిని, ప్రాముఖ్యతను అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, దేశములు ఇప్పుడు గ్రహించినటుల మున్దెప్పుడును గ్రహింపలేదు. ప్రపంచములో శాంతిని స్థాపించుటకును, రష్యా కమ్యూనిజము వ్యాప్తిని అరికట్టుటకు జర్మనీ దేశముయొక్క శక్తియే శరణ్యమని అమెరికా దేశమువారికి ధృఢమైన నమ్మకము యిప్పుడేర్పడినది. రష్యాతో పోల్చిచూచిన చిన్నదైనను, రష్యాను వెనుకకు తరిమి తాఱుమాఱు చేయగలిగినది జర్మనీదేశమే. కడచిన రెండవ ప్రపంచ యుద్ధములో అమెరికా - బ్రిటను దేశములు జర్మనీతో సహకరించి యుండినచో, ఈ దినమునకు రష్యా దేశముకాని, కమ్యూనిజముకాని యింత ప్రబలముగా నుండెడిది కాదు. ఇట్టి అప్రతిహతమైన జర్మనీశక్తిని, అమెరికా, బ్రిటను దేశములు, రష్యాదేశముతో చేరి, పటాపంచలు గావించినందుకు ఫలితమును నేడా దేశములు రుచిచూచుచున్నవి. ఈదినము కాక పోయినను శ్రేపైనను జర్మనీదేశము మరల తలయెత్తి ప్రపంచమును గడగడలాడించగలదు.

* * *

పశ్చిమ జర్మనీ దేశములో పరిశ్రమలకు వలయు ముడిపదార్థములెల్ల చిక్కును. పరిశ్రమలలో గొప్పశిక్షణ పొందిన నిపుణులున్నారు. కావలసినంతమంది పనివారున్నారు. గొప్ప పరిశ్రమలున్నవి. ఏ క్షణములోనైనను జర్మనీదేశము తలయెత్తగలదనియు; తమ దేశమునకు ఉపద్రవముగ పరిణమింపగదనియు, రష్యావారు భయపడుచున్నారు. అందువలన జర్మనీ దేశములో సైనిక బలమును, ఆయుధ బలమును శాశ్వితముగ నిషేధింపవలెనని రష్యావారి యాశయమై యున్నది.

* * *

జర్మనీ దేశమును పునరుద్ధరించి, మిలిటరీ శక్తిలో ముందుండిన స్థితికి దెచ్చినకాని రష్యా కమ్యూనిజమును, పశ్చిమ దేశములకు వ్యాపింపకుండ చేయుట కష్టమని అమెరికా వారి భావము. ఈ యుద్దేశ్యముతోనె అమెరికావారు పశ్చిమ జర్మనీ దేశమును మిలిటరీ విషయములో బలముకలదిగా చేయవలెనని ప్రయత్నములను గావించిరి. కాని పశ్చిమ జర్మనీ దేశమును అమెరికా, బ్రిటీను, ఫ్రాన్సు దేశముల వారు సర్వస్వతంత్ర దేశముగ పరిగణించువఱకును అమెరికా వారి యుక్తులకు లోబడుటకు వీలులేదని బాన్ ప్రభుత్వము వారికి తెలిపియున్నారు. ఇది పరాక్రమము, ఆత్మగౌరవము కలదేశము యొక్క పద్ధతి.

* * *

రష్యావారి ఆయుధబలమును చూచి, అమెరికావారు భయపడుచున్నారు. అమెరికావారి ఆయుధ ఉత్పత్తి యుద్యమమును చూచి, రష్యా అనుమానపడుచున్నది. ఐరోపా ఖండములో, వివిధ ప్రదేశములలో అమెరికా స్థావరములను సంపాదించుకొనుటకుకూడ రష్యా గమనించుచున్నది. అందుకని ఆ యుధబలమును తగ్గించుటకు అన్ని దేశములు అంగీకరింపవలెనని రష్యా ప్రతి దినము; ప్రతి సమావేశములోను పట్టుదల చూపుచున్నది. రష్యాలోనే ఎక్కువ ఆయుధబలము కలదని అమెరికా మొదలగు దేశములకు అనుమానము కలదు. రష్యా దేశముయొక్క ఆయుధ బల పరిమాణము తెలుసుకొని, రష్యా యుద్ధ ప్రయత్నములను రహస్యముగ చేయుచున్నదని, ప్రపంచమునకు ఋజువు చేయవలెనని పశ్చిమ దేశముల ఆశయము. అందుకని ఆయుధబలమును తగ్గించుట కంగీకరించుటకు ముందు, యేయే దేశములలో ఎంతెంత ఆయుధ బలముకలదో పరిశీలింపవలెనని అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు దేశములు చెప్పుచున్నవి. అందువలన ఇప్పటికే పది వారములుగా ప్యారిస్ పట్టణములో అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, రష్యా దేశముల విదేశాంగ శాఖ డిప్యూటీ మంత్రులు సమావేశమై చర్చలు సాగించుచున్నను, విషయనిర్ణయ పట్టికను (Agenda) తయారుచేసికొన జాలకున్నారు. విషయ నిర్ణయ పట్టికను తయారుచేయు విషయములో అంగీకారము కుదిరినదని యిప్పుడే వార్తలు చేరినవి.

జాతీయ ఆదాయమునుండి అమెరికా దేశమువారు 100టికి 15%, బ్రిటను, ఫ్రాన్సు దేశములు 100టికి 9% ఆయుధ సామగ్రిపై కర్చుపెట్టుటకు తీర్మానించుకొనిరి. ఇది యుద్ధములేని కాలము. ఈ దేశములు ప్రజాసామ్య సిద్ధాంతములపై పరిపాలన సాగించు దేశములు. యుద్ధపరికరముల యుత్పత్తికై యింత ద్రవ్యమును కర్చుపెట్టుటకు సాధ్యశ్యమే కానరాదు.

* * *

పశ్చిమ దేశములవారికిని, అమెరికా వారికిని ఒక పేరోచన కలదు. గ్రీసులోను, కొరియాలోను కమ్యూనిష్టులు ఏ విధముగ జోక్యముకలిగించుకొని దురాక్రమణను సాగించిరో, అదే ప్రకారము తమ దేశములలోకూడ వారు ఉపద్రవమును కలిగింపవచ్చునని వారి భయము. అందుకనే తమదేశములలో ఆయుధ బలమును, సైనిక బలమును ఎక్కువ చేసుకొనుటకన్న వేరు మార్గము లేదని అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు దేశములు తలచు చున్నవి. పరస్పరము భయముకల యిట్టి దేశముల మధ్య సమర సభావము యెటుల యేర్పడునో - యెప్పుడు యేర్పడు

జనరల్ మ్యాక్ ఆర్థర్‌ను, సేనా నాయకత్వము నుండి తొలగించిన కారణములు తెలుపుచు, కొరియాలో యిప్పుడు సాగుచున్న యుద్ధమును, చైనాలోనికి వ్యాపింపజేయు ఉద్దేశము బొత్తిగా లేదని అమెరికా అధ్యక్షులు ట్రూమన్ గారు, జనరల్ మార్షల్ గారును తెలిపిరి. కొరియా యుద్ధమును పరిమితి చేయవలసిన అవసరమును వీరిప్పుడు గ్రహించిరి. 38-వ అక్షాంశ రేఖను ప్రపంచ ఐక్యదేశముల సేనలు దాటి, ఉత్తర కొరియాలో ప్రవేశించుట వివేకము కాజాలదని, శ్రీ జవహర్‌లాలు గారు ఎప్పుడో హెచ్చరించియుండిరి. అప్పుడు వారి మాటలు వీరి తలకెక్కలేదు. అందువలననే కొరియా యుద్ధము ఇప్పటికీ పూర్తికాకపోవుటకు కారణమైయున్నది. కొరియా యుద్ధము వల్ల ప్రత్యక్షముగా వచ్చేలాభము ఏమి తమకు లేదని అమెరికా వారు ఇప్పుడు చెప్పుచున్నారు. కాని వారికి లాభమున్నదో లేదో ఆమాటవేరు. యుద్ధకాలమును పొడిగించుటకు వారి మూర్ఖత, పట్టుదలయే కారణము. ప్రతిష్ఠలకై పెనుగులాడుటయే కారణము.

అమెరికావారికి నిజముగ ప్రపంచములో శాంతిని నెలకొల్పుటకు యిష్టములేదు. జాయింటు సెలెక్టు కమిటీ విచారణ సంఘము ఎదుట ఈ నెల 10-వ తేది జనరల్ మార్షల్ మాటలాడుచు కమ్యూనిస్టు చైనాకు ప్రపంచ ఐక్యదేశ సమితిలో సభ్యత్వము ఇచ్చుటకు అమెరికా ఎంతమాత్రము అంగీకరింపదని తెలిపెను. ఈ విధముగ అమెరికావారు నిజమునే గ్రహింపజాలక "కమ్యూనిజము" సిద్ధాంతముపైననే ఈర్ష్య చూపుచుండ ప్రపంచ శాంతి ఎట్లు నెలకొనును?

చైనాలో ఇండియా ప్రభుత్వ రాయబారియైన సర్దారు కె. యం. పణిక్కర్ గారు కమ్యూనిస్టు చైనా ఐక్యదేశము సమితికీ ఏలాటి సలహాలను ఇచ్చుటకు సంసిద్ధముగాలేదని ఇండియా ప్రధాన మంత్రిగారికి తెలియజేసియున్నారు.

—0—

## అష్టావధానములోని సమస్యలు-వానిపై పద్యములు.

( 2 వ పేజీ తరువాత )

7. గంటలు.

8. వివిధ సమస్యలు.

రవిగాననిచోఁ గవిగాంచు నేకదా?

చ॥ వివిధము లౌరహాస్యములు పెనుమబ్బులు చేరిదేశమున్
గపిసి చికాకుసేయు వడగండులు రాలునో? వానయేతుదిన్.
భువనము దన్నునో! యెఱుఁగబోలదు భావిని గాంచనేర్పున
త్కవి యొకరుండె చూడ (రవిగాననిచోఁ కవిగాంచునేగదా)

కవి ప్రకృతికి మగఁడా? కొడుకా?

సీ॥ తానసతియందు నందనతఁగాంచుఁ
బురుషుడందురు ధర్మప్రబోధమతులు
ప్రకృతినుండి యెతాను భావంబుఁగాంచ ఁ
గవి ప్రకృతిఁ గౌగిలించు మగండు నిజము॥

ముగింపు

ఉ॥ కోరినవారలెల్ల నొనగూడిరి కార్యము నిర్వహింపఁగా
భారవహుండవై శ్రమముపాటు నెఱుంగగనీక సర్వమున్
తీరిచితీవ! నీపయి నుతింగురియింపఁగ నీదు సొమ్మనీ
కే ఋణమిచ్చినట్లగు నిశే కరముల్ ముకుళింతు రాఘవా!—

—0—

# ఇండియా రాజకీయములు.

న్యూఢిల్లీ పట్టణమునుండి ఈ వారము ఒక శుభవార్త చేరినది. ఇండియా యూనియన్ అధ్యక్షులైన డా॥ రాజేంద్ర ప్రసాదుగారు ఉరిశిక్ష విధింపబడిన 12 మంది తెలంగాణా కమ్యూనిష్టు ఖైదీలు పంపుకొనిన "క్షమాపణ అర్జీని" అంగీకరించిరి. కనికరించి, వారిపై విధించిన ఉరిశిక్షను రద్దుచేసిరి. యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షగా మార్పుచేయుచు ఈ నెల 6-వ తేదిన ఉత్తరువు గావించిరని ప్రకటింపబడినది. కమ్యూనిష్టులను ఉరితీయక విడిచిపెట్టిరని సంతసించుట కాదు. న్యాయ విచారణలో అవకతవకలు జరిగినప్పుడు, ముద్దాయిలకు తమ నిర్దోషత్వమును ఋజువు చేసుకొనుటకు ఇవ్వవలసిన అవకాశములన్నియు యివ్వకపోయినప్పుడు, అట్టివారెవరైననుసరే, ముద్దాయిలకు విచారణ న్యాయముగా జరిగినదనుతృప్తి లేనిదే శిక్ష విధింప కూడదనే మావాదము. డా॥ రాజేంద్ర ప్రసాదుగారు నైతిక పథములో గాంధీజీకి చాల దగ్గిరవారు. ఉరిశిక్ష రాక్షస కృత్యమని గాంధీజీ అభిప్రాయము. కనుక డా॥ రాజేంద్రప్రసాదుగారు తెలంగాణా ఖైదీలపై ఉరిశిక్ష రద్దుచేయుచు గావించిన ఉత్తరువు న్యాయపరిపాలన యందు దీక్షకలవారందరికిని ఆనందము చేకూర్చును. గాంధీజీ హంతకుడైన నాథురామ్ గాడ్సేను ఉరితీయు సమయములో గవర్నరు జనరల్ గారికి అనేక క్షమాపణ విజ్ఞాపనలు పంపుకొనబడెను. డా॥ రాజేంద్రప్రసాదుగారే ఆ దినములలో గవర్నరు జనరలుగా నుండినచో, తప్పక వారు ఉరిశిక్షను తొలగించి, యావజ్జీవ శిక్షగా మార్పుచేసి, గాంధీజీ సిద్ధాంతములను నిలువబెట్టి యుండెదరనుటకు సందేహముండదు. అది అన్యథా జరిగినది. కడచిపోయినది. ఇప్పుడు యోచించియు లాభము లేదు.

* * *

ఇంకొక శుభవార్త. ఈ మధ్య చెన్నరాష్ట్ర మంత్రివర్గమువారు జనరల్ ఎన్నికలు 1952 సం॥ ఫిబ్రవరి నెల వరకు ఆపుదల చేయవలెనని కౌన్సిలు సభలో ఒక తీర్మానమును పెట్టించిరి. దానిని ఏకగ్రీవముగ అంగీకరింప జేసిరి. ఇండియా ప్రభుత్వానికి పంపిరి. జనరల్ ఎన్నికలు మరల వాయిదా పడునేమోయని దేశమంతయు ఆందోళన చెందుచుండెను. ఇండియా పార్లమెంటులో ఈ విషయమై శ్రీ పి. బసిరెడ్డిగారు ఒక ప్రశ్నను వేసిరి. డా॥ బి. ఆర్. అంబేద్కరుగారు ఆప్రశ్నకు ప్రత్యుత్తరమొసగుచు, చెన్నరాష్ట్ర కౌన్సిలు వారినుండి ఎన్నికలు వాయిదా వేయవలెనని సూచనగా వచ్చిన తీర్మానము సహేతుకముగ లేదు. జనరల్ ఎన్నికలు వాయిదా పడవు. నవంబరు-డిశంబరు నెలలలోనే ఎన్నికలు స్పష్టముగా జరుగునని తెలిపిరి. ఎప్పుడు క్రొత్త ఎన్నికలు జరుగునని తహతహపడుచున్న ప్రజలకు ఇది ముఖ్యమైన శుభవార్త కాదా?

* * *

ఎన్నికల ప్రచారము సాగించుటకై రేడియో సౌకర్యములు ఇతర పార్టీలవారికి కూడ కలుగజేసెదరా అని శ్రీ. హెచ్. వి. కామత్ గారు ప్రశ్న వేసిరి. శ్రీ ఆర్. ఆర్. దివాకర్ గారు పార్లమెంటులో ప్రత్యుత్తరమిచ్చుచు, ఆ విషయమై యోచించుటకు ఇంకను వ్యవధి [illegible] అనిరి. ఏమి వ్యవధి? కాంగ్రెసుపార్టీవారికి ఎన్నికల ప్రచారమునకై రేడియోలను ఉపయోగించుకొనుటకు ఎంత హక్కు కలదో ఇతర పార్టీవారికి కూడ అదే హక్కు కలదు కదా? దీనికై ఇంకను యోచన ఎందుకు?

* * *

ప్రజాప్రభుత్వానికి అపకీర్తి. ఈ [illegible] 5-వ తేది శ్రీ ఎం. వి. [illegible]గారి ప్రశ్నకు హోముశాఖా మంత్రిగారు, శ్రీ రాజగోపాలాచార్యులుగారు ప్రత్యుత్తరమిచ్చుచు 2,512 మంది సెక్యూరిటీ ప్రివెంటివ్ డిటెన్షను చట్టము క్రింద నిర్బంధములో నున్నారనియు, [illegible] గాను, శాంతిరక్షణకు గాను 2,444 గురు నిర్బంధింపబడినారనియు, బ్లాకుమార్కెటు వ్యాపారములు సాగించినందులకు - అక్రమ లాభములు పొందినందుకు 68 మంది నిర్బంధములో నుంచబడినారనియు, తెలిపిరి. ఇంత పెద్ద దేశములో 36 కోట్ల మంది ప్రజలలో, బ్లాకుమార్కెటు వ్యాపారము సాగించేవారును, అక్రమలాభాలు పొందేవారును 68 [illegible] సి. ఐ. డి. శాఖవారు [illegible] ఈ 68 సంఖ్యనుబట్టి యూహించుకొనవచ్చును.

* * *

ఇంకొక గొప్పవిశేషము జరిగినది. ఈ వారము ఇండియా పార్లమెంటు గావించిన ఘన కార్యములలో, విశ్వవిద్యాలయ బిల్లును ఆమోదించుట ముఖ్యమైనది. పరీక్షల మూలముననూ, పట్టముల మూలముననూ, విద్యయొక్క విలువను కొలుచుట ఈ దేశములో ఒక పెద్ద సాంప్రదాయముగ ఏర్పడినది. విద్యార్థులు తమ సంపూర్ణ ప్రతిభను పెంపొందించుకొనుటకు

అనుకూలమైన సంస్థలు ఈ దేశములో లేవు. ఈ దేశము లోనే కాదు. ఇతర దేశములలోగూడ లేవు. చిత్రలేఖనము, నాటకములు ఎంత ముఖ్యమైనవో, చరిత్ర, అర్థశాస్త్రము, ప్రకృతి శాస్త్రములు అంతే ముఖ్యమైనవని తలచి విద్యార్థులకు చెప్పువారులేరు. కాబట్టి ఒక్క విద్యా సంస్థలోనైనను మానవ విజ్ఞానము అభివృద్ధి నొందుటకై వలయు విషయము లన్నియు నేర్పుటకు అవకాశ ముండవలెను. ఈ దేశములో ప్రాచీన భాషలున్నవి. ఆ ప్రాచీన భాషలకును, సంస్కృతికిని ప్రాముఖ్య మొసగు ఒక్క విద్యాలయమైనను ఈ దేశమున నుండవలదా?

శాంతినికేతనములో డా॥ రవీంద్ర కవి చంద్రుడు సుమారు 30 సంవత్సరముల క్రిందట స్థాపించి, పోషించిన విశ్వభారతి విశ్వవిద్యాలయమును ఇండియా ప్రభుత్వము వారిప్పుడు తమ యాజమాన్యము క్రిందికి తీసుకొనుటచే ఈ లోటు తీరునని చెప్పవచ్చును. ప్రాచీన గురుకులములవలె విద్యార్థులు జనసామాన్యమునకు దూరమైన అడవి ప్రదేశము లలో నివసించి, ప్రశాంతముగ ప్రకృతి సౌందర్యములను కన్నులార గాంచుచు, వృక్షములనుండియు, పక్షులనుండియు, మృగములనుండియు, విజ్ఞానమును అభివృద్ధి చేసుకొనుట కనుకూలముండునని గురుదేవుని ఆశయమైయుండెను. హైందవ సంస్కృతికిని, పాశ్చాత్య సంస్కృతికిని సమైక్యత యేర్పడవలెనని కవిచంద్రుని తలంపుగా నుండెను. మేధావులు, విఖ్యాత రచయితలు, పాశ్చాత్య దేశములనుండి శాంతినికేతనమునకు వచ్చిరి. అక్కడనే ఉపాధ్యాయులుగ పనిచేయ మొదలిడిరి. ఈ విద్యాసంస్థకూడ ఇతర విద్యాలయములవలెనే ఆర్థిక యిబ్బందులకు లోనై, కడదినములలో గురుదేవునికి తొందర కలిగించెను.

తుదకు ఆయన సంకల్పబలము ఫలించెను. నాలుగు రోజులు ఇండియా పార్లమెంటులో చర్చ జరిగిన తర్వాత "విశ్వభారతి" బిల్లు ఆమోదింపబడెను. విశ్వభారతి విద్యాసంస్థయొక్క లక్ష్యములను నిర్వచించుచు, డా॥ పి. ఆర్. దేశముఖ్ గారు ఒక ముఖ్యమైన సవరణను ఉపపాదించిరి. వివిధ దృక్పథములనుండి సత్యమునకును - మానవుని మనస్సునకును గల సంబంధమును తెలుసికొనుట; ప్రాచ్య సంస్కృతిని పాశ్చాత్య దేశములవారికి అర్థమగురీతి వెల్లడిచేయుట; హిందూ, బౌద్ధ, జైన, ఇస్లాం, సిక్కు, క్రైస్తవ మతములు, నానినాగరికతను సంబంధించిన చరిత్రలోను, కళలలోను, శాస్త్రములలోను, శాంతినికేతనము పరిశోధనలు గావించుటకు కేంద్రముగా నుండవలెనని నిర్వచింప బడినది. ఆసవరణ ఆమోదింపబడెను. బెంగాలురాష్ట్ర సెకండరీ బోర్డువారి యాజమాన్యము క్రింద విశ్వభారతి విద్యాపీఠము యుండ కూడదనియు; విద్యాపీఠ పరిదర్శకులు (విజిటర్స్) విద్యా ప్రణాళికల విషయములో జోక్యము కలిగించుకొనకూడదని యు సవరణలు డా॥ శ్యామప్రసాదముఖర్జీగా రుపపాదించిరి. అవి ఆమోదింపబడెను.

"ఇది (విశ్వభారతి) అపూర్వమైన విద్యాసంస్థ. ఇతర విశ్వవిద్యాలయములు అనుసరించుచున్న మామూలు మార్గమునే ఈ విద్యాలయము అనుసరింపకూడదని మా ఆశయము. ఇండియా ప్రభుత్వముగాని లేక విద్యాశాఖమంత్రి కాని స్వతంత్ర మార్గములో ఈ విద్యాపీఠము అభివృద్ధి చెందుటకు మాత్రమే తోడపడవలెనని" ఈ విశ్వభారతి చాన్సెలరు గారైన పండిత జవహర్‌లాలు గారు నుడివిరి. వారి సంకల్పము నెరవేరుగాక! విశ్వభారతి ప్రపంచమున కంతయు ఉపకరించు విశ్వవిద్యాలయమై "విశ్వభారతి" అను పేరును సార్థక మొనర్చుకొనుగాక!

## కడపలో నీటి కఱవు.

ఆర్యా, కడపలో ముఖ్యముగా గమనింపవలసినలోటు నీటివసతి. ఇట్టినీరు కడప పురజనులకు చాలినంత లభించుట లేదు. సరిగా లెక్కవేసి చూచిన కడపలో సుమారు 60 కొళాయిలకు నోరులేక కేవలము పంపు మాత్రమేయుండి నీరు వృథాగా పోవుచున్నది.ఇంక అటుల కొళాయి లేక పంపుమాత్రమే యుండుచోట్ల కొందరు కొళాయి తెచ్చివేసి "ఇది మాకొళాయి, మాకు కావలసినంత తీసుకొన్న పిమ్మట మీరు నీరు తీసుకొనిపొండి" అని దౌర్జన్యముగా ప్రజలను బెదిరించి తీసుకొని పోయెదరు. ప్రజలు పాపము ఏమీ యుచేయజాలక బొమ్మలవలె నిలబడి తమఅదృష్టమును నిందించుకొనుచు పోయెదరు. అట్టికొళాయి ఉదాహరణమునకు ఏ/28 ఏ/29 ఎలెక్ట్రిక్ స్తంభములమధ్య, డిప్యూటీ ప్రొహిబిషన్ ఆఫీసు యొద్దనున్నది.

ఈ నీటి విషయములో పూర్తిబాధ్యత పురపాలక సంఘము వారిది. పోనీ నీరు సరిగ వదలిన ఈ కష్టమే లేదు. అరగంట లేదా పావుగంట కెక్కువ వదలరు. అది కొన్ని చోటులందు పగలు కొన్ని చోటులందు మధ్యాహ్నము కొన్నిచోట్లలేనే లేదు. కొన్నిచోట్లు పురపాలక సంఘము వారి బారి తెచ్చి నీరు సప్లయి చేయుచున్నది. ఈవిధముగా నుండిన ప్రజలకు ఎట్లు సులభముగా దొఱుకును. కనుక పురపాలక సంఘము ఈ నీటి కొరతను త్వరగా తీర్చి వేయవలయును. ప్రజలకు చాలినంత వీధికి 2, 3, కొళాయిలు వేయించవలయునని పురపాలక సంఘమువారిని ప్రార్థించుచున్నాము. 16-వ వార్డు బోరెడ్డి వీధిలో సుమారు 500 ప్రజలు కలరు. అంతమందికి గల వీధికి, ఒక కొళాయి మాత్రమే కలదు. కనుక ఇట్టివియింకా సరిగాచూచిన ఏన్నోకలవు. పురపాలక సంఘమువారు దీనిపై తగు శ్రద్ధ తీసుకొని పురజనులకు నీటి విషయమై కొరతలేకుండ చేయుదురని ప్రార్థన.

కడప. —— జె. గోవిందరావు, విద్యార్థి.

## ఆంధ్రుల కళాప్రతిభ.

ఆర్యా!

రమారమి, ఋగ్వేదకాలమునుండి ఆంధ్రులు లలితకళలలో విశిష్టతనుగడించి, సముత్తుంగ యశోశృంగాన్ని అధిరోహించిరి. అన్యవిషయాలకుగూడ మార్గదర్శకులైయుండిరి. శిల్ప, చిత్రకళ, కవిత్వ, సంగీతనాట్యాలయ నిర్మాణాది సమస్త కళారంగాలలో ఆంధ్ర ప్రతిభ, ఆంధ్ర విశిష్టత, ఆంధ్ర ప్రజ్ఞ, ఆంధ్ర ప్రత్యేకత ఆంధ్ర వ్యుత్పన్నత ప్రదర్శించిరి. పైనుదహరించిన వన్నియు ఆంధ్ర జాతిలో సంపూర్ణంగా సంశోషించి ఆంధ్ర జాతి "కళామయ జాతి" యని నిశ్శంకగా చెప్పుటకు ధైర్యము నొదగూర్చినది.

తెలుగువారు మహాసామ్రాజ్యాలను నిర్మించిరి. విస్తీర్ణ రాజ్యాలను అప్రతిహతముగా పాలించిరి. పరసర రాజ్యాలపై ఏకచ్ఛత్రాది పత్యెతవహించిరి. పూర్వ పశ్చిమ చక్రవాళ కాలములో వీరి జయ భేరీస్వనాల ప్రతిఘోషింపచేసిరి. శాతవాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయులు, విజయనగరరాజు ఒకరితర్వాత నొకరు, ఒకరికిమించి ఒకరు, శ్వేతాంభ్రేకచ్ఛత్రాలను ముడవసండా అలంకరించి దాని తళుకును దాని బెళుకును, దశదిశల విసరివేసిరి. కళారాధన, సౌందర్యార్చన ఆంధ్ర దైనందిన జీవితాధఃపతిలో ముప్పిరిగొని, ఆంధ్రజాతిని ప్రతిభా సంయుక్తముగా యొనర్ప చాలినది.

ప్రాచీనాంధ్ర కళాప్రతిభ, కన్నులారగాంచి, భూజౌన్నత్య ప్రవరత్వాని కుప్పొంగి, భవిష్యత్కాలములో శిల్పిస్థి ఉత్సాహవంతులై నూత్నకళా దీక్షోన్ముఖులు కావలయుననిన, ఆంధ్రకళా సరస్వతి యొక్క అమరత్వానికి కీర్తి చిహ్నాలైన అజంతా, ఎల్లోరా, అమరావతి, ఘంటశాల, నాగార్జునుడి కొండ, మాచెర్ల, చేజర్ల, చేబ్రోలు, భట్టిప్రోలు, దాక్షారామము, సంఘారామము, విజయనగరము, హంపి, కాళహస్తి, తిరుమల, చంద్రగిరి, లేపాక్షి, కంచి, మహాబలిపురం, మధుర, రామేశ్వరం మొదలగు సుప్రసిద్ధ ప్రదేశాలకు పోయి చూడవలెను.

ఈమధ్య కొలదికాలము మాత్రము ఆంధ్రశిల్పం, ఆంధ్రకళ, ఆంధ్రనాట్యం కొంత మరుగువడినా దేశములో ప్రబలిన జాతీయోద్యమాల ఫలితముగా, మరలా ఉత్తేజ పత్తేజాన్ని అలవటించుకొని, చండప్రచండగతిని అగ్రస్థానం వహించినది.

స్వర్గీయ దామెర్ల రామారావు, అడవి బాపిరాజు, చామకూర సత్యనారాయణ, నూతలపాటి నరసింహము, దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మ ప్రభృతులైనవారి ఆంధ్ర కళాకృషి ప్రస్తుతింప దగినది.

కానీ నేటికి ఆంధ్రకళ ప్రతేకతను, ప్రతిభను, ప్రజ్ఞను, ప్రవరత్వాన్ని, విశిష్టతను ఆర్జించకలిగినను, బాహ్యజగత్తుకు తన నూతన విజ్ఞాన విభవాన్ని ప్రస్ఫుటము కావింపజాలకపోయినది. ఆంధ్రకళను, మరింత అనర్ఘళముగా అభివృద్ధి చేసి బాహ్య కళాప్రపంచమునకు అందజేయగలరని ఆశించుచున్నాను.

'అరుణ.'

[9-వ పేజీ తరువాత]

యెడ్వర్డు ప్రేమితురాలు కొరకై దిశావలయిత రాజ్యమునకు తిలోదకము విడలేదా?

ఒకప్పుడే ప్రేమ మానవ మాత్రులపై ఏదేని వస్తువుపై నిలుచుటయుఁగలదు. కొందఱు విత్తమునందో మరికొందఱు ప్రాపంచికముగాని మోక్షసాధనకు భగవంతునియందో తమ ప్రేమనుంచుదురు. ధనముపైనున్న, ఆశయనియుఁ జెప్పబడుచున్నది.

# భారత జ్యోతి

( ప్రతి బుధవారము ప్రకటింపబడు తెలుగు, ఆంగ్ల, రాజకీయ వార పత్రికలు.)

## చందా వివరములు

| | | |
|---|---|---|
| తెలుగుప్రతి:- | సంవత్సర చందా రూ | 9—0—0 |
| | విడి సంచిక ... | 0—3—0 |
| ఆంగ్లప్రతి:- | సంవత్సర చందా ... | 4—8—0 |
| | విడి సంచిక ... | 0—1—6 |
| రెండుచేరి:- | సంవత్సర చందా ... | 13—0—0 |
| | విడి సంచిక ... | 0—4—0 |

## ప్రకటన రేట్లు

| | | |
|---|---|---|
| పూర్తిపేజి | ఒకదఫాకు ... ... ... | రూ 80—0—0 |
| అర్ధపేజి | ,, ... ... ... | రూ 45—0—0 |
| ఒక అంగుళము | ,, ... ... ... | రూ 6—0—0 |

కంట్రాక్టు రేట్లకు, ఇతర వివరములకు:

257, ట్రంకు రోడ్డు,
పోష్టు బాక్సునంబరు 10,
కడప.

మేనేజరు,
"భారత జ్యోతి"

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE."
PRINTER: K. R. JOSHEE :: PUBLISHER: V. R. GOPALAKRISHNA
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

# భారత జ్యోతి

సంపాదకులు:– సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4. సంచిక–18. | బుధవారము మే, 30 1951. | ప్రతి బుధవారము వెలువడును.


## విషయానుక్రమణిక.

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 18. | శ్రీ ఖర సం॥ వైశాఖ బ. ౧౦, మే 30, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## ప్రజల జాబులను సి. ఐ. డీ లు పరీక్షించుట.

శ్రీ రాజగోపాలాచార్యులు గారు ఎప్పటికి కాని పోలీసువారి చర్యలను ఖండించెదరని తలచుటకు వీలులేదు. వారు చెన్నరాష్ట్రములో ముఖ్యమంత్రిగా నుండినప్పుడు ఒకటే - ఇప్పుడు యూనియన్ ప్రభుత్వములో హోము శాఖా మంత్రిగా నున్నను ఒకటే. క్రింది అధికారుల చర్యలను సమర్థించుట వారి సహజ స్వభావము. గాంధిజీ తన జీవిత కాలములో ప్రభుత్వచర్యలను విమర్శించినట్లు ప్రపంచములో ఇక ఏవ్యక్తియు విమర్శించి యుండడు. శ్రీ రాజగోపాలాచార్యులు గారికి గాంధిజీతో సన్నిహితమైన సంబంధము అనేక సంవత్సరములుగ ఏర్పడియుండెను. కాని తప్పులను నిర్భయముగ ఖండించుటలోగల అద్భుతమైన గుణము శ్రీ రాజగోపాలాచార్యులగారికి అబ్బలేదు. దుర్మార్గమును నిప్పువలె కాల్చివేయు శక్తి, స్వభావసిద్ధముగ శ్రీ జవహరిలాలు యందుండినది. నిర్వీర్యులైన శ్రీ రాజగోపాలాచార్యుల వారినిబోలు వారును, వయస్సు మించినవారును కేంద్ర మంత్రి వర్గములో చేరుటవల్ల, ఆయన తీవ్రతయంతయు మారిపోయెను. ఎల్లరిచే ఖండింపబడిన పోలీసు పరిపాలనమే దినదినమునకు దేశములో ఎక్కువగా పాదుకొనుటకు అవకాశము లభించెను.

ఇండియాపార్లమెంటు సభ్యుడైన శ్రీ యస్. యన్. సింహాగారు సి. ఐ. డి. పోలీసువారు పోస్టాఫీసులలోనికిపోయి, ప్రజలయొక్క జాబులను, పార్లమెంటుసభ్యుల జాబులను పరీక్షించుచున్న విషయము, దాచివేయు విషయము, ప్రభుత్వదృష్టి నాకర్షించినదాయని మే నెల 23-వ తేది పార్లమెంటులో ఒక ప్రశ్న వేసిరి. దానికి హోము శాఖామంత్రి శ్రీ రాజగోపాలా చార్యులవారు ఒకవింతయైన ప్రత్యుత్తర మొసగిరి. ఆ విషయమై వ్రాతపూర్వకమైన ఫిర్యాదు ఒక్కటిమాత్రమే ప్రభుమునకు చేరినది. ఆఫిర్యాదులో దెలుపబడిన ఆరోపణలలో నిజము లేదని చెప్పిరి. ప్రజల ఉత్తరప్రత్యుత్తరములను తనికీచేసి తీసికొను పద్ధతి విస్తారముగ వ్యాప్తిలో లేదనియు దెలిపిరి.

పోస్టులు శాఖమంత్రిగారైన జనాబ్ రాఫీ అహమద్ కిద్వాయిగారు ఇదే విషయమై అప్పుడే మాటలాడుచు సి.ఐ.డీ.పోలీసులు ప్రజల ఉత్తరములను తనికీచేయుచున్నారని అనేకఫిర్యాదులు ప్రభుత్వమునకు చేరినవి. ఆకస్మికముగా పోస్టాఫీసుల లోనికి తనికీ విషయమై పోయినప్పుడు, ప్రభుత్వమువారి అనుమతి లేకుండనే సి. ఐ. డీ. పోలీసువారు ఉత్తరములను పరీక్షించి తీసికొనుట, నేను చూచితిని. హోము శాఖా మంత్రితో ఈ విషయము చర్చింపబడెను. ప్రభుత్వమువారి అనుమతి లేకుండ ఆ విధముగ ప్రజల ఉత్తరములను సి.ఐ.డి. వారు చూచి, దాచకూడదని కఠినముగా ఉత్తరువులు జారీచేయబడిన''వనియు తెలిపిరి.

హోము శాఖామంత్రిగారికి వ్రాతపూర్వకమైన ఒక టేఒక్క ఫిర్యాదు వచ్చినదట. అందులోని విషయములు నిరాధారములట. తపాలా శాఖా మంత్రిగారికి అనేకమైన ఫిర్యాదులు చేరినవట. అందులోని విషయములు నిజమా, అసత్యమా

అని ఇతరులకు వ్రాసి తెలుసుకొనుటకు అవసరమే లేకుండ, తానే పోస్టాఫీసులకు తనిఖీకి పోయినపుడు సి. ఐ. డి. పోలీసువారు ప్రజల జాబులను తీసుకొనుచుండుట స్వయముగ చూచిరట. ఆవిషయమై హోమ్‌శాఖా మంత్రిగారితో కూడ చర్చించిరట.

ఒకే విషయముపై పార్లమెంటులో ఒకే దినము, హోమ్‌శాఖ మంత్రిగారొసగిన ప్రత్యుత్తరములోను, పోస్టలు శాఖమంత్రి గారొసగిన ప్రత్యుత్తరములోను, ఎంతటి భేదమున్నదో పాఠకులే గ్రహించెదరుగాక. ఇది ఒక గుణపాఠముగ పెట్టుకొని రాబోవు ఎన్నికలలో తీవ్రమైన చైతన్యముగల యువకులనే శాసనసభ్యులుగను, పార్లమెంటు సభ్యులుగను, మంత్రులుగను, ఎన్నుకొందురుగాక! లేనియెడల స్వతంత్ర దేశములో పోలీసు పరిపాలనమే పాదుకొనిపోవును. ఎక్కువ బలపడిపోవును.

# మతదూషణ చేయుటకు న్యాయ శాఖమంత్రికి హక్కు ఉన్నదా?

డా॥ భీమరావు రాంజీ అంబేద్కర్‌గారు ఇండియా ప్రభుత్వ న్యాయశాఖా మంత్రి. ఇండియా రాజ్యాంగ చట్టములో ప్రాథమిక హక్కుల క్రింద ఒసగబడిన వాక్స్వాతంత్ర్యమును, భావ స్వాతంత్ర్యమును, పత్రికా స్వాతంత్ర్యమును నీలకలిపి, హిట్లరు పరిపాలనమును స్వతంత్ర భారత దేశములో పునరుద్ధరించుటకై, ఇండియా ప్రధాన మంత్రి, ఇటీవల పార్లమెంటు సభలో ప్రవేశపెట్టిన రాజ్యాంగ సవరణ బిల్లును సమర్థించుచు, దీర్ఘోపన్యాసము చేసిన ప్రముఖులలో డా॥ అంబేద్కర్ గారొకరు. ఈ విషయమును పాఠకులు జ్ఞాపకముంచుకొనవలెను.

ఈ దేశములో అదృష్టమువల్లనో, దురదృష్టమువల్లనో, అధికసంఖ్యాకులగు ప్రజలు హిందువులు. కనుక ఈ దేశములో ఇప్పుడు తత్కాలికముగ వ్యవహరించుచున్న ప్రభుత్వముకాని లేక ఇకముందు ఏర్పడబోవు ప్రభుత్వములుకాని హిందువుల సానుభూతిపైననే ఆధారపడి యుండును. ఈ విషయముకూడ పాఠకులు గమనింపవలెను.

ప్రతివారికిని మత విషయములో స్వాతంత్ర్యముండవలెను. ఎవరికి ఇష్టమొచ్చిన మతమును వారు అవలంబింపవచ్చును. ఇతరులకు బోధింపవచ్చును. మతవిషయమై సంపూర్ణ స్వాతంత్ర్యమున్నది కదాయని - ఇతరుల మతములను తూలనాడి, మతవైషమ్యములను రేచ్చగొట్టుటకు ఎవ్వరికిని హక్కులేదు. అది చట్టవిరుద్ధము. శిక్షార్హము.

డా॥ అంబేద్కర్‌గారు బౌద్ధమతావలంబకులు. బౌద్ధమత వ్యాప్తియందు ఎక్కువ పట్టుదల కలవారు. బౌద్ధమత సిద్ధాంతమును క్రోడీకరించి ఒక గ్రంథముగ ప్రకటించుటకు ప్రయత్నించుచున్నారు. ఒక ప్రార్థన గీతావళి తయారుచేసిరి. ఇదంతయు మంచిదే. ఎవ్వరికికాని అక్షేపణయుండజాలదు.

ఇటీవల న్యూఢిల్లీపట్టణములో బౌద్ధజయంతి జరిగినది. ఆ సందర్భములో బుద్ధభగవానుడు ప్రపంచములోనుండు మానవకోటికి ఒసగిన దివ్య సందేశమును గుఱించి మాటలాడుటకు బదులు హిందూమతమును, మత సాంప్రదాయములను తూలనాడుచు, నోటికి వచ్చినట్లు తిట్టుటకు ప్రారంభించిరి. "హిందూమతము జార్జన్యముపైనను, సాంఘిక విభేదములపైనను, శృతులలోని సూత్రములపైనను ఆధారపడియున్నది. హిందూమతము నైతిక సిద్ధాంతములను బోధింపదు. దేవతలను పూజింపమనియు, బ్రాహ్మణులకు అన్నము పెట్టమనియు ఆమతము బోధించును. అందువలననే ప్రజలలో నైతిక పతనము కలిగినది. ప్రభుత్వములో లంచగొండితనమున్నందుకదియే కారణ" మని చెప్పిరి.

డా॥ అంబేద్కర్ గారికి హిందూమతమనిన ఏమియో తెలియునా అని సందేహము కలుగుచున్నది. హిందూమతము మహోన్నతమైనది. అందులో బ్రాహ్మణుడనికాని, బ్రాహ్మణేతరుడని కాని, చండాలుడని కాని విచక్షణలేదు. జాతి, మత, కులభేదములకును, దేశ కాలములకును అతీతమైనది హిందూమతము. విశ్వమానవ ప్రేమ, సర్వమానవ సమత్వమే ఉపనిషత్తుల మతముయొక్క మూల సిద్ధాంతములు. ఉపనిషత్తుల మతము ఒక్కటే మానవ ఔన్నత్యము నంగీకరించినది. మానవుడే దైవమని, "బ్రహ్మ"మని నిర్వచించినది. మానవుని కంటికి గోచరించు చరాచర సృష్టియంతయు దైవస్వరూపమనియు, 'బ్రహ్మ'మనియు ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. శ్రీరామచంద్రుడు బ్రాహ్మణుడుకాడు. శ్రీకృష్ణుడు బ్రాహ్మణుడుకాడు. నందనారు బ్రాహ్మణుడుకాడు. స్వామి వివేకానందుడు బ్రాహ్మణుడుకాడు. వ్యాసుడు బ్రాహ్మణుడు కాడు. వాల్మీకి బ్రాహ్మణుడుగాడు. వీరందరు బ్రాహ్మణేతరులే. కాని వీరినందరిని ఎక్కువ భక్తిభావముతో చూచువారు బ్రాహ్మణులే. ఉపనిషత్తుల మతములో దౌర్జన్యము లేదు. విగ్రహారాధలేదు. బ్రాహ్మణులను వారే లేరు. వారిని మేపమని ఎచ్చట చెప్పలేదు. సర్వమత సిద్ధాంతములను సమన్వయించుకొనగలది ఈ ప్రపంచములో ఒక్క (హిందూమతము) ఉపనిషత్తుల మతము తప్ప మరేదియులేదు. బౌద్ధమత సిద్ధాంతములన్నియు ఉపనిషత్తులలో నిండియున్నవి. డా॥ అంబేద్కర్ గారు ఇండియా ప్రభుత్వ న్యాయశాఖ మంత్రిగా నుండవచ్చును. కాని ఇట్టి ఉన్నత భావోపేతమైన ఆదర్శములతో నిండి, ఉపనిషత్తులపై ఆధారపడియున్నను మతమును దూషించుటకు వారికెంతమాత్రము హక్కులేదు. వాక్స్వాతంత్ర్యములోను, భావస్వాతంత్ర్యములోను ఇండియా న్యాయశాఖామంత్రిగారికి మాత్రము మినహాయింపు ఉండబోదు.

అవినీతి ప్రబలి లంచగొండితనముతో నిండిన ప్రభుత్వములో తానెందుకు మంత్రి పదవిలో నున్నాడో అర్థమగుటలేదు. హిందువుల సానుభూతిపై ఎక్కువగ ఆధారపడియుండు ప్రభుత్వములో ఒక్కనిమిషముకూడ ఉండుటకు డా॥ అంబేద్కర్ గారికి నైతిక హక్కులేదు. వెంటనే రాజీనామా యొసగి తొలగవలసినదే:—

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనముల క్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి, ప్రకటింపవలయునో తెలియకున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయుజాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటించుటకెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము:—

సంపాదకులు:—
"భారత జ్యోతి"

సాహిత్య చర్చలు — విద్యార్థుల ఉపయోగార్థము:—

# సంస్కృత నాటకములలో సఖిపాత్ర

శ్రీ జటావల్లభుల పురుషోత్తం

సంస్కృత నాటకములలో సఖిపాత్ర ఉపపాత్రలలోనిదేయైనను ప్రధానపాత్రయగు నాయకురాలి పాత్రపోషణకును, ప్రధాన రసమగు శృంగార రసముయొక్క పరిణతికిని, కథా సంవిధానమునకును అత్యంతము ఉపకరించునదగుటచే మన దృష్టిని ప్రత్యేకముగ నాకర్షించును. ఈపాత్ర కిట్టిప్రాముఖ్యము శృంగార రసప్రధానములగు నాటకములలోనే యుండును. ఎచ్చటపట్టినను సఖులు ప్రాకృత భాషనే వాడినారు. కాని వారి వాక్చమత్కృతిని, పరిజ్ఞానమును, సభ్యతను పరిశీలింతుమేని వారు సంస్కృతమనస్కులని తెల్లము కాగలదు. కొన్ని ప్రసిద్ధ నాటకములలో సఖపాత్రలెట్లు నిర్వ్యాఘములైనవో చూతము.

క్రీస్తుశక మేడవశతాబ్దివాడైన శ్రీహర్ష చక్రవర్తి రచించిన రత్నావళి, ప్రియదర్శికా నాటకములలో సఖపాత్ర లుదాత్తముగా చిత్రింపబడినవి.

సాగరిక యనునామాంతరముల రత్నావళి స్వజనముకెల్ల దూరస్థయై కేవలము రక్షణ నిమిత్తమై వత్సరాజైన ఉదయనుని యాస్థానము చేరి, కాలక్షేపము చేయుచు తుదకు మహారాజునే ప్రేమించును. ఇది హాస్యాస్పదముగ గన్పట్టు విషయము. కాని తనయభీష్టము నెరవేరనిచో ప్రాణము విడునంత గాఢముగా నామె రాజుపై లగ్నచిత్తయాయెను. ఆశారేఖ యిసుమంతయు లేని యాగాఢాంధకారములో నామెకు దివ్యజ్యోతియై ప్రోత్సాహమొసగి మార్గదర్శకయైనది. యామె సఖియైన సుసంగత, సాగరిక నిర్జన ప్రదేశములో కూర్చుండి వత్సరాజు చిత్రపటము గీచుకొనియైనను చిత్తవిశ్రాంతి గోరియున్నప్పుడు, ఆ చిత్రమును రహస్యముగా చూచి యామె సాహసమును నిందించుటకు బదులుగా "ఇట్టి యున్నత లక్షణములుగల కన్య రాజునుతప్ప మరెవ్వరిని వరించును? రాజహంసి కమలాకరమునుకాక మరిదేని నాశ్రయించును. (కమలాకర ముజ్ఝిత్వా నాన్యస్మిన్ రాజహంసీ అభిరమతే!)" అని యామె యభీష్టమును సమర్థించును.

తాను గీచిన చిత్రమును సుసంగత చూచినదని సిగ్గుపడిపోయిన రత్నావళి "సఖీ, ఇది మదన మహోత్సవమగుటచే నేను భగవానుడైన అనంగుని చిత్రము గీచినాను" అనిచెప్పి యామెను మభ్యపెట్టచూచును. "నీవు మన్మథుని వ్రాసితివి కావున నేనురతీదేవిని గీచెద"నని పల్కి యామె యక్కడ రత్నావళి చిత్రమునే గీయును. రత్నావళి కోపముతో "ఇదియేమి రతీదేవి అని ప్రశ్నింప, సుసంగత నీవెట్టి మన్మథుని గీచినావో నేనట్టి రతీదేవినే లిఖించినాన" ని చెప్పును. తర్వాత రాజుచిత్రమును చూచి ఎంతయో మెచ్చుకొనును.

నాటకములలో సఖులుగ గన్పట్టు యువతులు విశేష విద్యావైదగ్ధ్యముగలవారు కాకపోయినను, చిత్రకళాదుల యందెట్టి ప్రావీణ్యము గలవారుగా నిరూపింప బడినారో యనుట కిదియొక ఉదాహరణము.

తమ నెచ్చెలిపట్ల నెట్టి నిర్వ్యాజ ప్రేమ గలవారుగా సఖులు సంస్కృత నాటకములలో చిత్రింపబడినారో యనుటకెన్నియో నిదర్శనములు గలవు. రాజు విదూషకునితో సాగరికాగతమైన వాంఛను తెలుపుచుండగా సుసంగత యటకేగును. "ఈముఖర వాసవదత్తతో నీ ప్రణయగాథను చెప్పకుండుటకై దీనికి పారితోషికము నిమ్ము" అని విదూషకుడు సూచించును. రాజు స్వర్ణకటకమును దీసి సుసంగత కీయబోవును. అంత సుసంగత సాగరికపైని అకలుషమైత్రిని

గన్పరచుచు నాటకమును నిరాకరించి "ప్రభూ, నేనీ చిత్రపటములో తనబొమ్మగీచినానని నాపైని కినిసిన నాసఖియైన సాగరిక కదళీగృహములో నున్నది. నాపై నీకనుగ్రహము కల్గినదికాన ఆయనుగ్రహమును నాకు హేమకటక మిచ్చుట రూపమున కాక, ఆమెను ప్రసన్నురాలినిగా చేయురూపమున కన్పరుప గోరుచున్నాను." అనును. అదే యవకాశముగాతీసికొని, రాజు సాగరికను సమీపించును. అతిడామెను బ్రతిమాలినపుడు సుసంగత నైపుణ్యముతో "రాజా, ఈమె అతికోపన. ముంజేయి పట్టుకొని యామెను బ్రతిమాలవలయును." అని సూచించి వారి సంధానమునకు తోడ్పడును.

వత్సరాజు ప్రథమభార్యయైన వాసవదత్త సాగరిక బయట రాకుండగను, రాజుకంటబడకుండగను చూచుచుండవలసినదిగ పరిజనమును కఠినముగా ఆజ్ఞాపించును. అట్టి పరిస్థితిలో సఖియైన సుసంగత సాగరిక నెట్లయిన రాజుతో సమావేశపరుప నెంచి ఆమెకు వాసవదత్త వేషము వేసి, తాను వాసవదత్త పరిచారకయైన కాంచనమాల వేషము వేసి యామెను రాజునొద్దకు తీసుకొనిపోవును. సఖులు తమ నాయికను నాయకుని దరిచేర్చుటకై యిట్టిమాయలను పన్నుట చాల నాటకములలో కలదు.

సఖులు విశేష విద్యావతులు కానున్నను సంస్కృతి గంధవిలసితలనియు, వాక్చమత్కృతిలోను, లలితకళలోను నిపుణులనియు నిదివరకేచూచియున్నాము. విద్యాస్ఫారములైన రాజాస్థానములలోనుండు వారలకిట్టి సంస్కృతి కల్గుటలో నాశ్చర్యములేదు. ప్రియదర్శికా నాటికలో నొక అంతర్నాటిక కలదు. అందు ఉదయన మహారాజు ఉజ్జయినీ రాజకుమారియగు వాసవదత్తను తన పాండిత్యముచే హరించుట మనోహరముగ నిరూపింపబడినది. ఈఅంతర్నాటికలో పాత్రలు ధరించిన వారు వాసవదత్త సఖులగు మనోరమ, కాంచనమాల. స్త్రీలు పురుషపాత్ర ధరించుట కూడ అందుకాననగును. సఖియైన మనోరమ ఉదయన మహారాజు వేషము ధరించును. నాటిక రెండవనాడుకూడ కొనసాగును. అపుడామె తన నేపథ్యమును మహారాజుకే యిచ్చును. మహారాజా దుస్తులను ధరించి యితరులు గుర్తింపనిరీతిగా తన పాత్రను తానే నటించును. నాయికయైన ఆరణిక వాసవదత్త వేషమును వేయుటచే రాజునకును, ఆమెకును దర్శన స్పర్శన భాషణాద్యవకాశమును రంగస్థలముమీద నైనను కల్పించుటకే మనోరమ రాజువేషమును వేయుటలో తోడ్పడినది. తన సఖియైన ఆరణికయొక్క ప్రణయగాథలో నామె కేదోరీతిగా తోడ్పడుటకై మనోరమ యిట్లు చేసినది. వాసవదత్త ప్రేక్షకురాలుగా నుండనేయున్నది. ఆమె యీపన్నగడను కనిపెట్టుచో తనకు ఇక్కట్లు వాటిల్లునని మనోరమకు తెలియును. అయినను సఖీహితమునకై సాహసకార్యమున కొడంబడినది. ఈరీతిగా సఖులు శృంగారనాయికాహితైషిణులై తెగింపు పనులకు పూనుట చాల నాటకములలో కాంచనగును.

అంతర్నాటికలోని వాసవదత్తకు సఖిగానున్న కాంచనమాలయు చాతుర్యమును, సఖీహిత సాధకత్వమును చూపును. వాసవదత్త తన వీణావైదగ్ధ్యముచే వత్సరాజు హృదయము నాకర్షించును. సంగీతోపాధ్యాయు డగుటచే వత్సరాజు ఆసనముపై ఉపవిష్టుడగును. వాసవదత్త కూర్చుండుటకు చోటులేదు. కాంచనమాల ఉదయనునితో "ఆర్యా, మాసఖి యిప్పుడే వీణాగానముచే మీ మెప్పు పొందినదికదా! వీణాచార్యులగు మీరు కూర్చున్న ఆసనముపై తాను కూర్చుండుటకా రీతిగా అర్హతను సంపాదించుకొనలేదా?" అనును. వెంటనే యాతడు వాసవదత్తను తన ప్రక్కన కూర్చుండబెట్టుకొనును. కాంచనమాల అంతటితో నాగక "ఓరాజా, మాసఖి వీణానాదముచే స్వీకృతాంగియైయున్నది. ఈమె నోదార్చుము." అనును. ఇదియు వత్సరాజును మఱియొకయడుగు ముందునకు తీసుకొని వెళ్లినది. అతడు "మంచిమాట చెప్పితివి. అట్లేచేయుదును" అనును.

[సశేషము.]

# ప్రజాభిప్రాయ వేదిక.

## ఒంటిమిట్ట ఆస్పత్రి విషయములు.

అయ్యా,

ఎవరి పుణ్యముననో ఒంటిమిట్టకు ఆసుపత్రి వచ్చినది. ఒంటిమిట్టకు పరిసర గ్రామాదులు సుమారు 16 యున్నవనియు, వైద్యసహాయము బొత్తిగా లేదనియు పలుగురాళ్ళపల్లెలో మూలనబడి నిలిచిపోయిన డిస్పెంసరీని ఒంటిమిట్ట గ్రామమునకు వచ్చునట్లు చేయబడినది.

ఒక పురవాసి ఆసుపత్రి ప్రారంభమున 6 మాసముల వరకు మందులురా లేదనియు, తర్వాత సంవత్సరమునకు కావలసిన మందులు సప్లైకాబడినవనియు, సంవత్సరమునకై నిర్ణయింపబడిన మందులు మూడుమాసములకే మిగిసి పోయినవనియు పత్రికలలో వ్రాసిరి. బోర్డుద్వారా అఫిషియల్‌గా మందులకు గ్రాంటు అయినతర్వాత మందులు రావడము సాధారణముగా ఆలస్యముగానే వచ్చుచుండును.

డిస్పెంసరీలకు రు 600_0_0లు ఔషధములకు గ్రాంటు చేయుదురు. అందులో సీసాలు మొదలైన వాని క్రింద రు 180_0_0లు ఖర్చులుపోను, రూ420 లు మాత్రమే ఔషధములకు నిల్వయగును. ఆరోగ్యకరమైన ఆయుర్వేదము వంటిఔషధములు మొదలగులవి నూరుమంది రోగులకు వాడిన ఒకమాసము లోపలనే మందులన్నియు అయిపోవచ్చును. అట్లయిపోవుచుండినను శ్రీయుత డియారము వెంకటసుబ్బయ్యగారు ప్రాక్టీషనరుగా యుండినకాలములో స్వంతడబ్బు ఖర్చుపెట్టి బీదప్రజలకు, చికిత్సలు చేయుచుండెడివారు.

డాక్టరుగారికిచ్చునది గౌరవ వేతనముగాని, జీతము గాదు. ఇంటిబాడుగ యిచ్చుటలేదు. అలవెన్సుగాని, జీతముగాని, ఇంక్రిమెంటుగాని, ప్రావిడెంటు ఫండుగాని, రూరల్ మెడికల్ ప్రాక్టీషనరుగార్లకిచ్చుటలేదు. కొన్ని స్థలములయందు డిస్పెంసరీకు ఇంటిబాడుగ, డి॥ బోర్డువారు యిచ్చుచున్నారు. మరికొన్ని స్థలములయందుండు డిస్పెన్సరీలకు గ్రామస్థులే ఇంటిబాడుగ భరించుచున్నారు. మెడికల్ ప్రాక్టీషనరులకు యేబాడుగగాని ఇచ్చుటలేదు.

గ్రామాదులలో పిలిచినప్పుడంతయు ఇండ్లకు పోయి రోగులను చూడవలయును. ఉదయాది అస్తమానపర్యంతము ఆసుపత్రిలోనుండి మందులిచ్చుచునే యుండవలయును.

రూ 50_0_0 నెల 1 కి ఆదాయము వచ్చు రోగుల నుండి మందు చార్జి చేయకూడదు. విజిటింగ్ చార్జి సహా అడుగ కూడదు.

మెడికల్ ప్రాక్టీషనరులకిచ్చు సబ్సిడీ రూ॥ 65 లు ఇందులో ఆసుపత్రిబాడుగ భరించి కాపురముండు ఇంటికి బాడుగ భరించి, రూ॥ 40 లేక 45 ల లోపల అష్టకష్టములు పడి ఎట్లుజీవింపవలయునో ముఖ్యముగా గవర్నమెంటువారు యోచించవలయును. కనుక మెడికల్ ప్రాక్టీషనరుల కష్టనష్టములను గమనించి గవర్నమెంటువారు వారికి చాలినంత జీవనప్రభృతి కలిపించి, చాలినన్ని మందులు సప్లయి చేయుచు వారిచేత చికిత్సలు చేయించవలెనని కోరుచున్నాము.

### ఆస్పత్రి భవన నిర్మాణము.

ఈగ్రామములో ఆస్పత్రికి భవనములేదనుమాట వాస్తవము. ట్రయినింగుకు పోయినడాక్టరుగారికి చందాలుయిచ్చి రసీదుపొంది యున్నచో, అట్టిలిఖిత రూపమైన ఆధారము లుండినచో నేను అడిగి వసూల్ చేసి ఇప్పించగలవాడను.

అర్థములేని ప్రచారముచేయుట వలన ప్రజలు, ప్రభుత్వము, ఉన్మాదావస్థయందుండి పత్రికల కెక్కినట్టు తలంచబడును. ఒంటిమిట్టయందు వైద్యసహాయముకొరకు,ఒకచక్కని భవననిర్మాణముచేసి ప్రజలకు ప్రభుత్వమునకు ఉత్సాహము గలిగించి శాశ్వితానందకీర్తిని గ్రామ పెద్దలు పొందగోరుచున్నాను.

ఒంటిమిట్ట. ఎ. బి. రంగారెడ్డి.

## బస్సులు-ఓవర్ లోడింగు-సివిల్ హక్కులు.

అర్యా!

ఈ పరిపాలనము ఏమి పరిపాలనమో కాని యేతట్టు చూచినను ప్రజల కష్టములు తగ్గే మార్గము కనిపించ లేదు ఆహార విషయము అటుండగ ప్రయాణము చేయుదమన్న, అటు ళ్ళలోకాని ఇటు బస్సులలోకాని సౌకర్యమనేమాట లేనే లేదు. ధాన్యము యెక్కువగ పండక పోవుటకు వర్షములు లేవని, సరియైన కాలమునకు కురియ లేదని చెప్పెదరు. కొన్నిచోట్ల యెక్కువ వానలవల్ల వరదలైపారి పైర్లు చెడిపోయినవని చెప్పెదరు. కాని బస్సులలో ప్రయాణము చేయుటలోగల కష్టములెందుకో చెప్పకున్నారు. ప్రయాణీకుల సంఖ్య హద్దులేకుండ పెరిగిపోవు చున్నదో, లేకుంటే ప్రయాణమునకు చాలినన్ని బస్సులు లేవో చెప్పలేము. ఏ బస్సులో చూచినా ఓవర్ లోడింగే. గూడ్సు వాగనులో పశువులను, గొర్రెలను వేసినట్లు_బస్సులలో మనుష్యులను ఎక్కించుచున్నారు. ఇదియేమిరా అని అడిగే దిక్కేలేకుండ యున్నారే రామరాజ్యములో ఏమి ఈ ఆశ్చర్యము?

బస్సులలో జంతువులమాదిరిగా ఎంతమందిని ఎక్కించినా అడిగే ఉద్యోగి కనపడడు. పోలీసువారు కండ్లు మూసికొని యుంటారు. రెవిన్యూ అధికారులు కండ్లు మూసికొని యుంటారు. ప్రతిరోడ్డుమీద(రూటు Route) ప్రయాణీకుల సంఖ్య ఎక్కువౌతూయున్నదని రోడ్డు ట్రాఫిక్ బోర్డు వారేమైనా బస్సులసంఖ్య యెక్కువచేస్తారా అంటే ఎక్కువ చేయరు. జిల్లారోడ్డు ట్రాఫిక్ బోర్డులకు బస్సులను ఎక్కువచేసే అధికారము లేదు. సెంట్రలు రోడ్డు ట్రాఫిక్ బోర్డువారికి ప్రజల కష్టాలు చూచెందుకు కండ్లులేవు. చెవులు లేవు. పైన అధికార గర్వము జాస్తి.

ప్రయాణీకులలో యేమైనా తెలివియుండి వారి వారి సివిల్ హక్కులను తెలిసికొని, ధైర్యముగా చెలాయించుతారా అంటే—1000మంది ప్రయాణీకులలో ఒక్కరో ఇద్దరో చదువు కొనిన వాండ్లుంటారు. మిగత వాండ్లందఱికి చదువు రాదు. సివిల్ హక్కులంటే యేమో తెలియదు. చదువు వచ్చిన వాండ్లు వాండ్లకు సౌకర్యములు కుదిరితే చాలు. ఇతరులు ఎట్లపోయినా వారికి కాబట్టదు.

ప్రతిబస్సులోను ఒక నియమితసంఖ్య కన్న ఎక్కువ మంది ప్రయాణీకులను ఎక్కించుకొనకూడదని ఒక చట్టమున్నది. ఆ సంఖ్య బస్సుమీదనే వేసియుంటార్లు. "జి" పర్మిట్లోకూడ వుంటుంది. చార్జిచెల్లించి, బస్సులో ప్రయాణము చేసే ప్రతిమనిషికి కూడ బస్సులో సౌకర్యముగా కూర్చొనుటకు "సివిల్" హక్కు వున్నది. ఈ సివిల్ హక్కును ఏ కండక్టరు కాని, బస్సు స్వంతదారుడు కాని ఆటంక పరచరాదు. ఆటంకపరచుటకు హక్కు లేదు. నియమిత సంఖ్యకన్న ఎక్కువమంది ప్రయాణీకులను ఏ బస్సులోనైనా యెక్కించినచో- తెలివిగల ప్రయాణీకులు ఆ బస్సు నంబరును గుర్తు వ్రాసుకొనవలెను. తనతోపాటు ప్రయాణము చేయుచున్న గౌరవముగల నలుగురి ప్రయాణీకుల పైవిలాసములను విచారించి గుర్తు వ్రాసుకొనవలెను. తన స్థానము చేరిన తర్వాత, తాను ప్రయాణము చేసినప్పుడు బస్సులో ఎక్కువమందిని ఎక్కించినందులకై కలుగజేసిన కష్టమునకై నష్టపరిహారమును (డామేజస్-Damages) కోరుచు, సివిల్ కోర్టులలో దావాలు వేయవలెను. ఇది సివిల్ హక్కులపై జరుగు దౌర్జన్యములు, కోర్టువారు విచారించి కేసు ఋజువైనచో నష్టపరిహారము నిప్పించెదరు. ఇటుల బాధ్యతగల వారెల్లరు చేయుటకు ప్రారంభించుచో, బస్సులలో ఓవర్ లోడింగులు ఉండునా? అప్పుడైనా బస్సుల సొంతదారులు సర్కారువారు కండ్లు తెఱచి చూడరా? ప్రజలు ఇట్లా తమ సివిల్ హక్కులను చెలాయించుటకై కోర్టులలో దావాలు వేయుటకై ముందుకురారని కద్దా కండక్టర్లు, స్వంతదారులు, సర్కారువారు ప్రయాణీకులను అగౌరవముగా చూచుట, కష్టపెట్టుట.

తిరుపతి. బి. వేమారెడ్డి.

---

# చేనేత పారిశ్రామికుల హర్తాళ్.

ఆర్యా! ఈ నెల 16-వ తేది ప్రొద్దుటూరు నగరములో చేనేత పారిశ్రామికులు హర్తాళము జరిపిరి. దేశములో వ్యవసాయము తర్వాత, హెచ్చుమంది ప్రజలకు జీవనాధారమైనది, చేనేతపరిశ్రమ. ఇది చేతివృత్తులలో ప్రధానమైనది. దేశము మొత్తముమీద $1\frac{1}{2}$ కోటిపారిశ్రామికులు ఈ వృత్తిపై ఆధారపడియున్నారు. గత సం॥ము నుండి దేశములో పారిశ్రామికుల దుస్థితి విషమ రూపము దాల్చి, ప్రభుత్వము అనుసరిస్తూ వస్తూన్న వస్త్ర పరిశ్రమ విధాన ఫలితముగా, చేనేతపరిశ్రమకు నెలలోకనీసము నాలుగు, ఐదు రోజులకైనా సరిపడునూలు సప్లయి కాక, లక్షలాది చేనేత పారిశ్రామికులు నిరుద్యోగులై, తిన తిండిలేక, నిత్యోపవాసములు చేయుచున్నారు. క్షుద్బాధ కోర్వజాలని చేనేత పారిశ్రామికులెందరో ఆకటి చావులు చచ్చిరి. మరెందరో ఆత్మహత్యకు గురియైరి, ఇంకెందరో ఆత్మాభిమానము చంపుకొని భిక్షాటన చేయుచు జీవనయాత్ర సాగిస్తున్నారు.

ప్రభుత్వానికి చీమ కుట్టినట్టు కూడా లేదు. కడకు దేశమంతటా, ప్రభుత్వభవనాల వద్ద ఆకలి యాత్రలు నడిపించిరి, కాని తగిన ప్రయోజనములేక పోయినది.

సత్యాగ్రహ ఉద్యమము గత నెల 16-వ తేది నుండి చెన్నపట్టణములో సెక్రిటరేట్ ముందుగా చేయుటకు సాగుచున్నది. కాని గమ్యస్థానముచేరకముందే పోలీసులు, సత్యాగ్రహులను అటకాయించి వ్యానులో తీసికొనిపోయి, ఉదయం 9 గం॥ నుండి. రాత్రి 10 గం॥ వరకు వారిని నిర్బంధములోయుంచి, 25, 30 మైళ్ళ దూరము వరకు తీసుకొనిపోయి, ఆహారము ఇవ్వక, నిర్జన ప్రదేశములో వదలిపెట్టుచున్నారు. శాంతిప్రియులైన చేనేతవారియెడ అమానుషముగా, ప్రవర్తించడము, ఇది ప్రజా ప్రభుత్వానికి తగునా! ఇదేనా గాంధీగారు కోరిన రామరాజ్యము?

ప్రొద్దుటూరు జింకా వెంకటసుబ్బయ్య.

---

# రాజ్యాంగ చట్టము.

ఆర్యా!

రాజ్యాంగ చట్టములోని ప్రాథమిక హక్కులకు సంబంధించిన క్లాజులను సర్కారువారు యిప్పుడు సవరించుటకు పార్లమెంటులో బిల్లును తెచ్చినారు. అధికమంది ప్రజలకు ఇంగ్లీషుభాష రాదు. ఎన్నికలకు సంబంధించిన రెండు బిల్లులు కూడ యిప్పుడిప్పుడే చర్చింపబడుచున్నవి. ఇవన్నియు ప్రతి పౌరుడును బాగా చదువుకొని అర్థము గ్రహించుటకై వీలు పడునట్లు, ప్రాంతీయ భాషలలో తక్షణమే అచ్చువేయించి, అతి స్వల్పమైన ధరకు ప్రజలకు అందజేయుట ప్రభుత్వమువారి ధర్మము. ఈ విషయమై రాష్ట్ర ప్రభుత్వములు, కేంద్ర ప్రభుత్వములు శ్రద్ధ వహించునా?

గుత్తి. డి. సివరాము.

## చిత్తూరు జిల్లాబోర్డు తెలుగులో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుట.

ఆర్యా!

మే నెల 27_వ తేదీ చిత్తూరు జిల్లాబోర్డు సమావేశము జరిగినది. ప్రభుత్వమునకు, మరి కొందరి ఉద్యోగులకు తప్ప మిగత జిల్లాబోర్డు వ్యవహారమంతయు తెలుగులోనే జరప వలెనని తీర్మానించడమైనది. తెలుగు టైపురైటర్లను కొని, ఉత్తర ప్రత్యుత్తరములన్ని తెలుగులోనే జరుపుటకు ఏర్పాట్లు చేయవలెనని చెప్పినారు. ఇందుకు మా జిల్లాబోర్డు అధ్యక్షులైన శ్రీ యన్. పి. చెంగల్వాయనాయుడుగారికి మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము. రాయలసీమలో ఈ విధమైన తీర్మానము చేయడము మొట్టమొదట మా చిత్తూరి జిల్లాబోర్డుకే గౌరవము దక్కినదనుకొంటాను. మిగత రాయలసీమ జిల్లాబోర్డులు కూడ యీ పద్ధతి అనుసరిస్తె బాగుండును. మా ప్రెశిడెంటుగారికి తెలుగుపైయుండే అభిమానము వ్యక్తమైనది.

చిత్తూరు. యన్. రంగస్వామి.

---

## కొండాపురమునకు వైద్యవసతి

ఆర్యా!

కొండాపురములో మిల్లులున్నవి. జిల్లాబోర్డువారి హైస్కూలున్నది. ఆస్పత్రిలేదు. ఇచ్చటనే ఒక ఆస్పత్రిని స్థాపించవలెనని పలువురు తలంచుచున్నారు. కాని బాగా శిక్షణపొంది అనుభవము కలిగిన డాక్టర్లు చిక్కేది కలువైనది.

ఇప్పుడు కడపజిల్లా బోర్డువారు మే నెల 28_వ తేది జరిగిన మీటింగులో తాళ్ళప్రొద్దుటూరులో ఉండే డాక్టరును వారమునకు మూడురోజులు కొండాపురమునకు వచ్చి-ఆగ్రామ ప్రజలకు వైద్యసహాయము చేయమని ఉత్తరువు చేసినారు. డాక్టరు కొండాపురమునకు యిప్పటినుండి వారమునకు మూడు రోజులు వచ్చును. కొండాపురము ప్రజలు డాక్టరు కూర్చుండుటకును, మందులిచ్చుటకును తగుమైన చోటును చూపించి తోడు పడెదరని కోరుచున్నాను.

చెన్నూరు దగ్గఱ పెన్నానదికి వంతెన కట్టుటకును; కమలాపురము దగ్గఱ పాపఘ్ని నదికి కాజ్ వే కట్టుటకును, గండ్లూరు దగ్గఱ చెయ్యేరుకు కాజ్ వే కట్టుటకును పంచవర్షక రహదారీ ప్రణాళికలో చేర్చవలెనని కూడ జిల్లాబోర్డు అధ్యక్షులు ప్రభుత్వమువారిని కోరుచు ఒక తీర్మానమును ఉద్దాపాదించిరి. అదికూడ అంగీకరింపబడెను. ప్రభుత్వమువారు వీని విషయమై శ్రద్ధవహించెదరని తలచుచున్నాను.

వి. ఆర్. ద్వారకానాథ్

---

## బళ్లారిలో మిల్లుగుడ్డల రేషనింగు

ఆర్యా!

మెట్టూరు మిల్లుగుడ్డలు, బెన్ని మిల్లుగుడ్డలు సామాన్యమైన వారికి చిక్కుటే కష్టమైనది. అందువలన ఇన్ ఫార్మల్ రేషనింగు ప్రవేశపెట్టబడినది. రేషన్ కార్డులపై గుడ్డ బట్వాడా చేయబడును. రేషన్ కార్డు లెక్కల ప్రకారము ఒక కుటుంబములో 10 మందికాని అంతకు తక్కువకాని మనుష్యులుంటే, ఒక్కొక్కరికి నాలుగు గజముల మిల్లుగుడ్డ యిచ్చేటట్లును, 10 మందికి మించియున్న కుటుంబములకు ఎనిమిది గజముల గుడ్డ యిచ్చులాగునను తీర్మానింప బడినది. ఇందులకు మా జిల్లా యధికారులను మీ పత్రికద్వారా అభినందించుటకు అవకాశమిచ్చెదరా?

బళ్ళారి. ఎల్. ఆర్. లింగారెడ్డి.

[కడపలోకూడ ఇదే విధముగ మిల్లుగుడ్డల పంపకమును ఏర్పాటు చేయవలెనని జిల్లా కలెక్టరుగారికి మేము సలహా యొసగితిమి. అది చట్టవిరుద్ధమనియు, ఇండియా ప్రభుత్వము వారి విధానమునకు ప్రతికూలమనియు తెలిపిరి. గుడ్డల దుకాణముల వద్దపోలీసు బందోబస్తు ఏర్పరచి బట్వాడా చేయించెదమనిరి. కాని అటుల బట్వాడా చేయుటలో చిక్కులు చాల యున్నవి. ఎవ్వరిని తృప్తిపరచుటకు వీలుండదు. ఒక్కొక్క వ్యక్తికి ఎన్నిగజముల మిల్లుగుడ్డ యిచ్చుటఅను ప్రశ్న వచ్చును. ఒకొక్క కుటుంబమునకు సమిష్టగా చేర్చి ఇప్పించినచో,10 గజములో 20 గజములో, ఆయాకుటుంబములోని సభ్యుల సంఖ్యనుబట్టి లభింపగలదు. వ్యాపారస్తులు కూడ ఆసందర్భములో గుడ్డలను చీకటి మార్కెటులలో అమ్ముకొనుటకై దాచి యుంచికొనుటకు అనుకూలములు ఎక్కువగ నుండవు. కాన కడపజిల్లాలో కూడ రేషన్ కార్డులను ఆధారపరచుకొని గుడ్డల పంపకములో రేషనింగు (Informal Rationing) ప్రవేశ పెట్టెదరని తలచుచున్నాము.—]

సం॥"భారత జ్యోతి"

# ప్రపంచ రాజకీయములు.

కొరియాలో కడచిన సంవత్సరము జూన్ నెల 25_వ తేది యుద్ధము ప్రారంభమైనది. ఒక్క సంవత్సరము పూర్తి కావచ్చినది. ఇప్పటికైనను దీని నేదో ఒక విధముగ అంత్యమొందించుట ముఖ్యమని అమెరికాలో కొందఱు రాజకీయ నాయకులు తలచుచున్నారు. కొరియాలో తమ చేతులను కడుగుకొని ఇతర ప్రదేశములలో తలచూపుచున్న కమ్యూనిజము వైపు దృష్టిని మరల్చుట ముఖ్యమని అమెరికా వారు ఇప్పుడిప్పుడే గ్రహించుచున్నారు.

“రాబోవు కొరియా యుద్ధ వార్షిక దినమున (జూన్ నెల 25_వ తేది) 38_వ అక్షాంశ రేఖను హద్దుగానుంచుకొని ఎవరెవరి సైన్యమునువారు ఉత్తరమునకును, దక్షిణమునకును ఉపసంహరించుకొనవలెననియు; విదేశీయులెల్లరు ఈ గడువు లోపల ఉత్తర కొరియానుండియు; దక్షిణ కొరియా నుండియు వైతొలగి పోవలెననియు ఐక్యదేశముల సమితివారొక విజ్ఞాపన చేయవలెనని ఎడ్విన్ జాన్సన్ గారు (Edwin Johnson of Colorado) ఒక తీర్మానము నుపపాదించి యున్నారు. ప్రస్తుతము కొరియాలో జరుగుచున్న యుద్ధము వల్ల ఫలిత మేమియు లేకపోవుటయేగాక రాపిడి ఎక్కువగును. అలసట యెక్కువగును. కాలము గడిచినంతవఱకు, కొరియా ప్రజలకు కష్టములు మాత్రము ఎక్కువగుచుండును. ఈ సత్యమునే పై తీర్మానము వెల్లడించుచున్నది.

♦♦ ♦♦ ♦♦

ఇది అమెరికా దేశీయులు ప్రతిపాదించిన తీర్మానము. ఈ తీర్మాన విషయమై అమెరికా ప్రభుత్వవర్గమువారు ఏలాటి అభిప్రాయమును వెలిబుచ్చలేదు. దీనిని గుఱించి వ్యతిరేకాభిప్రాయమును ప్రకటింపలేదు. అమెరికా మిలిటరీ అధికారులు కొరియాలో యుద్ధము సాగించుచున్న జనరల్ రిజ్‌వే గారికిది వరకే సూచించియుండెదరని తలంపబడు చున్నది.

ఎడ్విన్ జాన్సన్ గారు ఉపపాదించిన తీర్మానము యొక్క పూర్తిపాఠమును రష్యావారి “ప్రావడా” పత్రిక ప్రకటించినది. రష్యావారి వార్తా సంస్థయైన “టాస్” ఇతర పత్రికల కందిచ్చినది. ఈ తీర్మానమును నిరసించుచు వ్యాఖ్యానము గావింపక రష్యావారు ప్రకటించుటలోనే ఎంతో అర్థమున్నది.

కడచిన వారముదినములుగ చేరుచున్న యుద్ధవార్తలను పట్టిచూడ, జనరల్ వాన్ ఫ్లీట్ (General Van Fleet) నాయకత్వముక్రింద దక్షిణ కొరియాలోనుండి ఉత్తరకొరియన్లు తరుమబడుటేగాక, ఉత్తరకొరియాలో ప్రవేశించి, వారిపైననే యుద్ధతీవ్రతను చూపుచున్నట్లున్నది. వేల కొలది చైనా సైనికులు ఆయుధ సామగ్రితో (ఐక్యదేశ సైనికులకు) అమెరికా వారికి పట్టుపడుచున్నటుల కూడ వార్తలు వచ్చుచున్నవి. దురదృష్ట వశమున అమెరికా సైనికులు ఉత్తర కొరియాలో పూర్తిగ ప్రవేశించి, మంచూరియా ప్రాంత్యమును మరలా చేరినచో, రష్యావారి ప్రతిష్టకు తీరనిలోటువాటిల్లును. దీనిని రష్యావారు బాగుగ అర్థముచేసుకొని యున్నటుల తోచుచున్నది.

♦♦ ♦♦ ♦♦

చైనావారికి అత్యధిక సంఖ్యాకులగు సైనికులున్నారన్న మాట వాస్తవము. కాని అంతమాత్రముచేత శిక్షణ పొందిన సైనికులు ప్రతిదినము హతమగుచుండుట వారుమాత్రము ఎంత కాలము ఓర్పుతో నష్టపడగలరు. చైనావారు అమెరికా సైనికులను నష్టపఱచిన దానికన్న అమెరికా వారివల్ల చైనా సైనికులే ఎక్కువగా హతమార్పబడుచున్నారు. అందువల్ల యుద్ధమును త్వరలో పరిసమాప్తి నొందించుటకు చైనావారు కూడ సుముఖులుగనే యున్నారని తలంపవచ్చును.

ఇట్టి వాతావర్ణములో యుద్ధపరిసమాప్తికిని, శాంతిస్థాపనకును ఐక్యదేశముల సమితినుండి ప్రతిపాదనలు వెలువడుట సమయానుకూలముగను, సమంజసముగను యున్నవి. కొరియాలో తక్షణము యుద్ధము తత్కాలికముగ నిలుపుదల కావలెను. 38_వ అక్షాంశరేఖకు ఇరుప్రక్కల 20 మైళ్ళ వఱకు శత్రురక్షణముగ నిలిచిన ప్రదేశముగ (Buffer Zone) పరిగణింపవలెను. ఐక్యదేశముల సమితి ఆధ్వర్యముక్రింద ఉత్తర_దక్షిణ కొరియాలను ఏకముచేసి, ఒక స్వతంత్ర దేశముగ యేర్పాటు చేయవలెను.

* * *

( మిగత 11_వ పేజీలో )

( 10-వ పేజీ తరువాత )

చైనాపై అన్ని ఆంక్షలను తొలగింపవలెను. ఐక్య దేశముల సమితిలో సభ్యత్వ మొసగవలెను. ఫర్మోజాను చైనాకు ఒసగవలెను. ఈ మూడు షరత్తులకు అమెరికావారు సమ్మతి తెలుపుచో, పై ప్రతిపాదనలలో మొదటి రెంటికిని చైనా తప్పక అంగీకరింపవచ్చును. చైనాపై ఆంక్షలను తొలగించుటకు అమెరికావారు సంసిద్ధత చూపవచ్చును. ఐక్య దేశముల కూటమిలో చైనాకు స్థాన మొసగుటకును, ఫర్మోజాను చైనావశము చేయుటకును అమెరికావారు సులభముగా సమ్మతింపబోరు. ఐక్యదేశముల కూటమిలోకూడ ఈ ముఖ్య విషయములపై ఏకాభిప్రాయము లేదు.

కొరియాలో ఐక్యదేశముల కూటమిలోచేరిన దేశము లన్నియు యుద్ధము సాగించుచున్నవని చెప్పుట పేరునకు మాత్రమే కాని నిజముకాదు అమెరికాదేశము ఒక్కటే ఈ యుద్ధ భారమునంతయు వహించుచున్నది. ఇది నిజమైన పరిస్థితి. ఈ విషయమును అమెరికావారు గ్రహించి, కొరియాలో యుద్ధమును ఆపుదల చేయుచో — వారి మిలిటరీ శక్తిని ఇతర రంగములలో వినియోగించి, కమ్యూనిజమ వ్యాప్తిని అరికట్టవచ్చును.

కొరియాలో ఎంత కాలము యుద్ధము సాగించినను అంతకాలము అమెరికా వారికిని, చైనావారికిని, తీవ్రమైన నష్టములు కలుగుచునేయుండును. కొరియావారి కష్టములు దిన దినమునకు హెచ్చుచుండును. కడకు నిర్మానుష్యమగు శ్మశాన భూమిగ మారిపోవును.—— ఇదియే కలుగబోవు ఫలితము.

——:)(:——

# చెన్న రాష్ట్ర శాసనసభ నియోజక వర్గములు.

## 375 స్థానాల్లోను తెలుగు దేశమునకు 145.

చెన్నరాష్ట్ర అసెంబ్లికి నూతన రాజ్యాంగ చట్టము ప్రకారము 375 స్థానములున్నవి. పార్లమెంటులో ఈ రాష్ట్రానికి 75 స్థానములున్నవి. ఈ స్థానములకు సంబంధించిన నియోజక వర్గములు ఈ నెల 18 వ తేదీన జారీ అయిన అధ్యక్షుని ఉత్తరువులో వివరింపబడినవి. ప్రదేశ శాసనసభ నియోజకవర్గముల జాబితాను—రాయలసీమ జిల్లాలకు సంబంధించినంతవరకు-ఈ పత్రికలో ప్రకటించు చున్నాము. పార్లమెంట్ ఏవైన సవరణలు చేస్తేనేతప్ప, మామూలుగా జూన్ 8-వ తేదీనరికి ఈ నియోజకవర్గములే ఖాయమై పోవును.

| నియోజక వర్గము పేరు | నియోజకవర్గ విస్తీర్ణము | మొత్తము స్థానములు | రిజర్వుస్థానము (హరిజనులు) |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| **కర్నూలు జిల్లా** | | | |
| మార్కాపురము. | మార్కాపురము తా॥ | 1 | — |
| కంభము | కంభము తా॥ | 1 | — |
| నంద్యాల | నంద్యాల తా॥ శిరువెళ్ల తా॥ శిర్వేలు గోస్పాడు ఫిర్కాలు | 1 | — |
| కోవెలకుంట్ల | కోవెలకుంట్ల తా। శిరువెళ్ల తా॥ రుద్రవరం చాగలమర్రిఫిర్కాలు | 1 | — |
| డోన్ | డోన్ తా॥, బనగానపల్లి సబ్ తాలూకా | 1 | — |
| నందికొట్కూరు | నందికొట్కూరు తాలూకా | 1 | — |
| కర్నూలు | కర్నూలు, పత్తికొండ తా॥ | 2 | 1 |
| **కడప జిల్లా** | | | |
| రాజంపేట | రాజంపేట తా॥ శిద్ధవటము, ఒంటిమిట్ట, కోడూరుఫిర్కాలు | 2 | 1 |
| రాయిచోటి | రాయిచోటి తా॥ (లక్కిరెడ్డిపల్లి మినహా) | 1 | — |
| కడప | కడపతా॥, లక్కిరెడ్డిపల్లిఫిర్కా | 1 | — |
| బద్వేలి | బద్వేలితా ॥ సిద్ధవటము తా॥ లోని ఓబులముఫిర్కా | 1 | — |
| ప్రొద్దటూరు | ప్రొద్దటూరు తాలూకా | 1 | — |
| కమాలాపురము | కమాలాపురము తా। పులివెంద్ల తా। పులివెందుల, వేముల, లింగాలఫిర్కా | 1 | — |

| | | | |
|---|---|---|---|
| జమ్మలమడుగు. | జమ్మలమడుగుతా॥ పులివెందుల తా॥ తొండూరు, సింహాద్రిపురముఫిర్కాలు | 1 | — |

## అనంతపురం జిల్లా

| | | | |
|---|---|---|---|
| పెనుగొండ. | పెనుగొండతా॥ కదిరితా॥ లోని గుంజేపల్లి ఫిర్కాకలిసి | 1 | — |
| హిందూపురము. | పరిగిఫిర్కా మినహా హిందూపురము తా॥ యున్న కదిరితా॥ మహమ్మదాబాద్ ఫిర్కాయున్నా | 1 | — |
| మడకశిర | మడకశిరతా॥ పరిదిఫిర్కా | 1 | — |
| కదిరి | కదిరితా॥ (గుంజపల్లి మహమ్మదాబాద్ ఫిర్కాలు మినహా | 1 | — |
| ధర్మవరము | ధర్మవరముతా॥ అనంతపురము తా॥లోని బుక్కచర్లఫిర్కా | 1 | — |
| కల్యాణదుర్గము } అనంతపురము | కల్యాణదుర్గముతా॥ బుక్కచర్ల ఫిర్కా మినహా అనంతపురముతా॥ గుత్తితా॥ పామిడినాగసముద్రము ఫిర్కాలు | 2 | 1 |
| తాడిపత్రి | తాడిపత్రి తాలూకా | 1 | — |
| గుత్తి | పామిడి నాగసముద్రము ఫిర్కాలు పోగా మిగులుగుత్తి తాలూకా యావత్తు | 1 | — |

## బళ్లారి జిల్లా

| | | | |
|---|---|---|---|
| అదోని | కౌతాళము కోసిగి ఫిర్కాలు మినహా అలూరు అదోని తా॥లు | 2 | 1 |
| శిరిగుప్ప | శిరిగుప్పతా॥ ఆదోనితా॥లోని కౌతాళము, కోసిగి ఫిర్కాలు | 1 | — |
| బళ్లారి | బళ్లారి తాలూకా | 1 | — |
| రాయదుర్గం | రాయదుర్గం తాలూకా | 1 | — |
| హొస్పేట | హొస్పేట సాండూరు తా॥ | 1 | — |
| కుడ్లిగి | కుడ్లితా॥ హర్పనహల్లి తా॥ చిగతేరిఫిర్కా హర్పనహల్లి తా। చేరిన హడగల్లితా॥ ఇట్టిగిఫిర్కా గ్రామములు పోగా మిగిలిన ఇట్టిగి ఫిర్కా | 1 | |
| హర్పనహల్లి | ఇట్టిగ ఫిర్కాలోని హంపసాగర ఎనిగి, బన్నికల్ ఎనిగజీపూర్ జి. కొండహళ్లీ, కొడ్లబల్, హై, ఆసిగిదేరి, భుగరిబొమ్మన హల్లి, చింతప్రపల్లి, గ్రామము లున్న హడగల్లి తా॥ హరే హదహల్లి, హడగల్లి, తాంబ్ర హల్లి ఫిర్కాలు హర్పనహల్లి తా॥ హర్పనహల్లి, అరికేర్ తెలిగి ఫిర్కాలు | 1 | |

## చిత్తూరు జిల్లా

| | | | |
|---|---|---|---|
| ఘట్టు | మదనపల్లెతా॥ తంబళ్లపల్లె బురకాయలకోట, పెద్దతిప్ప సముద్రము, ఘట్టుఫిర్కాలు | 1 | |
| మదనపల్లె | మదనపల్లె పడమటర, మదనపల్లె తూర్పుఫిర్కాలు వాయలపాడు తా॥ వాయలపాడు, కదిరాయ చెర్వుఫిర్కాలు. | 1 | — |
| పుంగనూరు | పుంగనూరు తాలూకా | 1 | — |
| చిత్తూరు | చిత్తూరు తాలూకా | 2 | 1 |
| తిరుత్తణి | పుత్తూరు తా॥ నగరిఫిర్కా తిరుత్తణి కనకమ్మ సత్రం ఫిర్కాలు. | 1 | — |
| పల్లిపట్టు | పల్లిపట్టు, ఎరుంబి, రామకృష్ణ రాజుపేట ఫిర్కాలు | 1 | — |
| కాళహస్తి | నగరిఫిర్కా మినహా కాళహస్తి పుత్తూరుతాలూకాలు. | 2 | 1 |
| చంద్రగిరి | చంద్రగిరి తాలూకా. | 1 | — |

—:)(:—

# ఇండియా దేశ రాజకీయములు.

న్యూఢిల్లీనుండి ఈ వారము చేరిన వార్తలలో నొకటి రెండు ముఖ్యమైనవి కలవు. శ్రీమతి సుచేతా కృపాలనీ గారు కాంగ్రెసు సభ్యత్వమునకు రాజీనామా యొసగిరి. ఈమె కడచిన 20 సం॥గ కాంగ్రెసు సంస్థతో నెక్కువగా సంబంధము కలుగజేసుకొనినది. గాంధీజీ శిష్యవర్గములోచేరి, దేశ సేవయం దెక్కువ యనుభవమును గడించినది. సభ్యత్వమునకు రాజీనామా యొసగుచు ఈమె ఒక ప్రకటన గావించినది.

“ఇప్పటికి ఈ దేశములో కాంగ్రెసు పరిపాలనము యేర్పడి నాలుగు సంవత్సరములైనది. ఈ నాలుగు సంవత్సరములుగ మన జాతీయ జీవనము ఏ విధముగను అభివృద్ధి నొందలేదు. ప్రజల ఆర్థిక స్థితి మఱింత దుర్భరముగ పరిణమించినది. దేశస్వాతంత్ర్యమును సంపాదించుట కేసంస్థ కారణ భూతముగ నుండెనో, అట్టి సంస్థలోనే ప్రజాసామ్య సిద్ధాంతము (డెమాక్రసీ) మంటకలిసినది. ఏ ప్రాథమిక హక్కులకై కాంగ్రెసు సంస్థ పోరాడెనో అట్టి హక్కులే కాంగ్రెసు ప్రభుత్వముల క్రింద నిరోధింపబడుచున్నవి.

“బ్రిటిషు సామ్రాజ్యమును ఈ దేశములో స్థిరముగా నెలకొల్పుటకై ఆంగ్లేయులు అనేక నిర్బంధ శాసనములను ప్రవేశపెట్టిరి. ఇండియా రాజ్యాంగ చట్టము ప్రజలకు ప్రాథమిక హక్కులను హామీగా నొసగి యున్నను, అట్టి హక్కులకు భంగము కలిగించుటకై రాజ్యాంగ చట్టము సవరింప బడుచున్నది. నిర్బంధ శాసనములు మరల అమలులోనికి తేబడుచున్నవి. 20 సం॥గ నాకు కాంగ్రెసు సంస్థతోగల సంబంధము తెంచుకొనుట కష్టముగనే యున్నది. కాని పార్టీయొక్క స్వప్రయోజన మునకన్న, దేశక్షేమమే నాకు ఎక్కువ. కాంగ్రెసు పార్టీలో నుండి పని చేయుటకన్న కాంగ్రెసు వెలుపలనుండియే దేశమునకు ఎక్కువ సేవ చేయగలనని నా నమ్మక” మని శ్రీమతి సుచేతా కృపాలనీగారు తెలిపినది. నెహూరు పండితులుకాని, టాండన్ బాబుకాని లేక శ్రీ రాజగోపాలాచార్యులు కాని ఈ ప్రకటనలోని విషయములు అసత్యములని సవాలు చేయగలరా?

* * *

ప్రివెంటివ్ డిటెంషన్ చట్టముక్రింద వివిధ రాష్ట్రములలో విచారణలేక నిర్బంధములో నుంచబడినవారు రాబోవు జనరల్ ఎన్నికలలో ఓటుచేయుటకు అధికారమొసగుచు ఇండియా పార్లమెంటులో ఈ నెల 21-వ తేది ఒక సవరణ తీర్మానము ఆమోదింప బడినది.

♦♦ ♦♦ ♦♦

బ్రిటీషువారు ఈ దేశమును పరిపాలించుచుండిన కాలములో కాంగ్రెసువారిని జైయిళ్ళలో నిర్బంధించి యుంచిరి. కాని వారిని ఎన్నికలలో అభ్యర్థులుగా నిలుచుటకున్ను, ఓటుచేయుటకున్ను కావలసినన్ని సౌకర్యములను కలుగజేసిరి. జైయిళ్ళలోనుండియే అనేకమంది కాంగ్రెసువారు శాసన సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

♦♦ ♦♦ ♦♦

ఇప్పుడు ఇండియా రిపబ్లిక్ దేశమైనది. ప్రజా ప్రభుత్వ మేర్పడినది. కాంగ్రెసు పార్టీ అధికారములో నున్నది. నవంబరు-డిశంబరు నెలలలో జరుగబోవు ఎన్నికలలో విచారణలేక నిర్బంధములో నుంచబడినవారికి ఓటింగు హక్కు ఉండకూడదని “ప్రజా ప్రాతినిధ్యపు బిల్లు (Peoples Representation Bill No. 2) లో 61-వ సెక్షనులో, కేంద్ర ప్రభుత్వమువారు నిర్వచించిరి. దీనిని ఖండించుచు, నిర్బంధములో నుంచబడిన వారికి ఓటింగు హక్కు కలుగజేయవలె” నని శ్రీ జస్‌పత్‌రాయి కాపూర్‌గారు ఒక సవరణ తీర్మానము ఉపపాదించిరి. శ్రీ టి. టి. కృష్ణమాచారి; డా॥ పంజాబ్‌రావు దేశముఖ్; ఏ. సి. గుహ; మునీశ్వరదత్త, ఉపాధ్యాయ, ఆర్. కె. సిద్వా; గోకులభాయి భట్టు, మొదలగు వారెల్లరు సవరణతీర్మానమును బలపఱచిరి. తుట్ట తుదకు దానిని న్యాయశాఖామంత్రి, డా॥ అంబేద్‌కర్ గారు అంగీకరించిరి. ఇవన్నియు నెహూరు పండితుని పరిపాలనక్రింద జరుగుచున్న అవకతవకలు.—

* * *

జనరల్ ఎన్నికలను 1952 సం॥ ఫిబ్రవరి నెల వఱకు వాయిదా వేయవలెనని చెన్న రాష్ట్ర కౌన్సిలు సభలో ఒక తీర్మానము ఆమోదింపబడి, ఇండియా ప్రభుత్వమువారికి పంపబడెను. ఆ తీర్మానము నిరాకరింప బడినది. ముందు ఏర్పాటు చేసినట్లు, డిశంబరు 1-వ తేది మొదలు డిశంబరు 21-వ తేదీల లోపలనే ఎన్నికలు జరిపి తీరవలెనని చెన్న రాష్ట్ర మంత్రివర్గమునకు ఇండియా ప్రభుత్వమువారు స్పష్టముగ తెలిపిరి.

750 ఓటర్లకు ఒక్కొక్క పోలింగు స్టేషన్ వంతున 20,000 పోలింగు స్టేషన్‌లు ఈ రాష్ట్రములో ఎన్నికలకై

ఏర్పాటు చేయబడును. ఒక్కొక్క నియోజక వర్గమునకు సుమారు 100 పోలింగు బూతులు (స్టేషన్లు) ఉండును. సాధ్యమగుచో స్త్రీలకు ప్రత్యేక పోలింగు స్టేషన్లు ఏర్పాటు చేయబడును. గ్రామ పరిసరములలో రెండు మూడు మైళ్ళ కన్న ఎక్కువదూరము లేకుండ పోలింగుస్టేషన్లు ఏర్పాటు చేయబడునని తెలియుచున్నది.

♦♦ ♦♦ ♦♦

పెట్రోలుపై మరల కంట్రోలు ప్రవేశపెట్టరనియు; విదేశములనుండి దిగుమతి అయ్యే పెట్రోలు సప్లయికి అంతరాయములు కలుగలేదనియు, శ్రీ హెచ్. వి. కామత్ గారి ప్రశ్నకు మే నెల 25-వ తేది పార్లమెంటులో శ్రీ కె. సంతానముగారు ప్రత్యుత్తర మొసగిరి.

* * *

బీహారు రాష్ట్రములో నుండు వైద్య కళాశాలలో స్త్రీలకును, ఆదివిజాతి వారికిని; షెడ్యూలు తరగతి వారికిని తప్ప, యితరులకు స్థానములు ప్రత్యేకింప బడవని ఆ రాష్ట్ర మంత్రివర్గమువారు ప్రకటించిరి.

♦♦ ♦♦ ♦♦

బొంబాయిలో ఈ నెల 19-వ తేది ఇండియా ప్రభుత్వ ఉత్పత్తి, సప్లయిశాఖామంత్రి గారైన శ్రీ యస్. వి. గాడ్ జిల్ గారు మాటలాడుచు, ధనికవర్గమువారు ముందుకు వచ్చి ప్రభుత్వముతో సహకరింపలేదను కారణమువల్ల, అభివృద్ధి ప్రణాళికలు నిలుపుదల చేయుట లేదు. ప్రణాళికలకు కావలసిన ద్రవ్యమును, పన్నులను ఎక్కువ చేసి రాబట్టుకొందురు. ఈ దేశము ధనిక వర్గమువారిదే కాదు. బీద వారికి కూడ హక్కు ఉన్నది. కనుక పన్నులు ఎక్కువ చేసినచో, తాముకూడ యెక్కువ పన్నులభారము వహింప వలసి వచ్చునుకదా యని బీద ప్రజలు మొఱపెట్ట కూడ"దని చెప్పిరి. బీదలకు దేశములో అన్న వస్త్రములకు తగుమైన వసతులు చేసి—వారి ఆకలి బాధను నివారింపజాలక పోయినను, పన్నుల భారము మాత్రము మోయమని చెప్పుటకు ప్రభుత్వములో పనిచేయుచున్న మంత్రులకు ఎట్లు ముఖము మెచ్చుచున్నదో తెలియకున్నది.

♦♦ ♦♦ ♦♦

ఇండియాలోనుండు విదేశ స్థావరములు స్వతంత్రమై ఇండియా ప్రభుత్వముక్రిందనే చేరిపోవలెనని తీవ్రమైన ఆందోళన జరుగుచున్నది. ఫ్రెంచి సెటిల్ మెంటులనుండియు, గోవానుండియుకొందరు ప్రతినిధులు బొంబాయి పట్టణములో సమావేశమై, ఫ్రాన్సు, పోర్చుగీసు ప్రభుత్వములతో ప్రత్యక్షముగా సంప్రతింపులు జరిపి, విదేశస్థావరములను ఇండియాతో చేర్చి వేయుటకు తగుచర్య వెంటనే తీసుకొనవలెనను తీర్మానమును ఆమోదించిరి.

డా॥ యస్. వి. రాజకుమార్ గారు (కాంగ్రెసు విదేశాంగ శాఖా కార్యదర్శి) మాటలాడుచు, ఈ విషయములో ప్రభుత్వ మేమియు చేయజాలదనియు; ఇండియాప్రజలు తమ స్వాతంత్ర్యమునకై ఏ విధముగ పోరాడిరో అదేవిధముగ వారును శాంతియుతముగ పోరాడి స్వాతంత్ర్యమును సంపాదించు కొనవలెనని హెచ్చరించిరి.

---



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.

PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA'

EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah

రాజకీయ వార పత్రిక.

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4. సంచిక-19.

బుధవారము, జూన్ 13, 1951.

ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక

# భారత జ్యోతి

సంపుటము. ౪. సంచిక 19. | శ్రీ ఖరనామ సంవత్సర వైశాఖ శు. ౮, జూన్ 13, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## పోలీసు పరిపాలనము రిపబ్లిక్ ఇండియాలో పునరుద్ధరింపబడినది.

శ్రీ జవహరిలాలుగారి అసంతృప్తికరమైన పరిపాలనము ఈ 1951 సం॥ జూన్ నెల 2-వ తేది సంపూర్ణత నొందినది. ఉచ్ఛస్థానమున కొచ్చినది. 1950 సం॥ జనవరి 26-న తేది నూతన రాజ్యాంగ విధానము ఈ దేశములో అమలులోనికి వచ్చెను. తీర 16 నెలలుకూడ నిండీ నిండక మునుపే, ఆరాజ్యాంగచట్టము కత్తిరింపులకు గురియైనది. రాజ్యాంగ చట్టములో పరిమితిముగా ఒసగబడిన వాక్స్వాతంత్ర్యము, భావ స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యములకు స్వస్తి చెప్పబడినది. ఇండియా పార్లమెంటులో ఒకే ఒక్క రాజకీయ పక్షముకలదు. ప్రతిపక్ష వర్గము శూన్యము. ఇట్టి పరిస్థితులను అవకాశముగా గైకొని, ఒకేపార్టీ యొక్క పశుబలమును ఆధారముగ గైకొని, పౌర ప్రాథమిక హక్కులను శూన్యము గావించుటకై ప్రతిపాదించిన "రాజ్యాంగ సవరణ బిల్లును" ఈ 2-న తేదీ చట్టముగా ఒనర్చియున్నారు. నిరంకుశత్వము, నియంతత్వము, ఫాసీజము, నాజీజము ఇంతకన్న ఎక్కువ పోగలుగునా?

పార్లమెంటులో విమర్శించినవారి నోళ్లను, ప్రతికక్షి వర్గములో ఖాళీగానున్న బెంచీల నోళ్ళను మూయించి, ఈ ఉపద్రవ కరమైన బిల్లును శాసనముగా నొనర్చితినని శ్రీ జవహరిలాలుగారు గర్వింపవచ్చును. తనప్రతిభ ఉచ్ఛస్థాయి కొచ్చినదని తనలో తాను సంతృప్తి పడవచ్చును. కాని పార్లమెంటు భవనమునకు వెలుపలనున్న విశాల ప్రపంచముయొక్క కండ్లను, చెవులను శ్రీ జవహరిలాలుగారు మూయజాలరు. తమ కాంగ్రెసు పార్టీలో సభ్యులుగా నున్నవారిలోనే, సుమారు 70 మందికన్న అధికముగా పార్లమెంటు సభ్యులు "నిరంకుశ పరిపాలనా చిహ్నమైన ఈ సవరణ బిల్లుకు" తమ ఇచ్ఛవచ్చినట్లు ఓటువేయుటకు స్వాతంత్ర్యమును ఇవ్వవలెనని శ్రీ జవహరిలాలుగారిని కోరుచు, విజ్ఞాపనలు పంపుకొన్న విషయమున్ను; అలహాబాదు విశ్వవిద్యాలయ న్యాయశాస్త్ర ఆచార్యులైన ప్రొఫెసర్, కె. కె. భట్టాచారిగారు ఈ బిల్లుపై తనకిష్టము వచ్చినట్లు ఓటుచేయుటకు నిరాకరించినందువల్ల, కాంగ్రెసు పార్టీకిని, కాంగ్రెసు సభ్యత్వమునకు రాజీనామా నొసగిన విషయమున్ను, బాహ్య ప్రపంచము గుర్తించియే యున్నది. కాంగ్రెసు పార్టీనుండి వెడలకొట్టెదరేమో అను భయమునకు లోనై, అనేకమంది పార్లమెంటు సభ్యులు, తమ మనసాక్షికి వ్యతిరేకముగా ఈ "సవరణబిల్లుకు" ఓటుచేసిన విషయముకూడ ప్రపంచమునకు తెలియును. గాంధీజీకి వారసని చెప్పబడు శ్రీ జవహరిలాలుకు కాని లేక ఇండియా ప్రభుత్వ మంత్రివర్గమునకు కానిఇది విజయమని చెప్పుట కెంతమాత్రము వీలులేదు.

రాజ్యాంగ చట్టమునకు సవరణ (అమెండుమెంటు) బిల్లు, ఇండియా పార్లమెంటులో ప్రవేశపెట్టినది మొదలు, బిల్లు మూడవసారి చదువబడి శాసన మగువఱకును శ్రీ జవహరిలాలుగారు గావించిన ప్రసంగములను చదివినచో, ఆయనపై గౌరవాదరణలు కల అసంఖ్యాకులగు ప్రజలలో విముఖత కలుగజేయు భావము జనించినది. జ్ఞానవంతులలో కూడ ఇదే భావ మంకురించినది.

ఈ దేశములో నివసించుచున్న విదేశ రాయబారులలోను, పాశ్చాత్య విజ్ఞానులలోను ఆ ప్రసంగములు ఏవిధమైన అభిప్రాయములు కలుగజేసినవో చెప్పలేము. ఇండియాకు స్వాతంత్ర్యము రాకమునుపు అఖిలభారత పౌరహక్కుల రక్షణ సంఘమునకు శ్రీ జవహరిలాలుగారు అధ్యక్షులుగా నుండిరి. ప్రజల ప్రాథమికహక్కులకై తీవ్ర పోరాటమును సలిపిరి. అట్టివ్యక్తి ఆ విధమైన ప్రసంగములను గావించుట పాశ్చాత్యులలోకూడ ఆశ్చర్యము కలిగించియే యుండును.

రాజ్యాంగ చట్టములో ప్రాథమిక హక్కులను స్పష్టీకరించుటకై ఉపయోగింపబడిన వాక్యములలో అర్థము స్పష్టముగా లేదు. ఆవాక్యముల లోని అర్థమును స్పష్టపఱచుటకే ఇప్పుడు సవరణ బిల్లు ప్రతిపాదింప బడుచున్నది. ఈ సవరణబిల్లు వలన రాజ్యాంగ చట్టము మారదని ఒక్క అంశమునే ప్రతి ప్రసంగములోను శ్రీ జవహరిలాలుగారు నొక్కిచెప్పుచు, దేశీయులను సంతృప్తి పడమనిరి. హోమ్ శాఖా మంత్రిగారైన శ్రీ రాజగోపాలాచార్యులుగారును, న్యాయశాఖ మంత్రిగారైన డా॥ అంబేద్కర్ గారును, శ్రీ గోపాలస్వామి అయ్యంగారు గారును, తమనోటినుండి వెలువడు వాక్యములయొక్క అర్థతీవ్రతను గుర్తింపక, చిలుకలవలె శ్రీ జవహరిలాలుగారి పదములనే పలుకజొచ్చిరి.

ఎవరిని మోసగించుటకై ఈ నాయకులు ఇట్టి వాక్యములను, ఇట్టి భావములను వెలిబుచ్చుచున్నారో అర్థమగుటలేదు. "దేశరక్షణకు సంబంధించిన విషయములు; పబ్లిక్ ఆర్డరు; (శాంతి భద్రత) స్నేహ భావముతోనున్న విదేశీయులకు సంబంధించిన విషయములు, నేరమును ప్రోత్సహించుట" అను వాక్యములు ఇంతవఱకు రాజ్యాంగ చట్టములోలేని భావములను తెలుపుట లేదా? నూతన ఉపద్రవములను సృష్టించుట లేదా?—

ఇంతవఱకును అమలులోనున్న రాజ్యాంగ చట్టము క్రింద 19 (1) సెక్షనులో పరిమితిగా ఒసగబడిన వాక్స్వాతంత్రమును, భావస్వాతంత్ర్యమును, పత్రికా స్వాతంత్ర్యమును పై వాక్యములు పూర్తిగా దోచుకొనుటలేదా? పైన తెలిపిన పదములు, వాక్యములు అస్పష్టమైనవి, హద్దులేనివి. పౌరునియొక్క ప్రతి చర్యను వర్తింపజేయుట కనుకూలమైనవి. శ్రీ జవహరిలాలు తాను గావించిన ప్రసంగములలో అక్కడక్కడ ఈ పదములకు పరిమితి లేనట్టి అర్థము కలదనియు; దుర్వినియోగ పఱచుటకనుకూలపడుననియు; పౌరుల సహజమైన వాక్స్వాతంత్ర్యమును, భావస్వాతంత్ర్యమును, అణచివేయుట కవకాశమొసగు ననియు అంగీకరించిరి. రాష్ట్ర ప్రభుత్వములకును, కార్యనిర్వాహక వర్గమువారికిని ఈ వాక్యముల నుపయోగించుట వలన కలిగింపబోవు అధికారములను దుర్వినియోగపఱచరని నేను హామీ నివ్వజాలనని శ్రీ జవహరిలాలుగారు చెప్పిరి.

"నేరమునకు ప్రోత్సహించుట" అను వాక్యము దేనికైనను అన్వయించునను మాట నిజము. ... ... మీరు పార్లమెంటుపైనను, న్యాయ స్థానములపైనను, ఆధారపడి యుండవలెను.

"నేనుకాని లేక మీరుకాని సహించుకొని యుండజాల నంతవఱకు రాష్ట్ర శాసనసభలు హద్దుమీరి పోవుట కవకాశమున్నది.

"19 (2) శెక్షనును సవరించుట వలన పత్రికలకు సంబంధించిన విషయములలో పార్లమెంటుకు కొన్ని అధికారములు కలుగజేయబడినవని చెప్పుట నిజము. కొంత ప్రమాద

మున్నదను మాట నిజము. పార్లమెంటువారు తమకు నిరోధకరముగా ఈ హక్కులను ఉపయోగించెదరేమో అను భయము పత్రికా రచయితలలో కలదు. వారికి ప్రతికూలముగ యీ హక్కులు ఉపయోగింపకుండ వారు ప్రయత్నము సలుపుట సహజము"— అని శ్రీ జవహరిలాలు గారు తెలిపిరి.

19 (2) శెక్షనుకు క్రొత్తసవరణ వాక్యములు చేర్చుటవలన పౌరుల హక్కులకును, పత్రికల స్వాతంత్ర్యమునకును ప్రమాదము సంభవించునని తెలిసి తెలిసి, ఎందుకు నిలుపుదల చేయరైరి. ఈ సవరణ తీర్మానమువల్ల క్రొత్తగా కలుగబోవు అధికారములను, రాష్ట్ర మంత్రివర్గములు కాని లేక పార్లమెంటు కాని ప్రజల పట్లను, పత్రికల పట్లను దుర్వినియోగము చేయకుండ ఆవాక్యములను సంస్కరించుటకు కాని, వానికి హద్దుల నేర్పరచుటకు కాని ఎందుకు సమ్మతింపరైరి? జనరల్ ఎన్నికలు జరుగుటకు ముందుగ పార్లమెంటు మఱియొకసారి సమావేశమగును. అంతవఱకైనను 19(2) సెక్షనుపై చర్చను, చర్యను ఎందుకు నిలుపుదల చేయుట కంగీకరింపరైరి? ఈ ప్రశ్నలలో ఏ ఒక్కదానికికూడ సరియైన ప్రత్యుత్తరము శ్రీ జవహరిలాలు గారికి లేదయ్యెకదా!

హోముశాఖా మంత్రికాని లేక న్యాయశాఖ మంత్రిగాని, ఈ సవరణబిల్లును ఉపపాదించుటకు ఏల ముందుకు రాలేదని ఆచార్య కృపాలనీ గారు వేసిన సూటి ప్రశ్నకుకూడ శ్రీ జవహరిలాలు గారికి ప్రత్యుత్తరములేదు. వీరు ఈ ఇద్దరి చేతులలో కీలుబొమ్మనవలె ప్రవర్తించిరి కదా!

15 (3) సెక్షనుకు సంబంధించిన సవరణ తీర్మానమును గుఱించి మాటలాడుచు, న్యాయశాస్త్రము ప్రకారము కాని, రాజ్యాంగ చట్టము ద్వారా కాని యిష్టమొచ్చినటుల దుర్వినియోగించకుండ సెలెక్టు కమిటీవారు అపుడల చేయరైరని శ్రీ జవహరిలాలుగారు చెప్పిరి. "ఆర్థికముగా" అను పదము 340 సెక్షన్‌లో ఉపయోగింపబడ లేదు. అందువలన దానిని క్రొత్త సవరణ తీర్మానములో చేర్చలేదని చెప్పిరి. కాని (1) పబ్లికు ఆర్డరు; (2) విదేశ ప్రభుత్వములతోగల స్నేహ సంబంధములు; (3) నేరమును ప్రోత్సహించుట అను పదములు కాని లేక వాక్యములు కాని రాజ్యాంగ చట్టములో ఎచ్చటనైనను ఉపయోగింప బడినవా? ఈ క్రొత్త పదములను ఏవిధముగా 19 (2) సెక్షనుకు శ్రీ జవహరిలాలుగారు చేర్చియున్నారు? "ఆర్థికముగా" వెనుకపడిన ప్రజలుకూడ 15 (3) సవరణ తీర్మానము ప్రకారము లాభ పడవలెనని శ్రీ జవహరిలాలుగారి ఆశయమేమైయుండినచో, "ఆర్థికముగా" అను పదమును 15 (3) సెక్షనులో చేర్చుటకు ఏలాటి అడ్డు కలిగియుండజాలదు. 15 (3) సెక్షనులో ఇప్పుడు క్రొత్తగా చేర్చిన "సాంఘికముగను, విద్యావిషయములలోను వెనుకబడియున్న" అనుపదముల అర్థము "ఆర్థికముగా వెనుకబడియున్న" అను పదమునకుకూడ వర్తించునని శ్రీ జవహరిలాలుగారు వాదించిరి. ప్రజలను కూడ అదేవిధముగ నమ్మమనిరి. ఈ విధముగా చెప్పుట ప్రజలయొక్క సూక్ష్మబుద్ధికి అపచారమొనర్చుట కాదా?

19 (2) సెక్షనుక్రింద క్రొత్తగా కలుగజేసిన అధికారముల నవకాశముగ తీసికొని, రాష్ట్ర ప్రభుత్వములు చేయబోవు చట్టములన్నియు ఇండియా యూనియన్ అధ్యక్షుని అంగీకారమునకు పంపియే తీరవలెనని రాజ్యాంగ చట్టములో నిర్వచించుటకు తన కెంతమాత్రము ఆక్షేపణలేదని శ్రీ జవహరిలాలుగారు పదేపదే చెప్పిరి. దీనినైనను నెరవేర్చిరాయనిన అదికూడ చేయరైరి. రాష్ట్ర మంత్రివర్గములవారికి అప్పుడప్పుడు స్నేహపూర్వకమైన సలహాల నొసగెదమనియు; రాష్ట్ర

మంత్రివర్గములు సలహాల నంగీకరించెదరని నమ్మెద ననియు చెప్పి, ప్రజలను సంతృప్తిపడమనిరి.

అన్ని దృక్పథములనుండి సవరణ బిల్లును పరీక్షించుటకై కావలసిన రికార్డులను కాని, లేక తగుమైన వ్యవధిని కాని ఇవ్వలేదని డా॥ శ్యామ ప్రసాద్ ముఖర్జిగారు బిగ్గరగ తెలిపిరి. స్వీడను దేశపు రాజ్యాంగ చట్టమును గురించి శ్రీ రాజ గోపాలాచార్యులు వారును, డా॥ అంబేద్కర్ గారును గోరంతలు కొండంతలుగా చెప్పిరి. ఆ రాజ్యాంగ చట్టము ప్రతినొకదాని నివ్వమని డా॥ ముఖర్జీగారు కోరగా ఇవ్వలేదు. పార్లమెంటులో చర్చించుచున్న సమయములో - కొన్ని అంశములను విశదీకరింపమని డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారుకోరగా నిర్లక్ష్యభావముతో "పాఠశాల తరగతిలో ఉపన్యసించుటలే" దని డా॥ అంబేద్కర్ గారు ప్రత్యుత్తర మొసగిరి. సెలెక్టుకమిటీనుండి బిల్లు తుట్టతుదకు ఏ రూపముదాల్చినదో తెలిసికొను అవకాశము, మే నెల 25-వ తేది ఉదయము8-45 గంటల వఱకు సెలెక్టుకమిటీ సభ్యుల కొసగలేదని జనాబ్ నజరుద్దీన్ అహమద్ గారు వాపోయిరి. ఇది ఎంతటి అవమానకరమైన విషయము!

శ్రీ జవహరిలాలు గారు ఏ సందర్భములో కూడ ఈ విషయమును ప్రస్తావింపలేదు. పార్టీ విభేదములతో సెలెక్టుకమిటీ సభ్యులు ఈ బిల్లును పరీక్షింపలేదు. ఏకాభిప్రాయమునకు రావలెనను దృష్టితోనే కృషిచేసిరని సగర్వముగ పార్లమెంటులో వెల్లడి చేసిరి. కావలసిన రికార్డులను సెలెక్టుకమిటీసభ్యుల ఎదుట పెట్టకపోవడము, సావకాశముగ బిల్లును చర్చించుటకు సభ్యుల కవకాశమివ్వక పోవడము, ఏకాభిప్రాయమునకు రావలెనని కృషిచేయడమా! ఇది శ్రీ జవహరిలాలుగారు చెప్పుటకు తగునే కాని మరెవ్వరు చెప్పజాలరు.

ఈ విషాదాంత ఉపకథలో, శ్రీ రాజగోపాలాచార్యులవారు నిర్వహించిన పాత్ర దుర్భరముగ నున్నది. విశాలభావములుకాని, దృష్టికాని కలవారని వీరు పేరొందిన వారుకారు. క్రిమినలు లా సవరణ చట్టమును నిర్మూలింపమని గాంధిజీ సలహా యొసగినను, వీరు చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రిగానుండు కాలములో వినరైరి. మీదుమిక్కిలి దానిని సమర్ధింప బూనిరి. శ్రీ బులుసు సాంబమూర్తిగారిని, కీ॥ శే॥ డా॥ సుబ్రహ్మణ్యము గారిని పోలీసు శాఖలోనుండిన జనాబ్ ముస్తఫాల్లీ ఖాన్ గారు బూడ్సు కాళ్లతో రొమ్ముపైకొట్టి ప్రఖ్యాతికొచ్చిరి. ఆయనపై చర్యగైకొనమని ఆందోళన చేసినను, శ్రీ రాజగోపాలాచార్యులు గమనింపరైరి. "అధికారమునకును" "నిర్బంధ విధానమునకును" "పోలీసువాడికిని" వీరు అభిమానకర్తలు. బిల్లును పార్లమెంటు సభలో ఉపపాదించుటకు ముందుకురాక, శ్రీ జవహరిలాలుగారిని ముందుకు ఎందుకు త్రోసిరో వీరు కూడ చెప్పుటకు సాహసింపరైరి.

"దౌర్జన్యమును ప్రోత్సహించుట" అను పదములకన్న "నేరములను ప్రోత్సహించుట" అను పదములే సవరణ తీర్మానములో నుండవలెనని శ్రీ రాజగోపాలాచార్యులవారు సమర్థించుచు:-

"సంఘాభివృద్ధికి ఏదైనను చెడ్డదని శాసనసభలు తీర్మానించినచో, దానిని అతిక్రమించినవారు శిక్షింపబడవలెను. అటువంటి నేరములను ప్రోత్సహించుట వాక్స్వాతంత్ర్యము కాజాలదు. చిన్న విషయములను నేరముగా చేయకూడదు. అట్టివికూడ నేరములని ఒక్కసారి తీర్మానించినచో, అట్టి నేరములను ప్రోత్సహించుట సహింపరాదు" అని శ్రీ రాజగోపాలాచార్యులుగారు చెప్పిరి.

ఇది దూష్యభావకరమైన సిద్ధాంతము. ప్రమాదకరమైన సిద్ధాంతము. ప్రస్తుత పార్లమెంటు ఒకే రాజకీయ పార్టీగల సంస్థ. బుద్ధియుండియో

లేక బుద్ధిలేకనో వాక్స్వాతంత్ర్యమును, భావస్వాతంత్ర్యమును శూన్యము గావించుటకై రాజ్యాంగ చట్టమునకు ఈ సవరణబిల్లును ఆమోదించినది. వాక్స్వాతంత్ర్యము, భావస్వాతంత్ర్యము ఇండియాకు చెడ్డవని శ్రీ రాజగోపాలాచార్యుల వారి సిద్ధాంతము ప్రకారము, పార్లమెంటు తీర్మానించినది. ఈ సవరణబిల్లును (చట్టమును) రద్దుచేయమని చెప్పుటకాని లేక పత్రికలలో వ్రాయుటకాని ఒక నేరమగును. ఈచట్టముపై నిరసన భావమును ప్రకటించుటకై వార్తాపత్రికలన్నియు ప్రకటించుట, ఆపివేయమని సలహాయిచ్చుట కూడ నేరమగును. ఇప్పటి దేశపరిస్థితులు మద్యపాన నిషేధ శాసనములను అమలులోనుంచుట వివేకముకాదని పలువురు అభిప్రాయపడుచున్నారు. మద్యపాననిషేధము ఒక చట్టమైనది. ఈ చట్టమును రద్దుచేయమని ప్రభుత్వమును కోరుటకూడ ఒక నేరమగును. ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో స్త్రీ, పురుషులు వివాహమాడుటకాని, సంతానమును బడయుటకాని మంచిదికాదని పార్లమెంటు భావింపవచ్చును. వివాహములను, సంతానములను నిషేధించుచు రేపు పార్లమెంటు చట్టములు చేయవచ్చును. ఈ చట్టము అమానుషమని చెప్పుట నేరమగును. నేరమును ప్రోత్సహించుట అగును. ఇట్టిపరిస్థితులలో అంత్యమెప్పుడు? అంత్యమెచ్చటనున్నది? ఇటువంటి స్వాతంత్ర్యముననేనా గాంధిజీ పాటుపడి, తన ప్రాణముల నర్పించినది?

కీ॥ శే॥ జిన్నాసాహెబ్‌గారి సలహాల ప్రకారము దేశవిభజన కంగీకరించుటలేదని కాంగ్రెసు సంస్థ తీర్మానించియుండెను. దేశమును విభజించుటే మంచిదను సూత్రముపై ప్రచారము చేయుటకు తన కనుమతివ్వవలెనని శ్రీ రాజగోపాలాచార్యులవారు కోరుటయు, కాంగ్రెసు సభ్యత్వమునకు రాజీనామా నొసగి, దేశమును విభజింపవలెనని ఒకమూలనుండి మఱియొకమూలకు తిరుగుచు, శ్రీ రాజగోపాలాచార్యుల వారు ప్రచారము సాగించినదియు, పాఠకులు జ్ఞాపకముంచుకొన కోరుచున్నాము. తాను నమ్మిన సిద్ధాంతమును ప్రచారముచేయుటకు వాక్స్వాతంత్ర్యమును కోరినవ్యక్తి, యూనియన్ మంత్రివర్గములో హోమ్‌శాఖ మంత్రిగా కూర్చొని, పౌరుల వాక్స్వాతంత్ర్యమును, పత్రికా స్వాతంత్ర్యమును నిరోధించుచున్నాడు కదా!

ప్రభుత్వము దయాళువై యుండవచ్చును. కాని వెఱ్ఱి భ్రాంతులకులోనై, నేరములు కానివానిని నేరములుగా ఒనర్చి, ఏదో ఒకసాకుపై ప్రజల సహజ హక్కులను దోచుకొనుట కనుగుణ్యమైన ఎక్కువ అధికారములను ప్రభుత్వమునకు ఒప్పగించుట చాల ప్రమాదకరమైన కార్యము. పౌరుల హక్కులకన్న – పత్రికల హక్కులు ప్రత్యేకమను భ్రాంతితోనే ప్రధానమంత్రిగారును, హోమ్‌శాఖ మంత్రిగారును కొనా మొదలు ప్రసంగించిరి. పత్రికా స్వాతంత్ర్యమును అరికట్టు ఉద్దేశ్యము తమకులేదని ప్రకటించిరి. విదేశాంగ విధానమును కాని లేక ఇతర దేశముల విదేశాంగ విధానములుగాని, ఎంతగా విమర్శించినను, తనకు సంబంధించినంత మట్టునకు ఎట్టి చర్యగైకొనుటలేదని ప్రధాన మంత్రిగారు చెప్పిరి. 19 (2) సెక్షనుకు సవరణ విషయమై యోచించినప్పుడు అది పత్రికా స్వాతంత్ర్యమును నిరోధించునని తనకు తట్టనేలేదని చెప్పిరి. కాని ఆ సవరణ తీర్మానము పత్రికాస్వాతంత్ర్యమును శూన్యము గావించుననియు; బ్రిటీషువారి కాలములో చేయబడిన పత్రికా నిర్బంధ శాసనములన్నిటికిని మరలా ప్రాణము పోయబడుననియు; రామరాజ్యమునకు బదులు, పోలీసు రాజ్యము సృష్టింపబడుననియు స్పష్టముగా తెలియజేసిన తర్వాతనైన తనప్రయత్నమును మానుకొనిరా? ఉపద్రవము కలిగించుట కనుకూలమైన హద్దులేని పదములకు హద్దులు ఏర్పరచవలెనని కోరినను వినరైరి.

అంతయు కొనమొదలు తుదివఱకు సింహావలోకనము గావించినచో, ప్రజాభిప్రాయములను శిరస్సున వహించి, పరిపాలనము సాగింపవలెనని ఘోషించువారిలో మొట్టమొదటి వ్యక్తియైన శ్రీ జవహరిలాలుగారు నిరంకుశుడుగా మారిపోయెను. రాజ్యాంగ చట్టమును ఒక చింపి కాగితముతో సమానముగా చూచెను. వాక్స్వాతంత్ర్యమును, భావస్వాతంత్ర్యమును, పత్రికా స్వాతంత్ర్యమును మంట కలిపెను. రాజ్యాంగవిధానములో స్పష్టీకరించిన సిద్ధాంతముల ననుసరించి, తన కాంగ్రెసు ప్రభుత్వము, దేశపరిపాలనమును కొనసాగింపజాలదని తనకు తోచియుండినచో, ఆ విధముగ చెప్పియుండవలసినది. రాజ్యాంగ విధానమునే సంపూర్ణముగ రద్దుచేసి, బ్రిటీషువారి సామ్యము ననుసరించి, పార్లమెంటుకే సర్వాధికారములు ఒప్పగించియుండవలసినది. రాజ్యాంగ చట్టము రీత్యా హామీ యొసగబడిన పౌరుల ప్రాథమిక హక్కులను శూన్యము చేయుటకన్న, పైన తెలిపిన మార్గము ననుసరించియుండిన శ్లాఘపాత్రముగ నుండెడిది. మిష్టర్ ఫ్రాంక్ ఆంథోనిగారు తెలిపినటుల 19 (2) సెక్షను వ్యక్తి స్వాతంత్ర్యమను కోటపై ప్రయోగింపబడిన మొదటి ఫిరంగిగుండు వంటిది. కేంద్ర ప్రభుత్వములోని మంత్రివర్గము వారికిని, రాష్ట్ర మంత్రివర్గములవారికిని, స్థాపితము చేయబడినపోలీసు రాజ్యమునకు ప్రాణముపోసి, రిపబ్లిక్ ఇండియాలో పునరుద్ధరించు అధికారమును ఈ బిల్లు కల్పించినది.

———

మారణ యంత్రములను కలిగి, వానిని ప్రయోగించు శక్తియుండినచో, స్నేహభావము వలన కాకున్నను, భయము వల్లనైనను యుద్ధమును నివారింప వచ్చునని తలంపబడెను. కాని దురదృష్టవశమున ఈ ఆశయము, ముందు ఎంత దూరముగ ఉండినదో, ఇప్పుడుకూడ అంత దూరములోనే యున్నది. ప్రతి స్వతంత్రమైన దేశముకూడ తన అధికారలోభమును, స్వాతంత్ర్యములోను కొద్దిగనైనను ప్రపంచ క్షేమమునకును, లాభమునకును త్యాగ మొనర్చుట కిష్టపడకుండుటయే యిందుకు కారణము.

గౌ. న్యా. హెచ్. జే. కన్యా,
సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తి, మార్చి 31—వ తేది.

* * * *

కాశ్మీర సమస్యపై ఆంగ్లో—అమెరికన్‌లు ప్రతిపాదించిన తీర్మానమును ఇండియా అంగీకరింపలేదు. అందువలన కలుగబోవు ప్రతిఫలమును ఎదుర్కొనుటకు సంసిద్ధముగా నున్నది. పంచాయతీ తీర్మానము కాశ్మీర ప్రజల ఆత్మగౌరవమునకేగాక ఇండియా ప్రజల ఆత్మగౌరవమునకు కూడ భంగకరముగా నున్నది. ఆత్మగౌరవమును ఇండియా దేశము అపహరణయందుంచజాలదు. ఆ సవాలును ఎదిరించుటకు మన మెల్లరము సిద్ధముగా నున్నామని నేను నమ్ముచున్నాను.

శ్రీ. జవహరిలాలు నెహూరు, కాశ్మీరము, ఏప్రిలు 2—వ తేది.

♦♦♦ ♦♦♦ ♦♦♦ ♦♦♦

# విజ్ఞాన విశేషాలు.

## సరియైన టైము చూపే అమెరికా గడియారము—ప్రపంచములోని గడియారాలను దిద్దుకొనుటకై రెండు గంటల కొకసారి సూచనలు.

దూరప్రాచ్యము, ఆఫ్రికా, ఆసియా, పశ్చిమార్ధగోళము దేశాలలోని అన్ని రేడియో స్టేషనులకు అమెరికానుండి సమయ సూచనలు చేయబడుచున్నవి. సరియైన టైము అమెరికా దేశమంతటా తెలియడము కొరకు 2,00,000 మైళ్ళకు పైగా టెలిగ్రాఫు తీగల ద్వారా ఈసమయ సూచనలు పంపబడుచున్నవి.

పీప్స్ అనేపేరుతో ఈ సమయసూచనలు ప్రతి రెండు గంటలకు చివరి 5 నిముషాలలో పంపబడుచున్నవి. వాషింగ్టనులో సముద్రమట్టానికి బాగా ఎత్తయిన స్థలంలో నిర్మించబడిన అమెరికా నౌకా శాఖ పరిశోధన కార్యాలయమువారి గడియారము ఆధారముగా తీసుకొని సమయ సూచనలు చేయుచున్నారు.

ఒక దినము 24 గంటల కాలమును కొలవ డానికిగాను నౌకాశాఖ ఖగోళ శాస్త్రజ్ఞుడు ఒకనక్షత్రాన్ని గుర్తించుకొని, తన దూరదర్శిని యంత్రములో మరునాడు అదేచోటుకు ఆనక్షత్రము సరిగా ఏకాలమునకు తిరిగి వచ్చుచూ పరిశీలించు చుండును. శాస్త్రజ్ఞుని పరిశీలనాఫలితము సెకండులో వెయ్యోవంతు భాగము తప్పినప్పటికి, అప్పటి గడియారము సరిదిద్ద బడును.

ఈ సమయ సూచనలు కేవలము నావికులకే కాక, సర్వేయర్లు, ఖగోళ శాస్త్రజ్ఞులు, పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, భూమిగురుత్వాన్ని, భూకంపాలను కనిపెట్టే శాస్త్రవేత్తలకు కూడ ఉపయోగపడగలవు.

పరిశోధకు లందరికి ముఖ్యముగా కావలసినది టైము. 1842 నుండికూడా శాస్త్ర పరిశోధనకు ఆధారమైన టైమును కొన్ని నక్షత్రాలను గుర్తించుకొనడము ద్వారా నౌకా శాఖ పరిశోధన కార్యాలయమువారు ఖగోళ పరిశోధనలు చేస్తూనే వున్నారు. గ్రహస్థితిని బట్టి కాలములోని మార్పులను సరిదిద్దడానికి గాను ఏర్పడిన సంస్థలలో అమెరికా నౌకాశాఖ పరిశోధన కార్యాలయము ఒకటి.

పరిశోధనా కార్యాలయము మొదటి సమయ సూచనను 1904లో ప్రసారించినది. ఒక ఏడాది తరువాత నుండి నిత్యము సమయ సూచనలు ప్రసాదింపబడు చున్నవి. సెకండులో $\frac{8}{1000}$వ వంతు వరకు మాత్రమే మార్పు ఉండడము ఈ గడియారములోని విశేషము.

# అవీ—ఇవీ.

## ఉపాధ్యాయులకు న్యూయార్కు పత్రిక పౌరశిక్షణ. ఇండియాలో కూడ ఈ పద్ధతిని అనుసరించెదరా?

విద్యార్థులు ప్రజా జీవనములో వివేకవంతమై, ఉపయోగకరమైన పాత్రను నిర్వహించునట్లు చేయునిమిత్తము "న్యూయార్కు టైమ్స్" పత్రిక ఆనగరములోని ఉపాధ్యాయులకు తోడ్పడుచున్నది.

న్యూయార్కు నగర విద్యా సంఘమువారితో సహకరించుచు, ఈ పత్రిక కడచిన 7 సంవత్సరములుగ 'విద్య-వార్తలు' అనే అంశముపై ఏటేటా 15 వారాలు శిక్షణ ఏర్పాటు చేయుచు వచ్చినది. విద్యార్థులు స్థానిక, జాతీయ సమస్యల విషయములో తమ పాత్రలను సక్రమముగా నిర్వహించడానికి వారందరు-అసలు దేశములో ఎక్కడ ఏమి జరుగుచున్నదో చక్కగా తెలిసికొని ఉండడము అవసరము అనే భావముతో ఈ శిక్షణ ఏర్పాటు చేయబడినది.

ఈ శిక్షణలో అంతర్జాతీయ, ఆర్థిక, కార్మిక, సైనిక, శాస్త్రవిషయక, వైజ్ఞానిక వార్తావళినంతా వారికి బోధింపబడును. ఒక్కొక్క వారములో ఒక విషయాన్ని గురించి ముఖ్యముగా చెప్పెదరు. రోజూ మొట్టమొదట "టైమ్స్" పత్రికలోని ఉద్యోగులు ఆయా విషయాలపై ఉపన్యాసాలు ఇచ్చెదరు.

ప్రాథమిక, సెకెండరీ స్కూళ్లలో ఇంగ్లీషు, సాంఘిక శాస్త్రము బోధించే ఉపాధ్యాయుల నిమిత్తము ఈ శిక్షణ ఏర్పాటు చేయబడినది.

# బీదల కడుపుగొట్టి ఉద్యోగులను మేపుట.

డా॥ జాన్ మత్తాయిగారు పూనా పట్టణములో మే నెల 26-వ తేది వాణిజ్య కళాశాలకు శంకుస్థాపన చేయుచు:—

"ఇండియా దేశములోని ప్రజలు నికృష్టమైన జీవనము చేయుచున్నారు. ఇంకను కఠినమైన జీవనము చేయుమని వారికి చెప్పుటలో అర్థము లేదు. అధిక చెలామణిని తగ్గించుటకు, పన్నులను ఎక్కువ చేయుట ఒక మార్గమని చెప్పెదరు. ఇది చాలా పూర్వాచారమైన పద్ధతి. ఇప్పుడు ఈ పద్ధతి పనికిరాదు. ప్రభుత్వ పరిపాలనా కర్చులను తగ్గించుటే సరియైన మార్గము. ప్రభుత్వ కర్చు తగ్గించుటలో ఇంతవరకును ఏవిధమైన ప్రయత్నమును గావింపలైరి.

"ఉత్పత్తిని అధికము చేసినప్పుడే అధిక చెలామణి సన్నగిల్లునని ఎల్లరు అంగీకరించెదరు. కాని ఇందులో కూడ ఒక్క ముఖ్యవిషయమును గమనించుటలేదు. ఉత్పత్తిని అధికము చేయవలెనని చెప్పిన, నూతన ప్రణాళికలను అమలు పెట్టవలెనని తలచుచున్నారు. ఇది పొరబాటు. క్రొత్త ఉత్పత్తి సంస్థలను స్థాపించుట కాదు. ఇప్పుడు దేశములోనున్న ఉత్పత్తి యుపకరణములు పాతగిలిపోయినవి. శిథిలమైపోయినవి. వానిని మరమ్మతు చేయుటే ఇప్పుడు జరూరుగ కావలసినపని. దీనిని మాత్రము ప్రభుత్వము వారు గమనింపజాలకున్నా"రని చెప్పిరి.

బ్రిటీషువారి పరిపాలనా కాలములో పరిపాలనా వ్యయమును తగ్గించుటకై, వారెంత మాత్రము వెనుకాడిన వారుకారు. 'పబ్లిక్ అంకౌంట్సు కమిటీ' యనునది ఒకటుండినది. వివిధ పరిపాలనా శాఖలలో జరుగు దుబారాలను గమనించి, వానిని ఆపుదల చేయుచుండినది. కడచిన పదిసంవత్సరములుగ పరిపాలనా వ్యయము మితిమీరిపోయినది. ఎన్నియో శాఖలు స్థాపింపబడినవి. లెక్కకు లేనన్ని అనవసరమైన ఉద్యోగములు కల్పింపబడినవి. పరిపాలనకర్చు పెనుచిచ్చుమాదిరి పెరిగిపోయినది.

పరిపాలనా వ్యయమును తగ్గించుటకై కాంగ్రెసు ప్రభుత్వముల వారు అనేక కమిటీలు ఏర్పాటుచేసిరి. ఆ కమిటీలు వివిధముగా పరిపాలనా కర్చును తగ్గింప వీలగునో వివరముగా సూచించుచు నివేదికలను తయారుచేసిరి. మంత్రి వర్గములకు సమర్పించిరి. కాని ఆ సూచనలను ఆమలునందుంచి పరిపాలనా కర్చును తగ్గించుటకు ఏమంత్రివర్గమువారుకూడ ముందుకురాలైరి. ఇందువల్లనే ఈ దేశములో యింత సంక్షోభము కలుగుటకు కారణమైయున్నది. కాంగ్రెసువారు పరిపాలనా భారమును వహించిన ఈ ఐదుసంవత్సరములుగ ఒక్క ఘనకార్యమైనను సాధింపజాలరైరి. ఆశాపూరితమగు మాటలను చెప్పుచు కాలము పుచ్చుచున్నారు. మంచిమాటలను చెప్పుచు, ప్రజలపై పన్నుల భారమెక్కువ చేయుచున్నారు. జీవితములను దుర్భరము చేయుచున్నారు. వారింతకు వారికి తోచదు. ఇతరులు చెప్పినవినరు. పన్నుల మూలముగా ఈ కాంగ్రెసు మంత్రి వర్గముల వారు బీదప్రజల కడుపుగొట్టి ఉద్యోగులను మేపుచున్నారు. శ్రీ జవహరిలాలును పట్టుకొని ఈ విషయములనన్నిటిని అడిగేదిక్కు ఈ దౌర్భాగ్య దేశములో కనపడకున్నది కదా?

క్రొత్తభూమిని సాగుక్రిందికి తెచ్చుటకన్న – సారము తగ్గి అధోగతిలోనున్న భూములను అభివృద్ధి చేయుటకు ప్రయత్నించుటే ఉత్తమమని డా॥ జాన్ మత్తాయిగారు తెలిపిరి. అటులనే మితముగానున్న ఆర్థిక వసతిని, నూతన పరిశ్రమలు స్థాపించుటకు ఉపయోగించుటకు మారుగ, ప్రస్తుతము పనిచేయుచున్న పరిశ్రమలను మరమ్మతుచేసి, అభివృద్ధి చేయుటే ఉత్తమ మార్గమనియు, మొట్టమొదట చేయవలసిన పనియనియు హెచ్చరించుచున్నారు. పాడుబడిన బావులు, చెరువులు, జలాధారములు లెక్కకులేనన్ని ఈ దేశములోనున్నవి.

వానినన్నిటిని మరమ్మతుచేయించి, ఉపయోగమైన విగ చేయుటకు మారుగ, నూతన ప్రణాళికలను తలపెట్టుట సమంజసముకాదని డా॥జాన్ మత్తాయి గారి అభిప్రాయము. వారొసగిన ఉపన్యాసము నంతయు సావకాశముగ చదివినచో – ఈ కాంగ్రెసు మంత్రి వర్గము లనుసరించుచున్న ఆర్థిక విధానము క్రిందను, నిర్బంధ విధానమను రోడ్డు రోలరుక్రిందను, భారత దేశమునకు మంచికాలము కలుగునాయని తోచుచున్నది. దీనికంతయు మంత్రుల మూర్ఖత, వక్రదృష్టితప్ప మరేమియు కారణముకాదు:—

---

# సొంతపనులపై పోవునప్పుడు మంత్రులకు ప్రయాణ కర్చులు – దినబత్తాలు లేదు.

( శ్రీ. యస్. వెంకటాద్రి, ఎం. ఏ. )

ఇండియా ఆడిట్ జనరల్ ఒకస్వతంత్రాధికారి. యూనియన్ ప్రభుత్వములోని మంత్రులు, రాష్ట్రప్రభుత్వములలోని మంత్రులు, విశ్రాంతి గైకొనుటకో లేక సొంత పనిమీదనో, కేంద్ర పట్టణములను వదలి ఇతర చోట్లకు పోవునప్పుడు, ప్రయాణ కర్చులను, దిన బత్తాలను పొందుటకు అర్హత లేదని ఒక ఉత్తరువును జారీచేసియున్నారు. పరిపాలనా నిర్వాహణమునకు సంబంధించిన విషయములను విచారించుటకే మంత్రులు ప్రయాణములు చేయుచో, అప్పుడు మాత్రమే వారు టి.ఏ. లను, డి.ఏ.లను ప్రయాణము కర్చులు, దిన బత్తాలు పొందుట కర్హులైయుండెదరని స్పష్టము చేసినారు.

ఈ యుత్తరువు పైకిచూచెందుకు బాగావున్నది. దీనిని కఠినముగా అమలు జరుపవలెనంటె, యెన్నో కష్టములున్నాయి. అవన్ని ఇండియా ఆడిట్ జనరల్‌గారు యోచించినారో లేదో తెలియదు. ఇప్పుడు ఇండియాలో ఉండే పరిస్థితులకును నాగరీకత గల యితర దేశములలో వుండే పరిస్థితులకును వ్యత్యాసము ఎక్కువగా నున్నది. ఆ దేశాలలో సామాన్య ప్రజలంతా చదువుకొన్నవారు. వారికి "పబ్లిక్ డ్యూటి" (Public Duty – ప్రభుత్వము చేయవలసినపని) అంటేయేమో, "ప్రయివేటు డ్యూటి" లేక ఫంగ్షన్ (Private duty or Function - సొంతపని – వ్యక్తిపరమైనపని) అంటే ఏమో బాగా అర్థమౌతుంది. ఆ దేశములలో సాధారణముగా మంత్రులు తప్పుదారిలో నడుచుటకు అవకాశము లుండవు. అట్లొకవేళ తప్పుదారి నడిచినా ప్రజలు ఊర్కొనరు. వెంటనే జాబులు వ్రాస్తారు. పార్లమెంటులోను, శాసన సభలలోను ప్రశ్నలువేస్తారు. వార్తాపత్రికలకు వ్రాస్తారు.

బ్రిటీషు ప్రభుత్వమున కంతా అట్లి ప్రధానమంత్రి. అతనికి ప్రయాణముచేయుటకు స్టేటు కారు (State Car – ప్రభుత్వము యొసగిన మోటారు) ఉన్నది. కాని అట్లీగారు తమ సొంతపనిపైనకాని, విశ్రాంతి తీసుకొనుటకు కాని లండన్ పట్టణమును విడిచి, సొంత గ్రామానికి పొయ్యేటప్పుడంతా స్టేటుకారులో ప్రయాణముచేయడు. తన పాతపడిన సొంతకారులోనే ప్రయాణము చేస్తాడు. స్టేటుకారును నడిపే డ్రయివరునుకూడ తనకారును నడుపుటకు ఉపయోగించడు. తానే సొంతముగా కారు నడుపుకొంటాడు. లేకుండిన తన భార్య ఆకారును నడుపుతుంది. ఈమాదిరిగా ఈ దినానికికూడ అట్లి ప్రధానమంత్రి చేస్తూయున్నాడు. ఈయ నొక్కడే

యీ విధముగ చేయుటలేదు. బ్రిటీషు మంత్రులు యిదేవిధముగనే ప్రవర్తించెదరు.

దేశపరిపాలనా కార్యములకును, స్వంత కార్యములకును గలభేదములను గమనించి నడచుకొనవలెనన్న యెక్కువ సూక్ష్మబుద్ధి, నైతిక దృష్టికావలెను. గాంధిజీ చాల సూక్ష్మబుద్ధి కలవాడు. ఇండియా దేశము బీదది. ఈదేశ ప్రభుత్వముకూడ బీదల చిహ్నముగ నుండవలెనని వారి ఆశయము. అందుకని ద్రవ్యవసతి కలవారు మంత్రులుగానుండుట సంభవించు చో, అట్టివారు జీతములు తీసుకోకుండ మంత్రిపదవులను చేయవలెనని చెప్పిరి. పెద్దపెద్ద బంగళాలలోను, కట్టడములలోను మంత్రులు కాపురము చేయకుండ సామాన్య ప్రజలమధ్య, సామాన్యమైన యిండ్లలోనే నివసింపవలెనని ఆయన చెప్పెను. ఇండియాలో కేంద్రప్రభుత్వములో కాని, రాష్ట్రప్రభుత్వములలోకాని యుండు మంత్రిలలో నొకరైన గాంధిజీ యాశయముల పరిశారము వర్తించువారు లేరు.

రాజకీయరంగములో విద్యాబుద్ధులకు, నీతి నియమములకు తావులేదు. యోగ్యతా యోగ్యతలకు తావులేదు. పార్టీల బలమువల్ల మనమధ్య లోనున్న వారిలో కొందరు మంత్రులైనంత మాత్రమున, వారిలో యిదివఱకులేని గొప్పతనము యిప్పుడొచ్చినదని భావించే భావదాస్యము మనవారిలో ఎక్కువ. చిన్న రీడింగురూమును తెఱచుటకు మంత్రిలే రావలెనని కోరినారు. కో–ఆపరేటివ్ సంస్థను పారంభించుటకు మంత్రిలే రావలెనంటారు. ఇట్ల రాష్ట్రమంతా కోరుతూ ఉంటే ఎన్ని చోట్లకని మంత్రిలు తమ స్వంతకర్చు పెట్టుకొని పోగలుగుతారు. వారికి వచ్చే జీతము చాలదు. ప్రయివేటు (స్వంత) ఆస్తియుంటే అదికూడ చాలదు. మంత్రిలురాకుండా పోదామంటే – "ఇతడు మంత్రిఅయినా అయినాడు కాని, యెంత గర్వము యెక్కినది. మనలను పలుకరించడు. రమ్మంటే రాడు" అని విమర్శించుటకు మొదలుపెట్టుతారు.

అనవసరమైన చిన్న చిన్న కార్యముల కంతా మంత్రిలు వస్తె, ప్రయాణ కర్చులకింద, దినబత్తాల క్రింద ఎంతో ద్రవ్యము పట్టుతుంది. ఇదంతా ప్రజలనుండి పన్నుల రూపముగా లాగే ద్రవ్యము నుండేకదా కర్చుపెట్టబడుతుందని యోచన చేసేవారేలేరు. మనమధ్య విద్యావిజ్ఞానములలో యోగ్యులైన వారెందరో వున్నారు. వారిని పిలిపించి, గౌరవించి, వారిచేత రీడింగు రూములను, కో–ఆపరేటివ్ సంస్థలను, పాఠశాలలను, కళాశాలలను పారంభింప చేయుపద్ధతి మనవారు అలవరచుకొనవలెను.

బ్రిటీషువారి హయాములో, ప్రతిరాష్ట్రములోను 4 గురు లేక 5 గురు అడ్వైజర్లు (సలహా దారులు) ఉండిరి. వారు కేంద్రస్థానములను వదలకుండ, క్రింది ఉద్యోగులను గడగడ లాడించుచు, సమర్థతతో పరిపాలనమును సాగించుచుండిరి. ఇప్పుడు మంత్రిల సంఖ్య మించిపోయినది. కాని పరిపాలనా సామరస్యము తగ్గిపోయినది. పరిపాలనము, సర్కారు, మంత్రిలు అంటే క్రింది యుద్యోగులలో భయమేలేకుండ యేర్పడినది. ప్రజలలో భయమనేమాటే శూన్యమైనది.

మంత్రిలుకూడ వీనినన్నిటిని గమనింపవలెను. ఏది పబ్లిక్ డ్యూటి; ఏది ప్రయివేటు డ్యూటి అనే విషయమును నిర్ణయించుట కష్టమైన పని. సాధారణముగ చిన్నచిన్న కార్యములకంతయు చెవియిచ్చి, కేంద్రస్థానములను వదలి వచ్చుట మానుకొనవలెను. తమయొక్క ప్రయాణబిల్లులపై మనసాక్షిగా పబ్లిక్ డ్యూటిపై పోయినట్లు సర్టిఫికెట్లు తానే వ్రాసుకొనవలెను. పరిపాలనా కర్చులను తగ్గించు దృష్టితోనే తమ ప్రయాణములను నిర్ణయించుకొనవలెను. ఆడిట్ జనరల్ ఉత్తరువును గౌరవించుటకు మంత్రిలకు యింతకన్న వేరుమార్గములేదు.

---

# చెన్నరాష్ట్రమునకు పార్లమెంటులో

# 75 స్థానములు.

## నియోజకవర్గములు: అధ్యక్షుని ఉత్తరువు.

పార్లమెంటు స్థానములు 75లో, చెన్నపట్టణమునకు 2. అందులో ఒకటి షెడ్యూలుజాతులకు కేటాయింప బడినది. తెలుగు జిల్లాలకు మొత్తము 29 స్థానములు గలవు. వీటిలో షెడ్యూలు జాతులకు 4. షెడ్యూలు తరగతులకు ఒకటి ప్రత్యేకింప బడినది.

## పార్లమెంటు నియోజక వర్గములు.

| నియోజక వర్గము పేరు. | నియోజక వర్గ విస్తీర్ణము. | మొత్తము స్థానములు. | రిజర్వు స్థానములు: హరిజనులు | రిజర్వు స్థానములు: కొండజాతులు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| పాతపట్టణము | ఇచ్ఛాపురము, సోంపేట, టెక్కలి, పాతపట్నము తాలూకాలు, పార్వతీపురము తా॥ కురుపాము, గుమ్మలక్ష్మీపురము, మెండెంబల్లు ఫిర్కాలు, శ్రీకాకుళము తా॥ నగరి, కటకము ఫిర్కా | 1 | – | – |
| శ్రీకాకుళము | నరసన్నపేట, పాలకొండ తాలూకాలు, నగరి కటకం ఫిర్కా, షేర్ మహమ్మద్ పురము ఫిర్కాలు పోను, మిగతా శ్రీకాకుళము తా॥ చీపురుపల్లి తాలూకా కుప్పిలి రణస్థలం ఫిర్కాలు | 1 | = | – |
| పార్వతీపురము | సాలూరు, బొబ్బిలి తాలూకాలు, చీపురిపల్లి తా॥ గర్భాము, చీపురిపల్లి, పొందూరు ఫిర్కాలు, పార్వతీపురము తా॥ తల్లబురిడి పార్వతీపురము-గరుగుబిల్లి, నాగూరు, కొమరాడ, గోయిపాక ఫిర్కా | 1 | – | – |
| విజయనగరము | విజయనగరము, భీమునిపట్నము, శృంగవరపుకోట తాలూకాలు | 1 | – | – |
| విశాఖపట్నము | విజయనగరము, భీమునిపట్నము, శృంగవరపుకోట తాలూకాలు పోగా మిగులు విశాఖపట్నము జిల్లాయున్ను, పెద్దాపురము తా॥ తుని, రౌతులపాడు ఫిర్కాలున్నూ, కలసి. | 2 | – | 1 |
| కాకినాడ | పిఠాపురము, కాకినాడ, రామచంద్రపురము తాలూకాలు (మండపేట, అలమూరు, పామర్రు ఫిర్కాలు మినహా) మరాలో ఉదహరించిన మండపేట ఫిర్కా గ్రామములు, రాజమండ్రి ఫిర్కా గ్రామములు కలసి. | 1 | – | – |
| | మరా:— కేశవరము, ద్వారపూడి (వేములపల్లితో కూడ) మెర్నితోపాడు చేరిన వెలగతోడు, పాలతోడు, లిప్పనపాడు, అర్తమూరు పంచాయితీలు, మేడపాడు, చిన ద్వారపూడి గ్రామములు. | | | |

| | | | | |
|---|---|---|---|---|
| | రాజమండ్రి ఫిర్కాలోని శ్రీ కృష్ణపట్నము, భూపాలపట్నము, యర్రంపాలెముకొండ, గుంటూరు పంచాయతీ. | | | |
| రాజమండ్రి | తుని, పిఠాపురము, కాకినాడ, రామచంద్రపురము తాలూకాలు మినహా తూర్పు గోదావరిజిల్లా అంతా. ఆలమూరు, పామర్రు, మండపేట ఫిర్కాలు (పైన ఉదహరించిన మండపేట, రాజమండ్రి ఫిర్కా గ్రామములు మినహా). | 2 | 1 | – |
| మచిలీపట్నము | భీమవరము తాలూకాయున్ను, తాడేపల్లిగూడెం తాలూకా, గణపవరము ఫిర్కాలోని గోపవరము, పిప్పర వెంకట్రాగపురము, కొత్తపల్లి, అర్ధవరము, ముగుల కాకికాడ, కేశవరము, బందరు, దివి తాలూకాలు. | 1 | – | – |
| గుడివాడ | కైకలూరు, గుడివాడ, గన్నవరము తాలూకాలు. నూజివీడు సబ్ తాలూకా, విజయవాడ తా॥ లోని వల్లూరు, కంకిపాడు ఫిర్కాలు. | 1 | – | – |
| విజయవాడ | విజయవాడ తాలూకాలోని కంకిపాడు, వల్లూరు ఫిర్కాలుపోగా మిగులు తిరువూరు, నందిగామ, విజయవాడ తా॥కాలు, గుంటూరు తాలూకాలోని తాడికొండ, మంగళగిరి ఫిర్కాలు (చినకాకాని, చినవడ్లపూడి, ఇప్పటం, కంతేరు, కాజ, నిడమర్రు, నూతక్కి, పెదవడ్లపూడి, రామచంద్రపురము గ్రామములు మినహా) సత్తెనపల్లిలోని పెదకూరిపాడు ఫిర్కా. | 1 | – | – |
| తెనాలి | తెనాలి, రేపల్లె తాలూకాలు, బాపట్ల, యాజలి ఫిర్కాలు, బాపట్ల తా॥ పరచూరి ఫిర్కా గొల్లపూడి అగ్రహారము, వీరన్నపాలెము, రామానాయునిపాలెము, చెరుకూరు, కంకులమర్రు. | 1 | – | – |
| గుంటూరు | గుంటూరు, పెదకాకాని, పత్తిపాడు ఫిర్కాలు, మంగళగిరి ఫిర్కాలోని చినకాకాని, చినవడ్లపూడి, అప్పటము, కంతేరు, కాజ, నిడమర్రు, నూతక్కి, పెదవడ్లపూడి, రామచంద్రపురము, యాజలి బాపట్ల ఫిర్కాలు, పరచూరు ఫిర్కాలో పైన ఉదహరించిన గ్రామములు పోగా మిగులు బాపట్ల తాలూకా. | 1 | – | – |
| నరసారావుపేట | వినుగొండ, నరసారావుపేట, పల్నాడు తాలూకాలు, బెల్లముకొండ, అచ్చంపేట ఫిర్కాలు, ఒంగోలు తా॥ అద్దంకి ఫిర్కా వాళ్లపల్లి, వలపర్ల, చినకొత్తపల్లి, ధర్మవరము, రామకూరు, గోళ్లపల్లి, కలవకూరు, కొండమంజునూరు | 1 | – | – |
| ఒంగోలు | వెంకటగిరి, సూళ్లూరుపేట, గూడూరు, నెల్లూరు తాలూకాలు, ఆత్మకూరు తా॥ కలువాయి, వీరపూరు, ఫిర్కాలు మినహాయించి నెల్లూరు జిల్లా, అద్దంకి ఫిర్కాలో మినహాయించిన గ్రామములు, పోగా మిగులు ఒంగోలు తాలూకా. | 2 | 1 | – |
| నెల్లూరు | వెంకటగిరి, సూల్లూరుపేట, గూడూరు, నెల్లూరు తాలూకాలు ఆత్మకూరు తా॥ కలువాయి, వీరవూరు ఫిర్కాలు. | 1 | – | – |
| నంద్యాల | కర్నూలు, డోన్, పత్తికొండ, తా॥లు, బనగానపల్లి సబ్ తా॥ మినహాయించిన కర్నూలు జిల్లా యావత్తు. | 1 | – | – |
| కర్నూలు | కర్నూలు జిల్లా కర్నూలు పత్తికొండ తా॥ లు. బళ్ళారి జిల్లా ఆలూరు ఆదోని, శిరుగుప్ప తాలూకాలు | 1 | – | – |
| బళ్లారి | ఆలూరు, ఆదోని, శిరుగుప్ప తా॥లు పోగా మిగులు బళ్ళారిజిల్లా | 1 | – | – |
| అనంతపురము | బుక్కచర్ల ఫిర్కా మినహా గుత్తి, కల్యాణదుర్గము, తాడిపత్రి, అనంతపురము తాలూకాలు, కర్నూలుజిల్లా డోన్ బనగానపల్లి సబ్ తాలూకాలు. | 1 | – | – |

| | | | | |
|---|---|---|---|---|
| పెనుకొండ | గుత్తి, కల్యాణదుర్గము, తాడిపత్రి, అనంతపురము తాలూకాలు మినహాగా బుక్కపట్నం ఫిర్కా చేరిన అనంతపురము జిల్లాయావత్తు | 1 | – | – |
| కడప | రాజంపేట, సిద్ధవటము, రాయచోటి తాలూకాలు మినహా రాయచోటి తాలూకా లక్కిరెడ్డిపల్లి ఫిర్కా, సిద్ధవటము తా॥ ఓబులము ఫిర్కా కలసిన కడప జిల్లా యావత్తు. | 1 | – | – |
| చిత్తూరు | కాళహస్తి, పుత్తూరు, తిరుత్తణి, చంద్రగిరి తాలూకాలు మినహాయించిన చిత్తూరు జిల్లాయున్నూ, కడపజిల్లాలోని రాజంపేట తాలూకాయున్నూ, లక్కిరెడ్డిపల్లి ఫిర్కాపోగా మిగులు రాయచోటి తాలూకాయున్నూ, ఓబుళంఫిర్కా పోను మిగులు సిద్ధవటము తాలూకాయున్నూ, కలిపి | 2 | 1 | – |
| తిరుపతి | కాళహస్తి, పుత్తూరు, తిరుత్తణి, చంద్రగిరి తాలూకాలు, | 1 | – | – |
| మదరాసు | మదరాసు పట్టణము సైదాపేట తాలూకా శ్రీపేరుంబుదూరు తాలూకాలోని కున్నత్తూరు ఫిర్కా | 2 | 1 | – |

——:)(:——

# సంగ్రహపట్టీ.

| జిల్లా | పార్లమెంటు సీట్లు | | | ప్రదేశ సభ | | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తము | హరిజన్ స్థానములు | కొండ జాతులు. | మొత్తము | హరిజన స్థానములు | కొండ జాతులు |
| శ్రీకాకుళము | 3 | — | — | 15 | 2 | 1 |
| విశాఖపట్నము | 3 | — | 1 | 14 | 1 | 1 |
| తూర్పు గోదావరి | 3 | 1 | — | 16 | 3 | 1 |
| పశ్చిమ గోదావరి | 2 | 1 | — | 12 | 2 | — |
| కృష్ణా | 3 | — | — | 12 | 2 | — |
| గుంటూరు | 5 | 1 | — | 18 | 1 | — |
| నెల్లూరు | 1 | — | — | 13 | 2 | — |
| కర్నూలు | 2 | — | — | 8 | 1 | — |
| బళ్లారి | 1 | — | — | 8 | 1 | — |
| అనంతపురము | 2 | — | — | 9 | 1 | — |
| కడప | 1 | — | — | 8 | 1 | — |
| చిత్తూరు | 3 | 1 | — | 12 | 2 | — |
| | 29 | 4 | 1 | 145 | 19 | 3 |
| మదరాసు | 2 | 1 | — | 8 | 1 | — |
| | 31 | 5 | 1 | 153 | 20 | 3 |



——:)(:——

# ప్రపంచ రాజకీయములు.

## ఆగ్నేయ ఆసియా పరిస్థితులు

ఫ్రెంచివారికి కొంచమైనా బుద్ధిలేదు. మూర్ఖము ఎక్కువ. జరిగినంత కాలము మిలిటరీశక్తిపై ఇండియా, బర్మా, సింహళ దేశములను అణచియుంచుట సాధ్యముకాదని ఆంగ్లేయులు గ్రహించిరి. దూరదృష్టి చూపి—ఈ మూడు దేశములపైనను తమ పెత్తనమును చాలించుకొనిరి. ఆయా దేశ ప్రజలకే రాజకీయ స్వాతంత్ర్యము నప్పగించిరి. అందుకు ఫలితముగా ద్వేషమును పోగొట్టుకొని ప్రజల సానుభూతిని పొందిరి. ఇండో—చైనాపై, ఫ్రెంచివారి పెత్తనమును ప్రజలు సహించుట లేదు. జాతీయోద్యమమును సాగించుచున్న వియట్ మిన్‌కు చైనాకమ్యూనిస్టులు చేయూత యొసగుచున్నారు. ఇండో—చైనాకు, సయాం, బర్మా, మలయా దగ్గఱ దేశములు. ఇండో—చైనాదేశము ఎవరి స్వాధీనములో నుండునో, వారికి ఆదేశములలో నుత్పత్తి యగునవన్నియు స్వాధీనములో నుండును.

మలయాలోనుండు జనసంఖ్యలో సగము మంది చైనా వారుకలరు. మలయా కమ్యూనిస్టులలో 100 కి 90 మంది చైనావారే. బ్రిటీషువారికి మలయాలో, చైనావారితో నెంత పోరుగనున్నదో, బర్మాలోకూడ చైనావారితో నంత పోరుగనే యున్నది. 112 నియోజక స్థానములలో ఎన్నికలు జరుగ వలసియుండెను. కాని బర్మాప్రభుత్వమువారు 76 నియోజక ప్రదేశములలో మాత్రమే ఎన్నికలు జరుపుటకు తీర్మానించుకొని యున్నారు దీనిని పట్టి చైనావారి యొత్తిడి రంగూనుపై ఎంతగనున్నదో యూహించుకొన వచ్చును.

♦ ♦ ♦

కమ్యూనిస్టు చైనా పై దిగ్బంధములను, ఆంక్షలను ప్రయోగించుటకు అమెరికావారు పట్టు పట్టియున్నారు. ఒక వేళ చైనావారు బర్మా రోడ్డును తెఱువమని చెప్పవచ్చును. అప్పుడు బర్మావారికి సందిగ్ధస్థితి తప్పక యేర్పడును. కొరియా యుద్ధములో కమ్యూనిస్టుచైనావారికి జోక్యము లేకుండినచో, వారి బలమునంతయు ఇండో-చైనాలో తప్పక ఉపయోగించెడి వారే. అందుకు సందేహము లేదు. చైనావారికి ఈ యవకాశమిప్పుడు లభింపని కారణమువల్ల, ఇండో-చైనాలో జాతీయ వర్గమువారికి తత్కాలికముగ మిలిటరీ జయము కలిగినను ఆ మిలిటరీ జయము చాలకాల ముండజాలదు. ప్రజలసానుభూతిలేక ప్రభుత్వము చాలకాలము నిలువజాలదు. ఫ్రెంచివారికి ఇప్పటికైనను బుద్ధికలిగి బావుదాయ్ ప్రభుత్వమునకన్న సంపూర్ణ రాజకీయహక్కుల నొసగుచో, కమ్యూనిస్టు ఉధృతను యరికట్టుట కది కొంతవరకు తోడుపడును. లేనంతట ఈదినము కాకున్నను రేపైనను ప్రమాదము తప్పదు.

♦ ♦ ♦

ఆగ్నేయ ఆసియా దేశములలోను, తూర్పు ఖండములోను కమ్యూనిజమును అరికట్ట వలయునన్నను, ప్రపంచ శాంతిని స్థాపింప వలెననినను, పశ్చిమఖండవాసులకు ఒకటే ఒక మార్గము కలదు. ఇప్పుడిప్పుడే రాజకీయ స్వాతంత్ర్యమును గడించిన దేశములు కొన్నిగలవు. ఇంకను రాజకీయ స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న దేశములు కొన్నిగలవు. ఇండియా, బర్మా అటువంటి గొప్పదేశములపై అధికారమును వదలుకొనిన బ్రిటీషువారు మలయాపై అధికారము వదలుకొనవలెను. ఇండో—చైనాపై ఫ్రెంచివారి అధికారమును వదలుకొనవలెను. ఈ దేశములలోని ప్రజల ఆర్థికాభివృద్ధికి అనుగుణ్యమైన ప్రణాళికలను ప్రారంభింప వలెను. అంతరంగిక స్థిరత్వమునకు తోడుపడవలెను. అప్పుడే కమ్యూనిజము తల యెత్త జాలకుండును:—

## దక్షిణాఫ్రికా భారతీయుల గతి

దక్షిణాఫ్రికాలో రంగుజాతివారు, అందు ముఖ్యముగ భారతీయులు పడుచున్న కష్ట పరంపరలు మన మప్పుడప్పుడు జ్ఞాపకము చేసుకొనుట మంచిదికదా? భారతీయులు (రంగు జాతివారు) ప్రవీణ్యతగల ఏ వృత్తిని అవలంభింప కూడదు. దక్షిణాఫ్రికాలో వ్యాపారము చేయకూడదు. వ్యాపారము ఎక్కువగా జరుగు ప్రదేశములన్నియు తెల్లజాతివారికే కేటాయింప వలెను. భారతీయులకు ఏలాటి వృత్తులు లేక నిరుద్యోగులై యున్నారు. వారు వ్యాపారము చేయదలచుచో, వారి వస్తువులను భారతీయులకే అమ్ముకొనవలెను కాని తెల్ల వారికి అమ్ముకొనకూడదు. తగుమైన విద్య పొందుటకు అవకాశము లేదు. సాంఘికముగ ఎక్కువగు అమర్యాదలకు గుఱియగు చున్నారు. జోహన్స్‌బర్గు, డర్‌బాన్, కేపుటవున్ పట్టణములలో భారతీయులకు వ్యాపార సంస్థలు (కొట్లు) గలవు. వ్యాపారము అభివృద్ధి కరముగా నుండు ప్రదేశములు "తెల్లవారికే" ప్రత్యేకింపవలెనని ప్రభుత్వము

ప్రకటించుట వలన, భారతీయ వర్తకులు విధిలేక కట్టడముల నన్నిటిని తెల్లవారికే విక్రయింప వలసియున్నది.

◆◆ ◆◆ ◆◆

దక్షిణాఫ్రికాలో తెల్లజాతివారికి గుడ్డలు అవసరము. అందువలన వారిచెలామణికి మారకము వసతులు లేకున్నను, ఇండియానుండి గుడ్డలు దిగుమతి కావలెను. బియ్యము భారతీయులకు ముఖ్యమైన ఆహార ధాన్యము. అందువలన దక్షిణాఫ్రికాలోనికి బియ్యము దిగుమతి కాకూడదని నిషేధించియున్నారు.

ఆఫ్రికా ఖండమునకు వాయువ్య దిశన గోల్డు కోస్టు (Gold Coast) నిగిర్యా (Nigera) అను చిన్న రాష్ట్రము లున్నవి. ఇవి బ్రిటీషు కలోనియల్ ఆఫీసువారి పాలనక్రింద నున్నందున స్థానిక ప్రజలకు కొంత స్వతంత్ర ఛాయలను కలుగజేయుచున్నారు. దీనినిచూచి, దక్షిణాఫ్రికాలోనుండు నీగ్రోలును, రంగుజాతుల వారును (భారతీయులును) తమకు కూడ అట్టిస్వాతంత్ర్య హక్కులు కలుగజేయ వలెనని యెక్కడ యాందోళన జేసెదరోయని భారతీయులపై నిర్బంధ విధానమును తీవ్రతరము చేయుచున్నారు. 55 నియోజకవర్గ స్థానములలో రంగుజాతివారికి ఓటుచేయు హక్కున్నది. మద్రాస్ ప్రభుత్వమువారు ఈ హక్కును తొలగించి వేయుటకు ప్రయత్నించుచున్నారు. దక్షిణాఫ్రికా అసెంబ్లిలోకాని, సెనేటులోగాని రంగుజాతివారికి ప్రత్యక్షమైన ప్రాతినిధ్యము కూడదని వారితలంపు. రంగుజాతివారెల్లరు చేరి, అసెంబ్లికి 4 తెల్లవారిని, సెనేటుకు 1 తెల్ల వానిని తమప్రతినిధిగా ఎన్నుకొను రీతి చేయ సమకట్టియున్నారు. జాతి ద్వేషము ఇంతకన్న యెక్కువ తీవ్రరూపము దాల్చగలదా?

—0—

# లంచగొండి తనము

## శ్రీ పి. వి. సుబ్బయ్యగారు.

లంచగొండితనమును రూపుమాపుటకు ప్రభుత్వము సర్వవిధములా ప్రయత్నము సేయుచున్నది; గాని ఆ ప్రయత్నము లన్నియు బూడిదలోఁబోసిన పన్నీరు విధమున వృథా యగుచున్నవి. కారణ మేమి? ఈ లంచగొండితనమునకు మూలము ప్రభుత్వోద్యోగులలో గాక ప్రజా బాహుళ్యమునందు మిళిత మగుటయే.

ప్రభుత్వోద్యోగులు ప్రజా సేవకులుగా పని చేయవలసి యుండినను, ప్రజలా కార్యసాధనకు అనుకూల వాతావరణమును కల్గించుట లేదు. ప్రభుత్వోద్యోగులు సైతము తమ విద్యుక్తధర్మమును నెరవేర్చుటకు సక్రమముగా వచ్చు వేతనముపై నాధారపడక, అన్యాయార్జితముపై నాధార పడుచున్నారు. ఆశయము నదొకవైపు మ్రొగ్గుచుండ, కార్యమును త్వరలో సాధించుకొనవలయునన్న ఆతురత మరియొక వైపు మ్రొగ్గుచున్నది. ఏ ఒక వైపునందు మాత్రమే ఈ వాంఛ రేకెత్తినచో ఏక హస్త కరతాళము భంగి తలంపు రిత్తవోయెడిది. అట్లుగాక ఇరువైపులవారు తమ కార్య సాధనకు ఆతురత పడుటచే, ప్రతి ఫల మివ్వడము పుచ్చుకోవడము జరుగుచున్నది. ప్రభుత్వోద్యోగి స్వార్థపరత్వ రహితుఁడై తన ధర్మమును నెరవేర్చుటలో 'మానవ సేవయే మాధవ సేవ' యనిభావించినచో ప్రతిఫల మీయబోయినను నిరాకరించును. రెండవ వైపువారు తమ కార్యము నెరవేరుటయందు కొంత కాల విలంబనము జరిగినను, ప్రతికూలము తటస్థించినను, న్యాయముపై నాధారపడి మూకీభావము వహించినచో, లంచము పుచ్చుకొనుట యుండదు. అట్లుగాక ఇరు పక్షముల వారును లంచము నిచ్చుటకు, లంచము పుచ్చుకొనుటకు సంసిద్ధులగుచో, ప్రభుత్వము తలక్రిందుగా తపము చేసినను యియ్యది నశించునా? నశింపదు.

'లంచగొండి తనము! ఎక్కడఁజూచినను లంచగొండి తనము!! తాబేదారు మొదలుకొని మంత్రులవరకు ఈయన్యాయమును సాగించుచున్నారని అనేకులు ప్రభుత్వము నెత్తి పొడుచుట జరుగుచున్నది. సభలలో ప్రజానాయకులనఁబరగు కొందఱు పెద్దలు బాహాటముగా చాటుచున్నారు. ప్రభుత్వపక్షమువారు తన్నివారణమునకు ప్రబల ప్రయత్నములు చేయుచుండ ప్రజాపక్షమువారు తమ పనికాదని చేతులు ముడుచుకొని కూర్చున్నచో కాగల ఫలితమేమి? ప్రజానాయకులైనను ప్రజలయందు చైతన్యముతీసుకొని రావలదా? 'లంచము తీయబోకుడు' మీరీపనులకు పూనుకొనకున్న పుచ్చుకొనువా రెవరు. న్యాయముగా మీపనులు జరుగకున్న న్యాయము గల చోటికి పొండు. ఇది ప్రజాప్రభుత్వము" అని ప్రచారము సాగింపవలదా? అట్లుచేయుటకు మాని ప్రభుత్వోద్యోగులు లంచగొండులని నిందించుటవలన నేమి ప్రయోజనము.

'శీలంహి సర్వస్య నరస్య భూషణం' అను ఆర్యోక్తి ననుసరించి ఉద్యోగులును ప్రజలును శీలవంతులైనచో, అధర్మ మడుగంటును. ఈ కార్యము ఫలప్రదము గావలెనన్న బాధ్యత ఉద్యోగులపై యెంతో ప్రజలపై గూడా అంతే కలదు. ఉభయ పక్షముల వారును దీనిని గ్రహించి ప్రవర్తించిన లంచగొండి తనము విజన ప్రదేశముల కరుగును.

# ప్రజాభిప్రాయ వేదిక

## ఆకలి చావులు

ఆర్యా!

స్వతంత్ర భారతదేశములో ఆహార సమస్య రోజు రోజుకు విషమించుచున్నది. అక్కడక్కడ ఆకలి చావులు, ఆక్రందనలు వినబడుచున్నవి. ఆంధ్ర దేశములో చేనేత కార్మికుల ఆకలి మరణాలు; తమిళనాడులో, మలబారులో రోజుల తరబడిగా పస్తులు పత్రికలద్వారా చూడడము మన కలవాటయి పోయినది.

మరీ ఘోరము పాపం బీహార్ పుత్రుల నికృష్టావస్థ. బీహార్ రాష్ట్రకాంగ్రెసు కమిటీ సభ్యుడు శ్రీ రామచంద్ర సాహా ఏప్రెల్ నెల 21-వ తేది ఒక ప్రకటన చేస్తూ, ఈ పక్షంలోనే అంటే 15 రోజుల్లోనే 7 మంది ఆకలి చావుల పాలైనారని తెల్పెను. అనగా అచ్చటిపరిస్థితి మనముబాగుగా అర్థం చేసుకొనవచ్చును.

కూచ్ బీహార్‌లో అన్నార్తులైన ఆరువేలమంది ప్రజలు అలమటించి అలమటించి, ఏదో ప్రభుత్వముచే సహాయము పొందుదమని ప్రభుత్వ భవనమువద్దకు ఆకలి యాత్ర పోయినారు. ఫలితము, ఆరు మందికి మరణము. చాలా మందికి గాయాలు.

ఈ విషయములన్ని వినుచుండ, ప్రతి భారతీయుని హృదయము కాలిపోవుచున్నది. ఆహార సమస్యలో విజయము పొందే అవకాశమే లేదా? భారతీయులు ఆకలితో కుక్కలచావు చావ వలసినదేనా? అవకాశము ఉన్నది. చావ వలసిన అవసరములేదు. అందుకు కొన్ని పనులు ప్రభుత్వము చేయుటకు సమకట్టవలెను.

1. అసమర్థుడని అన్ని పత్రికలు వుద్ఘోషించే ఆహార మంత్రి (కరువుల మంత్రి అని గూడఅంటారు) శ్రీ మున్షీని తొలగించి, సమర్థుడైనవ్యక్తిని ఆశాఖకు నియమించవలయును.

2. దేశములోని పొలములను బీడుపెట్టేవారిని జాతి ద్రోహులుగా పరిగణిస్తూ శిక్షించ వలయును.

3. జమీందారులకు ఎట్టి నష్టపరిహారము లేకుండ రద్దుచేసి, శ్రామికులైన వ్యవసాయ కూలీలకు భూమి పంచవలయును.

4. పేద రైతులకు పన్నులు తొలగించి, వ్యవసాయ పరికరములు వారికి కంట్రోలు ధరలకందచేసి, ప్రోత్సహించ వలయును.

5. వీటన్నిటికిని ముందు జాతి సమస్యయగు ఈ సమస్యను పరిష్కరించుటకు అన్ని పక్షముల (పార్టీల) సమిష్టి సమావేశము జరుపవలయును.

6. శ్రీ నెహూరు పండితుడు ఆనాడు 'బ్లాక్ మార్కెటు దారులను ఉరి తీయుదమని' చెప్పినట్లు చేయ వలెను.

ప్రొద్దుటూరు. బి. నాదమునిరాజు.

---

## ఆర్థిక సంక్షోభము—ప్రజల దివాలా తనము:

ఆర్యా!

యుద్ధకాలములో విపరీతముగా పెరిగిపోయిన ధరలు యుద్ధానంతరము తగ్గిపోతాయని ప్రజలెంతో ఆశపడినారు. ఆనందదాయకమైన సుఖజీవనమునకై కలలుగన్న జాతీయ ప్రభుత్వము ధరలనుతగ్గించి అవి అందుబాటులో నుండేటట్లు చేస్తుందని ప్రజలు భావించిన కలలు కల్లలయినవి.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము, ఒక్క సోవియట్ రష్యాను మినహాయించి మిగతా ప్రపంచ మంతటా అలుముకొన్న ఆర్థిక సంక్షోభము, దానివలన ప్రాప్తించిన ఘోరాతి ఘోరమైన సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకొని ప్రజలెంత జాగ్రత్తగా బ్రతుకుతున్నప్పటికిని ఋణాలు దినదినానికి పెరుగుచున్నవేకాని తగ్గడములేదు. కార్మిక-కర్షక-కష్టజీవులు ఎన్నోవిధాలుగా ఎన్నోబాధలకు గురియగుట కండ్లారా చూచుచున్నాము.

వ్యాపారస్థులు, దోపిడి దారులు ఆడింది ఆటగా, పాడింది పాటగా చెలామణి కావటము వల్ల ప్రజలు వివిధ రకాలుగా దోపిడి చేయబడుతున్నారు. అన్నివస్తువుల ధరలు పెంచి ప్రజలను కొల్లగొట్టవలెననే దుర్బుద్ధితో వ్యాపారస్థులు, భారీపరిశ్రమ యజమానులు దోపిడిదారులు కలసి ప్రజల రక్త మాంసాలను నిలువునా పీల్చివేయుచున్నారు. యుద్ధానికి ముందుకంటే, యుద్ధముజరుగుచున్న సమయములో అధికలాభాలు సంపాదించ కలిగియున్నారు. అంతకంటే యిప్పుడు అధికంగా సంపాదించుచుంటున్నారు.

ఈ విధానమువల్ల బీద రైతులపరిస్థితి మరీ అధ్వాన్నముగా వున్నది. ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, విత్తనాలు, పశువుల మేత, జీవితావసర వస్తువులన్ని విపరీతముగా పెరిగిపోవడము వల్ల, "ఒక రైతుకున్నదారి, గోదావరిగా మారినది." ఇక వ్యవసాయ కూలీ కుటుంబాల సంగతి, చేతి వృత్తుల మీద బ్రతికేవారి సంగతి చెప్ప నవసరమేలేదు. ఋణ

భారమునుండి బయట పడవలెనని భూములను అమ్మడము, కొంపా గోడు తాకట్టుపెట్టడము, భార్యా బిడ్డల మెడల్లోనున్న నగలను, మంగళసూత్రములతో సహా అమ్మి వేయడానికి ప్రారంభించినారు. కూలీలు నానా బాధలు అనుభవించుచున్నారు. మధ్యతరగతివారు, ఉద్యోగులు, కార్మికులుపడు బాధ బ్రహ్మదేవునికే తెలియును.

వెనుకటి కాలమందు ఆర్థిక సంక్షోభము వచ్చినపుడు మనదేశమును విదేశీయులు పరిపాలించుచుండిరి. ఇప్పుడు ప్రభుత్వాధికారమంతా మన దేశీయుల చేతులలోనే వున్నది.

భారీ పరిశ్రమలన్నిటిని వెంటనే జాతీయము చేయవలెను. గ్రామాలలో వ్యాపార విధానము, రేషనింగు ద్వారానే జరిపించవలెను. రైతుపైనున్న ఋణ భారాన్ని తగ్గించి 5 యకరాలలోపు భూమిగల పేద రైతులపై శిస్తు తొలగించవలెను. ప్రవేటు వ్యాపార సంస్థలను నిషేధించి, జీవితావసర వస్తువులు అందుబాటులో నుండేటట్లు చేయవలెను. రైతు కవసరమగు ఎరువులు, విత్తనాలు, వ్యవసాయ పనిముట్లు సకాలములో అందేటట్లు చేయవలెను.

వేంపల్లె. పి. రామన్న.

---

## వెనుకబడిన జాతుల వారి ఇబ్బందులు.

---

ఆర్యా!

స్వతంత్ర భారత దేశములో కుల మత భేదములను పాటించక ప్రతిపౌరునకును సమాన హక్కులను గలిగించు రాజ్యాంగచట్టము అమలు జరుపబడుచున్నది. కాని కొన్ని ప్రాంతాలలో కులతత్వవాదులు, మతోన్మాదులు, తమ యధికారమును చలాయించు దురుద్దేశ్యముతో వెనుక బడిన జాతులవారిని నానాకష్టాలపాలు జేసి వారియాత్మగౌరవానికే హాని కలుగజేయు చున్నారనుటకీ క్రింది యుదంతము నిదర్శనము.

నేను రజక వంశములోపుట్టి, యఫ్. ఏ. వరకు చదువుకొన్నాను. భారత వైమానిక దళములోను, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఆఫీసులోను, రెవిన్యూ శాఖలోను, కొన్ని దినములు పనిచేసి యున్నాను. కాని అనివార్య కారణాల వల్ల ఉద్యోగమును చాలించి ప్రస్తుతము వేంపల్లె గ్రామములో ప్రయివేటు ట్యూషన్‌లు చెప్పుకొని జీవించుచున్నాను. నా వృత్తి ఎవరికిని ఏలాటి యిబ్బంది కలుగజేయునది కాదు. ఉష్ణ బాధ భరింపజాలక నేను మే నెల 25_వ తేది రాత్రి 7_30 గంటలకు మా యింటిముందు మంచముపై కూర్చొని యుండగా ఒక ముస్లిం వ్యక్తివచ్చి, నా పై తీవ్రముగాచూచి "చాకలి వెధవా! మంచముపై కూర్చును యధికారము నీకెవ్వరిచ్చినారురా? తక్షణమే దిగెదవా లేదా యని గద్దించుచు తిట్టి, నన్ను పబ్లికు వీధిలో అగౌరవ పరచినాడు. రజక కులములో పుట్టినంత మాత్రాన మా యిండ్లముందు మంచముపై కూర్చుండు హక్కుమాకు లేదా? విద్యావంతులైన మాబోటి వారికే ఇలాటి అవమానాలు జరిగితే యిక సామాన్యులమాట చెప్పనే పనిలేదు. ఇట్టి దౌర్జన్య వాదుల బారినుండి వెనుకబడిన జాతులవారి గౌరవ మర్యాదలను కాపాడవలసినదిగా ప్రభుత్వమును గోరుచున్నాను.

వేంపల్లె. నడింపల్లె కృష్ణదాసు.

---

## బద్వేలు తాలూకా కందిమల్లాయపల్లె మఠము వారి దురాశతో దాదాపు 250 మంది అమాయక ప్రజలు హుతులయిరి.

---

ఆర్యా!

కందిమల్లాయపల్లె శ్రీ వీరబ్రహ్మస్వామివారి మఠాధిపతి, ఏజంట్లు, మెంబర్లు, సుమారు రెండు మూడు మాసముల క్రిందట యజ్ఞముచేయు తలంపుతో రాజధానియందు, ఆంధ్ర, నైజాము, పరగణాల ప్రజలనుంచి సుమారు లక్ష రూపాయలు వరకూ చందాలు వసూలు చేసిరి. యజ్ఞ సమయమందు ప్రజానీకమునకు అన్నదాన మొనర్చెదమని, తక్కువ ధరలకు బియ్యము, వగైరా సామగ్రి యంతయూ సంపాదించినారు. సదరు ద్రవ్యమునుగాని, సామగ్రిగాని, ప్రజలకు సక్రమముగా వినియోగించలేదు.

దూర దేశమందలి ప్రజలు భక్తివంతులై, యుదార స్వభావముతో, ఆయజ్ఞమునకై, వెయ్యిన్ని నూటపదహారు లర్పించిన మహానుభావులు రాగా, వారిని సక్రమముగావిచారించక పోవుటయేగాక, తుదకు శ్రీ వీరబ్రహ్మంగారి ఆలయములోనికి పోయి చూచుటకు వసతి గలుగజేయలేక పోవుట చాలాశోచనీయము.

పూర్వమునుండియూ యిచ్చటి యాత్రికులకు లక్షలాది ప్రజలకు శ్రీ వీరబ్రహ్మంగారి ఆలయములోని సమాధి దర్శనము ఉచితముగాను, సులువుగాను లభించుచుండెడిది. కాని యిప్పుడది వ్యర్థమై, యాత్రికులవల్ల వ్యక్తి 1కి ఎనిమిది అణాలు రుసుము వసూలు చేయబడుచున్నది. అట్లు రుసుము యివ్వనివారు ఆలయములోనికి పోవుటకు వీలు లేదని ప్రకటించి, మఠాధిపతులు ప్రజలకు ఆశాభంగ మొనర్చిరి. ఇది శ్రీవారి మఠమునకు చాలాగొప్ప కళంకము తెచ్చెనని చెప్పక తప్పదు.

మే నెల 1-వ తేది నుంచి, అంతకుముందునుంచి కూడా కందిమల్లాయపల్లెయందు కలరావ్యాధి యుండికూడా, యిట్టి ఉత్సవ కార్యక్రమమును నిర్వహింపబూనుట, మఠాధిపతుల యొక్క స్వార్థమే కారణమనిపించుచున్నది. కలరా వ్యాధి బాధకు తాళలేక ఒక వ్యక్తి బావిలోపడి మరణించగా, సదరు శవమును బావిలోనుంచి తీసినారు. యాత్రికుల క్షేమముగోరి, సదరు బావిలో నీళ్ళుపుపయోగించకుండునట్లు చేయకుండుట, మఠాధిపతుల యొక్క అశ్రద్ధయే కారణము. అదే యింతమంది అమాయకప్రజల ప్రాణముల ఆహుతిగొన్నది.

మే నెల 15-వ తేది హెల్తు డిపార్టుమెంటు వారు, కలరావ్యాధి తీవ్రతను గుర్తించి, వెంటనే యాత్రికులందరూ ఆస్థలమునుంచి వెళ్ళిపోవలయునని దండోరా మూలమున తెలియపరచగా, మఠమువారి ఏజంట్లు అందులకు వ్యతిరేకముగా దండోరా వేయించుచూ, కలరావ్యాధి లేదనియూ, ప్రజలు వెళ్ళిపోనవసరము లేదనియు చెప్పిరి. కలరా వున్నదని దండోరా వేయించినందులకు హెల్తు డిపార్టుమెంటు వారిని, మఠమువారు నీచముగా మాట్లాడి నిందించి, వ్యాక్సినేటరును కొట్టపోవుట చాలా అక్రమము. ఇట్టివి వివేకవంతులొనర్పునవి గావు. ప్రజాశ్రేయస్సుగోరి ఉత్సవ కార్యక్రమమును నిలిపివేసి యుండినచో, యెంతో క్షేమకరముగా యుండెడిది.

ఒక్క బద్వేలు తాలూకాయందుమాత్రము యిప్పటికి వెయ్యమందివరకూ కలరావ్యాధి సోకి దాదాపు 300 మంది చనిపోయినట్లు తెలియుచున్నది. ఇతర జిల్లాలవారు దారిలో గోడ్లయందు పడిపోయి, మంచినీళ్ళుసహా యిచ్చువారు లేక సుమారు 100 మంది చనిపోయినారు. సదరు శవములు తీసివేయువారులేక, రాణీభావినుంచి—నెల్లూరు; మల్లెపల్లెనుంచి, కంభం; గిద్దలూరు, రస్తాలయందు కాకులు శవములను పీక్కుతినుచున్నవి. ఈ వ్యాధి యితర జిల్లాలకు యెంతవరకూ ప్రాకినదో తెలియకున్నది. ఇంతటి దారుణమైన సంఘటన జరుగుటకు, హెల్తుడిపార్టుమెంటువారా లేక మఠాధిపతులు, ఏజంట్లు, మెంబర్లా, అను విషయమును ప్రభుత్వమువారు న్యాయ విచారణ జరిపి, నిందితులను తగురీతి దండించి, నష్టపడినవారికి వలయుసహాయ మొనర్చెదరని ప్రభుత్వమువారికి యిందు మూలమున విన్నవించుచున్నాము.

తాలూకా కాంగ్రెసు కమిటీ, బద్వేలు. | పి. బాలిరెడ్డి, ప్రెశిడెంటు.

ఇండియా రాజకీయములు — [20-వ పేజీ తర్వాత]

ఇండియా ప్రభుత్వ మెంతమాత్రము సహాకరింపజాలదని అసందిగ్ధముగ శ్రీ జవహరిలాలుగారు తెలిపిరి. ఈ విషయములో ఇండియా ప్రజలెల్లరు యిదే విధముగ భావించుచున్నారు. డా॥ ఫ్రాంకు గ్రహముగారు ఇండియాకు రాకుండుటే గౌరవప్రదమని తలచుచున్నారు.

## ప్రభుత్వ వయోజన విద్యాశిక్షణ కేంద్రము

—: ఉదయగిరి. :—

ఆర్యా!-కడప, నెల్లూరుజిల్లాలలో వయోజనులకు విద్యనేర్పు ఉపాధ్యాయులను తర్ఫీదుచేయుటకు కేంద్రము ఉదయగిరిలో నెలకొల్పబడినది. 40 మంది ఉపాధ్యాయులకు శిక్షణ యివ్వబడుచున్నది.

ఈ శిక్షణ ఆరువారాలుపాటుమాత్రమే యివ్వబడును. శిక్షణ పూర్తికాగానే వారు నడుపు వయోజనకేంద్రాలలో, యావన్మంది వయోజనులకు వారు అక్షరాస్యత కలుగజేయగలుగుదురు. ఈ ఆరు వారాలు కాగానే మరియొక జట్టును అనగా 40 మందికి శిక్షణ ప్రారంభమగును. శిక్షణకాలములో నెలకు ఒక్కొక్కరికి రు 22½ వంతున ప్రభుత్వము స్టయిఫండును యిచ్చును. పనులు చురుకుగా సాగడానికి దీనిని వివిధ శాఖలుగా విభజించి, ప్రజాస్వామిక పద్ధతులమీద, ఎన్నికలు జరిపి, ప్రజాస్వామిక సూత్రాలను, అమలు పరచుటకు తీర్మానించియున్నాము.

ఉదయగిరి. ధూళిపాళ్ళ కృష్ణమూర్తి.

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనములక్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి, ప్రకటింపవలయునో తెలియకున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయుజాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటించుట కెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము:—

సంపాదకులు:—
"భారత జ్యోతి"

# ఇండియా రాజకీయములు.

కాశ్మీర సమస్య ఇండియాదేశమునకు కంటిలో పుల్ల మాదిరి పరిణమించుచున్నది. కాశ్మీరము శాస్త్ర సమ్మతముగ ఇండియా యూనియన్‌లో చేరినను, ఈ విషయమును మొదటినుండి ఆంగ్లో—అమెరికన్‌లుగాని, భద్రతా సంఘము కాని లేక ప్రపంచ ఐక్యదేశముల కూటమికాని అంగీకరింపలేదు. పాకీస్తాన్, కాశ్మీరముపై దౌర్జన్య మొనర్చినదని ఆంగ్లో—అమెరికన్‌లు, భద్రతాసంఘము ఒప్పుకొనుటయే లేదు. ఇండియా వాదము యెంత న్యాయమైనను — ఆన్యాయమును గుర్తించు వ్యక్తులు కాని లేక దేశములు కాని లేకున్నవి. పాకీస్తాన్ అధికారులు యెన్ని అబద్ధములు సాహసముతో చెప్పినను, అవన్నియు సత్యములని నమ్మబడుచున్నవి. ఇండియాను అవమాన పరచుటకై ఆ యపఖ్యాతి ప్రచారము నంతయు ఆంగ్లో—అమెరికన్‌లు ఉపయోగ పెట్టుచున్నారు.

కాశ్మీర దేశముపై పాకీస్థాన్ దేశమునకే సంపూర్ణాధికారమున్నట్లును, ఇండియాదేశమే అనవసరముగ జోక్యము కలిగించుకొని, తన మిలిటరీ శక్తిని ఉపయోగించి — యాక్రమముగ స్వాధీనములో నుంచుకొని యున్నదని పాకీస్థాన్ ప్రచారమునకే ఆంగ్లో—అమెరికన్‌లు ఎక్కువ ప్రోత్సాహ మొసగుచున్నారు. “కాశ్మీరమును రక్షింపుడ”ను కేకలతో పాకీస్తాన్ ప్రతిధ్వనించుచున్నది. భద్రతా మండలివారు తమ నిర్ణయమును అంగీకరించియే తీరవలెనని ఇండియాదేశము నాదేశించినగాని కాశ్మీర సమస్య పరిష్కారము కాదు. ఇంతకాలముగ పాకీస్తాన్ ప్రజలు భద్రతా సంఘముపై నమ్మకముంచుకొని యోర్పుతో నున్నారు. ఐక్యదేశముల కూటమి, క్రొత్తగా యేర్పరచిన డా॥ ఫ్రాంక్ గ్రహాముగారు యేమి చేసెదరో చూచెదము. సంతృప్తికరముగ పరిష్కరింపజాలనిచో — పాకీస్తాన్ ప్రజలు వారిచేతనగు పనిని వారే చేయుటకు ప్రారంభించెదరు. ఇంకమాత్రము చాలకాలము ఆగజాలరని వార్తాపత్రికలు హెచ్చరించుచున్నవి.

జమ్మూ — కాశ్మీర దేశములకు, రాజ్యాంగ చట్టము నేర్పరచుటకై వయోజన ఓటింగుపద్ధతిపై, రాజ్యాంగ పరిషత్తు సభను ఏర్పాటుచేయవలెనని మహారాజాగారు మే నెల 1—వ తేది ఒక ప్రకటనను గావించియున్నారు. ఆ ప్రకటనను యనుసరించి, రాజ్యాంగపరిషత్తు సభను యేర్పరచుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. రాజ్యాంగపరిషత్తు సభ యేర్పడిన తర్వాత, ముందు మహారాజున్ను, ప్రజాప్రతినిధియైన షేక్ అబ్దుల్లాయున్ను కాశ్మీరము ఇండియా యూనియన్‌లోనే అంతర్భాగమైయుండవలెనని గాంచుకొనిన ఒడంబడికేను, బలపరచుచు తీర్మానము చేయునేమోనని పాకీస్థాన్ భయపడుచున్నది. రాజ్యాంగపరిషత్తు మహాసభయొక్క అభిప్రాయము ప్రజాభిప్రాయము కాదనిచెప్పుటకష్టము. అందుకై రాజ్యాంగ పరిషత్తు సభను ఏర్పాటుచేయు ప్రయత్నమును నిలిపివేయవలెనని పాకీస్తాన్ ప్రతినిధి భద్రతా సంఘములో చెప్పుటయు, అతను చెప్పినంత మాత్రములోనే యేమో మించిపోయినట్లు భద్రతా సంఘము కూడి ఈ విషయమును చర్చించెను. ఇందులో బ్రిటిషు ప్రతినిధి యెక్కువ శ్రద్ధచూపి, చర్చ ప్రారంభించెను. కాశ్మీరములో ప్రజాపరిషత్తు సభ నేర్పాటు చేయు ప్రయత్నములన్నియు భద్రతా సంఘమువారి ఆశయములకు విరుద్ధము. కాన దానిని ఆపుదలచేయుటకు ఇండియా ప్రజా ప్రభుత్వము తక్షణము చర్యపుచ్చుకొనవలెనని తీర్మానము చేయబడెను.

ఇండియా ప్రధానమంత్రి, శ్రీ జవహరిలాలు నెహూరుగారు ఈ నెల 4—వ తేది శ్రీనగరములో మాట్లాడుచు, రాజ్యాంగ పరిషత్తు సభను ఏర్పాటుచేయు విషయము, ఇండియా విభజన సమస్యకిన్ని ముందుది. పాకీస్తానము వారు దండయాత్ర చేయకుండినచో అప్పుడే నెరవేరి యుండెడిది. కాశ్మీర దేశముయొక్క ఆంతరంగిక విషయములలో జోక్యము కలిగించుకొని, దాని సంపూర్ణాధికారమును ప్రశ్నించుటకు యే యితర దేశమునకు కాని, అధికారికి కాని హక్కు లేదు. ఇండియా ప్రభుత్వవారి అంగీకారముతోనే రాజ్యాంగ పరిషత్తు సభ ఏర్పాటుచేయబడుచున్నదని స్పష్టముగా తెలిపిరి. ఈ రాజ్యాంగ పరిషత్తుసభ విషయమై పాకీస్తాన్ విదేశాంగ మంత్రి ఆక్షేపణ తెలుపుచు ఒక జాబువ్రాయడమే ఆలస్యముగ, తక్షణమె భద్రతా సంఘము కూడుటయు, కొందరు సభ్యులు పక్షపాత భూయిష్ఠమై ఆక్షేపణీయముగ ప్రసంగములను గావించుటయు జరిగినది. ఇండియా యుద్ధము చేయవలెనని పాకీస్తానము ప్రజలను రెచ్చగొట్టుచున్నదని మేము ఫిర్యాది చేసియున్నాము. ఇదిచాల ముఖ్యమైనదైనను, భద్రతా సంఘము చర్చించుటకు సంసిద్ధత చూపలేదు.

కాశ్మీరదేశ విషయమై పంచాయతీ చేయుటకు ఇండియా యెప్పటికిని సమ్మతింపదు. రాజీ సంప్రతింపులకు సదా సంసిద్ధముగనే యున్నది. పాకీస్థానము జరుపుచున్న అక్రమచర్య లన్నిటిని కొన్ని విదేశములు ప్రోత్సహించుచున్నందున శాంతియుత పరిష్కార మార్గములను మరింతకష్టము చేయుచున్నవని శ్రీ జవహరిలాలుగారు చెప్పిరి.

డా॥ ఫ్రాంకు గ్రహాముగారు ఇండియా దేశమునకు వచ్చినచో చాలగౌరవముగా చూచెదరు. భద్రతా మండలివారు గావించిన తీర్మానమును అమలులో పెట్టుటకు మాత్రము

(మిగత 19—వ పేజీలో)

సాహిత్య చర్చలు — విద్యార్థుల ఉపయోగార్థము:—

# సంస్కృత నాటకములలో సఖిపాత్ర

(శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు)

(గత సంచిక తర్వాత)

ఈ రీతి చమత్కారములచే సంస్కృతనాటకములలో సఖులు నాయికానాయకుల ప్రణయమును పోషించుచు, శృంగార రసమును ఒక మెట్టునుండి మరొక మెట్టునకు తీసికొని వెళ్ళుచు, విభావానుభావ సాత్త్విక భావములు గలుగుటలో నిమిత్త కారణములైన రస విషయమున కూడ నాటకమునకు తోడ్పడు చుందురు.

సర్వజ్ఞ సింగభూపాలుడు రచించిన కువలయావళి నాటికలోకూడ సఖీపాత్రలు మనోజ్ఞముగా చిత్రింప బడినవి. సఖులిర్వురు నొకవైపునను, శ్రీ కృష్ణుడు మరొక వైపునను విలాసోద్యానవనములో సంచరించుచుండగా చంద్రలేఖ కువలయావళితో "మన్మథ సామ్రాజ్య సంజీవినివగు నిన్ను చూచుటకో యనునట్లు విచ్చేసిన మాధవుని చూడుము" అనును. మాధవ శబ్దమును వసంతర్తు పరముగాను, కృష్ణపరముగాను శ్లేషించి యామె పల్కెను. కువలయావళి మనస్సులో కృష్ణుడే మెలగుచుండుటచే నామె కృష్ణపరముగానే గ్రహించి తొట్రుపాటు పడును: ఆ సమయముననే మణిముద్రిక జారుటయు శ్రీకృష్ణుడును ఆమెయు పరస్పర ముఖావలోకము చేసికొనుటయు, శ్రీకృష్ణుడు ఆమెమనస్సు తనపై లగ్నమై యుండుటను, ఆత్రోటుపాటు మూలముననే గ్రహించుటయు సంభవించును. చంద్రలేఖ ఆవాక్చమత్కృతిని కన్పరుపకపోయినచో నంత చమత్కారముగా శృంగార రసావిర్భావము గల్గుట సాధ్యముకాదు.

రుక్మిణి మున్నగువారు శ్రీ కృష్ణ కువలయావళుల ప్రణయ పరిణయముల ననుమతింపనందున రహస్యముగానే తెంతునంతయు చంద్రలేఖ నడపును. రుక్మిణి ఒకరాత్రి కువలయావళిని గృహములో బంధించి చంద్రలేఖను కాపుంచగా, నామె సాహసముతో నెవ్వరికిని తెలియకుండ కువలయావళిని తీసికొనిపోయి శ్రీకృష్ణుని చేర్చును. దారిలో కంచుకి "ఈమె యెవ్వ"రని ప్రశ్నింప "ఈమె ఇందీవరాళియను పరిచారిక" యనిచెప్పి యాతని కనుమొరగును. ఈ రీతిగా సఖులెంత సాహసకార్యమునైనను చేసి తమ నెచ్చెలి నుద్ధరించుట పరిపాటి.

శాకున్తలములో కాళిదాసు అనసూయా ప్రియంవదలు తమ అతిథి సత్కార ధర్మముచేతను, సఖీ హితైషిత్వము చేతను, మృదుమధుర సంభాషణముల చేతను, ఉక్తిచమత్కృతి చేతను, సాంప్రదాయిక విజ్ఞాన వైదగ్ధ్యముచేతను మనల నత్యంతము ఆకర్షింతురు.

వారు రూపరేఖా విలాసాదులలో శకుంతలకు తగినవారుగ చూపట్టుదురు. దుష్యంతుడాశ్రమములో ప్రవేశించుట తోడనే బాలపాదపములను స్వప్రమాణానురూపములైన ఘటములతో ఉదకసేచనము చేయుచున్న శకుంతలయు, అనసూయా ప్రియంవదలును ఆతని కంటబడుదురు. వారి రూప మాధుర్యముచే నాతడు ముగ్ధుడగును. "రాజాంతఃపురములలో కూడ అరుదైన యీ సౌందర్యము, ఆశ్రమవాసి జనమున కుండుటవలన అరణ్య లతలచే ఉద్యాన లతలు తిరస్కరింప బడినట్లున్నది" అని దుష్యంతుడు ప్రశంసించును.

దుష్యంతునింతగా నాకర్షించిన యీ సౌందర్యము శకుంతల దొక్కతెదే కాదనియు, సఖులది కూడననియు మనము గుర్తింపవలయును.

అనసూయా ప్రియంవదలచే ననుగమింప బడుచున్న శకుంతల విశాఖా నక్షత్రములచే అనుగమింప బడుచున్న శశాంకరేఖవలె నున్నదని దుష్యంతుడే పల్కెను.

అనసూయాప్రియంవదల పోలికలతోబాటు స్వభావములోని భేదములుకూడ పరిశీలింప తగియున్నవి. అనసూయ ఆరితేరిన మర్యాదల నెరిగిన ముత్తయిదువవలె వక్రత్వము లేక సూటిగా మాట్లాడును. ప్రియంవద నెరజాణయై, చమత్కారిణియై, పరిహాస ప్రియురాలై కన్పట్టును. శకుంతల స్తనవల్కలము బిగిసి యుండుటచే, నామె అనసూయతో "ప్రియంవద యీ స్తన వల్కలము నిర్దయగా బిగించినది. కొంచెము సడలింపుము" అనును. అంత ప్రియంవద "సఖీ నాపై దోషము మోపకుము. అనుక్షణము నీ కుచములను పెంచుచున్న నీ యవ్వనమునే నిందించు కొనుము" అని పరిహసించును.

ఈ రీతిగా ఈ సఖుల సంభాషణము ప్రధాన పాత్రల తోను, వారి ప్రణయగాథలు ముందునకు నడచుటతోను జోడింపబడి యుండును.

'దుష్యంతుడు తపస్సు వృద్ధినొందు చున్నదా?' యని అడుగ అనసూయ "ఇదానీంపున రతిధి విశేష లాభేన" నీవంటి మహానుభావుడు అతిథిగా మాకు దయచేయుటచే మా తపస్సు వృద్ధినొందుచున్నట్లే యని ప్రౌఢముగా సమాధానము చెప్పను.

అనసూయా ప్రియంవదలు కేవలము సాంప్రదాయిక విజ్ఞానముగల వారేకాక చదువను వ్రాయను నేర్చినవారు కూడను. దుష్యంతుని అంగుళీయకముపై పేరును వారు వెంటనే చదివి వైచినారు.

చతుర గభీరాకృతి కలిగి ప్రియముగను, మధురముగను ఆలపించు వ్యక్తిని వారు సులువుగనే రాజని తెలిసికొందురు. "మీ దేయూరు? మీ పేరేమి?" అని అనసూయ యెంత మర్యాదగా నడుగుచున్నదో చూడుడు. "రాజర్షి చేత నే రాజవంశ మలంకరింప బడుచున్నది. ఇప్పుడు రాజర్షి వియోగ బాధ ననుభవించుచున్న ప్రజలు గల దేశ మెద్ది? సుకుమారమై యీ శరీరము తపోవన పరిశ్రమలకు ఏల పాత్రము చేయబడినది?" అని యామె ప్రశ్నించును. ఇచ్చట భావభాషా మాధుర్య మెంతయు మెచ్చదగియున్నది.

అనసూయా ప్రియంవదల వేళాకోళపు మాటలకు కోపము నటించి శకుంతల వెడలి పోవుచుండగా అనసూయ "నయుక్తం అకృత సత్కార మతిథి విశేష ముజ్ఝిత్వాశ్రమ వాసినో జనస్య స్వచ్ఛచ్ఛందతో గమనం" అని అతిథి పూజామిషతో నామెను నిలిపి వైచును. ఇట్లనేక రీతుల సమయస్ఫూర్తితోను, చమత్కారముతోను, వారు శకుంతలా దుష్యంతుల సంపర్కమును ధృఢపరచి, వారి పరస్పరానురాగాభి వృద్ధికి తోడ్పడుదురు.

తరువాత శకుంతల మన్మథ తాపము ననుభవించుచుండగా వీరు స్వయముగా మన్మథ తాపము నెరుగని వారైనను, గ్రంథజన్య జ్ఞానముచే దానిని గుర్తింతురు. ఇతిహాస గ్రంథములలో కాముకులకుండు తాపమును నీ యం దిపుడు చూచుచున్నాను. "యాదృశీ ఇతిహాస నిబంధనేషు కామయమానానాం సమవస్థా శ్రూయతే, తాదృశీం తే పశ్యామి" అని అనసూయ పల్కెను. దీనినిబట్టికూడా వారికి బహుముఖమైన విద్యాగంధ మున్నట్లు తెల్లమగుచున్నది.

నిరాశాంధకారము నుండి శకుంతల నుద్ధరించుటకు ప్రియంవద యొక సూచన చేయును. "సఖీ అనసూయ! శకుంతల మహారాజునకు మదనలేఖను వ్రాసిన బాగుండును. దానిని పూలలో గుప్తపరచి దేవతా ప్రసాద వ్యాజమున అతని చేతిలో నుంచవచ్చును" అని యామె సూచించును. దీనివలననే శకుంతల లేఖను వ్రాయుటయు, వారికి చదివి వినిపించుటయు, దుష్యంతుడు చాటుననుండి విని బయటకు వచ్చుటయు, గాంధర్వవిధిని శకుంతలను పరిగ్రహించుటయు సంభవించును.



మరొక ముఖ్యమైన విషయమున సఖులు శకుంతల కెట్లు తోడ్పడినారో చూతము. దుష్యంతునకు బహు భార్యలుండవచ్చుననియు, అందువలన శకుంతల నుపేక్షింప వచ్చుననియు అనసూయ భీతి. కావున ఆమె రాజునకాభీతిని స్పష్టముగా వెల్లడించును. వెంటనే దుష్యంతుడు "నాకెందరు భార్యలున్నను, మీ సఖియు, సముద్రరశనయైన ఈయుర్వియు ఈ రెండే నా కుల ప్రతిష్ఠావహములు" అని వాగ్దానము చేయును. సఖులు సమయస్ఫూర్తితో, తగని సమయమున మెలకువతో తమ చెలికి మేలుకూర్చు తలంపున రాబట్టిన యీ వాగ్దానమునకు ఫలితముగానే చరిత్ర ప్రసిద్ధుడైన భరతుడు తరువాత సింహాసనము నధిష్ఠించుట సంభవించినదని కాళిదాసు సూచించుటచే, నీ సఖిపాత్రల కాతడెంత ఉన్నత స్థాన మిచ్చినాడో తెలియగలదు.

దుర్వాసుడు కణ్వాశ్రమమునకు వచ్చుసరికి శకుంతల యాతని రాకనే గుర్తింప లేనంతగా భర్తృలగ్నచిత్తయై యుండును. "నీ వెవ్వరిని స్మరించుచు నా కాతిథ్య మిచ్చుటకు మరిచినావో అతడు నిన్ను విస్మరించు గాక" యని దుర్వాసుడు శపించును. ఈ ఘోర విపత్తునుండి ప్రియంవదయే శకుంతలను రక్షించినది. ఆమె దుర్వాసుని కాళ్లపై బడి శాప తీవ్రతను తగ్గించినది. ఆనవాలు చూపుటచే దుష్యంతుడు శకుంతలను గుర్తించు పరిస్థితి యీ రీతిగానే కల్గినది.

ఇట్లు సంస్కృతనాటకములలో సఖీపాత్రలు నిర్వ్యాజ ప్రేమకును, స్వార్థత్యాగమునకును, సాహస కృత్యములకును, చమత్కారమునకును, సమయస్ఫూర్తికిని, మర్యాదకును, లలిత కళాకుశలతకును, మార్దవమునకును, మాధుర్యమునకును, కార్యదక్షతకును, ఆలవాలములై కథాగమనికకును, ప్రధాన పాత్ర పోషణమునకును, రససిద్ధికిని తోడ్పడుచు, మనల నత్యంతము ఆకర్షించు చున్నారు.

(భారతి మే, 1951 నుండి)

---

## అనంతపురము డిస్ట్రిక్టు మునసబు కోర్టులో.

### S. C. 38|51

| | |
|---|---|
| వాది:—మంగల చిగిచెర్ల ధారాదపు అనంతపురం., | ప్రతివాది:— మహమ్మదు ఇబ్రహీంసాబు, హోస్పేట. |

పై నంబరులో వాదిపేర ప్రతివాది 11—12—1948 తేదీన 100రూ॥ లక్కు నె 1 కి రూపాయకు 0—0—2 ల వడ్డీతో వ్రాసి యిచ్చిన ప్రాంసరి బాకీ,వడ్డీ మొదలు 115—8—4 లకు దావా దాఖలు చేయబడినది. సమన్ వాయిదా 19-6-1951 కి వేసినారు. ఆక్షేపణ యున్నయెడల ప్రతివాది కోర్టులో హాజరై పై తేదీన కోర్టులో తెలుపుకొన వచ్చును.

బి. రంగనాథముగారు, బి. ఎ., ఎల్. ఎల్. బి.
వకీలు, అనంతపురము.

## నోటీసు

### కడప ప్రిన్సిపల్ డి॥ మునసబు కోర్టులో

అస్సలు నెం॰ 61 OF 1951.

మంగల గంగమ్మ — మైనరు నెస్టు ఫ్రెండు తల్లి మంగల నాగప్ప భార్య నాగమ్మ, మొబ్బుచింతలపల్లె పులివెందుల తాలూకా } వాది.

గుండ్లకుంట నాగప్పకుమారుడు యానాది, కొమ్మద్ది గ్రామం, కమాలాపురం తాలూకా } ప్రతివాది.

ప్రతివాదికి యిందువల్ల తెలియజేయడ మేమనగా:—

నీవు మైనరువాదివల్ల పొందిన విక్రియందాఖలా ఆస్తి స్వాధీనమునకును, ఫల నష్టము రు 150/—లుకును, నీపైన దావాను దాఖలు చేసివుండేటందున, సదరుదావా 22—6—1951 తే॥కి వాయిదా వేసియున్నారు. నాటికి నీ అక్షేపణలు తెలుపుకొనంతట నీపైన, యెక్సపార్టి డిక్రి పొందబడునని తెలుపడమైనది.

కడప. } వి. రామిరెడ్డి,
28—5—1951. } వాదిపక్షం అడ్వకేటు.

---

### కడప డిస్ట్రిక్టు మునసబు కోర్టులో,

E P. 746 /50

S C. 310 /50

మల్లంకొండు రాజమ్మ Represented by its power of attorney holder మిట్టా వెంకట సుబ్బయ్యశెట్టి } పిటిషనరు

Vs

మునగా చిన్న అన్నయ్యశెట్టి రెస్పాండెండు.

## నోటీసు.

యీ డిక్రిని అనుసరించి ప్రతివాదినుంచి రావలసిన మొత్తమునకు ప్రతివాది తాలుకు షెడ్యూలు దాఖలా స్థావరాస్తిని యీకోర్టుయెదుట 18—6—1951 తేది యేలం వేయబడునని యిందువల్ల తెలియ చేయడమైనది.

### షెడ్యూలు.

కడప సబ్ డి॥ కడపటవున్ బాదర్‌ఖాన్ మశీదువీధి డోరు నెం 8/293ను గల ప్రతివాదితాలూకు మళిగ యింటికి చెకుబంది:- తూర్పు పేదరచిన్న సుబ్బరావు భార్య రూపాబాయి మళిగ; పడమర బడెంకల శిద్దయ్యమళిగ; దక్షిణం చిన్నరంగయ్యయిల్లు; ఉత్తరం పబ్లికురోడ్డు-యీలోగాయుండు ఒకఅంకణం పాదుమళిగె మిద్దెఇల్లు, అనుగుణాగా వగయిరాలు.

కడప. } వి. వి. శేషాచార్లు, బి. ఎ., బి. యల్,
24—5—1951 } వాది వాకీలు.

---

### కడప స్మాల్‌కాస్ కోర్టువారి సముఖానకు.

S. C. No 30 OF 1951.

తలపల దాసయ్య కుమారుడు నారాయణ సాకీన్ కమలాపురము తాలూకా అలిదెన మజరా ఈర్లపల్లె గ్రామము... ...... ......... ... } వాది.

Vs

వంటిగారి పెద్ద మునెయ్య కుమారుడు వోబన్న వురఫ్ సుందన్న సాకీన్ కమాలాపురము తాలూకా చిరాజుపల్లె గ్రామము. } ప్రతివాది.

యీ నెంబరువాది ప్రతివాదిపైన ప్రానోటునుబట్టి ఈ కోర్టులో రూ103—12—0లకు దావాదాఖలు చేయబడి, ప్రతివాదికి ఏమైన ఆక్షేపణలున్న ఎడల తెలుపుకొనుటకుగాను వాయిదా తే 14—6—1951 కి వేయబడి యున్నది. వాయిదారోజు పగలు 10 గంటలకు ఖుద్దునగాని లేదా ప్లీడరు ద్వారాగాని హాజరై, తన ఆక్షేపణలను తెలుపుకొనవలసినది. లేనంతట ఏక్స్‌పార్టిచేశి తీర్మానించబడునని యిందువల్ల తెలుపడమైనది.

కడప. } గాడిచర్ల సుబ్బరావు, బి. ఏ., బి. యల్.
1—6—1951. } వాది అడ్వొకేటు.

---

### కడప డిస్ట్రిక్టు ప్రిన్సిపల్ మునసబు కోర్టులో.

O. S. No. 23 OF 1951

యిరగంరెడ్డి చిన్నశిద్దారెడ్డి—— ——వాది

యెదిరి

(1) బండి బశిరెడ్డి.
(2) నారాయణరెడ్డి. } ప్రతివాదులు.

## నోటీసు.

యీ నెంబరు వాది, ప్రతివాదులపై ప్రానోటునుబట్టి రూ 767—0—0లకు దావా దాఖలు చేసియున్నాడు. సదరు నెంబరు 26—6—1951 తేదికి వాయిదాయున్నది. ప్రతివాదులకు యేదైన ఆక్షేపణ యున్నయెడల 26—6—1951 తేది పగలు 11 గంటలకు హాజరై తెలుపుకొనవలయును. లేనంతట Exparteగా తీర్మానించబడునని యిందువల్ల తెలియ జేయడమయినది.

కడప } పి. బశిరెడ్డి, బి. ఏ., బి. యల్,
9—6—1951 } అడ్వొకేటు.

---

# భారత జ్యోతి.

(ప్రతి బుధవారము ప్రకటింపబడు తెలుగు, ఆంగ్ల, రాజకీయ వార పత్రికలు.)

## చందా వివరములు.

| | | | |
|---|---|---|---|
| తెలుగుప్రతి:- | సంవత్సర చందా | రూ | 9—0—0 |
| | విడి సంచిక | ... | 0—3—0 |
| ఆంగ్లప్రతి:- | సంవత్సర చందా | ... | 6—0—0 |
| | విడి సంచిక | ... | 0—2—0 |
| రెండు చేరి:- | సంవత్సర చందా | ... | 12—0—0 |
| | విడి సంచిక | ... | 0—4—0 |

## ప్రకటన రేట్లు

| | | | |
|---|---|---|---|
| పూర్తి పేజి | ఒకదఫాకు | ... ... ... | రూ 80—0—0 |
| అర్ధ పేజి | ,, | ... ... ... | రూ 45—0—0 |
| ఒక అంగుళము | ,, | ... ... ... | రూ 6—0—0 |

కంట్రాక్టు రేట్లకు, ఇతర వివరములకు:

257, ట్రంకు రోడ్డు,
పోష్టు బాక్సునంబరు 10,
కడప.

మేనేజరు,
"భారత జ్యోతి"

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక.

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4.
సంచిక-20.

బుధవారము, జూన్ 27, 1951.

ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 20.

శ్రీ ఖరనామ సంవత్సర వైశాఖ బ. ౯, జూన్ 27.

ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## ఇండియా పార్లమెంటు – నిస్సారమైన ప్రసంగములు.

1950 సం॥ నవంబరు నెల 14–వ తేది ప్రారంభింపబడిన ఇండియా పార్లమెంటు సభ, ఈ జూన్ నెల 9–వ తేది ముగిసినది. సభ్యులెల్లరు ఈ పాటికి వారి వారి గ్రామములను, పట్టణములను చేరుకొని యుందురు. ఈ ఆరు నెలలుగ పార్లమెంటు సభను జరిపినామని ఇండియా ప్రభుత్వ మంత్రివర్గమువారు సంతృప్తిపడవచ్చును. పార్లమెంటు వ్యవహారముల నంతయు జాగ్రత్తగా గమనించుచు వచ్చుచున్న ప్రజలకు మాత్రము కొంచముకూడ తృప్తి కలుగజాలదు. శాసన సభలలో నేమి, బహిరంగసభలలో నేమి ఎంతో నైపుణ్యముతో ఏకధారగా ఉపన్యాసములను గావించి, ప్రభుత్వ వర్గమువారిని కలవరపఱచు చుండినటువంటి కీ॥ శే॥ సురేంద్రనాథబెనర్జి, చిత్తరంజన దాసు, మోతీలాల్ నెహురు, యస్. శ్రీనివాస అయ్యంగారు, యస్. సత్యమూర్తి మొదలుగాగల వారివలె ఒక్క సభ్యుడుకూడ పార్లమెంటులో ప్రసంగములు గావించి యుండలేదు. కీ॥ శే॥ బూలాభాయ్ దేశాయిగారివలె వాదనైపుణ్యముతో మంత్రి వర్గమువారు ప్రవేశపెట్టిన బిల్లులను ఖండించినవారు లేరైరి. అట్టి యుగము మరల వచ్చునా అని అనిపించినది.

ప్రొఫెసర్. కె. టి. షా; డా॥ శ్యామ ప్రసాద్ ముఖర్జీ, మొదలగు యే నలుగురు సభ్యులో తప్ప, మిగత సభ్యులు బడ్జట్టుపై గావించిన విమర్శన లన్నియు నిస్సారములుగ నుండెను. పరిపాలనా వ్యయమును తగ్గింపక, అనవసరముగ ప్రజల నెత్తిపై పన్నుల భారము ఎక్కువ వేసినా మనెడి తప్పును మంత్రివర్గమువారి మనస్సునకు తట్టునట్లు ఒక్కరుకూడ విమర్శింపలేదు. ఇంత అన్యాయముగను, నిరంకుశముగాను ఈ కాంగ్రెసు ప్రభుత్వమువారు పరిపాలనకొనసాగించుచున్నారే అని ప్రజలలో గాఢముగ నాటుకొనురీతిగ ఒక్క సభ్యుడుకూడ మాటలాడలేదు.

మిలిటరీ కర్చులు, మిలిటరీ స్టోర్సులు ఇవిచాల చిక్కువిషయములు. ఈశాఖలో దండగ కర్చు అగుచున్నటుల మరేశాఖలోకూడ కర్చుఅగుట లేదు. పన్నుల మూలకముగ రాబట్టబడిన ద్రవ్యమంతయు ఈ శాఖలో అగ్నిహోత్రములో నూనెను పోసినట్లు తగుల వేయుచున్నారు. ఈ మిలిటరీ శాఖ క్రింది కర్చులను ఒక్కొక్క అంశముగ పరిశీలించి, అర్థముచేసుకొని, విమర్శించుటకు మెంతో విజ్ఞానము కావలెను. పట్టుదల కావలెను. ఓపిక కావలెను. అట్టి ఓపికతో ఆ యంశములనన్ని తెలుసుకొని విమర్శించిన సభ్యుడు ఒక్కడైనను కానరాడు. ఏదో జీపుల కంట్రాక్టు విషయమై ఒక్క చిన్న అంశమును లేవదీసిరి. నలుగురైదుగురు కొంచము తీవ్రతతో మాటలాడిరి. "సిగ్గు కలుగజేసెడు" విషయము "సిగ్గుకలుగజేసెడు" విషయము (Scandalous) అను పదమును రెండు మూడు సారులుపయోగించి, ప్రభుత్వముపై ఏమో పెద్ద దెబ్బ తీసితినని భావించి సంతృప్తినొందిరి. ఇటువంటి "అవమానకరమైన" విషయములు ఒక్క జీపు కంట్రాక్టులలోనే కాదు. అనేక ఇతర

విషయములలో కూడ నున్నవి. కాని అవి మన పార్లమెంటు సభ్యులకు తట్టనేలేదు. ప్రధానమంత్రియు, సభానాయకుడైన శ్రీ జవహరిలాలుగారు జీపుల కంట్రాక్టు విషయమై సంజాయషీయిచ్చుచు "అవమానకరమైన" అను పదమును ఉపయోగించుటలోనే సభ్యులు పొరబాటు పడిరని చెప్పిరి. అంతటితో ఆ విషయము ముగిసెను.

ఇక పార్లమెంటులో మాటలాడిన మంత్రుల ప్రసంగములను చూచినచో, ఆర్థిక శాఖా మంత్రిగారైన శ్రీ దేశముఖ్‌గారికి తప్ప, మిగత వారికి బడ్జట్‌లోని కీలకరహస్యములు బొత్తిగా అర్థమైనటులలేదు. చేతిలో అధికారమున్నది. అనుకొనుటకు పశుబలతుల్యమైన పార్టీ మెజారిటీ యున్నది. ప్రతికక్ష వర్గము సున్న. కనుక ఎట్లు మాట్లాడినను చెల్లుబడి కాబడునను ఉదాసీన భావముతోనే మంత్రులు ప్రసంగించిరి. వారి ప్రత్యుత్తరములలో బలముకాని, వాదనైపుణ్యము గాని లేదు.

దీని నంతయు చూచిన బడ్జట్టు విషయములు, ప్రభుత్వ నిర్వాహణములోని ఇతర విషయములను, అర్థము చేసికొనుటకై మంత్రులు కాని, సభ్యులుకాని ప్రయత్నించిన పాపమునపోలేదని స్పష్టమగుచున్నది.

నెల నెలకు జీతములను తీసుకొనని మంత్రులు కాని, ప్రయాణ కర్చులను, బత్తాలను తీసుకొనని సభ్యులుకాని లేరని ప్రజలు గ్రహింపవలెను. ఒక్కదినము పార్లమెంటుకాని లేక రాష్ట్రశాసన సభలు కాని సమావేశమైనవనిన ఎంతో ద్రవ్యము కర్చుఅగుననికూడ తెలుసు కొనవలెను. పార్లమెంటు చర్చలు, శాసనసభా చర్చలు రాజకీయ పరిజ్ఞానమును ప్రజలలో అభివృద్ధి నొందించుటకు అనుగుణ్యమైనవిగ నుండవలెను. అప్పుడే వానికై పెట్టబోవు కర్చు సార్థకమగునని ప్రజలు బాగుగ తెలుసుకొనవలెను.

ఎన్నికలు జరుగులోపల ఇప్పుడున్న సభ్యులను మార్చుటకు వీలులేదు. దేశీయుల అదృష్ట వశమున ఈ రాబోవు డిశంబరు నెలలో ఎన్నికలు జరుగును. విద్య, రాజకీయ విజ్ఞానము, నిర్భయముగ విమర్శించు యోగ్యత గల యువకులు, పెద్దలు మన దేశమున నెందరోనున్నారు. కీ॥ శే॥ సత్యమూర్తి, బూలాభాయ్ దేశాయి మొదలగు వారి వలె మంత్రుల చర్యలను సూటిగా విమర్శించి, గడగడలాడింప సామర్థ్యముగల వ్యక్తులెందరో మన దేశమున నున్నారు. మన దేశము గొడ్డుపోలేదు. దేశరాజకీయములతో ఎవ్వరు కాని జూదమాడకూడదు. ప్రభుత్వ వర్గములోను, ప్రతికక్ష వర్గములోను సర్వసామర్థ్యముగల సభ్యులుండిననే కాని దేశమభివృద్ధిలోనికి రాజాలదు. ముందుకు నడువజాలదు. ఈ అంశములన్నిటిని ప్రజలు, ఓటర్లు దృష్టియందుంచుకొని కులములకును, మతములకును, జాతులకును అతీతులై, యోగ్యులైన సభ్యులనే రాబోవు ఎన్నికలలో ఎన్నుకొందురుగాక యని కోరుచున్నాము:—

---

"కాంగ్రెసు ప్రభుత్వములు విచ్ఛిన్నము గావలెనని కాంగ్రెసువాదులు గోరరు. వారిని తప్పులు బట్టుట, వారి విధానమును సవరించి, వారిని సరియైన మార్గమున నడిపింపవలయుననుటే వారి ముఖ్యోద్దేశ్యము. తన్ను తాను పరిశోధించుకొని తన తప్పులు తాను గుర్తించుట సాధ్యము గానిపని. మన శాసనసభలలో ప్రభుత్వ వ్యతిరేక పక్షములులేవు. కాంగ్రెసుపార్టీ సరియైన మార్గములో నుండవలయునన్న, ఆ పార్టీలోని సభ్యులు కొందఱు, కాంగ్రెసు క్షేమమును జాతీయ క్షేమమును కోరి, చురుకు తనము గల్గి జాగరూకులయి యుండవలెను.

— ఆచార్య జె. బి. కృపాలని, ఏప్రెలు 9.

# ప్రజల బుద్ధి వికాసముపై హైడ్రోజన్ బాంబులా?

ఇండియా ప్రభుత్వమువారు చేసేకార్యములలో కొన్ని సాధారణ ప్రజలకు అర్థము కావు. ఏమైన వ్రాస్తే మీ ప్రభుత్వాన్ని మీరే విమర్శించుతారా అంటారు. వ్రాయకపోతే వారేమైనా చెప్పుతారాఅంటేచెప్పరు. ఇప్పుడుమన దేశములో ఆహార ధాన్యములు కొరతపడినవని దేశదేశాన్ని అరుస్తోంటున్నారు. నిజముగా ఎంతకొరతపడినదో, ఎంత పండినదో ఆ వివరాలు రాష్ట్ర ప్రభుత్వాలకు తెలియదు. ఢిల్లీ ప్రభుత్వానికి, శ్రీ మున్షీ ప్రభువుకు అంతకుముందే తెలియదు. తక్కువ పడింది, తక్కువ పడింది యని గ్రామములలో కరణములు, రెడ్డి చెప్పేమాటలే పైవరకు పోతూవున్నాయి. నిజమా, అబద్ధమాయని విచారించి, పరీక్షించే వారు లేరు. ఎప్పుడైతే లేదని కేకలు మంత్రుల ప్రకటనలవల్ల బయలు దేరునో అప్పుడేవాని ధరలు పెరుగుతూ వస్తాయి. ఈ దినము ఆహార ధాన్యముల ధరలు హద్దుపద్దులేక కారుచిచ్చువలె పెరిగినవనిన, దానికంతా కాంగ్రెసు మంత్రులు, వారి ప్రభుత్వములో పనిచేసే యుద్యోగులు యనవసరముగ చేయుచూవచ్చిన ప్రకటనలు, లెక్చర్లే కారణము. ఇంతకన్న వేరేమియూ లేదు.

అమెరికా ప్రభుత్వమును 20 లక్షల టన్నుల ధాన్యము దీర్ఘఋణముపై సప్లయి చేయమని న్యూఢిల్లీ ప్రభుత్వమువారు కోరిరి. కొందరు అమెరికనులు 20 లక్షల టన్నుల ధాన్యము దానముగా ఇండియాకిస్తే బాగుంటుందని సూచించిరి. అందు వలన అమెరికా ప్రజల సౌహార్దము బయట పడుననిరి. కొందరు ఈ సలహా బాగున్నది కాని, ఉచితముగా సప్లయి చేసే తిండిగింజలు, ఆకలి మంటలతో బాధపడే ప్రజలకు నిజముగా చేరునని ఢిల్లీ ప్రభుత్వము హామీ యివ్వగలదాయని ప్రశ్నించిరి. ఈ దేశములో జరిగే అవకతవకలు, బ్లాకుమార్కెటు వ్యవహారములు, యుద్యోగులలో బలిసిపోయిన లంచగొండితనము, అమెరికా వారికి బాగా తెలుసును. వీనిని అణిచిపెట్టే యోగ్యత మంత్రులలో లేదనికూడ అమెరికావారికి తెలియును. అందుకనే వారు "మేము యెవరికోసరము ఆహార ధాన్యము పంపించదలచినామో, వారికే అవిముట్టునని నమ్మకమేమి"! యని ప్రశ్నించిరి.

కనుక ధాన్యమును దానముచేసే సమాచారము యిప్పుడు పోయినది. అప్పుగా 20 లక్షల టన్నుల ధాన్యమును సప్లయిచేయుటకు అమెరికా ప్రభుత్వము అంగీకరించినది. దీనికై ఈ దేశపు ప్రజలు కృతజ్ఞులు. కాని దీర్ఘకాలముపై ఋణముగా కోరుట యెందుకు అనే విషయమే అర్థమగుట లేదు. న్యూఢిల్లీ ప్రభుత్వమువారు అమెరికానుండి దిగుమతి యయ్యే 20 లక్షల టన్నుల ధాన్యమును ఈదేశము ప్రజలకు దానముగ పంచి పెట్టుతారా? ఆమాటే లేదుకదా? రవాణా కర్చులు, హోలుసేలు వర్తకుల లాభాలు, రీటైలు డీలర్ల లాభాలు, సేల్సుటాక్సులు, యితర చిల్లరలు అన్ని కర్చుల క్రింద చేర్చి, ధరలు యేర్పరచి, తినుటకు మిలో (జొన్నలు) గోధుమలు ప్రజలనెత్తికి అంటగట్టుతారు. విక్రయిస్తారు. దుడ్డు వెంటనే తీసుకొంటారు. స్టాకులోనుంచి ఒక్కొ డాకు పంపే ప్రతి సంచికి హోలుసేలు వర్తకులనుండి ముందుగానే పైకము రాబట్టుతారు. ఎప్పుడు వసూలు అయ్యే పైకము, అప్పుడప్పుడే అమెరికా ప్రభుత్వము వారికి జమ కట్టకుండా దీర్ఘకాలముగా ఆ ఋణమును పెట్టుకొనుట యెందుకు? దానికి వడ్డి చెల్లించుట యెందుకు? అమెరికావారు ఋణముపై పంపిన ధాన్యాన్ని న్యూఢిల్లీ ప్రభుత్వమువారు నాణెముగామార్చి దానితో ఏమిచేయ సంకల్పించినారు? ప్రజాహితకరమైన యే ప్రణాళికలను తయారుచేసినారు. 20 లక్షల టన్నులను విక్రయించుటవల్ల వచ్చు ద్రవ్యమును ఏ కార్యములను నిర్వహించుటకై ఉపయోగపెట్టవలెనని యున్నారు.

ఇండియాలోని ధనిక వర్గమువారు ఋణముల నివ్వమంటే ముందుకురాకున్నారు. ధాన్య

( మిగత 13-వ పేజీలో )

# రాబోవు ఎన్నికలు: శ్రీజయప్రకాశ నారాయణగారి ప్రకటన.

పాట్నా, జూన్ 17: రాబోయే ఎన్నికలయందు కాంగ్రెసును ఎదిరించి ఒక వైపున సోషలిస్టులు, ఇంకోవైపున ప్రజాపార్టీ నిలువబడినయెడల మూడు భాగాలుగా ప్రజల వోట్లువిభాగము కావలసివచ్చును. అట్లు జరుగకుండా, ఎన్నికల విషయములో మాత్రము సోషలిస్టులు ప్రజాపార్టీతో కలియవలెనని ఆలోచిస్తున్నారు. రాష్ట్రశాసన సభలలోను, కేంద్రశాసన సభలోనుగల సభ్యత్వస్థానాలలో సుమారు సగమువంతు అనగా 2 వేల సభ్యత్వ స్థానాలకు సోషలిస్టులు పోటీచేస్తారు. ఎన్నికల విషయములో సోషలిస్టుపార్టీ ఎవరితో కలియవలెనో నిర్ణయించుటకై జూన్ 21 తేదీ నుండి జూలై 1 వ తేదీ వరకు రాంచీలో సోషలిస్టుపార్టీ కార్యవర్గ సమావేశము జరుగును. వార్షిక సమావేశము సెప్టెంబరు మాసాంతమున జరుగును. జూలై 1 నుండి 4 వరకు సోషలిస్టుపార్టీ జనరలు కవున్సిలు సమావేశమగును.

# పురుషదాదులు, స్త్రీదాదులు:

అవశ్రితముగా దాదులు స్త్రీలే. పాశ్చాత్యదేశములలో ఆసుపత్రులేర్పడి చికిత్సకులకు సహాయము చేయుటకై వీరి నేర్పరచినపుడు స్త్రీలనే ఏర్పరచిరి. యుద్ధకాలములో వ్రణితులకు సేవగావించి వారినుత్సాహపఱచుట నొకకళగా పెంపొందించినది ఫ్లారెన్సునైటింగేల్. ఇట్లు స్త్రీల కాణాచియైన ఈ వృత్తిలో భారతదేశమున పురుషులను ప్రవేశపెట్టినకీర్తి డాక్టరు రాజన్ గారిది. నేడు మన చెన్న రాష్ట్రములో 3 గురు స్త్రీదాదులకు 1 పురుషుడువంతున ఆవృత్తిలో నియమింపబడి యున్నారుట. ఇంగ్లాండు మున్నగు చోట్లలో పురుషదాదులున్నారు. అయితే వారు పిచ్చి ఆసుపత్రులందు దురుసుచేయువారిని మెలకువగా అణచియుంచుటకు, సుఖరోగులైన పురుషులకు గహ్యాంగముల కుపచారము చేయుటకు మాత్రము వీ రేర్పడియున్నారు. కాని డాక్టరు రాజన్ గారి పురుషదాదులట్లుగాదు. అన్ని పనులను స్త్రీదాదులవలెనే వీరు చేయవలసియుండునని చెప్పుదురు. దాదిపనికి వాస్తవమునకు స్త్రీయే లాయఖు. స్త్రీ కంఠమునందే రోగి కుపచారవాక్యములను హితవుగా పల్కు మాధుర్యముగలదు. స్త్రీ చూపులోనే ఆచల్లదనము గలదు. స్త్రీకే అందుకు అవసరమైన ఆర్ద్రహృదయము సహజముగా గలదు. కావున స్త్రీ వలె పురుషుడు దాదిపనికి పనికిరాడు. స్త్రీని అనుకరించు పురుషుడు 'ఆడంగి రేకులవాడ'ని అపహాస్యము పొందునుగాని, స్త్రీదాదివలె గౌరవముతో మన్నింపబడడు. పైగా స్త్రీలు నేడు కేవలము గృహకృత్యములతో తృప్తిపడియుండుటలేదు. విశాల ప్రపంచమున నిజప్రతిభ చూపి రాణించవలెనని వారు కుతూహల పడుచున్నారు. ఇల్లువీడివచ్చి పురుషునితోపాటు భుజములు రాచుకొనుచు అన్ని పనులు చేయు స్త్రీ తనకు తెలియకయే మగరాయుడగుచున్నది. స్త్రైణ్యమునకు భంగము కాని వృత్తులలో దాదిపని ముఖ్యమైనది: ఇహపరసాధకమైనది. చిన్నతనములోనే భర్తపోయియు, పేదయు అనాథలైనవారికి బ్రదుకు సార్థకమొనర్చు గౌరవవృత్తి. కావున ఇంగ్లాండులోవాలె పైన పేర్కొన్న రెండు సందర్భములలోతప్ప మిగత అన్నిటికి స్త్రీదాదులనే ఏర్పాటుచేయుట అత్యవసరమని మేము నొక్కి వక్కాణించుచున్నాము. [ త్రిలిగి ]

# బ్రిటిష్ కార్మికపక్షము - కార్యాచరణ విధానములోనే భేదము.

## రాజీనామా ఇచ్చినమంత్రి బెవాన్ ప్రకటన.

ఐర్‌షైల్, స్కాట్లండ్, జూన్ 17: "బ్రిటిష్ ప్రభుత్వమునుంచి కొందరు మంత్రులు ఇటీవల రాజీనామా ఇచ్చినారంటే, ప్రస్తుత ప్రభుత్వముమీద వారికి విశ్వాసమూ, గౌరవమూ లోపించి పోయినదని అనుకోకూడదు. కార్మిక పక్షములో ఎవరికీ ఎవరితోను ప్రాతిపదిక సూత్రాలమీద అభిప్రాయభేదాలు లేవు. వచ్చిన అభిప్రాయ భేదాలన్నీ కూడా కార్యాచరణ విధానాలను గురించినవే కాని ఇతరమైనవి కాదు. ఆయుధోత్పత్తి కార్యక్రమమువల్ల ప్రజాసామాన్యముయొక్క జీవనప్రమాణము క్షీణించి పోతున్నదని ఆయన విమర్శించెను. ప్రభుత్వము చేస్తున్న లోపాలను చూపించడము అవమర్యాదగా భావించకూడదు. మానవసంఘములో పైతరగతి వారినుండి కార్మిక ప్రభుత్వము మంత్రులను నాయకులను ఎన్నుకొంటుంది. ఈ తప్పుడు ధోరణికి ఎంత త్వరగా స్వస్తి చెప్పితే అంతమంచిది. సోషలిస్టు ఉద్యమములో కేవలము మనసారగాక హృదయ దఘ్నముగా నిష్ఠాతులైన వారినే, పై పదవులకు నియమించవలెను.

# అ రి ష డ్వ ర్గ ము.

(శ్రీ పి. వి. సు బ్బ య్యా గా రు.)

అరి అనగా శత్రువు. షట్ అనగా ఆరు. వర్గము అనగా గుంపు. అందుచేత పై మకుటమునకు ఆరుగురు శత్రువుల గుంపని యర్థము. వీరెవరు? ఎవరికి వీరు శత్రువులు? అను ప్రశ్నలు హిందూ మతేతరులు తప్పక వేయుదురు. అనగా హిందూమతస్థులు ఈ శత్రుసమూహము నెఱిగి యున్నవారని భావము. హిందూమత గ్రంథములు, ఉపనిషత్తులు, భగవద్గీత, తత్వశాస్త్రము, నీతి శాస్త్రము, మొదలగునవి ఈ శత్రువులను గురించి వాకొనియున్నవి. ఇయ్యవి తెలియని హిందువుఁడు తనమతగ్రంధములనే చదివి యెఱుఁగడనియర్థము. అట్టివాడు తనధర్మము నిర్వర్తించిన వాడు గాడు.

ఏది యెట్లున్నను వీటిని గురించి కొంత చర్చించుట సమంజసము. ఈ శత్రువులు బాహ్యమున కనుబడువారుగారు. అనఁగా ముఖాముఖి నిలువంబడి బాహా బాహి, నఖా నఖి, ముష్టాముష్టి సమరంబునకు గడంగువారుగారు. వీరు మానవునికి యంతశ్శత్రువులు. వీరు 1. కామ 2. క్రోధ 3. లోభ 4. మోహ 5. మద 6. మాత్సర్యములనువారు. వీరు హృదయాంతరాళమున బుట్టి, మనోవాక్కాయ కర్మములందు ద్యోతక మగుచుందురు. వీరిని గుఱించి ముఖ్యగ్రంధముల గల సూక్తుల గమనింపుడు.

గీ॥ మిత్రు లెవ్వారో! అసలు నీ శత్రులెవరో
తెలియ నేలే వె యెంతటి - తెలివి నీగ
లోని శత్రుల స్తుడి వలలోన ( ,దవిలి
అనుజులను జంపి జయమనుకొనెదవోయి.

(బుద్ధగీత)

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్న మనాస్సుఖేషు విగత స్పృహః
వీతరాగ భయక్రోధః స్థిత ధీర్ముని రుచ్యతే.

(భగవద్గీత)

కామాది షట్కము విడువనివారు ధీరులుగారు. కనుక మానవునకు ప్రబలశత్రువులు పై వివరించిన ఆరు గుణములని తెలియుచున్నది. మరియు భాగవతమునందు:

క॥ కామ క్రోధాద్యములగు
నీ మానస వికృతులుడిపి యేకాంతగుహా
రాముఁడవై నను వెదకుట
సూ మేలొండెల్లనుడుగు-సులభవివేకా.

క॥ కోపంబును లోభంబును
నేపారిమనంబు గలఁప నెప్పుడు జింతా
తాపంబునొందు సధనుం
డాపద గాకన్విధము సుఖావహమగునే?

(భారతము–శాంతి పర్వము)

భగవద్గీత – ద్వితీయాధ్యాయమునందు:–

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసస్సంగ స్తే షూపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోభి
జాయతే
క్రోధాద్భవతి సంమోహస్స మ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశాద్బుద్ధి నాశా ద్వినస్యతి॥

అని యున్నది. అనగా సంగముచేత కామము జనించును. కామము వలన క్రోధము పుట్టును. క్రోధము వలన మోహము, మోహము వలన మఱపు, మఱపు వలన బుద్ధి చెడును. బుద్ధి చెడగా మానవుఁడు చెడకుండునా?

ఈ యారుగురు శత్రువులందు కామ మోహములు బలవత్తరమైనవి. క్రోధ, లోభ, మద, మాత్సర్యముల, సులభముగా జయింపనగును.

కామ మనఁగా కోరిక. మోహమనగా విషయాసక్తత. ఇయ్యవి ప్రపంచోత్పత్తికి, లౌకిక వ్యవహారమునకు, కారణ మగుచున్నవి. కోరిక లేనిదే పురుష ప్రయత్నములు జరుగవు. దాన లౌకిక వ్యవహారములు సన్నగిలును. ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములందు కామమును చేర్చుట అద్దాని ప్రాముఖ్యత విదిత మగుటలేదా? తరువాతి విషయాసక్తత – ఇయ్యది లేనిది ప్రపంచోత్పత్తి క్రమము కుంటుపడును. అనఁగా ఇయ్యవి సృష్టికార్య వ్యాసంగమున ప్రముఖ పాత్ర వహించుచున్నవని యర్థము అట్లగుట ఇయ్యవి శత్రువులుగాపరిగణింపబడు టెట్లని యొక వాదము.

ప్రపంచము మాయ. లౌకిక వ్యవహారములు స్వప్న ప్రాయములు. సుషుప్త్యావస్థలో కలుగు సంఘటనలు యథార్థములని అప్పటికి భావింపఁబడు చున్నవి. తద్విధమున విషయాసక్తులై యున్నంతవరకు, ప్రపంచ పోకడలు యదార్థములుగా గోచరమగుచున్నవి. జ్ఞాన నేత్రము తెరువఁబడుటతోడనే అయ్యవి మృషలుగాఁదోచుచున్నవి. కనుక

అబద్ధముల నిబద్ధి యని భ్రమించినంతకాలము కామ, మోహ ములు యవసరమున్నది. ఆపడికట్టు దాటగనే అయ్యవి శత్రువు లగుచున్నవి. ఇది మఱియొక వాదము.

ఈ రెండు వ్యతిరేక వాదములు తలనూపుటకు కారణ ములుగలవు. వ్యక్తి ప్రపంచమునకు మూలకందమగు పంచ భూతములతో నిర్మింపబడుట భౌతిక శరీర ధారియయ్యెను. భౌతిక శరీరము పరమాత్మ సంబంధియగు జీవుని కిరవగుట చలనము వహించెను. పరమాత్మ భౌతిక శరీరమునకు సంబం ధించినది కానందువలన జీవాత్మయు వేరైనది. కనుక భౌతిక శరీరమునకు సంబంధించిన మొదటి వాదమునకును, పరమాత్మకు సంబంధించిన 2-వ వాదమునకును వ్యతిరేకము ఘటిల్లుచున్నది.

రెండు వాదములును మిథ్యావాదములు గావు. మానవ జీవితమునకు రెండును అవసరము. కామ, మోహములు ప్రపంచమునకవసరము. పరమాత్మను సంధింప తహతహపడు జీవాత్మకవి సంబంధములేకపోయినను, తత్సాధనమున కనువు పడు శరీరమునకవి అవసరము గాకపోలేదు. భౌతిక శరీరము సంపద ప్రకృతి. ప్రకృతికి సహాయకారి శరీరము. కనుక దేనిని త్రోసివేయుట. ఈ విరుద్ధ భావములకు సమన్వయ మెట్లు కుదురును?

సమన్వయ మాలోచింప ప్రపంచమున తలయెత్తిన మేధావు లందరు తీసుకొబడిరి. వారి వారి యునికిపట్టుల ననుసరించి యు, వాతావరణమును బట్టియు, సమన్వయము చెప్పుకొని మోసగించుకొనిరి. సూటియగు మార్గము నొక్కరేనియు కను గొనజాలరైరి. మతకర్తలనబరగు క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు మొదలగువారు ప్రకృతిని విడనాడి, పరమాత్మకు ప్రాధాన్య మొసఁగి, తమ ప్రబోధములను నిర్మించుకొనిరి. వీరి వాదము లన్నియు ఒక పక్షమునకు జెందినవి. ఏ భూభాగమును ఈ సమన్వయమును కనుగొన్న భాగ్యమునబోలేదు. అట్టి భాగ్యము భారతభూమికే దక్కినది.

ఈ సమన్వయము కొఱకు ఋషులు భారతవర్షమున ఘోర తపమాచరించిరి. కృతయుగ ద్వాపరయుగములు గడు వగా త్రేతాయుగంబున ఈ సమన్వయము కనుగొనఁబడెను. అయ్యది కురుక్షేత్ర యుద్ధంబున అర్జునునకు శ్రీకృష్ణపర మాత్మ బోధించిన భగవద్గీత. అందలి కర్మయోగాధ్యా యము ప్రస్తుతాంశమునకు సంబంధించినది.

కర్మము సలుపుట పురుషలక్షణము. కర్మము సలు పక సోమరిపోతుగా నుండుమానవుఁడు అవివేకి. అతఁడు జీవించుట కర్హుడు గాడు. జీవింప కోరిక గలవాడు, దారా పుత్రాదుల పోషింపనభిలాషగలవాఁడు, పురుషార్థముల గడింప నాశగలవాఁడు కర్మ సలుపకున్న నెట్లు, ఇయ్యవి సాధించు టకు కామమే యుపకరణమనుట కూడనిపని. కర్మవలన కలుగు ఫలితము నాశింపక కర్మకొఱకే కర్మను జేయుట పరమ ధర్మము. అట్టి చిత్త సంస్కృతి గలవాఁడు నిష్కామ కర్మయోగి. అతని హృదయము ప్రశాంతముగలదై యుండును, క్రోధ, మోహ, మద, మాత్సర్యములాతని పొంతకురావు.

శ్లో॥ కామ క్రోధం లోభం మోహమ్
త్యక్త్వాత్మానం పశ్యతి సోహమ్
ఆత్మజ్ఞాన విహీనా మూఢా
స్తే పచ్యన్తే నరక నిగూఢాః ॥

(భారతీ వంశః)

కోరిక, ద్వేషము, అత్యాశ, మోహము, మొదలైనవి విసర్జించి, అజ్ఞాన రహితుడై పరమాత్మను చూడుము. ఆపరి జ్ఞానములేని తెలివితక్కువ మనుజులు నరకమునందు యమ భటులచేత బాధింపబడుచున్నారు అని తాత్పర్యము. కనుక చిత్తశుద్ధి వలయునన్న పైకామాదిషట్కమును జయింపవలెను.

ఇట్టి సంస్కారము ప్రబల ప్రయత్నమునగాని లభిం పదు. సంఘమున ఈ తాహతు ప్రతియొక్కరికి కలిగి యుం డుట అరుదు. కాని సంఘమును పవిత్రమొనర్చుటకు నడుము కట్టుకొన్న కొందఱి పెద్దలకైనను ఇయ్యది అనుల్లంఘనీయము. అట్టి సంస్కారములేనిదే రాజకీయనాయకులుగను, మత సం స్కర్తలుగను, బోధకులుగను, పత్రికా సంపాదకులుగను ఉండుట అనుచితము. నేఁడు రాజకీయ నాయకులిట్టి సం స్కార ప్రియులగుచో స్వరాజ్యప్రాప్తినందిన మనము, తిండి కరువు బట్ట కరువులతో కుయ్యోడు నగత్యము లేక యుండెడిది. నేటి మత సంస్కర్తలు ఇట్టి సంస్కారమును కలిగి యున్నచో సంఘమునందు మనము చూచుచున్న ఉత్త మాధమ స్థితులు లేకుండెడివి. నేటిపత్రికా సంపాదకులు ఇట్టి మనోవైఖరులు గలవారగుచో సంఘమున కలహములు రూపు మాసెడివి.

రాజకీయ నాయకులు జితేంద్రియులగుచో అశన వసనము లెట్లు సమృద్ధిగా లభించును? పలుకుబడిగల రాజకీయనాయకులు ప్రభుత్వాధికారమును చేపట్టుదురు. అనఁగా ప్రధాన మంత్రులుగను, మంత్రులుగను వెలయుదురు. ఈ స్థానములగల వీరు సదాచార సంపన్నులగుచో వీరి యాజ్ఞానువర్తులగు అధికారులు భయభక్తులతో తమ విద్యుక్త ధర్మముల నెరవేర్తురు. లంచగొండులుగారు. ప్రజలపీడింపరు. ప్రజలు ధాన్యాదుల పండించి సుఖమున నెసలాగుదురు.

మత సంస్కర్తలు అరిషడ్వర్గమును జయించిన వారగుచో, మతమునగల లోపముల సంస్కరించి సర్వులను సమబుద్ధితోఁ జూచి ఎల్లరకు ఉపయుక్తములగు సూత్రముల నేర్పాఱిచి యుందురు. వీరి వచన సంస్కారము ప్రజల నుత్తేజపరచి, సదాచారసంపన్నులఁజేసి తమలో తాము విభేదముల కల్పించు కొనక సోదరభావమున విలసిల్లుదురు.

[మిగత 10—వ పేజీలో]

# దేశ చరిత్ర

( శ్రీ భూతపురి నారాయణస్వామిగారు. )

ప్రాథమిక పాఠశాలలలో దేశ చరిత్ర గరపబడుచున్నది. అందు పూర్వరాజుల కాలము, మహమ్మదీయుల కాలము, బ్రిటీషు ప్రభువుల కాలము, అని మూడు భాగములుగా వ్రాయబడినది. ఈ చరిత్రయందు భారతీయ సంస్కృతి మచ్చునకైన గానరాదు. ఈ చరిత్ర కారకులకు భారతీయ యుగప్రమాణము ప్రమాణము కాదు. ఏ విషయమైనను క్రీస్తునకు మునుపు, వెనుక అని లెక్కించువారు. భారత దేశమున జను లారు వేలయేండ్లనుండియే యున్నటుల వీరి యభిప్రాయము. పైగా చరిత్రలో బ్రాహ్మణా బ్రాహ్మణ భేదములు హృదయముల కెక్కించు నంశములును గలవు. భారతీయులు స్వతంత్రులయినను ప్రాత పద్ధతులు మారలేదు. ఎట్లయ్యును బాలురు పాఠశాల వదలిన వెంటనే ఈ చరిత్రాంశములను మఱచిపోవుచున్నారు.

తాము నివసించు గ్రామమేదియో, దానికాపేరెటులవచ్చెనో, అందలి పంటలేవియో, ఏ యే విశేషములు గలవో, దాని పూర్వచరిత్ర యెట్టిదో తెలిసికొన నోచుకొనని బాలురకు కనడాలోని కలప పరిశ్రమ, ప్రెయిరీ భూముల గోధుమపంట, ఇట్టి విషయములు బోధింపబడుచున్నవి. ఇక బాలురకు దమ దేశముపై నాదరాభిమానము లెవ్విధమున గలుగును? పాఠశాలలలో గరపబడు నీ విద్యచిత్తౌన్నత్యము గలిగించుటలేదు. కృపణత్వమే నేర్పుచున్నది.

బ్రిటీషువారు మన దేశమున పాదుకొనిన కొంతకాలమునకే దేశ చరిత్ర వ్రాయింపదలచి, ప్రతి గ్రామాధికారులకును యాదాస్తు లంపించిరి. గ్రామము పేరు, ఆ పేరు కలుగుటకు కారణము, దాని పూర్వచరిత్ర, శాసనములు, ఇతర విశేషాంశములు తెలియజేయ వలసినదిగా కోరిరి. ఈ యాదాస్తులందిన తోడనే చాలమంది భయభ్రాంతులైరి. ప్రభుత్వమువారి యుద్దేశమును శంకించిరి. ఈ యజ్ఞానముచే గొందఱు గ్రామములలోగల శాసనముల జెరిపివేసిరి. కొన్నిటి యక్షరములు గుర్తింపజాలని రీతిమాపివేసిరి. కొందఱు తమకేమియు దెలియదనిరి. ఇందుచేత ప్రభుత్వమువారు సరియైన చరిత్రాంశముల సేకరింపజాలకపోయిరి. లభించిన కొద్ది యంశములలో ప్రభుత్వము వారు జిల్లా గజటీయర్లను వ్రాయించిరి. ఈ విధమున ప్రతిజిల్లా చరిత్రయు గొంత వ్రాయబడియున్నది. కాని యీ చరిత్ర ప్రజల కందుబాటులో లేదు. విద్యార్థులకు గఱపు నేర్పాటును లేదు.

ఏ యే గ్రామ మేకాలమున నుత్పన్నమైనదో తెలిసికొనుట కష్టము. పేరులబట్టి కొన్ని హిందూరాజుల కాలమునను, కొన్ని మహమ్మదీయుల హయామునను, కొన్ని పల్లవుల కాలమునను నుత్పన్నము లయినటుల తోచుచున్నది. కొన్నిటి యుత్పత్తిని గూర్చి బొత్తుగా నూహింప సాధ్యము కాని రీతినున్నవి. ఉచ్చారణ దోషము వలన పేరుల రూపములు తారుమారయినవి కొన్ని గలవు. కొన్ని గ్రామముల పేరు లాయాప్రాంతి నైసర్గిక స్థితులబట్టి యేర్పడినవి. కొన్ని పౌరాణిక కథల కంటగట్టినవి గలవు. ఈ విషయములన్నియు దెలిసిన చో, నెంత చరిత్ర వెల్వడునో విద్యాధికు లాలోచింపవలెను.

ఇట్టిచరిత్ర ఒక్కొక్క తాలూకాకు, ఎట్లో జిల్లా యొక్కొక్క మండలమునకు సేకరింపనగును. ఈ కార్య మేయొక్క అనధికారియు జేయజాలదు. ఇందు కొక పరిశోధక మండలి యేర్పడవలయును. ప్ర

స్తుత దేశ కాలస్థితుల బట్టి ఈకార్యమునకనుకూల ప్రయత్నములు జరుగునని యూహింప వీలులేదు. విద్యాశాఖాధికారులు, ముఖ్యముగా డిప్టీ యిన్స్పెక్టరులు, తాలూకాబోర్డుకరు గలరు. తమతాలూకాలలో వారు ప్రతి గ్రామమును తఱచు సంచరింతురు. అట్టిచో వారు ఆయాగ్రామముల చరిత్ర సేకరింపవచ్చును. విద్యాశాఖాధికారు లీ విషయమున శ్రద్ధవహింప ప్రార్థితులు. ఇంతేకాక నేడు గ్రామసీమలలో కొంతవఱకు నవీన విద్యాభ్యసన మందిన వారును గలరు. వారైనను తమ గ్రామ చరిత్రను పెద్దల వలనను, శాసనాదుల వలనను, నైసర్గిక స్థితుల వలనను, ఇతరోపాయములను బట్టియు, గ్రహించి "భారత జ్యోతి"కి వ్యాసములు వ్రాసిన చో, నట్టి చరిత్రాంశములను గ్రంథరూపమున బ్రకటింపవచ్చును. మన సంగతియే మనకు తెలియనప్పుడు, ఏ వి దేశములలోని కొన్ని యంశములు పాఠశాలలలో బోధింపజేయుటలో వివేకము కన్పింపదు. మనగ్రామసీమల ప్రాచీనాధునిక చరిత్రి నెఱిగిననాడే మనబాలురకు తమ ప్రాంతము నెడల నాదరాభిమానములు గలిగి, దానియున్నతికి బాటు పడగలరు.

ఓం, తత్ సత్.

# నెహూరూజీ పరిపాలనము సమర్థింపతగినది కాదు.

(శ్రీ. యస్. వెంకటాద్రిగారు, ఎం. ఏ,)

ఏ దేశములో కాని తప్పులు లేకుండ పరిపాలించుట కష్టము. ఇండియాదేశము చాల పెద్దది. భిన్నమైన మతములు, జాతులు, ఆచారములు, భాషలుకల దేశము. ఈ దేశమును తప్పులు లేకుండ పరిపాలించుట మరింత కష్టమను మాట అందరు వొప్పుకొనెదరు. ఈ దేశమునకు స్వతంత్రి మొచ్చినతర్వాత, పరిపాలనా భారమంతయు పండిత జవహర్లాలు గారి పైనను, సర్దారు పటేలు గారిపైనను పడెను. కేంద్రప్రభుత్వము చేయుచుండినతప్పులన్నిటికిని సర్దారుపటేలు గారు కారణమునియు, లోలోన సర్దారుపటేలు గారికిని, నెహ్రూజీగారికిని సరిపోక పోవడమే కారణ మనియు, అనేకులు చెప్పుతూవచ్చిరి కేంద్రప్రభుత్వమునుండి సర్దారు పటేలు తొలగిపోయినచో, దేశపరిపాలనము బాగుపడునని, ప్రజలలో నాదుక పుట్టెను. సర్దారు పటేలు ప్రతి ఘాతుకమైన యోచనలు కలవాడనికూడ చెప్పుచువచ్చిరి సర్దారు పటేలిప్పుడు చచ్చిపోయినాడుకదా? ఇప్పుడైన నెహూరు పండితుడు తప్పులు లేకుండ పరిపాలనము సాగించు చున్నాడాయని ప్రజలెల్లరు బాగుగ యోచింపవలెను.

నెహూరుజీ విజ్ఞానము కలవాడు కాదనియు, మెత్తని మనస్సు కలవాడు కాదనియు యెవ్వరు చెప్పజాలరు. చెప్పను. పరిపాలనా సామర్థ్యము లేనివాడని మాత్రము చెప్పక తప్పినది కాదు. ఆయన స్వబుద్ధి ప్రకారము నడచుకొనే మనోధైర్యము కలవాడుకాదు. చుట్టుఉండేవాండ్లు యెట్లు ఆడమంటే అట్లు ఆడు వాడు. సర్దారు పటేలు అట్ల ఆటలాడేవాడు కాదు. ఏది మంచిదని నమ్మితే దానిని ఉక్కుచేతితో నెరవేర్చేటంతవఱకు నిద్రపొయ్యేవాడు కాదు. ఇది దేశమంతా యెన్నికలు జరిగే సంవత్సరము. కాంగ్రెసు సంస్థను బలపఱచవలెనని యుద్దేశ్యము కలవారెవ్వరు తీరఎన్నికలు దగ్గఱకి వచ్చేసమయములో రాజ్యాంగశాసనములోని 19 (2) సెక్షనునసుసరించి, ప్రతిఘాతుకమై క్రూరమైన వాక్యములను చేర్చెదరా? ఇంతకన్న యవివేకము వేరొకటి యుండునా? సర్దారుజీ ప్రాణములతో యుండి యుంటే కేంద్రప్రభుత్వములో, హోముశాఖమంత్రిగా నుండియుంటే, ప్రజలెల్లరు ఏక కంఠముతో నిరసించిన నిరంకుశపరిపాలనాచిహ్నమైన బిల్లును శాసనమును చేయుటకు ప్రయత్నించునా? కాంగ్రెసు పరిపాలనమునకును, నెహూరుజీ కీర్తికిని శాశ్వితమైన కళంకమును తెచ్చిపెట్టునా? సర్దారుజీ ఇండియాప్రభుత్వములో డిప్యూటీ ప్రధానమంత్రిగా నుండుటవలన, ప్రభుత్వమునకు యెంతో బలము గాను, నెహూరు పండితునికి ముఖ్యముగా కుడి భుజముగా యుండెను.

రాజ్యాంగ శాసనములోని 19(2) సెక్షనును సవరించు విషయమై పార్లమెంటులో నెహూరు పండితులు మాటలాడుచు పరస్పర విరుద్ధములైన ప్రకటనలను గావించియున్నాడు. (1) ఇండియాలోని పత్రికలకు సర్వ స్వతంత్రమున్నదన్నాడు. (2) ఐదు లేక ఆరుమంది వ్యక్తులే ఈ దేశములో నుండే పత్రికలన్నిటిపై అధికారము చెలాయించుచు నడుపుచుండుటచేత, పత్రికలకు ఇండియాలో సహజమైన

స్వాతంత్ర్యము లేదన్నాడు. (3) పత్రికలు బాధ్యత లేకుండా యిష్టమొచ్చినట్లు వ్రాయుచున్నందున అటువంటి వ్రాతలను నిలుపుదల చేయుటకై ఈ 19 (2) సెక్షను సవరింపబడుచున్నదని చెప్పినాడు. పత్రికా సంపాదకులతో మాట్లాడుచు, పత్రికల స్వాతంత్ర్యమును నిరోధించుట, తన కిష్టము లేదన్నాడు. కాని, ఈ సవరణ తీర్మానము వాని స్వాతంత్ర్యమును నిరోధించుననియే అంగీకరించెను. (4) పత్రికలకు సంపూర్ణ స్వాతంత్ర్యముండవలెనని ప్రభుత్వము నమ్ముచున్నది. (5) అట్టి స్వాతంత్ర్యము ప్రపంచమును యుద్ధములో ముంచగలదని యింకొక చోట చెప్పినాడు.

ఇదంతా చూస్తే ఒక భావమునకును వేరొక భావమునకును, సంబంధమే లేకున్నది. ఒకే వ్యక్తి యిన్ని విధములు యోచించుచున్నాడు. ఇన్ని విధములుగ చెప్పుచున్నాడని నమ్ముటకే వీలుగాకుండయున్నది. ఇట్టి స్వాతంత్ర్య నిరోధకమైన బిల్లును, యేలాటి యోచన చేయకుండ, యింత త్వరిలో శాసనము చేయుటకుగల ముఖ్య కారణమేమో నెహ్రూజీ బొత్తిగా ప్రజాబాహుళ్యమునకు తెలియజేయడయ్యెను. తన ప్రతిష్టను, గౌరవమును తానే కోలుపోవుచున్నాడు.

సర్దారుజీ జీవించియే యుండిన ప్రభుత్వ పరిస్థితులు యింత అధ్వాన్న స్థితికి వచ్చెడివా? ఆయన సమస్యల నన్నిటిని సావకాశముగా యోచించి యుండును. ప్రజలలో అనుమానములు కలుగకుండు రీతి అన్ని విషయములను క్యాబినేట్‌లోనే (మంత్రివర్గ సమావేశములోనే) చర్చించి, నెహ్రూ పండితునికి కలిగిన అనుమానముల నెల్ల తీసివేసి యుండును. వాద ప్రతివాదములు కాని యుండినచో, ఒక్క మాటతో వాటినన్నిటిని తేల్చి వేసియుండెడివాడు.

భిన్న పరిస్థితులుకల పెద్దఖండమునకు నెహ్రూ పండితుడు అధికారము వహించియున్న మాట వాస్తవము. అందువలననే అతనియొక్క పరిపాలన విధానములో అసంగతము లుండకూడదు. నెహ్రూజీకి ఒకే పనేనా! ఎన్నోపనులు, అతని నెత్తిపైనయున్నవి. వాని నన్నిటిని సమన్వయము చేయుట ఒక్క మానవవ్యక్తికి సాధ్యమాయని చెప్పవచ్చును. నిజములో కూడ సాధ్యము కాకుండా పోవచ్చును. తనచేత కాని పనిని తలపైన పెట్టుకొని, దేశపరిపాలనమును అధోగతికి తెస్తానంటే ఎవరైనా వొప్పుకుంటారా? ఇండియా ప్రభుత్వమంత్రివర్గములో భిన్నదృక్పథములుకల మంత్రులుండుట వాస్తవము. వారి అభిప్రాయభేదములన్నియు తత్కాలికములైనవే. వారిలో వారికి ఏకాభిప్రాయములేదను కారణమున పరిపాలనా క్షీణతకు ఎవ్వరు వొప్పుకొనరు. తుదకు కష్టముల పాలుగావలసినవారు ప్రజలే కదా? ఇండియా ప్రభుత్వమును ఒక సమన్వయమైన సంస్థగా యేర్పరుచుటకై ప్రజలమైన మనమెల్లరము ప్రయత్నింపవలెను.

కడచిన నాలుగు సంవత్సరములుగ ప్రజలకు కడుపు నిండ అన్నము లేకపోయెను. ఒంటినిండ గుడ్డ లేకపోయెను. తలదాచుకొనెందుకు నీడలేకపోయెను. ఒక దినమున కన్న యింకొక దినము, ఒకవారముకన్నను యింకొకవారము ఎక్కువగు వచున్న ధరలే కాని తగ్గే ధరలు లేవు. 1939 సంవత్సరములో రు 40/లకు ఒక పుట్టెడు చిక్కేవడ్లు, యిప్పుడు రు 400/- అయినాయంటే, రెండురూపాయలకు కూడ ఒక పడి బియ్యము చిక్కడము లేదంటే, భూములులేనివాండ్లు, కూలిచేసుకొనేవాండ్లు, నెలజీతాలపైన యాధార పడేవాండ్లు అన్నం తిని బ్రతుకవలెనా, అన్నము తినకుండ చావవలెనా? ఏమైనా చెప్పితె యుత్పత్తి తక్కువ. యుత్పత్తి యెక్కువ చేయండని ఒక పాట పాడడము నేర్చుకున్నారు. ఉత్పత్తి తగ్గినమాట నిజమైతే బహిరంగముగ కంట్రోలు ధరలకు చిక్కని యవసరవస్తువులు, బ్లాకుమార్కెటులో కావలసినంత ఎట్లచిక్కుతుంది? వాండ్లకు యెక్కడనుండి యుత్పత్తియై వచ్చినాయి. మిల్లుపంచలధర జత 8/- అయితే, ఆధరలకు యిచ్చే వ్యాపారస్థుడే లేడు. ఒక్కపంచ కంటికి కనబడదు. ఒక్క జత రు22/- పెట్టుటకు సిద్ధముగనుంటే చిక్కతాయి. ఇట్టి అఘోరమైన స్థితికి పరిపాలన వచ్చినది. దేశము వచ్చినది. ప్రజలు వచ్చినారు. ఈ కాంగ్రెసు ప్రభుత్వములో ప్రజలకు యేమి ఆనందము కలిగినదని, గర్వించుటకు యేమి అవకాశము కలిగినదని, సమర్థింపవలెనో యెంతగానో యోచనచేస్తాను. నాకు ఏమి తోచడమే లేదు. నెహ్రూజీ అంటే నా విద్యార్థిదశలోనుండి యీ నిమిషమువఱకు నాకెంతో ప్రేమ. గౌరవము. ఆదరణ. కాని అతని హయాములో అతని పరిపాలన దినదినమునకు యింత అధ్వాన్నమై పోతూయుంటే, చదువుచ్చినవారందరువారిలో వారు కుమిలిపోతున్నారు, దుఃఖపడుతున్నారు, యేడుస్తున్నారు. నెహ్రూజీ ప్రభుత్వమును సమర్థించుట యెట్లు అనేది విద్యావంతులకెల్ల ఒక సమస్యగా యేర్పడినది.

---

అరిష డ్వర్గము— 7—వ పేజీ తరువాత

పత్రికా సంపాదకులు తమచే రచియింపబడు సంపాదకీయముల సంఘ జీవనమునకు గీటురాయిగా ననుసరించు లాగున వ్రాయగల ధీమంతులగుదురు. మంత్రులను, ప్రభుత్వాధికారులను సూటియగు మార్గమున నడుప దక్షత గలిగి యుందురు. జనవాక్యమును ద్యోతకము సేయు వీరి సంపాదకీయముల దొరతనమువారు త్రోసి రాజనగలరా? [illegible]టిని పాలను విడదీయు నేర్పుగల హంసల వదువున, వీరు న్యాయాన్యాయములను విడదీసి ప్రజల నుండిడి, వారిని ఋజుమార్గమున నడపింతురు. న్యాయమార్గమునగల ప్రజలు అంతఃకలహముల పెంచుకొనక ప్రశాంత మతులై యుందురు.

( సశేషము )

ప్రపంచము నమ్మండి — మేలుకొనండి:—

# అందము పరమ శత్రువైనది.

హెడీ లేమర్ — ప్రఖ్యాతనటి స్వానుభవము.

క్రిందటి నా పుట్టినరోజు పండగ బాగా జ్ఞాపకమున్నది. ఆరోజున నా మిత్రులు చాలామంది విందులకు ప్రయత్నాలు చేసిరి. ఒకరిద్దరు నావద్దకువచ్చి 'ఏమిటి ఈదినం కార్యక్రమ'మని అడిగినారు. నేను వారినెట్లో వదిలించుకొనే విసుగు జవాబులే చెప్పితిని. నిజము చెప్పడానికి నేను గర్విస్తున్నాను. ఆరోజు నేను ఇంట్లోనుంచి కదలదలచుకోలేదు. ఎవరూ ధైర్యముచేసి నన్ను పిలువలేదు.

'ఇదినాకు క్రొత్తకాదు. ప్రతి శనివారము రాత్రి స్త్రీలందరూ కులాసాగా షికారు బయలుదేరడము ఆచారము. నేను మాత్రము అలాటి సమయాల్లో ఇంట్లోనే ఉండిపోవడము చాలాసార్లు జరిగినది. ఎవరూ నన్ను పిలిచేవారుకారు. ఎక్కడికీ నేనువస్తానని వాగ్దానాలూ లేవు. ఒక్కొక్క రోజున సాయంత్రము పూట ఎవరైనావచ్చి నన్ను ఆహ్వానిస్తారేమోనని ఎదురుచూచేదాన్ని. ఎవరూ వచ్చేవారుకాదు. ఈమాటకు మీరు ఆశ్చర్యపోవచ్చు. ఇది కేవలము ప్రచారము కోసరము ఎత్తువేసిన దనికూడా భ్రమపడవచ్చు. అదేమీకాదు. నేను చెప్పినది సత్యము.

### అందము శత్రువు.

ప్రజలను ఒకవిషయము అడగ దలచుకున్నాను. 'అందము'అనేది వున్నంత మాత్రమున (దానివల్ల ధనము, ఖ్యాతీ రావచ్చు) జీవితములో ఆనందము లభించునా అని నాప్రశ్న. ఒకరిమాట ఏమోకాని — నా విషయములో మాత్రము 'అందము' శత్రువైనది — పరమశత్రువు...

నా జీవిత చరిత్రే ఈభావాన్ని బలపరుచుచున్నది. నేను తల్లిదండ్రుల కడుపున జన్మించిన ఒక్కబిడ్డను. అందువల్ల వంటరి జీవితమైనది. కాని లోకానికి బాహ్యాముగా కనిపించే వంటరి తనముకన్న ఎక్కువ వంటరితనమును నేను వ్యక్తిగతముగా అనుభవించినాను.

వియన్నాలో ఒకసంపన్న గృహములోనే జన్మించితిని. చుట్టూవున్నవారు స్థితిపరులు, మంచివారు, అయినా — నాకు జ్ఞాపకమున్నంత వఱకు నేను చాలా దుర్భరమైన జీవితాన్నే గడిపినాను.

నన్ను ఎప్పుడూ దాసీలే పెంచుతూవుండేవారు. తల్లిదండ్రుల దగ్గిర ఉండడము తక్కువ. అందువల్ల వారు నన్ను ప్రేమించనే లేదేమో అనిన అనుమానముకూడా. 'తల్లిదండ్రుల ప్రేమ'ను నేను రుచిచూడకనే పోయితిని. అందువల్ల చిన్నతనమునుంచి నేను ప్రేమకోసరము వెతుక్కోవలసివచ్చినది. కాని అది గగనకుసుమమే అయినది.

### పొగడ్త :: ప్రేమ.

చిన్నపిల్లగా వున్నప్పుడు నేను అందముగలదాన్నని అందరూ అనుకోవడము నాకు తెలుసును. కాని ఆమాటలు నన్నెందువల్లనో సంతోషపరిచేవికావు. నాకుకావలసినది పొగడ్తకాదు; —'ప్రేమ'. ప్రజలు నా సౌందర్యమును అభినందించుచున్నారు. కాని 'నన్ను' అభినందించడము లేదని తెలుసుకొన్నాను.

'విరహ జీవితము'అంటూ నేనెప్పుడు అనుభవించలేదు. పదునాల్గవయేట నేను తొలిసారిగా వలపులో పడినాను. నేను ప్రేమించినది ఒక ధనవంతుని కుమారుని. పేరు హాన్సు. వయస్సు 25 సంవత్సరములు.

ఇతను నాకంటె పెద్దదైన నాస్నేహితురాలొక ఆమెను ప్రేమించుచున్నాడు. కాని ఒక విందులో నన్ను చూచెను. అతని చూపు నాపైకి తిరిగినది. స్నేహితురాలి విషయము నాకు తెలును గనుక, అతని చూపుల్లోనుండి తప్పించుకోవలెనని ఎంతో ప్రయత్నించితిని. కాని లాభములేకపోయినది. అతడంత సౌందర్యమూర్తి.

తొలివలపు.

'ఇటుల ద్వంద్వంగా సాగదు వలపు' అని నేనూ, నా స్నేహితురాలూ అనుకొన్నాము. ఏదో ఇటో అటో తేల్చమని వెళ్లి అతనితోనే చెప్పినాము. అతను నన్నే ఎన్నుకొన్నాడు.

'నా ఆనందానికి అంతులేదు. అతనిని తరుచు కలుసుకునేదానిని. ఉత్సాహము నన్ను ఎప్పుడూ తరుముతూ ఉండేది. ఈ ఘట్టములో మా తల్లిదండ్రులను మోసము చెయ్యడముకూడ అవసరమైనది. బాగా ఆరితేరిన దొంగనైనాను కూడా.

'కాని కొంత కాలానికి, మా బంధుత్వము కూడ గాలిపటాలు ఎట్ల తెగుతాయో అదే రీతిగ తెగినది. అదృష్టవశాత్తు అప్పుడు నాదృష్టి నాటకరంగము మీదకు మళ్ళించబడినది. ప్రొడ్యూసర్ మాక్సు రెయిన్ హార్టును కలుసుకున్నాను. అయన చాలాగొప్పవాడు. నాకు అవకాశమిచ్చినాడు. పదియైదవయేట ప్రప్రథమముగా రంగస్థళముమీద ప్రవేశము లభించినది. భూమిక చాలాచిన్నదే. కాని చాలామంది దృష్టి నాపైన ప్రసరించే అవకాశమును అది కల్పించినది. వెంటనే నాకు 'ఎక్టసీ'అనే చిత్రములో ఒక పాత్ర యిస్తామని ఆహ్వానించిరి.

తొలిచిత్రము.

'ఈ చిత్రములో నటించడమువల్ల నా నెత్తిన చాలా దుమారముపడినది. ప్రజలలో ఒక తుపాను చెలరేగినది. బ్రతికి ఉన్నంతవరకు అనుభవించి తీరవలసిన అమానుష ఘట్టమొకటి ఏర్పడినది. ఈ రహస్యాన్ని మొట్టమొదటిసారిగా ప్రపంచానికి వెల్లడి చేయుచున్నాను.

'నా వయస్సు అప్పటికి పదిహేను వత్సరాలేననేది జ్ఞాపకము వుంచుకోండి. పైకి పోవలెననీ, పేరు సంపాదించుకోవాలనీ ఉబలాటము ఎక్కువగా వున్నది. అందువల్ల చిత్రములో నేనెంతో కష్టపడి పనిచేసినాను. ఇంచుమించుగా చిత్రము పూర్తికావచ్చినది. అంతవరకూ కథ బాగానే నడిచినది.

డైరక్టరు ఒక పేచీ పెట్టినాడు. నేను మొదట చూచి కంట్రాక్టుమీద సంతకము పెట్టిన 'స్క్రిప్టు'లో నుంచి ఒకసీను మార్చవలెనన్నాడు. నన్ను ఆసీనులో దిగంబరముగా ఫోటో తీయవలెనన్నాడు. అసలుకథలో నేను పొదలుమాటున జేరి వలువలు తీసివేయవలయునని ఉంది.

'నేను వల్లకాదన్నాను. ఆయన మండి పడినాడు. అలా నేను అంగీకరించని పక్షములో చిత్రమే ఆపివేయవలసి వస్తుందని, ఇంతవరకూ చిత్రానికి పెట్టిన ఖర్చు అంతకూ నేను బాధ్యురాల్ని అగుదునని – ఆయన వాదించినాడు. అలానంటించకుండా మానడానికి చట్టరీత్యా నాకు అధికారాలున్నాయి. కాని ఆసమయములో నేను దానిని గ్రహించలేదు. డైరెక్టరు మాటలకు భయపడి నేను అంగీకరించినాను. ఆరీతిగా అప్రఖ్యాతి లేకనా అపఖ్యాతి చెందిన ఆ సీనులో నటించడము జరిగినది. ఇరవై వత్సరాల క్రింద చేసిన ఈ పాపాన్ని ప్రజలు ఈనాటివరకూ నన్ను మరిచిపోవడము లేదంటే నమ్మండి.

# ప్రజలలో ధైర్యము, ఆత్మవిశ్వాసము కల్గించడమే నా సంకల్పము.

పాట్నాలో ఈ నెల 27వ తేది 40 వేల ప్రజలు చేరిన సభలో ఆచార్య కృపాలనీగారు, ఆయనభార్య శ్రీమతి సుచేతా కృపాలనీగార్లు క్రింది విధముగా ఉపన్యసించిరి:—

"నా స్వలాభానికి నేను ఆశించేది ఏమీ లేదు. నాకు బ్లాకుమార్కెటులో కొనుక్కొనవలసిన అగత్యములేదు. నేను ఏ అధికారికీన్నీ లంచములు యివ్వవలసిన ఆగత్యములేదు. ఇప్పుడున్న ధరలు రెండింతలు అయినప్పటికీ, నేను బ్రతుకగలను. భగవంతుడు చాలినంత నాకు యిచ్చినాడు. నేను నా భార్య మాకు కావలసిన నూలు మేము వడికి మా వస్త్రములను మేము తయారుచేసికోగలము. నేను ఆందోళన చేసేది నా కోసరం కాదు. ప్రజల క్షేమలాభము కోసము. ఇండియా పార్లమెంటులో నేను అనేక పర్యాయములు యీ అక్రమములను గూర్చి మొఱపెట్టియున్నాను. నేను బాహాట్యంగా అందరినీ నిందిస్తున్నానని నన్ను మందలించినారు. కాని శ్రీ. మహావీరత్యాగిగారు అక్రమముగా ప్రవర్తించిన ఒక అధికారి పేరును ఉదాహరిస్తే మిగిలిన మంత్రులందరూ ఆయనమీద విరుచుకొని పడినారు. ఆఫీసరుపేరు యెందుకు వెల్లడించినావని కోపగించిరి. కాంగ్రెసు ప్రెసిడెంటుతో నాకు ఏ విధమైన కలహమున్నూలేదు. నేను పోరాడేది ప్రజలకోసము. వేరొక పార్టీని ఏర్పాటు చేయవలసినదిగా ప్రజలు నన్ను ప్రోద్బలము చేసినారు. కొత్తపార్టీని ఏర్పాటు చేయడానికి తగినంత శరీరదార్ఢ్యము కూడ నాకు లేదు. కాబట్టి మీరందరు కలిసి పనిచేస్తేనే తప్ప నేను మీతో ఉండెదను, కాని నేను కాంగ్రెసులో మాత్రము తిరిగి ఎన్నటికీ చేరను. నేను ఎక్కడైన విశ్రాంతిగా కాలముగడుపుతాను. ఇతర సంస్థలలో జరుగుతున్న అక్రమములన్నీ మన పార్టీలో నేను జరుగనివ్వను. నేను నిష్కర్షగా పనిచేయిస్తాను. నావల్ల మీరు బాగుపడకపోతే, రాజకీయ రంగములో నాకు నేను స్వస్తిచెప్పుకుంటాను. ఇదివరకు కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామ యిచ్చినాను. దేశానికి నా నాయకత్వము కావలంటే నాయకత్వము వహిస్తాను. కొత్తపార్టీని ఏర్పాటు చేసింది నేనుకాదు. ప్రజలే. నేను శిరసావహించిన కార్యభారము చాల ఎక్కువైనదే. ఇదంతా నాకు అక్కరలేదని నిశ్చింతగా కూర్చోవచ్చు. కాని నేను ప్రజలకు కొన్ని ఆశలు కల్పించినాను. కాబట్టి మీరందరూ నాతో కలిసివస్తేనే తప్ప ఈ కార్యభారము నేనెట్లా నిర్వహిస్తాను. నేను కోరేది ఎన్నికలలో విజయముకావాలనే. నా సహచరులలో ఒక్కడుకూడ ఎన్నికలలో గెల్వక పోయినప్పటికీ నేను చింతించను. ప్రజలలో ధైర్య విశ్వాసాలు కల్పించవలెను. అదే నేను కోరేది. శాసనసభలలో సభ్యత్వస్థానాలు నాకు అక్కరలేదు. వాటితో నాకు పనిలేదు. ప్రజలలో ధైర్యములేనప్పుడు ఒక్క చిన్నవ్యక్తి ప్రజలను వీరులుగాచేసి స్వరాజ్యానికి దారి చూపించినాడు. అదే విధముగా ప్రజలలో ఆత్మధైర్యము నేను పురిగొల్ప గల్గితే చాలును. నేను కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చిన తర్వాత కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో మెంబరుగా నుండవలెనని నా భార్యయైన ఈ సుచేతాదేవిని రాజేంద్రప్రసాద్ గారు కోరిరి. ఆమె గాంధిమహాత్ముని వద్దకు వెళ్ళి సలహాఅడిగినది. ఆమెను వర్కింగ్ కమిటీలో చేరవలెనని గాంధిజీ సలహా యిచ్చెను. నాభర్త కృపాలనీగారిని కూడ వర్కింగ్ కమిటీలో చేరవలసినదిగా సలహా ఇవ్వరాదా అని ఆమెగాంధిజీని అడగినది. ఆచార్య కృపాలనీగారిని మరొకపనికి నేను ఉద్దేశించితినని గాంధీజీ ఆమెతో అన్నాడు. ఇదంతజరిగి 4 సంవత్సరాలైనది. ఆ కార్యభారము నేనిప్పుడు వహిస్తున్నాను.

సత్యాగ్రహము చేయగల్గితే బ్లాకుమార్కెటు వ్యాపారాన్ని నిర్మూలించగలము. భగవంతుని సహాయంతో ఆపని నేను నిర్వర్తించగలనని నమ్మియున్నాను.

---

ప్రజల బుద్ధివికాసముపై హైడ్రోజన్ బాంబా?
( 4-వ పేజీ తరువాత )

మును అమ్మెందువల్ల వచ్చె ద్రవ్యముతోనైనా కొన్ని ప్రణాళికలను నెరవేర్చవలెనని, దీర్ఘకాలము ఋణముగా 19 కోట్ల డాలర్లు ఉపయోగింప దలచినామని, న్యూఢిల్లి ప్రభుత్వము వారెందుకు స్పష్టముగ ప్రకటింపకూడదు. ఇందులోని రహస్యమేమి?ఈవిషయమేమాకు అర్థముగుటలేదు. అమెరికావారి ధాన్యమును కాని లేక దానిని అమ్ముకొనుట వల్ల వచ్చె ధనాన్ని కాని వెంటనే వాపసు యివ్వక ఉపయోగించుకుంటే అమెరికావారి డాలరు వలలో ఇండియా పడిపోవును కదా? అమెరికా ప్రభుత్వ దాక్షిణ్యానికి, దయకు, ఇండియా ప్రభుత్వము లోబడుట కాదా? ఇంక విదేశాంగ విధానములో ఇండియా స్వేచ్ఛగా, గౌరవముగా, స్వతంత్రముగా ఎట్లుమెలుగగలదు. ఇంత మాత్రము యోచించే బుద్ధి సూక్ష్మత ఇండియా ప్రజలకు లేదా? ప్రజల బుద్ధి వికాసములపై వొట్టి మాటలు చెప్పుచూ హైడ్రోజన్ బాంబులను వేయవలెననియున్నారా?

—ఆర్. రాధాకృష్ణమూర్తి, బి. ఏ.,

# ప్రజాభిప్రాయ వేదిక.

## గ్రామములలోని ఉద్యోగుల గోడు వింటారా?

ఆర్యా!

"ప్రభుత్వమునకు హృదయమనేది లే"దని మీరు "భారత జ్యోతి" పత్రికలో వొకసారి వ్రాసినారు. హృదయమే కాదు. చెవులు లేవు. కండ్లు లేవు. ప్రజల గోడు, వాండ్లు పడే కష్టములు తెలియవు. క్రింది ఉద్యోగులు పంపించే రిపోర్టులను ఆధారముగా పెట్టుకొని రాష్ట్రములో అంతా బాగుంది, ఆహార విధానము బాగుంది యని అసెంబ్లీలోను, మీటింగులలోను మంత్రులు చెప్పుతూ వుంటారు. వారు చెప్పే మాటలు నిజమా అనే విషయము మంత్రులకే తెలియదు.

యుద్ధము ప్రారంభమైన తర్వాత ఇంగ్లీషువారి హయాములో రేషనింగు ప్రారంభమైనది. రేషనింగు అంటే పట్టణములలో నివసించు ప్రజలు తప్ప, వారికి యితర గ్రామములలో వుండే జనులు కనబడనే లేదు. పెద్ద పట్టణములలో స్టాట్యుటరీ రేషనింగంట. ఇతర స్థలములలో యిన్‌ఫార్మల్ రేషనింగట— ఈ రేషనింగు పద్ధతిలో రెండు రకాలు పెట్టినారు. స్టాట్యుటరీ రేషనింగు వుండే పట్టణములలో మాత్రమే బదనాయముగా బియ్యము, గోధుమలు, చక్కెర, శనగలు, శనగ బేడలు సరసమైన ధరలకు యిస్తారు. ఇతర ప్రదేశాలలో వుండేవాండ్లు మనుష్యులు కారు. వారికి అన్నము అగత్యం లేదు. ధాన్యంవుంటే, చిక్కితే యిస్తారు లేకుంటే లేదు.

జాతివాండ్ల ప్రభుత్వముపోయి కాంగ్రెసు వాండ్ల ప్రభుత్వము యేర్పడినా వాండ్ల వాసన, వాండ్ల పద్ధతిపోలేదు. ఈ సంవత్సరము గ్రామాలలో యిన్‌ఫార్మల్ రేషనింగు పూర్తిగ యెత్తివేసినామన్నారు. మీ యవస్థ మీకే పడమని చిన్న చిన్న పట్టణాలలోయుండే ప్రజలకును, గ్రామాలలో వుండే ప్రజలకును చెప్పినారు. పెద్దపెద్ద మునిసిపల్ పట్టణాలలో మాత్రము రేషనింగు జరుపుచున్నారు.

ఆయా మునిసిపల్ పట్టణములలోనే కాక యితర ప్రదేశాలలో కూడ సర్కారు నౌకరీలు చేసేవాండ్లు వున్నారు. వాండ్లకు ఆహార ధాన్యము సప్లయిచేసే ఏర్పాటు చేస్తామని మంత్రులన్నారు. కలెక్టర్లకు ఉత్తరువులు పంపించినామన్నారు. ఫేర్‌ప్రయిజు డిపోలను పెట్టమన్నారు.

ఇదంతా యెట్లా నడుస్తూవుందో చూడండి. ఉదాహరణానికి ముద్దనూరు, కొండాపురము, తాళ్ళప్రొద్దుటూరు అను గ్రామాలు ఈ జిల్లాలో వున్నాయి. ఈ గ్రామాలలో హైస్కూళ్ళు వున్నాయి. డాక్టర్లు వున్నారు. పోలీసుస్టేషన్‌లు వున్నాయి. రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లు వున్నారు. ఎలిమెంటరీ స్కూళ్ళు వున్నాయి. పోస్టాఫీసులున్నాయి. ఈ మూడు గ్రామములలో ఏ వొక్క గ్రామములో కూడ సర్కారు డిపోలేదు. ఫేరుప్రయిజు డిపో లేదు. ఈ గ్రామాలలో వుండే సర్కారు ఉద్యోగులు, సర్కారునౌకరీలు 12 మైళ్లకు పైగా ఉండే జమ్మలమడుగుకు పోయి రేషనింగు బియ్యము తెచ్చుకొనవలెను. జమ్మలమడుగు—ముద్దనూరు మధ్య యేరు వున్నది. యేటికి నీళ్లు వచ్చినాయంటే తినేందుకు గింజలు లేదు. ముద్దనూరునుండికాని, కొండాపురమునుండికాని, తాళ్ళప్రొద్దుటూరునుండికాని ఒక్కసారి జమ్మలమడుగుకు పోయిరావలెనంటె కనీసము 2 రూ॥ లు కావలసి వుంటుంది. ఈ కర్చు పెట్టుకొని అంతదూరము పోతే — జమ్మలమడుగులో ఫేర్ ప్రయిజు డిపోవారు మాదగ్గర బియ్యంలేదంటారు. చక్కెర స్టాకు లేదంటారు. గోధుమలు లేవంటారు. రేపు రమ్మంటారు. మాపు రమ్మంటారు. ఆ డిపో కీపరు దయాదాక్షిణ్యము పుట్టి ఈ గ్రామసీమలలో ఉండే సర్కారు ఉద్యోగులకు వారము భత్యము యిస్తె కద్దు. లేకుంటే చెవులు విదిలించుకుంటూ మరలా వారి వారి గ్రామాలకు పోవలెను.

ప్రజలే యిప్పుడు అమలు జరుగుతూయుండే సర్కారుకు అధికార్లు. ఇంక రాబోయే ప్రభుత్వాలకు అధికార్లు, మాష్టర్లు. కనుక గ్రామాలలో ఉండే ఉద్యోగుల గోడు, వారి గతి చూడండి. విచారించండి. యోచించండి.

మంత్రులేమో సర్కారు ఉద్యోగులకు ఆహారధాన్యాలు చిక్కేందుకు మంచి యేర్పాటు చేసినామని ఢంకా వాయించుచున్నారు. ఎంతబాగుగా జరుగుతూవుందో యోచించండి.

గ్రామ సీమలలో రేషనింగు, కంట్రోలు తీసినామంటూనే ధాన్యము ధరలు యెక్కిపోయినాయి. రూపాయకు 3 పడి బియ్యం చిక్కడంలేదు. గ్రామాలలో సర్కారు ఉద్యోగాలు చేస్తూన్న వారంతా 12 మైళ్ళు, 16 మైళ్ళు పోయి రేషనింగు తెచ్చుకోలేక రూపాయకు అర పడి బియ్యం కొంటూ సర్కారువాండ్లు యిచ్చే జీతమంతా బియ్యానికి పెట్టుకుంటూ, ప్రాణాలు పట్టుకొనివున్నారు. గ్రామాలలో సర్కారు ఉద్యోగులని చెప్పుకునేవాండ్లు గుడ్డలకై పడేకష్టము చూస్తే మరింత జాలికలుగుతుంది. పెండ్లాలకు చీరలులేక కష్టపడుచున్నారు. బిడ్డలకు గుడ్డలు లేవు.

మంత్రులకు ఈ సంగతులన్ని తెలియవా? ఈ సంగతులన్ని తెలియచెప్పే కలెక్టర్లు దిక్కులేరా? గ్రామసీమలలో నివసించే సర్కారు ఉద్యోగులకెల్ల అనుకూలముగ ఉండే

ఎట్లు ఒక్కొక్క ఫిర్కాకు ఒక్కొక్క రేషన్ డిపో, గుడ్డల డిపో సర్కారు తరఫుననే పెట్టి, యెందుకు వారికి ఆహార ధాన్యము న్యాయమైన ధరలకు సప్లయిచేయకూడదని? గ్రామములలో పనిచేసే ఉద్యోగులకు యోచనలేకుండ, జీవించేందుకు వసతులు లేకుంటే, వాండ్లు మాత్రం యేమి ఉత్సాహముతో పనులు చేస్తారనే విషయము మంత్రులకెందుకు తట్టడము లేదని? ఉద్యోగులు ఉత్సాహముగ పనిచేస్తేనేకదా కాంగ్రెసు ప్రభుత్వము మంచిదని ప్రజలనుకొంటారు. జిల్లాకలెక్టరుగారైనా మీ పత్రికలో ప్రకటించిన ఈ లేఖను చదువుకొని, ప్రతి ఫిర్కాలోనూ ఒక రేషన్ డిపోను యేర్పాటు చేసేందుకు డి. యస్. ఓ కు ఉత్తరువు చేస్తారనే ఆశతో ఈ లేఖను వ్రాసినాను. దయయుంచి దీనిని మీరు ప్రకటింప ప్రార్థించుచున్నాను.

టి. కృష్ణమూర్తి.

## సత్యాగ్రహము.

ఆర్యా!

కడప పట్టణములో చేనేత పారిశ్రామికులు కడచిన నాలుగురోజులుగ సత్యాగ్రహము శాంతియుతముగ జిల్లా కలెక్టరు ఆఫీసువద్ద సాగించుచున్నారు. ఒక్క గొప్ప విశేషమేమనగ పోలీసువారు, ఇతర అధికారులు ఎవరుగాని ఈ సత్యాగ్రహులతో జోక్యము కలిగించుకొనక శాంతియుతముగ జరుగుటకు తోడుపడుచున్నారు.

కడప. వనమాల చెంచయ్య.

## పులివెందుల తాలూకాలో ఆహార స్థితి.

ఆర్యా!

ఈ సంవత్సరము కడపజిల్లా పులివెందుల తాలూకాలో సకాలమునకు వర్షములేక పంటలు బొత్తిగ పండలేదు. బీద, మధ్యతరగతి రైతులుగూడా తిండి గింజలు కొనవలసిన పరిస్థితిలో పడినారు. పశువులకు మేత కొఱతగాయున్నది. చేనేతవారికి నూలు సప్లయిలేదు. వ్యవసాయకూలీలకు పనులు లేవు. బీద ప్రజానీకమంతా చాలా బాధపడుచున్నారు. ప్రజలు తమకష్టాలను తెలియజేస్తూ, గ్రామగ్రామానికొక ధాన్యపు డిపోను తెరువవలెనని, భూస్వాముల యొక్కయు, దొంగ వ్యాపారస్తులయొక్కయు, ధాన్యాన్ని స్వాధీనపఱచుకొని, బీదలకు పంచవలెననీ, రైతులకు, చేనేతవారికి వడ్డీలేకుండా దీర్ఘవాయిదాలమీద అప్పులివ్వవలెననీ, విదేశాలకు నూలు సప్లయిని ఆపి, చేనేతవారికి చాలినంత నూలు సప్లయి చేయవలెననీ, వ్యవసాయకూలీలకు పనులు కల్పించవలెననీ, గండికోటప్రాజెక్టు, యితర మైనరుప్రాజెక్టులను కట్టింపవలెనని, పంటలుపండనిప్రాంతాలను కరువుప్రాంతాలుగ ప్రకటించి, తిండి గింజలు సప్లయిచేయవలెనని కోవరంగుట్లపల్లె, బ్రదంపల్లె, కోరాంపల్లె, బురుజుపల్లె గ్రామాలనుండి మహజర్లు పంపబడినవి. ప్రభుత్వము తక్షణము చర్యతీసుకొని ధాన్యాన్ని సప్లయి చేయవలెనని కోరుచున్నాము.

కోవరంగుట్టపల్లె. పి. సి. గంగిరెడ్డి.

---

### కడప జిల్లా కోర్టులో,

E. P. 18/1951 — O. S. 103/1949 (సబ్ కోర్టు)

లకిరెడ్డి వెంకట్రామిరెడ్డి వగయిరాలు — పిటీషనర్లు

Vs

1. లకిరెడ్డి చిన్నవెంకటరెడ్డి.
2. ,, బాలవెంకటరెడ్డి ఉరఫ్ బాలిరెడ్డి. మతి స్థిరము లేనందున కోర్టుగార్డియన్ శ్రీ కె. గుండూరావు, అడ్వకేటు, కడప.
3. ,, రాజు కొండారెడ్డి
4. ,, వెంకట కొండారెడ్డి
5. ,, లక్ష్మమ్మ

} రెస్పాండెంట్లు (ప్రతివాదులు)

1,3,4,5 రెస్పాండెంట్లు సాకిన్ అరకటవేముల గ్రామం ప్రొద్దుటూరు తాలూకా.

ప్రతివాదులకు:— పైనంబరులోని డిక్రీ వగయిరా ఖర్చులకుగాను జప్తిచేయించి యుండుప్రతివాదుల యెస్టేటు తాలూకు చరాస్తిని యేలంవేయుటకు, యేలం తేది నిర్ణయించ గలందులకు 25_7_1951 తేదికి నిర్ణయించ బడియున్నది. ఎవరైనా ఆక్షేపణ కలిగియున్నంతట కోర్టువారియెదుట పై తేదిన హాజరయి తెలుపుకోవలయునని తెలియజేయడమైనది.

కడప, 20_6_1951. వి. వి. శేషాచార్లు, బి. ఎ. బి., ఎల్. వాదుల వక్కీలు,

---

### కడపజిల్లా కోర్టువారి సముఖమునకు.

E. A. 13 of 1951.

O. S. 15/1941.

దేవిరెడ్డి సోమక్క — పిటిషనరు (D. 3.)

Vs

దేవిరెడ్డి వెంకట్రామిరెడ్డి — రెస్పాండెంటు (D. H.)

పిటిషనరు (3-వ ప్రతివాది) యీ నెంబరు డిక్రి Full satisfaction enter చేయమని మనవిచేసివున్నది, కనుక సదరు పిటిషన్ వాయిదా 3_7_1951 తేది వున్నది. యీ వాయిదాకు రెస్పాండెంటు ఈ కోర్టు యెదుట పగలు 11 ఘంటలకు హాజరై తెలుపుకోవలెను. లేనియెడల యక్సపార్టిగా తీర్మానించబడును.

యన్. సుబ్బరామయ్య, బి. ఏ., బి. ఎల్.,
పిటిషనరు వక్కీలు.

# భా ర త జ్యో తి.

( ప్రతి బుధవారము ప్రకటింపబడు తెలుగు, ఆంగ్ల, రాజకీయ వార పత్రికలు.)

## చందా వివరములు.

| | | | |
|---|---|---|---|
| తెలుగుప్రతి:- | సంవత్సర చందా | రూ | 9—0—0 |
| | విడి సంచిక | ... | 0—3—0 |
| ఆంగ్లప్రతి:- | సంవత్సర చందా | ... | 6—0—0 |
| | విడి సంచిక | ... | 0—2—0 |
| రెండు చేరి:- | సంవత్సర చందా | ... | 12—0—0 |
| | విడి సంచిక | ... | 0—4—0 |

## ప్రకటన రేట్లు

| | | | |
|---|---|---|---|
| పూర్తిపేజి | ఒకదఫాకు | ... ... ... | రూ 80—0—0 |
| అర్ధపేజి | ,, | ... ... ... | రూ 45—0—0 |
| ఒక అంగుళము | ,, | ... ... ... | రూ 6—0—0 |

కంట్రాక్టు రేట్లకు, ఇతర వివరములకు:

257, ట్రంకు రోడ్డు,
పోస్టు బాక్సునంబరు 10,
కడప.

మేనేజరు,
"భారత జ్యోతి"

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER : K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక,

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఎ.,

సంపుటము 4.
సంచిక-21.

బుధవారము, జూలై 4, 1951.

ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక

"భావ ప్రకటనా స్వాతంత్ర్యము మా జన్మహక్కు. రాజ్యాంగ విధానము ద్వారా
ఈ హక్కును హామీ యిచ్చు వరకునూ మేము నిద్రపోము"

# భారత జ్యోతి

సంపుటము. 4.
సంచిక 21.

శ్రీ ఖరనామ సంవత్సర జ్యేష్ఠ బ॥ ౧౧, జూలై 4, 1951.

ప్రతి బుధవారము
ప్రకటింప బడును.

## అవసర వస్తువులపై సేల్సుటాక్సు రద్దు కావలెను.

ఈ దేశములో అందరు భాగ్యవంతులే లేరు. కోట్లకొలది ప్రజలు భరించుటకు వీలు కానిటువంటి దరిద్రములో మునిగిపోవుచున్నారు. ప్రజలకు అన్నముపెట్టి, గుడ్డ యివ్వవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వములు కాని, కేంద్ర ప్రభుత్వము కాని వహించుటలేదు. ఉద్యోగము లేనివారికి ఉద్యోగముచూపు బాధ్యత ప్రభుత్వమునకులేదు. నిరుద్యోగ భత్యములులేవు. ముసలి తనములో నిర్భయముగ జీవించుటకు ఉపకార వేతనములు (పెన్షనులు) యిచ్చు బాధ్యతలేదు. ప్రజలు బ్రతికిన, వారి స్వశక్తిపై ఆధారపడి బ్రతుకవలెను. చచ్చిన చావవలెను. ప్రజలబ్రతుకుతో కాని లేక చావులతో కాని ప్రభుత్వమునకు సంబంధమేలేదు. బీదలనుండి పన్నులను రాబట్టుకొనుటకు సర్వహక్కులున్నట్లు ప్రస్తుత కాంగ్రెసు మంత్రివర్గముల అభిప్రాయమై యున్నది. అభిప్రాయమేకాదు. ఆ విధముగనే న్యాయ సూత్రములకు వ్యతిరేకముగ పన్నులను వసూలుచేయుచున్నారు. ఈహక్కు మాత్రము మంత్రివర్గముల కెచ్చటనుండివచ్చెనో చెప్పరు.

కోట్లకొలదిగాగల అమాయక ప్రజలకు మంత్రి వర్గములవారు విధించుచున్న పన్నుల విషయము బొత్తిగా తెలియదు. కొంచముగనో లేక గొప్పగనో తెలిసిన విద్యావంతులు వాని మంచిచెడ్డలనుగూర్చి ప్రజలకు నచ్చచెప్పి, పన్నుల క్రూరతను తగ్గించుటకై ఆందోళన సాగింపరు. అధికారములోనున్న మంత్రులు చట్టములకును, న్యాయ సూత్రములకును తమబుద్ధికి తోచినట్లు వ్యాఖ్యానములను చేసి, సామాన్యప్రజల నెత్తిపై పన్నుల భారమును తగ్గించుటకు మారుగ హెచ్చు చేయుటకే ప్రయత్నించుచున్నారు. ఈ విషయములో మన చెన్నరాష్ట్రము ఆర్థిక శాఖామంత్రి గారైన శ్రీ బి. గోపాలరెడ్డి గారి నాయకత్వము క్రింద ముందడుగు వేయుచున్నది.

ఇండియా రాజ్యాంగ చట్టములోని 286 సెక్షను 3-వ క్లాజులో—

"మానవ సంఘముయొక్క జీవితమునకు అవసరమైన వస్తువులని పార్లమెంటు నిర్ణయించిన వానిపై రాష్ట్ర ప్రభుత్వములు పన్నులు విధింపకూడదు. రాష్ట్ర శాసన సభలు పన్నులను వసూలు చేయు శాసనములు చేయకూడదు. అట్లు ఒక వేళ శాసనసభలు చట్టములు చేసినను అవి యూనియన్ అధ్యక్షుని ఆమోదము పొందనిచో, అనులు జరుపుటకు వీలుపడ"దని స్పష్టముగ తెలుప బడియున్నది.

ఆహారధాన్యము, పప్పుధాన్యము, కూరగాయలు, పాలు, పాలపొళ్లు, ఉప్పు, ముతక చేనేత గుడ్డలు, ముతక మిల్లుగుడ్డలు, ముడిప్రత్తి, వ్యవసాయపనిముట్లు ప్రజాజీవితమునకవసరమైన వస్తువులని భావించి, వానిపై సేల్సుటాక్సు విధింపకూడదని జూన్ నెలలో ఇండియా పార్లమెంటులో ఒక్క బిల్లు ప్రవేశపెట్టబడినది. ఈ బిల్లు విషయమై చెన్న

రాష్ట్ర ఆర్థిక శాఖామంత్రిగారు ఒక విపరీతమైన వ్యాఖ్యానమును గావించియున్నారు. రాజ్యాంగ చట్టములోని 286 సెక్షనులో, 3-వ క్లాజు ననుసరించి పార్లమెంటులో ఇప్పుడు ప్రవేశ పెట్టబడిన బిల్లు శాసనము కాకముందు, ఏయే వస్తువులపై సేల్సుటాక్సు అమలులో, నున్నదో దానిని తొలగించుటకు వీలుకాదని తెలుపుచున్నారు. ఇండియా యూనియన్ ప్రభుత్వ స్టేటుమంత్రియైన శ్రీ మహావీర త్యాగిగారు జూన్ నెల 26-వ తేది చెన్నపట్టణములో పత్రికా విలేఖరులతో మాటలాడుచు శ్రీ గోపాలరెడ్డిగారి అభిప్రాయమునే బలపఱచిరి. అందుకై శ్రీగోపాలరెడ్డిగారు ఆనందపడవచ్చును. సాధారణమైన బుద్ధితో యోచించిన పార్లమెంటులో ప్రవేశపెట్టబడిన బిల్లుప్రకారము, ప్రస్తుతము అమలులోనున్న పన్నులకు మినహాయింపు కలుగునని చెప్పుటకు వీలులేదు. అయితే చెన్నరాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రిగారును, శ్రీ మహావీర త్యాగి గారును, గొప్ప మేధావులై యుండవచ్చును. వారి వాదమును న్యాయశాస్త్రము లెంతమాత్రము సమర్థించునో చూడవలయును. ఇండియా పార్లమెంట్లు కొన్ని వస్తువులు మానవ సంఘమున కత్యావసరమైనవని నిర్ణయించినది. రాష్ట్ర ప్రభుత్వములకు కాని, లేక శాసన సభలకు కాని, వానిపై సేల్సుటాక్సు విధించుటకు వీలు లేదనినది. ఆ బిల్లు శాసనమగుచో, ఇప్పుడుఅమలులోనున్న పన్నులకు ఏల వర్తింపదో అర్థమగుట లేదు. రాజ్యాంగ చట్టము 286 సెక్షను 2-వ క్లాజులో—

"ఒక రాష్ట్రము నుండి మరియొక రాష్ట్రమునకు అమ్మకమునకై పోవు వస్తువులపై రాష్ట్ర ప్రభుత్వములు సేల్సుటాక్సు విధింపరాదు. ఈ రాజ్యాంగచట్టము అమలులోనికి రాకముందే అట్టి పన్నులు వసూలునందున్నచో, 1951 సం॥ మార్చి నెల 31-వ తేది వఱకు ఇండియా యూనియన్ అధ్యక్షుని ప్రత్యేక అనుమతి పొంది వసూలు చేసుకొనవచ్చునని" వ్రాయబడియున్నది.

1951 సం॥ ఏప్రెలు నెల 1-వ తేదీ నుండి ఆపన్ను చెల్లనేరదని స్పష్టమైనది. అవసర వస్తువులపై పన్నులను తొలగించుటకు పార్లమెంటుకు అధికారమున్నది. ఇదివఱకు రాష్ట్రములలో అమలులోనున్న పన్నులను తొలగించుట అనవసరమని రాజ్యాంగ శాసన కర్తలు భావించియే యుండిన యెడల, ఆ దేవిధముగ 186 సెక్షను 3-వ క్లాజులో తెలిపియుండెదరు. అటుల మినహాయింపబడవచ్చునని స్పష్టముగా తెలుపనందున శ్రీ గోపాలరెడ్డి గారి వాదము, శ్రీ మహావీర త్యాగివారి వాదము ఎంతమాత్రము సమర్థింపబడ జాలదు.

ఈ సేల్సుటాక్సు ఇండియా యూనియన్ లోగల అన్ని రాష్ట్రములలోను లేదు. మానవ జీవితమునకు అత్యావసరమైన వస్తువులపై పన్ను విధించుటే క్రూరత్వము. అన్యాయము. ఇట్టి అన్యాయమైన పన్నును విధించుటకు ఇతర రాష్ట్రములు పూనుకొనకుండుటకై ఇండియా పార్లమెంటు వారు చట్టముచేయ సంకల్పించినచో, ఆ చట్టము చెన్నరాష్ట్రమునకు వర్తింపదని చెప్పుటలో మూర్ఖత్వమే ఎక్కువ కనబడుచున్నది కాని, మానవ జీవితముయొక్క అవసరమును గుర్తించినటుల తోచుట లేదు. ఆహార ధాన్యముల పైనను, ఇతర అవసర వస్తువుల పైనను ధరలు విపరీతముగా పెరుగుచున్నందున సామాన్య ప్రజల జీవిత కర్చులు అంతులేకుండ పెరిగిపోయినవి. అవసరవస్తువుల పై కొంచముగనైనను ధరలు తగ్గింపవలెనను సంకల్పముతోనే ఇండియా ప్రభుత్వమువారు పార్లమెంటులో "అనవసర వస్తువుల" బిల్లును ప్రవేశ పెట్టియున్నారు. బిల్లులో తెలుపబడిన వస్తువులన్నిటిపైనను సేల్సుటాక్సు తొలగించినచో, రాష్ట్ర ఆదాయమునకు 6 కోట్ల రూపాయలు లోటు వచ్చునను కారణముపై, బిల్లు నాక్షేపించుట కాని లేక బిల్లు చెన్నరాష్ట్రమునకు వర్తింపదని కాని ఆర్థిక శాఖామంత్రిగారు చెప్పుటలో న్యాయము

( మిగత 5-వ పేజీలో )

# కాంగ్రెసుపై ప్రజలకు విసుగెత్తుటకు కారణమేమి?

( శ్రీ యస్. వెంకటాద్రిగారు, ఎం. ఏ. )

నేనే కాదు. మంత్రులైనవారును, శాసన సభ్యులైనవారును, సామాన్య ప్రజలలో యెవరినైనా పోయి ఈ కాంగ్రెసు ప్రభుత్వము లెట్లున్నవని ప్రశ్నించండి. ఈ కాంగ్రెసువారు అధికారానికి వచ్చిన దగ్గరనుండి అరిష్టము తగులు కొనినదని యంటారు. అన్నానికి, గుడ్డకు కఱవైన దంటారు. ఇంగ్లీషువారి పరిపాలనమే బాగున్నదంటారు. ఉద్యోగుల హడావిడి, దౌర్జన్యాలు యెక్కువైనా యంటారు. ఈ కాంగ్రెసు పభుత్వముపోతే బాగంటారు. కాంగ్రెసువారు తొలగిపోతే యింకేపార్టీవారు అధికారానికి రావలెనని మీరు కోరుతారని ప్రశ్నించుతే— ఇతర పార్టీలువస్తే మరింత అధ్వాన్నముగా యుంటుందేమో అంటారు. కాని కాంగ్రెసువాండ్లు మాత్రము వద్దంటారు. రైళ్ళలో ప్రయాణము చేసే ప్రయాణీకులంతా యీ విషయాలే చర్చించుకుంటూ ఉంటారు. మోటారు బస్సులలో ఇదే చర్చలు. కాఫీ హోటళ్లలో యిదే చర్చలు. కనుక కాంగ్రెసు పార్టీకన్న మంచిపార్టీ మరియొకటి లేదని ప్రజలలో నభిప్రాయమున్నా, వీరు యధికారములోనికి వచ్చిన ఈ నాలుగు సంవత్సరాలుగ దేశ పరిపాలనలో గావించిన యవకతవకలను చూచి, దేశమును పరిపాలించుటకు సరియైన యోగ్యత, సామర్థ్యము ఈ కాంగ్రెసుపార్టీకి లేదని సామాన్య ప్రజలు తలంచుచున్నారు. ఏమి చదువురానివారు, మోటువారైన ప్రజలు వేసే ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరము చెప్పుటకే కష్టమనిపిస్తుంది.

తీర యెన్నికలు సమీపించే సమయములో కాంగ్రెసు పార్టీవారు రెండు ప్రమాదకరమైన తప్పులు చేసినారు. ఈ సారి బడ్జెట్టులో రైల్వే చార్జీలు ఎక్కువచేసినారు. ఇంటరు క్లాసు, రెండవ క్లాసు, మొదటి క్లాసు చార్జీలు యెక్కువచేసినా తక్కువచేసినా అంతగా యోచించేవాండ్లుండరు. కాని మూడవతరగతి చార్జీలు ఎక్కువ చేయడము చేత సామాన్య ప్రజలంతా కండ్లు తెరచుకొన్నారు. ప్రయాణ సౌకర్యాలు బొత్తిగాలేవు. మూడవ తరగతి పెట్టెలు పశువుల దొడ్డి మాదిరిగ ఉన్నాయి. ప్రయాణీకులకు నిలుచుకొనేందుకే తావుండదు. ఈదినమునకుకూడ నిలిచే పలకల(Foot boards) మీద నిలుచుకొని, కడ్డీలు పట్టుకొని ప్రయాణము చేస్తూన్నారు. ఒకటవతరగతి పెట్టెలు, రెండవ తరగతి పెట్టెలు ఖాళీగా ఉంటాయి. మోటారు బస్సులలో ప్రయాణముకూడ ఇదేగతి. ఇవి ప్రజలకు ప్రతి నిత్యము కనపడేలోపాలు. ప్రతి దినము యెదుర్కొనవలసిన లోపాలు. ఓపిక పట్టుకొనండి అంటే ఎంతకాలమని యోపిక పట్టుకొని యుండగలరు. కష్టముల ననుభవింపగలరు. ఒక దినమా? రెండు దినాలా? ముందుగా సరియైన ప్రయాణ వసతులు చేసి, చూపి, తృప్తిపఱచి, అపైన రైలు చార్జీలు ఎక్కువచేసినా ప్రజలంతగా యోచింపరు. ఏలాటి సౌకర్యాలులేక, చార్జీలు మాత్రము యెక్కువచేసి, "నిబ్బరముతో యుండండి. మేము ముందేమో చేస్తా"మంటే ప్రజలు సమ్ముతారా?

1939 సం॥ నకు ముందు రైళ్లలో నాలుగు తరగతు లుండినాయి. వానికి ఈ క్రింది విధముగ చార్జీలుండేటివి.

| | | |
|---|---|---|
| 1-వ తరగతి. | మైలుకు | 24 పైసాలు. |
| 2 ,, | ,, | 12 ,, |
| ఇంటరు ,, | ,, | 6 ,, |

(ప్యాసింజరుకు)

ఇంటరు ,, ,, 7½ పైసాలు.

(మెయిలు, ఎక్స్‌ప్రెస్‌లకు)

3-వ తరగతి. ,, 2½ మొదలు 4 పైసాలు, మెయిలుకు 1 పైసా ఎక్కువ.

దూర ప్రయాణాలకు తక్కువ. దగ్గిరప్రయాణాలకు యెక్కువ.

యుద్ధకాలములో పై చార్జిలపై రూపాయకు ఒక్క అణా మొదట సర్‌చార్జి ఎక్కువ చేసినారు. తర్వాత రెండుఅణాలు చేసినారు. దీనికేకాంగ్రెసు వాండ్లందరు పెద్ద గోలచేసి, రైల్వేచార్జిలు ఎక్కువ చేయకూడదని శాసన సభలలో ప్రభుత్వమును ఆక్షేపించినారు. యుద్ధమయిపోయినది. బ్రిటీషు వారు వైతొలగినారు. దేశమునకు స్వతంత్రము వచ్చినది. గాంధీ టోపీదారులు అధికారములోనికి వచ్చినారు. ఏమైనదికి వెంటనే యుద్ధకాలపు సర్‌చార్జిలను తొలగించిరి. దూరప్రయాణము చేసే వారికి తక్కువ చార్జిని తొలగించిరి.

| | | | |
|---|---|---|---|
| 1-వ | తరగతి చార్జి | 30 | పైసాలకును, |
| 2 | ,, | 16 | ,, |
| ఇంటరు | ,, | 7½ | ,, |
| | | (పాసింజరు.) | |
| | ,, | 9 | ,, |
| | | (మెయిలు, ఎక్స్‌ప్రెస్) | |
| 3 | ,, | 4 | ,, |
| | | (పాసింజరు) | |
| | ,, | 5 | ,, |
| | | (మెయిలు) | |

పెంచిరి. తీర ఎన్నికలు సమీపించుచున్న సమయములో మరల ఈ చార్జిలపై మూడవ తరగతి ప్రయాణీకుల చార్జిలను మనకాంగ్రెసు ప్రభుత్వము వారు కొంచ మించుమించుగ 100టికి నూరింతలు పెంచిరి. 1939 సం॥లో 1-వ తరగతి ప్రయాణీకుల చార్జి ఎంత యుండెనో 1951 సం॥లోకూడ అంతనే యుంచిరి. ప్రయాణము చేయులకా సౌకర్యముల నెంతమాత్రము కలిగింపరైరి. రైళ్లలో మూడవ తరగతి ప్రయాణమన్న యమలోకమను మాట ప్రతివారికిని జ్ఞాపకమునకు వచ్చును. ఇవన్నియు చూచిన కాంగ్రెసు పార్టిపై ప్రజల కేవిధముగ విశ్వాసము కలుగునో చెప్పజాలను. ఎన్నికల ముందు రైల్వే చార్జిలు యెక్కువచేయుట కాంగ్రెసు పార్టికి మంచిదెబ్బ. ఇట్టి యవకతవక పనులవల్ల పార్టీల బలమును, ప్రజలపై కాంగ్రెసు కుండిన పలుకుబడిని కాంగ్రెసు నాయకులే పోగొట్టు కొనుచున్నారు. కాంగ్రెసుపై ప్రజలలో విసుగు పుట్టించుచున్నారు.

కాంగ్రెసు రాబోవు ఎన్నికలలో గెలువజాలదని చెప్పుటకు సాహసింపను. కాని కాంగ్రెసు పార్టివారు నిలుపబోవు అభ్యర్థులకు పోటీగా నిలుచువారు, సర్వవిధముల యోగ్యులై, యువకులయి, నీతి పరులయి యుండినచో, కాంగ్రెసు అభ్యర్థుల కెవ్వరును ఓటు చేయరను మాట నిశ్చయము. అటువంటి అభ్యర్థి ఎదురు పార్టివారికి లభింపని పక్షముననే కాంగ్రెసు పార్టివారికి జయము. ఈ హెచ్చరికను గోడలపై వ్రాసుకొనవచ్చును.

---

అవసర వస్తువులపై సేల్సుటాక్సు రద్దు కావలెను.

(3-వ పేజీ తరువాత)

లేదు. సకారణములకు దూరమై మొండి పట్టుతో వాదించుటకు ప్రారంభించుచో, ఈ ప్రభుత్వము ధనిక వర్గమువారి ప్రభుత్వమను ప్రతీతి స్థిరపడును. ఈ లాటి ప్రభుత్వముల క్రింద బీదలకు కష్టములు తొలగవను అభిప్రాయము స్థిరపడును. రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ ప్రజాదరణను కోలుపోవును. కనుక రాష్ట్రిఆర్థిక శాఖామంత్రి గారు దూరదృష్టికలిగి అవసరవస్తువులపై సేల్సుటాక్సును రద్దుచేయుటకు తమ సంసిద్ధత చూపెదరు గాక యని కోరుచున్నాము.

# జులై 12-వ తేది వార్తాపత్రికల ప్రకటన నిలుపవలెను.

## రాజ్యాంగ చట్ట సవరణబిల్లుపట్ల అసమ్మతి ప్రకటన; ప్రభుత్వము ఏర్పరచిన సలహా సంఘాలతో సహాయ నిరాకరణము.

**... —— (0) —— ...**

బొంబాయి, జూన్ 24: కేంద్ర ప్రభుత్వానికిని, రాష్ట్రీయ ప్రభుత్వాలకును సలహా యిచ్చుటకు, లేదా వారితో సమాలోచనలు జరుపుటకు, లేదా మరేవిధముగా నైనా కలిసి పనిచేయుటకు యేర్పరిచిన పత్రికా సంఘములన్నిటినీ తాత్కాలికముగా రద్దు చేయడానికి అఖిల భారత పత్రికా సంపాదకుల మహాసభవారు జూన్ 22-న తీర్మానించిరి. రాజ్యాంగ విధానము నందలి 19 (2) సూత్రానికి చేసిన సవరణ, పత్రికా స్వాతంత్ర్యానికి భంగము కలిగించును. పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్య హక్కును అరికట్టుచున్నదని సభవారు ప్రకటించిరి. పత్రికా స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వమువారు ఈ విధముగా అక్రమముగా, అనవసరముగా అరికట్టినందుకు అసమ్మతి తెలపడానికి గాను దేశములోని పత్రికలన్నీ జూలై 12-వ తేదీన ప్రచురణ నిలిపి వేయవలెనని సభవారు విజ్ఞప్తి చేసిరి. పత్రికలకును, పత్రికా శాసనములకును సంబంధించిన ప్రభుత్వ కమిటీలకును, విచారణలకును సహాయమును నిరాకరించవలెనను సూచనను స్థాయిసంఘ నిర్ణయానికి పంప సభవారు తీర్మానించిరి.

రాజ్యాంగ విధానాన్ని సవరించడంవల్ల యేర్పడిన పరిస్థితినిగూర్చి చర్చించడానికి ఈ సభ శ్రీ లాలా దేశబంధు గారి అధ్యక్షతను ప్రత్యేకంగా సమావేశ పరుపబడినది. నిన్న, నేడు దీర్ఘచర్చలు జరిపిన మీదట సభ నేటి సాయంకాలము సమాప్తమైనది.

### తీర్మానములు.

రాజ్యాంగ విధానమునందలి 19 (2) సూత్ర సవరణను మొదటి తీర్మానములో సభవారు తీవ్రముగా ఖండించినారు. ఈ సవరణ పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని అరికట్టుచున్నదని సభవారు స్పష్టముచేసిరి. త్వరపడి చేసిన ఈ సవరణను, అనుచితమైన ఈ సవరణను రద్దుచేయునంతవరకు పత్రికలు విశ్రాంతి పుచ్చుకొనవని ఈ తీర్మానము ప్రకటించుచున్నది.

(2) పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి తీరని భంగము వాటిల్లినదనే విషయాన్ని ప్రజలకు స్పష్టంగా తెలుపడానికి గాను దేశమునందలి వార్తాపత్రికలు, సచిత్ర వార, మాస పత్రికలు సంపాదకీయముపైన 'భావ ప్రకటనా స్వాతంత్ర్యము మా జన్మ హక్కు. రాజ్యాంగ విధానము ద్వారా ఈ హక్కును హామీ యిచ్చువరకునూ మేము నిద్రపోము' అను మాటలను ఇముడ్చవలెనని రెండవ తీర్మానము కోరుచున్నది.

(3) పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వమువారు అక్రమముగా, అనవసరముగా అరికట్టినందుకు అసమ్మతి తెలుపడానికి గాను పత్రికలు ఒకరోజున, 1951 సం॥ జులై 12-వ తేదిన పత్రికా ప్రచురణ మానవలెనని మూడవ తీర్మానము కోరుతున్నది.

(4) 19 (2) సూత్రాన్ని రద్దు చేయించడానికి కృషి చేస్తాము అనే వాగ్దానాన్ని పార్లమెంటుకు, రాష్ట్రీయ శాసన సభలకు, ఎన్నికకు నిలిచే ప్రతి అభ్యర్థినుండి పుచ్చుకోవలయునని నాల్గవ తీర్మానము వోటర్లను కోరుచున్నది.

(5) సవరణవల్ల పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి కలిగిన మహోపద్రవాన్ని అచంచలంగా ప్రతిఘటించవలెనని ఐదవ తీర్మానములో పత్రికలను, పత్రికల శ్రేయస్సు నభిలషించే వారిని సభవారు కోరుతున్నారు.

(6) ప్రభుత్వమువారికి సలహా యివ్వడానికి, లేదా, సమాలోచనలు జరపడానికి, లేదా ప్రభుత్వమువారితో కలిసి పని చేయడానికి కేంద్రములోను, రాష్ట్రాలలోను యేర్పరుప బడిన కమిటీలను సస్పెండు చేయడానికి సభవారు నిర్ణయించిరి.

(2) పరిస్థితులను పునఃపరిశీలించవలసిన అవసరము కలిగే యెడల ఈ మహాసభ నిర్ణయములను దృష్టిలో నుంచుకొని స్థాయి సంఘమువారు పరిస్థితులను పునఃపరిశీలించవచ్చునని సభవారు తీర్మానించిరి.

(3) పత్రికలకు, పత్రికా శాసనాలకు సంబంధించిన విషయములలో ప్రభుత్వమువారు ఏర్పరచిన కమిటీలకు విచారణలకు సహాయము నిరాకరించవలననే సూచనను స్థాయి సంఘమువారు పరిశీలించి, తగుచర్య గైకొనవలెనని సభవారు కోరుచున్నారు.

## అవీ ఇవీ

### అమెరికాలో స్త్రీ జూరర్లు.

అమెరికాలోని నలభై రాష్ట్రాల న్యాయస్థానాలలో స్త్రీలు జూరర్లుగా పనిచేయడానికి అనుమతింపబడినారు.

### ఉపాధ్యాయుల వేతనాలు.

అమెరికా ఉపాధ్యాయుల సంవత్సరమునకు జీతము 1950—51 లో సగటున 3,080 డాలర్లు. అమెరికా కార్మిక శాఖ అంచనాలను బట్టి పెద్ద పెద్ద పట్టణాలలోని ఉపాధ్యాయుల సగటుజీతము 1925—1949 మధ్య నూటికి 84 వంతులు పెరిగినట్లు తెలియుచున్నది.

### టైపురైటర్ల తయారు

అమెరికాలో 1863 జూన్ 23 న మొదటి టైపు యంత్రము పేటెంటు చేయబడినది. ఈ రోజున 28 కంపెనీలు టైపు యంత్రాలను తయారు చేయుచున్నవి. 1950 లో అవి రమారమి 850,000 యంత్రాలు తయారు చేసినారు.

### బురఖా స్త్రీలకు పరాభవము.

అమెరికాలో బురఖా స్త్రీలకు కలిగిన పరాభవమునకు చింతిల్లనివారుండరు. వారు పాకిస్థాను రాయబారి శిబిరమునకు చెందిన ఉద్యోగుల బంధువులైనను అఖండ భారత దేశమున గల స్త్రీలోకము యిందులకు వగచును. ఇరువురు ఆఫీసర్ల భార్యలు, కుమార్తెలు బజారుకువెళ్లి సరుకు కొనుచుండిరట. వారి ఫక్తు పాకిస్తాను ముస్లిము స్త్రీలపద్ధతి యుడుపుల ధరించి బురఖాలను వైచుకొని యుండిరట. అమెరికాలో "జిప్సీ" లనే యొకవిధమగు ఆటవిక జాతియున్నది. వారు మన లంబాడీల వంటివారు. లంబాడీ స్త్రీలు మనదేశములో అప్పుడప్పుడు చేయు హంగామా పల్లెవాసులకు బాగుగా తెలియును. బారుమీసాల మగవారుకూడ వారికి సమాధానము చెప్పలేక చేతులు వెల్లకిలవేసి చప్పరించుట కలదు. వారప్పుడప్పుడు చిల్లర అంగళ్ళపైబడి సాధువులగు వర్తకుల నదలించి, బెదరించి, మురిపించి, గికురించి దోచుకొని పోవుటయుకలదు. సరిగ నట్టే "జిప్సీ" యువతులు అమెరికాలో చేయుచుందురట. వీరు మంచి చాలాకీగా నుందురుకూడ. మనము అప్పుడప్పుడు వీని చర్యలను సినిమాలో చూచుచుందుము. పైన ప్రస్తావింప బడిన పాకిస్థానీ ఆఫీసరు బంధురాండ్రు వెళ్లిన షాపునకు కొద్ది కాలము క్రిందటనే 'జిప్సీ వనితలు వచ్చి దోచుకొని వెళ్ళిరట. అందుచే నాదుకాణాదారు ఝడిసి పోలీసు వారికి చెప్పి పంపినాడు. వారువచ్చి ప్రశ్నింపగా "ఘోషా స్త్రీలు" బురఖాలో నుంచిరైన వారు మాట్లాడరైరట. అంత పోలీసువారు వారిని ఠాణాకు నడిపించిరి. అక్కడ నిజము తెలిసి విడుదల గావించిరి. ఇది కొంత ఆందోళన మునకు కారణ మాయెను. తుదకు ఆ ప్రాంతపు మేయరు క్షమాపణ నొసంగెను. ఈ యుదంతము అంతటితో ముగియు ననే యను కొందుము. అయితే దీనివలన తెలియ దగిన మరొక విషయమున్నది. భారతదేశము వదలి వెళ్ళిన భారతీయులు ఇతర దేశములలో మన ఆచార వ్యవహారములను పాటించు పట్ల కొంత ఔచిత్యమును చూచుకొన వలయును. ఆత్మ గౌరవము, అభిమానము వీడకయే తమ ఎరుకగోరు పురుషుల కుచితభంగి జబాబివ్వజాల నప్పుడు మగతోడు లేక బయటికి వెళ్ళుటయే మానుకోదగును. స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యము లవసర మనువారు వాని ననుకూలముగా విని యోగ పరచుకొనగల శక్తియుక్తులు వారికుండ వలయునని యను కోరుదురు గదా.

## విజ్ఞాన విశేషాలు.

### చుట్టుప్రక్కల 15,000 మైళ్ళలో గాలి వానల కనిపెట్టే యంత్రము.

చుట్టూ 15,000 మైళ్ళ ప్రాంతములో ఎక్కడ గాలి వాన ఉన్నా వెంటనే కనిపెట్టగల ఒక క్రొత్తరకము రాడార్ రేడియోను అమెరికాలో ఉత్తర ఇల్లినాయిస్ రాష్ట్రములో వాతావరణ పరిశీలకులు ఉపయోగిస్తున్నారు. ద్వితీయ సమరకాలములో కనిపెట్ట బడిన రాడార్ యంత్ర సహాయముతో ఈ రేడియో తయారు చేయబడినది.

ఈ రాడార్ యంత్రము ఒక రకమైన శక్తికిరణాలను ప్రసారము చేయును. ఆకిరణాలు తమ లక్ష్యానికి తాకగానే కొంత శక్తి వెంటనే వెనుదిరిగి మళ్ళీ రాడార్ యంత్రములోనికి వచ్చును. అచట అది విస్తృతమై వాతావరణ సూచిలో స్పష్టముగా కనబరచును. గాలి వానలు ఏ దిశగా, ఎంతదూరములో ఉన్నది, ఏ దిక్కుగా ప్రయాణము చేస్తున్నదీ కూడా ఈ యంత్రము సూచించును.

ఈ రాడార్ కిరణాలు గాలివాన ప్రాంతమును చేరగానే వాటి శక్తి క్షీణించును. ఆ క్షీణదశలో ఆ కిరణ ప్రతి బింబము తిరిగి రాడార్ యంత్రమును చేరుకొని, ఎంత వర్షము కురియునదీ కూడా సూచించును. ఈ రాడార్ రేడియో సమీపములో ఉన్న గాలివానలను సరిగా చూప గలుగు చున్నది. కాని, దూర ప్రదేశాల విషయములో అంత సక్రమముగా పని చేయడము లేదు.

# రాజ్యాంగ చట్టములో 15–వ సెక్షను సవరించుట వల్ల కలిగిన మార్పు.

—.)0(.—

## వృత్తి కళాశాలలకు విద్యార్థుల సెలెక్షన్ విధానమును వివరిస్తూ అధికార ప్రకటన.

చెన్నపట్టణ మంత్రివర్గము ఈ నెల 18–వ తేదీన సమావేశమై మెడికల్, ఇంజినీరింగ్, వ్యవసాయ, పశువైద్య శాలలలో విద్యార్థుల ప్రవేశమునకు కమ్యూనల్ జి. ఓ. స్థానమున కొత్త నియమములను చేసిరి. కొత్త ఏర్పాటు ననుసరించి మొత్తము స్థానములలో షెడ్యూలు జాతులు, షెడ్యూలు తరగతులకు కలిపి 15% స్థానములు, సాంఘికముగా విద్యావిషయకముగా వెనుకబడినవారికి 25% ప్రత్యేకించబడనవి. ఇదేగాక మెడికల్ కాలేజీలలో 20% సీట్లు ఆడవాళ్ళకు ప్రత్యేకింపబడినవి.

ఇంతవరకు కమ్యూనల్ జీ. ఓ. ననుసరించి ప్రతి 14 స్థానములలో బ్రాహ్మణులకు 2. బ్రాహ్మణేతరులకు 6, వెనుక బడిన హిందువులకు 2, ముస్లిములకు ఒకటి, హరిజనులకు 2, క్రైస్తవులకు 1 స్థానము పంచేవారు.

"ఇంత వరకు జరుగుచున్నది స్థానముల పంపకము. ఇప్పుడు సహాయము అవసరమైన వారికి అవకాశము ఇచ్చుటకు కొన్ని స్థానముల రిజర్వేషన్ చేయుట జరిగినది. సర్వీసులు గురించి ఇంకా ఆలోచించలేదని వానికి కూడ ఏర్పాటు ఇదే విధముగా వుండవచ్చునీ, త్వరలో ఆ విషయమై కూడా నిర్ణయించెదమని శ్రీ భక్తవత్సలముగారు అన్నారు.

### ప్రభుత్వ ప్రకటన.

మెడికల్, ఇంజినీరింగ్ వ్యవసాయ, పశువైద్య కళాశాలలలో విద్యార్థుల ప్రవేశమునకు ప్రభుత్వము క్రొత్తగ ఈ క్రింది నియమములను చేసినది.

(1) మొత్తము స్థానములలో షెడ్యూలు జాతులు, షెడ్యూలు తరగతులకు 15% స్థానములు రిజర్వు చేయుదురు.

(2) సాంఘికముగా విద్యావిషయకముగా వెనుక బడిన జాతి వారలకు మొత్తము స్థానములలో 25% రిజర్వు చేయుదురు. విద్యా సౌకర్యముల నిమిత్తము లోగడ ప్రభుత్వ వుత్తర్వులో పేర్కొనబడిన కులాలను, సాంఘిక విద్యాభివృద్ధి అవసరమైన వెనుక బడిన జాతులుగ పరిగణించెదరు. లబ్బేలు, దూదేకుల, మోప్లాలాంటి ముస్లిం జాతులు, షెడ్యూలు జాతులు, షెడ్యూలు తరగతులనుండి క్రైస్తవులుగా మారినవారు ఆ జాబితాలో చేరెదరు.

(3) ఈ తరగతుల వారికి కనీస స్థానములు లభించేందుకు ఈ రిజర్వేషన్ చేసినను సమర్థతా అవకాశములను బట్టి అంతకు మించి చేర్చుకొనవచ్చును.

(4) రిజర్వు చేసినటువంటివీన్నీ, చేయనటువంటివీన్నీ అన్ని స్థానములు నిరుటి వలెనే నాలుగు ప్రాంతములు, అనగా సర్కారు, రాయలసీమ. తమిళ జిల్లాలు, పశ్చిమ కోస్తా జిల్లాల మధ్య పంచబడినవి.

(5) మెడికల్ కాలేజీలలో 20% స్థానములు ఆడవాళ్లకు ప్రత్యేకించెదరు.

(6) ప్రభుత్వమువారు నియమించే కమిటీలు వివిధ కేంద్రాలలో దరఖాస్తు దార్లను ఇంటర్వ్యూ చేసి, సెలెక్షన్ చేయుదురు. మెడికల్ కాలేజీకి ఒకటి, ఇంజనీరింగు కాలేజీకి ఒకటి, వ్యవసాయ పశువైద్య కళాశాలకు కలసి ఒక కమిటీ, మూడు కమిటీలు వుండును. చెన్నపురి, ఆంధ్ర, అన్నామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు కమిటీలకు అధ్యక్షులుగా వుంటారు.

(7) షెడ్యూలుజాతి, షెడ్యూలు తరగతుల అభ్యర్థులు తప్ప మెడికల్ ఇంజినీరింగు కాలేజీలకు పార్టు 3 లో మొత్తము మార్కులలో వరసగా 45%, 50% తక్కువ వచ్చిన వారి దరఖాస్తులను పరిశీలించరు.

(8) విద్యార్థుల సెలెక్షన్‌కు ఈ క్రింది విశేషములను గూడ ఆలోచన లోనికి తీసుకొనెదరు.

(1) ఇంటర్‌మీడియట్ పరీక్షలో పార్టు 3 లో వచ్చిన మార్కులు.

(2) ఆటలు, దేశీయ సైనికదళములో శ్రద్ధ.

(3) విద్యార్థుల అభిరుచి.

(4) శరీర సౌష్ఠవము.

(5) ఉన్నత విద్యా విషయములో కుటుంబ ఆర్థిక పరిస్థితిని గూడ ఆలోచన లోనికి తీసుకొనెదరు.

విద్యలోను, సంఘములోను వెనుకబడియున్న జాతుల వారిని 152 జాతులను పేర్కొనుచూ ఏప్రిల్ 6 తేదని ఒక పట్టికను ప్రభుత్వము ప్రకటించినది. అందులో తెలుగుజాతుల పేర్లు క్రింద తెలుపబడి యున్నవి.

బగిగ, బెస్త, బిల్లవ, బొంది, బోయ, దాసరి, దేవాంగ, దొమ్మర, దూదేకుల, యానాది, గవర, గౌడ, (గవళ్ళ, కలాలి) ఈడిగ, (శెట్టి బలిజతో సహా) జెక్కుల, (గుంటూరుజిల్లా) జాండ్ర, జంగము, కళింగి, సంసాల, విశ్వబ్రాహ్మణ, లబ్బె, లంబాడి, మహేంద్ర, (మేద) మంగలి, ముత్రాసులు, ఒడ్డె, పల్లి, పాములరెడ్డి, (గంజాము) సుగాలి, తీగెల, రజక, ఉప్పరి, బడ్డెబలిజ, (గంజాము, విశాఖ) యాదవ, ఎరుకల.

# ఆత్మజ్ఞానము - సుకరము కాదు.

మూలము:— శ్రీ స్వామి శివానందగారు. —అనువాదకులు, శ్రీ భూతపురి నారాయణస్వామిగారు.

మాయ అజేయము. మానవస్వభావ మాసురికము. కావున జ్ఞానసాధన పర్వతారోహణక్రియ వలె కష్టభూయిష్ఠము. కేవలము పరమేశ్వరానుగ్రహమే దీనిని లభింపజేయగలుగును. సన్యాసాశ్రమ స్వీకరణము వలన తాను సామాన్య మానవాతీతుడై, యనితరసాధ్యంబగు పదవి నధిష్ఠించినటుల దలచి యుపదేశ కర్తృత్వాధికారము వహించినచో, నిట్టి 'అహం' భావము వలన తన సాధనకే మోసము వాటిల్లును. వివిధ రూపములతో విజృంభించు నీ 'అహం' తత్వ నిర్మూలనమే జ్ఞానసాధనకు ముఖ్యమూలము. వినయ సౌశీల్యాదుల వలన దీనిని తొలగించుకొనవలెను. లేనిచో సాధనమంతయు భస్మహుతమగును.

జిజ్ఞాసువు మిక్కిలి జాగ్రత్తతో మెలగవలయును. అయ్యది స్వైరక్రీడకాదు. సాధనలో పరిపూర్ణత నొందితినను గర్వము దరికి రానీయరాదు. ప్రారంభదశలో నున్నటులనే భావింపవలెను. సంతోషము, దయ, క్షమ, ఆర్జవము, ప్రశాంతి, దాంతి ఇత్యాది సుగుణము లలవఱచుకొనవలయును. ఎట్టి సందర్భములందును, ఎట్టిచోటులందును, మనోవాక్కర్మలయందు ఋజు వర్తన ఏర్పడవలెను. దూషణభూషణముల యందు సమబుద్ధి నవలంబింపవలెను. పరోపకారమున నేలాటి యలసతయు నుండరాదు. అప్పుడే సాధకునికి సాత్వీక స్వభావము ప్రాప్తించును. జ్ఞానసిద్ధి లభించును.

సాధకునికి దుర్విషయరహిత చిత్తశుద్ధి ముఖ్యము. జ్ఞానినైతిననియు, నిర్లిప్తతాదశ నొందితిననియు, నే కర్మయోగాచరించితిన నయ్యది నను బాధింపదనియు నిట్టి తలంపు లుదయించినచో వాడు మాయా వాగరమున జిక్కును. అట్టి వానికి ఆత్మానాత్మ వస్తు వివేచనము కలుగజాలదు. అజ్ఞాన మావరించును. సద్బోధలు చెవిదూరవు. అహంకారము ప్రబలును. పెద్దల తిరస్కరించును. చిత్తైకాగ్రత, ధ్యానము, సమాధి, వీనికిదూరమై తుదకు నాత్మవంచకు డగును,

కావున నో సాధకా! అపరోక్షానుభూతి నార్జించు నీ సాధనమున విఘ్నపరంపర నొదవించు విక్షేపముల దలచి జాగ్రత్తతో వర్తించుము. యమ నియమాదుల నసదుగా తలంపకుము. సాధన చతుష్టయ మార్గము లేమరకుము. జపము, సంకీర్తనము, స్వాధ్యాయము, ఉపాసనము ఇత్యాది మార్గము లవలంబింపుము. ఆర్జవ ప్రాధాన్యము స్మరింపుము. గురుసేవ జేయుము. ఈ సద్గుణపుంజము సాధింపని సాధన చుక్కానిలేని నావవలె క్రుంగిపోవును.

జ్ఞానమనగా మానవ తత్వముగా మారుటయే. ఈమార్పు కలిగిననాడే సాధకుడు పరిపూర్ణుడగును. ఇయ్యది సత్వగుణ వర్ధనముననే సాధ్య మగును. ఇట్టి గుణ వృద్ధి కొరకే శ్రద్ధ, భక్తి ధ్యానాదులు, ఈ సాధనాభ్యాసము నందధికార ప్రాప్తిచే స్థిరచిత్తత యేర్పడును. సాధకా! ఇందు కొఱకై నీలోగల ఆసురిక స్వభావమును దహింపజేసికొనుము. నిరంతర సాధన తత్పరుడవగుము. భగవ దనుగ్రహమునకు మొఱపెట్టుకొనుము. తొందఱపడకుము. భ్రమ నొందకుము. ఓర్పు వహింపుము. సాత్వీక స్వభావము స్థిరముగా నేర్పడునో పరమానంద ప్రాప్తి కలుగును.

# అరిషడ్వర్గము.

(శ్రీ పి. వి. సుబ్బయ్యగారు.)

(గత సంచిక తర్వాత.)

కామ, మోహములు లేనిదే కర్మజాలముల నెఱపుట అసంభవము కాగలదని కొందఱి మతమైనను, సంభవము కాగలదని నిష్కామ కర్మయోగము సూచింపఁబడెను. నిష్కామ కర్మయోగము సులభసాధ్యమయినది కాదు. అరిషడ్వర్గములను చెంతకురానీయని నిష్కల్మష చిత్తము గల సంయమియే దానిని చేపట్టగలఁడు. ఆత్మ సంయమము బడయవలయుననన్న, వ్యక్తి తనప్రవర్తనను మార్చుకొనవలెను. మున్ముందు అతి ముఖ్యమగు నాహారమును గురించి జాగ్రత్త వహింపవలెను. సత్వరజస్తమోగుణములకు మూలము ఆహారము. సత్వగుణము వలయుచో పండ్లు, పాలున్ను, రజోగుణము వలయుచో, శాఖాహారమున్ను; తమోగుణము వలయుచో మాంసాహారమున్ను గ్రహింపనగును. సాత్వికాహారమునందు పప్పు, నేయి, నూనెలు చేరరాదు. ఇట్టి స్వాత్వికాహారమును గొనువారు కామక్రోధాదుల సులభముగా జయింపఁగలరు. ఈక్రింది వాక్యములను గమనింపుడు.

"మనస్సునకును, శరీరమునకును, కడు జుట్టఱికము గలదు. మకిలయగు మనస్సు మకిల తిండ్లకే మరులుకొనును, మకిలమనస్సు పలుతెగల చవులకును, భోగములకును మారాము చేయును. తిరిగి ఈ తిను బండములయు, భోగములయు, గుణము మనసుపయింబని జేయును. కావున ఆహార నియమమునకును, ఉపవాసమునకును, అవశ్యకత కానిపించుచున్నది. వికారయుక్తమగు మనస్సు శరీరమును ఇంద్రియములను తన శరీరమున నుంచుకొనుటకు బదులు శరీరేంద్రియములకు వశమై నడుచుచుండును. ఈ కారణముచేఁగూడ శరీరమునకొక యాహార మర్యాద యుండవలయును. ఆయాహారము శుద్ధముగనుండవలయును. ఇంచుక వికారము కలిగించునదిగాకూడ నుండరాదు."

—"గాంధీజీ - ఆత్మకథ", 4 వ భా॥ 30 వ అ॥

ఆహార నియమముల పాటించినను ఈ నిష్కామకర్మ యోగమును చేబట్టుట దుస్తరమే యగుచున్నది. ప్రతి చిన్నవిషయము నందును ఆత్మపరీక్ష చేసికొనుచు, ఇందునాకు కోరిక యున్నదా అని ప్రశ్నించుకొను చుండవలయును. బాహ్యమునకు నేను నిష్కామకర్మ యోగినని దంభములు బల్కినను, ఆత్మపరీక్ష చేసుకొన్న నిక్క ము తేటపడును. అట్లు ప్రతి దివసాంతమునందును పరీక్షించుకొని, దోసఁగుల గుర్తించుకొని అయ్యవి పునః ప్రతిపాదింపఁబడకుండునట్లు చూచుకొనుట ఈయోగి కర్తవ్యము."కర్మగతిగహనము. కర్తవ్యమేది, అకర్తవ్యమేది; ఏది కర్మ, ఏది అకర్మ, మఱియు ఏది వికర్మ. ఇది నిర్ణయింప జ్ఞానులును మోహితులగు చున్నారు" అని భగవంతుఁడు భగవద్గీతయందుఁ బలికి యున్నాఁడు. కనుక ఈ నిర్ణయమును మెలకువమెయి చేసికొనవలసి యున్నది.

ప్రతి కర్మయు మూఁడుమార్గములుగా నడుచుచున్నది. 1. వ్యక్తిగత ధర్మమును బట్టియు, 2. జాతి ధర్మమును బట్టియు, 3. యుగధర్మమును బట్టియు; కర్మయోగి వ్యక్తిగత ధర్మమును నిర్వర్తించు నపుడు జాతిధర్మమును, యుగధర్మమును ముందిడుకొని, వానికి వెలిబడని రీతి వర్తించును. యుగధర్మము పట్ల తక్కిన రెంటికిని ప్రాధాన్యము

లేదు. యుగమునననుసరించి మన ప్రకృతికి సరిపడు కర్మమేదియో నిర్ణయించుకొని యద్దానిని మాత్ర మే సలుపవలయును.

శ్లో॥ కుర్వన్నేవేహ కర్మాణిజిజీ విషేచ్ఛతం సమాః
ఏవం త్వయినాన్యథేతో௨ స్తినకర్మలిప్యతేనరే॥
—ఈశావాస్యోపనిషత్తు. 2.

ఈ లోకమున విహిత కర్మముల నాచరించుచునే, నూఱు సంవత్సరములు జీవింపఁ గోరవలయును. జీవితేచ్ఛగలఁ నీవు కర్మ బంధమునుండి విముక్తుఁడవగుట కింతకంటె మరియొక మార్గము లేదు.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మ ఫలహేతు ర్భూర్మాతే సఙ్గో௨ స్త్వకర్మణి॥
—భగవద్గీత - 2-47.

విహిత కర్మముల నాచరించుటేగాని వాని ఫలములను గోరుటకు నీకు ఎన్నడును అధికారము లేదు. కర్మ ఫలములను బొందుటకు నీవు కారణము గావలదు. అట్లని కర్మల ననుష్ఠింప కుండుట యందును తగిలియుండవలదు. అనఁగా ఫలముల ను గోరకుండ విహిత కర్మములను జేయుచుండవలెనని భగవానుడు శెలవిచ్చి యున్నాడు. మరియు "ఏజ్ఞానముచే గంతవ్యపథము సులభముగా నిర్ణీతమగునో కర్మజీవనము యొక్క లక్ష్యము ను, నిత్యమును అనుష్ఠింపఁదగిన నియమములను సుస్పష్టముగా నొక్కమాటలో వ్యాఖ్యాతమగునో అట్టి జ్ఞానము నీకిత్తు" అని భగవంతుడు భగవద్గీతయందు బలికియున్నాడు. అట్టి మహత్తరమైన వాక్యమేది? ప్రపంచమునఁగల మానవాళికి శిరోధార్యమగు నా యమూల్య జ్ఞానమేది? ఆ పరమ వచనమియ్యదియే—

శ్లో॥ మన్మనా భవమద్భక్తో మద్యాజీమాం నమస్కురు,
మామే వైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియో௨ సిమే॥
శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ
అహంత్వాసర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
(భగవద్గీత)

పై రెండు శ్లోకముల యర్థమును ఒక్కమాటలో చెప్పవలయునన్న అయ్యది ఆత్మసమర్పణము. సర్వ భూతములయందు భగవంతుని దర్శించుచు, సర్వకాలములందును అతనిని స్మరించుచు, సర్వ ఘటనములందును ఆతని శక్తి జ్ఞాన ప్రేమముల గుర్తించుచు సంపూర్ణమైన శ్రద్ధా భక్తులతో ఆతని సేవించుచు, సర్వకర్మములను యజ్ఞభావముతో ఆయనకు సమర్పించుట. ఇయ్యది తెలిసికొని తదానుగుణ్యముగా వర్తించు నాతఁడు నిష్కామ కర్మ యోగి యనజెల్లును. ఈయోగ మిప్పుడు సులభ సాధ్యమగును. పగలంతయు పాపముల నొనర్చి సాయంత్రమున "ఓ భగవంతుఁడా నాపాపముల క్షమింపుము" అనుటతోడనే పాపములు నశింపవు. తన పాపములకు పశ్చాత్తప్త హృదయుఁడై మఱునాఁడా పాపముల జేయకున్న ఫలమున్నది. మఱల మఱల నాపాపములనే జేయువ్యక్తికి నిష్కామ కర్మయోగమేగాక భగవత్సన్నిధాన మావంత యును లభింపదు. అట్టిది ఆత్మ సమర్పణముగాదు.

శ్లో॥ యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్
శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః॥
—భగవద్గీత 9 - 27, 28.

"అర్జునా! నీ వేమి యొనర్చినను, భుజించినను, వ్రేల్చినను, దానమొసగినను, తపమొనర్చినను, దానినెల్ల నాకు సమర్పణముగా జేయుము. పుణ్య పాపములనెడి కర్మబంధములనుండి విముక్తుఁడవు కాగలవు. అని శ్రీ కృష్ణభగవానులన్నది వాస్తవమే; కాని అట్టియాత్మ సమర్పణమొనర్చు యోగ్యత ముందుగనే ఆర్జింపవలదా? ఎట్టిదా తాహాతు?

(సశేషము.)

నవల

# ధర్మ విజయము.

శ్రీ వాల్మీకి

## (1)

సాయం సమయము. శీత శైల పరిసర విలసిత శిశిరానిలములఁబోలి గంధ వాహనుఁడు వసంతఋతు నయనాహ్లాద కరతరులతాగుల్మ విసరంబులనుండి మెల్ల మెల్లన వీచుచుండ ఇనుఁడపరపర్వత శిఖర శృంగంబున నిలచి సంజ కెంజాయల బరపుచు, సృష్టి విలాసంబుల వెలువరించుచుండెను. ఎందుఁగాంచినను కీరశారికాపిక మయూర కలకల నిస్వనంబుల వీనుల విందుగొలుపుచుండెను. ఆ సమయంబున నవయౌవన విరాజమాన శరీరులును సమ వయస్కులనగు నిరువురు యువకులు సుందర సౌధరాజ విరాజితంబగు కాంచీపుర వీధులం గమించి విరామారామము వైపు నొయ్యారముగ నడువఁజొచ్చిరి. ఒక్కొకపరి పెదవుల చిగురొత్తు నిర్మల మందహాస రుచిపరకింప, నిష్కల్మష హృదయులనియు, సంసార కష్టపరంపరలఁదగులని వారనియు, అవివాహితు లనియు బోధపడకమానదు. వేయేల, వారి యుడుపులును, వారిగమన వైఖరులును, వారి పాశ్చాత్యపద్ధతులును, వారు విద్యార్థులని, ఘంటాపథముగఁజాటెడిని. ఇట్లుఁజను దెంచి సమతలమగు పచ్చిక నేలపై గూరుచుండి, నవపరాగ భూషితమ్ములగు పుష్పవాటికల నాలోకించి, యొకఁడు "మిత్రమా! భగవంతుఁడు లేడనియు, ఉన్నచో దృగ్గోచరము గాడా యనియు నాస్తికులు వాదింతురు. ఈ సర్వజన నయనాభిరామమగు సృష్టిఁగాంచినయంత సృష్టికర్త యొకరుఁడుండునని స్ఫురింపదా!" యనుచుండునంత, రెండవవాఁడందుకొని "సృష్టి స్థితిలయ కారణభూతుఁడొక్కరు డుండునని తోపదా!" యని పకపకనవ్వెను. తదుపరి క్రమముగా వారిట్లు సంభాషింపఁదొడఁగిరి.

ప్రథముఁడు:— "శ్యామలా! నీవనునది నాస్తికుల మనంబున కెక్కునుగాని నాకు సరిపడదు"

ద్వితీయుఁడు:— "మఱి నీవనునదేమి?"

ప్రథముఁడు:— "పూర్వజన్మ సుకృతము ననుసరించి కీడో మేలో ఈ లోకంబునందు మానవు లనుభవించుచు పోవుచుందురు. కాని సృష్టించినవాఁడు భక్షింపడని నానమ్మకము"

శ్యామ:— "చంద్రశేఖరా! నీకుగల తత్వజ్ఞానమెల్లరకు కలిగినచో నిఁక సంసారమెందులకు? ఏ చెట్టు నీడనో, ఏ పుట్ట నీడనో కనులు మూసికొని కూర్చొనవలసినదేగదా!"

చంద్రశేఖర్:— "మిత్రమా! పరిహాసమాడకుము. నా యభిమత మెఱిగించితిని గాని వేరుగాదు".

శ్యామ:— "అబ్బే! నేను పరిహాస మాడుచుంటినని పొరబడితివా యేమి? లేదులేదు. యదార్థము వచించితిని. మిత్రమా! మఱియొక మాట. నీమాటచొప్పున సనాతనుఁడు గాఁగోరువాఁడు ఏమి చేయవలెను?"

చంద్ర:— "పాంచభౌతిక కంకాళ మీతనువని యెఱిఁగి, పంచేంద్రియముల మనసున కధీనము గునట్లొనర్చి, చిత్తశుద్ధిమై కార్యజాలముల సల్పుచు, సచ్చరిత్రుఁడుగా మెలఁగవలయును. మనోవాక్కాయ కర్మంబుల నేఱి కపకార మొనర్పకుండుటయే సనాతనంబునకు మార్గము"

శ్యామ:— "అట్లనుటచే నరిషడ్వర్గాదుల జయింపమనుటయే నీ భావము. ఇఁక పుత్రి మిత్రి కళత్రాదు లెందులకు?"

చంద్ర:— "నెచ్చెలీ! నీవిఁకను పెఱటి మార్గముననే యుంటివి. ఏక పత్నీవ్రతమునుదాల్చి రాజయోగము నెఱపుచు నిష్కామ కర్మ యోగులై ఏల తరింపకూడదు?"

శ్యామ:— "పరనారుల గవయఁగూడ దన్నమాట!"

చంద్ర:— "అవును. తన్నువరించిన నిష్కల్మష చరిత్రను దప్ప ఇతరులఁగోర గాదు".

శ్యామ:— "అయిన మిత్రమా! నీసహభాగిని యెవరు?"

చంద్ర:— "ఇంకను నిశ్చయించుకొనలేదు."

శ్యామ:— ఈ ప్రసంగ ధోరణిఁబడి కాలము మరచితిమి. లెమ్ము. చీకటిబడుచున్నది. అనిలేచి, ఏదియో ముచ్చటించుకొనుచు ముందుకు నడువఁజొచ్చిరి. ఇంచుక దూరమరుగగనే నయన పర్వమొనర్చుచు లేబ్రాయపు జవ్వను

లిగ్వురు తటస్థమైరి. వారియందొకతె సుమారు పదునారు వర్షముల ప్రాయము గలిగి వికసిత శిరీష కోరక సుకుమార శరీరంబును, చంద్రికాంతుల క్రుమ్మరించు ముఖపద్మంబును, కలువపూవుల గేలిచేయు నేత్రద్వయంబును, ఫాలభాగోపరి కేళిసలుపుచున్న ముంగురుల యందంబును గలిగి, చూపరుల సూనశర వేదనాదూయమాన మానసులఁ జేయఁజాలి భువన మోహనవిలాసమున వెలయుచుండెను. మఱియొకతె సమవయస్కయయ్యును, రూపవిలాసంబుల ప్రథమ యువతిని మీఱఁజాలదు.

వారు రాయంచల ధిక్కరించు మందయానమున క్రీగంటి చూపు లిందందు ప్రసరింపఁజేయుచు, నెడనెడ మందస్మిత ముఖారవిందలగుచు పోవుచుండిరి. అమూల్య వస్త్రాభరణాలంకృతులైన యువతీ ద్వయము నాలోకించి, వారి యపూర్వాభిరామతకు నాత్మ మెచ్చుకొనుచు ముందుకు నడువ నోడుచు, విశ్రమాశ్రమ పార్శ్వంబుల నేగు జనసమూహము లట్లే నిలువంబడి యనిమిషులై, కొంతవడిఁ దెప్పరిలి నేగుచుండిరి. ఇఁక నెదురు దవిలిన చంద్రశేఖర, శ్యామలారావుల దృష్టి నాకర్షింప కుందురా? చంద్రశేఖర మా జవరాంద్ర కన్యారత్నక జూచుచు, సర్వాంతర్బహిర్మధ్యాత్ముండగు సృష్టికర్త నేర్పునకాత్మ మెచ్చుకొనుచుండెను. శ్యామలారావందొక యువతి నాలోకించి "సోదరీ! రుక్మిణీ! ప్రయాణ మెంతవరకు.,, అనియెను. ఉద్దేశింపఁబడిన కన్య "అగ్రజా! వాహ్యాళి కరుగుచుంటిమి. మా యుపాధ్యాయుల కొమారితయగు నీ జానకీ యందులకు ప్రోత్సహింప బయలుదేరితిని. తదుపరి పరస్పరమిట్లు మాటాడఁదొడఁగిరి.

శ్యామ:— "నా పనిచిన కార్య మేమయ్యెను."

రుక్మి:— "ఏ మగును? సమయానుకూలము సిద్ధించిన పండగును.,,

శ్యామ:— "సరే శీఘ్రముగా మరలిరండ."ని విరమించెను. ఇట్లు సంభాషణ జరుగు నవసరంబున జానకి నెచ్చెలియగు రుక్మిణి భుజముల మాటున నిలువంబడి అనివార్య రూపజిత మారుండగు బాలసుందరముపై క్రీగంటి చూపుల ప్రసరింపఁజేయుచుండెను. ప్రథమ దర్శనంబుననే కోమల హృదయారవిందుడగు చంద్రశేఖర హృదయ ప్రాదము రాయంచయగు నా పూబోడికి నాహ్వానము జాటుచుండ, చిత్తమునకు బానిసేంద్రగు నేత్రద్వయ మూరకుండునా? అనురాగ లిప్తమగు దృక్కులనాపెను ముంచివైచినవి. అన్యోన్యానురాగ బద్ధుల హృదయ క్షేత్రములందు ప్రథమ దర్శన మాత్రముననే ప్రేమ బీజములు విత్తబడుట సహజము. —

అంత శ్యామలారావు ప్రసంగమును విడచుటయు, చంద్రశేఖరమును వెంట నిడికొని పురవీధుల బడుటయు. దృశ్య గోచర మగుటయు కొన్ని నిమేషములలో జరిగెను. పెన్నిధి గోల్పోయిన పేద చందమున, శీతాంశు కిరణ ద్యుతిఁగోల్పోయిన చకోర సంతతి విధంబున, మిత్రుని బాసిన కమలంబు కైవడిని చిన్నబోయిన మోముతో జానకి ముందుకు నడువఁ జొచ్చెను. వెన్నంటి రుక్మిణి జనుచుండెను. అందందు విహరించి గృహాభిముఖులై మార్గ మధ్యంబున నిట్లు సంభాషింప దొడఁగిరి.

జానకి:— "రుక్మిణీ! మీ సోదరుని యర్థించి గణితంబు నేర్చుకొన గూడదా?,,

రుక్మి:— "నేర్చుకొనకేమి. ప్రతిదినము రాత్రుల యందొక గంటకాలము బోధించుచునే యున్నాడు. ఎంత కఠినమైన లెక్కనైనను మాయగ్రజుఁడు త్రుటిలో మనసున కెక్క బోధింపఁజాలును. బహు కుశాగ్రబుద్ధి గలవాఁడగుట నధ్యాపకుని యనురాగమునకు పాత్రుఁడయ్యెను.,,

జానకి:— "నేఁడు మీ సోదరునితో జనుచున్న వారెవరు?,,

రుక్మి:— "ఆతఁడు మా సోదరునకు మిత్రుఁడు. చంద్రశేఖర మనువాఁడు. ఇరువురొకే పాఠశాలయందు సహపాఠకులు.,,

జానకి:— ఇరువురొకేచోట నివసించుచుందురా?,,

రుక్మి:— "లేదు. ఆతఁడు పెద్దకంచియందున్నాఁడు.,,

ఇట్లు సంభాషించుకొనుచు గృహముల సమీపించిరి. చీకటి పడెను. జానకీ రుక్మిణులు నిజనిలయంబుల కరిగిరి.—

—ప్రథమ ప్రకరణము సమాప్తము.—

# ప్రజాభిప్రాయ వేదిక.

## మనము స్వతంత్రులమేనా?

ఆర్యా!

1947 ఆగష్టు 15_వ తేదీన మనకు స్వరాజ్య మొచ్చినది. ఇప్పటికి దాదాపు 4 సంవత్సరములు కావచ్చినది. కాని మనకు చేతినిండపని, పొట్టనిండ కూడు దొరకుట దుర్లభమైనది. ఆనాడు మనమందరము కాంగ్రెసు అధికారమునకు వచ్చిన, మనకు కూడు, గుడ్డ, బాగా దొరుకుతుంది. సుఖముగా మానవులవలె బ్రతుకగల్గుతామన్న ఆశతో మన ఓట్లను కాంగ్రెసుకు వేసినాము. కాని మన ఆశలన్నీ నిరాశలయినాయి. ఈ కాంగ్రెసు ప్రభుత్వము అధికారములోనికి వచ్చినప్పటినుండి భూస్వాములు, జమీందారులైనారు. బ్లాక్ మార్కెటీర్లు పెట్టెల నింపినారు. మధ్య తరగతి రైతులు బీదరైతులైనారు. చిన్నరైతులు రైతుకూలీలైనారు. ఇంక కూలీచేసుకొని బ్రతుకేవారి సంగతి చెప్పలేనంత హీన స్థితి కొచ్చినది. ఇవన్నియు చూస్తే, అప్పటి బ్రిటీషు ప్రభుత్వమే మెరుగనిపించుచున్నది.

ఇట్లు ప్రజలంతా తిన తిండ, కట్ట బట్టలేక ఆత్మహత్యల పాలగుచున్నారు. దినమంతా కష్టించినా, మూడు రూకలు దొరకుట కష్టము. దానితో వాడు తిండి తెచ్చుకుంటాడా? లేక బట్ట తెచ్చుకుంటాడా? లేక గృహావసతులు చూచుకుంటాడా? కాబట్టి చింపిరి గుడ్డలతో, అర్థ కడుపుతో కాలము గడపవలసి వస్తున్నది. వాడు యింటికి వచ్చినప్పటినుండి, 'నాన్నా నాకు గుడ్డలేదు, నాన్నా నాకు అన్నమే' అంటున్న బిడ్డల ధ్వనులు విని చికాకుచెంది పోషించ చేతగాక, వాడు ఆత్మహత్యకు పాలగుచున్నాడు. ప్రభుత్వాన్నడిగితే కమ్యూనిస్టులని కాల్చుతారు. యదార్థ విషయాలకు తావులేకున్న మనకు స్వతంత్రము లభించినదని చెప్పుకొనుటకు వీలు లేదు.

ఆనాడు, లాఠీచార్జీలు, తుపాకి కాల్పులు చేసేప్రభుత్వము వుండకూడదని చెప్పిన కాంగ్రెసువారు ఈ నెహూరు ప్రభుత్వములో యదార్థ విషయాలను చెప్పవచ్చినవారిమీద, మాకు అన్నము పెట్టండి, లేదా పనిచూపండి అన్నవారిమీద లాఠీ చార్జీలు, కాల్పులు జరుగుతున్నాయి. చూడండి... మాసము నుండి చేనేత పారిశ్రామికులు చెన్నరాష్ట్ర సెక్రటేరియట్ ముందు మాకు నూలు ఎక్కువ సప్లయి చేయండి. అంతవరకు మాకు భృతి యివ్వండని చెప్పుచూ సత్యాగ్రహము చేస్తూవుండే వారిని లాఠీచార్జిలు చెయ్యడము, అరెస్టులు చెయ్యడము, భోజనము లేకుండా చెన్నపట్టణమునకు 20, 30 మైళ్ళ దూరంలో ఒక్కొక్కరినిగా రాత్రిళ్ళు వదలడము జరుగుచున్నది. యదార్థ విషయాలను చెప్పుకొనుటకు కూడా హక్కులేని మనము స్వతంత్రులమేవిధముగా అగుదుము? మరి మనయొక్క కష్ట నిష్ఠూరాలను ప్రభుత్వానికి చెప్పక, ఎవరికి చెప్పవలెను? ఇప్పుడు మనకు స్వరాజ్య మొచ్చిందే గాని సురాజ్యము మాత్రము లేశమైన రాలేదు. స్వరాజ్య మొచ్చినా మనకు స్వతంత్రము రాలేదు. కాబట్టి మనము స్వతంత్రులము కాము.

దేశములో రెండు వర్గాలున్నాయి. ఒకటి ధనిక వర్గము. రెండవది బీద వర్గము. వీనివల్లనే ప్రజలలో కుల, మతాలు అస్పృస్యతలు, అసూయ, దొంగతనాలు, పేచీలు, ఆకలి మంటలు, చావులు కూడా వస్తాయి. చూడండి... ఒకడు తక్కువ కులమువాడున్నాడనుకొండి, వాడు ఆర్థికములోను, విద్యలోను, ప్రవీణుడై ఒక వుద్యోగములో నుండిన వానిని మనము కులమతాలనే మాటే మరచి ఎక్కువగా గౌరవించుతున్నాము. ఎందుకు? వాడు విద్యలోను, ఆర్థికంగాను ముందున్నాడు గాబట్టి. సమాన గౌరవము, సమాన హక్కు లభించవలెనంటే ఆర్థిక సమానత కావలెను. అప్పుడే, అస్పృస్యతలు, దొంగతనాలు, కుల మతాలు, పేచీలు, ఆకలి మంటలు, చావులు నిర్మూలమగును. అటువంటి ఆర్థిక సమానత కమ్యూనిస్టులు, సోషలిష్టులు, నాస్తికులు కూడా కోరుతారు. గాంధీగారు కూడా కోరి యుండిరి. కాని దానిని అనుచరణలో పెట్టు ప్రభుత్వము కావలెను.

ఆ నాడే మనము స్వతంత్రుల మనిపించుకొనగలము.

ప్రొద్దుటూరు. మార్తల రామచంద్రారెడ్డి.

## నయోజన విద్య ఎందుకు జయప్రదము కాలేకపోతున్నది?

ఆర్యా!

నిరక్షరాస్యత నిర్మూలించుటకు ప్రభుత్వము కొంత [illegible] మును కేటాయించినది. ప్రతి సంవత్సరము [illegible] మూడవ వారములో ఉత్సవములు జరిపించును. నిరక్షరాస్యత నిర్మూలించుటకు కొంత మంది ఉపాధ్యాయులకు శిక్షణ యివ్వబడుచున్నది. ఈ శిక్షణ నిజముగా ఒక సక్రమైన ప్రణాళికద్వారా నెరవేర్చడము లేదు. ఏదో శిక్షణ యిచ్చినామంటే యిచ్చినామనే ధోరణిలో పోతూ వున్నది. శిక్షణ ఆరు వారాలు. ఈ ఆరు వారాలలో ఉపాధ్యాయులు మనస్తత్వాన్ని గ్రహించి ఏ విధముగా బోధించవలెనో సంగ్రహముగా తెలుసుకొనుటకు వీలు

లేకుండా పోతూవుంది. మరి ప్రతి ఉపాధ్యాయుడు ఈ శిక్షణ పొందేటందుకు వీలు లేదు. ప్రతి టీచరుకు ప్రివిలేజి లీవులు వుండవలెనంటే వుండవు. కాన షరత్తులు లేకుండా అన్ని వసతులు కల్పిస్తూ ప్రతి ఉపాధ్యాయునికి శిక్షణ ఇవ్వవలెను.

దినమంతా బిడ్డల యెదుట అరచి అరచి వచ్చిన ఉపాధ్యాయులు తిరిగి రెండుగంటల బోధనకు ప్రభుత్వము 8 రూ|| యిచ్చును. ఉపాధ్యాయులకు ఎక్కడ చూచినా జీతము తక్కువే. కష్టానికి తగిన ఫలితము ముట్టుటలేదు. అందువలన ఉపాధ్యాయులు ఈ పనిలో వుత్సాహము చూపలేక పోవుచున్నారు.

ఇది ఉపాధ్యాయునికి వేతనము కాదనియు, గౌరవ భృతియే యనియు, మీరు మానవసేవ గావించి దేశానికి సేవ చేయవలెననియు, చెప్పుతూ వుంటారు. చాలీ చాలని జీతాలతో భార్యా బిడ్డల పోషణ చూచుకోలేక, చుక్కలనంటే విపరీతపు ధరలను చూస్తూ, తన గొర్రెతోక జీతాన్ని చూచుకుంటూ, దిగులు చెందుచున్న ఈ ఉపాధ్యాయునికేనా "సేవ-దేశసేవ" కావలసినది. కూటికి, గుడ్డకే చాలని జీతాన్ని తీసుకుంటూవున్న ఉపాధ్యాయుడు, ఏ సాహిత్య పుస్తకాలు తెప్పించుకొని చదువ కలుగుతాడు? ఏ పేపరు తెప్పించుకొని చదువగల్గి, ప్రపంచములోని స్థితిగతులను వర్ణించగలడు? అధిక వేతనాలు, అధిక అలవెన్సులు, తీసుకొని అనేకమైన పుస్తకాలు తెప్పించుకొని, ప్రపంచ విషయములు అకలంకముగా తెలుసు కుంటున్న ఓ అయ్యల్లార! ఏదో ఆ దేశసేవ, మీరే చేయరాదా? కనక మేడల్లో బంగారు టుయ్యేలలో వూగే ఓ బాబుల్లారా! మీరు రెండు గంటల సమయాన్ని వయోజనులకు ఉపయోగించి "మానవ సేవయే మాధవ సేవ" అంటారే ఆ మానవ సేవనే చేయ రాదా? పూరి గుడిశెలలో బావురు మనే భాగ్యంతో, ఆకలితో మల మల మాడే పసి పిల్లలతో, అఘోరిస్తున్న ఉపాధ్యాయునికేనా మీరు చెప్పే మానవ సేవయే మాధవ సేవ కావలసినది? ఊరక కల్లబొల్లి మాటలు చెప్పి, సేవ చేయమని చెప్పక ఉపాధ్యాయునికి తగిన జీతమిప్పించి ఉత్సాహ పరచవలెనని మా విన్నపము.

ప్రజలు చూస్తామా అంటే, రోజూ రోజూ దినగండముగా కాలము గడుపుచున్నారు. కూటికి గుడ్డకు అలమటిస్తున్నారు. కష్టానికి తగిన ఫలితము ముట్టుట లేదు. దినమంతా రెక్క ఆడించినా జానెడు పొట్ట నిండుట లేదు. భార్యా బిడ్డల పోషణ చూచుకోవడమా? విద్య నేర్చుకోవడమా? ఇదే ఈ నాడు నిరక్షరాస్యుని పీడిస్తూ వున్నది. దినమంతా కష్టించి రాత్రనా కొంచెము నిద్రపోవలెనని ప్రతి వాడు కోరుకుంటాడు. తిండికి, గుడ్డకు, తహ తహ లాడుతూవున్న ప్రజలు విద్యా విజ్ఞానాలవైపు చూచుటలేదు. చూడ లేరు. దీనికంతా తిండీ గుడ్డా సమస్యే కారణమని తెలుస్తున్నది. పై లోటు పాటుల వలననే ఈ నాడు ఆహార సమస్య శ్రీ మున్షీగారి వనమహోత్సవము ద్వారా నెరవేరినట్లే, మన నిరక్షరాస్యత నిర్మూలన ఫిబ్రవరి వుత్సవాలలో నిర్మూలించ బడుతూన్నది.

కనుక నిరక్షరాస్యత నిర్మూలింప వలెనంటే, ప్రజలకు కూడు, గుడ్డ, యిల్లు, విద్యల లోటును తీర్చే బాధ్యత ప్రభుత్వము తీసుకోవలెను. వృత్తి గ్యారంటీని ప్రభుత్వము చూపవలెను. కూడు గుడ్డల దిగులు తీర్చవలెను. వయోజనులకు పలక, పుస్తకములు ఉచితముగ యివ్వవలెను. పాఠశాలకు హాజరయ్యే ప్రతి పేద వయోజనునికి సంవత్సరమునకు రు 10/ లు ఉచిత వేతనము, ఉపాధ్యాయునికి రు 30/ లున్ను, పగటి పనిలో ఒక పీరియడు విశ్రాంతి యివ్వవలయును.

వయోజనులకు విద్యగరపే ప్రతి ఉపాధ్యాయుని బిడ్డలకు ఉచిత శిక్షణకు ఏర్పాట్లు చేయవలెను.

ఆనాడే నిరక్షరాస్యత నిర్మూలన కాగలదు. ఆనాడే ప్రజలు విద్యావంతులు కాగలరు. ఆనాడే సరియైన ప్రజాస్వామిక రాజ్యము ఏర్పడ గలదు. ఆనాడే దేశము దుర్భిక్షమునుండి సుభిక్షమునకు రాగలదు.

ప్రొద్దుటూరు,

యం. సి. వెంకటరెడ్డి,
ఉపాధ్యాయుడు.

---

# భారత జ్యోతి.

( ప్రతి బుధవారము ప్రకటింపబడు తెలుగు, ఆంగ్ల, రాజకీయ వార పత్రికలు.)

## చందా వివరములు.

| | | |
|---|---|---|
| తెలుగుప్రతి:- | సంవత్సర చందా రూ | 9—0—0 |
| | విడి సంచిక ... | 0—3—0 |
| ఆంగ్లప్రతి:- | సంవత్సర చందా ... | 6—0—0 |
| | విడి సంచిక ... | 0—2—0 |
| రెండుచేరి:- | సంవత్సర చందా ... | 12—0—0 |
| | విడి సంచిక ... | 0—4—0 |

## ప్రకటన రేట్లు

| | | | |
|---|---|---|---|
| పూర్తిపేజి | ఒకదఫాకు | ... ... ... | రూ 80—0—0 |
| అర్ధపేజి | ,, | ... ... ... | రూ 45—0—0 |
| ఒక అంగుళము | ,, | ... ... ... | రూ 6—0—0 |

కంట్రాక్టు రేట్లకు, ఇతర వివరములకు:

257, ట్రంకు రోడ్డు,
పోష్టు బాక్సునంబరు 10,
కడప.

మేనేజరు,
"భారత జ్యోతి"

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక. REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4. సంచిక-22. | బుధవారము, జూలై 11, 1951. | ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 22.

శ్రీ ఖరనామ సంవత్సర ఆషాఢ శుద్ధ సప్తమి, జూలై, 11, 1951.

ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## ప్రజల కష్టములను గమనింపవలదా?

"రైల్వే కార్మికులకుగల బాధలన్నియు, న్యాయమైయుండవచ్చును. ఇప్పుడు ఆహార ధాన్యమును దేశమంతయు పంచిపెట్టుట అత్యవసరమైన కార్యక్రమము. ఈ సహాయమునకు అడ్డు రాకూడదనియు, కొంతకాలము ఓపిక పట్టుకొనియుండవలెననియు, నేను విన్నవించుచున్నాను. సమ్మె చేయవలెనని ఉద్దేశపడిన ఉద్యోగులను, పనివారలను ఆ ప్రయత్నము ఇప్పుడు మానుకొనవలెనని మనవి చేసుకొనుచున్నాను. రైల్వే పనివారల కష్టములు సంప్రతింపుల వల్ల తొలగించుటకు ప్రభుత్వము వారు సిద్ధముగ నున్నా"రని రైల్వే కార్మికులను, వారి నాయకులను ఉద్దేశించి, ఇండియా ప్రధానమంత్రి శ్రీ జవహరిలాలుగారు ఈ నెల 5-వ తేది గావించిన ప్రకటన వృథా పోజాలదని భావించెదము. రైల్వే కార్మికుల జీవిత వ్యయము ఎక్కువ కాలేదని కాని, దానికి సరిపోవు సంతతి వేతనముల నివ్వకూడదని కాని యెవ్వరు చెప్పజాలరు. విశాల దృష్టితో యోచించిన, ఒక్క రైల్వే కార్మికుల జీవిత వ్యయము మాత్రమే యెక్కువ కాలేదు. అత్యవసర పదార్థములపై ధరలు పెచ్చుపెరుగుట వల్ల, ఇండియాలో నివసించుచున్న బీద ప్రజల యొక్కయు, మధ్య తరగతుల వారి యొక్కయు, ప్రభుత్వ శాఖలన్నిటిలోను పనిచేయుచున్న ఉద్యోగుల యొక్కయు, కార్మికుల యొక్కయు, జీవిత కర్చులు అంతు లేకుండ పెరిగిపోవు చున్నవి.

ఆహార ధాన్యము సంవృద్ధిగా ఇతర దేశముల నుండి ఈ దేశమునకు దిగుమతియైన కాని, ఈ దేశములోనే పండుచున్న ధాన్యములకు ధరలు తగ్గవు. ఆహార ధాన్యములకు ధరలు తగ్గినకాని ఇతర అవసర వస్తువులపై ధరలు తగ్గజాలవు.

ఎన్నో చర్చలు, తీర్మానములు చేసిన తర్వాత, 20 లక్షల టన్నుల ఆహారధాన్యమును ఈ దేశమునకు ఎగుమతి చేయుటకు అమెరికా ప్రభుత్వమువారు సమ్మతించిరి. త్వరలోనే ధాన్యము ఈ దేశములోనుండు రేవుస్థలములను చేరును. ఈ తరుణములో రైల్వేకార్మికులు సమ్మె ప్రారంభించిన చో, వేలకొలది మైళ్ల దూరము నుండి ఈ దేశమునకు చేర్చిన ధాన్యమును వివిధ ప్రదేశములలో ఆకలితో బాధపడుచున్న ప్రజలకు అందిచ్చుటకు అవకాశముండదు. విదేశముల నుండి సకాలములో ధాన్యము చేరియు, ప్రజలు ఆకలి బాధతో అలమటించ వలసిన పరిస్థితు లేర్పడును. బొంబాయిలో విస్తారముగ మిల్లులలో గుడ్డ తయారగుచున్నది. ఆ గుడ్డను చెన్న రాష్ట్రమునకు చేర్చుటకు తగినన్ని రైల్వే వ్యాగనులు లేవను కారణముచేత, మిల్లు గుడ్డలు ఈ రాష్ట్రమునకు కావలసినంత దిగుమతి అగుచుండుట లేదు. వాని ఫలితముగా ఈ రాష్ట్రములో గుడ్డల కఱువు విపరీతమైనది. బీదలు గుడ్డను కంటితో చూడజాలకున్నారు. చీకటి మార్కెట్టు దారులు ప్రజలను దోచి భాగ్యవంతులగు చున్నారు.

ఇట్టి పరిస్థితులలో రైల్వే పనివారు సమ్మె చేసిన చో అన్నములేక దేశ ప్రజలను వారే చంపిన వారయ్యెదరు. రైల్వే కార్మికులు ప్రభుత్వమునకు మాత్రమే బాధ్యులుకారు. వారి కార్మిక సంస్థలకే బాధ్యులుకారు. వారి సౌకర్యములను మాత్రమే చూచుకొని తృప్తిపడి, దేశ ప్రజలెట్టి

కష్టముల పాలైనను కానిమ్మని చెప్పుటకు వీలు లేదు. దేశప్రజలకు కూడ వారు తర్వాతవారేలే. వారికి కలిగిన కష్టములను, రాయభారముల వల్లను, సంప్రతింపుల వల్లను పరిష్కరించుటకు ఇండియా ప్రభుత్వమువారు సిద్ధముగ నున్నారని శ్రీ జవహరిలాలుగారు బహిరంగముగ చెప్పుచున్న ఈ తరుణములో, కార్మికులు సమ్మెను సాగించుటకెట్టి కారణము కనిపించదు. సమంజసము కాదు. దేశమునకు క్షేమముకాదు. సమ్మెచేయుటవల్ల ప్రజలకు తక్షణమే కలుగబోవు కష్టములను గమనించి, సమ్మెను నివారించుటకు పాట్నాలో సమావేశమగుచున్న కార్మిక నాయకులును, రైల్వే పనివారులు తీర్మానించి, ప్రజల సానుభూతికి పాత్రులగుదురని ఆశించితిమి. కాని వారందుకు భిన్నముగ తీర్మానించిరి. ఇది విచారకరము. త్వరలో వారు నిర్ణయమును మార్చుకొందురు గాక!

# పత్రికా స్వాతంత్ర్యమే పౌరుల స్వాతంత్ర్యము.

(శ్రీమతి లీలావతి నారాయణ, బి. యస్. సి., గారి ఆంగ్లవ్యాసమునకు తెలుగు)

బ్రిటీషువారి పరిపాలనా కాలములోనే కాక, వారు పైతొలగిపోయి, సర్వసంపూర్ణ రిపబ్లిక్ దేశముగా మారిపోయిన తర్వాత కూడ, పత్రికా స్వాతంత్ర్యమునకై జాతీయనాయకులతోనే, తీవ్రప్రతిఘటనము సాగింపవలసిన పరిస్థితులేర్పడినవి. ఇంతకన్నను ఈ భారతదేశమునకు వేరు దౌర్భాగ్యమున్నదా? పత్రికా స్వాతంత్ర్యము వేరనియు, ప్రజల స్వాతంత్ర్యము వేరనియు, ఈ రెంటికిని యే విధమైన సంబంధము లేదనియు కొంతమంది ప్రజలలోను, ప్రజానాయకులని చెప్ప కేంద్ర ప్రభుత్వములోని మంత్రులలోను ఒక అభిప్రాయమేర్పడినది. అట్టి మేధావంతుల బుద్ధిహీనతకు సంతసింపవలయునో లేక నిరసింపవలయునో తెలియకున్నది. అట్టి బుద్ధిహీనులకు ఏ విధమైన సంజాయిషి కాని చెప్పి తృప్తిపఱచజాలము. ఇండియా రాజ్యాంగచట్టము (Constitution) లోని 19-వ సూత్రము 2-వ క్లాజును, కేంద్రమంత్రి వర్గమువారు సవరించుటకు నిశ్చయించుకొని నటుల రూఢియైనవార్తలు ప్రకటింప బడినప్పటినుండియు ఈ దౌర్భాగ్య దేశములో ప్రకటింప బడుచున్న దినపత్రికలేమి, వారపత్రికలేమి, మాసపత్రికలేమి మంత్రి వర్గమువారి ప్రయత్నములను తీవ్రముగ ప్రతిఘటించినవి. ఇండియా ప్రధానమంత్రి సవరణ బిల్లును పార్లమెంటులో ప్రవేశ పెట్టిన దినమునుండి, ఆ సవరణ బిల్లు ఆమోదింపబడి ఇండియా యూనియన్ అధ్యక్షుని సంతకము పొందు నంతవఱకు, సహేతుకరముగ బిల్లును విమర్శించినవి. బిల్లును శాసనముగా చేయుటవల్ల పత్రికా స్వాతంత్ర్యమునకు గలుగబోవు ప్రమాదములనెల్ల ప్రధాన మంత్రిగారికిని, హోముశాఖామంత్రిగారికిని నచ్చచెప్పినవి. వారు పట్టిన కుందేటికి మూడే కాళ్ళని—ఎవరెంతగా చెప్పినను తృణీకరించిరి. నియంతల రీతి ప్రవర్తించిరి. బిల్లును శాసనముగా నొనర్చిరి.

అమెరికా రాజ్యాంగ చట్టములో మొట్టమొదటి సవరణ సూత్రములోనే పత్రికా స్వాతంత్ర్యము హామీయొసగబడి యున్నది. ఇండియా రాజ్యాంగ చిత్తుబిల్లును చర్చించి, చట్టముగా ఆమోదింపబడు సమయములో అఖిలభారత పత్రికా సంపాదకుల సంఘమువారు, 1949 సంవత్సరము నవంబరు నెలలో, ఇండియా ప్రధాన మంత్రి, పండిత జవహరిలాలు నెహూరుగారినికలుసుకొని, రాజ్యాంగ చట్టములోనే పత్రికా స్వాతంత్ర్యము నొసగు సూత్రమును చేర్పవలయునని కోరిరి. రాజ్యాంగ చట్టములోని 19 సూత్రములో వాక్స్వాతంత్ర్యము, భావ స్వాతంత్రయము నిర్వచింపబడినది. హామీయివ్వబడినది. ఇదేహామి పత్రికా స్వాతంత్ర్యమునకు కూడ వర్తించును. కనుక పత్రికా స్వాతంత్ర్యమని ప్రత్యేకముగ రాజ్యాంగ చట్టములో నిర్వచింప వలసిన అవసరములేదని పండిత జవహరిలాలు యంతటి మహానాయకుడు నమ్మబలుకుచున్నాడు కదా. ఇక పత్రికా స్వాతంత్ర్యమున కేమికొఱత యుండునను భావముతో పత్రికాసంపాదకులు భావించిరి. వెనుకకువచ్చిరి.

ఈ వాగ్దానము పోని. 1950 సంవత్సరము డిశంబరు నెలలో అఖిలభారత పత్రికాసంపాదకుల సభలో ప్రసంగించుచు:

"పత్రికలు వాని స్వాతంత్రమును దుర్వినియోగ పఱచుగాక! అందువల్ల ప్రమాదములు కలిగినను కలుగుగాక! స్వాతంత్ర్యములేని పత్రికలుండుటకన్న, సర్వసంపూర్ణమైన పత్రికలుండవలయుననియే నేను కోరుదు"నని నెహూరుజీ తెలిపిరి.

కాని 1951 సం॥ ఏప్రెలు నెల వచ్చిరాకముందే ఈ ప్రధానమంత్రిగారి భావములు మారిపోయెను. ముందొసగిన వాగ్దానములెల్ల మంట కలిసిపోయెను. ప్రధాన హక్కుల క్రింద సూచింపబడిన 19-వ సూత్రమును సవరించి పత్రికా స్వాతంత్ర్యమునకే ప్రమాదము తెచ్చిపెట్టిరి. ఏప్రెలు నెలలోనే యిట్టి ప్రయత్నములకు బూనుకొను చున్నారని తెలిసి, ఈ విషయమునకు సంబంధించిన వివరములను తెలుపవలసినదని కేంద్రప్రభుత్వములోని మంత్రులను, పత్రికాసంపాదకులు కోరిరి. కాని వారు నిర్దాక్షిణ్యము వహించి ఇంతటి ప్రాముఖ్యమైన విషయములో కూడ యే సమాచారమును తెలుపరైరి. ముసుగులోనే దాచి యుంచుకొనిరి.

రాజ్యాంగ చట్టములోని 19(2) సూత్రమును సవరించుటవలన పత్రికా నిర్వహణమున కెట్టి ప్రమాదములు సంభవింపబోవని, లేనిపోని భీతిని కల్పించుకొని పత్రికలవారు అనవసరముగ ఆందోళన పడుచున్నారని శ్రీ జవహర్‌లాలు నెహ్రుగారును, శ్రీ రాజగోపాలాచార్యులవారును పలుమారు చెప్పుచున్నారు. ఇప్పుడు కావించిన సవరణలు కార్యనిర్వాహక వర్గమువారికిని, (పాలించువారికిని) శాసన సభలకును, వార్తాపత్రికలపై పరిమితి లేనటువంటి అధికారములను కలుగజేసినవి.

ప్రజాస్వామిక సిద్ధాంతమున కలవాటుపడిన ప్రజాసమూహమునకు, పత్రికా స్వాతంత్ర్యము యొక్క యవసరమును గుర్తింపజాలని రాష్ట్ర మంత్రివర్గములేమి, శాసనసభలేమి, తుదకు పార్లమెంటేమి, ఈ నూతనాధికారములను దుర్వినియోగపఱచ వచ్చును. రాజ్యాంగచట్టము ద్వార పత్రికాస్వాతంత్ర్యమునకు హామీ యిచ్చుట లేదు. పార్లమెంటు సభలలోను, బహిరంగ సభలలోను పత్రికాస్వాతంత్ర్యమును నిరోధింపమని పండిత జవహర్‌లాలు నెహ్రుగారు చెప్పుటలేదు. బయట చెప్పుమాటలు ఆయన సద్భావములను ప్రకటించును కాని 19 (2) సూత్రమును సవరించుటవలన శాస్త్రరీత్యా పత్రికా స్వాతంత్ర్యమునకు కలుగజేసిన ప్రమాదస్థితిని శ్రీ జవహర్‌లాలు నెహ్రు కాదు, డా॥ రాజేంద్ర ప్రసాదు కాదు, శ్రీ రాజగోపాలాచార్యులు కాదు. మరెవ్వరు కాని నివారింపజాలరు.

పత్రికలు తమ స్వాతంత్ర్యమునకై ఆందోళన సలుపుచున్నవనియు, ప్రభుత్వమును ప్రతిఘటించుచున్నవనియు, అవి ప్రజల సహజహక్కులైన వాక్స్వాతంత్ర్యమునకును, భావస్వాతంత్ర్యమునకును పోరాడుచున్నవని విజ్ఞానవంతులైన ప్రజలెల్లరు నమ్మెదరుగాక! ప్రజలను మినహాయించి పత్రికలకు ప్రత్యేక హక్కులేవియు ఉండబోవు. పత్రికలకే స్వాతంత్ర్యము లేనిచో, ప్రజల కెట్టిస్వాతంత్ర్యము కాని యుండబోదని మాత్రము బాగుగ అర్థము చేసుకొందురుగాక! తత్కాలికమైన రాజకీయ దిద్దుబాటులకన్న దేశముయొక్క ఘనాభివృద్ధియెక్కువ పవిత్రమైనది. పార్టీసిద్ధాంతములపై సాగుచున్న ప్రభుత్వమునకు రాజభక్తిని చూపుచు, ఆత్మను చంపుకొనుటకన్న ప్రజల స్వాతంత్ర్యమునకు పోరాడుటే ఎక్కువ పవిత్రమైన కార్యము. కనుక ఎన్నికష్టములు కలిగినను పత్రికాస్వాతంత్ర్యము సంపూర్ణముగ లభించువఱకును పోరాడుటే పత్రికల కన్నిటికిని మొట్టమొదట కర్తవ్యమైయున్నది. ఈ పోరాటములో ప్రజలెల్లరు పత్రికలకండయై నిలిచెదరుగాకయని ప్రార్థించుచున్నాము.

# గ్రంథ పరిచయము.

**'పురోగమనం' (గేయ సంపుటి) :—**

గ్రంథకర్త:— శ్రీ పుట్టపర్తి నారాయణాచార్లుగారు, విద్వాన్,

విక్రేతలు: యువ సాహిత్య మండలి, ప్రొద్దుటూరు.

వెల రూ॥ 1—0—0

ఈ గ్రంథకర్త ప్రకృతము కడపలోని శ్రీ రామకృష్ణ హైస్కూలులో తెలుగుభాషా బోధకులుగా నున్నారు.

శ్రీ నారాయణాచార్లుగారు అనేక గ్రంథములను రచించినారు. వారి "షాజీ" మొదలగు రచనలు తెలుగు లోకమంతయును చదివి ఆనందించినవే.

పూర్వ కవుల పద్ధతిని పురాతన ఛందస్సులో పద్యములను నడపి వీరు పలుగ్రంథములను రచించినారు.

ఈ "పురోగమనం" గేయ పద్ధతి ననుసరించినది. "ఏ సిద్ధాంతాలకు చెందని వ్వాణ్ణి నేను ........ ప్రాచీనవాదులు ఛందోరీతిని — వస్తువును అపేక్షిస్తారు. వారు ప్రాచీనులు. సంఘము క్రొత్త తోడుగులు తొడుగుతూంటుంది. ప్రాత దానిని విధ్వంసము చేయకుండా — కాలానికి ఒక కర్తవ్యమే. నా భావాలు చదవండి." అని కవి తొలిపలుకులు వ్రాసినారు. 'ఏ సిద్ధాంతాలకు చెందనివాణ్ణి' అని వీరన్నను వీరి 'పురోగమనం' నవ్యసిద్ధాంతమే గదా?

ప్రాచీన పద్ధతిగాని, నవీన పద్ధతిగాని — రససిద్ధులగు కవీశ్వరుల కలమున వెడలు మాటలు ఆనందోత్పాదకములే యగును. కవుల క్రొత్తపోకడల నర్థము చేసికొని, వారి రచనలను విమర్శక దృష్టితో పఠించి, నిరతిశయానందము ననుభవించుట చదువరులకు నుచితమే యగును.

సంస్కృత భాషలో భవభూతి తన యుత్తర రామ చరిత్ర నాటకమున ప్రాచీన నియమమును పాటింపకుండ 'ఏకోరసః కరుణఏవ' యని నిర్భయముగ విద్వత్ప్రపంచమునకు చాటినవాడు. ఈ కవియు 'భవభూతీ విప్లవాత్మకుడు' అని ప్రథమగేయమున చెప్పి, తన కవితా విప్లవమును సమర్థించుకొన్నాడు. తన కవితలోని నవ్యతను పాఠకలోకము నిరసింపగూడదనియు 'దాన్ని వినియోగించుకోవద్దంటే మానవుడుగా నేను బ్రదకడం మీ కిష్టంలేదన్నమాట' అని రసికలోకాన్ని హెచ్చరించినారు. కాలము ననుసరించి నవ్య పద్ధతితో కవుల రచనలు సాగుటయు, వానిని సవిమర్శకముగ చదువరులు పఠించి యానందించుటయు సహజమే కదా! కవి నిరంకుశుడు. కవిత్వమున క్రొత్త పోకడలుండును. వానిని నిరాదరణ దృష్టితో జూడకూడదనియు "యదాస్మై రోచతే విశ్వం తదేక పరివర్తతే" నాయిష్టము ప్రకారము లోకుల భావములు పరివర్తన పొందింతును. లోకుల యిష్టము

(మిగత 16—వ పేజీలో)

# కడచిన 50 సం॥లలో ప్రపంచ జనసంఖ్యా పెరుగుదల.

గత 50 సంవత్సరములో ప్రపంచ జన సంఖ్య పెరిగినట్లు ప్రపంచ ఆరోగ్య సంఘము నేడిక్కడ ప్రకటించినది. 1900లో ప్రపంచజనసంఖ్య 155, 16, 00,000 1949 లో అది 237, 74, 00, 000 అయినది.

మొత్తము 52 దేశాలలో దక్షిణ ఐర్లాండు దేశములో మాత్రమే జనసంఖ్య, తగ్గినది. ఆ దేశములో 1900 లో జన సంఖ్య 32 లక్షలు. అది 1948 లో 30 లక్షలకు తగ్గినది.

ఇండియా-పాకిస్థాన్‌ల జనసంఖ్య ఏకమొత్తముగా చూపబడినది. ఈ ఉభయ దేశాలలో జనసంఖ్య ఇతర దేశాలలో కన్న ఎక్కువగా పెరిగినది. 1900 లో 28, 25, 00, 000 1949లో ఉన్న జనసంఖ్య 43, 04, 00, 000కు పెరిగినది.

సోవియట్ యూనియన్‌లో జనసంఖ్య 7,40,00,000 ఎక్కువ అయినది. 1949 లో జనసంఖ్య 14, 92, 00, 000

అర్జెంటైన జనసంఖ్య నూటికి 251 వంతులు (48 లక్షల నుండి 168 లక్షలకు) పెరిగినది. బ్రిటను జన సంఖ్య నూటికి 12½ వంతులు (379 లక్షల నుండి 5 కోట్లకు పెరిగినది.)

గత 300 సంవత్సరాలలో ప్రపంచ జనభా 5450 లక్షలనుండి 23, 774 లక్షలకు పెరిగినది.

---

## విజ్ఞాన విశేషాలు.

### 75 టన్నుల బరువుగల టెలెస్కోప్.

—(0)—

అమెరికా నౌకా పరిశోధనశాఖా కార్యాలయములో 600 అడుగుల వ్యాసము గలిగి, 75 టన్నుల బరువుగల లోహముతో తయారుచేయబడిన అద్దాన్ని తయారు చేయుచున్నారు. ఇది, సూర్యునినుండి, నక్షత్రాలనుండి, ఖగోళములో ఉన్న రేడియో నక్షత్రాలనబడే వాట్లనుంచీ వచ్చే కాంతి తరంగాలను కనుగొనుటకును, పట్టుకొని రికార్డు చేయుటకు ఉపకరించే టెలిస్కోపు. ఈ టెలిస్కోపు ఖగోళ విజ్ఞానాన్ని మానవుడు అభివృద్ధి పరచుకొనుటకు, వాతావరణ పరిస్థితిని తెలుసుకొనుటకు, రేడియో వార్తలను ప్రసారము చేసేందుకు కూడ ఉపయోగపడును. సూర్యగోళము ఉపరిభాగము నుంచి ఉదజని మంటలు వేలకొద్ది మైళ్ళ పైకి తన్నుకొనివచ్చి వారి తరంగ దైర్ఘ్యముద్వారా వాతావరణాన్ని మార్పుచేయుచునట్లు ఖగోళశాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

ఈ టెలిస్కోపు, ఈ తరంగాలను అడ్డగించడమే కాక, వాటి పుష్టోగ్రతను, మిశ్రమ స్వభావమును, సూర్యగోళము ఉపరిభాగము నుంచి అవి పైకి లేచే వేగాన్ని కూడ తెల్పును.

రేడియో నక్షత్రాలు తక్కిన నక్షత్రాలకంటే పెద్ద వ్యాసాన్ని కలిగి, ఖగోళములో స్థిరమైన ప్రదేశములో నిలబడి ఉండును.

అవి పాలపుంత అని పిలవబడే ఆకాశములోని ఒక భాగములోని విద్యుత్ప్రవాహము మీదకూడా శక్తివంతమైన కాంతిని ప్రసరింప జేయును. అట్లు జరిగినప్పుడు అక్కడి విద్యుత్ప్రవాహము తిరిగి భూమిమీద వాతావరణాన్ని మార్చే శక్తిని పొందును.

---

## అవీ—ఇవీ

### అమెరికన్ కాలేజీలో టెలివిజన్ కేంద్రము.

—(0)—

అమెరికాలో అయోవాలోని రాష్ట్ర ప్రభుత్వ కళాశాలలో ప్రత్యేకముగ ఒక టెలివిజన్ కేంద్రమును నెలకొల్పబడినది. అమెరికా విద్యా సంస్థలు టెలివిజన్ కేంద్రాలను స్థాపించుటకు ఇదే ప్రథమము. ఈ కేంద్రము ప్రసారము చేసే సంగీత నాటికలు, నాటకాలు, వార్తావాహిని, ఇతర కార్యక్రమాలు ఆరు పెద్ద నగరాలకు, వందలకొలది వ్యవసాయ క్షేత్రాలకు, ప్రాథమిక విద్యా సంస్థలకు వినోద విజ్ఞానాలకు కలిగింపనున్నవి.

---

### న్యూయార్క్ వైద్య కేంద్రానికి ఇందూర్ మహారాజా భూరి విరాళము.

---

న్యూయార్క్ విశ్వవిద్యాలయానికి చెందిన బెలవ్యూ వైద్యకేంద్రము వారిసహాయార్థము ఇటీవలజరిగిన విందులో ఈ నగరములోని దాతలు 1,15,000 డాలర్లు విరాళముగ ఇచ్చిరి. ఆకస్మికముగా ఈ విందుకు హాజరైన ఇందూర్ మహారాజా ఒక్కరే 1, 000 డాలర్లు విరాళము నిచ్చిరి.

---

# విధ్వంసక చర్యలవలన ప్రభుత్వమునకు ప్రమాదము.

## అమెరికన్ సుప్రీము కోర్టు న్యాయమూర్తుల అభిప్రాయము.

అమెరికా సుప్రీము కోర్టు నుండి ప్రజల ప్రాథమిక హక్కులకు సంబంధించిన ప్రాముఖ్యమైన తీర్పు మూడు వారముల క్రిందట వెలువడినది. అందులో కొందరు న్యాయమూర్తులు వెలిబుచ్చిన అభిప్రాయములను ఈ దేశములో నుండు కాంగ్రెసుపార్టి వారును, ముఖ్యముగ హోమ్ శాఖా మంత్రిగారైన శ్రీ. రాజగోపాలాచార్యులు గారును గమనించుట ముఖ్యము.

> "మతమునకు సంబంధించిన విషయములలో కాని, ప్రజల వాక్స్వాతంత్ర్యమును, పత్రికా స్వాతంత్ర్యమును సంకుచిత పఱచుటకు కాని; శాంతియుతముగ ప్రజలు చేరుటకు కాని లేక ప్రజల కష్టములను తొలగించుటకై ప్రభుత్వమునకు నివేదించుకొను విషయములలో కాని, జోక్యము కలిగించుకొని, కాంగ్రెసు ఏలాటి చట్టములు చేయకూడ"

దని అమెరికన్ రాజ్యాంగ చట్టములో మొట్ట మొదటి సూత్రముగ నిర్వచింపబడినది. ఇండియా రాజ్యాంగ చట్టములో సూచించినటుల ఈ ప్రాథమిక హక్కులను పరిమితిచేయుచు మినహాయింపులను చేర్చలేదు. 1940 సం॥లో అమెరికా కాంగ్రెసు ఒక సవరణ చట్టము నామోదించినది. అందులో:

> "స్పష్టముగా తెలిసి కాని, లేక బుద్ధిపూర్వకముగా కాని, అమెరికా ప్రభుత్వమును దౌర్జన్యముతో గాని లేక విధ్వంసక చర్యలతో గాని కూలద్రోయవలెనని ప్రోత్సహించిన కాని, అవసరమున్నదని కాని, మంచిదని కాని, లేక న్యాయమైనదని కాని ప్రచారము చేయుట నేరముగా పరిగణింపబడు"నని తెలుపబడినది.

అమెరికాలో ముప్పది సంవత్సరముల క్రిందటనే కమ్యూనిష్టు పార్టి స్థాపింపబడినది. సుమారు 50,000 మంది ఆ పార్టిలో సభ్యులుగ నున్నారు. వీరి సంఖ్యాబలము అలక్ష్యము చేయదగినదైనను, వారి పార్టి నిర్మాణ విధానము, వారు గావించుచున్న ప్రచారము చాల శక్తివంతమై యున్నది. ఎక్కువ పలుకుబడి నార్జించినది. అదృష్టవశముననో లేక దురదృష్ట వశముననో అమెరికా వారికిని రష్యావారికిని దిన దినమునకు భేదాభిప్రాయము అభివృద్ధి యగుచున్నది. ఒకరి పేరును మరియొకరు సహింపజాలనంతటి స్థితికి రాజకీయ పరిస్థితులు ఏర్పడు చున్నవి. అందువల్ల వాక్స్వాతంత్ర్య విషయమై అమెరికాలో ప్రజలెల్లరికిని సర్వసంపూర్ణ హక్కులున్నను, వారు ఉపయోగించు పదముల వల్ల ప్రభుత్వమునకు ప్రత్యక్ష ప్రమాదము సంభవించునవిగా పరిణమించిన చో, అట్టి చర్యలను కాంగ్రెసు అరికట్టవచ్చునని న్యాయమూర్తి ఆలివర్ వెండల్ హోమ్సు గారు 1918 సంవత్సరమే తెలిపియుండిరి.

1948 సం॥ జూలై నెలలో పండ్రెండు మంది కమ్యూనిష్టుపార్టి సభ్యులు దౌర్జన్య పద్ధతులతో ప్రభుత్వమును కూలద్రోయుటకై ప్రచారము సాగించుచున్నారను నేరము క్రింద అరెస్టు చేసి, ఫెడరల్ గ్రాండుజూరీ వారి విచారణకు ఒప్పగించిరి. ముద్దాయిలకు తమ నిర్దోషత్వమును ఋజువు చేసుకొనుటకు అన్ని సౌకర్యము లొసగబడెను. బహిరంగ విచారణ జరుపబడెను. 1949 సం॥లో గ్రాండుజూరి ఆ పండ్రెండు మంది ముద్దాయిలను 1940 సం॥ కాంగ్రెసు ఆమోదించిన "స్మిత్తు చట్టము" ననుసరించి, దోషులుగా నిర్ణయించి శిక్షవిధించెను. ఈ శిక్షపై "కోర్టు ఆఫ్ అపీల్సు" కును, అటుతర్వాత సుప్రీము కోర్టునకును అపీలు చేయబడెను. అధిక సంఖ్యాకులగు న్యాయమూర్తులు కమ్యూనిష్టుల చర్యలు, ప్రచారము, ప్రభుత్వమునకు ప్రమాదము కలిగించునవిగా నున్నవని భావించిరి. వారి ఉద్దేశ్యములన్నియు, కార్యరూపమున పెట్టునంతవఱకు ప్రభుత్వము చర్యకైకొనకుండ కాచుకొని యుండవలసిన అగత్యములేదని తెలుపుచు, క్రింది కోర్టుల తీర్పును ఖాయపరచిరి.

కాని అధిక సంఖ్యాకుల అభిప్రాయముతో నేకీభవించిన వారిలో నొకరైన న్యాయమూర్తి ఫిలిప్పు ఫ్రాంకుఫూర్టర్ గారు పై కేసును గురించి ముఖ్యమైన హెచ్చరిక నొక దానిని గావించిరి.

"అనుకూలమైన తరుణములో (నిమిషములో) ముద్దాయిలు ప్రభుత్వమును కూలద్రోయుటకు సంసిద్ధులై యుండిన యుండవచ్చును గాక. వారు కోరుచున్న సంస్కరణములు ముఖ్యమైనవని అనేకమంది భక్తిపరులైన పౌరులు నమ్ముచున్నారు. అట్టి సందర్భములలో వారిని శిక్షించుట న్యాయమని తలంచుట భ్రమయగును.

"శిక్షను ఖాయపరచుటవల్ల అమెరికావారు ఒకరి భావములను మరియొకరికి తెలుపుకొనుటలో నిర్బంధముండ జాలదని చెప్పుటకు వీలులే"దనిరి.

న్యాయమూర్తి డాగ్లస్ గారు మెజారిటీ అభిప్రాయముతో భేదించుచు "కమ్యూనిష్టులు అనవసరమైన భావములు కల వ్యాపారస్తులు. వారి ప్రచారము ప్రభుత్వమును కూలద్రోయుటకు తగునంతటిది కాదు. తక్షణమే ఉపద్రవము కలుగునని తలంచునంతటిది కాదు"అని వ్యాఖ్యానించిరి.

న్యాయమూర్తి బ్లాక్ గారు వ్యాఖ్యానము గావించుచు, "ప్రస్తుతము కనబడుచున్న ఒత్తిడులు, ఉద్రేకములు, భయములు తగ్గిపోయి, శాంతి వాతావర్ణమేర్పడిన తర్వాత, ఇప్పుడున్న సుప్రీము కోర్టు కాని లేక ఇకముందు సుప్రీము కోర్టులో వ్యవహరించు న్యాయమూర్తులు కాని, సర్వస్వతంత్ర మానవ సంఘమునకు, గౌరవ ప్రదముగా నుండు రీతి రాజ్యాంగ చట్టములోని మొదటి సూత్రమును మరలా పునరుద్ధరించి, సర్వస్వతంత్రములు గలుగ జేయవలెనని (వాక్స్వాతంత్ర్యముపై గల అన్ని నిషేధములను తొలగింపవలెనని) తెలిపిరి.

ప్రజల ప్రాధమిక హక్కుల విషయమై అమెరికా దేశపు న్యాయమూర్తులకు ఎట్టి ఉదారమైన భావములుకలవో వివిధ న్యాయమూర్తులు వెలిబుచ్చిన అభిప్రాయములే స్పష్టము చేయుచున్నవి.

రాజ్యాంగ సవరణబిల్లులో "నేరమునకు పురిగొల్పుట" (incitement to offence) అనుపదములను తొలగించి "దౌర్జన్యమును పురిగొల్పుట" (incitement to violence) అనుపదములను చేర్చుమని ఎంత బతిమాలినను హోము శాఖా మంత్రి శ్రీ రాజగోపాలాచార్యులు వారు మూర్ఖత వహించి, వినరైరి. "పబ్లిక్ ఆర్డరు" (Public order.) అనే మాటలే వలదు బాబో అని మొత్తుకొన్నను వినరైరి. "పబ్లిక్ ఆర్డరు" అనే పదములకు అర్థమేమో వారే తెలుపజాలరైరి. పురాణములలో వాడబడిన "బ్రహ్మాస్త్రము" "నాగాస్త్రము" మొదలుగాగల మారణాస్త్రములకు సమానమైన పదజాలములను 19 (2) సూత్రములో వాడి, వానిని వింత వింతగ శ్రీ రాజగోపాలాచార్యులు సమర్థించిరి. ప్రభుత్వ విధానములను, చర్యలను, ఆక్షేపించు వారెల్లరు కమ్యూనిష్టులనే భావముతోనే మన కాంగ్రెసు నాయకులు ప్రవర్తించుచున్నారు. అట్టి యభిప్రాయములనే బుద్ధి సూక్ష్మత, యోచనాజ్ఞానము లేని పోలీసు వారిలో వ్యాపింప జేయుచున్నారు. ఇదే మన దేశమును పరిపాలించుచున్న సంకుచితమైన భావములు కల మేధావంతులకును, మానవ హక్కులనే యెక్కువగ ఆదరించు అమెరికా వారికిని గల ముఖ్య భేదము.

---

నవల

# ధర్మ విజయము.

శ్రీ వాల్మీకి

[గత సంచిక తర్వాత]

## (2)

[మొదటి ప్రకరణమున మిత్రులగు చంద్రశేఖర శ్యామలరావులు, జానకీ రుక్మిణులు కలిసికొనుట, ప్రథమ దర్శన మాత్రముననే, చంద్రశేఖర జానకులకు పరస్పరము ప్రేమ జనించుట వివరింపఁబడినది. తరువాత ఈ ప్రకరణమున...]

కాంచి పుణ్యక్షేత్రములలో నొకటి. అందు విష్ణుదేవాలయంబును, ఏకాంబ్రనాథేశ్వరుఁడను ఈశ్వర దేవాలయంబును, కామాక్షి దేవాలయంబును గలవు. ఏకాంబ్రనాథేశ్వరునకు సంవత్సరమున కొకపరి, ముక్కోటి ఏకాదశినాడు లక్ష దీపంబులు పెట్టఁబడును. ఆ మహోత్సవమును సందర్శించుటకు అష్ట దిశావకాశంబులగల పల్లెలయు, పట్టణంబులయు జనంబులు వత్తురు. ఆ పట్టణమునగల దేవతా విగ్రహము లన్నియు నలంకృతములై, ఉచిత వాహనంబుల నధిష్టింపఁబడి, మేళ తాళంబులతోను, భజనలతోను ఈశ్వరాలయమునకు గొనిరాబడును. స్త్రీ పురుషులు నూతన వస్త్రాలంకృతులై, భూషణ భూషితులై దైవ దర్శనమునకు తండోపతండములుగా వత్తురు.

నాఁడు లక్ష దీపమహోత్సవము, అసంఖ్యాకులగు జనంబులు, నేల యీనిన చందమున మహేశ్వరు దర్శనార్థము వచ్చియుండిరి. ఆ జనసమూహమున నొక ధవళ వస్త్రాలంకృతయైన బాలికా మణి, నెచ్చెలి సాహచర్యము దప్పుటచే ఏమియుం దోపక యిటు నటు బెదరిన లేడి కైవడి విలోకనముల సారింపుచుండెను. పురుషులు స్త్రీలనెడి విచక్షణ లేక ప్రజలు క్రమ్ముచుండిరి. నవయౌవనులగు విటజనంబులు, విషయాసక్త హృదయులగుట జవరాండ్రుగల యెడకు పరువులు దీయుచు నర్మ గర్భంబులగు హాస్యవచన రచనంబులు గావించుచు వినోదించుచుండిరి. చక్కని చుక్కయగు నీ బాలిక వారి వీక్షణముల బడకుండుట సాధ్యమగునా? వారా జవ్వని చుట్టును వలయాకారంబున నిలువఁబడిరి. చూపులకు వీరు విద్యార్థులుగా నుండినను, చేతలు తిలకించుచో కామోద్రిక్తులగు నరాధములని వెంటనే బోధపడును. కావున్న ఒంటరిగ జన సమ్మర్దమున బడి ఎటుపోవుటకు దెలియక బెంగపడు నా జవరాలితో వీరికేమి పని? వారిలో నొక్కఁడు, 'విలాసినీ నీ పేరెయ్యది?' యనియు, 'మరొక్కఁడు మదవతీ! మాటాడవేమి?' యనియు, ఇంకొక్కఁడు 'పలుకాడిన ముత్యములు రాలునా?' యనియు, ప్రశ్నింపఁ జొచ్చిరి. ఆ బాలిక సాలీడు వలలోఁ జిక్కిన ఈగ చందమున నేమియు గోచరింపని వడువున పాషాణ సదృశంబుగ నిలువఁబడి యుండెను. యువకు లామె యందమునకు ముగ్ధులై అచ్చోటు బాయ నొల్లక ప్రశ్న పరంపరల గుతిపించుచుండిరి. జనము లెక్కకు మిక్కుటమగుటయు, దైవ దర్శనమున కాతుర పడువారు దేవాలయ ముఖద్వారము వైపునకు జన మంకించుటయు, ఈ యువక బృందమునకును ఆ జవరాలికిని మధ్య స్థలము స్వగ్యమయ్యెను. ఎడ కత్తెరయందు పోక చందమున ఆ బాలిక నలుగ జొచ్చెను.

ఇట్టి విషమ పరీక్షలో నా బాలిక ఏమి జేయగలదు? ఎటు తప్పించుకొనఁగలదు? బుద్ధి పలు పోకలు పోవుచుండెను. తన్ను దానిందించుకొనుచుండెను. నెచ్చెలి పొరబాటున వేరొకరితో బోవుటయు, తానిట్లు దురవస్థల పాలగుటయు, విధి విధానమని భావించుచుండెను. ఇంతలో నా యువకుల వ్యూహమును భేదించుకొనుచు మధ్యకు రాగల్గిన యువకుఁడొకఁడు, "జానకీ! ఏమిట్లు ఒంటరి పాటునఁ బడితివి?" అని యా బాలిక నుద్దేశించి పలుకుటతో విటకాండ్రజట్టు ఒక్కరొక్కరే తొలఁగి యావలకు జనిరి. తలయెత్తి జానకి చూచి చంద్రశేఖరుని గుర్తించి నలుదెసల పరికించెను, యువకులందరు అప్పటికే జనిరి. ఇఁక జనము త్రొక్కుటులబడి నలిగి పోవనీయక చంద్రశేఖరము "గమ్మత్తు నిన్ను బండి నెక్కించి పంపెదనని" కరపల్లవమును గ్రహించి జన సమూహమునుండి యీవలికిఁ దెచ్చెను. తదుపరి యిట్లు సంభాషణ జరిగెను.

చంద్ర:— "ఒంటరిగా నీమహోత్సవమున కేల వచ్చితివి?"

జానకి:— "ఆర్యా! లేదు. నా నెచ్చెలియగు రుక్మిణితో కలిసి వచ్చితిని. ఆమె జనసమ్మర్దమున బడి యెడమై పోయినది. నే నొక్కతెనే చిక్కుపడితిని. మీ రీ సమయమున రాకున్న నాకు మహాపద వాటిల్లి యుండెడిది. మీ సహాయమునకు కృతజ్ఞురాలను"

చంద్ర:— "జానకీ! నాకీసంగతి తెలిసియే నిన్నన్వేషించుచు వచ్చితిని."

జానకి:— "ఎట్లు తెలిసికొనగల్గితిరి?"

చంద్ర:—“నీ చెల్లెలియగు రుక్మిణి, తన సోదరుని మంత్రాంగములోఁ జిక్కుకొని నిన్నాతని వశమొనర్చుటకు జేసిన పన్నాగమిది.”

జానకి:— “ఏమిటి?” (ఆశ్చర్యముతో)

చంద్ర:— “అవును. ఆతఁడు నిన్ను ప్రేమించెను. నీ వలపు సంపాదించుటకు పడరానిపాట్లు పడుచున్నాడు. ఇప్పుడు రుక్మిణి తన సోదరునితో మాటలాడు విధము మరుగున నుండి వింటిని.”

జానకి:— “ఏమని మాట్లాడుచున్నారు?”

చంద్ర:— “అజ్ఞాతముగా నిన్నొక బండిపై నెక్కించుకొని, ఉత్తరదిశనుగల పాడు దేవాలయమునకు తీసికొని పోవుదురట!”

జానకి:— “అట్లయిన నేనీ యుదంతము మా తండ్రిగారి కెఱిగించి తగిన శాస్తి జేయింతును.”

చంద్ర:— “ఏల తొందర పడుదువు? ఆతఁడు నిన్ను ప్రేమించెను గనుక నీ యభిమతము నెఱుఁగ ప్రయత్నించును కాబోలు.”

జానకి:— ప్రయత్నించుటేల? రుక్మిణి తన సోదరుని ప్రసక్తి దెచ్చినపుడంతయు ఆ విషయము నాయొద్దకు తేవలదని ఖండితముగా జెప్పివైచితిని.”

చంద్ర:— “అయిన నీవాతని ప్రేమించుటలేదా?”

జానకి:— “లేదు. సుమ్మాటికిని లేదు.”

చంద్ర:— “మరెవరిని ప్రేమించుచున్నావు? నీవబలవగుట నీకు నచ్చిన పురుషుని హృదయపూర్వకముగా ప్రేమించి, వరించి, సుఖించుట విధి. నీ హృదయ పీఠము నధిష్టించిన పుణ్యశీలుఁడెవరో తెలుపజాలిన నే నీ శ్యామలుని వారించుటకు ప్రయత్నించెదను.”

జానకి:— “అందని మ్రానిఫలంబుల కఱ్ఱుజాపుట వలన ప్రయోజనములేదని సందలించి వారింపుడు— భారతనారి తానెవరిని వరించునో వారి సమక్షమున చనవున మాటలాడును. అన్యుల తలయెత్తియైనను చూడదు. వారెవరై యుందురో మీరే గుర్తించుకొనుడు” అని ప్రేమ పూరితమగు క్రీగంటి చూపుల ప్రసరింపఁజేయుచు అవనత వదన యయ్యెను. చంద్రశేఖరుని హృదయ మనన్య ప్రేమానుభూతి కాలవాలమై తన్మయత్వము నాపాదించెను. ఇంచుకసేపూరకుండి “జానకీ! ఇఁక కాలవిలంబనము సేయక గృహోన్ముఖులగుట మంచిది,” యని చేరువున బోవుచున్న యొక గుఱ్ఱపుబండిని పిలిచెను. బండివచ్చుటే తడవుగా నిరువురును శకటమారోహించి గృహోన్ముఖులైరి. మార్గమధ్యంబున, శ్యామలారావు, రుక్మిణీలు ఉత్సవము దెసకేగుచున్న గుఱ్ఱపుబండి యెదురు పడెను; కాని శకటములు వేగముగా బోవుచుండుటచేతను, సాయంసమయ మగుటచేతను ఒకరినొకరు గుర్తింపరైరి. చంద్రశేఖరమా బండిని ముందు జూచిన వాఁడగుట వెంటనే గుర్తించి “జానకీ! చూచితివా? రుక్మిణి శ్యామలారావు లా బండిలో నేగుట. వారి మంత్రాంగము భంగమైనది. ఇఁక నీవు రుక్మిణిపట్ల జాగ్రత్త వహించి యుండుము.” అనుచుండునంత జానకి గృహము సమీపించెను. చంద్రశేఖరము బండినాపి “సెలవు గైకొందు ననుచు,” దిగెను. జానకి ప్రేమ విహ్వాల యగుట, మాటాట నోడి “పునర్దర్శన భాగ్య మెప్పుడని చూపులతో ప్రశ్నించెను. భగవంతుఁ డనుగ్రహించిన సమాగమమున కడ్డేమని చూపులతోనే జవాబు చెప్పుచు చంద్రశేఖరము విరమించెను.—

—రెండవ ప్రకరణము సమాప్తము:—

“కాంగ్రెసు విధించిన ప్రాథమిక విధానములను నేడు కాంగ్రెసు ప్రభుత్వములు అమలులోఁ బెట్టుచున్నవని వాదించువారు, యదార్థమును మరుగు పఱచు దిట్టలన జెల్లుదురు. సర్వ సమగ్రమయిన విధానములు లేనందున, మన ప్రభుత్వములు కష్టములకు గుఱియగుచున్నవనుట లోకవిదితము. అంతియేఁగాదు. కాంగ్రెసు విధానమునుండి మఱలి పెడమార్గమును ద్రొక్కుచున్న వనుట సర్వులకు తెలిసిన సత్యము. అదియే నిజమగుచో, శాసనసభలలోగాని, వెలుపలగాని, అట్టి కాంగ్రెసు వాదులకు విధేయులుగా నుండుట కాంగ్రెసు ధర్మములపాటించుట గాదు; తమ చర్యలచేత కాంగ్రెసు సంస్థకే కీడునాపాదించిన పెద్దమనుష్యుల ప్రతిపాదనలకు దాసోహమనుట వంటిది. అట్టి విధేయత అధోగతి పాలుజేయును.

—— ఆచార్య కృపాలనీగారు.

# రాబోవు జనరల్ ఎన్నికలు – ఓటర్లకు హెచ్చరిక

( శ్రీ. యస్. వెంకటాద్రి గారు, ఎం. ఏ., )

ఇండియా రాజ్యాంగ చట్టముక్రింద ఈ దేశమును పరిపాలించుకొను బాధ్యతంతయు 36 కోట్ల ప్రజల కొప్పగింపబడినది. 21 సంవత్సరము వయస్సు వచ్చిన ప్రతి యువకునికిన్ని, ప్రతి యువతికిన్ని. శాసనసభలకును, ఇండియా పార్లమెంటుకును, ప్రతినిధులను యెన్నుకొనే "ఓటింగు" హక్కు యివ్వబడినది. ఈ "ఓటింగు" హక్కు యిచ్చుటలో ధనికులని, బీదవారనే వ్యత్యాసము తొలగింప బడినది. మగవారు, ఆడువారు అను భేదము తొలగింప బడినది. జాతి భేదములు, మతభేదములు, కులభేదములు తొలగింప బడినవి. 21 సంవత్సరము వయస్సు యుండిన చాలును. తలయుండు ప్రతి మానవవ్యక్తికినీ, పూరిగుడిసెలలో నివసించు వారికిని, కొండలలో కట్టెలమ్ము కొనువారికిని "ఓటింగు" హక్కు యున్నది. కనుక నిజమైన స్థితిలో దేశపరిపాలనమును జరుపుకొనే భారమంతయు సామాన్య ప్రజలకే యొప్పగింప బడినది.

ఇప్పటికప్పుడే అక్టోబరు – డిశంబరు నెలలలో జరుగబోయ్యే యెన్నికలకు ఓటర్ల లిష్టులు తయారు చేయబడినవి. ఆ లిష్టులలో 21 సం। వచ్చినవారి పేర్లు యెన్నిలేవో, ఎంతమందిని ఈ సర్కారు యుద్యోగులు చేర్చుటకు మరచిపోయినారో, అశ్రద్ధవల్ల విడిచి పెట్టినారో యిప్పుడు చెప్పలేము. ప్రజలలో బీదవారు, చదువురానివారు, "ఓటు" అంటే అర్థముకానివారి సంఖ్యయే యెక్కువగానున్నది. వారంతకు వారే "ఓటింగు"లోగల హక్కును తెలుసుకొని ప్రజలను లక్ష్యము చేయని సర్కారు యుద్యోగుల దగ్గరకిపోయి తమ పేరును పట్టికలో చేర్చుమని అడిగేవారుండరు. అట్టివారు యిప్పుడు చింతించి లాభములేదు. ఇప్పుడు ఓటర్ల పట్టికలలో పేర్లుగలవారు మాత్రమే రాబోవు యెన్నికలలో తమకుగల "ఓటింగు" హక్కును యేవిధముగ నుపయోగించుకొనవలెనో బాగా యోచించుకొనవలెను.

ఇంతవరకు రాజకీయ రంగములో ఈ దేశములో ఎక్కువ పలుకుబడి కలిగినది కాంగ్రెసు పార్టీయుండెను. దీనికన్నను ప్రచారములోను, పలుకుబడిలోను తక్కువగ సోషియలిష్టుపార్టీ అనేది వొకటున్నది. హిందూ మహాసభ యొకటి యున్నది. ఈ మధ్యనే ఆచార్య కృపాలనీగారి నాయకత్వముక్రింద "ప్రజాపార్టీ" అను పేరుతో క్రొత్త పార్టీ యొకటి ప్రారంభింపబడినది. వీనికి తోడుగ చెన్న రాష్ట్రములో 'రిపబ్లిక్ పార్టీ' అను పేరుతో ఒకపార్టి యున్ను, పూర్వముండిన "జస్టిసు" పార్టి యున్ను స్థాపింపబడినవి. కమ్యూనిష్టు పార్టియుండనే యున్నది. ఎన్నికల గడువుసమీపించేకొద్దీ యింకెన్ని క్రొత్తపార్టిలు యేర్పడుతాయో చెప్పలేము. ఇన్ని పార్టిలు దేశములో వుంటే ఏ పార్టిలకు ఓటు చేయవలెనను ప్రశ్న సాధారణముగ బయలుదేరును.

మన దేశములో గ్రామములెక్కువ. గ్రామములో నివసించు ప్రజలకు సాధారణముగ విద్యతక్కువ. దేశరాజకీయ విషయములు బొత్తిగా తెలియవు. వారందరు అమాయక ప్రజలు. వారికి శ్రీరాముడు దేశపరిపాలనము చేసినా వొకటే, రావణాసురుడు, హిరణ్యకశ్యపుడుబోలు రాక్షస వృత్తి గలవారు పరిపాలనము చేసినా వొకటే. చెన్నరాష్ట్ర ప్రభుత్వ మంత్రివర్గములోగల మంత్రుల పేర్లు తెలియని ఓటర్లు గ్రామములో లక్షలకొలది గలరు. ఇండియా ప్రభుత్వ మంత్రి వర్గములో ప్రధాన మంత్రిగానుండిన పండిత నెహూరుజీ పేరుతప్ప మిగత మంత్రుల పేర్లుకాని, వారుచేసే పనులుకాని తెలియని ఓటర్లు లక్షలకొలదిగ గ్రామములలోనున్నారు. దేశమునకు స్వతంత్రమొచ్చి మూడు సంవత్సరములు గడిచినది. నాల్గవ సంవత్సరము గడుచుచున్నది. ఈ నాల్గు సంవత్సరముల కాలములో కేంద్రములోను, రాష్ట్రములోను, కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడి, వారు కావించిన మహోపకారములేవో, గ్రామసీమలలో నివసించే ఓటర్లకు తెలియదు. మంత్రుల పేర్లే తెలియని వారికి వారు చేసిన కార్యము లేమి తెలియును?

సర్కారు యుద్యోగులలోను, పోలీసువారిలోను గల దౌర్జన్యాలు ఇంగ్లీషువారి కాలములో యెట్లుండినావో యిప్పటికిని అట్లే యేవిధమైన మార్పులేకుండ యుండేవిషయము గ్రామ ప్రజలకు బాగా తెలుసును. తమ తమ గ్రామములలో కొంచము పలుకుబడి యుండినవారంతా రేషన్ డిపోలు మూలముగాను, ఫేర్‌ప్రయిజు డిపోల మూలముగాను, బస్సుల లైసెన్సుల మూలముగాను, బీద ప్రజల నోటిలో దుమ్ముకొట్టి, విపరీతముగ హద్దు పద్దులేకుండ లాభము సంపాదించి లక్షలకు పడగలెత్తిన విషయము బాగుగా తెలియును. ప్రొక్యూరుమెంటు, రేషనింగు, ధాన్యము రవాణాల విషయములో సర్కారు ఉద్యోగులు బీదరైతుల నేవిధముగా యేడిపించినది, పెద్ద పెద్ద రైతుల నేవిధముగ దువ్వి, వదలినది, గ్రామ ప్రజలకు బాగా తెలుసును. తిండికిని, గుడ్డకును కఱవై ప్రజలంతా అన్నమో రామచంద్రా, వస్త్రమో నారాయణయని అలవటించుట గ్రామ ప్రజలకు బాగుగా

తెలియును. దినదినము చూచుచున్నారు. వారి యాలాపనలను వినుచున్నారు. 1939 సం॥లో ధాన్యమునకును, గుడ్డకును, ఉండే ధరలకును, 1951 జూన్ నెలలో కాంగ్రెసు ప్రభుత్వ ముక్రింద యుండే ధరలకును పోల్చిచూచిన 10 అంతలు హెచ్చినవి. 1939 సంవత్సరములో 500 పల్లుగల పుట్టెడు వడ్లకు రు 35/– ధరయుండినది. ఇప్పుడదే పుట్టికి రు 400/– ధరయైనది. గజము కోరాగుడ్డ ధర 1939 సం॥లో 4 అణాలు మొదలు 6 అణాలుండెను. ఇప్పుడు రు 2/–లకు గూడ చిక్కుటలేదు. లక్షలకొలది బీద సాదలు గుడ్డలు చిక్కక చింపిరి గుడ్డలను, ముతికి గుడ్డలను వేసుకొని, అవమానముతో బయటికి రాజాలకున్నారు. ఏ వస్తువుకాని, యే ఔషధముకాని, చీకటి మార్కెటులో చిక్కుతుంది. ఎంతకావలెనంటే అంతచిక్కుతుంది. బహిరంగముగ మార్కెటులయందుమాత్రము కంటికి కనబడదు. ఇవన్నియు కాంగ్రెసు పరిపాలన క్రింద ప్రతి నిత్యము, ప్రతి నిమిషము జరుగుచున్న విషయములు.

ఒకొక్కప్పుడు యోచించుతే ఈ దేశములో ప్రభుత్వమనేది వొకటివున్నదా, లేనేలేదా యనిపించును. మంత్రులెక్కడ యున్నారో, ప్రభుత్వ మంతా సర్కారు ఉద్యోగులదే యైపోయినది. వ్యాపారస్తులదే యైపోయినది. ధనవంతులదే యైపోయినది. పెద్దతలకాయలదే యైపోయినది. ఉత్పత్తిదారులదే అయిపోయినది. దోపిడీదారులదే అయిపోయినది. పోలీసువారిదే అయిపోయినది. బీద బిక్కలను పలుకరించే దిక్కే లేకుండాపోయినది. ఈ కాంగ్రెసు పరిపాలనములో నెహురుజీ నీతిపరుడు. మేధావి. ఉత్తమోత్తముడు: జగద్విఖ్యాత పురుషుడు. విద్యావంతుడు. దయాళువు. ఇవ్వన్ని ఎవ్వరు కాదనరు. ఇట్టి పురుషుడు యింతకు ముందు పుట్టలేదు. ఇకముందు పుట్టబోడు. కాని వీరి పరిపాలనము క్రింద సామాన్య ప్రజలైన బీద బిక్కలు అనుభవించుచున్న జీవితములు దుర్భరముగ మారిపోయినది కదా?

నే నొక్కడనే చెప్పటలేదు. పైన అనేక విషయములను తెలిపినాను. వానిలో యేదైనా కాదనే వారుందురా?

# 250 రూ॥ శిస్తుగల భూమికి మించి ఏ ఒక్క పట్టాదారుకూ ఉండరాదు.

## రాష్ట్ర భూమి సంస్కరణల సంఘ సూచనలు.

చెన్నపట్టణము, జూన్ 30: రు 250 ల శిస్తు చెల్లిస్తూ వున్నవారు ఇకముందు ఎక్కువ భూములను సంపాదించుటకు వీలులేదు. ఎవరున్నూ రు 250 ల శిస్తుకు మించిన పొలమును కలిగివుండరాదు” అని భూమిశిస్తు సంస్కరణ సంఘమువారు శిఫార్సు చేసిరి. రాష్ట్రములో భూమి అమరకపు పద్ధతులను విచారించి సంస్కరణలను సూచించుటకు రాష్ట్ర ప్రభుత్వము 1950 సం॥ మే లో ఈ కమిటీని నియమించినది: —

అవిభక్త హిందూకుటుంబములు, వారసత్వము, దానములు మున్నగు సందర్భములలో రు 250 ల శిస్తుకు సరియగు భూమి పరిమితిని మార్చవచ్చునని కూడా సూచించిరి. ఇప్పటి భూవసతి విషయములో వున్న పరిమితికి మించి పొలము సంపాదించవచ్చునా లేదా యనునది ఒకానొక నిర్ణీత తేదీ ననుసరించి జరుగవలెననిన్నీ, అట్టి తేదీని శాసనముద్వారా నిర్ణయించవలెననిన్నీ కమిటీవారు శిఫార్సు చేసిరి.

కనీసము ఇకముందైనా వ్యవసాయదార్లు కానివారి చేతులలోనికి పొలములు పోకుండా ఆపుట ఆవశ్యమని, కమిటీవారు తలచి స్వయముగా వ్యవసాయదార్లు కానివారికి ఇక ముందు భూములు అన్యాక్రాంతము కాకుండా నిషేధించవలెనని సూచించిరి.

భూస్వాములు స్వంత సేద్యమునకు పూనుకొనే పక్షములో ఇప్పుడు వారి భూములు సాగుచేయుచున్న రైతులకు తబ్దీలు రాకుండా చూడవలెను. కనుక స్వంత సేద్యమునకు కూడా రూ 250లు శిస్తుకు సరిపడు భూమి విస్తీర్ణమే పరిమితిగ వుండవలె నన్నారు.

అయితే నిర్ణీత తేదినాటికి పరిమితభూమికన్న ఎక్కువగా స్వంత వ్యవసాయముచేసే భూస్వాములకు ఇది వర్తించదు. నిర్ణిత తేదినాడు స్వంత సాగులో ఎంతభూమి వుండునో అదంతా స్వంతకమతముగానే పరిగణించ బడునన్నారు.

నిర్ణిత తేది విషయములో కూడా కమిటీవారు శిఫార్సు చేశినారు. ఈ శిఫార్సులను పురస్కరించుకొని వీనిని తప్పించుకొనే నిమిత్తము అన్యాక్రాంతములు వగైరా జరుగకుండానున్నూ, ఈ శిఫార్సులు తెలియక పూర్వమే జరిగిన వ్యవహారములకు భంగం రాకుండానున్నూ, నివేదిక ప్రచురించే తేది అనగా 1951 జులై 1 వ తేది ఇకముందు చేయబోవు శాసనము కొరకు నిర్ణిత తేదిగా వుండవలెనని సూచించిరి.

ఈ కమిటీ రిపోర్టు 164 పేజీలున్నది. ఇది ప్రథమ రిపోర్టు మాత్రమే. దీనికి చైర్మన్ శ్రీ యం. వి. సుబ్రహ్మణ్యం, ఐ.సి.యస్; కార్యదర్శి శ్రీ యస్. ఆర్. కైవార్, ఐ.సి.యస్,

సభ్యులు: శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి, శ్రీ. యస్. రంగారెడ్డి, యం. యల్. సి; అల్లూరి సత్యనారాయణరాజు, యం. యల్. ఎ; శ్రీ సి. సుబ్రహ్మణ్యం, యం. పి; శ్రీ కె. యం. జేడెకర్, యం. యల్. సి; శ్రీ వి. ఐ. మునిస్వామిపిళ్ళె, యం. యల్. ఎ; శ్రీ జి. శంకరన్ నాయర్.

ఇందులో 16 అధ్యాయములు 6 అనుబంధములు వున్నవి. 7 గురు సభ్యులలోనూ 5 గురు కొన్ని విషయములలో అసమ్మతి నోట్సు వెల్లడించినారు. కమతము పద్ధతులు, పొలాల పరిమితి అన్యాక్రాంతమునకు విధిచే నిషేధములు వ్యవసాయము చేయని భూస్వాములు, కలుపుగోలు వ్యవసాయము కట్టుబడి, జిరాయితీ పద్ధతులు, వ్యవసాయ కూలీ సమస్యలు మొదలయిన అంశాలను సవిస్తరముగా విమర్శించి శిఫార్సులు చేసిరి. కాంగ్రెసు కమిటీవారు ఈ విషయమై చేసిన శిఫార్సులకు ఈ కమిటీవారు అభిప్రాయ మిచ్చిరి. వారి ప్రశ్నావళికి 192 వ్యక్తులనుండి 56 సంస్థలనుండి జవాబులు వచ్చినవి. (సశేషము).

# అరిషడ్వర్గము

(శ్రీ పి. వి. సుబ్బయ్యగారు.)

(గత సంచిక తర్వాత.)

భగవంతునికి సర్వమును ఆత్మార్పణము సేయగలట్టి యోగ్యత మానవుఁడెట్లు సంపాదింపఁగలడనునది జటిలమగు ప్రశ్న. ఎందువలన?

1. అరిషడ్వర్గాదులను జయించి, మిూదు మిక్కిలి ప్రపంచ వ్యవహారములు కుంటుపడని యట్లు విధ్యుక్త ధర్మముల నెరవేర్పవలయును.

2. పై విధి నెరవేర్చుటకు నిష్కామకర్మ యోగము బూనవలయును.

2. నిష్కామ కర్మ యోగము సులభసాధ్యమగుటకు వ్యక్తి సర్వ కర్మములను భగవదర్పణము సేయవలయును. కర్మ ఫలమువందు తనకు పాలున్నదని భావింపరాదు.

భగవంతున కాత్మ సమర్పణము సేయుట సౌలభ్య మెట్లగును? 'విషయ సుఖాదిక ఫలాపేక్షను విడిచి, సమస్త కర్మలను పరమ గురువగు నీశ్వరున కర్పించుటయే భక్తి విశేషమగు ప్రణిధానము,' అని భోజదేవుఁడును, 'క్షణికములగు విషయ సుఖములందు అవివేకుల కెట్టి ప్రీతియుండునో భగవంతుని ధ్యానించునపుడు అట్టి ప్రీతి హృదయమునుండి తొలఁగి పోకూడదని' ప్రహ్లాదుఁడును వచించియున్నారు. ఈ నిర్వచనములు భక్తిని గుఱించినవి. కనుక భక్తుఁడు భగవంతునికి సులభముగా సమస్తమును అర్పణసేయగలడు. ఆభక్తి నిష్కామయినదిగా నుండవలెను. భక్తుఁడు భగవానుని గూర్చి నిష్కళంకాన్వేషణ మొనర్చువాఁడుగా నుండవలెను. భక్తి ప్రేమమున జనించి, ప్రేమలో వికాసమొంది, ప్రేమమున లయించును. నారదుఁడు "భగవంతునియందలి పరమప్రేమయే భక్తి" అని నిర్వచించియున్నాడు. ఇది కలిగినవాఁడు అరిషడ్వర్గముల చెంతకు రానీయడు. సర్వకర్మముల ఆత్మార్పణము సేయు యోగ్యత కలిగి యుండును.

భక్తి భావమును బూని రామదాసు, తులసీదాసు, భక్తకబీరు, నందనారు, ధృవుఁడు, ప్రహ్లాదుడు, త్యాగరాజు మొదలగు భక్త శిఖామణులు సగుణోపాసకులైనను, నిర్గుణబ్రహ్మమును జేరగల్గిరి. ఎందుచేత? భక్తి పారవశ్యులైన వీరిని అన్య చింతలు సమిూపింపవు. అరిషడ్వర్గాదులు నిర్వీర్యము గలవై నిర్జింపఁబడును. అందుచే నవ్యక్తమగు పరబ్రహ్మము నుపాసించు వారలకంటె సగుణ బ్రహ్మము నుపాసించు వారిమార్గము సరళము. శ్రీకృష్ణపరమాత్మ పల్కిన తీరు జూడుము, "ఎవ్వారు నాయందు మనస్సు నిలిపి, నిత్యసమాహిత చిత్తులై

మహోత్తమ శ్రద్ధతో నన్నుపాసించుచుందురో వారే నా యుత్తమోపాసకులు, యోగిశ్రేష్ఠులు. నాశ రహితము, అనిర్దేశ్యము, అవ్యక్తము, సర్వవ్యాప్తము, అచింత్యము, అచలము, శాశ్వతము నగు పరబ్రహ్మము నెవ్వరు ఉపాసింతురో ఉత్తమమగు నింద్రియ నిగ్రహము నవలంబించి, అన్నిటి యందును సమబుద్ధి గలిగి, సర్వభూతహితమున రమించువారు నన్నే ప్రాప్తించుచున్నారు. కాని అవ్యక్తమగు బ్రహ్మమునందు, ఆసక్తచిత్తులగు వారి మార్గము కష్టతరము. ఏలన, దేహాభిమాన యుక్తులగు వారలకు ఈ పరబ్రహ్మ నిష్ఠ ప్రబలాయాసకరముగాని దే సిద్ధింపదు. ఎవరు తమ సమస్త కర్మములను నాకు అర్పించి అనన్యాసక్త చిత్తులై పరిపూర్ణ విశ్వాసముతో నన్ను ధ్యానించుచుందురో వారలను జననమరణ రూపమగు సంసార సాగరము నుండి అతిశీఘ్రముగా నేనుద్ధరింతును.”

—భగవద్గీత, (12 అ. 2-7)

భక్తి యోగమున నిష్కామకర్మ యోగమును సాధించుట సులభతరమైనను, భక్తులనిపించుకొనక కర్మకొరకే కర్మమును జేయుచు, కర్మవీరులుగా పరిగణింపబడి ముక్తి వడసినవారు అధునాతన యుగంబున లేక పోలేదు. వీరిలో స్వామి వివేకానంద, మహాత్మా గాంధి, అరవింద ఘోష్, స్వామి శివానంద సరస్వతి ముఖ్యులు. వీరెట్లు జీవితముల తీర్చుకొనిరో తెలిసికొన్న మేలొదవును.

స్వామి వివేకానంద;— బాల్యమున వివేకానందుడెన్నడును అసత్యమువచించిన పాపమున బోలేదు. ఒకపరి పాఠశాలయందు, అధ్యాపకుడు గోలచేయుచున్న బాలురగని లేచి నిలుచుండుడని ఆజ్ఞాపించెను. వెంటనే వివేకానందుడు లేచి నిలువబడెను. ఉపాధ్యాయుని ప్రశ్నలకు పాఠ్య భాగముల నుండి సరియైన జవాబులు చెప్పెను. అధ్యాపకుడు ఆశ్చర్య చకితుడయ్యెను.‘అల్లరి చేయుచుండినది నీవుగావని’ వేరొకరిని శిక్షింపబోవ, అల్లరి చేసినది నేనేనని సత్యము వచించి శిక్షబొందెను.

తండ్రి గతించిన వెనుక, వివేకానందుడు కష్టముల పాలయ్యెను. ఒక ధనికురాలాతనిని ప్రేమించి, నన్ను వివాహ మాడుమని కోరెను. ఆతడిట్లు జవాబు నిచ్చెను. “విషయ సుఖముల నాశించి, నీజీవితము నింతవఱకు గంగపాలు చేసితివి. యమలోకమునకు బోదలచితివా? మృత్యువు నెదుర్కొనుటకై నీవేమి సాధనలొనర్చితివో యోచింపుము,”అని పంపివై చెను. మఱియొక పరి తన గాన మాధుర్యమునకు పరవశత్వమును బొందిన ఒక బాలికా వితంతువు, ఆతని యొద్దకు వచ్చి మోహవిచేష్టిత యయ్యెను. వివేకానందుడామెకు సాష్టాంగ నమస్కారముచేసి “తల్లీ! తల్లీ! ఎందులకు వచ్చితివి? నీవు నా తల్లివి సుమా?” యని వచించెను. ఆ యువతి నరేంద్రుని మనోభావమును గ్రహించి వెనుకకు మఱలెను.

అతడు గృహస్థుడై సంసార భారమును వహింప వలసినవాడై యుండ, మేరు పర్వతమునకు ఆవగింజకును, సూర్యునకు మిణుగురు పురుగునకును, సముద్రమునకు పిల్ల కాలువకును, ఎంతటి వ్యత్యాసమో సన్యాస జీవితమునకును, గృహస్త జీవితమునకును, అంతటి వ్యత్యాసము గలదని నిశ్చయించి సన్యసించెను. ఆహారము పట్ల అయాచితముగా నేది లభించునో దానినే భుజించెదనని ఆతడు సంకల్పించుకొనెను. ఇట్లు తీర్చి దిద్దుకొన్న జీవితమును మానవ సేవ కంకితము చేసెను. ఆతడొకపరి శిష్యులతో “స్వకీయ ముక్తిని పాటింపక పరశ్రేయము కొరకై పాటుపడు వారిల దాసుడను నేను” అని వచించెను. అట్లే జీవించి తరించెను.

మహాత్మాగాంధి:— బాల్యావస్థలో గాంధిజీ దుష్ప్రవర్తనగల చెలికాని ప్రోత్సాహము వలన మాంసము తినుట మొదలుపెట్టెను. ఇందు గాంధీజీ యగ్రజునకు గూడ పాలుగలదు. ఇరువురును మాంసము తినుట కలవాటుపడి కొంత అప్పుజేసిరి. ఈ యప్పు తీర్చుటకు తనయన్న చేతిలోఁగల బంగారు మురుగు ఒకతులము కత్తిరించి అప్పు తీర్చికొనిరి. ఈ తప్పును కప్పి పుచ్చుటకు గాంధీజీకి మనసొప్ప లేదు. ముచ్చిమి చేసితిమిగదాయని హృదయము వేధించుచుండెను. తుదకు తండ్రి యొద్ద కరిగి తప్పునొప్పుకొని శిక్షవిధించుడని కోరెను. పశ్చాత్తాప పడెను. మాంసము తినకూడదని నిశ్చయించుకొనెను.

‘సృష్టికి నీతి మూలము, నీతికి సత్యము మూలాధారము;’ ‘అపకారికి ఉపకారము చేయుము;’ అను సూక్తులు బాల్యముననే ఈతని హృదయమున స్థిరమైన పునాదులు వేసికొనెను. వీని ననుసరించి తన జీవిత విధానమును దిద్దుకొనెను. ఇతఁడు ఇంగ్లాండు విద్యాభ్యాసార్థము పోవునపుడు “మద్యమును, మాంసమును, మహిళలను ముట్టనని మూడు వాగ్దానములు చేసి పోయెను. ఇంగ్లాండులో వీని విషయమున అచంచల చిత్తమును వహించి, శపథమును పాలించెను. ఇంగ్లాండులో బారిష్టరు పరీక్షయిచ్చినవాఁడగుట దన జీవనోపాధికి ప్లీడరు వృత్తియే గైకొనవలసి వచ్చెను. ‘ప్లీడరులకు కల్లలాడక తెల్లవారదని’ ఒకసామెత కలదు. గాంధీజీ తన వృత్తిలో సత్యము నెట్లు తలఁదాల్చెనో, చూడుడు.

(1) ఈయన తన క్లయంట్లతో ‘మీ కేసు కల్లయగుచో నాకడుగ రావలదు. సాక్ష్యము బనాయింపఁదలఁచికొనుసో నాయాశ పెట్టుకొనవలదని’ చెప్పువాడు.(2) తనయొద్దకు వచ్చిన ఒక కేసు విచారణ పూర్తియగునప్పటికి క్లయింటే తప్పుచేసినవాడని గాంధీజీకి తెలిసెను. గాంధీజీ యూరకున్న వో, తన క్లయింటే జయ మొందును. కాని గాంధీయాత్మ ఒప్పుకొనలేదు. వెంటనే లేచి క్లయింటును, చీవాట్లు పెట్టి, జడ్జిగారిని తన క్లయింటుకే శిక్షవిధింపుమని కోరెను. ఇట్టి వనేకములు గలవు. స్థలాభావముచే వ్రాయలేదు.

ఒకానొకనాఁడు తన యాశ్రమములోని విద్యార్థులలో నొకఁడు గోలచేయుచుండఁగా గాంధీజీ మందలించెను. కాని వాఁడు మానలేదు. గాంధీజీ చేయిజాపుమని కొట్టెను. అట్లు కొట్టుట అయుక్తమనియు, కోపమును నిగ్రహింపలేక పోయితిననియు చింతించెను. ప్రాయశ్చిత్తముగా ఉపవాసము చేసెను. తరువాత ఎన్నడును కోపము వహింపలేదు.

గాంధీజీ తన 32–వ,యేట బ్రహ్మచర్యదీక్ష వహించెను. కామక్రోధాదుల జయించుటకు పటుతర ప్రయత్నములు చేసెను. ఆహారమును తనదీక్ష కనుగుణ్యముగా నూర్చుకొనెను. జీవితమును స్వచ్ఛ మొనర్చుకొని, ప్రజాసేవలయందు విజయపతాకము నెత్తెను. (సశేషము.)

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా “భారత జ్యోతి” పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనములక్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి, ప్రకటింపవలయునో తెలియ కున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయుజాబులను, వ్యాసములను మా “భారత జ్యోతి” పత్రికలో ప్రకటించుట కెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము:—

సంపాదకులు, “భారత జ్యోతి”

# ప్రజాభిప్రాయ వేదిక.

## కల్లోల ప్రపంచములో శాంతిసంఘము ఆశాజ్యోతి.

—(0)—

ఆర్యా,

రెండు ప్రపంచ మహా మారణ యుద్ధాలలో, ప్రపంచ ప్రజానీక మంతా యుద్ధమంటే ఏమో ప్రత్యక్షముగా గాక పోయినను, పరోక్షముగ తెలుసుకొనిరి. లక్షల కొలది ప్రజానీకను ఎందుకో తెలియకుండా తమ ప్రాణాలను యుద్ధములో పోగొట్టుకున్నారు. భర్తలను పోగొట్టుకున్న భార్యలు, భార్యలను పోగొట్టుకున్న భర్తలు, బిడ్డలను పోగొట్టుకున్న తల్లిదండ్రులు, తల్లిదండ్రులను పోగొట్టుకున్న బిడ్డలు, వికలాంగులు, యుద్ధములో 'నా' అనే వస్తువు లేకుండా, సర్వము పోగొట్టుకున్న నిర్భాగ్యులు చేసే ఆక్రందనాలు, హాహాకారా లింకను మన చెవులకు వినబడుచూ యుండగానే, తిరిగి మరొక యుద్ధానికి ప్రయత్నములు సాగుచున్నవి. సాగించ మొదలు పెట్టినారు. ఈ నాడు అమెరికావారి ఘోర కిరాతక చర్యల ఫలితముగా, కొరియా స్మశానముగా మారి పోవుచున్నది. కడుపులో చల్లకదలకుండ శాంతియుత సుఖ జీవనమునకు ఉపయోగించుచున్న ఉత్తర కొరియాలో గ్రామాలకు గ్రామాలే భస్మీపటలమగు చున్నవి. ట్రూమన్ దొరగారి లెక్కల ప్రకారమే రెండు వైపుల 10 లక్షల మంది మరణించడమో లేక గాయపడడమో జరిగినది. ప్రక్కనవున్న తమ సోదరులకు చైనా వాలంటీర్లు సహాయము చేయడము, వారిపై అమెరికన్ కబంధుని ఘీంకారము, చైనా రష్యాల మిత్రత్వ ఒడంబడికలు ఇవన్ని మనము దృష్టి సారించిచూచిన, ఇవియే తిరిగి మరొక మారణసంగ్రామమునకు నాందివాచకము అగు విధముగా నున్నవి.

ఏ దేశములోని సామాన్య మానవుడైనా అటు ఆమెరికా పౌరుడు కానీయండి, ఇటు రష్యాపౌరుడు కానీయండి, యుద్ధాన్ని వాంఛించడములేదు. తిరిగి మరియొక యుద్ధమనే తల కొరివిని చేజేతుల తలపై పెట్టుకొని చావులు, రోగాలు, ఆర్థిక నిర్బంధాలు, తెచ్చుకోవలయునని ఎవరును కోరుట లేదు. అందులోను ఈమారు వచ్చేయుద్ధము ఆధునిక మారణ ఆయుధాలను ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబు మొదలైన కనివిని ఎరుగని రాక్షసశక్తియుతమైన ఆయుధములతో జరుగవచ్చును. రెండో యుద్ధములో నాగసాకి, హిరోషిమా నగరములపై ఆటంబాంబు ప్రయోగము జరిగినందువల్ల ఆ పరిసరప్రదేశముల ప్రజలు ఈ నాటికికూడ విపరీతమైన రోగములతో బాధపడుచున్నారనిన, కుప్పలుగా నిలువచేసుకొని పొంచియుండే నేటి యుద్ధోన్మాదులు సాగించే యుద్ధమెంత భయంకరముగా వుండునో పాఠకులే ఆలోచించవలెను. ఏమీ లేదు, పాతరోజుల్లో పల్నాటి యుద్ధము జరుగుతుంది అంటే శ్రీనాథుడు యుద్ధఫలితములు మహాప్రమాదకర పరిస్థితులని ప్రజలు, దేశాలు, పాలకులు అంతా కష్టపడుతారని వ్రాసినాడే! ఇప్పుడిక యుద్ధమువస్తే ఈ నాగరికసమాజములో ఎట్లుండునో ఆలోచించవలెను. యుద్ధాలు మహాప్రమాదకరములని అనుకొంటూ భయముతో ప్రజలు చేతులు ముడుచుకొని కూర్చోలేదు. ప్రపంచశాంతి సంఘమనుచు ఒక సంఘమేర్పడినది. ఇది ఏ రాజకీయ, మత, వర్గ, దేశములకు పరిమితముగాదు. లక్షాధికారి కానీయండి — భిక్షాధికారి కానీయండి, కమ్యూనిష్టు కానీయండి — క్యాపిటలిష్టు కానీయండి, రష్యాను ప్రేమించేవాడు కానీయండి — అమెరికాను ప్రేమించేవాడు కానీయండి,— ఎవరైనాసరే, మానవులయిన వారంతా "యుద్ధాన్ని కోరనివార" మనెడి వారందరు ఈ సంఘములోనికాహ్వానింప బడియెదరు. ప్రపంచము పుట్టినప్పటినుంచి, ఏ సంస్థగాని ఇటువంటి విశాలప్రజానీక ఆమోదకరమైన ఆశయముతో ఇప్పటికి పుట్టి, సర్వవర్గములకు, రాజకీయములకు, మతములకు చేరిన ప్రజలను ఆకర్షించలేదు. అట్టి మహాకార్యమును శాంతిసంఘము సాధించినది. ఇంకను సాధించగలదు.

"ఆటంబాంబులను నిషేధించవలె" నను నినాదముపై ప్రపంచములోని 50 కోట్లప్రజలు సంతకములుచేసి, ఈ సంఘము ద్వారా ప్రపంచ ప్రజానీకము తమ శాంతివాంఛ ప్రస్ఫుటముగా ప్రకటించిరి. "యుద్ధాలు రావలెను, ద్రవ్యముతో పెట్టెలను నింపుకొనవలె" నను యుద్ధోన్మాదులు శాంతి యోధులపై సంయుక్త సంఘటనను హడలగుచున్నారు. తిరిగి ఇటీవల శాంతి కమిటి బర్లినులో అగ్రదేశము లయిదును — అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్సు, నవచైనా — సమావేశమై, శాంతియొడంబడిక చేసికోవలెనని తీర్మానించి, ప్రపంచ ప్రజానీకమును పై అపీలుమీద సంతకములు చేసి, ఆందోళన సాగించమని కోరినది. పై 5 దేశములలో, ఏ దేశము శాంతి ఒడంబడికను నిరాకరించునో, ఆ దేశము 'యుద్ధోన్మాదదేశ' మని ఆ తీర్మానము నిర్వచించుచున్నది. ఇది సర్వప్రజానీకమునకు ఎటువంటి ఆమోద యోగ్యమైన తీర్మానమో చూడుడు. పై శాంతిపిలుపు మీద ప్రపంచ మందంతట సంతకములు చేయించబడుచున్నవి. ప్రతి గ్రామమున శాంతి కమిటీలు ఏర్పడి, ప్రపంచ ప్రజానీకము తన శాంతి

వాంఛను ప్రకటించుచున్నారు. మన దేశములోకూడ రెండు సంవత్సరముల నుండి ఈ శాంతి ఉద్యమము మొదలైనది. సుప్రసిద్ధులైన కాంగ్రెసువాదులు, స్వాతంత్రులు, పత్రికా రచయితలు భారతదేశ శాంతి సంఘములో ప్రధానపాత్ర వహించుచున్నారు.

బి. నాదమునిరాజు.

## కమ్యూనిష్టుపార్టీ—ఎన్నికలకు పోటీచేయును.

ఆర్యా!

1951—వ సంవత్సరము జూన్ నెల 2—వ వారములో సమావేశమైన కడపజిల్లా కమ్యూనిష్టుకమిటీ, భారత కమ్యూనిష్టు కేంద్రకమిటీచే ప్రకటింపబడిన డ్రాఫ్టు కార్యక్రమము పాలసీ ప్రకటనలను ఏకగ్రీవముగ ఆమోదించినది. వ్యక్తిగత హింసావాదమును మార్క్సిజ మంగీకరించదని, ఇండియా తన ప్రత్యేక పరిస్థితుల కనుగుణ్యముగా— చైనా, రష్యా బాటలు గాక— స్వంత విధానము నవలంబించు నను దానితో హర్షించుచు ఏకీభవించినది.

రాబోవు ఎన్నికలకుగాను ప్రచారము తీవ్రతరము చేయుటకు, 20,000 రూపాయల ఎన్నికల నిధికి సేకరించుటకు, ఇతర ప్రజాతంత్ర పార్టీలతోను, వ్యక్తులతోను కలసి సంప్రతించుటకుగాను ఒక ఎన్నికల కమిటీని నియమించినది.

ఎన్నికలు దగ్గరకు వచ్చుచున్నను, ప్రభుత్వము కమ్యూనిష్టుపార్టీపై నిర్బంధమును ఏమాత్రము సడలించక, ఇంకను ఎక్కువ చేయుచున్నది. కమ్యూనిష్టు పార్టీకి చట్టబద్ధమైన హక్కులను కలుగజేయవలెననియు, జిల్లానాయకులపై గల వారంట్లన్నిటిని రద్దుచేయవలెననియు ప్రభుత్వమును కోరినది.

జె. వెంకటరామిరెడ్డి,

కడపజిల్లా కమ్యూనిష్టుపార్టీ. బి. ఏ., ఎల్. టి.

## వధువులు కావలయును.

వివాహ మాడగోరు వైశ్యవధువులు (పేదలు, వితంతువులు కూడ) వరులకొరకు:— వి. వి. యస్. సంఘము, నీలకంఠరావు పేట, కడప జిల్లా— అని వ్రాయుడు.

[గ్రంథ పరిచయము] 4—వ పేజీ తరువాత.

ననుసరించి రచనలు చేయను) అని హెచ్చరించుటయు, పాఠకలోకము కవుల స్వేచ్ఛను గౌరవించి వారిరచనల విలువ గ్రహించి ఆదరింపడము పరిపాటియే. ఈ కవియును పై పద్ధతి ననుసరించినాడు.

ఈ పురోగమనమున పలు గేయములు గలవు. ప్రతి గేయములోను క్రొత్త పోకడలు వ్యక్తమగును. ప్రజలిట్టి రచనలను జదివి భావ సౌందర్యమును గ్రహించి యానందించుట కలవఱచుకో వలెను. ఇట్టి నవ్య కవితా రీతుల నాదరించి, రచయితల కుత్సాహము కలిగింపవలె ననుటయే మా కోరిక.

## ప్రజలు గమనింప తగినది.

ఒక పెద్దపులి సిద్ధవటము బీటుకు సంబంధించిన లంకమల రిజర్వు అడవిలో చేరుకొని ఒక మనిషిని ఒక పిల్లవానిని చంపి తినినట్లు తెలియుచున్నది. అందువలన తుపాకి లైసెన్సు గల వారెవరైనా ఆ పులిని చంపి, దాని చర్మమును, గోళ్ళు, తలను, పండ్లను, హాజరు పఱచిన వారికి రు 300/— బహుమానము ఇవ్వబడును. పెద్దపులి ఆడది.

కడప. (సం.) సి. వివేకానందమూర్తి,
కలెక్టరు.

### కడప జిల్లా కోర్టులో.

E P 22 Of 1950
OS 10 Of 1949

ఇడమడక వెంకటసుబ్బయ్య. —— వాది.
ఇడమడక పెద్దవెంకటమ్మ. —— ప్రతివాది.

### నోటీసు.

(D 2) ఇడమడక వెంకటసుబ్బయ్య భార్య చిన్న వెంకటమ్మ ప్రొద్దుటూరు తాలూకా గోపవరం గ్రామం.

ఈ డిక్రీ మొత్తము ఖర్చులు వగయిరాలకుగాను జప్తి దాఖలా చనిపోయిన వెంకటసుబ్బయ్య తాలుకు స్థావరాస్తిని యాలం వేయుటకు వాది కోరి యున్నాడు. గనుక అందుకు యేదైన ఆక్షేపణలు యున్నంతటయినా కోర్టుయెదుట 10—8—1951 తేదిన హాజరై తెలుపు కొనవలెనని తెలియ చేయడమయినది.

కడప. 9—7—1951. } వి. వి. శేషాచార్లు, బి. ఏ., బి. ఎల్.,
వాది వక్కీలు.

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక,

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము 4.
సంచిక-23.

బుధవారము, జూలై 18, 1951.

ప్రతి బుధవారము
వెలువడును.

## విషయానుక్రమణిక

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 23. | శ్రీ ఖరనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౧౫, జూలై, 18, 1951. | ప్రతి బుధవారము ప్రకటింప బడును.

## పేర్లను మార్చినంత మాత్రమున మనుష్యులు మారెదరా? బుద్ధులు మారునా?

తెలుగు దేశముననుండు రాజకీయ నాయకులలో శ్రీ ప్రకాశము పంతులుగారును, శ్రీ యన్. జి. రంగాగారును ఒకరికొకరు పొసగని శక్తులు. ఈ రెండు శక్తులును చేరి ఒక పార్టీని స్థాపించి, విజయవంతముగ పోరాడుదురని ఇది వఱకెవ్వరును నమ్మలేదు. ఇకముందు నమ్మజాలరు. శ్రీ ప్రకాశము పంతులుగారు గుండె దిట్టముగ కేసరి లక్షణములు కలవారు. ఎట్టి త్యాగమునకైనను వెనుక ముందులు చూచువారు కారు. ఇది దక్షిణ ఇండియాలో నున్న ప్రతి వారికిని తెలిసిన విషయము. 1937 సం॥ జరిగిన ఎన్నికలలో, రాష్ట్ర శాసన సభా నాయకత్వము వలదన్నను తన్ను వరించుచుండినది. అట్టి నాయకత్వమును వహించి, సులభముగ రాష్ట్ర ముఖ్య మంత్రియై యుండవచ్చును. కాని ఆ పదవిని శ్రీ రాజగోపాలాచార్యులు గారు ఆశించిరి. కీ॥ శే॥ సత్యమూర్తి ద్వారా రాయబారములు పంపిరి. వెంటనే శ్రీ ప్రకాశము పంతులుగాను, పార్టీ నాయకత్వము తమకు వలదని తామే పార్టి సభలో శ్రీ రాజగోపాలాచార్యుల పేరును నాయకత్వమునకు మొట్ట మొదట ఉపపాదించి, త్యాగ దీక్షను బహిరంగముగ ఋజువు పఱచిరి. శ్రీ రాజాగోపాలాచార్యులవారికి కృతజ్ఞత లేదు. 1946 సం॥ ఎన్నికలు జరిగి మంత్రి వర్గము ఏర్పడు సమయములో శ్రీ ప్రకాశముగారితో పోటి చేయనని శ్రీ రాజగోపాలాచార్యులు చెప్పజాలరైరి. తుదకు ఏదో ఒక విధముగ శ్రీ ప్రకాశము పంతులుగారు రాష్ట్ర ముఖ్యమంత్రి కాగా, వారిని పడద్రోయుటకై కుట్రపన్నిన వారికి శ్రీ రాజగోపాలాచార్యులు గారు తమ నైతికబలమును, ప్రోత్సాహమును ఒసగిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవిని శ్రీ రంగాగారికి అంటగట్టినవారు శ్రీ ప్రకాశము గారే. కాని అవకాశము చిక్కగనే శ్రీ రంగా గారుకూడ ముఖ్యమంత్రి పదవినుండి శ్రీ ప్రకాశము పంతులుగారిని దింపుటకు తోడుపడిరి. మేలు చేసినవారికి కీడు చేయుటే వారి మనోతత్వము. ఇదంతయు తెలిసి, వారిని కూడగట్టుకొని ఒక నూతన పార్టీ నేర్పరచి నిర్వహించెదనని శ్రీ ప్రకాశము పంతులుగారు తలచుటయే గొప్ప లోపము.

ప్రజాపార్టి పుట్టుకలోనే కొన్ని తేట తెల్లమైన లోపములున్నవి. శ్రీ ప్రకాశము పంతులుగారు ఆ పార్టికి నాయకులైన అగుదురుగాక! వారు గావించు లోపములుకూడ లోపములని చెప్పవలయునే కాని, వానిని సమర్థించుట న్యాయేతరము. ప్రస్తుతము ఈ రాష్ట్రమున అధికారములోనున్న

మంత్రివర్గమువారు అవలంభించుచున్న విధానములు, అనుసరించుచున్న పద్ధతులు శ్లాఘనీయముగ నున్నవని ఎవ్వరును చెప్పరు. శాసన సభలలో, నైతిక సంపత్తు, సర్వ సామర్థ్యముగల ప్రతిపక్షవర్గము లేక పోవుటయే కాంగ్రెసు మంత్రివర్గముల బాధ్యతారహితమైన పరిపాలనమునకు కారణము. కాంగ్రెసు పార్టీ వ్యవహారములలోను, పరిపాలనా వ్యవహారములలోను, లోపములున్నచో పార్టీలో నుండియే వానిని సవరించుటకై ప్రయత్నించుట ప్రతి సభ్యుని కర్తవ్యము. అట్లు సవరించుట సాధ్యముకాదని తోచినచో, యోగ్యులైన సభ్యులు పార్టీసభ్యత్వమునకు రాజీనామా నొసగి, గౌరవప్రదముగ బయటికి వచ్చుట రెండవ కర్తవ్యము. ఈ రెండు కర్తవ్యములను ఒక్క శ్రీ తెన్నేటి విశ్వనాథముగారు తప్ప, ఈ ప్రజాపార్టీ నాయకులైన శ్రీ ప్రకాశము పంతులు గారేమి, అనుచరులైన శ్రీ రంగాగారేమి, వారిశిష్యవర్గమేమి అనుసరింపరైరి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికల విషయములలో "అధికారములో నున్న మంత్రులు తమ అధికారములను దుర్వినియోగ పఱచిరి. చేయరాని తప్పులను చేసిరని" శ్రీ ప్రకాశము పంతులుగారును, శ్రీ రంగాగారును చెప్పిరి. అవన్నియు నిజమనియే నమ్మెదము. కాని అట్టి ఎన్నికలతో వారుఎంతమాత్రము ప్రమేయముకలిగించుకొనరైరి. ఆ ఎన్నికలను బహిష్కరించి, వెంటనే ప్రజా పార్టీని స్థాపింపరైరి. ఎన్నికలలో పాల్గొనిరి. అధ్యక్ష పదవికై ఇద్దరి పేర్లను (శ్రీ ప్రకాశము - శ్రీ రంగాగార్ల పేర్లను) ప్రకటించిరి. ఎన్నికలో పోటీ చేసిరి. ఓడిపోయిన వెంటనే మంత్రివర్గము పైనను, అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన వారిపైనను దుమ్మెత్తిపోయుటకు ప్రారంభించిరి. క్రొత్తపార్టీని "ప్రజాపార్టీ" అను పేరుతో స్థాపించిరి. క్రొత్తపార్టీలను స్థాపించినంత మాత్రముననే, - క్రొత్తపేర్లను పెట్టుకొనినంత మాత్రముననె, వ్యక్తులు మారిరా? బుద్ధులు మారినవా? నైతిక బలమును సంపాదించుకొనిరా! కాంగ్రెసు పార్టీ నుండి తొలగినంత మాత్రముననె, శ్రీ ప్రకాశము పంతులుగారు మారలేదు. శ్రీ రంగాగారు, రంగాగారుగానే ఉన్నారు. వారిలో మార్పేమియు రాలేదు. క్రొత్తపార్టీ అని పేరు పెట్టినంత మాత్రముననె, ప్రజలెల్లరు మోసపోయి ఆ పార్టీని వరించెదరనియు, ప్రోత్సహించెదరనియు తలచుట పొరబాటు.

ఆక్రోశమువల్ల శ్రీ రంగాగారు కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యత్వమునకు రాజీనామా యొసగిరి. కాంగ్రెసు అధ్యక్షులైన టాండన్‌గారు శ్రీ రంగాగారిని స్వయముగా పిలిపించుకొని చెవిలో నేమో ఊదిరి. అది రహస్యము. వెంటనే వారిమనస్సును మార్చెను. ఆచార్యకృపాలనీగారు తమ క్రొత్తపార్టీ భవిష్యత్తును చర్చించుటకై పాట్నాలో సమావేశ పఱచిన సభకు శ్రీయుతులు జయ ప్రకాశనారాయణ, ప్రకాశముపంతులు, రంగాజీగార్లు హాజరైరి. శ్రీప్రకాశము పంతులుగారు ఆ సభలో జోక్యము కలిగించుకొని నూతన పార్టీ నిర్మాణమును బలపఱచుచు, దీర్ఘోపన్యాస మొసగిరి. శ్రీరంగాగారు ఏలాటి జోక్యమును కలిగించుకొనరైరి. మాట్లాడుటకు అవకాశము కలిగిన సభలో నోరే తెరువరైరి. శ్రీ టాండన్ గారు చెవిలో ఊదిన గాలియొక్క ఫలితము. ఆ సభలోనే శ్రీ ప్రకాశము పంతులుగారి చెయ్యిని విడిచిపెట్టిరి. విజయవాడలో జరిగిన సభలో పూర్తిగా తేలిపోయిరి. ప్రజాపార్టీ నుండి చీలిపోయినట్లేనను భావము ఎల్లరికిని శ్రీ రంగాగారు కలుగజేసిరి.

కాని రాజకీయరంగములో ఎంతో అనుభవమున్న దిట్టలకన్న దిట్టలని భావించు శ్రీ రంగా

గారు ఒక్క సత్యమును గ్రహింపరైరి. శ్రీ ప్రకాశము పంతులుగారు కీర్తిశాలి. తెలిసిన శత్రువు. ఆచార్యకృపాలనీగారు తెలిసిన బహిరంగశత్రువు. మంచిని మంచిఅని, చెడ్డను చెడ్డఅని బహిరంగముగ ఘోషింపగల మనోధైర్యము, నైతిక బలము కలవారు. వీరిలో కుట్రబుద్ధి, లోలోపల గుసగుసలు లేవు. కాని వీరిని ప్రజలు బాగా అర్థము చేసుకొనగలరు. అధికారములో నున్నవారు బాగుగ అర్థము చేసుకొనగలరు. శ్రీ రంగాగారు అట్టివారు కారు. అంతా లోలోపలనే రహస్యముగ నుండును. రహస్యముగ జరుగును. ఇట్టి రహస్య వ్యక్తులకగనే ప్రతి వారికిని భీతి. ప్రతి పార్టికిని భీతి. తాము లేని కాంగ్రెసు వర్కింగు కమిటీ కాని, కాంగ్రెసు పార్టీగానీ, ప్రజా పార్టిగాని బాగుగ పని చేయగలవను సత్యమును శ్రీ రంగాగారు ఇంతవఱకును గమనింప కుండుటయే విషాదము.

కాంగ్రెసు డెమోక్రాటిక్ సంస్థ. అందులో ఎట్టివారు చేరుదుమన్నను వద్దని చెప్పుటకు కాంగ్రెసు నిర్మాణము ప్రకారము, ఎవ్వరికిని వీలు లేదు. కనుక శ్రీ రంగాగారు, శ్రీ ప్రకాశము పంతులుగారి నాయకత్వమును, ప్రజాపార్టిని వదలుకొని, ఇచ్చిన రాజీనామాను ఉపసంహరించుకొని ముందు మరల కాంగ్రెసులో చేరిన చేరవచ్చును. కానివీరు కాంగ్రెసులో లేనందువలన లోపము కలిగినదని కాని లేక మరలా చేరుటవల్ల కాంగ్రెసు బలపడునని కాని తలచు వెఱ్ఱి ప్రజలెవ్వరుండబోరు. వారు లేని ప్రజాపార్టి బాగుగ పనిచేయుననియే ప్రజలు తలంచు చున్నారు. పార్టి పేర్లను చూచి ఎన్నికలలో ఓట్లనిచ్చు కాలము పోయినది. పార్టిలో చేరిన వ్యక్తులు ఎట్టి వారని యోచించు కాలము వచ్చినది. ఓటర్లు ఎల్లరు జాగ్రత్తగనే యున్నారు.

---

"దేశములో బ్రహ్మాండమైన ఎన్నికలకు సన్నాహములు చేసుకొంటున్న మనము శాంతి కన్నను మరి దేన్ని వాంఛించడము; అదీకాక పాకిస్థానుతో మన సంబంధములు ఉండవలెనన్న మాటకూడనిజమే. ఇందుకు మనము ఎన్నివిధాల ప్రయత్నములు చెయనచ్చునో, అన్ని విధముల ప్రయత్నము చేసినాము. ఈ ప్రయత్నములు పాకిస్థాన్ జీహాద్ కొనసాగిస్తూనే ప్రత్యుత్తరము ఇచ్చుచున్నది. పాకిస్థాన్ నాయకులు, పాకిస్థాన్ పత్రికలు, పాకిస్థాన్ మంత్రులు యుద్ధమును గూర్చి మాట్లాడుతూ వుండగ, తగుదునమ్మా అని పాకిస్థాను ప్రధాని, శాంతిని గురించి, స్నేహ సంబంధములను గుఱించి ప్రస్తావించడము మంత్రులు యుద్ధమును గూర్చి మాట్లాడుతూ వుండగా, అందుకు కావలసిన ప్రయత్నాలు అన్ని అచ్చట జరుగుతూవుండగా; పాకిస్తాన్ ప్రధాని తగదునమ్మా అని శాంతి పాఠాలను వల్లించడము విచిత్రము అనిపిస్తుంది.

లియాకతాలీ కాశ్మీరును గూర్చిన ప్రసక్తికూడ కొంత తెచ్చిరి. కాశ్మీరులో పాకిస్తాన్ దురాక్రమణకు దిగినదని, కాశ్మీరులో కొంత భాగములో ఇంకా తన సైన్యాలు ఉన్నవని, కాశ్మీర్ ఇండియాలో ఒక భాగమని, ఇవన్నియు మరిచిపోయి, ఆయన అటుల మాట్లాడుతున్నారు. కాశ్మీరులో పాకిస్తాన్ నడతను ఏ శాస్త్రము సమర్థించునో, ఏ ధర్మ సూత్రము రక్షించునో నేను ఇంకా నేర్చుకొనవలసి యున్నది. ఇది ఇట్లుండగా, పాకిస్తాన్ సైన్యములు ఇండియా మీద దాడు చేయుచున్నవి. ఇదే లియాఖత్ శాంతి వాదము అయితే, ఇదే ఇరుగు పొరుగు దేశాలతో స్నేహ సంబంధములను పెంచుకోడానికి మార్గము అయితే అయనకు, ఆయన మార్గాలకు గూడా ఒక్క నమస్కారము. మన మార్గము అట్టిది కాదు. మనకు ఒకరి మీదకు దురాక్రమణకు దిగవలసిన పనిలేదు. కాని పాకిస్తాన్ ఇండియా ఏ భాగము మీదకు సైన్యాలను నడిపినా, మనశక్తినంతయు వినియోగించి, ఆ ప్రయత్నములను అరికట్టి తీరుతాము.

—శ్రీ జవహరిలాలు గారు, బెంగుళూరు, జూలై 16.

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి)

[గత సంచిక తర్వాత]

## (3)

[చంద్రశేఖర, శ్యామలరావులు వాహ్యాళి వెడలి, తిరిగి వచ్చునపుడు జానకీ, రుక్మిణులు కలిసికొనిరి. రుక్మిణి శ్యామలరావు చెల్లెలు. జానకి ఉపాధ్యాయుని కొమరిత. తొలిచూపులలోనే చంద్రశేఖర, జానకులకు పరస్పరము ప్రేమ జనించెను. శ్యామలరావు జానకిని ప్రేమించి, ఆమెను తనవైపునకు దిప్పుకొనుటకు తన చెల్లెలిద్వారా ప్రయత్నములు జేయుచుండెను. ముక్కోటి ఏకాదశి నాటి మహోత్సవమున జానకి దారితప్పి, జన సమూహమున చిక్కువడెను. విద్యార్థులు కొందఱు ఆమెను ముట్టడించి, అసభ్య చేతలకు గుఱిసేయబోవు సమయమున, చంద్రశేఖరుఁడు ఆకస్మికముగా వచ్చి తప్పించి, శ్యామలరావు సోదరి సాయంబున పన్ను పన్నాగము నుండి విముక్తిఁ జేసెను. ఈ సంఘటనముల వలన చంద్రశేఖర జానకులకు మఱింత ప్రేమ వృద్ధియయ్యెను. తరువాత ఈ ప్రకరణమున......]

సుందర నందనవన రామణీయతను ధిక్కరించు నట్లుండు ఉద్యానవన మధ్యమున నొక రేడియో యంత్రముఖమునుండి మధుర గానము వినబడుచుండెను. సూర్యుఁ డస్తగిరిశృంగము నెక్కుటఁ జేసి ఆ వనమునకు మఱింత శోభ సమకూరెను. బాటల కిరువైపుల గల పొదరిండ్లు హెచ్చుతగ్గులు లేక సమోన్నతమున విరాజిలుచుండెను. పూలతలు వికసిత పుష్ప సౌరభముల వెదజల్లుచు, నాసికా రంధ్రములకు విందుఁ గొలుపుచుండెను. ఆ వన రామణీయత శ్రమమును బాపి, మానవాళికి హాయిని, ఆనందమును కలిగించుచుండెను. ఆ సమయంబున ఉద్యానవన సోపానముల వాహ్యాళి జనుదెంచిన విలాస పురుషులును, స్త్రీలును ఆసీనులై యుండిరి. ఒకచో ప్రస్తుత రాజకీయములపై చర్చ తీవ్రముగా జరుగుచుండెను. ఒకఁడు కాంగ్రెసు నాయకులఁ దూలనాడుచు, అధికారము హస్తగతమైన వెనుక దేశసేవాపరతంత్రత వారియందు నశించిన దనియు, అధికారులు లంచగొండు లయిరనియు చెప్పుచుండెను. మఱియొకఁడు ఇవి యన్నియు, శిశువునకు బాలారిష్టముల వలె మొదటమొదట అనుభవము లేమి సంభవించెడునవి యనియు, కొంత అనుభవము గడించిన వెనుక పరిపాలన సక్రమ స్థితికి రాగలదనియు వాదించుచుండెను. వేరొకఁడు ప్రజాపార్టీ మాత్ర మేమేద్చునో చూతమనియు, అప్పుడే ఆంధ్ర ప్రజాపార్టీ నాయకులకు తీవ్ర భేదాభిప్రాయములు వచ్చుట శుభదాయకముగా దనియు సూచించుచుండెను. మఱియొక్కచోట సినిమాలను గుఱించి వ్యాఖ్యానము జరుగుచుండెను. నేఁటి సినిమాలు ప్రజాబాహుళ్యమును నీతి మార్గమున నడిపించుటకు ఉపయోగపడుట లేదనియు, చెడుదారులు ద్రొక్కఁజేయు వీని వలన లాభము లేదనియు, ఒకఁడు వాదించుచుండెను. మఱియొకఁడు సినిమా నటీనటులు నీచాతినీచమగు శృంగార ఘట్టముల తెరపైఁ జూపుట అసభ్యమని ఖండించుచుండెను.

ఇట్లు అచ్చటచట, చిన్నచిన్న ముఠాలుగా విద్యార్థులు, పిన్నలు, పెద్దలు కూర్చొని, కొందఱు వినోదములందును, కొందఱు ముచ్చటలందును కాలము గడుపుచుండ, ఏ యొక్కరితోను కలిసికొనక కొంత దవ్వున గల ఒక వేదికపై నొక యువకుఁడు నేదియో దీర్ఘముగా యోచించుచుండెను. ఒక్కొకపరి లేచి అటు నిటు పచారుచేయుచు, తనలో తానిట్లు తలపోయుచుండెను. "జానకి నన్ను హృదయపూర్వకముగా ప్రేమించుచున్నదని మొన్నటి సంఘటనము వలన తేలిపోయినది. ఈ కోరిక నాపై పెంచుకొనుటకు స్వతంత్రురాలు. కాని వివాహముపట్ల తలిదండ్రుల యాజ్ఞ శిరసావహింపవలదా? ఆమె తలిదండ్రులు వేరు కులమువాఁడనగు నాకు తమ కొమార్తె నిచ్చుట కలలోని వార్త. అట్లగుట నన్ను మనసార ప్రేమించుచున్న ఈ బాలికను త్రోసివేయుటొప్పునా?............ఏమియుఁ దోచుట లేదు. ధర్మసంకటముగా నున్నది. హృదయమున ఆమెను గూర్చిన చింత అప్పుడే బయలుదేరినది. ఆమెను మొదట చూచినపుడే, అన్యకాంతల తల్లులని భావించు నా హృదయము తిరుగుబాటొనర్చి ఆమెకు స్థాన మొసఁగినది. వలదని నిరోధముల మనసున స్థాపించుకొన ప్రయత్నించుకొలఁది ఆమెపైఁ గల ప్రేమ

పటుతరముగా వేధించుచున్నది. ఇక నేమి సేయుట!... ...... ప్రేమకు కులములు అడ్డుగా నుండుట ధర్మ విరోధము. మానవ సంఘమునకే ముప్పు. సృష్టికర్త యీప్సితమునకు గొడ్డలిపెట్టు. మానవ కల్పితములైన కులములు, వినిర్మల ప్రేమభాజనులగు యువతీ యువకులకు నాటంకము కాగూడదు. నన్నాపె ప్రేమించుచున్నది. నే నాపెను ప్రేమించుచున్నాను. కనుక ప్రాణముల యొడ్డి యైనను జానకిని నా యర్ధాంగిగాఁ జేసికొందును. ఇది చేకూరిననాడు ధర్మ విజయ మగును" అని నిశ్చయించుకొని సోపానముపై గూర్చుండెను. ఇంతవరకు చింతా సంకులమైన ఆతని చిత్తము వినిర్మలమై ముఖమున శాంతియుతమగు హృదయాహ్లాద వీచికలు తోచుచుండెను. ఇంతలో నొక యువకుఁ డరుదెంచి యతనిని కలుసుకొనెను. తరువాత వారిట్లు సంభాషింపఁ దొడగిరి.

ఆగంతుకుఁడు:—

"మిత్రమా! ఇంత త్వరగలో నేఁడు పార్కునకు వచ్చి నాడ వేల?"

పరిచితుఁడు:—

"అవును. మనసు కొంచము కించ పహించియుండుకతమున వచ్చితిని. కాని శ్యామలా! నీ వేల యింత త్వరితముగా వచ్చితివి?"

శ్యామ:—

'నీ కొఱకు మీ యింటఁ జూచితిని. నీవు పార్కు దెసఁ బోతివని విని యిటు వచ్చితిని.'

పరిచయుఁడు:—

'ఏమి యుదంతము దెచ్చితివి?'

శ్యామ:—

'యుదంత మున్నది. గొప్పదే. నేను మనసార ప్రేమించుచున్న జానకికి రేపు బహుళ దశమినాఁడు వివాహ మట. ఈ సంగతి విన్న నాకు కర్ణకఠోరముగా నున్నది.'

పరిచయుఁడని పై జెప్పఁబడిన వ్యక్తి చంద్రశేఖరుఁడని పాఠక మహాశయు లిదివరకే గ్రహించి యుందురు. శ్యామలరావు మూలమున జానకి వివాహ వార్త విని చంద్రశేఖరుఁడు భగ్నహృదయుఁ డయ్యెను. కాని హృదయమునందలి యారాటమును గనుపింపనీయక ఇట్లనెను. 'శ్యామలా! గత్యంతర మే మాలోచించితివి?'

శ్యామ:—

'ఏమియుఁ దోఁచుట లేదు. నీ వేదేని సలహా నొసంగుదు వేమో నని యిటకు వచ్చితిని.'

చంద్ర:—

'నా సలహా ఒక్కటియే. నీ వాపెను ప్రేమించినను, నిన్నాపె ప్రేమించుట లేదు. కనుక నాపె యీప్సితమున కెట్టి యాటంకములు కలుగనీయక యూరకుండుము.'

శ్యామ:—

'నన్నాపె ప్రేమింపనిది యదార్థమైనను, కాబోవు వరుని మాత్రము ప్రేమించుట లేదు. ఆపె మనస్సు మా యిరువురి మీఁదను గాక వేరొక్కనియందుఁ దవిలి యున్నది. నా సోదరి రుక్మిణి మూలమున నాతఁ డెవరో తెలిసికొన ప్రయత్నించితినిగాని, జానకి ఆ రహస్యమును వెలువరించుట లేదు.'

చంద్రశేఖరున కీ పల్కులు పరమానందమును గల్గించెను. నవయౌవన విరాజమాన శరీరయగు యువతి తన్ను ప్రేమించుచున్నదని విని యానందింపని మగవాడుండునా? ప్రజ్వలించిన హృదయంబున, శ్యాములు నిట్లు ప్రశ్నించెను. 'శ్యామలా! ఆపె యెవరిని ప్రేమించుచున్నను, తలిదండ్రులు వేరొకరి కిచ్చి వివాహ మొనర్ప నిశ్చయించినపుడు తానేమి సేయఁగలదు? పోనీ ఆతఁ డెవరో తెలిసికొన్న నీ కేమి ప్రయోజనము?'

శ్యామ:—

'చంద్రశేఖర్! ఆతఁ డెవరో తెలిసికొన్న ఈ వివాహమున కడ్డు పెట్టుట కుపాయాంతరము గలదు. నా మేన ప్రాణములున్నంత దనుక జానకిని వేరొకరు పెండ్లియాడుట చూచి సహింపఁ జాలను. ఆరు నూరుగానీ, నూరారు గానీ జానకిని నేనే పెండ్లియాడ వలెను.

ఈ నిశ్చయము చంద్రశేఖరునకు హృదయ విదారకముగా నుండినను, శ్యామలరావు ధైర్యవంతుఁడనియు, ధనవంతుఁడనియు, తాఁ బట్టిన కుందేటికి మూడే కాళ్లన్నట్లు చేకొనిన కార్యమును సాధింప శక్తిగలవాఁడనియు, ఈతని నుపయోగించి, వివాహము విఘ్న మొనర్చిన, తదుపరి జానకిని చేపట్టుట సులభమనియు నెంచి శ్యాములునితో నిట్లనెను. 'శ్యామలా! నీ నిశ్చయము కొనియాడ దగినది. నీ యీ కార్యమున నా చేతనైనంతవరకు నీకు సాయ మొనర్తును. కనుక కర్తవ్య మాలోచింతము.' ఈ వాక్యము శ్యాములునికి పరమానందము గల్గించెను. తాను పిడివాదమున ఘటికుఁడైనను, చంద్రశేఖరుని చురుకుతనము తోడుపడగల దనియు సంతసించి, 'చంద్రశేఖరా! నాకు పరమానంద మొదవుచున్నది. నీవు సాయపడు నెడల నేను జానకిని చేపట్టఁ గలను.'

చంద్ర:—

'ఈ నీ యానందము పునాదులు లేనిది. ఆ జవరాలి వివాహము నాపిననే గాని కార్యము సఫలీకృతము కానేరదు. ఏ విధముగ సాధించుట యనునది చింతవ్యము.'

శ్యామ:—

అందులకు కావలసిన ధన వ్యయమున కేను పూనుకొందును.

( మిగత 15_వ పేజిలో )

# ప్రజాభిప్రాయ వేదిక

## భూములను అమ్ముకునే హక్కుపై నిర్బంధము.

— * —

ఆర్యా,

ఇండియా రాజ్యాంగ శాసనములోని 19 (1) సెక్షను ప్రకారము ఆస్తిని సంపాదించుకొనుటకును, యనుభవించుకొనుటకును, యిష్టము వచ్చినట్లు అమ్ముకొనుటకును ప్రతి మానవునికి హక్కు కలిగించినారు. రాజ్యాంగ శాసనము (Constitution) లో హక్కు కలిగించినంత మాత్రాన దానిని ఈ కాంగ్రెసు ప్రభుత్వములు గౌరవించెదరనే హామి యెంత మాత్రము లేదు. ఏ దినము బుద్ధి పుట్టితే ఆదినము కాన్‌స్టిట్యూషనునే తల్లక్రిందుల మార్చివేయగలరు. ప్రాథమిక హక్కులని చెప్పే వానిని మంట గలపగలరు. చెన్నరాష్ట్ర ప్రభుత్వము వారు యేర్పాటు చేసిన భూమి సంస్కరణ సంఘమువారు (Land Reforms Committee) తమ శిఫార్సులలోని 25 పేరాలో, భూములను స్వయముగ సేద్యము చేసుకునే వారికి తప్ప యింకెవ్వరికిని భూములను యితరుల కెవ్వరికిని విక్రయింపరాదు. అట్లు విక్రయించుట నిషేధింపవలెనని తెలిపి యున్నారు.

పంజాబు రాష్ట్రములో కూడ 1901 సం॥ యిట్టి శాసనము చేయబడి యుండెను. దానిని "పంజాబు లాండ్ ఎలియినేషన్ చట్టము (Punjab Land Alienation Act Of 1901) యని చెప్పెదరు. వ్యవసాయ దారులు కానివారికి భూములను విక్రయించుట పనికిరాదని నిషేధింప బడినది. కాని ఇండియా రాజ్యాంగ శాసనములో 14, 15 (1) సెక్షనుల ప్రకారము న్యాయ సమత్వము, న్యాయ పరిపాలనలో సర్వులకు సమమైన రక్షణ యివ్వ బడునని తెలుప బడినది.

పై తెలిపిన సెక్షనుల ననుసరించియు, 19 (1) ఎఫ్–సెక్షను ననుసరించియు యిప్పటికి 50 సంవత్సరములుగ పంజాబులో అమలులోనున్న లాండు ఎలియనేషన్ చట్టము, క్రొత్త రాజ్యాంగ శాసనము ప్రకారము చెల్లనేరదని యిటీవలనే ఇండియా యూనియన్ ఆధ్యక్షులు రద్దు కావించుచు ఉత్తరువు చేసిరి. చెన్నరాష్ట్ర మంత్రులుకూడ ఈ ముఖ్యమైన విషయమును గమనించి, సుబ్రహ్మణ్యము కమిటీ వారు సూచించినట్లు భూములను విక్రయించుకొనే విషయములలో నిర్బంధములు కలుగ జేయకుండ వలెనని కోరుచున్నాము.

ట్రిప్లికేను. బి. రామమూర్తి.

---

(2)

## రేషనింగు ఆఫీసులలో దౌర్జన్యములు.

---

ఆర్యా,

రేషనింగు ఆఫీసులని సర్కారు వారు పెట్టివా పెట్టినారు. కాని యిక్కడ జరిగే హడాబడులు, దౌర్జన్యాలు మరి యెక్కడా జరుగుట లేదు. ఇక్కడ చేరే ఉద్యోగులంతా స్కూలు ఫయినల్ చదివీ, చదువనివారు. "నిర్భాగ్యునికి అధికారమిచ్చిన అర్ధరాత్రి గొడుగు పట్టుమ"ను సామెత తెలుగులో నున్నదికదా? ఆ సామెత ప్రకారము తెలివితేటలు, చదువు యెక్కువగా లేనివారికి ఉద్యోగములు లభించుట తోడనే, తమ దగ్గరికి రేషన్ కార్డులకు వచ్చే ప్రజలంతా వాండ్ల నౌకర్లని, తామే వారిపై యధికారులని భావించుచున్నారు. ప్రజలకు సేవకులము కదా అనే భావమే రేషనింగు కచ్చేరిలలో పనిచేసే ఉద్యోగులకు తట్టుటలేదు. టెంపరరీ రేషన్ కార్డులకు పర్మనెంటు రేషన్ కార్డులకు ఆ యాఫీసులకు పోతే—రేషన్ కార్డులు యివ్వకుంటే ప్రజలు అన్నములేక బాధ పడుతారనే యోచన లేకుండ రేపురా, మాపురా అని యంటారు. వారముల కొద్ది జరుపుతారు. మీ యింటికి వచ్చి యింట్లోఉండే వారి సంఖ్యను తనిఖీ చేయవలె నంటారు. త్వరగా రారు. రేషనింగు ఆఫీసుకు పొయ్యే ప్రతివారు అన్నాతురులై పోతారు. అట్టి వారికి మొట్ట మొదట టెంపరరీ కార్డో, లేక యింకేదో యిచ్చి వారి పై విలాసమంత వ్రాసుకొని, తర్వాత విచారణ ప్రారంభించుతే బాగుంటుంది కదా? విచారణలో లోపాలు కలుగుతే వెంటనే ప్రాసిక్యూషన్ చేయండి. అది లేక ప్రజలను ఊరక త్రిప్పుతూ వుంటే వారికి విసుకెత్తు తుంది. అన్నములేక అలమటించుతారు. చదువు వచ్చినవాండ్లు, పెద్దవారు అనే వాండ్లు పోతే రేషనింగు ఆఫీసులో పనులు త్వరగ జరుగును. చదువు రానివారు బీదవారికి వచ్చే కష్టములంతా యిట్టివే. కనుక రేషనింగుఆఫీసుకు రేషనింగు కార్డులకు పొయ్యే వారికి ఆలస్యముగా కార్డులు ఇచ్చినారంటే—దానికి యే గుమాస్తాలు బాధ్యులో వారిని పనిలోనుండి తొలగించుతామని మంత్రులు కఠినముగా వుత్తరువు చేసినకాని, రేషనింగు కచ్చేరిలలో పనిచేసే వుద్యోగులకు క్రింది చూపులు రావు. బీదవారి తట్టు చూడరు.

గుత్తి. డి. విశ్వనాథము.

# రాబోవు జనరల్ ఎన్నికలు - కాంగ్రెసు ప్రచారము.

( శ్రీ యస్. వెంకటాద్రి గారు, ఎం. ఏ., )

పద్నాలుగుకాదు, వేలుకాదు, లక్షలుకాదు. 17,50,00,000 మంది భారతీయులకు రాబోయే అక్టోబరు – డిశంబరు యెన్నికలలో వోటుచేయు యధికారము లభించినది. దేశము చిన్నదికాదు. ఒక ఖండమునకు సమానమైనది. శ్రీ మోహన్‌లాలు గౌతమగారు అ॥ భా॥ కా॥ కమిటీ కార్యదర్శియని అందరికి తెలిసియుండ వచ్చును. ఏ విధముగ రాబోవు ఎన్నికలలో ప్రచారము యెట్లు సాగించవలెనను విషయముపై సూచనలు చేస్తూ, రాష్ట్రకాంగ్రెసు సంఘములకును, జిల్లాకాంగ్రెసు కమిటీలకును, శ్రీ మోహనలాల్ గౌతమగారు యిప్పటి కప్పుడే ఉత్తరువులను పంపినారు. ప్రతినియోజక ప్రదేశమును(Constituency) వివిధ భాగములుగ విభజించి, వొక్కొక్క భాగమును సమర్థులైన ఎన్నికల కమిటీవారికి వొప్పగింపమన్నారు. వారము వారము గ్రామములలోను, పట్టణములలోను, వార్డులలోను టీపార్టి సభలు పెట్టవలెను. స్త్రీల సంఘములు, యువకుల సంఘములు యేర్పాటు చేయవలెను. కాంగ్రెసు వారితోను, కాంగ్రెసుపై అభిమానముండే వారితోను, యెక్కువ సంబంధము పెట్టుకొనవలెను. కాంగ్రెసు ఎన్నికల సభలలో ఏమి మాట్లాడవలసినది, చర్చలు యేవిధముగ జరుపవలసినది కాంగ్రెసు ప్రచారకులెల్లరు ముందుగనే తయారుచేసుకొని, క్రమపద్ధతిపై ప్రచారము సాగింపవలెను. దేశములోవుండే అవకాశాల నన్నిటిని కూడ గట్టుకొని, ప్రజల జీవిత పరిమాణమును ఏ విధముగ హెచ్చుచేయుటకును, విరివిగ నిర్మాణకార్యక్రమమును సాగించుటకు కాంగ్రెసు యెట్లు పనిచేయ తలపెట్టినదో దానినంతా ఓటర్లకు బాగా చిన్న నయమైన మాటలతో నచ్చచెప్పవలెను. సామాన్య ప్రజలలో నుద్రేకములు కలిగే ఉపన్యాసము చేయుటకాని, కేకలు వేయుటకాని మానవలెనని"నని తెలిపి యున్నారు.

ఇదంతా బాగా వున్నది. ఓటర్లు అనేవారున్నారు, వారితోడు బాటులేకుంటే యెన్నికలలో జయించేది కష్టమనే విషయము ఇప్పుడిప్పుడే కాంగ్రెసువారు తెలుసుకొన్నటుల తోచుచున్నది. ఇప్పుడే కండ్లు తెఱచు చున్నారు,

కాంగ్రెసుకు చెప్పుకోతగిన స్వచ్ఛంద సేవకులు (Volunteers) లేరు. ఈ విషయమై ఎవ్వరు పొరబాటు పడవద్దు. గాంధిజీ తన జీవిత కాలములో కొన్ని ఆదర్శములను ముందిడుకొని, వానిని తాను స్వయముగా కార్యరూపములో పెట్టి, ప్రజలనుకూడ ఆ విధముగ నడుచుకొండని ప్రభోధించు చుండెను. అట్టి ప్రభోధములు యువకుల నెల్ల గాంధీజీవైపు లాగుకొను చుండెను. ఇప్పుడు కాంగ్రెసు సంస్థలో మహానాయకులని, నాయకులని చెప్పుకొనే వారిలో ఆదర్శాలే లేవు. ఇతరులకు చెప్పేటట్టు తమంతకు తాము నడుచుకొనే నాయకులే కాంగ్రెసులో కానరారు. అందువల్ల ఏ కాంగ్రెసు నాయకుడు కాని, యువకులను తనవైపు లాగుకొల జాలకున్నాడు. ఈ విషయము యెవ్వరు మరవవద్దు.

తలవని తలంపుగ కాంగ్రెసు పార్టీకి దేశ పరిపాలనా యధికారము చే చిక్కడము జరిగినది. పోటీగ ఉండే పార్టి వొకటి లేకపోవడము కూడ తటస్థించినది. అధికారము చెయ్యి చిక్కినదికదా అనే ధోరణిలో పడి, కాంగ్రెసుసంస్థ నిర్మాణము

నే మరచిరి. గాంధీజీ నొక్కి చెప్పుతూ వుండిన నిర్మాణ కార్యక్రమాన్ని బొత్తిగా వదలుకొనిరి. కాంగ్రెసు నాయకులని చెప్పుకునే పెద్దలంతా అధికార పదవులు, గౌరవ పదవులు అని చెప్పబడు రొట్టెలకు, చేపలకు ఆశించిరి. పల్లెటూర్లను వదలి పట్టణములు చేరుకొనిరి. పదవుల సంపాదనలోను, పర్మిట్లు సంపాదనలోను ఒకరితో నొకరికి పోటీ జరిగి, కాంగ్రెసు నాయకుల మధ్యనే తగవులు, స్పర్థలు బయలుదేరెను. కాంగ్రెసు వర్కర్లకు కూడ ఈ మార్గములో పొమ్మని చెప్పె దాతలే లేరైరి. వారుకూడ వారినాయకుల యడుగు జాడలలోనే నడుచుటకు ప్రారంభించిరి. దీని ఫలితముగ గ్రామములలో నేమి, పట్టణములలో నేమి కాంగ్రెసు సంస్థలనునవి పేరుకు కూడ లేక పోయెను.

ఇంతటితో ముగిసినిదా? ముగియలేదు. కాంగ్రెసు వారు దేశసేవా నిరతిని మానుకొనుట వల్ల ప్రజలతో వారికుండిన సంబంధము తెగిపోయెను. అవినీతి, లంచగొండితనము వారిలో ప్రబలి పోయెను. దీనినంతయు, దగ్గఱనుండి ప్రజలు తెలుసుకొనిరి. ప్రజల విశ్వాసమును పోగొట్టుకొనిరి. కాంగ్రెసుకు క్షీణదశ ప్రారంభమాయెను.

కాంగ్రెసు ప్రభుత్వములు అనుసరించుచున్న విధానములతో కాంగ్రెసు సంస్థకు జోక్యమున్నదో లేదో తెలియదు. మంత్రులు అనుసరించుచున్న విధానములతో ఏలాటి సంబంధము లేదని కాంగ్రెసు సంస్థలు చెప్పజాలవు. చెప్పుటకు వీలు లేదు. కనుక అధికారము చెలాయించుచుండు మంత్రులు చేయుచున్న కార్యములను గురించి ఓటర్లు వేయు ప్రశ్నలకు కాంగ్రెసు ప్రచారకులు సరియైన ప్రత్యుత్తరములను చెప్పజాలరు. దేశానికి స్వతంత్రము వచ్చిన వెంటనే ప్రభుత్వము వారు ఎదుర్కొన వలసివచ్చిన కష్టములను చులకన చేయుట యెవ్వరికీ ఇష్టములేదు. కాని అవి చేసినాము, ఇవి చేసినామని చెప్పుచు, చేయవలసిన ముఖ్యమైన కార్యములను చేయజాలక పోవుట వలన ఏ ఓటరుకాని మంత్రులను క్షమింప జాలడు. నిత్య జీవితములలో స్త్రీలు, పురుషులు పడుచుండే కష్టములు దేవునికే యెరుక. సామాన్య ప్రజలెల్లరు కాంగ్రెసు పేరు చెప్పుతూనే మండిపడేటంత కోపముతో వున్నారు. భరింపరాని హీనాతిహీనమైన జీవితాలను ఈ కాంగ్రెసు ప్రభుత్వాలక్రింద గడుపుచున్నారు. కాశ్మీర సమస్య ఎట్లపోతేనేమి? దక్షిణాఫ్రికాలో భారతీయులు ఎట్లా కష్టపడితే నేమి? విదేశాంగ విధానములో యేవిధముగ ప్రవర్తించుతే నేమి? దేశములో మాన సంరక్షణకు కట్టుకునేందుకు సరియైన ధరలకు గుడ్డలు లేవు. ఒక్కపూట కడుపునిండ తినుట కన్నము లేదు. ప్రజలు అనుభవించుచుండే కష్టములను, మంత్రుల పై ఆరోపణలను యెంతో యెక్కువగ వ్రాయవచ్చును. మంత్రులుకాని లేక కాంగ్రెసు ప్రచారమునకై పొయ్యేవారు కాని తృప్తికరమగు సంజాయిషీలను చెప్పజాలరు. అందుచేతనే చాలా మంది కాంగ్రెసునుండి వదలుకుంటూ వున్నారు.

ఇన్నాళ్లు కాంగ్రెసు సంస్థ విదేశీయుల పరిపాలనమును యెదిరించుచు, బెదిరించుచు, ప్రాముఖ్యములోనికి వచ్చినది. ఇదివరకు జరిగిన ఎన్నికలలో కూడ పరాయి ప్రభుత్వమునకు అడంగా నిలుచువారికిని – ప్రభుత్వ వ్యతిరేకులకును ఎన్నికలలో పోటీలు జరుగుచుండినవి. ఇప్పుడు అట్టి పరిసితి పోయినది. కాంగ్రెసు సంస్థలోనే పనిచేయుచు, దాని గుట్టులు తెలిసిన సహచరులతోనే, దేశీయులతోనే ఎన్నికలలో కాంగ్రెసు పోటీ చేయవలసిన అవసర మేర్పడినది. కాంగ్రెసు పరిపాలన క్రింద ప్రతివానికి విసుగు పుట్టె విషయములలో ఉద్యోగుల దౌర్జన్యాలు ఎక్కువ. తెల్లవారి దొరతనము రోజులకన్న తెల్ల టోపీలు పెట్టుకొనే కాంగ్రెసువారి దొరతనము రోజులలో అవి జాస్తియైనవి. పోలీసువారు, సర్కారు ఉద్యో

(మిగత 11-వ పేజీలో)

# అరిషడ్వర్గము

(శ్రీ పి. వి. సుబ్బయ్యగారు.)

(గత సంచిక తర్వాత.)

అరవిందుడు:— ఈయన ఆశ్రమమున కట్టుపని, ఇంజనీరింగు పని, పాదరక్షలు కుట్టుపని, రొట్టెలు చేయుపని, వ్యవసాయము, గ్రంధరచనము, అచ్చుపని యిత్యాది బహువిధ కర్మకలాపములు నెఱవేఱుచున్నవి. ఇట్టివృత్తుల స్వీకరించియు, ఆశ్రమ వాసులగు శిష్యులు సర్వదా ఆత్మ పరిజ్ఞాన పరిశోధకులుగా నుందురు. మనస్సును, బుద్ధినేకాక శరీరమునుగూడ ఆరోగ్య స్థితియందుంచుకొని, కర్మజాలములయందు మునిగియున్నను, మనస్సునందు ప్రవేశింపనీయక నీటియందు చరించు హంస విధంబున నుండవలెననుట అరవిందుల ఆశయము. ఆతని వాక్యము వినుఁడు. "దేశకాలాతీతమైన దశయందు జగము మిథ్య. కాని మనము దేశకాలాతీతులము కాము. మనము జగమును మిథ్య యనుట కధికారులము కాము. దేశకాలముల యందు జగము మిథ్యయు గాదు. జగము సత్యము. ఎప్పుడు దేశకాలముల కతీతులమై బ్రహ్మమునందు విలీనమగుటకు సమయమాసన్నమగునో అపుడు జగమును మిథ్యయన గల్గుదుము. అనధికారులమై పల్కినచో, మిథ్యా భారమగును. ధర్మమునకు విపరీతగతి వాటిల్లును. మనవిషయమున బ్రహ్మము సత్యము. జగము మిథ్య అనుటకంటె బ్రహ్మము సత్యము. జగము బ్రహ్మము అనుట ఉచితము" (శ్రీ అరవింద వ్యాసావళి.)

స్వామి శివానంద సరస్వతి:— ఈయన బాహ్యమునకు, ప్రపంచములో నొక్కఁడుగ చూపట్టును; కాని ప్రపంచమునకు సంబంధించిన వాడు గాడు. సత్యాన్వేషణమున ప్రపంచ ప్రజలకు చేయూత నొసఁగుటయే ఈతని ఆశయము. గ్రంధ కోటుల రచించి ప్రపంచమున కందజేయుచున్నాఁడు. ఆత్మవిజ్ఞానమును గుఱించి యెంతగా మాట్లాడునో, శరీరము శరీరపోషణ విధానములను గుఱించి అంతగా మాట్లాడును. భగవంతుని సర్వ జీవరాసులను అద్దమునందువలె దర్శింపగల నేటి తత్వవిశారదుఁడు. ఈయన రచనలు "భారత జ్యోతి" పత్రికాముఖమున కొన్ని వెలువడుచున్నవి. చూడనగును.

పై వివరించిన మహనీయుల జీవితములందు అరిషడ్వర్గమునకు పాలన లేదు. వారి జీవితములు ధన్యములు. వాని నాదర్శముగాఁగొని మన జీవితముల దిద్దుకొందుము గాక. నిష్కామ యోగులమని దంభములు పల్కుచు, చాటున దుష్కార్యముల నొనర్చి, పట్టువడినపుడు, "మేము వేదాంతులము. మాకవి యంటవు. తాటస్థ్యమగుట చేయక తప్పినది గావు. బురదయందలి కుమ్మరపుర్వు విధంబున మేము చరింతుము" అని ప్రపంచమును వచింపకుందుము గాక. (సమాప్తము)

## విజ్ఞాన విశేషములు.

### నీరు–గాలి: ఇవి మాత్రమే ఆహారము.

మిసెస్ బర్బరా మూరి పటాలివా అను స్త్రీకి ఇప్పుడు 50 సం॥ వయస్సు. 30 సం॥ యువతి మాదిరి కనిపించును. కేవలము నీటిపైనను, గాలిపైనను ఆధారపడి 150 సంవత్సరములు జీవింపగలనని ఆమె నమ్మకము. గాలి, సూర్య రశ్మి, అప్పుడప్పుడు ఒక లోటా నీరు త్రాగడమే ఆమె ఆహారము. ఇతర మేమియు తినదు.

ఇరువది సంవత్సరములకు ముందు ఈమె మామూలుగా మూడు మారులు భోజనము చేయుచుండెను. క్రమ క్రమముగ 12 సంవత్సరములుగ ఆహారము తగ్గించుచు వచ్చినది. గడ్డి మొదలైన ఆహారము ఒక్క పూటనే తినుచు, అప్పుడప్పుడు నీరు త్రాగుచు జీవింపగల స్థితికి వచ్చెను. ౬ సంవత్సరముల క్రిందట టొమాటో పండ్ల రసమును, ఆరంజి పండ్లరసమును, గడ్డి రసమును, మూలికల రసమును తన ఆహారముగ ఒనర్చుకొనెను. ఇప్పుడు వీని నన్నిటిని మాని వేసినది. నీటిలో నిమ్మ పండ్లరసమును కొంచెముగ పిండుకొని మాత్రమే త్రాగును. శాస్త్రీయమైన పరికరముల ద్వారా సూర్యుని వెలుతురులోను, గాలిలోను ఉన్న ఆహార పదార్థమును చూచుటకు వీలగును. ఆ యాహార పదార్థమును తీసుకొని సూర్యుని వేడిలో దానిని ఆహారముగ మార్చుకొని ఉపయోగించుకొనుచున్నాను అని చెప్పుచుండును.

శేషనింగు 11 సం॥ క్రిందట ప్రారంభమైనను, ఆమె ఒక్కసారి కూడ ఆహార పదార్థములను తీసికొనలేదు. ఆహారము తీసికొనలేదని ఋజువు చూపుటకు ఆమె రేషనింగు పుస్తకములో ప్రతిపుటలోను "రేషన్ రద్దు" "రేషన్ రద్దు" అని స్టాంపులు వేయబడినవి. పరిశుభ్రమైన గాలికొఱకు ప్రతి సంవత్సరము స్విజర్లాండునకు పోవును. నదులలో పారుచుండు నీటిని త్రాగి, కొండల నెక్కుచుండును.

దేహములోనుండు చిన్న చిన్న రంధ్రములు, రక్తము, పూర్తిగా మార్పు చెందినదనియు, వేడిమి, చలి, ఆకలి, అలసట, వ్యాధులు తన్ను బాధింపజాలకున్నవనియు ఆమె చెప్పును. 'చలికాలములో కాని, ఎండాకాలములో కాని, సాధారణమైన జంపరు, మరలు వేసుకొందును. స్విజర్లాండులో ప్రజలు ఉన్ని గుడ్డలను వేసుకొని కూడ చలికి వణకుచు, నన్నుచూచి ఆశ్చర్య పడుదురు. చలికాలములో నాకు వేడిగా నుండును' అని ఆమె చెప్పును.

"పురుషులకున్నంత బలమున్నది. విశ్రాంతికై నాలుగైదు గంటల నిద్ర అవసరము. విష సంబంధమైన ధాతువులు నా దేహములో లేనందున నాకు రోగములంటవు. ఆహారమును చూచుటకు సహింపలేను. అందమైన పండు కనపడినచో తినవలెనని ఇచ్ఛ కలుగు"నని ఆమె చెప్పును.

("ఆ॥ బ॥ పత్రిక")

---

### పిల్లల క్షయ వ్యాధికి స్ట్రెప్టోమైసిన్ దివ్యౌషధం.

స్ట్రెప్టోమైసిన్ 12 సంవత్సరాల లోపు బాల బాలికలకు వచ్చే క్షయవ్యాధి నివారణకు మంచి పని చేయునని అని బాస్టన్‌లోని ముగ్గురు డాక్టర్లు ప్రకటించిరి. మామూలు చికిత్సలతో నయముకాని 17 సంవత్సరాల లోపు వయస్సుగల 27 మంది క్షయరోగులకు ఈ మందు వాడి చూచితిమనీ, వారిలో 5 గురికి వ్యాధి పూర్తిగా పోయినదని, 18 మందికి కొంచెము గుణ మిచ్చినదని, ముగ్గురికి అసలు పని చేయలేదని, ఒక రోగికి మాత్రము ఈ వ్యాధి ఎక్కువైనదని, ఈ వైద్యులు చెప్పుచున్నారు. ఈ మందువల్ల వ్యాధి ఎక్కువైన రోగి, నెల 15 రోజుల శిశువు.

ఈ మందువల్ల ఎక్కువ గుణము కనిపించని ముగ్గురు రోగుల వయస్సు 12 సంవత్సరాలకు పైన ఉన్నది. 1½ సంవత్సరాలు, అంతకంటె తక్కువ వయస్సు వారికి, 12 సంవత్సరాల పై వారికీ వచ్చే క్షయ వ్యాధిలో తేడా వున్నదని ఈ డాక్టర్లు చెప్పుచున్నారు. ఈ వైద్య పరిశీలన యొక్క ఫలితాలు అమెరికన్ వైద్య సంఘము వారి పత్రికలో ఇటీవల ప్రకటింప బడినవి.

---

[రాబోవు జనరల్ ఎన్నికలు – కాంగ్రెసు ప్రచారము.]

[9–వ పేజీ తరువాత.]

గులు, కళ్లెములేని గుఱ్ఱములైనారు. వీరి కళ్లెములను బిగబట్టి, సరియైన మార్గమున నడిపించే నైతిక బలము, విజ్ఞానము కల మంత్రి పుంగవులే లేరైరి. తెల్ల దొరతనములో జరుగుచుండే మాదిరే పోలీసువారిని పొగిడే పద్ధతి, దుర్వ్యపద్ధతి కాంగ్రెసు మంత్రుల హయాములోకూడ కొనసాగుచున్నది. అక్కడ అది సాధించినాము, ఇక్కడ ఇది సాధించినామని బడాయి కొట్టుకొనుచున్న కాంగ్రెసు ప్రభుత్వముల క్రింద, జీవితావసరములైన కూటికి గుడ్డకు నలిగి, హతమై పోతూవున్న ఓటర్లు, యెట్లా మరలా కాంగ్రెసు పెట్టెలలోనే వోట్లు వేస్తారో తెలియదు. ఏ ముఖము పెట్టుకొని, కాంగ్రెసు ప్రచారకులు ఓటు చేయమని కోరుతారో తెలియదు.

న్యాయస్థాన తీర్పులు:—

# స్త్రీ వ్యభిచరించిన శిక్షింప బడదు.

ఇండియా రాజ్యాంగ చట్టము 14-వ సూత్రములో "ఇండియా దేశ సరిహద్దులలో న్యాయచట్టముల దృష్టిలో ప్రతి పౌరునికి ప్రభుత్వము లు సమానత్వము ఇవ్వవలెను. సమానమైన రక్షణ కూడ యివ్వవలెనని నిర్వచింప బడినది. 15 (1) సూత్రములో మతము, జాతి, కులము, స్థలము, స్త్రీ, పురుషులు, అను వానికి, ఏ ప్రభుత్వముకూడ ప్రాముఖ్యత యొసగి భేదము చూపరాదని నిర్వచించిరి.

ఇండియా శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడు) 497-వ సెక్షను వివాహమైన స్త్రీ, పరపురుషునితో వ్యభిచరించుట వలన, పరపురుషుడెంత దోషియో స్త్రీకూడ సమానమైన దోషియైనను, న్యాయస్థానములు స్త్రీని శిక్షింపరా"దని స్పష్టముగా నిర్వచించుచున్నది. ఇండియా రాజ్యాంగ చట్టములో 14-వ సూత్రము న్యాయచట్టముల యెదుట సర్వులకు సమానత్వమునే చూపవలెననియు, 15-వ సూత్రములో స్త్రీ, పురుష విభేదములను పాటింప కూడదనియు తెలిపియున్నందున, వివాహమైన స్త్రీ, పురుషునితో సమానముగ వ్యభిచార నేరమునకై ఏల శిక్షింపబడరాదను ప్రశ్న బొంబాయి హైకోర్టులో ఇటీవల చర్చకు వచ్చెను.

ఒక స్త్రీయొక్క భర్త జయిలులో నుండగ ఒకవ్యక్తి ఆతని భార్యతో వ్యభిచరించెను. నేరముక్రింద బొంబాయిసిటీపోలీసు కోర్టులో చార్జి పెట్టబడెను. ముద్దాయి తాను నిర్దోషియని తెలుపుకొనుచు, ఇండియారాజ్యాంగ చట్టములోని 14,15 సూత్రముల ప్రకారము ఇండియన్ పీనల్ కోడ్ లోని 497 సెక్షను స్త్రీలకు వర్తింప చేయ వలెననియు, అందువల్ల స్త్రీలుకూడ శిక్షార్హులా కాదా అను విషయమును తీర్మానింప వలెననియు బొంబాయి హైకోర్టుకు విజ్ఞాపన గావించుకొనెను.

బొంబాయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియు, న్యాయమూర్తి శ్రీగజేంద్రగడ్కర్ గారును, ఈ ముఖ్యాంశమును చర్చించుచు - 'పురుషులను మాత్రమే వ్యభిచార దోషమునకు శిక్షింపవలెనని శాసనసభ వారు చట్టము చేసియున్నందున ఆ శిక్ష పురుషులైన దోషుల కెల్లరిని వర్తించును కాని కొంతమంది పురుషులకు మాత్రమే వర్తించుట లేదు. కనుక ఇందులో సమానత్వము పాటింప బడుచున్న'దనిరి.

"హిందూ ధర్మశాస్త్ర కర్తయైన మనువున కన్నను, మహమ్మదీయ శాస్త్ర కర్తలకన్నను, ఇండియన్ పీనల్ కోడును తయారుచేసినవారు ఎక్కువ విజ్ఞానము కలవారు. దేశములో అప్పుడు ప్రబలిన సాంఘిక పరిస్థితులను గమనించి, భారతీయ స్త్రీలయెడ ప్రత్యేకమైన కారుణ్య దృష్టిని చూపి యున్నారు. ఇండియాలో బాల్యదశలోనే ఆడపిల్లలకు వివాహము జరుగును. ఒక స్త్రీ కన్న ఎక్కువమందిని వివాహము చేసుకొను ఆచారము పురుషులలో కలదు. కొంతమంది స్త్రీలను ఏకాంతములో పెట్టు వాడుక కూడ కలదు. అందువలన పురుషుల లాలనములకు స్త్రీలు లొంగుట కవకాశము లున్నవి. అందులకై ఇం|| పీ|| కో|| 497-వ సెక్షనులో విధించిన శిక్ష స్త్రీల కన్వయింపదు. స్త్రీలను మినహాయించుట న్యాయముగ నున్నది. పై అభిప్రాయముల ప్రకారము స్త్రీ, పురుషులను దృష్టితో భేదము చూపలేదని" బొంబాయి హైకోర్టు ప్రధానన్యాయమూర్తియు, న్యాయమూర్తి గజేంద్ర గడ్కర్ గారును ముద్దాయి గావించిన విజ్ఞాపనపై అభిప్రాయ మొసగి, ముద్దాయి పిటిషనును త్రోసి వేయుచు జూన్ నెల కడవారములో తీర్పు చెప్పిరి.

# కౌలుదార్లకు ప్రత్యేక రక్షణాలు.

## భూమి సంస్కరణల సంఘము వారి శిఫార్సులు

'స్వయముగా సాగు చేయకపోతే భూమి ఉండదు.'

చెన్నపట్టణము, జులై 1 : చెన్నరాష్ట్ర ప్రభుత్వము వారు నియమించిన భూమి సంస్కరణల నివేదికలోని కొన్ని ముఖ్యమైన శిఫార్సులను గత 'భారత జ్యోతి' సంచికలో ప్రకటింప బడినవి.

(శిఫార్సుల సారాంశము.)

రైతు సామ్యము ఈ రాష్ట్ర ప్రజల సాంప్రదాయమునకు అనుకూలముగా వున్నది. భూమి చిన్న చిన్న ఖండములుగ ఉండుటవల్ల నష్ట కష్టములున్నవి. ఇంకా భూమి చిన్న విభాగములు కాకుండుటకునూ, చిన్న చిన్న ఖండములను ఏకీకరణ చేయుటకునూ తగుచర్యలు తీసుకొని ఏదో ఒక రకమైన సహకార వ్యవస్థ క్రిందికి తీసికొని రావలెను.

ప్రస్తుతపు భూవసతికి గరిష్ట ప్రమాణము నిర్ణయించవలసిన అవసరముగాని గరిష్ట ప్రమాణమునకు మించిన భూమిని వశపరచుకొను అవసరముగాని లేదు.

ఐతే ఇకముందు ఏ వ్యక్తికీ రూ. 250 లకు మించి భూమి సిస్తు చెల్లించే భూమి ఉండరాదు. సమిష్టి కుటుంబాలకు వెయ్యి రూపాయల శిస్తు చెల్లించే భూమి ఉండుటకు అనుమతింప వచ్చును.

గరిష్ట ప్రమాణమునకు మించి భూమి కలిగి వుండుటకు అనుమతించ బడిన ఏ భూమి అయినా, నిర్ణీత తేదీకి పైన కొంత భూమిని విక్రయించే యెడల సదరు భూస్వామికి అవసరపు భూమి వుంచుకొనే అవకాశము రద్దు అగును. అయితే కొంత అమ్మిన తర్వాత భూవసతి గరిష్ట ప్రమాణము కన్న తగ్గినచో ఆ లోతక్కువను భూస్వామి భర్తీ చేసుకొన వచ్చును.

గరిష్ట ప్రమాణమునకు మించి భూములు సంపాదించిన, భూమిని పరిహారము లేకుండా తీసుకొన వలెను. లాండ్ ట్రిబ్యునల్ కేసులను విచారించి పరిష్కరించెదరు. ఈ కట్టుబాట్లు మత దాన ధర్మములకు, విద్యా సంస్థలకు, సహకార సంఘములకు వర్తించవు.

కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘము వారు సూచించిన గిట్టుబాటు, భూవసతి అనేది ఆచరణ యోగ్యము కాదనియు, ఆ విషయమై విచారణ జరిపించ నవసరము లేదు. అయితే కనీస భూమిని నిర్ణయించుటకు కొన్ని ఎంచ బడిన ఫిర్కాలలో పరిశీలన జరిపించవచ్చును. కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘము వారు అభిప్రాయ పడినట్లు కనీస వసతి నిర్ణయమునకు పూనుకొన నవసరము లేదు.

"రైతు" అనిన (1) స్వంతముగా కష్టపడి, పాటుపడే వ్యవసాయము చేయువారు. (2) కుటుంబము లోని వారిచేత వ్యవసాయము చేయించే వారు. (3) పంటలో వాటా లేకుండా కూలినాలి యిచ్చి వ్యవసాయము చేయించుకొనే వారని నిర్వచించుకో వచ్చునని సూచించిరి. ఆడవాళ్ళు, మైనర్లు, స్వంతముగా అజమాయిషీ చేసుకొనే శారీరక, మానసిక పరిస్థితి లేనివారు నౌకర్లకు కూలి యిచ్చి వ్యవసాయము చేయించుకున్నా, స్వంతముగా వ్యవసాయముచేయు రైతుల క్రిందికే వస్తారు. సమిష్టి కుటుంబములలో, కుటుంబములోని ఎవరు సాగు చేస్తూ వున్నా స్వంతముగా వ్యవసాయము చేస్తు వున్నట్టే ఎంచబడును.

జాయింటు స్టాకు కంపెనీలలో భాగస్వాములుగ చేరువారు, ధర్మ సంస్థలు, మత సంస్థలు, సహకార సంఘములను "రైతు" అనే నిర్వచనము నుండి మినహాయించ బడినారు.

పై నిర్వచనము క్రింద రైతులు కానివారికి అన్యాక్రాంతములను నిషేధించ వలెను. అయితే మూడు సంవత్సరముల లోగా స్వంత వ్యవసాయము చేసే షరత్తుమీద కలెక్టరు సర్టిఫికెట్‌తో భూమిని కొని రైతులు కావచ్చును.

వ్యవసాయ కూలీలు ఎప్పుడుపడితే అప్పుడు భూమి సంపాదించుకో వచ్చును. వ్యవసాయ కూలీ ఎవరో స్పష్టము చేయ వలెను.

గిట్టుబాటు, వసతి, ప్రమాణమునకు తగేలాగు విభాగముల చేయుచు, నిషేధించుటకూ, చిన్న చిన్న ఖండములను ఏకీకరణము చేయుటకు అవసరమగు శాసనమును చేయ వలెను.

ప్రభుత్వము సహకార వ్యవసాయాభివృద్ధి సంఘములను ప్రోత్సహించ వలెను. ప్రదర్శనములకు పరిశోధకులకు తప్ప "ప్రభుత్వ వ్యవసాయము" అనుసరించ తగినది కాదు. సమిష్టి వ్యవసాయము గురించి ఆలోచించ నవసరము లేదు. అయితే గ్రామము అంతా కలిసి మేము సమిష్టిగా వ్యవసాయము చేసుకుంటా మనిన ప్రోత్సాహ మివ్వవచ్చును. సహకార వ్యవసాయాభి వృద్ధి సంఘములతో పాటు సహకార సమిష్టి వ్యవసాయమును ప్రోత్సహింప వచ్చును.

కట్టుబడులు, కవులు గ్యారంటీ, మరమ్మత్తులు మొదలగు విషయాలకు సంబంధించిన షరత్తులకు లోబడి, భూస్వామికి కవులుదారీ విధానము వుంచవచ్చును.

"కౌలుదారు" అనగా, స్వంతముగా వ్యవసాయము చేయని వారికి చెందిన భూమిని సాగుచేసే వారని అర్థము. వారందార్లు, పరుంపట్టాదార్లు, కవులుదార్ల క్రిందికి వస్తారు.

రైతువారీ ఏరియాలలో కవులుదార్లకు జిరాయతీ హక్కు నివ్వ నవసరము లేదు.

స్వంత వ్యవసాయమునకు పరిమితి నిర్ణయించి వందున, భూములను కౌలుకు యిచ్చే భూస్వాములమీద సర్‌చార్జి వేయ నవసరము లేదు.

ప్రభుత్వము కట్టుబడులను శాసనము ద్వారా నిర్ణయించవలెను. కట్టుబడులను మొత్తము పంటమీద నిర్ణయించుట సరియైన పద్ధతి.

కట్టుబడుల గరిష్ట ప్రమాణములను శాసనము ద్వారా నిర్ణయించవలెను. తగాదా వచ్చినప్పుడు, ప్రభుత్వము వారు నియమించే ట్రిబ్యునల్ న్యాయమైన కట్టుబడిని నిర్ణయించెదరు.

పంటల ననుసరించి భూస్వామికి రైతుకు ఉండవలసిన కట్టుబడుల విభాగము గరిష్ట ప్రమాణము, ఈ దిగువరీతి నుండవలెను:—

1 వ తరగతి వసతిగల భూములకు— ధాన్యము భూస్వామి భాగము నూటికి 45— కౌలుదారు భాగం— 55.

2 వ తరగతి నీటి వసతిగల భూములకు 40 — 60: నీరు తోడవలసిన చోట్ల భూస్వామి భాగము 1/3 వరకు తగ్గవచ్చును.

మెరక భూములందు గాని, పల్లము భూములందు గాని పండించే వాణిజ్య పంటలకు భూస్వామికి 40— కౌలుదారుకు 60—. (పసుపు, చెరకు, అరటి, ఉల్లి, వేరుశెనగ, ప్రత్తి, తమలపాకులు— వాణిజ్య పంటలుగా యిందు నిమిత్తమై నిర్ణయింప బడినవి.

ఇతరపంటలు మెరకలో గాని పల్లములో గాని .40.60. ఈ సరసమయిన కట్టుబడుల స్కీము కొబ్బరి, మామిడి, నిమ్మ మొదలగు పండ్లతోటలకు చెల్లదు. ఏ పొలునందయిన పెక్కు పంటలు పండించినచో అన్నింటికి కలిపి మొత్తానికి యీ భాగము చెల్లును.

నాము పంట (కాని కార్పు) పల్లము భూములందు పండేది యిప్పటి రీతినే కౌలుదారులకు పూర్తిగ విడిచిపెట్టవలెను. కాని కార్పు అనగా ఏది అను విషయమున తగవు వచ్చినపుడు లాండు ట్రిబ్యునలు నిర్ణయము ఉభయులు అంగీకరించవలెను.

గడ్డి కౌలుదారునకు చెందును. పన్నులన్ని భూస్వామి కట్టుకో వలెను. సాగు కర్చులన్ని పశువుల పరికరాలు విత్తులు ఎరువులకగు కర్చులు కౌలుదారు భరింప వలెను. మార్పులుంటే పార్టీలు సర్దుకో వలెను. తగవుంటే లాండు ట్రిబ్యునలు పరిష్కరించును. మొత్తము పంట, అనగా కొన్ని ప్రాంతములందు ఆచారముగానున్నట్లు కోతల కర్చులకు మినహాయించి మిగిలిన పంటకాక, పొలములో పండిన పంట అంతా యని అర్థము. సరస మయిన కట్టుబడులు నిర్ణయించు అధికారులు యీ దిగువ విషయములు గమనించ వలెను. స్థానికముగానున్న కట్టుబడుల విలువలు, వ్యవసాయ కర్చులు, స్థానిక వస్తువుల ధరలు, భూస్వామిగాని, కౌలుదారుకాని చేసిన మరమ్మత్తు కర్చులు, అసెసుమెంటు మున్నగునవి.

సరకు రూపములో కట్టుబడి భాగము పుచ్చుకొను వరముదారులు దాన్ని నగదుగా మార్చి పుచ్చుకో రాదు. సరకు రూపముగా స్థిర మొత్తము చెల్లించు కౌలుదారులుకూడ దాన్ని నగదుగా మార్చి యివ్వరాదు.

కౌలు కాలములో ధరలు మారినా నగదు కౌలు నిర్ణయించుకొన్న వారి మొత్తము మారదు. విపరీతముగా ధరలు మారినచో కట్టుబడుల రేటు నిర్ణయముమార్పు, ధరలనుబట్టి ఉభయుల అంగీకారముపై మార్పు చేయవచ్చును.

కట్టుబడి బాకీలపైని, అడ్వాన్సుల పైని వడ్డి నూటికి 6 కన్న మించరాదు.

పంటలు కొంతగాని, సగముగాని చెడినపుడు, ప్రభుత్వమువారు శిస్తు రెమిషను యిచ్చు మేరకు, భూస్వామి కౌలుదారునకు రిమిషను యివ్వ వలెను.

కౌలుదారులు భూస్వామికి వెట్టిచాకిరీ చేయుట, వారికి గొర్లు, మేకలు మున్నగువానిని ఉచితముగా నిచ్చుట, నెయ్యి, కోళ్ళు, కాయగూరలు, గడ్డి ఉచితముగా భూస్వామికి యిచ్చుట నిషేధించవలెను.

భూస్వాములు తమకు రావలసిన కట్టుబడికి మించి వసూలు చేసినచో వారామొత్తము వాపసు చేయుటేగాక, ఏదో పొరబాటున జరిగినట్లు, ఋజువు చేయ లేకున్నచో, వారాకు 5 రెట్లు రూ 25 లకు తక్కువ కాకుండునట్లు యిచ్చుకోవలెనని లాండు ట్రిబ్యునలు నిర్ణయించ వచ్చును.

[సశేషము]

— ధర్మ విజయము: 6 వ పేజీ తరువాత —

చంద్ర:—

'మంచిదే. ప్రస్తుతము చేయవలసినది విజయదశమి నాటి ముహూర్తమును భంగమొనర్చుట. ఏ విధముగ నది ఘటిల్లును......ఆఁ— ఆఁ ఈ విధముగాఁ దోఁచుచున్నది. ఆదినము తెల్లవారుఝామున నాల్గు గంటలకు ఒక కారు నాయత్తముచేసి, యద్దానిని వారి యింటి కనతి దవ్వున గల మెఱక ప్రదేశమునందుంప వలెను.'

శ్యామ:—

'ఓ— అది యెంతపని. కాని జానకిని కారుయొద్దకు రప్పించు ఉపాయ మేది?'

చంద్ర:—

'ఆ పని నే జేయుదును. ఆమె ప్రేమించుచున్న యువకుఁడు నాకు చిరపరిచితుఁడు. జానకి తండ్రి ముందు తిరుపతిలో నున్నప్పుడు, మంచి కుటుంబీకుఁడును, సత్ప్రవర్తన గలవాడు నగు రాజారావు నామె ప్రేమించెను. అతఁడు వ్రాసినట్లొక ఉత్తరమును సృష్టించి, జానకికి పంపుదును. ఆమె నిర్దేశించిన స్థలమునకు తప్పక వచ్చును. కారు నెక్కుట తోడనే మనము కంచీపురము వెలుపడి యదృశ్యుల మగుదుము.'

శ్యామ:—

'అట్లయిన యిప్పుడే అందుల కేర్పాటొనరింతును. చీఁకటి కావచ్చుచున్నది. ఇఁక బయలు దేరుదమా?'

చంద్ర:—

'సరే! భోజనానంతరము నీవు మా యింటికి వచ్చుచో, ఈ విషయమును చర్చించి నిర్ణయించుకొందము. ఈ విషయములు గోప్యముగా నుండుట మంచిది.' అనుచు లేచి గృహోన్ముఖులైరి. (3—వ ప్రకరణము సమాప్తము.)

ప్రజాభిప్రాయ వేదిక.

## శ్రీ. వీణా నర్సరాజుగారి మృతి.

ఆర్యా,

వీరు 1951—వ సంవత్సరము జూన్ నెల 24—వ తేదీ ఆదివారము 1 గం॥కు భౌతిక దేహమును వదలిరి. వీరు కొందఱి బీద విద్యార్థులకు ఉచిత విద్యా భోజనము లిచ్చి, వారి అభివృద్ధికి తోడ్పడిరి. వీరి ఆత్మకు సర్వదా శాంతి సమకూర్చునటుల, మా టీచర్ల యూనియన్ సంఘము సర్వేశ్వరుని ప్రార్థించుచున్నది.

వేంపల్లె. వై. వెంకటయ్య.

## పురాతన వ్రాత ప్రతుల గ్రంథములు.

ఆర్యా!

తంజావూరు దర్బారు భవనములోని ఒక గదిలో అపూర్వమైన వ్రాత గ్రంథములున్నవి. వానిని చూచే దిక్కు లేదు. దుమ్ముతోను, పురుగులతోను నిండి యవిమట్టిలో కలిసి పోయేటట్లున్నవి. పాలి భాషలోను, బోధి భాషలోను వ్రాయబడిన గ్రంథములున్నవి. వీని విషయమై పర్కారువారు ఎందు కింత యశ్రద్ధ చేయుచున్నారో తెలియదు. చెన్నపట్టణములో ఓరియంటల్ లయిబ్రరీలో పనిచేయువారిలో ఈ భాషలను తెలిసినవారు కొందరున్నారు. ఈ యపూర్వమైన వ్రాత గ్రంథములు మన్నులో మాయమై పోక ముందే తక్షణము ఓరియంటల్ లయిబ్రరీకి తెప్పించి, వారిచేత పరిశోధనలను చేయించి, వానిని ముద్రించుట కేర్పాటు చేయవలెనని కోరుచున్నాను.

టిప్లికేను, బి. రామమూర్తి.

## మహారాజ రాజశ్రీ మదనపల్లె డిస్ట్రిక్టు మునసబు కోర్టులో.

O. S. 221/49

R. E. P. 136/51.

ఎండపల్లె ఎల్లారెడ్డి ... ... వాది.

గంగిశెట్టి చంచయ్య } ప్రతి వాదులు.
గంగిశెట్టి నారాయణశెట్టి }

వాదిపరము తెలియజేయడము యేమనగా,

ప్రతివాదుల తాలూకు జప్తి దాఖలా స్థిరాస్తులను యేలము షరత్తులు నిర్ణయించుటకుగాను సేలు నోటీసు ప్రతివాదులకు ఎన్నిమార్లు పంపినను సర్వు చేసుకోక తంటాలు చేయుచున్నారు. 31—7—1951 తేదికి యేలం షరత్తులు నిర్ణయించుటకుగాను వాయిదా వేయబడినది. ఆదినము మీరు హాజరయి ఆక్షేపణ తెల్పుకో వలయును. అట్లు లేనంతట మీ పరోక్షములో తీర్మానించబడును. తెలిసేది.

యస్. వి. వరదాచార్య, బి. ఏ., బి. ఎల్.,

మదనపల్లె. వాది తరఫు అడ్వకేటు.

# కీర్తిశేషులయిన చిలుకూరి నారాయణరావుగారి మృతిస్మృతి.

(విద్వత్కవిశేఖర హెచ్. దేవదానముగారు, బి. ఓ. యల్.)

ఉ॥ సత్యము శాంతమున్ సుగుణ-సంతతి మీ హృది వాస ముండుటన్
నిత్యము వాసచేడియల-నిర్మలభక్తిని గొల్చినారు; సా
హిత్య విమర్శనంబులవి-సన్నుతి కెక్కఁగ వ్రాసినారు; మీ
మృత్యువు శిష్యకోటులను-మేరయెఱుంగని చింత ముంచెహో.

తే॥ గీ॥ ఒక్క భాష నదుపెతల కెక్కవయ్యె
పెక్కు భాషాపదములను జక్క నేర్చి
ఎట్లు డాచితిరో తలయందెఱుఁగ నింక
అల సరస్వతి మీలోన నిలచెనేమొ.

ఉ॥ న్యాయము విస్తరిల్లుటకు-నానుడులెన్నియొ యేర్చికూర్చి యా
ప్యాయముగా సుగ్రంథమును-వ్రాసితిరార్యులు మెచ్చునట్లుగా
మీయనుభూతి పొంగగను-మేలిమి పొత్తములెన్నొ వ్రాసి, నా
రాయణరావుగారు కవి-రాజుల నబ్బురపర్చినారహో.

శా॥ మీరేయే సభలందునిల్చి సభికుల్-మెచ్చన్ప్రసంగంబులన్
గోరంతేనియుహమ్ము లేకిడితిరో-కూర్చున్నవారెల్లరున్
గారాబంబున మిమ్మువించునట సత్కారంబు గావింపరే
ఔరౌరా! భవదీయప్రజ్ఞయది తా నాశ్చర్యమున్గొల్పెహో.

మ॥ ఇఁక నాంధ్రావనిలోన మీకరణి సాహిత్యంపు సంద్రంబున
న్నొకరేమున్గి విశాలభావరుచులన్నొప్పారు శబ్దంబులన్
బ్రకటింతోరి! ప్రకటింపగోగద మహాప్రాజ్ఞా! యుపేక్షించుచున్
నికరంబైన భవత్ప్రయోగములె బల్నెగ్గింగదా యెల్లెడన్.

ఉ॥ దేశవినాశకుల్ మఱియుఁదెక్కలికాంగ్లను బెక్కురుండఁగా,
దేశ శుభోదయంబునకుఁ దేకువ యత్నముసల్ప నీకుఁ దా
లేశము జాలిలేక తన లెక్కలఁ జావు యముండు వ్రాయుచున్
గ్లేశమునందు ముంచెఁగద క్రూరముగా బహుళాంధ్రదేశమున్.

తే॥ గీ॥ ధరణివిడిపోయినట్టి మీదారసుతుల
కతులశాంతినిగూర్చుచు ననవరతము
నీకు నిర్మలాత్మకు నట నిత్యసుఖము
గలుగఁజేయనై భగవంతుఁ దలఁతుభక్తి.

—0—

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక. REGISTERED No. M. 5285. విడిపత్రిక అణాలు 3.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి. ఏ.,

| సంపుటము 4. సంచిక-24. | బుధవారము, జూలై 25, 1951. | ప్రతి బుధవారము వెలువడును. |
|---|---|---|

## విషయానుక్రమణిక

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 24.

శ్రీ ఖరనామ సంవత్సర ఆషాఢ బ. 2, జూలై, 25, 1951.

ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## అన్నము లేనివారిని నడుము బిగించమని కోరుట న్యాయమా?

“అనేక విషయములలో - ముఖ్యముగ (అన్న వస్త్రములవిషయములలో) మానవజీవితమునకు ప్రధానమైన ఆర్థిక విషయములలో - నా ప్రభుత్వము విజయమును సాధింప జాలక పోయినది. ఇది నా అంతరాత్మకు బాగుగ తెలియును. ఇండియా ప్రభుత్వము సాధించిన వానికిని - సాధింపలేక పోయిన వానికిని - ప్రధాన మంత్రి నైనందువల్ల ఆ బాధ్యతంతయు నేనే వహింప వలెనని తలచుచున్నా”నని ఇటీవల బెంగుళూరులో సమావేశమైన అఖిల భారత కాంగ్రెసు సంఘమునకు సమర్పించిన నివేదికలో శ్రీ జనహారిలాలు నెహురుగారు తెలిపిరి. ఈ యోదార్ప వలన శ్రీ జవహరిలాలుగారు తమ సహజ నమ్రత భావమును వెలిబుచ్చుచున్నారేకాని, దానివలన దేశములోనున్న కోట్లకొలది సామాన్య ప్రజల కెంతమాత్రము ప్రత్యక్షలాభ ముండబోదు. 1946 సం॥ సెప్టెంబరు నెల నుండి ఈ దినము వఱకును, ప్రత్యక్షముగ ఇండియా ప్రభుత్వమునకు నాయకత్వము వహించి, ప్రభుత్వ వ్యవహారములను నడుపుచున్నారు. వీరి ఆదర్శములను కాని, ప్రవర్తనమును కాని, విజ్ఞానమును కాని, లేక శక్తి సామర్థ్యములను కాని శంకించు వారు ఈ దేశములో నొక్కరైనను నుండజాలరు. కాని ఇట్టి సర్వ సామర్థ్యములు కలవారు ప్రధాన మంత్రిగా నుండియు, నాలుగు సంవత్సరములుగ సామాన్య ప్రజల జీవితావసరములైన అన్న వస్త్రముల సమస్యనే సాధింపజాలక పోయిన, ఇంతకన్నను వేరు విషాదమున్నదా యని అడుగక తప్పదు.

“ప్రజల నిత్య జీవితములకు సంబంధించిన ఆర్థిక సమస్యలను పరిష్కరించుటకు ప్రభుత్వము మొట్టమొదట పూనుకొని యుండవలసినది. కాంగ్రెసు సంస్థ ఆదర్శములను ముందిడుకొని, ఒకేసారి ఒక పెద్ద దూకు దూకి, ఆర్థిక రంగములో విప్లవము తెచ్చి, ప్రజల అభివృద్ధికి తోడుపడవలెనని యూనియన్ ప్రభుత్వమువారును, రాష్ట్ర ప్రభుత్వములును తలచినవి. ఏమో చేయవలెనని శక్తికి మించిన ప్రయత్నములను చేసితిమి. దానివలన ఆర్థిక ఒత్తిడి ఎక్కువాయెను. రవాణా నిర్మాణము విరిగి పోయె”నని శ్రీ జవహరిలాలుగారు తెలిపిరి. దేశమునకు స్వాతంత్ర్యము చేకూరగనే, నోటిలో ఎంత రొట్టె పట్టునో అంతమాత్రము రొట్టెనే కొరకకుండ, కాంగ్రెసువారు ఎక్కువ రొట్టెను కొరికిరి. నోరు పట్టకపోయెను. నమలుటకే వీలులేక పోయెను. బొత్తిగా జీర్ణించుకొనజాలక పోయిరి. దేశ ఆర్థిక వసతులకు మించిన స్కీములను తయారు చేసిరి. వానిని నెరవేర్చుటకు శిక్షణపొందిన వ్యక్తులు లేరైరి. బొక్కసములో ద్రవ్యము లేదయ్యెను. కాంగ్రెసువారి నూతనోత్సాహముతో దేశము నింతటి అధ్వాన్న స్థితికి తెచ్చిపెట్టిరి. కాంగ్రెసు నాయకులని చెప్పుకొను వారి అందరిలోను, వలయు నంత విజ్ఞానము, ప్రజాహిత కార్యముల యందాసక్తి యున్నదనియు, వారెల్లరు సరియైన నాయకత్వమునకు పనికివచ్చెదరనియు శ్రీ జవహరిలాలుగారు నమ్మిరి. ఈ విధముగ వారు

ఊహించుకొనుటే తప్పు. ఆ తప్పును వారు చేయకుండినచో, దేశపరిస్థితులు ఇంత దుర్భర స్థితికి వచ్చియుండెడివి కావు.

"కొన్ని సందర్భములలో కేంద్ర ప్రభుత్వముతో రాష్ట్ర ప్రభుత్వములు సహకరింపలేదు. అస్థిరమైన ప్రభుత్వములు ఒక స్థిరమైన విధానమును సూచింపజాలవు. కార్య రూపమున పెట్టజాలవు. ఇప్పటి దేశపరిస్థితులలో అట్టి ప్రభుత్వములుండుట దేశ పురోభివృద్ధికి ప్రమాదముగ పరిణమించు"నని శ్రీ జవహరిలాలుగారు తెలిపిరి. ఎప్పుడు రాష్ట్ర ప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వముతో సహకరించుటలేదని తోచునో అప్పుడే వానిని రద్దుచేసి యుండినచో, కేంద్ర ప్రభుత్వ గౌరవము ఎంతో ఎక్కువై యుండెడిది. రాష్ట్ర ప్రభుత్వము లేమి చేయుచున్నను, కేంద్ర ప్రభుత్వములు చేతులు కట్టుకొని కూర్చొని, రాష్ట్ర ప్రభుత్వములు సహకరించుటలేదని చెప్పి తృప్తి పడుచో, అది శ్రీ జవహరిలాలుగారి ప్రభుత్వము యొక్క బలహీనతనే సూచించును కాని సామర్థ్యమును సూచింపజాలదు.

"ఆర్థిక విషయములకు సంబంధించిన భారమంతయు వివిధ తరగతుల ప్రజలపై బడినది. ఇందుకు సందేహము లేదు. ముఖ్యముగ మధ్య తరగతుల వారిపై ఎక్కువ కష్టము పడినది. సహజముగ అసంతృప్తి ఎక్కువైనది. దీనికంతయు బాహ్య పరిస్థితులును, అంతరంగిక సంఘద్రోహులును కారణమని చెప్పవచ్చును. కాని ప్రభుత్వమే దీనికంతయు బాధ్యత వహింపవలెను. పరిస్థితులను చక్కబఱచుటకు పూనుకొనవలెను. ప్రభుత్వమువారు చేయుచున్న పనులలో ప్రజలు సమానబాధ్యత వహించుట బొత్తిగ లేకున్నదను విషయము ప్రాముఖ్యముగ కనపడుచున్నది. ప్రజలలో ఉదాసీనభావము మఱింత ఎక్కువైన"దని శ్రీ జవహరిలాలు గారు తమ నివేదికలో మఱియొక చోట తెలిపిరి. వారు దేశ ప్రభుత్వ నిర్వాహణ భారమును వహించుటకు 1946 సం॥ సెప్టెంబరు నెలలో పూనుకొనగనే, కాంగ్రెసు వారు దేశీయులలో ఎన్నో ఆశలను రేకెత్తించిరి. కేవలము మానవ నిత్యజీవితమున కవసరమైన ఆహార, వస్త్ర సమస్యలనే తీర్ప జాలక, విలువైన నాలుగు సంవత్సరముల కాలము వృథా చేసిరి. ఆహార, వస్త్రముల ధరలను శ్రీ జవహరిలాలు ప్రభుత్వమువారు తగ్గింప జాలకపోవుటేగాక, అవి హెచ్చు కాకుండనైనను చేయజాలరైరి. దిన దినమునకును వాని ధరలు హెచ్చుచునే యున్నవి. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వమనిన, ప్రజలలో ఏల ఉదాసీన భావము, నిరాశ, అసంతృప్తి హెచ్చు కాదో మాకు తెలియుటలేదు. ప్రజల సహకారమును కోరుటకు కాంగ్రెసు పార్టీవారికి ఏమి హక్కు ఉన్నదో యూహింప జాలకున్నాము.

ఇంకను కాంగ్రెసు సంస్థ దేశమునకంతయు ఏకైక జాతీయ సంస్థయను భావమే శ్రీ జవహరిలాలు గారిని బాధించుచున్నది. కాంగ్రెసు తప్ప ఇతర రాజకీయ పక్షములు తలయెత్త కూడదని తలంపు కలుగరాదు. ప్రతికూలపక్షముండుట అత్యవసరము. ప్రజాస్వామిక ప్రభుత్వ విధానము ప్రజల కత్యంత ఉపయోగకరముగ పని చేయవలయునని ఎవరైనను తలచుచో, కనీసము బలమైన రెండు రాజకీయ పక్షము లుండవలెను. ఈ విషయములు శ్రీ జవహరిలాలు గారికి తెలియనివి కావు. కొంచము సద్దుబాట్లు ఉన్నచో, ప్రధాన విషయములలో అన్ని రాజకీయ పార్టీలు ఒకదానితో నొకటి సహకరించుట కాని లేక ఒకే లక్ష్యముపై పనిచేయుట కాని అసాధ్యము కాదు. ఇట్టి అవకాశమును కలుగజేయ వలెనన్న ప్రస్తుత కాంగ్రెసు సంస్థను రద్దుచేసి, దానిని కేవలము ఒక రాజకీయపార్టీగా పునరుద్ధరింప వలెను. ఇతర రాజకీయ నాయకుల నుండియు, రాజకీయ పార్టీల నుండియు అప్పుడు కావలసినంత సహకారము లభింపగలదు.

స్వాతంత్ర్యమును వచ్చిన తర్వాత నాలుగు సంవత్సరములు కూటికి, గుడ్డకు కష్టపడితిమి. ఇకనైనా ఈకష్టము పాయునా, ఈకష్టములు పైతొలగునను ఆశ శ్రీ జవహరిలాలుగారు తయారు చేసిన కాంగ్రెసు ప్రణాళికలోనైన ఉన్నదా యని

యోచించిన - ఎంతమాత్రము ఆ ఆశకు అవకాశము లేదు. దేశమునకు స్వాతంత్ర్యము రాకముందు మందభాగ్యులైన భారతీయుల భవిష్యత్తు, అంధకార భూయిష్టమై, నిరాశా జనకమై, అస్పష్టముగ నుండెను. సర్వ సంపూర్ణ స్వాతంత్ర్య దేశమై ఐదు సంవత్సరములు కావచ్చినను, బీదసాదల యొక్కయు, మధ్య తరగతుల వారి యొక్కయు, భవిష్యత్తు, అస్పష్టముగను, అంధకారముగనే యున్నది. చాలీ చాలని గంజి త్రాగి, నోరు బిగించుకొని, నడుముకట్టి పాటుపడుట కన్న వేరు గత్యంతరమే లేదని శ్రీ జవహరిలాలుగారు, బెంగుళూరులో సమావేశమైన అ॥ భా॥ కాంగ్రెసు సభలో, కాంగ్రెసు ప్రణాళికను సమర్థించుచు, భావగర్భితమైన మహోపన్యాస మొసగిరి. ప్రజలు అన్నవస్త్రములులేక మలమలమాడుచున్నారని వారే అంగీకరించి యున్నారు. అన్నము లేని వారిని ముందుకు రమ్మని కోరుటలో న్యాయమేమైన ఉన్నదా?

# కాంగ్రెసు ఎన్నిక ప్రణాళిక.

దీర్ఘమైన కాంగ్రెసు ఎన్నిక ప్రణాళిక ప్రకటితమైనది. ఇది కూడ శ్రీ జవహరిలాలు నెహూరు గారి కలమునుండియే వెలువడినది. ఇండియా జాతీయ మహాసభ పక్షమున వ్రాయబడినది. బెంగుళూరులో సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు కమిటి ఎదుట పెట్టబడినది. ప్రారంభ ఘట్టము, కడ భాగములు శ్రీ జవహరిలాలుగారి సహజధోరణిలోనేయున్నవి. హృదయాకర్షణమగు పదములతోను, భావములతోను నిండియున్నది.

"నైతిక ప్రవర్తనమే జాతీయ జీవితమునకును, రాజకీయ కార్యక్రమములకును ముఖ్యాధారమైనదని భారత జాతికి తండ్రి సమానుడైన గాంధీజీ మనకు చెప్పెను. ఆదర్శము లెంతముఖ్యమో, వానిని సాధించు మార్గములుకూడ అంతముఖ్యమైన వనియు; ఫలితము మనము అనుసరించు మార్గములపై ఆధార పడియుండుననియు గాంధీజీ నొక్కి చెప్పెను. హక్కులు, ప్రత్యేకాధికారములు, అనువానిని తలంపకయే, ఫలాపేక్ష రహితముగ ముందు పనులు చేయుటకు పూనుకొనవలెనని మన దేశ ప్రాచీన సంస్కృతి, సాంప్రదాయములు బోధించుచున్నవి. తర్వాతనే హక్కులనునవి, ఆ కర్మ ఫలితములనుండి చేకూరునని చెప్పబడుచున్నది. కాంగ్రెసువారిని, ప్రజలను, ఈ సిద్ధాంతములనుండి వారికి లభించిన ప్రేరిత జ్ఞానమే గమ్యస్థానము చేర్చిన"దని శ్రీజవహరిలాలుగారు ఈకాంగ్రెసు ప్రణాళిక పీఠికలో వ్రాసిరి. ఇవన్నియు ఉన్నత భావములే. ఇంతవఱకును శ్రీ జవహరిలాలుగారి నోటినుండి వచ్చుచుండిన ప్రతి అక్షరము, పదము, వాక్యము దేశీయుల హృదయములలో ఆనందము కలుగజేయుచు, ఎన్నో ఆశలను పైకి లేవదీయు చుండెను. ఆయన ఉన్నతాశయములు, భావములు, ఆశయములుగను, భావములుగనే ఈ దినమునకు కూడ నిలిచిపోయినవి. ఆయనచే నడుపబడుచున్న ప్రభుత్వములో కాని, ప్రభుత్వ ఉద్యోగులలోకాని లేక సమీపముగ చుట్టునుండు వారిలోకాని ఆయాశయములు, భావములు అణుమాత్రమైనను ప్రతిబింబించుట లేదు. అందువలననే ఇప్పుడు శ్రీ జవహరిలాలు గారి యాదేశములు ప్రజలలో ఉత్సాహమును గొల్ప జాలకున్నవి.

ఎన్నిక ప్రణాళిక యని శ్రీ జవహరిలాలు గారు తయారుచేసినది, నిజములో ఎన్నిక ప్రణాళిక కాజాలదు. ఎన్నికలలో కాంగ్రెసుపార్టీకి జయము కలుగువో, వారు అధికారమునకు వచ్చి, ఏయే రంగములో ఏయే కార్యములను సాధించుటకు తీర్మానించుకొనిరో, తెలిసికొనుటకు ఈ ఎన్నిక ప్రణాళిక ఉపయోగపడుటలేదు. దేశమును ప్రస్తుత మెదుర్కొనిన వివిధ సమస్యలపట్ల కాంగ్రెసు పార్టీవారి అభిప్రాయ మేమో దానిని మాత్రమే అది ప్రతిబింబింప చేయుచున్నది.

శ్రీని— బహుకాలానుభవముగల మీ వాక్రుచ్చు వాక్యంబు లమృత తుల్యంబులు గదా?

అని నిష్క్రమించును.

## — 2-వ రంగము. —

కరణము మాధవరావు మేడమీద సోఫా కుర్చీలో కూర్చుని రఘుపతిరావుతో:

సీ॥ తరతరంబుగ నేను ధర్మంబుదప్పక కరణీకమును జేయ
గడఁగినాను
ఉద్యోగులకునెల్ల నుల్లాసమొనగూర్చి కాలంబు నొక
రీతి గడపినాను
సర్కారులెక్కలు సరసంబుమైవ్రాసి జమబంది పస
నొంద సలిపినాను
కోరినలెక్కలు కొదువలేకనె జేసి— హాళిని గౌరవ
మందినాను

తే॥ గీ॥ అకటయిది యేటిచిత్రమొయరయ జాల?
వయసుమాలిన యుద్యోగితండమయ్యె
పరువు మర్యాదలొక్కింత భగ్నమయ్యె
చాలు. కరణీకపదవులసౌఖ్యమికను॥

మాట— అయ్యా! మాతండ్రి కరణీకము గణనీయంబనియు సకల శుభముల కాలవాలంబనియు, వేల్పు గిడ్డియనియు వక్కాణించుచుండెను. కొందఱు మన దస్త్రముండిన నన్న వస్త్రములకు గొఱంత యుండునా? యని కొందఱందురు. కాని విమర్శింప నీయుద్యోగులు వంశపరంపరయను సంకెలలంజిక్కి నృక్కి యున్నారు. కాల పరివర్తనమున నీయుద్యోగంబు నేయ నయోగ్యంబని తెలియుచున్నది.

రఘుపతిరావు:— కాల పరివర్తనమున గొంత తలక్రిందులగుట న్యాయంబె. కాని యెట్టితఱి నను నిరుత్సాహంబు కార్యంబు గాదు.

మాధవరావు:— ఏది ఎటులుండినను పనులభార మతిశయించి నది. క్రమముగ గ్రామలెక్కల నెక్కువగ నిర్ణయించి, యన్నియు గరణములే వ్రాయవలయునని నిర్ణయించిరి. వేతనము లత్యల్పములు. పనులతిశయములు. ఇట్టి యుద్యోగమున కంటె సేద్యము సేయ మేలగు.

రఘు— వ్రాయజాలని లెక్కల నేరీతి వ్రాయుదురు? పై యుద్యోగులు మీ లెక్కల భారమును గుఱించి విమర్శింపరా?

మాధ— పై యుద్యోగులు విమర్శించినను, లెక్కలు వ్రాయ మనుటయే వారి విధిగ నున్నది.

రఘు— మీ అసోసియేషనేమైనది?

మాధ— అసోసియేషను శాంమావసిష్టముగ నున్నది.

రఘు— నడిపించువారు లేకనా? 'అయోగ్యపురుషంనాస్తి' పనికిరాని పురుషులు లేరు కదా?

మాధ— పనికిరానివారు లేరు కాని, యా యా స్థానంబులకుం దగిన వారిని, నియోగించు పురుషుడు మాత్రమరుదని తలంచ వలెను.

రఘు— కలియుగమున సంఘమే బలము, సంఘనాయకుడు నీతిజ్ఞుడైనచో సంఘము ప్రకాశించును. అవినీతిజ్ఞుడైన పతనమగును.

మాధ— సంఘనాయకుడు నడుపను, నడిపింపను శక్తివంతుడైన సంఘము ప్రకాశించును.

రఘు— సంఘసభ్యు లేకీభవింతురా?

మాధ— ఎవరికివారే.

రఘు— ఉత్సాహము కార్యకారి. చీమలు నడచిన బండ లరుగుచున్నవి.

తే॥గీ॥ తాత తరములధర్మంబు దప్పకుండ
దస్త్రముల గొని గణకులై ధరణిలోన
జనుల సమ్మోదమంది ఖల్ జాణలనగ
పేరు వాడిరి లోకాన బేర్మిమీర.

అనుసరకీ—(ఇరువురును జిరునగవు లభినయింతురు)

(తహశీల్ దార్లవారి జవాన్ అమిరుద్దీన్ ప్రవేశించును)

మాధ— జవాను నుద్దేశించి — ఏమి సమాచారము?

జవాన్— సమ్మను నందించును.

మాధ— (సమను తీసికొని) ధాన్యపు రిజిష్టర్లతో తాలూకా ఫీసుకు హాజరు కావలసినటుల తహశీల్ దార్ల వారి సమను చదువుకొని సంతకముచేసి యిచ్చును. జవాను నిష్క్రమించును.

రఘు— మాధవరావుగారూ? నేను మీవెంట కచ్చేరికి వచ్చి తహశిలుదారుగారి యెదుట మీ నటన చూడ వలయును.

మాధ— కరణాల కథలందరెఱుంగుదురు. మీబోటివారెఱుంగకుండు టేల?

రఘు— నేను మీవెంట వచ్చెదను అని నిష్క్రమించును.

మాధ— (ఆత్మగతమున) నేనింకను రిజిష్టర్లు వ్రాయలేదు, తహశీలుదారీదినము నాపై గుపితుడగును. ఎంతపని చేసినను నధికారులు పని చేయ లేదనే యందురు. మా కష్టమెఱుంగరు కదా? ఏ లెక్క వ్రాయకున్నను చార్జి ఫ్రేం చెయ్య మనడమే తేలికయైనది. రేపుకదా సమను వాయిదా అని నిష్క్రమించును.

[ సశేషము ]

ఏకాంక నాటిక

# గణకుఁడు.

శ్రీ అంపేరాయని సుబ్బరావుగారు.

## — ప్రథమ రంగము. —

నాంద్యంతమున సూత్రధారుఁడు—

ఉ॥ శ్రీవిలసిల్లు ధర్మములు-జేర్పడు సంతసె నా తరింతువే
వావిరి ధర్మ సంతతుల-వాలెము భూమిని నిల్పనోజనై
తావు కొనంగఁజేతునని-తాలిమి బార్థివు డోడఁబల్కునా
దేవుఁడెసంగి మేల్దనియు-దీవనలియ్యెడమా కొసంగుతన్॥

ప్రభాతమున కలువలు ముకుళించును. కమలములు వికసించును. దివాంధము ప్రీతిం దొలఁగును. చక్రవాకము ముద మొందును. సూర్యుఁడుదయించును. చంద్రుఁడస్తమించును. పాపిష్టి దైవముయొక్క పరిణామ మాశ్చర్యముగ నున్నది. దిక్కులు పరికించి — ఎవరా వచ్చుచున్నది?

ఓహో! సజ్జనమూర్తి, శ్రీనివాసశాస్త్రి గారు వచ్చుచున్నారు. ఇఁక నా పని ముగిసినది. (అని నిష్క్రమించును)

కరణము కొణకంచి మృత్యుంజయులుగారి స్వగృహము:—

శాస్త్రిగారు ప్రవేశింతురు. కరణమాలోచనా నిమగ్నుఁడై యుండును.

శ్రీని— మిత్రమా? ఏమాలోచించుచున్నారు?

మృత్యుం- (శాస్త్రిగారి నుద్దేశించి)

సీ॥ భారతభువిలోన బలియుఁడై గ్రామాల పాలనంబున వన్నె
బ్రబల మెఱసి
బహుజనాళితో మైత్రి బాయక నేలకొల్పి యుద్యోగి
మండలి నుక్కుమీఱి.
రాజశాసనరీతి రంజిల్లఁజేయుచు రాముకంబుగ లెక్క
వ్రాసి నడిపి
ఉద్యోగులెదుటనుఖద్యోతులననిల్చి కార్యముల్ జరి
పిరి కలము బూని॥

తే॥ గీ॥ కలిగెనిప్పుడు కష్టముల్ గలయఁజూడ
గణకులెల్లరు నొక్కింత కలముదించి
జనపదంబుల హాళిమైసాగుభూమి
కధిపతులు గాగ నిలచుటయలఁతిగాదు.

మాట— అశోక చంద్రగుప్తుల కాలమునుంచియు నింతఁదనుక గ్రామ సీమల గణకులు గణపతులనంబఱంగిరి. వారు తమ గ్రామములందే దేని యుత్తమ కార్యములు జరుపవలసి యుండిన ముందంజ వేయువారు. మఱియు ప్రభుత్వము, గణకులను, గౌరవనీయులుగ గణించుచు, ప్రభుత్వమునకును బ్రజలకును మధ్య రాయబారులుగ నియమించిరి. వంశపరంపర హక్కుల నొసంగి గ్రామలెక్కల గొన్నింటి వ్రాయుట కినాముల నొసిఁచిరి. క్రమముగ నినాములకు శిస్తునువిధించి యత్యల్ప వేతనములొసంగిరి. కాని యింతవఱకు లెక్కల బాహుళ్య మతిశయింప జేయలేదు. కాల పరివర్తనమున నిత్తతిలెక్కలు వ్రాయు బాహుళ్యమతిశయించినది. ఇరువదినాలుగు గంటలు పనిచేసినను దీరకున్నది. దానం జేసి విసుకు జనించుచున్నది.

శ్రీని— గణకోద్యోగము మీ వంశలక్ష్మియని యాగ్యులు వచింతురు.

మృత్యుం- తద్వాక్యంబు సత్యంబే? కాని కాల పరివర్తనమున తలక్రిందులుగ నున్నది. ప్రభుత్వము గణకుల కొసంగిన గౌరవ శబ్దము కాయితములలో (గారు) అని వ్రాయుటయే కాని యాచరణమున,నీచముగ వర్తించుచున్నారు.

శ్రీని— అట్లైన మీ యుద్యోగములను వదులుకొనరాదా?

మృత్యుం- బహుకాలముగ నీ యుద్యోగమును జేయుచు వేరొక వృత్తి నవలంబింప వీలులేక నిట్లే పొరలాడుచున్నారు.

శ్రీని— ఏది ఎటులున్నను మీరు గౌరవనీయులే.

తే॥ గీ॥ కవులు బండితులెలమిని గారవించి
ధరణి గీర్తింప బడినట్టి ధన్యులీరె!
కల్పవృక్షంబు పగిదిని గర్షకులకు
గామితార్థంబు లొసగెడి ఘనులు మీరె!

మాట— అయ్యా? గ్రామమున మీ రగ్రగణ్యులు. శుభకార్యముల బ్రథమమున గణపతిని బూజింతురు. గ్రామ సంబంధ కార్యముల దొలుదొలుత మిమ్ము బూజింతురు. గణపతిని బూజింపకుండిన విఘ్నము లేర్పడును; గణకుల బూజింపకున్న గార్యము సున్న.

మృత్యుం- శాస్త్రిగారూ? మీ యుగ్గడింపెన్న దగినదే? కాని, కాలమానాను సారముగ నిప్పుడీ గణకోద్యోగము గర్హనీయము? ఎట్టులనిన జనపదంబులం దవిద్యావ్యాప్తిం జేసి దుర్నయ మేర్పడినది. కరణము ప్రభుత్వముతోను బ్రజలతోను సంబంధముకలవాఁడుగ నున్నాడు. గ్రామ సముదాయమున సజ్జన దుర్జనులుందురు. కరణము వారి ననుసరింపకున్న దూషింతురు. వారి ననుసరింప బ్రభుత్వముచే దూషింపబడును. కరణమెంత నీతిజ్ఞుఁడైనను, దుర్నయులకు దూషణ పాత్రం బే?

ఆ॥ వె॥ కాలమహిమ నెఱిఁగి కరణాలు నేర్పున
గళల నభ్యసించి గణుతికెక్కి
జనపదంబులందు జనులకు విద్యలు
గఱపిరేని బూజ్యఘనులటింద్రు?

"లక్షలకొలది ప్రజలకు ఆహారము, వస్త్రము, తలదాచుకొనుటకు స్థలము ఇదివఱకు లేకున్నది. రాజ్యాంగ విధానములో చేర్చబడిన కాంగ్రెసు ఆశయములు నెరవేర లేదు. ఈ ఆశయములను కార్యరూపములో పెట్టుటకై పోరాడవలసిన తరుణ మాసన్నమైనది. అవి సాధింపనిచో, రాజకీయ స్వాతంత్ర్యమనిన దానిలో మన కర్థమే లేదు" అని ఆ ప్రణాళికలో తెలుపబడినది. కాని కాంగ్రెసువారికి ఎన్నికలలో ఓటుచేయుచో, లక్షలకొలదిగ అన్నవస్త్రములకును, తలదాచుకొను స్థలమునకు దూరులైయున్న ప్రజలకు, ఏవిధముగ అన్నవస్త్రములు కాంగ్రెసుపార్టివారు సాధించి, అందుబాటులోనికి తెచ్చి యివ్వగలరో ప్రణాళికలో స్పష్టముగా తెలుపరైరి.

భూమి సంస్కరణములు, గృహపరిశ్రమల అభివృద్ధి, మొదలగుమామూలు పాటలనే ఎన్నిక ప్రణాళికలో సూచించిరి. కాని వాని వాస్తవ పరిస్థితులను గుర్తించి, వానిని నెరవేర్చు మార్గములను సూచింపరైరి. ప్రతివ్యక్తికిని ఒక ఎకరానో, రెండు ఎకరాలనో భూమిని ముక్కలు ముక్కలుగా పంచి యిచ్చి, అందఱికిని భూమిని యిచ్చినామను సంతృప్తిపడవచ్చును. ప్రతి వారికిని భూమి కాంగ్రెసువారు పంచి యిచ్చెదరను ఆశను కల్పింపవచ్చును. అట్టి ప్రజలెల్లరు నవీన శాస్త్రి పద్ధతులపై వ్యవసాయము ఆ చిన్నచిన్న ముక్క భూములలో సాధింపగలుగుదురుగా అని యోచించినవారు లేరు. భూమిని దున్నువాడే భూమి సొంతదారుడని మఱియొక ఆశాజనకమైన కేకను లేవదీసి యున్నారు. ఇది బాగాయున్నది. కాని భూమిని దున్నుచున్న ప్రతివ్యక్తికిని దానిని అభివృద్ధిలోనికి తెచ్చుటకు తగిన వ్యవధి, ఆర్థికసంపత్తు యున్నదా లేక యుండునా అని యోచించుటలేదు. భూమిని యొసగిన ప్రతివారికిని దాని అభివృద్ధికై ద్రవ్యసహాయము చేయగల స్థితిలో మనప్రభుత్వము లున్నవా లేక యుండునా అని యోచించేదిక్కులేదు. ఇదిచిన్న సమస్యకాదు. కొన్ని దశాబ్దముల వఱకును ప్రభుత్వములు రైతులకు ద్రవ్యసహాయము చేయజాలని స్థితిలోనే యుండుననుట మాత్రము సత్యము.

గృహ పరిశ్రమలను అభివృద్ధిచేసి, భూములు చాలని వారిని గృహపరిశ్రమల వైపు మరలింపవలెనని ఎన్నికల ప్రణాళికలో మఱియొక సూచన గావింపబడినది. గృహపరిశ్రమలపై తయారగు వస్తువులకు మొట్టమొదట గిరాకీ యుండవలెను. భూమిలో పనిచేయుటవల్ల లభించు కూలికన్నను (ఫలితముకన్నను) గృహ పరిశ్రమలలో పనిచేయువారికి ఎక్కువ కూలి గిట్టుబాటు అగునట్లుండవలెను. అట్లు చేయజాలనిచో, అనవసరముగ గ్రామ ప్రజలను పట్టణముల వైపు లాగి, పట్టణములపై లేనిపోని ఒత్తిడిని కలుగజేసిన వారయ్యెదరు.

పరిశ్రమల అభివృద్ధి విషయములో కొంచెము తత్తరపాటే యున్నది. పరిశ్రమలను జాతీయము చేయడములో:—

"అనేక విషయములను యోచింప వలెను. ఫలితమును గమనింప వలెను. ప్రభుత్వమునకుండు ద్రవ్య వసతిని చూడవలెను. ఏ పరిశ్రమనైనను జాతీయము చేయుటవల్ల అది ప్రజా సముదాయమునకెట్లు ఉపయోగపడునో గమనింప వలె"నని ప్రణాళికలో సూచింపబడినది. ఏక్షణములోనైనను, దేనినైనను ప్రభుత్వము స్వాధీనము చేసుకొనుటకు అధికారమున్నదని రాజ్యాంగ చట్ట సవరణ తీర్మానములో నున్నందు వలన, ప్రజలు తమ సొంత ద్రవ్యమును వెదజల్లి, పరిశ్రమలను అభివృద్ధి పఱచి, ప్రతి ఫలము లేకుండ, ప్రభుత్వమునోట పెట్టుటకు ముందుకు రారు. ఇది మానవ స్వభావము. పరిశ్రమలు జాతీయము చేయవలెనను కత్తి వ్రేలాడుచున్నంతకాలము, దాచియుంచబడిన ప్రజల మూలధనము దేశ పరిశ్రమల అభివృద్ధికై ముందుకు రాదు. అన్ని పరిశ్రమలను జాతీయ మొనర్చుకొని నిర్వహించుకొనగల ఆర్థిక సంపద, సామర్థ్యము ప్రభుత్వమునకు లేదు. ఈ అస్పష్టమైన వాతావర్ణము ప్రబలియుండు వఱకును దేశము పారిశ్రామికముగ అభివృద్ధి నొందజాలదు.

ఆర్థికాభివృద్ధితో పాటు, ఆర్థిక సమత్వము, సమవిభాగము జరుగవలెనని ప్రణాళిక నొక్కి చెప్పుచున్నది. ఇది మంచి సూత్ర మనుటకు

(మిగత 12-వ పేజీలో)

స్త్రీల పుట:

# స్త్రీలు ముందుకు రానియెడల – దేశ మభివృద్ధికి రాదు.

( శ్రీమతి యస్. పద్మావతీ దేవి గారు. )

"స్త్రీలు ముందుకు రానియెడల దేశము అభివృద్ధికి రా"దని ఈ వ్యాసమునకు శీర్షిక నిచ్చితిని. అది కొంత విపరీతమైన అర్థ మొసగ వచ్చును. పురుషులతో పాటు అన్ని రంగములలోను, అన్ని విషయములలోను, స్త్రీలు పోటి చేయవలెనని నా యభిప్రాయము కాదు. రాజకీయ రంగములో పోటిచేయవలెనని నా యభిప్రాయము కాదు. మానవ సంఘాభ్యుదయమునకు స్త్రీలు, పురుషులు సమాన బాధ్యులు. స్త్రీలు తమ బాధ్యతలను బాగుగ తెలుసుకొని, పురుషులకు సహచరులుగను, సహ కారులుగను తోడుపడిననే కాని ఏ దేశము ముందుకు నడువ జాలదని నా నిశ్చితాభిప్రాయము. అనేక వేల సంవత్సరములుగ దేశము, భగవంతుడు, మతము, పతిభక్తి యను గూఢమైన భావములు భారతీయ స్త్రీలలో నొక సాంప్రదాయము వలె, వంశ పరంపరముగ వచ్చుచున్నవి. ఈ భావములు వారి రక్తములో సమ్మిళితమై నరములన్నిటిలోను ప్రవహించుచున్నది. అందువలననే ఈ పుణ్యభూమియైన భారతావని యెంతమంది విదేశీయుల దండయాత్రలకు బలియైనను, ఎంతమంది మతాంతరుల దౌర్జన్యములకును, రాక్షస కృత్యములకును, బలియైనను, హిందూ మతము, హిందూ ధర్మము, హిందూ సాంప్రదాయములు ఈ దినమునకుకూడ నశింపక నిలిచియున్నవి. పశువృత్తిగల పలువురి పురుషులలో నీతి లోపించినను, హిందూ స్త్రీలు నీతిబాహ్యులు గాక నిలువబట్టియే ఈ సనాతన దేశమునకు సభ్య ప్రపంచములో మర్యాద దక్కినది. స్త్రీలు విద్యా వివేక సంపన్నులగుచో, వక్రమార్గమున పురుషులు నడచుటను మానుకొందురు. స్త్రీలు విద్యా సంపన్నులుకాని గృహములలోనే, పురుషుల యవినీతి ఎక్కువగ కనిపించుచున్నది. ఈ విషయమును స్త్రీలు బాగుగ గ్రహింప కోరుచున్నాను.

స్త్రీలకు ఉన్నత విద్యలను గరపినచో నీతికి దూరులగుదురని కొందరి యభిప్రాయము. విద్యలేని స్త్రీలు నీతికి దూరులు కాలేదా? విద్యకును, అవినీతికిని సంబంధము లేదు. విద్యవలన విజ్ఞాన మభివృద్ధి గాంచును. విజ్ఞానము అవినీతిని అడ్డగించును. నీతి, అవినీతి యనునవి వంశమర్యాదలపైనను, పెంపకము పైనను, సహవాసములపైనను, పరిసరముల పైనను ఆధారపడియుండును. స్త్రీలు విద్యావంతులగుచో, తమ భర్తలను మంచి మార్గములలో నడుపు సామర్థ్యము కలిగియుండుటేగాక, మాతృస్థానము వహించునపుడు, తమ సంతానమును సరియైన పద్ధతులపై పెంచుకొనుటకు తగినవారై యుందురు. ఉద్యోగములలో ప్రవేశించి, స్వేచ్ఛగ జీవించుటకై స్త్రీలు విద్యావంతురాండ్రు కావలెనని నేను చెప్పను. గృహ జీవితముకన్న మించిన ఉద్యోగములు స్త్రీలకు లేవు. గృహమునకన్న మించిన ఉద్యోగ కార్యాలయములులేవు. గృహనిర్వాహణ కార్యములలో, విజ్ఞానముగల స్త్రీలు నిర్వర్తింపవలసిన కార్యములతో, భార్యలు సహకరింప వచ్చును. గృహములలో నుండు యితర సభ్యులకు తోడుపడవచ్చును. బంధు మిత్రులకును, ఇరుగు పొరుగు వారికిని, గ్రామములలో నుండు యితర సోదరీ మణులకును సహాయ పడవచ్చును. విద్యా విజ్ఞానములు లేని వారు ఇతరు లెవ్వరికిని తోడుపడజాలక పోవుటే గాక తమకు తామే తోడుపడజాలని స్థితిలో నుందురు. కనుక స్త్రీలు విద్యావంతు రాండ్రగుటకు

దీక్షగా పాటుపడవలెను. తల్లిదండ్రులు, తోబుట్టువులు వారి విద్యాభివృద్ధికి యెన్నివిధముల తోడు పడగలరో యన్నివిధముల తోడుపడవలెనని ప్రార్థించుచున్నాను.

దేశమునకు స్వతంత్రము లభించి నాలుగు సంవత్సరము లైనది. ఏ వైపుచూచినను నిరాశ, అసంతృప్తి, నిరుత్సాహము పొడగట్టుచున్నది. దిన దినమునకు ప్రజలలో నిస్పృహ హెచ్చుచున్నది. ఒకరి కష్టములు మఱియొకరు విచారించుటకే వీలు కాకయున్నది. నా యిరుగు పొరుగు గృహములలో నుండు స్త్రీ రత్నములును, నా పట్టణములో నుండు సోదరీమణులును ఏరీతిగ నున్నారో, వారి కష్ట సుఖము లెట్టివో తెలుసుకొనుటకై అక్కడక్కడ కొన్ని గృహములకు పోతిని. బీదల యిండ్లలోను, మధ్యతరగతుల వారి గృహములలోను నా సోదరీమణులకు కట్టుకొనుటకు మారుచీరలు లేక బయటికి రాజాలకున్నారు. కొందరు చినిగిన చీరలను కట్టుకొని మానరక్షణకై కట్టుకొని యున్నారు. కొందఱికి తినుట కన్నము లేదు. ఒక స్త్రీ ప్రసవించి, ఏకవస్త్రయై, మురికి చీరలతోనే, మంచముపై పరుండి యుండెను. గుడ్డలులేనందున, మంచముపై పసుపు ఆకులను పఱచి, శిశువును పండబెట్టుకొని యుండెను. ఈ దృశ్యము చూచుటకే నాకు దుర్భరముగ నుండెను. ఆ బాలింతరాలికి గంజి పోయుటకు కూడ యింటిలో ఆహారము లేదయ్యెను. ఆ తల్లి దీనావస్తను నేను చూడజాలక నా యింటికి నేరుగా వెళ్లి, కొన్ని చింపిరి గుడ్డలను, ఒక పాత చీరను, ఒక పావు పాలను తీసుకొనిపోయి ఆమె గొంతులోపోసి, రక్తమయిన చీరను విడిపించి, వేరొక చీరను కట్టించితిని. బిడ్డకు స్నానము చేయించి, మెత్తగ గుడ్డలు పఱచి, తల్లి ప్రక్కలో పరుండబెట్టితిని. ఆ మహాతల్లి దుర్బలత్వముచే గడగడ వణుకుచుండిన చేతుల నెత్తి నాకు నమస్కరింపగనే, అప్రయత్నముగ కన్నీరు నాకు కారజొచ్చెను. "అమ్మా! నమస్కరింపకుము. నే నేమియు నీకు చెయ్యలేద"ని చెప్పి, ప్రోత్సాహ మొసగి, మరల వచ్చి చూచెదనని చెప్పి వెళ్లితిని. ఇట్టి దీనావస్థలో ఎంత మంది తల్లులున్నారో కదా? లక్షల కొలదిగా నున్నారు. ఈ దృశ్యములను నెహ్రూజీకి తెలుపు వారెవరు? నెహ్రూజీ చూచి భరింప గలుగునా? కూలి నాలి చేసికొని జీవించు బీదలకు న్యాయమైన ధరలకు గుడ్డల నిచ్చువా రెవరు? ఆహార ధాన్యములనిచ్చువారెవరు? వారు కొనదలచినను న్యాయమైన ధరలకు వారి కందిచ్చుదాతలు ఈనాటికి ఈ భారత భూమిలో మాయమైరి కదా?

ఇట్టి నిర్భాగ్యమైనస్థితికి దేశమును తెచ్చిన వారెవరు? ఎవరును కారకులని చెప్పుటకు వీలు లేదు. సమిష్టిపై, భారత భూమిలో నివసించిన ప్రజలలో నీతి నశించినది. స్త్రీలోకములో నైతిక జీవితము తగ్గుదల కొచ్చినది. అవినీతి మార్గములో నడుచుచున్న భర్తలను దండించు యోగ్యత, ధైర్యము, స్త్రీలలో శూన్యమైనది. లంచగొండులగు భర్తలను దండించి, చీవాట్లుపెట్టు భార్యలు లేరైరి. బ్లాకు మార్కెట్టులో వ్యాపారాలు చేయుచున్న భర్తలను దండించు పెండ్లాలు లేరైరి. మానవ సంఘమునకు అనునిత్యము ద్రోహము చేయుచు, అధిక లాభములను గడించి, బీదలను దోచి పెట్టినంతనే, ఆ ధనము అట్టి పాపభూయిష్ఠులైనవారి భార్యలకంటునా? వారి సంతతి జీర్ణించుకొనగలుగునా? దేశమంతయు పాడై పోయిన, వారు మాత్రము ఆనందముగ ఆలుబిడ్డలతో సుఖముల ననుభవింపగలరా?

ఇప్పుడు మన భారతభూమిని ఎదుర్కొనిన సమస్య లెన్నోగలవు. ప్రతియింటిలోను గృహస్థులనుభవించుచున్న కష్టము లెన్నోగలవు. ప్రతి గృహిణి ఎదుర్కొనుచున్న సమస్య లెన్నోగలవు. కనుక స్త్రీలెల్లరు అప్పుడప్పుడు ఒక పాఠశాలలలోనో, లేక పెద్దల గృహములోనో చేరి ఒకరి

## కాంగ్రెసు ఎన్నిక ప్రణాళిక.

(5-వ పేజీ తరువాత)

సందేహము లేదు. ప్రజలలోనున్న ఉత్సాహము, సామర్థ్యము, విడుదలవై సక్రమ మార్గములలో నడువవలెనన్న సమముగా పంపకము చేయవలెనను మాటకు ప్రాముఖ్యము తగ్గింపవలెను. ఉత్పత్తి అధికము కావలెనను దానిపైననే దృష్టినంతయు ఎక్కువగ కేంద్రీకరింపవలెను. అప్పుడే, దేశములో సర్వదిశల కనబడుచున్న కష్టములు వైతొలగును. దీనికంతయు శ్రీ జవహరిలాలు గారు సూచించినటుల. ప్రతివారును ముందు ఫలము నపేక్షింపక పనిచేయుటకు పూనుకొన్ననే కాని దేశ దారిద్ర్యమునకు విమోచన ముండదు.

---

### కడప డిస్ట్రిక్టు జడ్జి కోర్టులో

O. S. No 38 Of 51

మానవ గోపాలకృష్ణయ్య.— ... వాది.

V. S.

మానవ లక్ష్మినరసమ్మ, వగైరాలు.— ప్రతి వాదులు.

కమలాపురము సబ్ తాలూకా కొమ్మద్ది గ్రామములో వుండే ప్రతివాదులు (3) వోబిడ్డి వోబుళకొండారెడ్డి, (4) పోగాకు నిమ్మకాయల పాపిరెడ్డి—

సదరు కొమ్మద్ది మజరా అడవి చెర్లోపల్లె గ్రామములో వుండే ఐదో ప్రతివాది మూలి జోగిరెడ్డి గార్లకు—

**నోటీసు**

ఈ నెంబరులో వాదిని లేటు మానవ వెంకటేశమయ్యకు దత్తుకుమారుడని డిక్లేరు చేయవలయుననిన్నీ, సదరు వెంకటేశమయ్య తాలూకు యావత్తు ఆస్తిని స్వాధీనము వగైరాలకున్ను వాది దావా దాఖలు చేసియున్నాడు. 13_8_1951 వ తేదిన పగలు 11 గంటలకు వాయిదా వేయబడినది. మీకు ఆక్షేపణలు వుండిన కోర్టువారిఎదుట నాటిరోజున హాజరై తెలుపుకో వలసినది. తప్పిన మీ పరోక్షమందు విచారించి తీర్మానించబడునని తెలిసేది.

కడప.                                    శ్రీ కే. సీతారామయ్య,
తేది 20_7_1951.                        వాది పరం అడ్వకేటు,

---





## *** ప్రార్థన. ***

(శ్రీ కె. వి. సుబ్బరావు గారు, బి. ఏ.,)

(Adopted from Sri Swami Sivananda's Universal Prayer)

శ్రీపతే నీపద ధ్యాన చిత్తుడగుచు
స్తోత్రమొనరింప బూనిన చోద్యమగును
విశ్వకర్తవు భర్తవు విశ్వహర్త
సకలమును నీవె ప్రార్థన సల్పు టెట్లు.

స్ఫటిక సంకాశ సలిలములను
పాద ప్రక్షాళనము చేయ బోదమన్న
అభ్ర వాణియు నీ పాదమందె బుట్టె
అడుగు తమ్ముల నెట్టుల కడుగ గలను.

సచ్చిదానంద రూపమై స్వచ్ఛమైన
వలువ ధరియించి వెలిగెడి భక్తవరద
ఎట్టి పీతాంబరంబునే బెట్టగలను
ఎంత యోచించినను బుద్ధి కెక్కదయ్యొ.

ప్రకృతి యంతయు నీ సృష్టి ప్రతిభ గాదె
చేతనా చేతనంబు కతీతుడగుచు
నిండి నిబిడీకృతంబయి యుండునీకు
ఆసనంబేది వేతునో వాసుదేవ.

సూర్య చంద్రులు పరమాత్మ చూడ్కికవగ
చూచు చుందువు జీవుల సూక్ష్మ గతిని
అట్టినో నీకు చూడను అద్దమీయ
వెఱ్ఱియగు కాన నేమిత్తు విశ్వ వేద్య.

---

## గాంధీజీ జ్ఞాపకార్థము.

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

విద్యార్థులకు – సాహిత్యచర్చలు :

# ఆంధ్ర వాఙ్మయ యుగ విభాగము.

జాతియొక్క స్వధర్మమునకు సంఘర్షణ తటస్థించి, సంస్కార మెప్పుడు జరుగునో అప్పుడే ఒక యుగమని పేరు వచ్చును. అట్టి సంస్కారమున కెవడు తీవ్రకృషి గావించి కృతార్థుడగునో, వాని నామముననే ఆ యుగముగ వ్యవహరింపబడును. ఒక యుగముననే భిన్నమతము లుండగూడదాయని అడుగవచ్చును. అవును ఉండవచ్చును. కాని ఒకడు కాలమును, జాతిని ప్రతిఘటించినను, వాడు ఆ కాలమునకు, ఆ జాతికి జెందినవాడే. అనగా వాడా యుగమునందలి జాతి ధర్మములకు విరుద్ధముగానున్నను, వానియందు ఆ జాతి ధర్మము వానికి తెలియకుండ ద్యోతకమగుచుండును. బ్రాహ్మణ మతమును రూపుమాపుటకు బయలుదేరిన బౌద్ధమతమునందు కొన్ని బ్రాహ్మణమత వాసనలుండును.

ఒక్కొక కాలమున యుగకర్తలను ప్రపంచమే యెన్నుకొనును. జాతిధర్మమునకు విచ్ఛేదముగలుగ, దానిని సంస్కరించి, అట్టి సంస్కార రూపమును తన గ్రంథమున ద్యోతకము గావించునట్టివానిని యుగకర్త యందురు. అట్టి యుగకర్తయందు వ్యక్తిత్వము, ఆత్మీయత మున్నగునవి యనన్యసామాన్యమై యుండును. వాని నితరు లనుసరింతురు. వాఙ్మయ చరిత్రయందు కూడ నిదేవిధమున యుగవిభాగము చేయనగును.

కవులను, కావ్యములను విడిచి, కేవలము రాజులను బట్టియే, యుగ విభాగ మేర్పరచుట వాఙ్మయ చరిత్రకు సరిపడదు. ఇట్టియెడ ఒక యుగమున నొక మహాకవి మిక్కిలి ప్రఖ్యాతుడయినప్పుడు, తద్యుగ పురుషుడుగా నిర్ణయింపబడవలసినవాడు తత్కవియా లేక వానిని బోషించు రాజా యను విషయముకూడ విచారింపదగినది. ఒకానొకయుగ ముత్కృష్ట కావ్యరచనచే మిక్కిలి ప్రసిద్ధి వహించినపుడు, అయ్యుగ ప్రసిద్ధికి కారణభూతుడు ఆ కవియా లేక తత్కవీశ్వర పోషకుడైన రాజేశ్వరుడా? ఈ ప్రశ్నకు ఉభయులు కారణభూతులన్నచో నెవరికీ బాధయుండదు. కాని యుగపురుషుని నిర్ణయించవలసి వచ్చినప్పుడు మాత్రము ఈ యిరువుర తారతమ్యములను విమర్శింపక తప్పదు. ప్రభువులు ఆదరించుచు సకల విధముల బోషించుటచేతనే కవులకు మనశ్శాంతి కలిగి, ఉత్తమకావ్యరచన గావించి కీర్తివహించిరి. తమచే బోషింపబడిన కవు లట్టి ప్రసిద్ధకావ్యరచనలు గావించుటచే తనే తత్ప్రభులును కవితాచరిత్రమునందు స్మరింపబడుచున్నారు. అందుచే నొకరికీర్తి కొకరు కారకులగుచున్నారనుటలో సందియము లేదు.

కాని కవులను బోషించుచు, వారిచే నుత్తమకావ్యముల వ్రాయింపకయే, మన కవితాచరిత్రమున స్మరింపదగిన రాజులెవరైన నున్నారా? రాజాశ్రయము లేకయే ఉత్తమ కావ్యముల రచించిన కవులు మాత్రము గలరు. అట్టివాడే పోతన. పరమభాగవతోత్తముడగు ఈ మహాకవి రాజాదరణకు ప్రాకులాడక, కాదు–తిరస్కరించి, భగవదర్పితముగ మహాభాగవతము రచించెను. అందుచే ప్రాధాన్యము కవిదే గాని భూధవునిది కాదు. ప్రాధాన్యము కవిదేయైనప్పుడు తద్యుగ ప్రసిద్ధి కాతడే యెక్కువ కారణభూతుడగుచున్నాడు. కావున యుగపురుషుడుగా నిర్ణయింపబడవలసినవాడు కవియేగాని, రాజుకానేరడు.

పై విషయములను బట్టి వాఙ్మయ చరిత్రమున యుగ విభజనమును కవులను బట్టియే చేయనగును. అటుల చేయబూనినపుడు ప్రప్రథమమున తన భారతరచనచే నాటి దేశీయ కవిత్వములలో నాంధ్రకవిత్వమున కెక్కువ ప్రాధాన్య గౌరవములను గలిగించి కవుల కెల్లరకు మార్గదర్శకుడైన నన్నపార్యుడు మనకు మొదటి యుగపురుషుడని వెంటనే స్ఫురింపగలదు. అటులనే తిక్కనాది మహాకవులను ఆయా యుగకర్తలుగ చెప్పవలయును. నన్నపార్యుని కాలమునుండియు వాఙ్మయాభివృద్ధి చర్చించుటకుముందు ప్రాచీనాంధ్ర కాలమున భాషాస్వరూపము కవితాసృష్టి నెరుంగుటకూడ వాఙ్మయచరిత్ర కత్యంతావసరము.

వాఙ్మయచరిత్ర తెలిసికొనుటకు ఆధారములు:—

(1) కావ్యములు (2) దేశచరిత్రములు (3) సంఘచరిత్రములు (4) రాజకీయచరిత్రములు (5) జీవితచరిత్రములు (6) కవిజీవితములు (7) శాసనములు. దేశచరిత్రములలో నాయా కాలములలో సాంఘిక విపర్యాసములను బట్టి కావ్యజాలమునకు గల సంబంధమును గుర్తింప వలయును. కవుల చరిత్రలోని కవుల కవిత్వమును గూర్చి యభిప్రాయములను చిలుక పలుకులవలె గ్రహింపక, స్వయముగా చదివి, అభిప్రాయము లేర్పరచుకొన వలయును. జీవితచరిత్రల వలన కవుల యాత్మీయత కనుగొనవలయునుగాని, వారివారి స్థల నిర్దేశమునకే గోరంతలు కొండంతలుచేసి పెనుగులాడ నవసరములేదు. ఆత్మీయత కవియొక్క ప్రధానాంశమగు యాథార్థ్యమును గుర్తించుటకు సహకారియగును. ఏ కవిత్వమునకైనను యాథార్థ్యమే మూలబీజము. మఱియు ఆత్మీయతయే కవులకు ప్రత్యేకత గలిగించును. కాన కవుల జీవితములలో వారి పుట్టుపూర్వోత్తరములతో పనిలేదు. మరియు ప్రయోజనము గూడ లేదు. వారి ఆత్మీయతయే గావలయును. ఆత్మీయత కాల ప్రభావము. జాతి యొక్క స్వధర్మము, పరిస్థితులు అనునవి యా జాతి యొక్క వాఙ్మయ సృష్టికి కారణములు.

“కృష్ణా పత్రిక”

కష్టసుఖములను మహిళయొక్క తెలుసుకొన ప్రయత్నింపవలదా? వానిని పరిష్కరించు మార్గములను యోచింపవలదా? వానిని మన మంత్రులైనవారికి తెలుప వలదా? పత్రికలకు వ్రాసి ప్రజాభిప్రాయమును అనుకూలముగా నొనర్చుకొన వలదా?

ప్రజల జీవితములు వేరు, దేశ రాజకీయములు వేరని స్త్రీలు తలంపరాదు. దేశ రాజకీయములకును, ప్రజల జీవితమునకును సంబంధ మెక్కువగనున్నది. త్వరలోనే ఎన్నికలు రాబోవుచున్నవి. కనుక ప్రతిగ్రామములోను, పట్టణములోను స్త్రీలెల్లరు పలుమారు చేరవలెను. తమ సమస్యలను, దేశ సమస్యలను చర్చింపవలెను. సలహాల నివ్వవలెను. ముఖ్య సమస్యలపై తీర్మానముల గావించి దేశమును పరిపాలించు బాధ్యత వహించిన మంత్రులకు పంపవలెను. స్త్రీలు ముందుకు వచ్చిన కాని దేశ మభివృద్ధికి రాజాలదని ప్రతి భారతీయ యువతియున్న, ప్రతి స్త్రీయున్న గ్రహించు కొనవలెనని ప్రార్థించు చున్నాను.

—:♦:—

# ప్రజాభిప్రాయ వేదిక

## చెన్నపట్టణములో విద్యార్థుల కష్టములు.

ఆర్యా!

విదేశములనుండి పోవు విద్యార్థులకు పాశ్చాత్య దేశములలో వసతులు చాల యున్నవి. విద్యార్థులకై ప్రత్యేకమైన హాస్టల్సు (Hostels) హోటల్సు వున్నవి. దీనికి తోడు పెయిడ్ గెష్టులని (Paid Guests కర్చుల కిచ్చి భోజనము చేయు అతిథులు) గృహస్థ కుటుంబములలో చదువు కొనుటకు, భోజనమునకును వసతులు కల్పించి, ఒకరిద్దరు విద్యార్థుల నుంచుకొనెదరు. హాస్టలులకు, హోటల్సులకు ఇవ్వవలసిన కర్చులను కుటుంబయజమానికే విద్యార్థులిచ్చెదరు. ఆ కుటుంబములలోవారు భోజనాది సౌకర్యములను పొందెదరు. గృహయజమానులకు కూడ ఈ పద్ధతిలో నష్టముండదు. ఈ విధముగ పెయిడ్ గెష్టులుగ ఇంగ్లాండులోను, అమెరికాలోను గృహస్థ కుటుంబములలో నుండి చదువు ముగించుకొనిన హిందూదేశ విద్యార్థు లెందరో కలరు.

చెన్నపట్టణములో వివిధ కళాశాలాలలలోను, వృత్తి కళాశాలలలోను స్థానములను సంపాదించు కొనుటె కష్టముగ నున్నది. కళాశాలలలో స్థానము లు చిక్కిన తర్వాత విద్యార్థు లుండుటకు వసతులు బొత్తిగ లేకున్నవి. హాస్టల్సులలో స్థలము లేదనుచున్నారు. హోటల్సులో స్థలము లేదనుచున్నారు. విద్యార్థులింక యెక్కడవుండి, విద్యను పూర్తి చేసుకొనగలరు? ఈ కష్టములనుండి విద్యార్థులను తప్పించుట యెట్లు?

పాశ్చాత్య దేశములలోవలె చెన్నపట్టణములో నుండు గృహస్థులు కూడ ఈ సమస్యను దూర దృష్టితో యోచింపవలెను. భోజన కర్చులకు, రూము కర్చులకు పైక మిచ్చినను కూడ భోజనము పెట్టుటకు అవకాశములు లేని ఈ కష్ట కాలములో, విద్యార్థులనుండి భోజన కర్చులను, రూము కర్చులను తీసికొని అన్న వసతులు కలిగించుటలో తప్పు లేదు. అగౌరవము లేదు. విద్యార్థులను పెయిడ్ గెష్టులుగా గైకొనినచో వారి కెంతో మహోపకారము గావించిన వారయ్యెదరు. చెన్నపట్టణములో నుండు గృహస్థులు యీ విషయము యోచించి విద్యార్థుల కష్టములను తొలగించుటకు ముందుకు రావలెనని ప్రార్థించుచున్నాను.

మైలాపూరు. ఆర్. త్రిమూర్తి రావు.

---

## ఈ యన్యాయము ఎక్కడైన యున్నదా?

ఆర్యా!

దేశమునకు స్వతంత్రము వచ్చిన తర్వాత యువకుల కష్టములు, విద్యార్థుల కష్టములు యెక్కువై పోవు చున్నవి. దేశమంటె, నాయకులంటె యే విధముగ యువకులలో ప్రేమ భక్తులు ప్రజ్వలించునో తెలియదు. యువకులకు, సూక్ష్మబుద్ధి కలవారికి, కష్టపడి చదువుకొనే వారికి ఇండియా ప్రభుత్వము క్రిందకాని, రాష్ట్ర ప్రభుత్వాలలో గాని ఉద్యోగములు యివ్వకుంటె మానెను. ప్రభుత్వ యుద్యోగముల కొఱకై యువకులు చింతించే దినాలు పోయినాయి. ఆర్ట్సు కళాశాలలలోను, వృత్తి కళాశాలల లోను, సాంకేతిక కళాశాలలలోను, చేరి చదువు కొనుటకు సాంఘిక న్యాయము పేరుతో ప్రభుత్వములు ప్రతి బంధనములు కలిగించు చుంటే విజ్ఞానాభివృద్ధికై పరితపించే యువకులంతా ఏ మైపోవలెనో చెప్పే దిక్కు లేకుండా అయి పోయినది. యుక్త వయస్సు వచ్చి, చదువుకొనుటకు వసతులు, యోగ్యతలుకల యువకులకు చదువుకొని విజ్ఞానమును పెంపొందించు కొను అవకాశములు తొలగించినచో, వారి బుద్ధి వికాసములు, శక్తి, కాలము యేటి పాలై పోవుటె కదా?

(మిగత 16 వ పేజీలో)

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి)

[గత సంచిక తర్వాత]

## (4)

[చంద్రశేఖర, శ్యామలారావులు వాహ్యాళి వెడలి, తిరిగి వచ్చునపుడు జానకీ, రుక్మిణులు కలిసికొనిరి. రుక్మిణి శ్యామలరావు చెల్లెలు. జానకి ఉపాధ్యాయుని కొమరిత. తొలి చూపులలోనే చంద్రశేఖర జానకులకు పరస్పరము ప్రేమ జనించెను. శ్యామలరావు జానకిని ప్రేమించి, ఆమెను తనవైపునకు త్రిప్పుకొనుటకు తన చెల్లెలిద్వారా ప్రయత్నములు సేయుచుండెను. ముక్కోటియేకాదశినాటి మహోత్సవమున జానకి దారి దప్పి, జన సమూహమున చిక్కువడెను. విద్యార్థులు కొందఱు ఆమెను ముట్టడించి, అసభ్యచేతలకు గుఱి సేయబోవు సమయమున, చంద్రశేఖరుఁడు ఆకస్మికముగా వచ్చి తప్పించి, శ్యామలరావు సోదరి సాయంబున పన్ను పన్నాగమునుండి విముక్తిఁ జేసెను. ఈ సంఘటనముల వలన చంద్రశేఖర జానకులకు మఱింత ప్రేమ వృద్ధి యయ్యెను. చంద్రశేఖరుఁడు ఒంటిపాటున, తనకు జానకి యందు వొడమిన ప్రేమను గుఱించి వితర్కించుకొను సమయమున, శ్యామలుఁడటకు వచ్చెను. జానకికి వివాహము కానున్న విషయమును చంద్రశేఖరునకు జెప్పి, ఆతని సహాయ మర్థించెను. ఇరువురును జానకి వివాహము భగ్న మొనర్ప సంసిద్ధులు గనుక, ఉపాయాంతరమును నిశ్చయించి విరమించిరి. తరువాత ఈ ప్రకరణమున]

కాంచీపురమున రాజవీధియందలి యొక దివ్య భవనమున రమణీయాలంకృతమగు గదిలో లక్ష్మణరావు వాలుకుర్చీయం దాసీనుఁడై యేదియో నాలోచించుచుండెను. రాజబాట గల సందడి యొకించుకయు నాతని యాలోచనమున కడ్డు తగల లేదు. ఆతఁ డిట్లు గాద్గదిక స్వరమున దలపోయఁ జొచ్చెను. ‘జానకి మధుసూదనుని వరింపకుండుటకు కారణమేమి? ఆతఁడు సుగుణములు గలవాఁడు. పైపెచ్చు కన్యాశుల్కమున కాశింపని విశాల హృదయుఁడు. జానకీ కరగ్రహణమున కెంతయుఁ దగియున్నవాఁడు. సత్కుల సంజాతుఁడగు నాతఁడు కురూపియైన నేమి? నవమన్మథాకారుఁడైన వ్యక్తి దుర్గుణముల ఖనియగుచో, నాతనికన్న కురూపి త్రిభువనముల గాలించినను కానరాఁడు. ఆతని దరిఁజేరుటకు సజ్జనులు సంశయింతురు. లోకము దూలనాడును. ఇట్టి ధర్మసూక్ష్మమును విద్యావంతురాలగు జానకి గ్రహింపకుండుట కడు వింతగా నున్నది. నేనే స్వయముగా బోధించి చూచెద’ నని ‘జానకీ! జానకీ!’ యని పిలచెను. జానకి కూఁడ తోడనే యరుదెంచి నిలువంబడెను. అంత నాతఁడు ‘జానకీ! పెండ్లి తలపెట్టినప్పటి నుండియు, నీవు వింతగా ప్రవర్తించుచున్నావు. భోజన పానీయములందుగాని, అలంకారములయందు గాని శ్రద్ధ వహించుట లేదు. వాహ్యాళి వెడలుట లేదు. నెచ్చెలులతో ముచ్చటించుట లేదు. నీ హృదయమున గల దేదో చెప్పుము. నీ కోరినయట్లు సేయుదును.’

జానకి:— ‘నాన్నా! నేను మధుసూదనుని ప్రేమించుట లేదు. ఆతఁడన్న నాకయిష్టము. ఇష్టములేని పెండ్లి ఇంగువతో సమానమనుట తమ కెఱుఁగనిది కాదు. బలవంతమున నన్నాతని కిచ్చి ఏల నా జీవితమును దుఃఖమయ మొనరింతురు.’

లక్ష్మ:— ‘అమ్మా! ఆతఁడు నీకు నచ్చని కారణము నే నెఱుఁగుదును. ఆతఁడు రూపసి కాడని కదా నీవు నిరాకరించుట. నా మాటలు కొంచెము సమాలోచింపుము. ‘కులములోన నొకఁడు గుణవంతుఁడుండిన కులము వెలయు వాని గుణముచేత’ అని పెద్దలు వచించిరి. సద్గుణ గరిష్ఠుఁడు మధుసూదనుడు. మీఁదుమిక్కిలి విద్యాధికుఁడు. ఆతఁడట్టి సుగుణములచే లోకపూజ్యుఁడయ్యెను. కనుక శారీరకముగా మనోహర రూపమును బొందకపోయినను, మానసికముగా మహోజ్వల చరితుఁడయ్యెను. ‘అగుణస్య హతం రూపం’ అను నార్యోక్తి వినవా? రూపవంతుడైనను గుణము లేనిచో కురూపియగును. కనుక మధుసూదనుఁడు నీకుఁ దగిన వరుఁడు.’

జాన:— ‘సద్గుణములు గలిగియు రూపముగలవా రెవ్వరును లేరా?’

లక్ష్మ:— ‘ఉందురుగాని వంశము, కులము, గోత్రము, సరిపడవు. అందుచేత అట్టివారిని వరించుట హేయము.’

జానకి:— ‘మానవజన్మ మంతయు నొకటే. స్త్రీ పురుష భేదములు తప్ప కులభేదములు మానవ కల్పితములు. అట్టి విభేదముల పురస్కరించుకొని ప్రేమికుల కడ్డువెట్టుట తమ బోటి సర్వజ్ఞులకు దగని పని.’

లక్ష్మ:— ‘అయిన నీ వొక కులహీనుని ప్రేమించుచుంటివా? ఛీ! నీ ముఖము చూడరాదు. పొమ్ము. నిన్ను మధుసూదనునికే యిచ్చి వివాహ మొనరింతును. కులభ్రష్టవయి

యుండుటకన్న, అతని భార్యవై నీవు దుఃఖించుటే శ్రేయస్కరము' అని లక్ష్మణరావు కోపోద్దీపితమానసుఁడై వెడలి పోయెను.

జానకి యింటియందే తనగది యందు కూరుచుండి గాఢముగా యోచించుచుండెను. ముఖపద్మము మనోహరహాస్యరుచులు లేమి, ముకుళితమై కొంత నూని యుండెను. బాష్పంబులు కనుగవ నిండి, కుచాగ్రభాగోపరి గల పయ్యెదఁ దడుపుచుండెను. విషాద సహిత హృదయారవిందంబున నూహాపోహంబు లివ్విధంబున నిర్మింపఁబడుచుండెను. 'ప్రాణసఖా! సర్వాంగ సౌందర్య విరాజమానమగు నా యీ తనువును తొలిచూపుననే నీ కర్పించితిని. నీవే నా బాహ్యప్రాణంబవనియు, నా యేడుగడవనియు నమ్మితిని. అట్టియెడ తలిదండ్రుల యాజ్ఞ శిరసావహింప వలెననియు, కుల గౌరవమును నిలుప వలెననియు, నిన్ను విడనాడుదునా? విడనాడజాలను. ప్రాణముపోయినను శీలమును సంరక్షించుకొందును. మున్ను సావిత్రి ప్రథమదర్శన మాత్రమున ప్రేమించిన సత్యవంతుఁడు అడవులపాలై యుండినను, అతనినే వివాహమాడి, తన శీలమును రక్షించుకొనెను. మనసున తలపోయుట శారీరకముగా వ్యభిచరించుటవంటిది కాకపోయినను, మానసికముగ అట్టి పనికి తీసిపోయినది కాదు. కనుక చంద్రశేఖరునే వివాహమాడుదును. అది పొసఁగని నాఁడు శరీరమును త్యజింతును' అని లేవబోవు సమయమున నొక నూతనవ్యక్తి ప్రవేశించి, కమ్మనొకదాని నిచ్చి మాటలాడకయే వెడలిపోయెను. జానకి యిట్లు చదువ నారంభించెను.

కంచి,
తేది.................

ప్రేయసీ! భీతి నొందకుము. నా మేన ప్రాణము లున్నంతవరకు నీ యభిమతమునకే యంతరాయమును కలుగదని విశ్వసింపుము. నీకు నాయందు గల ప్రేమాతిరేకము కొనియాడఁ దగియున్నది. నీవు కాబోవు వివాహ బంధము నుండి యీవల బడ నిశ్చయింతువేని, మీ యింటి కెడమవైపున గల సందున కొక కారు నంపుచున్నాడ; సంశయింపక నీ వందుఁ బ్రవేశింపుము. అయ్యది నే నున్న ఒక రహస్య ప్రదేశమును జేరును.

ఇట్లు నీ ప్రేమపెన్నిధి,
చంద్రశేఖరుఁడు.

'ఆఁడబోయిన తీర్థ మెదురైనట్లు, సరియైన సమయమునకే ఉత్తరము జేరినది. ఇఁక సంశయింప నేల? ఇప్పటి కారు గంటలు కావచ్చుచున్నది. ఈ యుదంత మెవ్వరెఱుఁగని యట్లు వర్తించెద. సమయము నిరీక్షించి, నా మనోహరుఁ జేరి, నా జననీజనకులకు పాఠము నేర్పించెద' నని లేచి, మనోనిశ్చయమును ముఖపద్మము వెలువరించుచుండ వాతాయనము చెంత నిలుచుండెను. అంతలో రుక్మిణి ప్రవేశించెను. తరువాత వారిట్లు సంభాషించిరి.

జానకి:— 'రుక్మిణీ! నీ వరుదెంచిన కారణ మేమి?'

రుక్మి:— 'నెచ్చెలీ! ప్రాణసఖి పరిణయోత్సవము సమీపించుచుండ స్నేహితురాండ్రు రాకుందురా?'

జానకి:— 'రుక్మిణీ! దానికేమిగాని, నీవు మాత్రము పెండ్లిమాట నా యెద్ద యెత్తకుము.'

రుక్మి:— 'కాబోవు పెండ్లి అనుకొనకున్నంత మాత్రమున నిలిచిపోవునా?'

జానకి:— 'అది వేరుసంగతి. దానితో నీకేమి. నీవు మాత్రము దాని ప్రశంస తేవలదు.'

రుక్మి:— 'చిత్తము. కుడువబోవు కూరాకురుచు లిప్పుడెందులకు. నే బోయివత్తును' అని నిర్గమించును.

మరుదినోదయము ఉదయము 8 గంటలకు ముహూర్తము. లక్ష్మణరావు పంపున కైవర్తజనంబులు తమ్ము పనిచిన కార్యము లొనర్చుచుండిరి. గృహమంతయు విద్యుద్దీపప్రకాశంబున ప్రకాశించుచుండెను. కుడ్యంబులు వివిధ చిత్రపట సహస్రంబులచే నలంకృతమై యుండెను. వాతాయన ద్వారబంధముల పచ్చతోరణములు విరాజిలుచుండెను. గదులు బంధుజన సమాగత ప్రవర్ధిత కుతూహలోదధి తరంగముల నోలలాడుచుండెను. చకోర నివహంబులు చుక్కల దొరకై నిరీక్షించు తెఱంగున నెల్లరు లగ్నకాలంబున కెదురు సూచుచుండిరి.

వివాహమంటప మలంకృతమై యుండెను. కంబంబులఁ గట్టిన రంభాకంబములు దృక్పథముల తమవైపున కీడ్చుచుండెను. తోరణంబులు పలువిధ ఛాయల వెదజల్లుచు, నయనాహ్లాద మొనర్చుచుండెను. గంధవహుఁడు సువాసన ద్రవ్యంబుల పొత్తుఁ జేరి పెలఁగుచు సుఖాసీనులై యున్న బంధుజనుల కానంద మొదవూర్చుచుండెను. ఒక్కచో విశాల శిలాతలంబున విరాజిలు రత్నకంబళముపై బాలబాలికలు నిదురించుచుండిరి.

ఇట్లుండ నింటిమోసల గల యలంకారములకు మేరయే లేదు. చలువపందిళ్లు, పచ్చతోరణంబులు పురవీధుల జను జనపదంబుల దృష్టి నాకర్షించుచుండెను. అచటికి కొంత దూరంబునఁ గల మఱియొక గృహంబున పెండ్లివారు విడిసి యుండిరి. అయ్యది సామాన్యముగ నలంకరింపఁబడియుండెను. అందు విడిసినవారు క్రొత్తవారగుటచే నందలి యలంకారములను విచిత్రముగాఁ జూచుచుండిరి. ముహూర్త సమయమాసన్నమగుటచే, పురోహితు ననుమతిని వధూవరుఁ డలంకారముల తీర్చుకొనుచుండెను. ఎల్లెడల సంతోషము సాగరము వలె నుబుకుచుండెను. యువిదారత్నంబులు మందగమనమున నటునిటు చరించుచు, యువకు లొనర్చు కనుసన్నల మన్నించుచు, మందస్మితవదనారవిందు లగుచుండిరి. ఈ మహోత్సవమున లక్ష్మణరావు శాంతాదేవుల కుతూహలము వర్ణింప నాదిశేషుని కేనియు దరంబుగాదు. ఏకపుత్రి యగు జానకి వివాహ మట్టి యానంద మొదగూర్చుట అతిశయోక్తి గానేరదు. (మిగత 16 వ పేజిలో)

# వ్యక్తులు—పార్టీలు.

(శ్రీ. భూతపురి నారాయణస్వామిగారు.)

శ్లో॥ కర్పూర ధూళీ రచితాల వాలః
కస్తూరికా కుంకుమ లిప్త దేహః
సువర్ణకుంభైః పరిషిచ్యమానో
నిజం గుణం ముంచతి నో పలాండుః.

[కప్పురపు పొడిచే పాదు చేసి, కస్తూరి, కుంకుమము పూతె పూసి, బంగారు బిందెతో నీరు పోసి, పెంచినను ఉల్లి తన నైజగుణమగు దుర్వాసనను విడువదు.]

ఉల్లి నందనవనములో నాటినను ఉల్లియే కాని మల్లియ యు కాజాలదు; మందారముగను మారజాలదు. బీజరూపమున నున్నతరి చెడ్డ కంపు కానుపింపక పోవచ్చును. అంకురించి, పెరిగి పెద్దది కాజొచ్చిన కొలది దాని సహజ స్వభావము గోచరించును. ఇట్టి యుల్లిచెట్టు లొకటి రెండున్న బాధ తెలియక పోవచ్చును; పెక్కులున్నచో నందనవన ప్రభావము మందగించును, కడను నశించును. మందారాది దివ్యకుసుమ పరిమళ మంతరించును. వాతావరణ మంతయు దుర్భర దుర్వాసనా పూరిత మగును. అట్టి తరి నందనవనమని యెవ్వ డానందించును? ఎవ్వడు ప్రవేశించును? దివ్య తరు బృందముచే ప్రభావము గడించిన నందనవనము ఉల్లి తోట యగును. శుక పికాదుల మధుర ధ్వనులకు బదులు జోరీగల నినాదములు పిక్కటిల్లును.

ఇట్టి దుర్గతియే నేడు కాంగ్రెసుకు పట్టినది. దేశసేవా పరాయణు లడుగున బడినారు. స్వార్థపరులు ప్రబలినారు. అధికార వాంఛ, అర్థసముపార్జనాసక్తి హద్దు దాటినవి. అకార్యాచరణ మధిక మయినది. చిత్తము చెడినది; సేవ పడినది. వితండ వాగ్వైఖరి యలవడినది. మహానుభావులు తపించి, సంపాదించిన స్వాతంత్ర్యము జారిపోవునా యను దిగులేర్పడినది. స్వాతంత్ర్య సంపాదనానంతరము తత్పూర్వము బీజరూపమున నడగి యుండెన స్వార్థపరత అంకురించి, యెదిగినది; పల్లవించి, నవ నవోన్మేషముతో నసలు దొడిగినది. నెహ్రూకైన,— నొకవేళ దివినుండి దిగివచ్చినను ఆ మహాత్మునకైన— దీనిని పెకలించివైవ సాధ్య మగునా?

అధికార ప్రాప్తి కనర్హ కార్యములకు వెనుదీయరు. అధికారము దుర్లభ మయినచో నన్యపక్షావలంబనమున కత్తులు సాచెదరు. వ్యక్తుల దుశ్శీలముచే సంస్థయే కలుషిత మైనది. నందనవనమును మాని చైత్రరథ విహార మొనరింతమనినచో, నందును ఈ యుల్లిచెట్లు మొలవకుండునా? ఏ పక్షమైనను వ్యవహరింపబడుట కందు జేరిన సభ్యుల శీలమే ముఖ్యాధారము. ప్రతిపక్షమును తన విస్తృతి నపేక్షించును; పక్షనాయకులు స్వాధికారవాంఛతో గుణదోష విచారము లేక సభ్యులను జేర్చుకొందురు. వీరి ననుచరుల జేసికొనుట, సంతృప్తి పరచుట యవశ్యకర్తవ్యములు. కానిచో నధికారము హస్తగతము కాజాలదు. అధికార వ్యామోహ మవి నీతికి దింపినది. ఏ పక్షమైనను, దాని బాగోగులు పక్షనాయకులపై నున్నవి. సంస్కారము చర్యవలన గలుగును కాని తీర్మానముల వలన గలుగదు.

స్వాతంత్ర్యము లభించిన తోడనే కాంగ్రెసు నాయకుల బుద్ధి మారిపోయెను. సత్యాగ్రహ మొనర్చిన వారికి భూములు పంచి యిచ్చిరి. శాసనసభా ప్రవేశార్హత కారాగారమునకు పోయిరాని వారలకు లేదనిరి. తమ సంఘములకు, తమ సభ్యులకు పరిపాలనమున సామాన్యోద్యోగుల దైనందిన కార్యములందు సైతము పెత్తనము గలిగించిరి. గౌరవము, లాభము, పలుకుబడి, కాంగ్రెసు సభ్యులు కాని వారి కందుబాటులో లేకుండ జేసిరి. తుదకు సర్వము కాంగ్రెసు సభ్యుల కొఱకే నియమిత మనిపించిరి. ఈ చర్యల వలననే కాంగ్రెసు లోని త్యాగ శీలము విధ్వస్త మైనది. చిత్తములు పెత్తనము వైపునకు ప్రాకినవి. దేశ భక్తులు దేశ భోక్త లయిరి. యోగ్యులను వెనుకకు నెట్టి, యయోగ్యులు ముందుకు వచ్చిరి.

ఈ యకార్యములకు ప్రతీకారము లాలోచించి యొనర్పక కేవలము "ఏకీభావ సూత్రము లుపన్యసించిన మాత్రమున నభిలషిత సంస్కార మబ్బునా?" కాంగ్రెసు సంఘముల దృష్టి అధికారములపైనుండి నిష్కామ సేవపై మఱల వలెను; మఱలు నటుల విధింప వలెను. అధికారము లందకుండ జేయ వలెను. ఇట్లు చేసినచో దుశ్శీలురు తమంత తామే తొలగి పోదురు. సంస్థ చక్కబడును.

ఓం తత్ సత్.

[ప్రజాభిప్రాయ వేదిక:— 10—వ పేజీ తరువాత]

బ్రాక్ వర్డు క్లాసు, పెడ్యూలు క్లాసు, వెనుక పడిన, క్లాసులు, మైనారిటీ క్లాసులు, ముస్లింలు, క్రైస్తవులు, యింకా యెంతమందికి కావలయు నంటె అంత మందిని ముందుకు తెచ్చుటకు ఎలిమెంటరీ పాఠశాలలలోను, సెకెండరీ పాఠశాలలలోను, అన్ని కాలేజీలలోను, జీతాలు లేకుండ చదువు చెప్ప వచ్చును. జీతాలు (Tuition Fees) లేకుండా చేయుటే కాకుండ పై జాతుల వారికిని, కులముల వారికిని మతముల వారికిని, పాఠశాలలలోను, కళాశాలలలోను చేరి చదువు కొన్నందుకు విద్యార్థి వేతనాలు (Scholarships) యివ్వవచ్చును. కేంద్రప్రభుత్వము క్రిందను, రాష్ట్ర ప్రభుత్వముల క్రిందను యుద్యోగములు గ్యారంటీ చేయవచ్చును. ఇటువంటి అవకాశాలు యెన్నింటినో కల్పింపవచ్చును. ఎవ్వరికిని చింతయుండదు.

ఏ జాతుల వారు, యే కులముల వారు సంఘములో ముందుగ నున్నారని మంత్రులు తలచెదరో అట్టివారు పాఠశాలలలోను, కళాశాలలలోను ఒకటికి రెండంతలు జీతములు (Tuition Fees) యివ్వ వలయునని నిబంధనల నేర్పరుప వచ్చును. ఈ ఫార్వర్డు (Forward) తరగతి క్రిందికి వచ్చే విద్యార్థుల కెవ్వరికి కాని స్కాలర్ షిప్పులు యివ్వకూడదని తీర్మానింప వచ్చును. పాఠశాలలలో కాని లేక కళాశాలలలో కాని చేరుటకు వచ్చు ప్రతి విద్యార్థి నుండి "ఇండియా కాన్‌స్టిట్యూషనులో పౌరులకు యే విధమైన హక్కులు యివ్వబడినను, రాష్ట్ర ప్రభుత్వము క్రిందకాని, కేంద్ర ప్రభుత్వము క్రిందకాని ఉద్యోగములను కోరు హక్కు వదలుకొను చున్నాన"ని వ్రాత మూలకముగ అడ్మిషన్ స్టేటుమెంటులు తీసుకొన వచ్చును. 100 కి 80 మార్కులు వచ్చిననేకాని ఉన్నత పాఠశాలలలో కాని, కళాశాలలలో కాని ప్రవేశ మిచ్చుట లేదని ప్రత్యేక నిబంధనను చేయ వచ్చును. ఇట్టి నిబంధనలు, నిర్బంధములు యెన్ని చేసినా మానెను. వాని కన్నిటికి ఒప్పుకొని కేవలము విజ్ఞానాభివృద్ధికై కళాశాలలలో ప్రవేశముగోరు యువకులకు కాంగ్రెసు మంత్రులు స్థానము లిప్పింపరాదా?

తండ్రికాని, తాతకాని కళాశాలలలో చదివి, యెందుకు పనికిరాని డిగ్రీని (Degree of an University) పొందినంత మాత్రమున వారి కొడుకులకు, మనుమలకు కళాశాలలలో స్థానమివ్వవలసిన అవసరము లేదని ప్రపంచములో యేదేశములో కాని, ఏ ప్రభుత్వముకాని యుత్తరువులు చేయునా? తండ్రులు, తాతలు చదువు కొనిన దోషములు (నేరములు) వారి సంతతి వారికి పట్టునని గాంధీజీ సర్వ మానవ సమత్వ సిద్ధాంతముపై పనిచేయు కాంగ్రెసు ప్రభుత్వమువారు యుత్తరువులు చేయ గలరు కాని, ప్రపంచములోగల యే నాగరిక దేశము యిట్టి యుత్తరువులను చేయ జాలదు. ఇట్టి న్యాయ మెక్కడ నుండబోదు.

తిరుపతి. యస్. ఆర్. బలరామన్. బి. ఏ.,

## ధర్మ విజయము.

(14 వ పేజీ తరువాత)

ఎనిమిది గంటలు కావచ్చుచున్నది. దుకూలభూషణాంబరముల ధరించుకొని రా నియమింపఁబడిన జానకి యింకను వివాహమంటపమునకు రాలేదు. ఆలస్య మగుచుండుటఁ జేసి శాంతాదేవి కుమరితె యుండవలసిన గది ప్రవేశించెను. జానకి అచ్చట లేదు. దొడ్డిలోని కేగియుండునని పోయి పరికించెను. కాని కనుపింప లేదు. వివాహమాడుట కిష్టము లేనందున ఇంటియం దెందేని దాగియుండుననియు, ఈ విషయము బంధుజను లెఱింగిన అవమానము ఘటిల్లుననియు, తానే రహస్యముగా కూతురుండు జాడ నరసి మందలింపవలెననియు తలంచి, హృదయారాటమును దిగమ్రింగుచు, గృహ మంతయు గాలించెను. జానకి యెందును కానరాలేదు. శాంతాదేవి యిక దుఃఖ మాపుకొనలేక నేలఁగూలి యేడువజొచ్చెను. బంధుజనులయందు గుసగుసలు బయలుదేరెను. జానకి మాయమైనదను సంగతి నలుదెసల బ్రాకెను. కొన్ని నిముషములలోనే ఆనందార్ణవము దుఃఖార్ణవముగా మారెను. లక్ష్మణరావు కుమారిత యొనరించిన చేతకు నిర్విణ్ణుఁడై, చేయునది లేక కలిగిన యవమానమునకు తల వంచుకొనెను. పుర మెల్లెడల జానకి యదృశ్యవార్త వ్యాపించెను. లక్ష్మణరావు అపరాధపరిశోధకుండగు మోహనులాలును రాబనిచి, సర్వము నివేదించెను. అతఁడు, కొన్ని ప్రశ్నములు వేసి, జానకి యుండిన గది పరీక్షించి, మఱియొకమారు వచ్చెదనని చెప్పి, వెడలిపోయెను.

వరుఁడగు మధుసూదనుఁడు తనకు కలిగిన యవమానమునకు ఖేదపడి, బంధుజనసమేతముగా తన గ్రామమునకు మఱలిపోయెను.— మనుజుఁ డొకటి తలంప మాధవుఁ డొకటి తలంచును. లీలామానుష విగ్రహుఁడగు భగవంతుని చేత లెవ్వ రెఱుఁగఁ గలరు?

[4 వ ప్రకరణము సమాప్తము.]

## మనవి

ఈ వారము పత్రికలోని 6 నుండి 11 వఱకుగల పుటలు పొరపాటున క్రమముదప్పి ముద్రణ కాబడియున్నవి. పాఠకులు ఈ పొరపాటును సవరించుకొని పేజీల వరుసన చదువుకొన వలయునని ప్రార్థించుచున్నాము.

"భారత జ్యోతి" "మేనేజరు."

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక, REGISTERED No. M. 5285. విడిపత్రిక అణాలు 3

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఎ.

| సంపుటము 4. సంచిక-25. | బుధవారము, అగస్టు 1, 1951. | ప్రతి బుధవారము వెలువడును. |
|---|---|---|

## విషయానుక్రమణిక



——:(0):——

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 25.

శ్రీ ఖరనామ సంవత్సర ఆషాఢ బ. ౧౪, ఆగష్టు, 1, 1951.

ప్రతి బుధవారము ప్రకటింపబడును.

## ప్రజల ప్రాణములతో జూదమాడుట కాదా?

ఆహార సమస్యను కేవలము ఒకచిన్న విషయముగ మంత్రి వర్గమువారు భావించుచున్నారు. రేషనింగు పరిమాణమును, ధరలను, ఉన్నట్లుండి తగ్గించుట, ఎక్కించుట వలన మానవ జీవితమునకు అత్యంత ప్రాముఖ్యమైన ఈ విషయములో, మంత్రి వర్గమువారు ఎక్కువ బాధ్యతతో మెలగుచున్నటుల కనపడుట లేదు. ఏ ధాన్యమునైనను ప్రజలకు చాలినంత సేకరించుటకు కాని, దిగుమతి చేసుకొనుటకు కాని వీలుండదని తట్టినప్పుడు, రేషనింగు ప్రమాణమును హెచ్చించి, ప్రజలలో లేనిపోని ఆశను పురిగొల్పకూడదు. పోయిన సంవత్సరమంతయు 6 ఔన్సుల బియ్యముతోనే ప్రజలు తృప్తిపడి యుండవలెననిరి. కాలమో కర్మమో యని ప్రజలు దానితో విధిలేక సరిపుచ్చుకొని ప్రాణములను పట్టుకొని యుండిరి. అంతటితోనే ఊరకుండిన బాగుండెడిది. అట్లు చేయరైరి. 6 ఔన్సులను 7 ఔన్సులకు పెంచిరి. దానిని మరలా 8 ఔన్సులకు పెంచిరి. ఇంకను హెచ్చించుటకు ప్రయత్నించెదమని ఆశ కల్పించిరి. తీరా నాలుగు నెలలు గడచీ గడవక మునుపే ఇప్పుడు ఉన్నట్లుండి ఈ ఆగష్టు నెల 12-వ తేదినుండి, మరల ముందురీతి 6ఔన్సుల బియ్యమే ఇవ్వబడునను ఒక ప్రకటనమును చేసి యున్నారు. ఇది ఒక మోటు దెబ్బవలె తాకినది. ప్రజలకు ఏ కష్టములైన ఉండుగాక, బ్రతికిన బ్రతికెదరు గాక. చచ్చిన చచ్చెదరు గాక. మొట్టమొదట 6 ఔన్సుల నుండి 8 ఔన్సుల వరకు బియ్యము రేషన్ హెచ్చించియే యుండకూడదు. ఒకసారి హెచ్చించిరా మంత్రివర్గమున కేమి కష్టమైన ఉండుగాక. ఆ 8 ఔన్సుల పరిమాణమును తగ్గింపకూడదు. అప్పుడే మంత్రివర్గముల పైనను, ప్రభుత్వముల పైనను ప్రజలకు విశ్వాసము, ఆదరణ భావము ఏర్పడును. ఒక నిలుకడ లేక మాటిమాటికి హెచ్చించుట, తగ్గించుటవలన ప్రజలలో నిరాశ జనించును. మంత్రి వర్గముల పై విశ్వాసము తగ్గిపోవుటయే గాక ఆగ్రహము హెచ్చును.

ఈ ఆహార విషయములలో ప్రభుత్వము వారు అనుసరించుచున్న విధానము చాల చిందరవందరగా నున్నది. చీటికి మాటికి బియ్యము పరిమాణము మార్పుగావించుట చూడ ఈ ఆహార సమస్యయే ప్రభుత్వము వారికి బొత్తిగా అర్థమైనటుల లేదు. బర్మా మొదలగు దేశములలో కావలసినంత బియ్యము కలదు. సరసమైన ధరలకే చిక్కగలదు. కాని యూనియన్ మంత్రివర్గములో ఆహారశాఖా మంత్రియైన శ్రీ కే. యం. మున్షీ గారికి, ఊహ, దూరదృష్టి లేనందున ఆ దేశ ప్రభుత్వములతో తరుణములో అనుకూలమైన ఒడంబడికలను గావించుకొనరైరి. అనుకూలమైన

ధరలకు ఎక్కువ బియ్యము దిగుమతి యగుటకై ఏర్పాటు చేయనైరి. ఈ రాష్ట్రమునకు 2 లక్షల బియ్యము చాలదనియు, దానిని 4 లక్షలకు హెచ్చింపవలెననియు, చెన్నరాష్ట్ర మంత్రివర్గము వారు యూనియన్ ప్రభుత్వమును ఒత్తిడి చేయుచుండిన మాట వాస్తవము. కాని యూనియన్ ప్రభుత్వమువారు ఈ రాష్ట్ర పరిస్థితులను బొత్తిగ యోచింపనైరి. బియ్యము దిగుమతులను ఈ రాష్ట్రమునకు హెచ్చుచేయుటకు నిరాకరించిరి.

దీనికితోడు విపరీతమైన ధరపెట్టి యూనియన్ ప్రభుత్వమువారు సయామునుండి బియ్యమును ఈ దేశమునకు దిగుమతి చేసుకొనిరి. దానిని ఈ రాష్ట్రమునకు పంపిరి. స్థానికముగ చిక్కు బియ్యము ధరకన్న, రెండంతల ధర ఈ సయాము బియ్యమునకు నిర్ణయించిరి. ప్రజల నెలపై ఆ హెచ్చు ధరనుపెట్టి ఆ సయాము బియ్యమును అన్నము లేని ప్రజలకు పంచి పెట్టుటకు మంత్రివర్గమువారు తీర్మానించుకొని యున్నారు. సయాము బియ్యమును ప్రత్యేకముగ అమ్మిన ప్రజలు దానిని కొనరనియు, స్థానికముగ చిక్కు బియ్యము ధరతో పాటు, సయాము బియ్యమును అమ్మినచో ఒకకోటి రు॥లు ఇండియా ప్రభుత్వమునకు నష్టము వచ్చునని చెప్పుచూ, స్థానికముగ చిక్కు బియ్యము ధరను, సయాము బియ్యము ధరకు ఒకటిగనే పెట్టి విక్రయించవలెనని ఈ రాష్ట్ర మంత్రివర్గమువారు తీర్మానించిరి. ఆగష్టు 12-వ తేదినుండి ఒకపడి బియ్యమునకు 7 పైసాలు హెచ్చించు నిర్ణయమునకు వచ్చిరి.

12 ఔన్సుల రేషనింగు ప్రమాణములో బియ్యము మాత్రము 6 ఔన్సులే ఇచ్చుటవలన మిగత 6 ఔన్సులు ప్రజలు విధిలేక గోధుమలనే కొనవలసియుండును. పోనీ గోధుమల ధరయైన సరసముగ నున్నదాయని యోచించిన దానిపై 1 పడికి మూడు అణాలు హెచ్చించి యున్నారు. ప్రజల జీవిత వ్యవహారమును తొలగించి, అన్నాతురులైన వారికి అందుబాటులోనికి అన్నమును తెచ్చుటకై ఆహార ధాన్యముల ధరలను తగ్గించుటకు మారు, ఏదో ఒక కారణముపై ప్రభుత్వమువారే హెచ్చించుటకు పూనుకొనినచో, ఇక ప్రజలకు దిక్కెవరు? బ్లాకు మార్కెట్టు ధరలు ఇంకను హెచ్చగుటే కదా? ఇట్టి విధానము నవలంబించుట వలన — మంత్రి వర్గమువారు ప్రజల ప్రాణములతోనే జూదమాడుట కాదా?

## ఇన్‌కంటాక్సు సవరణ బిల్లు — ఉపసంహరింపబడుట.

ఇండియా యూనియన్ ప్రభుత్వము వారికి, కట్టకడపటికి, కొంచము మంచి బుద్ధి పుట్టినట్లున్నది. ఈ నెలలో సమావేశమగు పార్లమెంటు సభలో ఇన్‌కంటాక్సు "సవరణ బిల్లును" ప్రవేశపెట్టుట లేదని ప్రభుత్వమువారు తీర్మానించినటుల, ఆర్థిక శాఖ స్టేటు మంత్రిగారైన శ్రీ మహావీరత్యాగిగారు జూలై 30-వ తేది రాత్రి ఒక ప్రకటన చేసియున్నారు. తమది ప్రజాప్రభుత్వమనియు, తమ ప్రజాప్రభుత్వములో పన్నులకు సంబంధించిన బిల్లులయొక్క మంచిచెడ్డలు, ప్రజలు పూర్తిగ గ్రహించుటకు కావలసినంత అవకాశమివ్వనిదే, వానిని పార్లమెంటులో తొందరపడి ప్రవేశపెట్టి శాసనము గావింపకూడదని భావించియున్నారట. ఇప్పుడు జరుగబోవు పార్లమెంటు సభయే ఆఖీరు సభ. ఎన్నికలు జరిగి పార్లమెంటు సభ క్రొత్తగా ఏర్పడు వరకును ఇక పార్లమెంటు సభలు జరుగవు. ఇప్పుడు జరుగు పార్లమెంటు సభలో ఈ బిల్లును, ప్రవేశ పెట్టకపోయినచో, అది రద్దు అగును. అవతల చెల్లనేరదు. ఇండియా ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమునకై ఇంతమాత్రము గౌరవ మొంచినందులకు ప్రజలెల్లరు, కృతజ్ఞులై యుందురు — ఎన్నికలు జరిగి క్రొత్త ప్రభుత్వము ఏర్పడు లోపలనే, ప్రస్తుత సవరణ బిల్లును శాసనముగా చేసి ప్రజలపై ఇన్‌కంటాక్సు ఆఫీసర్లు ఇష్టమొచ్చినట్లు సవారీ చేయకుండ ఆపుదల చేసినందులకై, ఇండియా ప్రభుత్వము వారెంతయు అభివందనీయులు.

# 1950 వ సం॥ చెన్నరాష్ట్ర గ్రామ పంచాయితీ చట్టము.

[గ్రామ ప్రజల ఉపయోగార్థమై కొన్ని ముఖ్యాంశములు ఈ పత్రికయందు ప్రకటించుచున్నాము.]

—0—

ఏప్రిల్ మొదటి తేదీనుండి అమలులోనికి వచ్చినది.

---

1920 వ సం॥న లోకల్ బోర్డు చట్టము ప్రకారము నిర్మితమై 1951 వ సం॥ ఏప్రియల్ వరకు పనిచేయుచున్న పంచాయితీలే, క్రొత్త చట్టము క్రింద పంచాయితీలుగా పరిగణింప బడును. ఇంతవరకు కార్యనిర్వాహకులుగా నున్నవారే, ఎన్నికలు జరుగు పర్యంతము నుందురు. (చెన్నరాష్ట్ర గ్రామ పంచాయితీ చట్టము మూడవ షెడ్యూలునందలి 2, 4 సూత్రములు).

### 1950 వ సం॥పు గ్రామ పంచాయితీ చట్టము — ముఖ్యాంశములు.

1. ఐదువందలు జనసంఖ్య కలిగిన ప్రతి గ్రామమునకు ఒక పంచాయితి యుండగలదు. అంతకు తక్కువ జనసంఖ్య కలిగిన గ్రామములు, ప్రక్కగల పంచాయితీలో చేర్చబడును, లేదా అటువంటివే యితర గ్రామములలో జేర్చి ఒక పంచాయితిగా యేర్పాటు చేయబడును.

2. పంచాయితిలలో ఇప్పుడున్న మేజరు, మైనరు అనే విభజన రద్దుచేయబడును. సాలు ఆదాయము 10,000 తక్కువ గాకుండా. జనసంఖ్య 5,000 మంది తక్కువ గాకుండా యున్న పంచాయితులు మొదటి రకపు పంచాయితీలుగాను, మిగతవి రెండవ తరగతి పంచాయితీలుగాను వ్యవహరించబడును.

3. పంచాయితీల సంఖ్య, జనసంఖ్యను పురస్కరించుకొని 5 మొదలు 15 వరకు నుండగలదు. (6 వ సెక్షన్.) శాసన సభల యెన్నికలవలెనే, పంచాయితి యెన్నికలుకూడ. —రహస్య ఓటింగు పద్ధతి ప్రకారము జరుగును (సెక్షన్ 12). ఇంతవరకు అధ్యక్షుడు సభ్యులచేత ఎన్నుకొనబడేవాడు. ఇపుడట్లుగాక, ఓటరు లందరిచేతను యెన్నుకొనబడును. అతడు పంచాయితికి ఒక ఎక్స్ అఫిషియో మెంబరుగా ఉండును (సెక్షన్ 21). గ్రామపెద్దగాని, (రెడ్డి) ఇతర ప్రభుత్వోద్యోగిగాని, స్థానిక పరిపాలన ఉద్యోగిగాని, పంచాయితీ సభ్యుడు కాజాలడు (14 సెక్షన్.).

ఏ గ్రామ (రెడ్డి లేక మేజస్ట్రీటు) పెద్దగాని, కార్యనిర్వాహక సభ్యుడుగా నున్నయెడల, క్రొత్త చట్టము అమలులోనికి వచ్చినరోజునుండి అతని పదవి పోవును. [మూడవ షెడ్యూలులోని 4 సూత్రము (3)].

ఉపాధ్యక్షుడు మాత్రము పూర్వము వలెనే, సభ్యులచే నెన్నుకొన బడును (సెక్షను 22.).

4. షెడ్యూలు తరగతులవారికి మాత్రమే స్థానములు ప్రత్యేకింపబడును (సెక్షను 8). చెన్నరాష్ట్ర లోకల్ బోర్డు చట్టము క్రింద, ముస్లిములకు, ఇండియన్ క్రైస్తవులకు ప్రత్యేకించబడిన స్థానములు, సాధారణ స్థానములుగా వ్యవహరించబడి, ఆ స్థానముల కిదివరకే యెన్నిక అయిన సభ్యులు యీ క్రొత్త చట్టము ప్రకారముకూడ పదవిలో నుండెదరు (మూడవ షెడ్యూలులోని 5 వ సూత్రము.)

5. సభ్యులను ఎన్నుకొను నిమిత్తము, ప్రతి పంచాయితి, రెండు వార్డులకు తక్కువ గాకుండా, విభజన చేయబడును (సెక్షను 9.). ఇప్పటివలెనే, సభ్యులయొక్కయు, అధ్యక్షునియొక్కయు పదవీ కాలము మూడు సంవత్సరములుండును.

6. పంచాయితీలు విధిగా చేయవలసిన పనులు (10, 21 సెక్షన్లు.) కొన్ని ఉన్నవి. అవి:—

రోడ్డు నిర్మాణము,— బాగుచేయుట, వీధులయందును, బహిరంగ స్థలములయందును, దీపముల సౌకర్యము కలిగించుట, మురికి కాల్వలు త్రవ్వించుట, మరుగు (అన్ని) దొడ్లను శుభ్రము చేయించుట, మంచినీళ్ళ సదుపాయము కలిగించుట, బావులు, చెరువులు మొదలగునవి త్రవ్వించుట, బాగుచేయించుట, ప్రజారోగ్యముగురించి శ్రద్ధతీసుకొనుట మొదలగునవి.

ఇక అధికారపూర్వకముగా చేయవలసిన వేసనగా,— రోడ్ల ప్రక్కన చెట్లను నాటించి సంరక్షించుట, ప్రాథమిక పాఠశాలలను, పఠన మందిరములను, సంతలు, బండ్లు ఆగెడి స్థలములు, పశువుల వధించు స్థలములు, వైద్యాలయములు, ప్రసూతి, శిశుపోషణాలయములు, బజారులు, తీర్థములు మొదలయినవాటి ఆధిపత్యము వహించుట, వ్యవసాయాభివృద్ధి, వ్యవసాయక ప్రదర్శనములు జరుపుట మొదలగునవి.

7. ఈ చట్టము ప్రకారము, పంచాయితీలకు మరికొన్ని క్రొత్త అధికారము లివ్వబడినవి.—

(ఎ) సివిలు, క్రిమినలు న్యాయపరిపాలన.— 1888 వ సం॥పు చెన్నరాష్ట్ర విలేజీ (గ్రామ) కోర్టుల ఆక్టు ప్రకారము, గ్రామ కోర్టులు, పంచాయితీ కోర్టులు చేస్తూన్న యీ పని యికముందు గ్రామ పంచాయితీలే చేయును. (132 వ సెక్షన్.)

క్రొత్త చట్ట మమలులోనికి వచ్చిన తర్వాత, పంచాయితీలు గలచోట, సివిల్, క్రిమినలు న్యాయపరిపాలనమును పంచాయితీకోర్టులు, గ్రామ కోర్టులు జరిపించగూడదని వానికి తెలియజేయ వలసినదిగా కలెక్టర్లకు ఆదేశించడమైనది.

(బి) దస్తావేజుల రిజిస్ట్రేషను.— స్టాంపు డ్యూటీగాని, రిజిస్ట్రేషను ఫీజుగాని లేని దస్తావేజులు, నూరు రూపాయలు విలువను మించని ఆస్తియొక్క దస్తావేజుల విషయములో — రిజిస్ట్రేషను ఆఫీసర్లుగా పనిచేయుటకు, — అప్పుడప్పుడు —పంచాయితీల కార్యనిర్వాహక వర్గమువారికి —ఇన్‌స్పెక్టరు —జనరల్, అధికారము ఇవ్వవచ్చును. (సెక్షన్ 133.)

(సి) మరామ్మతు పనులు.— గ్రామములో నీటి పారుదల సాధనములకు చిన్నచిన్న మరమ్మతులు చేయించుటకున్నూ, ఆ కారణముగా పన్ను విధించుటకున్నూ పంచాయితీలకు అధికార మివ్వబడినది.

(డి) పోరంబోకులు.— గ్రామములో చిట్టడవులు, పచ్చిక బయళ్లు—కళ్ళములు, బంజర్లు పోరంబోకులు మొదలయిన వానిపైని ఆధిపత్యము పంచాయితీలకే యుండును.

(ఇ) సాముదాయకపు హక్కులు.— గ్రామ ప్రజలు అనుభవించు సాముదాయకపు హక్కులు రద్దుపరుపబడి పంచాయితీలకు ట్రాన్సుఫర్ చేయబడును. (సెక్షన్ 58.)

8. ప్రభుత్వము విధించు, గరిష్ఠపు రేట్లను, కనీసపు రేట్లను, అనుసరించి, పంచాయితీలు – ఇంటిపన్ను, (గుడిసెలు మినహా), ఉద్యోగపుపన్ను, వాహనముల (Vehicle Tax) మీద పన్ను, నిర్బంధముగా వసూలు చేయగలవు. (సెక్షన్లు 63, 66.)

ఇన్‌స్పెక్టరు అనుమతిపై, గ్రామోపయోగార్థముగాని, గ్రామ సౌకర్యములకు గాని, మరికొన్ని చిల్లర పన్నులు పంచాయితీ వసూలుచేయవచ్చును. [సెక్షను 63 (3).]

ప్రభుత్వమువారు మరొక విధముగా ఆదేశించని పక్షములో— ఈ చట్టము అమలులోనికి వచ్చిన తర్వాత గూడ పంచాయితీ చట్టరీత్యా పన్ను వసూలు చేయుటను కొనసాగించ గలదు. (రూల్ 12, షెడ్యూలు 3.)

మత రీత్యా, దానధర్మాల రీత్యా, విద్యావిషయముల రీత్యా ఖర్చుపెట్టు నిమిత్తము, వాని ఆదాయము నొసగు కొన్ని ప్రయివేటు మార్కెట్లు తప్ప, తక్కిన ప్రయివేటు మార్కెట్లను రద్దుచేసి, వాని స్థానే పబ్లికు మార్కెట్లు ఏర్పాటు చేయడము జరుగును, (సెక్షను 81.)

9. ఇదివరకు వలెనే, గ్రామమందు విధింపబడే చిల్లర పన్నులో నాలుగవ వంతు (రూపాయికి అర్థణా) పంచాయితీకి చెందగలదు. [(సెక్షను 70) 2 (111)]

ఇదిగాక జనసంఖ్యనుబట్టి రెండవ తరగతి పంచాయితీలకు పంపిణీచేయు నిమిత్తము ప్రతిసంవత్సరము స్టేటు భూమిశిస్తునుండి కొంత మొత్తము ప్రభుత్వము కేటాయించును. సెక్షను 71.)

10. ప్రతి పంచాయితీయొక్క సాంవత్సరిక అక్కౌంటులను ఆడిట్ చేయు నిమిత్తము ప్రభుత్వము—లోకల్ ఫండ్ అకౌంట్సు ఎగ్జామినర్ ఆధిపత్యాన, లోకల్ ఫండ్ ఆడిట్ సిబ్బందిని నియోగించును.

(ii) ఇకపై జిల్లా బోర్డులకు, పంచాయితీలపై ఏ విధమైన అధికారము ఉండబోదు. కాని ఇప్పటిరీతిగనే అవి—పంచాయితీలు లేని తావులందు మాత్రము అధికారము కొనసాగించ గలవు. పంచాయితీల నిర్మాణము జరిగిన తర్వాత మాత్రము జిల్లాబోర్డులకు అధికారము ఉండబోదు. ప్రభుత్వము—126 సెక్షను ప్రకారము యెప్పటి వలెనే పంచాయితీ సిబ్బంది (Staff) ప్రావిడెంటు ఫండు అకౌంట్లు కొనసాగించు పనిని జిల్లాబోర్డులకు ఉండును. శాంతి సంరక్షణ, ఆస్తి, జీవితముల రక్షణ మొదలయినవాని విపత్కర పరిస్థితులలో తప్ప— పంచాయితీలపై కలెక్టరుకూడ ఏ విధమైన అధికారము లేదు. [సెక్షన్లు 11, 43 (3), 44.]

11. ప్రభుత్వము— లోకల్ బోర్డులయొక్క, మునిసిపల్ కౌన్సిలు యొక్క ఇన్‌స్పెక్టరుద్వారా గ్రామ పంచాయితీలపై తన యధికారము, పర్యవేక్షణ నిర్వహించును. ఈ కార్యక్రమములో సదరు ఇన్‌స్పెక్టరుకు, ప్రాంతీయ ఇన్‌స్పెక్టర్లున్ను, జిల్లా డిప్యూటీ పంచాయితీ ఆఫీసర్లు తోడ్పాటుగా నుందురు. (సెక్షన్ 42)

12. పాత చట్టము క్రింద తీసికొన్న ఏ చర్యలైనా— అవి క్రొత్త చట్టములో ఏకీభవించకుండా పోయిననే తప్ప— క్రొత్త చట్టము అమలులోనికి వచ్చి, దానిక్రింద తీసుకునే చర్యలవల్ల రద్దయిపోయే వరకూ, చెల్లుబడియై అమలులో ఉండగలవు. (సూత్రము 13, షెడ్యూలు 3.)

---

పత్రికా పరిచయము.

# 'గీతావాణి'

ఆధ్యాత్మిక మాసపత్రిక: గీతా ప్రచురణ సమితి: అర్లగడ్డ. (కర్నూలుజిల్లా) సంపాదకులు: శ్రీకంఠముగారు. సం॥చందా రు 4/. విడి సంచిక అరణాలు.

హిందూమతము, అందు ముఖ్యముగ వేదాంత మతము, ప్రస్థానత్రయములనబడు ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రములపై ఆధారపడియున్నది. అనేక వేల సంవత్సరముల క్రిందట ముందు "వేదయుగము"లో భగవంతుడు మానవ ప్రపంచమునకు బాహ్యమున నెచ్చటనో నున్నాడను భావము ప్రబలి యుండెను. భగవంతుని మహాశక్తిని చాటు భూమ్యాకాశాది పంచ భూతములకు, సూర్య, చంద్ర, తారా గణములను పూజించుచుండిరి. స్తోత్రము చేయుచుండిరి. కాని భగవంతుని కనుగొనవలెనను జిజ్ఞాస మాత్రము వారిని వదలినది కాదు.

మహర్షులు గుప్త స్థలములగు అరణ్య ప్రదేశములకు తరలి, యెన్నియో యోగములను సాధించి, యెన్నియో పరిశోధనలు గావించి, "భగవంతుడు" "ఈశ్వరుడు" అని చెప్పబడు అదృశ్యమైన మహాశక్తి మానవ ప్రపంచమునకు బాహ్యముగ పైన ఎచ్చటనూ లేదనియు, భౌతిక నేత్రములకు కనపడు చరాచర సృష్టియందంతయు నిండి నిబిడీకృతమై యున్నదనియు, మానవుడు భగవంతునికై ఎచ్చటనో వెతక వలసిన పని లేదనియు, తన హృదయాంతరాళములో (హృదయాకాశములో) సూక్ష్మాతి సూక్ష్మమైన అణుస్వరూపముగ ప్రకాశించుచున్నాడనియు, తెలుసుకొనిరి. మానవ దేహమే దేవాలయమనియు, అందు అణుమాత్రముగనుండు "జీవాత్మ" (ప్రాణశక్తి) యే పరమాత్మ యనియు సిద్ధాంతీకరించి ప్రపంచమునకు చాటిరి. "బ్రహ్మము" "ఆత్మ" అనునవి భిన్నమైనవి కావనియు, ఈ రెండును ఒకటేనను సత్యమును మహర్షులు తెలుసుకొనిరి. ప్రతి మానవ వ్యక్తి హృదయాంతరాళములోను బ్రతిష్ఠింపబడియున్న 'ఆత్మ' దృశ్య ప్రపంచములోను, సృష్టి యంతటిలోను అంతర్యామియై యున్న 'బ్రహ్మ' మే యని ఆ మహర్షులు చాటిరి. ఇట్టి మహోత్కృష్టమైన మూల సిద్ధాంతములు, సత్యములు ఉపనిషత్తుల యందు నిండి యున్నవి. ఆ సత్యములు జాతి, మత, కుల భేదములకును, లింగ భేదములకును, దేశ కాలములకును అతీతమైనవి. మానవుడే భగవంతుడని, మానవ ఔన్నత్యమును, విశ్వ మానవ ప్రేమను, సర్వ మానవ సమత్వమును, ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఈ ఉపనిషత్తుల సారాంశమే శ్రీకృష్ణార్జునీయమగు భగవద్గీతగా వెలువడినది. దీనినే యోగశాస్త్రమనియు, కర్మయోగశాస్త్రమనియు, జ్ఞానయోగ శాస్త్రమనియు చెప్పుచున్నారు. ఈ స్థాన త్రయము లొక్కరి సొత్తు కావు. ప్రపంచములోనుండు సర్వమానవుల సొత్తైయున్నది.

ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు ప్రాచీన కాలమునందీ దేశములో వాడుకలోనుండిన సంస్కృత భాషలోనున్నవి. సంస్కృత భాషలో అనర్గళ పాండిత్యముండిన కాని వీనిలోని గూఢార్థములను తెలిసికొనుట కష్టము. సంస్కృత భాషలోని గాంభీర్యము, భావ సౌష్టవమును, ఇతర భాషలలోనికి తెచ్చుటకూడ కష్టమే. ఆ భావములను సరిగ తెలుపగల పదజాలము చిక్కుట కష్టము. కాని పాశ్చాత్య తత్వశాస్త్రజ్ఞులు ఎంతయో కష్టించి, అక్షర సంజ్ఞను, శబ్దోత్పత్తిని తెలుసుకొని, వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతలను, జర్మనీ, ఫ్రెంచి, ఆంగ్ల భాషలలోనికి భాషాంతీకరణ మొనర్చుకొనిరి. అంతమాత్రమే కాక వానిపై స్వతంత్ర వ్యాఖ్యానముల గావించిరి. వేదాంత మతము యొక్క ఔన్నత్యమున కచ్చెరు వొందుచు అందలి దివ్య సందేశములను మానవ కోటికి చాటుచున్నారు. సంస్కృత భాషనభ్యసించి, భారతీయ సంస్కృతిని, వేదాంత మతము యొక్క ఉత్కృష్టమును గ్రహించుటకు ప్రతి వ్యక్తియు ప్రయత్నించుట మంచిదే. కాని అనేకులకు అనేక కారణముల వలన సంస్కృతభాష నభ్యసించుటకు వీలుండదు. అందువలన వేదాంత శాస్త్రములలో అత్యుత్తమములై, అద్వితీయములైన ఉపనిషత్తులను, భగవద్గీతలను, మూలార్థము చెడకుండు రీతి, దేశ భాషలలోనికి అనువదించి, సర్వ జనులకును వానిని చదువుకొనుటకు అనుకూలముగునట్లు తేట తెల్లమగు వచన రూపముగ ప్రకటించుట చాల యవసరము.

దేశములో ఏ వైపు చూచినను అవినీతి ప్రబలినది. ధర్మ మడుగంటినది. ఆధ్యాత్మిక వాతావర్ణము నశించుటయే ఇందుకు కారణము. కనుక అట్టి వాతావర్ణమును మరల కలుగజేసి, ప్రజలను అవినీతినుండి సక్రమ మార్గములకు త్రిప్పుటకు కొంత ఆధ్యాత్మిక ప్రచారము ముఖ్యము. ఈ దృష్టితో చూచిన, "గీతావాణి", శ్రీకృష్ణార్జునీయమగు భగవద్గీతలోని దివ్య సందేశమును తెలుగు భూమిలో సర్వజనుల కర్థమగు రీతి వెదజల్లుటకై స్థాపింప బడినదని తలంతుము.

తత్వశాస్త్రములకును, రాజకీయములకును సన్నిహిత సంబంధమున్నది. లోకమాన్య బాలగంగాధర తిలకు గారు గొప్ప సంస్కృత విద్వాంసులు. "స్వరాజ్యము నాజన్మ హక్కు", అని శంఖారావము పూరించిన ప్రథమ రాజకీయ నాయకుడు. వీరిని దేశద్రోహులుగ బ్రిటీషు ప్రభుత్వము వారు పరిగణించి, ద్వీపాంతరవాస శిక్షనొసగిరి. బర్మాదేశములో మాండలే పట్టణమున రాజకీయ ఖైదుగా నుంచిరి. ఆ ప్రవాసములో నున్నపుడే వీరు "గీతారహస్య", మను పేర భగవద్గీతకు విపులమైన వ్యాఖ్యానమును వ్రాసి అందులోని మహా రహస్యములను వెల్లడించిరి.

(మిగత 16—వ పేజీలో)

# ప్రజాభిప్రాయ వేదిక

## పల్లెటూరి ప్రయాణము.

ఆర్యా,

అది యొక పల్లెటూరు. చూచుటతోడనే మేను పులకరించినది. నిజముగా తనువు పులకరించుటలో విశేష మేమియు లేదు. నేను జన్మించినది మొదలు, పట్టణములలోనే నివసించుచు కాలక్షేపము చేయుచుండెడి వాడను. ఈ దిన మేలనో మావారు పల్లెటూరికి పొమ్మనిరి. వెంటనే పల్లెటూరికి పయనమై పోయి, ఆ పల్లెను కనులకు ఇంపుగా చూచి ఆనందించితిని. ఆ పల్లె పుష్పములతో అలంకరింపబడినది. మేడలు విశాలముగను, అందముగను, పరిశుభ్రముగను కన్పట్టుచుండెను. అందలి బాలబాలిక లందరు ఐక్యతతో ఆటలయందు మునిగి, తమలోతాము ఆనందపరవశులై, ఈ లోకమునే మరచిరా యనునట్లు తోచుచుండెను. నేను అందలి బాలబాలికల ఐక్యత గాంచి, కొంతసేపు నిశ్చేష్టుడనై నిలువబడి, తర్వాత తెప్పరిలితిని. నిజముగా ఈ పల్లె నా కనుల కిపుడు స్వర్గమా లేక పల్లెయా యని తోచుచుండెను.

ఇందుకే కాబోలు ప్రతియొక్కరిని పల్లె ఆకర్షించునది. అచటి యానందము, పరిశుభ్రత, ఐక్యత, పట్టణములలో ఎన్నిదినములు జీవించినను రాజాలదు. పట్టణములలో టక్కరి మాటలతోను, జూటామాటలతోను జీవించువారును, ఐక్యతన్న బొత్తుగ సరిపోనివారును మరికొందరుందురు. ఇక పరిశుభ్రత యన్నచో, వీధులలో నుండు మురికికాల్వలు, ధూళి, చెత్తపుల్లలు, పెంట మొదలయినవి క్రిమికీటకాదుల కాటపట్టయి, రోగముల నాహ్వానించుచుండును. గొప్పగొప్ప గృహములు నిర్మింపబడి యుండుటవలన, వేసవికాలమున సరియైనగాలి వీవక, ప్రజలు అలమటించుచుందురు. కావున మంచివాయువును పీల్చుటకై సాయంకాలమున బయలు ప్రదేశముల కేగుచుందురు. స్త్రీల బాధ చెప్పుట కలవిగానిది. వారు అన్నివేళలందును ఇండ్లలోనే యుండుటచేత, విడుచు గాలినే పీల్చుచు నానా బాధలకు గురియగుచున్నారు. పసిబాలుర విషయము చూతమనిన, వారు ఆటలాడుకొనుటకు జేనెడు చోటు యుండదు. పోనీ వీధులలో ఆడుకొనుటకు మోటారుల, జట్కాబండ్ల హడావిడులవల్ల, యే ప్రమాదము సంభవించునో యను భయము. ఇట్టి బాలకు లెంత బలవంతులుగ నుందురో మీరే యోచింపుడు. ఇవి యిట్లుండగా, ఈ కంట్రోల్సు కాలములో తినుటకు కావలసినంత కూడు చిక్కక మాడుచున్నారు. నిజముగా నరకమే మేలనిపించుచున్నది.

పల్లెలలోని ప్రజలు అమాయకులు. ఒకరికి కీడుచేయు కోరిక వారి హృదయమంత వెదకినను కానరాదు. కావలసినంత తాము తైకొని, తక్కినది ఇతరుల కొసగుటయే వారి ముఖ్యమైన తలంపు. అచ్చట పంటలు సమృద్ధిగ పండును. కావున పండిన పంటలో తమకు కావలసినంత యుంచుకొని మిగిలిన దానిని పట్టణప్రజలకు పంపుదురు. తెల్లవారుఝామున కోడికూయగనే ప్రతియొక్కరును నిద్రనుండి లేచి, వారివారి పనులలో ప్రవేశింతురు. పురుషుడు కాడికట్టి, ముల్లుకర్ర చేతబట్టి పొలముదున్నుటకు బయలుదేరును. స్త్రీ మజ్జిగ కవ్వము చేబూని, మజ్జిగ జిలుకుటకు బయలుదేరును. తర్వాత గృహకృత్యము లెల్లను చూచుకొని, పిల్లలున్న, వారివెంట తన పెనిమిటికి భోజనము పెట్టిపంపును. లేకున్న ఆమెయే గొనిపోవును. ఆమె పోవునపుడు తాంబూలము చేతబట్టి, కొప్పు గట్టిగ బిగించి, ఆనందము పెదవులపై తాండవమాడుచుండ, మెల్లమెల్లన నడుగులిడుచు, ఆటపాటలతో చనును. తన భార్యను చూచిన వెంటనే, ఆ భర్తకు మనసున సంతోషము పొంగిపొరలును. అంతదనుక తా నొనర్చిన శ్రమనుకూడ మరచిపోవును. ఆహా! అటువంటి దాంపత్యమున్నగదా జీవితమున కానందము. లేనిచో జీవించియు ఉపయోగ మేమి? ఆనందమొనగూర్పని దాంపత్యము నీరులేని బావి వంటిది కదా! ఇక పెండ్లీడు వచ్చిన బాలికలు, ఒకరినొకరు తోడు చేసికొని, గడ్డగంపలు చంకల యందు ధరించి, చిరునగవులతో, ఇంపైన పాటలు పాడుకొనుచు, పొలములకు పోవుచుందురు. వారి నడక, దేహ ఆరోగ్యము, మేను కాంతి చూచి ప్రతియొక్కరు ఆనందింతురు. ఈడువచ్చిన బాలురు కూడ తమ తండ్రులకు సహాయపడుచు, దురలవాట్లకు లోబక మెలగుచుందురు. అందుచే అచట స్త్రీ పురుష భేదము లేక, ఏక కుటుంబీకులవలె మెలగుచుందురు. పరిశుభ్రమైన గాలి వీచుచుండును. అందలి ప్రజలందరు దృఢకాయులు. స్త్రీలు పట్టణములలోని వారివలెగాక, యథేచ్ఛగా పొలములలో కష్టించి, తమ దేహారోగ్యమును పెంపొందింప జేసికొందురు. వారి ఆటలో ముఖ్యమైనవి గోలిగుండ్లు, బొంగరములు, పులిగీతము, చదరంగము, బేరాట, భారాకట్ట. వారి యొక్క వినోదములు నృత్యము, భజన, కోలాటము. ఇట్టి ఆనంద జీవులను చూచుచు, కొన్ని దినము లచ్చనే యుండి మరల నాగ్రామము నేను చేరుకొంటిని.

రంగశాయిపురము. అట్లా రామిరెడ్డి.

# ఇన్‌కంటాక్సు అమెండుమెంటు బిల్లు.

( శ్రీ యన్. వెంకటాద్రిగారు, ఎం. ఏ., )

ఎవరికైనా కోపము రాని రాకపోనీగాక. ఇంత యన్యాయ మున్నదా? కాంగ్రెసుపార్టీవారు దేశ పరిపాలనాధికారములోనికి వచ్చిన తర్వాత, రాజ్యాంగ చట్టమునకు సవరణ బిల్లును ప్రవేశపెట్టి ప్రజల సహజ హక్కులకే భంగ మొనరించిరి. ఇది యెట్లైన యుండని. మరియొక క్రూరమైన బిల్లును నొకదానిని కేంద్ర ప్రభుత్వమువారు పార్లమెంటులో ప్రవేశపెట్టి యున్నారు. అది ఇన్‌కంటాక్సు అమెండుమెంటు బిల్లు (Income Tax Amendment Bill). ఈ బిల్లులో సూచించిన మార్పులను ప్రజలు చదివినారంటే యింతకన్న క్రూరమైన బిల్లు మఱియొకటి వుండునా యని యనిపించును. దీని ముందర కాన్‌స్టిట్యూషన్ అమెండుమెంటు బిల్లు (Constitution Amendment Bill) యొక్క క్రూరత్వము మాసిపోవును. అధికారము చెయ్యి చిక్కినతర్వాత కాంగ్రెసు నాయకుల దృష్టి యేవిధముగ మార్పు గాంచుచున్నదో ఓటర్లందరు గమనించుట యవసరము. ఇన్‌కంటాక్సు సవరణ బిల్లులో చేసిన విప్లవకరమైన మార్పులను చదివినారంటే - ప్రభుత్వము క్రింద పనిచేయు మంత్రులు, యుద్యోగులు మొదలైన వారంతా సత్య హరిశ్చంద్రులనియు, ధర్మమూర్తులనియు, ప్రజలు, వ్యాపారస్థులు, పరిశ్రమల యజమానులు మొదలైన వారంతా దొంగలు, దోపిడీదార్లు, యవినీతిపరులు, పన్నులను ఎగురవేయు వారను భావముతోనే యీ సవరణ బిల్లును తయారుచేసినట్లు స్పష్టమౌతుంది. మంత్రులు కాని, సర్కారు ఉద్యోగులు కాని ప్రజలలో నుండి వచ్చినవారేనా లేక ఆకాశములోనుండి దిగబడిన వారా! ప్రజలు, వ్యాపారస్థులు, పరిశ్రముల పెట్టుబడిదారులు -మొదలైనవారు ఏ మట్టినుండి పుట్టినారో, సర్కారు ఉద్యోగులు ఆ మట్టిలోనే పుట్టినారు. ప్రజలలో అవినీతి లేదని చెప్పలేము. బ్లాకుమార్కెటు చేయువారు లేరని చెప్పలేము. పన్నులు ఎగురగొట్టవలెనని ప్రయత్నించేవారు లేరని చెప్పలేము. ఇదే ప్రకారమే సర్కారు ఉద్యోగులలో కూడ అవినీతిపరులు, లంచగొండులు లేరని చెప్పుటకు వీలులేదు. లేరని యే మంత్రి పుంగవుడు కాని బహిరంగముగ కాని, రహస్యముగ కాని చెప్పలేరు. సర్కారు ఉద్యోగులలో లంచగొండితనము యెక్కువైనదని ప్రజలంటారు. ప్రజలలో యవినీతి యెక్కువైనదని సర్కారు యుద్యోగులంటారు. ప్రజలలోను మంచివారున్నారు. ప్రజలలోను నల్లగొర్రెలున్నాయి. ఉద్యోగులలోను నల్లగొర్రెలున్నాయి. అందువలన ప్రజలపై యెక్కువగా అనుమానము, అపనమ్మకము పెట్టుకొని, సర్కారు ఉద్యోగుల కసాధారణాధికారములను యీ ఇన్‌కంటాక్సు సవరణ బిల్లు క్రింద కలుగచేయుట, కాంగ్రెసు మంత్రులకు న్యాయమా? గొర్రెలను తోడేండ్లకు పట్టియిచ్చుటేకదా యీ బిల్లుయొక్క ముఖ్య యుద్దేశ్యము.

ఇన్‌కంటాక్సు అమెండుమెంటు బిల్లును, మామూలు రకమైన సవరణ బిల్లుయని చెప్పుట కవకాశము లేదు. పోలీసువాండ్లు ఒక నేరస్థుని యింటిని సోదా చెయ్యవలెనంటే - యిప్పుడువుండే చట్టముల ప్రకారము మేజస్ట్రీటుల నుండి సర్చి వారంటులను పొందిన తర్వాతనే యిండ్లలో యడుగు పెట్టుటకు హక్కు కలదు. అయితే యీ ఇన్‌కంటాక్సు సవరణ బిల్లు ప్రకారము - ఇన్‌కంటాక్సు ఆఫీసర్ల కెక్కడలేని అధికారములు కలుగ

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి)

[గత సంచిక తర్వాత]

## (5)

[చంద్రశేఖర, శ్యామలాగారులు వాహ్యాళి వెడలి, తిరిగి వచ్చునపుడు జానకీ, రుక్మిణుల కలిసికొనిరి. తొలిచూపులలోనే చంద్రశేఖర, జానకులకు పరస్పరము ప్రేమ జనించెను. ముక్కోటి యేకాదశినాఁడు జానకిని బలవంత పెట్టుటకు శ్యామలుఁడుపన్ను పన్నాగమునుండి చంద్రశేఖరుఁడు తప్పించెను. ఈ సంఘటన జానకీ, చంద్రశేఖరుల ప్రేమ వృద్ధియగుటకు కారణమయ్యెను. జానకి వివాహము కానుండెను. చంద్రశేఖరుఁ డిది తెలిసి, సహాయార్థము తన్ను గోరిన శ్యామలునితో కలిసి, జానకిని కారుమీఁద నెక్కించుకొని తిరుపతి జేరి. తరువాత ఈ ప్రకరణమున—]

చిత్తూరు జిల్లా యందు, తిరుపతికి సుమారు 12 మైళ్ళలో చంద్రగిరి యను పట్టణము గలదు. ఈ పట్టణమునకు దక్షిణమున శేషాచలపర్వత పరిసరంబున ఒక కోట గలదు. కోట ప్రాకారంబులు శిథిలావస్థ యందుండినను, అందలి భవనములు ప్రభుత్వముచే రక్షింపఁబడి, పూర్వ భారత లలిత కళా విశిష్టతను చాటుచున్నవి. ముఖ్యభవనము రెండతస్థులు గలదై, భవన నిర్మాణ కౌశలముఁ చూపఱ నాశ్చర్యచకితులఁ జేయుచున్నది. ఇయ్యది పూర్వము శ్రీ కృష్ణదేవరాయలచే నిర్మింపఁ బడినది. అతఁడు తన సామ్రాజ్యమున పర్యటించి, ప్రజల యోగక్షేమముల నరయుటకు బయలు వెడలినపుడు ఇందు కొన్ని దినములు నివసించు వాఁడు. ఈ భవనమునకు ముందొక శృంగార జలాశయము గలదు. ఆ జలాశయమునకు నలుపార్శ్వములయందును సుఖాసీను లగుటకు ఆసనము లమర్చబడి యున్నవి. శీతల తరుచ్ఛాయల నీ యాసీనములుండుట, భవనమును జూడబోవు నూతన జనులిందు కొంత విశ్రమించి పోవుచుందురు.

సాయంసమయము. అస్తగిరి శృంగంబున బంగారు పతకమో యన విరాజిలు వృద్ధభానుఁడు స్వర్ణచ్ఛాయల బఱపుచుండెను. ఆ కిరణద్యుతిచే నా మహలు మఱింత రామణీయత నందుచుండెను. కొలఁకునం గల జల తరంగముల సహా ప్రకరుఁడు ఊయల లూగుచుండెను. సింహబలుఁడైనను ఒకానొకచో దైన్యము తప్పదు గదా? ఇట్టి సృష్టిరామణీయకమును, తటాక భంగ వినిర్గత శీతవాతూల ప్రహారములను నయనానందముగ ననుభవించుచు, ఇరువురు యువకులు తరుచ్ఛాయలఁ గల ఆసనముల నలంకరించి, సంభాషించుకొనుచుండిరి. విలాసమున కాడు పల్కులవలె గాక, వారి మాటలు తీవ్రభావ సమాశ్రితములని, వారి ముఖవైఖరులు బోధించుచుండెను. ఆ సంభాషణ క్రమ మిది:—

ఒకఁడు.— 'రాచిలుక బంధింపఁబడినది. ఇఁక చేయవలసిన కార్యము లేవి?'

రెండవవాఁడు.— 'శ్యామలా! జానకి సుశీల. ఆమె మన హస్తగతమైనది మొదలు, నిన్ను పరామర్శించుటయందును, సంభాషించుటయందును సోదరునిగా భావించుచున్నది. నీ యందు సోదర వాత్సల్యము నెఱపుచున్నది. ఏమి చేయవలయునో నీవే తెల్పుము.'

శ్యామ.— చంద్రశేఖరా! నీ వపార్థము చేసికొనుచున్నావు. జానకి నీ సమక్షమున అట్లు ప్రవర్తింపక, మఱి యెట్లు ప్రవర్తించును? సిగ్గుపడుట స్త్రీలకు సహజము. కనుక తన ప్రేమ బహిర్గతము కానీయకున్నది. కరగ్రహణ మహోత్సవానంతరము గాఢాలింగన సుఖ మీయఁగలదు. కనుక ఆ ప్రయత్నమునకు పూనవలెను. ఆలస్యమగుచో, మనము పట్టుపడుదుము. తిరుపతికి అనతి దూరమున చిరుతానూరొండు గలదు. అచ్చట పురోహితులు లేచిపోయినవారికి వివాహము గావింతురు.'

చంద్ర.— 'అవును. కావింతురు. కాని...'

శ్యామ.— 'కాని, అనఁగా?'

చంద్ర.— ఏమియు లేదు. వధూవరు లొండొరులు ప్రేమించుకొన వలెను. అట్టివారికే ఆ పట్టణమున గల 'అలివేలి మంగమ్మ' గుడి యందు దైవసాక్షిగా పాణిగ్రహణము చేయఁబడును.'

శ్యామ.— 'అయితే! జానకి నన్ను ప్రేమించుట లేదా? ప్రేమింపకపోయిన మా వివాహము కాజాలదా?'

చంద్ర.— నీ వను మాట కడు వింతగా నున్నది. ఏక హస్త కరతాళముభంగి నీ ప్రయత్నము వృథాయైపోవును. జానకిని చేపట్టుమాట విడిచిపెట్టుము.'

(మిగత ప్రక్క పేజీలో)

శ్యామ.— 'నీ ధోరణిఁ జూడ, నీ మొదటి వాగ్దానమును మఱచినట్లున్నది. వీలగునంత సాయమొనర్తునని చెప్పి, నాచే ధనవ్యయము చేయించి, యిప్పుడు పెడమార్గముఁ బడుచున్నావు. గత నాలుగు దినములుగా జానకి చూపులు, మాటలు గమనింప, ఆమె వరించిన పురుషుఁడు నీవ యనియే ధ్రువమగుచున్నది. మిత్రుఁడవని నమ్మిన నన్ను వంచించితివి.'

చంద్ర.— 'శ్యామలా! వంచించితివని నన్ను దూఱుటవలన ప్రయోజనము లేదు. ప్రేమింపని జానకిని నీవు కోరుట, ఆమెను బలవంతపరుప నీవు లక్షదీపమునాఁడు ప్రయత్నించుట న్యాయసమ్మతము కానందునను, ఆమె నన్ను ప్రేమించుచుండుట చేతను, చేయిఁ జేసికొనక తప్పినది కాదు. నీవు నీ యధర్మవృత్తికి స్వస్తిఁ జెప్పి, సన్మార్గమున ప్రవర్తింపుము.'

శ్యామ.— 'నీవు నాకు నీతి గఱపవలసిన పనిలేదు. నా కర్తవ్యమును నేను నిశ్చయించుకొనఁ జాలుదును. కులమువాఁడనగు నేను జానకిని కోరుట ధర్మవిరుద్ధము, కులహీనుఁడవగు నీవు కోరుట ధర్మము. ఆహాహా! ఏమి నీతివంతుఁడవోయ్!'

చంద్ర.— 'కులహీనుఁడనో, కులీనుఁడనో జానకి నడిగి తెలిసికొనుము. నన్ను ప్రేమింపుమని నీవలె నే నెన్నఁడు ఆమెను దేబిరింప లేదు. నీ వైపున కామెను త్రిప్పుకొనఁ గల్గుచో నే నిప్పటికైనను మిన్నకుండెదను; కాని కారులు ప్రేలిన సహింపఁ జాలను.'

శ్యామ.— 'సహింపఁజాలకున్న నన్నేమి చేయగలవు. ఆ కులట నన్ను ప్రేమింపక పోయిన బలవంతమున నా యాలింగనమున బంధించి, తనివిదీర ముద్దాడి, నాకోరిక దీర్చుకొందును గాని వదలను.'

చంద్ర.— 'ఛీ! నీచుడవై పశువువలె ప్రవర్తించెద ననుచున్నావు. నా మేన ప్రాణములుండ, నీవు జానకిని సమీపింపఁ జాలవు.'

శ్యామ.— 'మహాశౌర్యవంతుఁడ వలె మాటలాడుచున్నావే! నీవు నా ప్రయత్నమున కడ్డము వచ్చిన, నిన్ను యమసదనమున కంపక మానను.'

చంద్ర.— 'బీరము లాడిన ప్రయోజనము లేదు. చేయి చేయి కలిసిన ఎవరు సామర్థ్యము గలవారో బోధపడగలదు.'

శ్యామ.— 'అయిన ఇప్పుడే కలుపుదము రా రమ్మ' ని శ్యామలుఁడు క్రోధ వీక్షణములతో లేచెను.'

చంద్ర.— 'రా రమ్మ' ని హుంకరించుచు చంద్రశేఖరుఁడును లేచెను.——ఇట్లీరువురు మిత్రులును స్త్రీ కొరకై పోట్లాడుటకు సిద్ధపడిరి. శ్యామలుఁ డింతలో తన బలహీనతను గుర్తెఱింగి, చంద్రశేఖరుని కుయుక్తితో మట్టుపెట్టుట మంచిదని తలంచి, క్రోధమును దిగమ్రింగి, 'చంద్రశేఖరా! బాల్యస్నేహితులము ఇట్లు పోరాడుట భావ్యము గాదు. నా మనసందుల కొడబడుట లేదు' అని లేచి ముందునకు నాలుగడుగులు వేసి నిలుచుండెను. చంద్రశేఖరుఁడు కారునిలచియున్న చోటు జేరుటకు, తాను కూర్చున్న ఆసనమునుండి లేచి ముందునకు నడచెను. శ్యామలుఁ డింతలో క్రిందబడియున్న కర్రనొకదానిని చేకొని, ముందు జనుచున్న చంద్రశేఖరుని తలపై దభేలున గొట్టెను. చంద్రశేఖరుఁడు దెబ్బతోఁ దలబగిలి, రక్తము గారుచుండ నేలఁగూలెను. మూర్ఛాగతుఁడయ్యెను. శ్యామలుఁడు ఎవరైనా చూతురేమోయని, వేగమున పరువిడి, కారునెక్కి తిరుపతి మార్గమును బట్టెను.

తిరుపతి (తూర్పు) రైల్వే స్టేషను సమీపమున గల, తిరుపతి దేవస్థానమువారి ధర్మ సత్రము కడు గొప్పది. అందనేక గదులు గలవు. ఒక అందమైన గదిలో, జానకి వాలుకుర్చీయందుఁ గూరుచుండి, చంద్రశేఖర, శ్యామలులు చీఁకటి పడుచున్నను రాని కారణ మేమని యోచించుచుండెను.— గది తలుపు కదలుటతో చంద్రశేఖరుఁడు వచ్చెఁగాబోలునని, తిరిగి చూచెను. వచ్చినది సత్రములో పనిచేయు నొక సేవకురాలు. నడిప్రాయము గలది. పేరు రంగమ్మ. క్రొత్తగా వచ్చిన యాత్రికులకు కావలసిన పనులఁ జేసిపెట్టి, వారివలన పారితోషికములఁ బుచ్చుకొనుట యామెకు నిత్యకృత్యములలో నొకటి. జానకి యామెను చూచుట తోడనే 'రంగీ! ఇదో రెండణాలకు విస్తళ్లు తెచ్చిపెట్టు' అని రెండణాలివ్వగా రంగమ్మ వెడలిపోయి, ప్రక్కనే గల దుకాణమునందు మంచియరటాకులు నాలుగు తెచ్చి, గదియందుంచెను. జానకి రంగమ్మవైపు దిరిగి 'కూర్చోవే! తిరుపతి విశేషములు రెండు చెప్పిపోదువు గాని' అని యాజ్ఞాపింపగాఁ, రంగమ్మ 'అలాగే నమ్మా' అని క్రిందపరచి యుండు చాపమీఁద కూర్చుండెను. అంత జానకి:—

"రంగీ! ఈ దిగువ తిరుపతి నుండి ఎగువ తిరుపతికి పోవలయు నని అనుకొన్నాము. ఉదయము వెళ్లి, సాయంత్రమునకు మఱలి రావచ్చునా?"

రంగమ్మ.— "రావడానికేమి తల్లీ! పోనూపోవచ్చు — రానూరావచ్చు; కాని అక్కడి విశేషాలు చూడవలయునన్న రెండు మూఁడు దినములైన అక్కడ యుండవలయును."

జానకి.— "వింతలు విశేషాలు చూచుటకు తీరిక లేదే. ఆ మరునాఁడే మేము బొంబాయికి పోదలఁచినాము."

రంగమ్మ.— 'అమ్మా! మీరు బొంబాయివారా!'

జానకి.— 'కాదే, మాది మదరాసు. బొంబాయిలో పనియున్నది. పోవలయును.'

రంగమ్మ.— 'అమ్మా! మీరు చాలా మంచివారుగా నున్నారు. నా కిక్కడెవ్వరు దిక్కులేరు. మీకు పనిమనిషి కావలయునన్న నేను తయారుగా నున్నాను. పిలుచుకొని పోయెదరా!'

జానకి.— 'మావారితో విచారించి చెప్పెదను. వారు మూఁడు గంటలప్పుడు షికారువెళ్ళి, ఇంకను రాలేదు.'

(మిగత 10 వ పేజీలో)

ఏకాంక నాటిక

# గణకుఁడు.

శ్రీ అంపేరాయని సుబ్బరావుగారు.

[ గత సంచిక తర్వాత ]

## —— 3— వ రంగము ——

తహశీలుదారుఆఫీసు:—

తహశీలుదారుఁడు, తాలూకా సప్లయిఆఫీసరు, రివిన్యూ ఇంస్పెక్టరు ఉపస్థితులై యుందురు. రఘుపతిరావు వెంట మాధవరావును, మృత్యుంజయులును మఱికొందఱు కరణములు ఆఫీసువద్ద నుందురు.

తహశీలుదారుడు— (దఫేదారు నుద్దేశించి) కరణాల సమను సరువయ్యేనా? గుమాస్తాను పిలువుము.

దఫేదారుడు— (గుమస్తాను పిలువ రికార్డుతో హాజరగును)

తహ:— కరణాల సమనులు సరువైనవా?

గుమాస్తా:— అయినవి. (అని కాయితములందిచ్చును)

తహ:— సరువైన కరణాలను వరుసగ బిలుపింపుము?

గుమా:— జవాన్ రహీంను పిలిచి కరణాలను పిలువుము? కొణకంచి మృత్యుంజయులు మొదలగు వారిని పిలువుము.

రహీం:— కొణకంచి కర్నం ముచ్చల్ జోడ్ (అని పిలుచును) అందుగల వారందరు ముచ్చల్ జోడు యేమి అని గొల్లున నవ్వుదురు.

ఒక కరణము— కరణము అంటె నింతటి గౌరవ మున్నదని యొండొరు లనుకొనుదురు.—

గుమా— అయ్యా? అతను మహమ్మదీయుఁడు. తెలుగు చక్కగ వాడుక లేదు. (అని మఱియొక జవానుతో పిలువ నాజ్ఞాపించును) మృత్యుంజయులని వరుసగ బిలుచును.

గణకులు— తహశీలుదారు నెదుట వరుసగ నిలుతురు.

తహ— మీరు ధాన్యపు రిజిష్టరు వ్రాసితిరా?

మృత్యుం— ఇతర లెక్కలను బూర్తి చేయుచు వాని నింకను వ్రాయలేదు.

తా॥ స॥ ఆ॥ (తహశీలు దారుతో) ఈ లెక్కలు మాన్యుయలు దాఖలా లెక్కలు కాదని కరణాలు నిరసనముగ నున్నారు.

తహ— అటులైనచో సస్పెండు చేసెదను. ఈ లెక్కల నిప్పుడు మాన్యుయల్లో చేర్చి యున్నారు.

రివెన్యూ ఇన్స్పెక్టరు— (తహశీలు దారునితో) ఈ కరణము రూకల సంజాయిషీకి రెడ్డివెంట వుండలేదని రెడ్డి రిపోర్టు చేసి యున్నాడు.

కరణం— రెడ్డివెంట నంటియుండవలెనా?

రివిన్యూ— అవును. ఉండవలెను.

కరణము— ఇతర లెక్కలు వ్రాయువారెవరు?

రివిన్యూ— లెక్కల నన్నింటినీ నీవే వ్రాయవలయును. రెడ్డికి రూకల సహాయము చేయవలెను.

తహ— బోర్డుకు పంపవలసిన సంజాయిషీ లెక్కల నంపితివా?

కరణము— సంజాయిషి తయారు చేయుచుండగ దమ సమన్కు హాజరు కావలసి వచ్చినాను.

తహ— చుర చురం చూచుచు, నీకు తెలివి యున్నదా? ఇంకను సంజాయిషీ వేయలేదా? నీ తలదిరుగుడు నణచెదను.

కరణము— (తల పంకించుకొనును)

తహ— ట్రాన్స్ఫర్లు- స్టోన్ ప్రాగ్రెను లెక్కల నంపితివా?

కర:— ట్రాన్స్ఫర్లు కొన్నింటి నంపితిని.

తహ— (బి) మెమోలు నంపితివా?

కర:— తాలూకాకు పంపి యున్నాను.

తహ— అక్ర యాక్రయము బోలి-ఛార్జి ఫ్రేమగైనిస్టు ది కేయం? అని గణకులంగాంచి రెండు దినములకీ లెక్కల నన్నింటి నివ్వవలెను- ఇక బోయిరండని యాజ్ఞాపించును.

కరణములు— నిష్క్రమింతురు.

తహశీలుదారుఁడును-మిగత యుద్యోగులును నిష్క్రమింతురు.

తహశీలుదారుఁడొంటరియై స్వగృహమున నుండును.

కైలాసరావు (కరణమునకు సరిపడని యొక వ్యక్తి) కరణము వాఁడు నాపైన యాక్రమణను గురించి వానిపై తహశీలు దారునితో మాటాడుట కిత్తఱి బాగుగ నున్నది, అని లోపలికి ప్రవేశించును.

తహ- ఎవరు మీరు?

కైలాస.- సార్, కొణకంచి గ్రామము. నేను కొంతకాల ముద్యోగముచేసి పెన్షను తీసుకొన్నాను. నేను కైలాసరావును. మీకు జ్ఞాపకమున్నదా? హి హి హీ యని నవ్వు నభినయించును.

తహ— కూర్చొనుఁడు? ఏమి పనిమీద వచ్చితిరి?

కైలాస— నేనుద్యోగమును వీడి గ్రామమున జేరినదాదిగ, గ్రామములోని బ్రజలు నన్నెంతయొ గౌరవింతురు. కరణము నంత కేర్ చెయ్యరు. అందువలన కరణానికి నాపై నీర్ష్య పొడమినది. కరణ మక్రమముగ నాపై నొక యాక్రమణ వ్రాసినాఁడు. మహోపద్రవమును గలిగించు చున్నాఁడు. తాము న్యాయ పాలనము చేయవలయును.

తహ— కరణాలు లంచగొండ్లు కదా? కరణాలను నమ్మరాదు.

కైలాస— అవులించిన పేర్వులెంచు జాతి. దూరమున నుంచ వలయును.

శిష— విచారింతుగాక! పోయిరండు. (పరదా వ్రాలును)

స్థలము— తాలూకాఫీసులో— కరణము మృత్యుంజయుఁడు

మాధవరావు— రఘుపతిరావు మఱికొందరు గణిసులును.

మాధ— రఘుపతిరావుగారూ? వింటిరా? గౌరవోద్యోగుల మర్యాదలు. మా సభలు, సంప్రతింపులు, పనికిరానున్నవి. ఇఁక నీయుద్యోగము నేయదగదు. రాజ్యాంగ విధానమున నుద్యోగులు పెక్కురైరి. ప్రతి యొక్కరికిని దాసులమై యుండవలసినది. ధాన్యపు రిజిష్టర్లు తయారుచేయ వలసినది కరణము లేనని నిర్ణయించిరి. తొలుదొలుత గొంత పారితోషిక మొసంగి యిప్పుడదియు లేకుండఁజేసిరి. రిజిష్టర్లు వ్రాయుట సులభమైన పనికాదు. కరణములెంత పనిచేసినను గౌరవము లేదు. విశ్రాంతియు లేదు. ఈ యుద్యోగము వలన శరీరము శుష్కించు చున్నది.

మఱియొక కరణము— లెక్కలు రాత్రింబవళులు వ్రాసి నా కజీర్ణవ్యాధి కలిగినది. ఇతర కార్యములు శూన్యము. అన్న మునకు సున్న.

మఱియొక కరణము— ఉద్యోగములు వదలవని గాంధీ ప్రబోధించుచుండు టెట్లుంగరా? అనుభవము వలన బాగుగ దెలియును.

(నిష్క్రమింతురు) [సశేషము]

—o—

## ధర్మవిజయము.

(8వ పేజి తరువాత)

రంగమ్మ.— 'అమ్మా! కారుమీదనే షికారా?'

జానకి.— 'పట్టణాలలోనా రంతేనే— కాని చంద్రగిరి ఇక్కడి కెంతదూరమే?'

రంగమ్మ.— 'పండెండు మైళ్ళుండును. అమ్మా ఒక మాట. వారిద్దరిలో మీ వా రెవరమ్మా.'

జానకి.— 'కొంచెము లావుగా, ఎరుపుగా ఉన్నారే ఆయనే మావారు కాబోయేవారు. సన్నగాఉంటారే ఆయన మా అన్నగారు.'

రంగమ్మ.— 'అయితే మీ రింకను పెళ్లి చేసికోలేదా? పెళ్లి కాకమునుపే తీర్థయాత్రలు వచ్చితిరా— అందులకు మీ తలిదండ్రు లంగీకరించిరా?'

జానకి.— 'రంగీ! అట్లు వచ్చుటకు బలమైన కారణమున్నది. కాని యిప్పుడు చెప్పుటకు సమయము లేదు. మఱియొకతూరి చెప్పెదను.'

రంగమ్మ.— 'అయినా! దానితో నాకేమి తల్లీ! ఏదో మాటవరస కడిగితిని. గొప్పవారి విషయాలజోలి పోకూడదు.'

జానకి.— 'అటుపోయి చూడవే!— కారేమైన వచ్చుచున్నదేమో!' అనుచుండు నంత శ్యామలారావు భయకంపిత మానసమున గబగబా వచ్చి, వాకిట నిలుచుండెను. జానకి అతని వైపు చూచి, అతని ముఖవైఖరులఁ జూచి కంగారు పడెను. తోడ చంద్రశేఖరుఁడు లేడు. మఱింత గందరగోళము పడెను. అంత శ్యామలుఁడు 'జానకీ! పోలీసులు మనల వెంటాడు చున్నారు. చంద్రశేఖరుని యనుమానింప నాతఁడు వారి కన్నులలో కారము జల్లి ఎటులో తప్పించుకొని ఎగువ తిరుపతికి పారిపోయెను. మనల వెంటనే రమ్మని చెప్పినాడు. కనుక బయలు దేరుము. లేనిచో మన మిక్కడనే వారికి జిక్కుదుము' అనెను. జానకి అతని ఆపద్రాఁజూచి, రంగమ్మ సాయముతో సామానులన్నియు సర్దుకొని బయలుదేరెను. ఇద్దరు కారు నెక్కిరి. రంగమ్మ సామానులన్నియు కారునందుంచెను. జానకి రంగమ్మ కొక ఐదురూపాయల నోటు నిచ్చి, మఱల వచ్చెద మనియు, బొంబాయికి పోవునపుడు పిలుచుకొని పోదుమనియు జెప్పి శెలవు గైకొనెను. శ్యామలుఁడు కారు కదలించి ఎగువ తిరుపతిదారి పట్టెను.

[5 వ ప్రకరణము సమాప్తము.]

---

## ప్రకటన.

ఇందుమూలముగా సర్వులకు తెలియజేయడ మేమనగా:—

నా అవిభక్త అన్న లేట్ వెంకటసుబ్బయ్య యిప్పటికి సుమారు పదకొండు సంవత్సరముల క్రిందట చనిపోయినాడు. నా అవిభక్త అన్న పై వెంకట సుబ్బయ్య కుమారుడు అప్పయ్య, మైనర్, మా అన్న సదరు వెంకటసుబ్బయ్య చనిపోయినప్పటినుండి నా సంరక్షణలో వున్నాడు. మైనరు గార్డియన్ సంరక్షణ కర్తగా నేనే వుంటూవున్నాను. మా అన్న సదరు వెంకట సుబ్బయ్య భార్య పిచ్చమ్మ మూడు సంవత్సరముల నుండి స్వేచ్ఛగా సంచరించుచూ వున్నది. సదరు పిచ్చమ్మకు మా స్థిరచరాస్తియందు యేలాటి సంబంధము లేదు. మాకు బద్వేలు తాలూకా ఇటుగుళ్లపాటి గ్రామములో స్థిరచరాస్తులున్నవి. కొంతమంది మా కుటుంబము తాలూకు స్థిరచరాస్తులను సదరు పిచ్చమ్మతో విక్రయించుకో వలెననే దుష్ప్రయత్నములు చేయుచున్నట్లు తెలియుచున్నది గనుక సదరు పిచ్చమ్మవలన వ్రాయించుకొని వుండిన విక్రయములు మొదలగు యే విధమైన పరాధీనములు చెల్లనేరవు. మైనరు అప్పయ్యను గాని, నన్నుగాని బాధించనేరవు అని తెలియజేయుచున్నాను.

ఇట్లు

ఇటుగుళ్లపాటి పుల్లయ్య,

పెద్దచెప్పల్లి పోస్టు,

కమాలాపురం తాలూకా.

జేసినారు. ఎవరి యింట్లోకంటే వారి యింట్లో ప్రవేశింపవచ్చును. కావలసిన స్టేటుమెంటు లిమ్మని అడుగవచ్చును. ఏసమాచారము కావలసివుంటె ఆ సమాచారానికి సంబంధించిన విషయములు తెలుపమని నిర్బంధింపవచ్చును. ఇండ్లలోకి ప్రవేశించుటకు కాని, సోదా చూచుటకు కాని మేజస్ట్రీటులనుండి వారంట్లు అక్కరలేదు. ఏమి యక్కర లేదు. ఇన్‌కంటాక్సు అఫీసర్ల యిష్టమే చట్టము.

బ్యాంకులలో ప్రజలు కాని, వ్యాపారస్థులు కాని ద్రవ్యమును దాచియుంచుకుంటే – ఆ విషయమును యితరుల కెవ్వరికిని బ్యాంకులు తెలియజేయకూడదనే నియమ మొకటి యున్నది. ఈ నియమాన్ని ఇన్‌కంటాక్సు సవరణ చట్టము గాలికి విడిచి పెట్టమనినది. బ్యాంకులలో యే వ్యక్తులకైనా పైక ముండవచ్చును. ఇన్‌కంటాక్సు ఆఫీసరుకు ఆ రహస్యము తెలిపి తీరవలెనని యిప్పుడు నిర్బంధ మొకటి తెచ్చిపెట్టినారు.

ఇదంతా యెటులైనా పోనీయని అనుకుంటె ఇన్‌కంటాక్సు ఆఫీసర్ల విచారణపై కోర్టులకు అధికారము లేకుండ, ఇన్‌కంటాక్సు ఆఫీసర్ల విచారణనే జుడీషియల్ (న్యాయస్థాన విచారణ) విచారణగా భావించవలెనని సవరణ బిల్లులో చెప్పుచున్నారు.

ఇంత తొందరపడి, ఇట్టి విప్లవకరమైన బిల్లును పార్లమెంటులో పెట్టవద్దండి. ప్రజాభిప్రాయమునకై ప్రకటించండని ఈ దేశములో కల వాణిజ్య సంస్థలు, చేంబర్ ఆఫ్ కామర్సులు, ప్రభుత్వమువారికి విన్నవించుకొన్నవి. ఈ బిల్లులో కావించినసూచనలన్నియు ఇన్‌కంటాక్సు విచారిణ సంఘము వారు కావించిన శిఫార్సుల ననుసరించి చేయబడినవని చెప్పుచూ, ప్రజాభిప్రాయమునకై బిల్లును ప్రకటించుటకు కేంద్ర ప్రభుత్వమువారు నిరాకరించినారు. అదే విచారణ సంఘమువారు పన్నులను చెల్లింపవలసిన వారికి అనుకూలముగ గావించిన శిఫార్సుల నన్నిటిని గాలికి విడిచి పెట్టినారు.

గడిచిపోయిన సంవత్సరములోకూడ ఇన్‌కంటాక్సును వేయు అధికారములు యిప్పటికే ఇన్‌కంటాక్సు ఆఫీసర్లకున్నది. అది చాలదని, యీ సవరణ బిల్లు శాసనమైనచో, 1951 సం॥ ఏప్రిలు నెల 1-వ తేదీనుండి అమలులోనికి వచ్చినటుల భావింపవలెనని బిల్లులో నొకక్లాజును చేర్చియున్నారు. ఇదంత చూస్తే, మంత్రులకు ప్రజలపైన బొత్తిగా విశ్వాసములేదని – ప్రజలెల్లరు మోసగాండ్రు అనే భావము కలిగినదని తోచుచూ యున్నది. వ్యాపారస్థులు, పెట్టుబడిదారులు మొదలైన వారందరు అంత మోసగాండ్రు, పన్నులు యెగవేయవలెనని తలంచే వారైనచో – సర్కారు ఉద్యోగులు మాత్రమంత ధర్మమూర్తులా? తప్పు చేయనివారా? న్యాయైకపరులా? కాంగ్రెసు మంత్రులకు విశ్వాస యోగ్యులా? ఇదంతా యెప్పటికి తేలుతుంది. ఎటువంటివాడైనా సరే సర్కారు ఉద్యోగాలలో యుంటె మంచివాడు. న్యాయ బద్ధుడు. సర్కారు ఉద్యోగములు లేని వారెల్లరు అన్యాయపరులు, మోసగాండ్రు యని తేలుతుంది. కాంగ్రెసు ప్రభుత్వముల యొక్క పరిపాలనము కట్టకడపటికి యింతకు దిగినది. తమ ప్రజలను తామే నమ్మలేకున్నారు. సర్కారు ఉద్యోగులే శరణ్యమనుచున్నారు.

ఏది యెట్లుండిన నుండుగాక. ఈ బిల్లును మాత్రము తొందరపడి శాసనముగా చేయకూడదని ప్రతి ఇన్‌కంటాక్సు చెల్లించు వ్యక్తియు ఇండియా గవర్నమెంటుకు తంతెల నిచ్చెదరని తలచుచున్నాను. సభలుచేసి తీర్మానములను కూడ త్వరలో పంపవలెనని హెచ్చరించుచున్నాను.

## గాంధీజీ జ్ఞాపకార్థము.

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

(గీతావాణి 6-వ పేజీ తరువాత)

కీ॥ శే॥ చిత్తరంజనదాసుగారు విఖ్యాతి పొందిన రాజకీయ నాయకుడు. వీరు "నారాయణ" అను వేదాంత మాస పత్రికకు సంపాదకులై, తత్వవిచారములను ఆ పత్రికయందు చర్చించుచుండిరి.

గాంధీజీ విషయము చెప్పుట అనవసరము. అనవరతము వీరు గీతా శాస్త్రమును పారాయణము చేయుచు, అందుప దేశింపబడిన కర్మమార్గము ననుసరించి, భౌతిక దేహమును బలిదానముగా ఒసగి, ఆత్మ యజ్ఞమును గావించి, కృతార్థులైన కర్మయోగి.

ఇప్పుడు ఇండియా ప్రధానమంత్రి పదవి యందున్న శ్రీ జవహర్‌లాలు నెహురుగారు తత్వశాస్త్రములలో ఆరితేరిన విద్వాంసుడు. అద్వైతమునకును, సాంఖ్యమునకుగల అతి సున్నితమైన భేదమును బహునైపుణ్యముతో "డిస్కవరీ ఆఫ్ ఇండియా" అను గ్రంథములో చర్చించి యున్నారు. జనకాది రాజ యోగులలో చేర్పవలసిన రాజయోగి. అపూర్వమైన ఈశ్వర తేజము, ఈ యోగ పురుషుని ముఖమును, నేత్రములను ఆవరించి, ప్రకాశించుచున్నది. వీరందరును రాజకీయ నాయకులైనను, ఉపనిషత్తులను, గీతా శాస్త్రములను చదివి, వానిలోని మూలార్థమును గ్రహించిన యోగి పుంగవులు.

కనుక మానవు డేవృత్తి నవలంబించినను, ఏ కార్యములలో నిమగ్నులైనను, ఆత్మజ్ఞానమును చులకన చేయరాదు. శ్రీకృష్ణభగవానుని దివ్య సందేశమును వ్యాపింప జేయుటకై 'గీతావాణి' పత్రికను స్థాపించిన శ్రీకంఠముగారు ప్రశంసార్హులు. వీరి కృషి ఫలించుగాక యనియు, వీరి 'గీతావాణి' దిన దినాభివృద్ధి గాంచుగాక యనియు కోరుచున్నాము.

## భూములగుత్త వేలము నోటీసు.

కమలాపురము గ్రామములో ఉండే మైనరు మాకం వెంకట సుబ్బనరసింహుల్ము శెట్టిగారి యొక్క ఈ క్రింద కనుపరచిన గ్రామములలోని భూములను ఒక సంవత్సరమునకు, సాగు గుత్తకు యిచ్చుటకుగాను కడప జిల్లా జడ్జిగారు 3—8—1951వ తేదీన కడప డిస్ట్రిక్టు కోర్టులో మధ్యాహ్నం 1గంటకు బహిరంగ మయిన వేలం వేయుచున్నారు. కావలసినవారు యీలమునకు వచ్చి, సాగుకు తీసికొనవచ్చునని ఇందుమూలమున తెలియపరచడ మైనది.

| | గ్రామము. | | విస్తీర్ణము. | |
|---|---|---|---|---|
| (1) | కమలాపురము. | — | 54—0. | (సుమారు). |
| (2) | వెదురూరు | — | 71—20 | ,, |
| (3) | మీరాపురము | — | 8—58 | ,, |
| (4) | గంగవరము | — | 18—0 | సుమారు |
| (5) | చదిపిరాళ్ళ | — | 39—24 | ,, |
| (6) | లేటపల్లె | — | 4—79 | ,, |
| (7) | తవ్వారుపల్లె | — | 3—40 | ,, |
| (8) | కోట్లూరు | — | 3—68 | ,, |
| (9) | ఖాజీపేట సుంకేశల | — | 0—73 | ,, |
| (10) | పెద్దపుత్త | — | 5—83 | ,, |
| (11) | ఏటూరు | — | 7—90 | ,, |
| (12) | పొడదుర్తి | — | 5—0 | ,, |
| (13) | గొల్లపల్లె | — | 9—0 | ,, |
| (14) | మాచనపల్లె | — | 2—49 | ,, |
| (15) | ఖాజీపేట | — | 0—80 | ,, |

ఇట్లు తమ విధేయుడు,

కమలాపురము. మాకం వెంకటసుబ్బనరసింహుల్మ

మైనరు గార్డియన్.

వంకదారి నరసింహుల్మయ శెట్టి.

## నోటీసు

కడప డిస్ట్రిక్టు జడ్జి కోర్టులో,

O. P. NO. 33, Of 1951.

Notice under section 5 clause (1) (e) of the Madras Hindu Begami Prevention and divorce Act VI of 1949.

వేంపల్లె సుబ్బన్న, తండ్రి వెంకటేశు, సాకిన్ వేంపల్లె పులివెందుల తాలూకా — పిటిషనరు.

వేంపల్లె లక్షుమ్మ భర్త సుబ్బన్న (పిటిషనరు) సాకిన్ హాల్ నబీకోట, కడపటవున్. — రెస్పాండెంటు.

పైనంబరులోని పిటిషనరు రెస్పాండెంటుతో 1947—వ సంవత్సరములో తనకు కాబడిన వివాహమును రద్దు పరచవలసినదిగా పై నెంబరు పిటీషన్ దాఖలు చేసుకొని యున్నాడు. సదరు పిటీషన్‌లో రెస్పాండెండు హాజరగుటకు గాను నోటీసు వాయిదా 27—8 1951 వ తేదికి వేసి యున్నారు. కాబట్టి సదరు వాయిదా నాటికి రెస్పాండెంటు కేమైనా ఆక్షేపణలున్నయెడల 10 గం॥ లకు కోర్టుకు హాజరై కోర్టు వారికి తెలుపుకొన వలసినది. లేనియెడల రెస్పాండెంటు పరోక్షమందు పిటిషనరు దాఖలు చేసిన పై నంబరును పిటిషనును విచారించి తీర్మానము చేయబడునని యిందువల్ల తెలుపడ మైనది.

టి. రాధాకృష్ణయ్య, బి. ఏ. బి. యల్,.

కె. సంజీవి, బి. ఏ. బి. యల్,.

కడప. పిటిషనరు పక్షము అడ్వొకేట్లు,

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక. REGISTERED No. M. 5285. విడిప్రతిక అణాలు 3

# భారత జ్యోతి

సి. రామకృష్ణ, బి.,ఏ.

సంపుటము 4. సంచిక–26. | బుధవారము, అగస్టు 8, 1951. | ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక



—:(౦):—

# భారత జ్యోతి

సంపుటము. ౪. సంచిక 26.

శ్రీ ఖరనామ సంవత్సర శ్రావణ శు. ౬, ఆగష్టు, 8, 1951.

ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## లంచగొండితనమును సమూలముగ హతమార్చుట.

ఇండియా స్వతంత్ర దేశమై, కాంగ్రెసు పార్టీవారు అధికారమునకు వచ్చినది మొదలు దేశ అగ్రనాయకులును, యూనియన్ ప్రభుత్వ మంత్రులును, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనము తీవ్రముగ వ్యాపించియున్నదని పలుమారు బహిరంగముగ చెప్పుచుండుట వినుచున్నాము. ప్రభుత్వ నిర్వాహణమునకంతయు బాధ్యత వహించియున్నవారా-అపూర్వ నాయకోత్తములు. వారి నైతిక ప్రవర్తనము అద్వితీయమైనది. లేశమాత్రమైన శంకించుటకవకాశములేనిది. వారిపేరు వినినంత మాత్రముననే - వారిని చూచినంత మాత్రముననే-ప్రభుత్వోద్యోగులలో నుండు క్రుళ్లు అంతయునై తొలగి పోవలసియుండినది. అటుల రూపుమాసిపోవుననియే దేశీయులెల్లరు ఆశించిరి, కాని అటుల జరుగలేదు. నాలుగు సంవత్సరములకుపైగా కాంగ్రెసు వారి పరిపాలనము కొనసాగుచు, ఈ నాటికి కూడ రాక్షసిరూపమున లంచగొండితనము ప్రబలియున్నదని చెప్పుటలోను, దానిని తొలగించు మార్గములు కనిపెట్టవలెనని తలంచు స్థితిలోనేయుండుట సిగ్గుకదా? ఇదియే ఇందులోని విషాదము. ప్రభుత్వ నిర్వాహణా యంత్రముతో సంబంధముగల ఉద్యోగులయందు మాత్రమే లంచగొండితనమున్నదనియు, ప్రజలెల్లరు ఈ దోషమున కతీతులుగనున్నారనియు మేము చెప్పుటకు సాహసింపము. ఈ దేశ వాతావర్ణమే లంచగొండి వాసనతో నిండి కలుష భూయిష్ఠమై యున్నది. ఎంత గొప్ప ఉద్యోగి కానిండు, ఎంతగొప్ప వ్యక్తి కానిండు, అతడు లంచగొండియని కాని, లంచగొండికాదని కాని స్పష్టమున బల్లగుద్ది చెప్పలేనంత స్థితి సంప్రాప్తమైనది. ప్రభుత్వోద్యోగులును, ప్రజలును సమిష్టిగా చేరి మంత్రులకు అపకీర్తి తెచ్చియున్నారు. కాంగ్రెసు సంస్థపైనను, ఉత్తమోత్తమ నాయకుల అధికారముక్రింద నడుచుచున్న ప్రభుత్వముపైనను, ప్రజలకు అసూయత, విసుగు కలుగు నటుల చేసియున్నారు.

శ్రీ జవహరిలాలుగారు అ|| భా|| కా|| క|| సమర్పించిన నివేదికతో ఈ లంచగొండి విషయమును చర్చించుచు:—

"లంచగొండి విషయమై పలుమారు ప్రస్తాపన చేయబడుచున్నది. ఈ లంచగొండితనము వివిధ రూపములలో వ్యాపించినదని చెప్పుటకు సందేహము లేదు. వీనిని నిర్మూలించుటకు సర్వ శక్తులా పోరాడవలెను. దీనికి సంబంధించిన కేసులుకూడ త్వరలో పరిష్కారమగు మార్గమును కూడ చూడవలెను. ఒక పద్ధతి ననుసరించి నేరము ఋజువగుటకు కావలసిన సాక్ష్యముపై న్యాయస్థానములు యెక్కువ పట్టుదల చూపుటవలన, పరిత్యక్షమైన చిక్కులేర్పడినవి. దానివలన నేరస్థులు పలుమారు శిక్షనుతప్పించుకొనుట తటస్థించుచున్న"దని చెప్పిరి.

బ్రిటీషువారు ఈ దేశముపై అధికారము చలాయించుచుండిన రోజులలో, లంచగొండి తనము అన్నివైపుల ఇప్పుడున్నంత తీవ్రముగ వ్యాపించిన

దని వినలేము. దానికి హోంశాఖామంత్రి గారైన శ్రీ సి. రాజగోపాలాచార్యులవారు స్పెషలు పోలీసుశాఖ ఉద్యోగుల సభలో జులై నెల 30-వ తేది మాటలాడుచు, బ్రిటీషువారి కాలములో లంచగొండి విషయమై ప్రజలు భయమువల్ల చెప్పుకొనకుండిరి. ఇప్పుడు ఆ భయము తొలగినది. అనేకులు నిర్భయముగా చెప్పుకొనుచున్నారు. అందువలన బ్రిటీషువారిహయాములో లంచగొండితనము తక్కువగా ఉండినదని కాని, ఇప్పుడు హెచ్చినదనికాని చెప్పుటకు వీలులే" దనిరి. కొంత ఇదికూడ నిజమై యుండవచ్చునని నమ్మెదము.

యుద్ధకాలములో 'యుద్ధ విరాళములను' వసూలుచేయుటకు ప్రభుత్వోద్యోగులు, జిల్లా కలెక్టర్లు మొదలు రివెన్యూ ఇన్‌స్పెక్టర్ల వఱకు హోదాగలవారినెల్ల ప్రజలపై వదలిరి. యుద్ధావసరములకై వలయు పదార్థములను సేకరించుటకు కంట్రాక్టులను ఇచ్చు అధికారములను, మానవ జీవితమునకు అవసరమగు పదార్థములను సేకరించి, బట్వాడా చేయుటకు కొద్దిమందికి మాత్రమే అవకాశములొసగునట్టి లయిసెన్సులు, పర్మిట్లు— ఇచ్చు అధికారమున్ను, ఈ ఉద్యోగులకు ఒప్పగించిరి. యుద్ధ విరాళములు వసూలుచేయు విషయములో సరియైన లెక్కలు అడుగు దిక్కు లేదు. రసీదుల నిచ్చిన దాతలు లేరు. అడిగే ధైర్యము ప్రజలకు లేదు. కనుక పరిమితమైన వేతనముల పై ఆధారపడి, ఎక్కువ రూపాయలను కంటితో చూచుటకు అవకాశములేని ఉద్యోగు లెల్లరు ఎక్కువ ద్రవ్యమును చూచుటకు ఆస్పదము చిక్కెను. తమ పెట్టెలను నింపుకొనిరి. మిగతది పై అధికారుల కొప్పగించిరి. దానివలన పెద్ద ఉద్యోగములను కూడ పొందిరి.

సామాన్యప్రజలుగ నుండినవారు లయిసెన్సులను, పర్మిట్లను సంపాదించుకొని రెప్పపాటు కాలములోనే గొప్ప ధనవంతులైరి. ఇతరులు దీనిని చూచి అధికారుల కృపకు పాత్రులగుటకు పోటీ సలిపిరి. ఈ పోటీలో ఉద్యోగులు అవినీతి పరులై, ప్రజలను నీతిబాహ్యులుగ నొనరించిరి. దేశనాయకుల దురదృష్టవశమునను, అవినీతిపరులయిన ఉద్యోగుల యొక్కయు, ప్రజలయొక్కయు అదృష్టవశమునను యుద్ధము పరిసమాప్తమైనను, కంట్రోల్లు, పర్మిట్లు లయిసెన్సులు ఈ దినము వఱకును కొనసాగుచునే యున్నవి. తెల్లవారకమునుపే ధనవంతులు కావలెనను ఆతురత వలన ఏదో ఒక విధముగ లయిసెన్సులు, పర్మిట్లు పొందుటకు ప్రయత్నించుచున్నారు. తాము అవినీతివంతులై, ఉద్యోగులను లంచగొండులుగ చేయుచున్నారు.

ప్లానింగు కమిటీకి పంపిన నివేదికలో ఈ లంచగొండితనమును చర్చించుచు:—

"ప్రభుత్వమువారి విధానములను ఆచరణయందు పెట్టవలసిన ఉపకరణములు ఉద్యోగులు. ఈ తరుణములో కావలసినంతమంది మంచి ఉద్యోగులు చిక్కుటలేదు. నైతికపరివర్తనము లేదు అని చెప్పుటలో— లంచగొండితనము చేరును. అభిమానము చేరును. పలుకుబడి చేరును. లంచగొండితనము మొదలైన ఆరోపణలు చేయబడినచో, ఒక వ్యక్తి ఎంత గొప్ప అధికారపదవిలోనైన నుండుగాక —మంత్రికాని, శాసనసభ్యుడుకాని లేక ముఖ్యమైన ఉద్యోగికాని— విచారణ నుండి రక్షణ లేకుండ చూడవలెను. అపరాధ పరిశోధకశాఖ బలహీనముగా నుండుటవల్లనో లేక విచారణ పద్ధతియందు లోపముండుటవల్లనో అనేకమంది లంచగొండిఉద్యోగులు శిక్షలను తప్పించుకొను చున్నారు. ఆయా శాఖలలోనే జరుపు విచారణలు త్వరలో ముగియునట్లు చేయవలె" నని శ్రీ గోర్వాలాగారు తెలిపిరి. విచారణసలుపు యంత్రము బలహీనముగా నుండుటవల్లకాని లేక విచారణ సలుపు విధానములో లోపముండుటవల్లకాని అవినీతిపరులయిన ఉద్యోగులు శిక్షలను తప్పించుకొనుచున్నారను విషయములోను, త్వరలోనే ఇట్టి లంచగొండి కేసులు విచారింపబడుటకు ఏర్పాటు చేయవలెనను విషయములోను ఇండియా ప్రధానమంత్రియు, శ్రీ గోర్వాలాగారును ఒకే అభిప్రాయము కలిగియున్నారు. కాని ఉద్యోగులను,

అందు ముఖ్యముగ పోలీసుశాఖవారిని భుజముపై తట్టుటలోను, పొగుడుటలోను యీసరికి చెందని హోమ్ శాఖా మంత్రిగారైన శ్రీ రాజగోపాలాచార్యులుగారు మాత్రము వేరు అభిప్రాయము కలిగియున్నారు.

"స్పష్టమై, అంగీకారయోగ్యమైన సాక్ష్యముండి నప్పుడే కాని ఒక వ్యక్తి దోషియని తీర్మానింప కూడదను సిద్ధాంతమును త్రోసి పుచ్చరాదు. సహజమైన న్యాయమును ఋజువుపెట్టుకొను పద్ధతులు తొలగింపరాదు. తన నిర్దోషత్వమును ఋజువుపెట్టుకొను అవకాశము ముద్దాయిలకొసగక సూక్ష్మమైన విచారణ పద్ధతులకు దిగకూడదు. ఏవ్యక్తియైనను ఋజువయ్యేవరకే నిర్దోషియని భావింపవలెను కాని, దోషియని భావింపరాదు. లంచగొండి తనమును నిర్మూలించుటలో కొన్ని కష్టములున్నవి. లంచగొండితనమును తొలగించవలెనను ఆతురతవల్ల న్యాయ విచారణకు సంబంధించిన సిద్ధాంతములను విడనాడజాలము. సమస్యలను మన మెంతమాత్రము ఎదుర్కొనగలమో అంతమాత్రమె మనకొనుము క్రిమినలు జూరిస్ ప్రుడెన్సు ఏపునాదుల పై స్థాపింపబడినదో వానిని సంరక్షించెదము గాక" అని హోంశాఖా మంత్రిగారైన శ్రీ రాజగోపాలాచార్యుల వారు తెలిపియున్నారు.

ఆహా! ఎంత ఆశ్చర్యకరముగ క్రిమినలు జూరిస్ ప్రుడెన్సులోని మూలసిద్ధాంతములను తెలియ జేసియున్నారో పాఠకులు గమనించెదరు గాక! శ్రీ రాజగోపాలాచార్యుల వారెల్లప్పటికి ఉద్యోగుల పక్షపాతి. న్యాయ విచారణ విషయములో పైన వెలిబుచ్చిన భావములు, పద్ధతులు క్రిమినలు కేసులో చిక్కుపడిన ఉద్యోగులకును, అవినీతికి పాలుపడినటుల అనుమానింపబడిన ప్రభుత్వోద్యోగులకు మాత్రమే అన్వయింప వలెననియా లేక ఇతర ప్రజలకు కూడ అవి అన్వయింప వలసినవేనా అని శ్రీ రాజగోపాలాచార్యుల వారిని వినయముతో అడుగవచ్చునా? ఇతర ప్రజలకుకూడ ఈ న్యాయ విచారణ సిద్ధాంతములు అన్వయించుచో, ఏలాటి విచారణ లేక అనుమానముపై నిర్బంధములో ప్రజల నుంచుటకై చేయబడిన ప్రివెంటివ్ డిటేషన్ చట్టమును శ్రీరాజగోపాలాచార్యుల వారెట్లు సమర్థింపగలరో మాకర్థము కాదు. ఆ చట్టముక్రింద విచారణలేకనే కారాగృహములలో వ్యక్తులను ఉంచియుండుట వారు ఏ విధముగ సమర్థించెదరో చెప్పజాలము. ప్రభుత్వోద్యోగులకు ఒకవిధమైన క్రిమినల్ జూరిస్ ప్రుడెన్సును, రిపబ్లిక్ ఇండియాలోని స్వాతంత్ర పౌరులకు వేరొక పద్ధతిని సూచించెదరా?

శ్రీ గోర్వాలాగారు మంచి ఉద్యోగులు అరుదుగ ఉన్నారని రిపోర్టులో తెలిపిరి. దీనికి ప్రత్యక్ష విరోధముగ "లంచగొండులకన్న న్యాయమైన దృష్టిగల ఉద్యోగులే ఇప్పుడు ఎక్కువగ ఉన్నా"రని శ్రీ రాజగోపాలాచార్యుల వారు హోంశాఖ మంత్రిపీఠమునుండి సర్టిఫికెట్టు నిచ్చిరి. మంత్రి పదవులలోనుండు గొప్పవారు ఉద్యోగులను గురించి అనుచితముగ శ్లాఘించుట వలన ఉద్యోగులలో భయమనునది తగ్గును. లంచగొండులకు ప్రోత్సాహ మెక్కువగును.

ఉద్యోగులెల్లరు అవినీతి పరులని లేక లంచగొండులని మేము చెప్పము. నీతిపై దృష్టిగల ఉద్యోగులున్నారు. వారి ప్రవర్తనమును శంకించుటకు వీలులేదు. మంత్రులును, ప్రజలును అట్టివారిని బహిరంగముగ మెచ్చుకొనవలసినదే కాని మంచి ఉద్యోగులు అరుదుగ ఉన్నారని మాత్రము ప్రతి వారు అంగీకరించెదరు. మంచి ప్రవర్తనముగల ఉద్యోగులే ఎక్కువగా నున్నవో, నాలుగున్నర సంవత్సరములుగ అపూర్వ నాయకోత్తముడైన శ్రీ జవహరిలాలుగారి పరిపాలనక్రింద ఇండియా ప్రజల జీవితములు ఇంతటి భరింపరానిస్థితికి వచ్చియుండవు. అనుమానములపై ప్రజలను ఏ విధముగ విచారణలేకనే నిర్బంధములలో పెట్టుచున్నారో, లంచగొండితనము నిర్మూలింపవలెనన్న, అనుమానముగల ఉద్యోగుల నెల్లరిని విచారణ లేకనే దేశ క్షేమమునకై ప్రివెంటివ్ డిటేషన్ చట్టము క్రింద నిర్బంధములో నుంచుటకు వెనుతీయ కూడదు. ఈ దేశములో లంచగొండి తనము నిర్మూలింప బడవలెనన్న ఇంతకన్నను వేరుమార్గము లేదు.

# గ్రంథ పరిచయము.

[మోహనవిజయము— గ్రంథకర్త: సాహిత్య శిరోమణి, ఉభయభాషా ప్రవీణ, శ్రీ కాండూరి నరసింహాచార్యులు, జమ్మలమడుగు బోర్డు హైస్కూలులో ప్రధానాంధ్రపండితులు.]

(వెల రు. 2—0—0)

ఇది సాంఘికమగు పద్యప్రబంధము. కవి మోహనుండను నతని జీవితమును వర్ణించినారు. ఇందు మూఁడాశ్వాసము లున్నవి.

కథాసారము:

"ధర్మపురమందలి వసుంధరా విశ్వపతులను దంపతులకు మోహనుఁ డేకైక పుత్త్రుఁడు. తండ్రి లోభి కాన, మోహనుని జనివింపఁడయ్యెను. శంకరుఁడను గాంధీయనుయాయి చేయు నుపన్యాసములను మోహనుఁడు వినుట తటస్థించెను. కాన, మోహనునికి బాల్యముననే దేశభక్తి యంకురించి పెరుగఁ జొచ్చెను. తండ్రి సమ్మతించక పోయినను, తల్లి యనుమతిపైని మోహనుఁడు గృహము వీడి కాశికి బోయెను. అట నొక పుణ్యపురుషుని సాయమున కళాశాలలో జేరి, సంస్కృతాంగ్లాదుల జదివి, పట్టభద్రుఁడయ్యెను. అప్పటి కిరువది రెండేండ్ల ప్రాయమువాఁడగు నీ బ్రహ్మచారి, దేశమును జూడఁదలచి కాశి వీడెను. కాశ్మీరమునకుఁబోయి అట "శ్రీహరి" యను మిత్రు నార్జించి వారియింట నుండెను. సుశీల శ్రీహరికి జెల్లెలు. మోహను డామెపై ననురాగము కలవాఁడయ్యెను. ఆమెయు మోహనుని బ్రేమించెను. తన తల్లిదండ్రుల యనుమతిగొని సుశీలను వివాహమాడ నిశ్చయించి, ఆమె కన్యాత్వమును మోహనుఁ డాదరించి తన ధీరతఁ బ్రదర్శించెను.

మోహనుఁడు హిమాలయాదుల సందర్శించి ధర్మపురికి వచ్చెను.

తల్లిదండ్రుల యనుమతిపైని సుశీలను పెండ్లాడెను. మోహనుడును, సుశీలయును దేశసేవారతులై ప్రజలకు రాజకీయవిషయముల బోధించుచు కాలము పుచ్చిరి."

పై కథ ఈ కాలమందలి యువకుల కాదర్శప్రాయమై యున్నది. పూర్వకవుల యాచారము ననుసరించి ఆచార్యులవారు మోహనుని పాత్రను నీతిదాయకమైనదానినిగాఁ జిత్రించిరి. ఇందలి భాష గ్రాంథికము. మత్తకోకిల, మహాస్రగ్ధర, ఉత్సాహము మొదలగు పద్యములను గూడ వీరు వ్రాసినారు.

మోహనుని దేశాటనమున గల వింతలను కవి మనోహరముగా వర్ణించినారు. మూఁడవ యాశ్వాసమందలి మోహనుని దేశసేవ, మిత్రు లతనిని ఎన్నికలకు నిలఁబెట్టుట మొదలగు విషయములు చాల బాగుగా నున్నవి. పద్యముల నడక బాగున్నదనుట కొక యుదాహరణము:

సలలిత పంకజాకర లసత్సరసీరుహ సంగతంబులై
మలయజ వాతపోతము లమంద సుఖాస్పద సత్త్వసార ముల్
పొలయఁగఁజేవ, జవ్వనపు ముగ్ధలు విచ్చలు సంజమాపులన్
లలిత విలాసభావముల రంజిలుచుండ్రు వనాంతసీమలన్.

పై పద్యమున స్వభావోక్త్యలంకారము మనోహరముగా నున్నది. ఇట్టి పద్యము లెన్నో కలవు.

అచ్చటచట ముద్రణ స్ఖాలిత్యములును, ఛందోభంగములును ప్రమాదమునఁ నేర్పడినవి. అట్టివానిని పునర్ముద్రణమున గ్రంథకర్త తొలఁగింతురని యాశింతుము.

విద్యుద్దీపము రాజిల్లెడు తెరగన్ విద్యున్మాల భంగిన్ సమస్త.

పై పద్యముపాదమున గణభంగమున్నది. ఇట్టివి అచ్చటచట గలవు.

పలువురు విద్వాంసు లీ గ్రంథము విషయమున సదభిప్రాయము లిచ్చినారు. చెన్నరాష్ట్ర ప్రభుత్వాస్థానకవులును, కవిసార్వభౌములును నగు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి గారు "గ్రంథకర్తగారు సంస్కృతాంధ్రములందు మంచి సాహిత్యసంపద కలవారనుటకు సందేహము లేదు. వీరు గ్రంథమును సాంప్రదాయసిద్ధముగా వ్రాసినారు" అని దెలిపియున్నారు.

ఆచార్యులవారి యీ కృషికి మా ధన్యవాదములు.

# ప్రజాభిప్రాయ వేదిక

## జనరల్ ఎన్నికలు—ప్రభుత్వ కర్తవ్యము.

**

ఆర్యా!

వచ్చే జనరల్ ఎన్నికలలో మా కిష్టమైన ప్రభుత్వమును ఏర్పాటుకొనమని కాంగ్రెసు నాయకులు పదేపదే చెప్పుచున్నారు. ఏదైనా నోటితో చెప్పుట సులభమే కాని దానిని ఆచరణలో నిరూపించుట కష్టము.

జనరల్ ఎన్నికలముందు ఈ రాష్ట్ర ప్రభుత్వాలను, కేంద్ర ప్రభుత్వమును కనీసపు మూడు నెలలయిన రద్దుచేసి, ప్రెసిడెంటుచే నియమింపబడిన అధికారులు, అనగా గవర్నర్లు సలహాదారులతో ఆ మూడు నెలలు ప్రభుత్వము నడిపిన, అది ప్రజా స్వామికముగా యుండును. అట్లయినచో ప్రస్తుత అధికార పక్షము తన చేతిలోని అధికారమును ఎన్నికలలో తిరిగి తాము గద్దె నెక్కుటకు ఉపయోగించుకొనుటకు వీలుండదు. దురదృష్ట వశాత్తు ఈ సూచనను భారత ప్రభుత్వము అంగీకరించలేదు. నిజముగా ఇండియా ప్రజాస్వామిక ప్రభుత్వమని చెప్పుకొనుచున్న మన నాయకులే పరిపాలనలోనే యిటువంటి మంచిసూచన ఆమోదింపకుండుట ఆశ్చర్యకరము. అంతేగాక మన ప్రజాస్వామిక ప్రభుత్వ వ్యవస్థకే సిగ్గుచేటు.

ప్రస్తుత కాంగ్రెసు పరిపాలనలో అధికారుల దౌర్జన్యములు, నీతి తలచుకున్నప్పుడు ఎన్నికలు బాగుగా ప్రజాస్వామికముగా, నిష్పక్షపాతముగా జరుగునని అనుకొనుటకు వీలులేకున్నది.

‘కమ్యూనిష్టులు హింసా చర్యలు విడిచితే వారికి పౌర హక్కు లక్షణముగా వుండు’ నని, శ్రీ రాజగోపాలాచార్లు గారు ఎప్పుడో చెప్పినారుకదా! అందులో రాజాజీ ‘హింసా విసరణ కొద్దికాలమయినా సంతోషిస్తాను. వారికి పౌరసత్వ హక్కులు యిచ్చెద’ మని చెప్పినారు.

మూడేండ్లనుంచి కమ్యూనిష్టుపార్టి అవలంబించిన పోరాటు ఎత్తుగడలకు, ప్రజల ఎదుట చింతించి, ఎన్నికలలో పాల్గొనెదమని వారు నాలుగు నెలలనాడే ప్రకటించినారు. కమ్యూనిష్టు నాయకుడు శ్రీడాంగే, జైలు గడపదాటిన నాటి నుంచే హింసామార్గాన్ని వ్యతిరేకించి నిజమైన ప్రజా స్వామిక కార్యాలు కమ్యూనిష్టుపార్టి చేయుననిఅన్నారు. ఉత్తర భారతదేశములోని రాష్ట్రములు చాలమటుకు డిటెన్యూలందరిని విడుదలచేసి, వారికి కొన్ని హక్కులివ్వబడినవి. చెన్నరాష్ట్రములో ఇంకా వందలకొలది డిటెన్యూలున్నారు. వందలమంది మీద అరెస్టు వారెంట్లు వున్నవి. వానిని రద్దు చేయ కూడదా?

కాబట్టి ప్రస్తుత కాంగ్రెసు ప్రభుత్వమువారు ఈ క్రింది కార్యములను చేయవలయును.

(1) జైళ్ళలోవుండే అన్ని రాజకీయ పార్టీల ఖైదీలను బేషరత్తుగా విడుదల చేయవలెను.

(2) అరెస్టువారెంట్లు రద్దు గావించ వలెను.

(3) ఎన్నికలకు మూడు మాసములకు ముందుగానైనా పరిపాలన ప్రెసిడెంటు వశము గావించి, మంత్రివర్గములు రాజీనామా యివ్వవలెను.

(4) అధికారులుకాని ఎన్నికల ప్రచారములో పాల్గొనకుండా కఠిన చర్యలు తీసుకొనవలెను.

(5) ప్రజల సొమ్ముఅయిన రేడియోలు ఎన్నికల ప్రచారములో అన్ని పార్టీలు, వ్యక్తులు ఉపయోగించు కొనుటకు వీలు కలిగించ వలెను. అప్పుడే ప్రస్తుత పరిపాలన ప్రజాస్వామిక ప్రభుత్వ మనిపించు కొనును.

ప్రొద్దుటూరు. బి. నాదమునిరాజు.

---

## మహిళల కర్తవ్యము.

ఆర్యా!

మహిళలు శాంతి కార్యక్రమంలో పాల్గొన వలెనని, వారిని సభ్యులుగా చేర్పించవలెనని, గ్రామమహిళా సంఘము ఏర్పాటు చేయవలెనని, ఒక కార్యక్రమము ఏర్పాటు చేయబడినది. ఈ కార్యక్రమము కొనసాగించుటకు తాలూకా ఆర్గనైజరుగా శ్రీమతి యన్. కొండమ్మగారు నియమింపబడినారు.

పౌరసత్వ హక్కులు పునరుద్ధరించి, రాజకీయ డిటెన్యూలందరిని విడుదలచేసి, జనరల్ ఎన్నికలలో, అన్ని పార్టీలు, సంస్థలు, గ్రూపులు, వ్యక్తులు స్వేచ్ఛగా పాల్గొనేందుకు అవకాశముగలిగించవలెనని ప్రభుత్వము వారిని కోరుచున్నాము.

కమలాపురము. యన్. కొండమ్మ, మహిళా సంఘ ఆర్గనైజరు.

## ఉప్పు పరిశ్రమ.

ఆర్యా,

బొంబాయికి సమీపమున ప్రభుత్వము స్థాపించిన ఉప్పు పరిశోధనశాల యున్నది. ఇచ్చట 100 కి 92 మొదలు 95 వంతును పరిశుభ్రమైన ఉప్పును తయారుచేయుటకు ఒక్కమణుగుకు రు 0—11—3 కర్చుఅగునని ప్రకటించి యున్నారు. ఇది గొప్ప సాధనగ భావించుచున్నారు. చెన్నరాష్ట్రములో పలు ప్రదేశములలో ఉప్పుపరిశ్రమల స్థానములున్నవి. ముఖ్యముగ ట్యుటికోరనులో 95% పరిశుభ్రమైన ఉప్పును తయారు చేయుటకు మణుగు ఒకటికి రు 0—8—0 కన్న యెక్కువ కర్చు యగుటలేదు. ఈ కర్చును యింకా తగ్గించుటకు వీలున్నది. బొంబాయి ఉప్పు పరిశోధనా శాలవారు రు 0—11—3 ఒక మణుగు ఉప్పును తయారుచేయుటకు వీలున్నదని చెప్పుకొనుట వొట్టి బడాయియని ప్రజలు తెలుసుకొందురుగాక!

కర్నూలు. సి. వెంకటప్ప.

తారా పరిచయము:—

# 'మధుబాల' జీవిత సంగ్రహము.

ప్రపంచములో ఐశ్వర్యవంతు లెందరో లేరు. భాగ్యవంతు లెల్లరు ప్రతిభా శాలురు కారు. పేదలలో ప్రతిభా శాలురు లేరని తలచుటకు వీలు లేదు. పేదత్వము ఒకపాపము. నేరము కాదు. కాని పేదలకు తమ సహజ ప్రతిభను ప్రదర్శించుటకు వలయు వాతావర్ణము, అనుకూలమైన పరిస్థితులు చిక్కుట అరుదు. అందువలననే విద్యావంతులు, విజ్ఞానులు, రచయితలు, నటకులు, గాయకులు, మొదలైనవారు బయటికి రాజాలక బూడిద కప్పిన నిప్పువలె నున్నారు. ధనాఢ్యులచే గుర్తింపబడజాల కున్నారు. తరుణములో ఆదరణమును, ప్రోత్సాహమును పొందజాలక, బీటికి కాసిన వెన్నెల వలె అడవిలో ముండ్ల పొదలమధ్య పుష్పించిన పుష్పముల వలె జీవితములు వ్యర్థమై పోవుచున్నవి.

చలన చిత్రములలో నటించుచున్న యువతీ యువకు లెల్లరు పట్టభద్రులు కారు. విద్యావంతులు కారు. కళల యందును, శాస్త్రములయందును క్రమశిక్షణను పొందిన వారు కారు. ఎక్కువ మంది సామాన్య ప్రజల మధ్యలో పెరుగుచు వచ్చినవారే. ఇట్టి వారు సినిమారంగమున ఆకర్షింపబడుటకు కారణ మేమి? భోగ భాగ్యములు కాదు. కాని వారిలో ప్రకృతి యొసగిన సౌందర్యము, ఆకర్షణీయమైన ముఖకాంతి, అవయవ సౌష్టవము, శ్రావ్య కంఠము, ఇవియే పేదల పాలిటి ధనరేఖలు. ఆస్తులు. శ్రీమతి యం. యస్. సుబ్బలక్ష్మిని ఆకర్షింపజేసిన దేది? ఆమెలో ప్రపంచమెల్లరు గుర్తించిన దేది? హృదయాహ్లాద కరమగు రూప లావణ్యము, మానస నైజ ప్రవృత్తులనణచి, ఉన్నత పథమునకు గైకొని పోగల శ్రావ్య కంఠము. ఈ రెంటిని పండితులు, పామరులు ఆమెలో గుర్తించిరి. ప్రకృతి దత్తమైన ఈ రెండు లక్షణములే, ఆమెను అష్టైశ్వర్య వంతురాలిగ నొనర్చినవి.

సినిమా ప్రపంచములో 'మధుబాల' పేరు వినని వారీ దేశమునం దుండరు. ఈ యువతి జీవితములో ప్రపంచము నంతయు విస్మయ మొందింపగల అద్భుత పరిణామము కనిపించుచున్నది. వయస్సు 17 సంవత్సరములు నిండీ నిండని యువతీలలామ. ఈ చిన్న వయస్సులోనే దేశమంతయు పేరెన్నిక వచ్చినది. సామాన్యమైన కుటుంబములో అతుల్లాఖాన్ అను నతనికి పదిమందిలో నాలుగవదిగ (ఆడ పిల్లలలో మూడవదిగ) జన్మించినది. కుటుంబపోషణ కంతయు ఈ యువతియే ఆధార భూతమై యున్నది. ఈ బాలిక జీవితమును దిద్దుటలో తండ్రియే ఎక్కువ బాధ్యత వహించి యున్నాడు. ఒక్క మోటుతనము తప్ప, మిగత గుణములన్నియు తన తండ్రినుండి యలవరచుకొన్నది. ఐదు అడుగులు నాలుగు అంగుళముల పొడవు కలిగి, ఈ యెత్తుకు తగిన లావును కలిగి, ఆకర్షణీయమైన విగ్రహముగ నున్నది. నటించునప్పుడు చూపరుల కంటికి విందొసగురీతి యవ్వనత్వములోని సంపూర్ణ చైతన్యమును ప్రదర్శించును. ప్రేక్షకుల కాహ్లాద మొసగూర్చును. విషాద దృశ్యములలో ఓదార్పును ప్రదర్శించును. దుఃఖ ఘట్టములలో శాంతమును ప్రతిబింబింపజేయును.

మధుబాల ముఖ్య వంపులోనే ఒక విధమైన అందమున్నది. ఆ పిల్ల నడకలోనే ఒక విధమైన గాంభీర్యత యున్నది. మెల్లగ మాటలాడును.

తండ్రి ప్రయత్నముపై 'బసన్తు' అను చిత్రములో 1941 వ సంవత్సరములో మధుబాల నటించెను. పిదప కిదార్ శర్మగారి 'నీల్ కమల్' మోహన్ సిన్హా గారి 'చిత్తూరు విజయ్' 'దిల్ కి రాణి' 'ఖుబ్‌సూరత్ దునియా' 'ఇమ్తీహాన్' "అమార్ ఖాని", "రాధ", "అపరాధి", అను వానిలో నటించుటకు అవకాశములు లభించెను. కాని వీనిలో ఈ బాలికకు ఖ్యాతి లభింపలేదు. "నీల్ కమల్", "దిల్ కి రాణి", "రాస", చిత్రములలో విఖ్యాత నటుడైన రాజ్ కాపూర్‌తో కూడి నటించుట ఘటస్థించెను. కాని ఇవేవియు ఆమె అర్థికాభివృద్ధికి తోడుపడలేదు. "బసన్తు", లో ప్రదర్శించిన పిదప, ఆ బొంబాయి పట్టణములోనుండు అనేక ఫిలిము స్టుడియోల దగ్గఱ తన్ను పిలిచెదరా అని కాచుకొని యుండవలసిన పరిస్థితిలోనే ఈ మధుబాల యుండెను. పైన తెలిపిన చిత్రములలో నటించుట వల్ల, ఈ చిన్నపిల్ల ఒక విఖ్యాత నటకురాలుగ తయారగు చిహ్నములన్నియు ఉన్నవని ప్రతి స్టుడియో యజమానులు గ్రహించుటకు వీలు పడెను.

ప్రకృతి గుణములు చాలకాలము దాగజాలవు. మధుబాలను ప్రపంచము గుర్తించుకాలము కలిసి వచ్చెను. 1948 సంవత్సరము కె. బి. లాల్ గారి "లాల్ దుపట్టా" అను చిత్రములో ప్రదర్శించుటకు ఆస్పద మొసగబడెను. బాల్య దశను దాటి కోమలమైన యౌవ్వనదశ ప్రారంభము ఈ పిల్లపై మూర్తీభవించెను. ఒక అపూర్వమైన దివ్య కాంతగా ప్రేక్షకులకు మిరుమిట్లు గొలిపెను. ఆ నాటి నుండియు "మధుబాల", సినిమా వ్యాపారుల యొక్కయు, ప్రజా బాహుళ్యము యొక్కయు, దృష్టి నాకర్షించెను. మరు సంవత్సరము "అశోక కుమారుతో" "మహల్", చిత్రములో నటించెను. ఇదే ఈ పిల్లను సినిమా ప్రపంచములో నుచ్చస్థానమునకు దెచ్చెను. యౌవ్వన దశ ఆరంభ మగుటచేత అవయవ నిర్మాణములో పొడచూపుచున్న అభివృద్ధి సహజ సౌందర్యమునకు వన్నె తెచ్చుచున్నది. ఈ మధుబాలను తమ చిత్రములలో

చేయుకొనుటకై ఫిలిము నిర్మాతలలో పోటీ ఏర్పడెను. ఆ పోటీ ననుసరించి, ఈ యువతి విలువకూడ హెచ్చెను. కె. యస్. హిర్‌లాని గారి "తారన" చిత్రములో ప్రదర్శించుటకు రు 1,50,000 – కాంట్రాక్టుపై మధుబాల సంతకము పెట్టెను. ఒక్క నెల రోజులలో రు 1,50,000/– ఆర్జించుటకు అవకాశమైన వృత్తి ఈ ప్రపంచములో నెచ్చటనైన కలదా? ఈ 17 ఏండ్ల వయస్సులో ఎల్లరిని భ్రమింప జేయగల యింత వేతనమును పొంద గలిగిన మరియొక వ్యక్తి ఈ ప్రపంచమున కానవచ్చునా? ఇది నమ్ముటకు సాధ్యమున్నదా? ఇది నిజమైన ప్రత్యక్ష విషయము. ఈ చిన్న యువతి 'మధుబాల' ఆర్జింప గలిగియున్నది. వేతనముల విషయములో విప్లవ కరమైన మార్పును తెచ్చినది. కాని ఆర్థికముగ ఇంతటి గొప్ప పరిణామమును పొందిన 17 సం॥ యువతియొక్క నడవడికను గూడ ప్రజలు తెలుసుకొన వలదా?

ఈ "మధుబాల" స్టుడియో ఎదుట నటించు నప్పుడు ప్రేక్షకు లెవ్వరును ఆ పరిసరములలో నుండకూడదు పత్రికా రచయితలు కూడ రాకూడదు. రాత్రికాలము షూటింగుకు రమ్మని అడుగ కూడదు. నియమిత కాలమున కన్న ఒక్క నిమిష మెక్కువ ఉండమని చెప్పకూడదు. ఆలస్యములకు తాను బాధ్యత వహించదు. ఈ షరతుల కన్నిటికి అంగీకరించిననే కాని మధుబాల కాంట్రాక్టుపై సంతకము పెట్టదు. ఈ కాంట్రాక్టులు మొదలైన విషయములన్నియు తన తండ్రికే వదలి వేయును. తాను జోక్యము కలిగించు కొనదు. చిత్రములలో తన శక్తి నంతయు వినియోగించి నటించుట మాత్రమే ఈ పిల్ల పని.

ప్రతి నిత్యము ఉదయము 6 గంటలకు లేచును. ఫలములు మొదలగునవి గైకొని, సరిగా 7 గంటలకు ఇల్లు వదలి స్టుడియోలకు పోవును. ఒక్కొక్క స్టుడియోలోను ఎంతెంత కాలము పనిచేయుటకు అంగీకరించుకొని యుండునో, సరిగా ఆ నియమిత కాలమునకు పోయి, డైరెక్టర్లు చెప్పిన ప్రకారము ఉత్సాహముతో నటించును. అన్ని స్టుడియోలలోను పనులు ముగించుకొని సాయంకాలము 6–30 గంటలకు యిల్లు చేరు కొనును. అక్క చెల్లెండ్రుతప్ప ఇతర స్నేహితులు ఈ మధుబాలకు లేరు. అందువలన యిల్లు విడిచి ఎక్కడికి పోదు. అక్క చెల్లెండ్రతోనే ఆడుకొనుచు, పాడుకొనుచు కాలము—పుచ్చుకొనును. ఎప్పుడైన తన కారులో షికారు వెళ్ళును. సరిగ రాత్రి 9 గంటలకు పడకకు పోవును.

ఆంగ్లేయ భాషను యిప్పుడిప్పుడే అభ్యసించుచున్నది. ఇట్టి కఠిన శిక్షణకు లోనై ఈ యువతి ప్రవర్తించు చున్నది. తాను కొన్ని సినిమాలలో భాగస్వామిగ నున్నది.

ఈ అందము, యీ దేహ పటుత్వము స్థిరమైనవి కావని ఈ యువతి గ్రహించినది. దూర దృష్టికల తండ్రి కూడ తెలుసుకొని యున్నాడు. ఇంకను కొంతకాలము తన రూప లావణ్యముతోను, నటనా కౌశలముతోను ప్రజల నాకర్షించును. ఈ ఆకర్షణకూడ దాని హద్దుకు రాగనే నిలిచి పోవును. అంతలోపలనే తానెంత సంపాదింప గలుగునో అంత సంపాదించుటకై ఒక వైపు కృషి చేయుచున్నది. మరియొక వైపు సంఘ జీవితములో ఒక స్థానమును సంపాదించు కొనుటకై అనేక సంస్థలకు విరాళముల నొసగుచున్నది. వంగదేశ క్షామ నివారణ నిధికి రు 50,000 విరాళ మొసగినది. ఇండియా ప్రధానమంత్రిగారి నిధికి విరివిగా విరాళ మొసగినది. బీదసాదల కనేక విధముల తోడు పడుచున్నది. వివాహము చేసికొని దాంపత్య జీవితము ననుభవింపవలెనని తలంపు ఈ మధుబాలకు కలదు. దైవ భక్తి, మతమునందు విశ్వాసము కలదు. ప్రవర్తనమునందు వ్రేలు జూపి చూపుట కవకాశము లేదు. ఎవరిని వివాహమాడ నిశ్చయించు కొనునో కాని తన వివాహ విషయములో తన తండ్రి తనకు సంపూర్ణ స్వేచ్ఛ యొసగునని నమ్ముచున్నది. తండ్రి బిడ్డ అభిప్రాయమును మించి పోడు.

పుట్టుకతోనే బంగారు గరిటెను నోటిలో నుంచుకొని ఈ మధుబాల పుట్టలేదు. బీద సాతా వర్గములోనే జన్మించినది. విద్యయు, సంస్కృతియు చాల తక్కువే. పట్టభద్రురాలు కాదు. ప్రవేశ పరీక్షయందుకూడ ఆరితేరినది కాదు. కాని మధుబాల రక్తములోనే, వినయము, గంభీరత్వము, సాధుత్వము, సంస్కృతి కలిసి పోయినవి. మనోహరమైన ఆకారమునకు ఇవన్నియు వన్నె తెచ్చి, మూలలోనున్న మధుబాలను ముంగిటవేసి, పిన్న వయస్సులోనే ఖ్యాతి యొనగూర్చినవి. ఈ యువతి జీవితము గర్వింప తగినదికదా?

## ఆసియాను గురించి బోధించు అమెరికన్ అకాడమీ.

అమెరికాలో ప్రభుత్వ నాయకులకును, విద్యా, రాజకీయ, పారిశ్రామిక, విదేశ వాణిజ్య, సాంఘిక రంగాలలోని వారికిని ఆసియా దేశములను గురించిన విజ్ఞానము కలిగించి, ఆసియా, అమెరికాల నడుమ సౌహార్దమును పెంపొందజేయుటకుగాను, ఇటీవలనే శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరములో అమెరికన్ అకాడెమీ ఆఫ్ ఏషియన్ స్టడీస్ అనే సంస్థ స్థాపింపబడినది.

# వింతలు—విపర్యాసములు.

## ఇట్టి ఘోరము లెచ్చట నైన ఉన్నవా?

### తెల్లజాతి స్త్రీని చూచినందులకు ఒక నీగ్రోయువకుడు శిక్షింపబడెను.

అమెరికావారు గొప్పనాగరీకులమనియు, ప్రపంచములో గల పీడిత ప్రజలను, పీడిత దేశములను ఉద్ధరించి, విశ్వమానవ స్వాతంత్ర్యమును కాపాడుటకై పట్టుపట్టియున్నామని వారు తలంచుచున్నారు. ఆ విధముగ ప్రచారము సాగించుచున్నారు. ఇంతటి ఉన్నతాశయములు కలవారిలో జాతి ద్వేషము ఎంత తీవ్రముగ నున్నదో పాఠకులు ఈ క్రింది వృత్తాంతము వల్ల గ్రహించెదరు గాక.

న్యూయార్కు, జులై 13.

మాక్ ఇన్‌గ్రామ్ అనునతడు నీగ్రోజాతికి చేరిన 44 సంవత్సరములు గల వ్యక్తి. ఇతడు తొమ్మిదిమంది బిడ్డల తండ్రి. 'ఉత్తర కరోలీనా' (North Carolina) కు చేరిన యాన్సివిలీ (Yanceyville) కోర్టులో 'ఒక స్త్రీపైబడి కొట్టెను' నేరముక్రింద ఇతనిని చార్జి చేసిరి.

'ముద్దాయి ఏమి చేసెను' అని ఇన్‌గ్రామ యొక్క న్యాయవాది పిర్యాదిచేసిన 18 సంవత్సరముల ఈడు గల యువతిని కోర్టులో ప్రశ్నించెను.

పిర్యాది:— ముద్దాయి నాతట్టు చూచెను.

న్యాయవాది:— నీవు, ముద్దాయి యెంతదూరమందుండెను?

పిర్యాది:— 75 అడుగుల దూరములో నుండెను.

కనుక తాకుటకు కాని లేక తనతో మాటలాడుటకు కాని ముద్దాయియైన ఇన్‌గ్రామ ప్రయత్నింప లేదని ఆ యువతి కోర్టులో అంగీకరించెను.

ప్రాసిక్యూటరు 'నీగ్రోలనుండి తెల్లజాతి స్త్రీలకు రక్షణ మవసరి' మనెను. అందుపై రోడ్డుగ్యాంగి కూలిగా పనిచేయుటకు 2 సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను. ముద్దాయి న్యాయవాది ఈ తీర్పుపై అపీలుచేయుదునని తెలుపగా న్యాయమూర్తియైన అర్. ఓ. వర్‌నన్‌గారు 500 డాలర్లకు ముద్దాయి జామీను ఇవ్వవలెననికోరెను. ముద్దాయి నిర్భాగ్యుడు. నిరుపేద. (అ|| బ|| పత్రిక.)

* * *

## 10 సంవత్సరముల బాలిక ప్రసవించుట.

అమెరికా దేశములో పికాయుని (Picayuni) అను గ్రామములో 23 సంవత్సరముల ఈడుగల నీగ్రో స్త్రీ యున్నది. ఆమెకు 10 సం|| ల ఈడుగల బిడ్డ యున్నది. ఆ బిడ్డ జూలై 15 వ తేదీ ఒక మగశిశువును ప్రసవించినది. ప్రసవమైన వెంటనే ఆ శిశువును తూచగా 7 పౌనులు, 3 ఔన్సులుండెను. ఈ ప్రసవమునకు హాజరయిన డాక్టరు తనకు 54 సంవత్సరముల వైద్యవృత్తిలో అనుభవమున్నదనియు, తనకు తెలిసినంతవఱకు అంత చిన్న వయస్సులో తల్లియైన సాదృశ్యము తెలియదని చెప్పెను.

(అ|| బ|| పత్రిక)

## భూమి స్వంతదారులకు 12 ఔన్సుల బియ్యము.

చట్టసంబంధమైన (స్టాచుటరీ) రేషనింగు అమలునందున్న పట్టణములలో నివసించుచుండు భూమి స్వంతదారులు (భూములను స్వయముగా దున్నేవారుకాదు) తమ స్వంత ఉపయోగమునకై వారివారి కుటుంబమునగల వ్యక్తుల సంఖ్యననుసరించి, ప్రతియొక వ్యక్తికి, ఒక దినమునకు 10 ఔన్సుల బియ్యము ప్రకారము లెక్కించి, భూములుండు ప్రదేశముల నుండి దిగుమతి చేసికొనవచ్చునని ఒక ఉత్తరువుండినది. ఆ ఉత్తరువును ఇప్పుడు సవరించి, 12 ఔన్సుల ప్రకారము భూమి స్వంతదారులు రేషనింగు ప్రదేశములోనికి బియ్యము తెచ్చుకొన వచ్చునని రాష్ట్రమంత్రివర్గమువారు ఉత్తరువు చేసియున్నారు.

♦ ♦ ♦

ఇట్లు 12 ఔన్సుల ప్రకారము బియ్యమును తెచ్చుకొను భూస్వాములకు రేషన్ డిపోలలో గోధుమలు ఇవ్వబడవు. గోధుమలు కావలసినచో, ఎన్ని ఔన్సుల గోధుమలు కావలయునో అన్ని ఔన్సుల బియ్యమును రేషన్ అధికారులకు ఒప్పజెప్పిన, అన్ని ఔన్సుల గోధుమలు ఇవ్వబడునని, ఈ నెల 1 వ తేదీ ప్రకటించి యున్నారు.

♦ ♦ ♦

భూములు లేనివారుకూడ స్టాచుటరీ రేషనింగు పట్టణములకు ఇతర ప్రదేశముల నుండి బియ్యము తెచ్చుకొనవచ్చును. కాని వారు వ్యక్తికి ఒకటికి 6 ఔన్సుల బియ్యమునకన్న ఎక్కువ తెచ్చుకొన కూడదు. వీరు మిగత 6 ఔన్సులు గోధుమలుకాని లేక ఇతర ధాన్యమునుకాని రేషన్ డిపోల నుండి పొందవచ్చును. ఈ విషయముపై త్వరలోనే ప్రభుత్వ ప్రకటన వెలువడునని తెలియుచున్నది.

* * *

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి.)

[గత సంచిక తర్వాత]

## (6)

[చంద్రశేఖర, శ్యామలారావులు వాహ్యాళి వెడలి, తిరిగివచ్చునపుడు జానకీ, రుక్మిణులు కలిసికొనిరి. తొలి చూపులలోనే చంద్రశేఖర, జానకులకు పరస్పరము ప్రేమ జనించెను. ముక్కోటి యేకాదశినాడు జానకిని బలవంతపెట్టుటకు శ్యామలుండు పన్ను పన్నాగమునుండి చంద్రశేఖరుడు తప్పించెను. ఈ సంఘటనము జానకీ చంద్రశేఖరుల ప్రేమ వృద్ధియగుటకు కారణమయ్యెను. జానకి వివాహము కానుండెను. చంద్రశేఖరుడు డిడి తెలిసి, సహాయార్థము తన్నుగోరిన శ్యామలునితో కలిసి, కారు మీద నెక్కించుకొని తిరుపతి జేరిరి. తిరుపతి తూర్పు స్టేషను సమీపమందున్న గత సత్రమునందు జానకిని దిగవిడిచి, ఒకనాటి సాయంత్రమున శ్యామలరావు, చంద్రశేఖరులు వాహ్యాళి వెడలిరి. జానకినిగూర్చి తీవ్రసంభాషణ యనంతరము శ్యామలుడు, చంద్రశేఖరుని యేమరుపాటున తల బగులగొట్టెను. శ్యామలుడు తిరుపతిజేరి, జానకిని ఎగువ తిరుపతికి కారుమీద తోడ్కొని పోయెను. తరువాత ఈ ప్రకరణమున.—]

లక్ష్మణరావు శాంతాదేవులు తమ కొమారిత అదృశ్యమైన నాటనుండి దుఃఖాకులితస్వాంతులై, అన్నపానీయముల కడుపార గైకొనక, బహుళపక్ష చంద్రునివలె దినములు గడుచుకొలది క్షీణించుచుండిరి. లక్ష్మణరావు ఉపాధ్యాయవృత్తి నుండి విరమించి యింటియందే యుండెను. మనస్సు కాచగోళము భంగి వల్లలనాడుచుండ, విరమించుకొని శేమి చేయగలడు? ఉద్యోగము చాలించుకొన్నను శాంతి దొరకలేదు. శాంతాదేవి కుమారితను దలంచుకొని యేడ్వనిదినము లేదు. ఇంట నిల్లాలు వాపోవుచుండ యజమాని సుఖభాగుడు గానెందుబెట్లు? నిత్యకృత్యముల యంత్రమువలె చేయుచుండెను చిత్తము కించపహించియే యుండెను. పోలీసువారు జానకిజాడ తెలియుటకు విశ్వప్రయత్నములు సేయుచుండిరి. కాని ప్రయోజనము లేకయుండెను.

ఇట్లుండ నొకనాడు లక్ష్మణరావు వార్తాపత్రికను చదువుచు 'జానకి శ్యామలరావుల వివాహము' అను మకుటమును గాంచెను.— చూచి తన నేత్రములను తానే నమ్మజాలక మఱిమఱి యిట్లు చదువ గడంగెను.

'జానకీశ్యామలరావుల వివాహము'

---

చిరుతానూరునందు దైవసన్నిధిని, ప్రేమభాజనులగు శ్యామలారావు, జానకులకు వివాహము నడచెను. జానకి లక్ష్మణరావు కొమారిత. తండ్రి, తన యభీష్టమునకు విరుద్ధముగా వేరొకరికి కల్యాణ మొనరింపనుంకె, తన మనోహరుడగు శ్యామలునితో లేచివచ్చి, ఈ వివాహమునకు సమ్మతించెను. తిరుపతి.—

పూర్తి చేసి తన కళత్రముండు గది ప్రవేశించి, మృత్యుముఖమును ప్రవేశింపనున్న భార్య కీ వదంతి నెఱింగించెను. ఆమె ఆతురతతో 'ఆఁ, నిజమా! నాతల్లి ఇంకను బ్రతికియున్నదా! శ్యామలుని వివాహము జేసికొన్నదా!' అని నిట్టూర్పు విడిచెను. అంత లక్ష్మణరావు 'అవును. శ్యామలుని పెండ్లియాడినది. శ్యామలుడు మన కులమువాడు. ధనవంతుడు. ఇక మన సంకటము తీరిపోయినది. పోలీసులు దర్యాప్తు చేయవలసిన పనిలేదు. కొలది దినములకు వధూవరు లిర్వురు గృహము జేరగలరు.' అందులకు శాంతాదేవి యలరి 'వచ్చునని కాలయాపన చేయుటవలన లాభములేదు. మీరు వెంటనే తిరిగి గ్రామమునకు రావలసినదని పత్రికలలో ప్రకటింపుడు. పోలీసుల కిచ్చిన పిర్యాదు వాపసు తీసికొనుడు' అని ముగించెను. లక్ష్మణరావు 'ఈ పనికి యిప్పుడే పూనెదననియు, దుఃఖముమాని సంతోషముగా నుండవలె' ననియు, భార్య కుపదేశించి, ఆ గదినుండి వెడలిపోయెను.

లక్ష్మణరావు ఇట్లు భార్య నూరడించి, తన గదియందు కూర్చుండి పోలీసు ఇన్‌స్పెక్టరుగారికి, తన పిర్యాదు నుపసంహరించుకొను విషయమై వ్రాయుచుండెను. ఉత్తరము ముగియకమునుపే, శ్యామలరావు తోబుట్టువగు రుక్మిణి గది ప్రవేశించి నిలుచుండెను. లక్ష్మణరావు తలనెత్తి చూచి, రుక్మిణిని కూర్చుండ నియోగించెను. తరువాత వారిరువురకీ ఈ క్రింది విధముగా సంభాషణ జరిగెను.

లక్ష్మ.— 'రుక్మిణీ! నీవు జానకికి నెచ్చెలివై యుండియు, ఆమె యిలు వీడిన యనంతరము ఇటు తొంగియైనను చూడలేదు. ఇట్టి ప్రవర్తన ఆధునికయుగమున సబబు కాబోలు.'

రుక్మిణి.— 'ఆర్యా! తమ రెంతటి విషాదము ననుభవించిరో, నేనును, మా తలిదండ్రులును అంతటి విషాదము ననుభవించితిమి. అదియు మీకు నే ముహూర్తమున సంభవించెనో మాకును ఆ ముహూర్తమునందే సంభవించెను. అట్లగుట

ఇఁక మిమ్ము దర్శించుటకు తీరిక యేది?'

లక్ష్మ.— 'అయిన, జానకీ శ్యామలాంగావులు ఏక ముహూర్తమున పూర్వనిర్ణయ ప్రకార మదృశ్యులై యుండురు.'

రుక్మి.— 'అట్లని మా కిప్పుడు తోఁచుచున్నది.'

లక్ష్మ.— 'వార్తాపత్రికలలో వెలువడిన వార్తను బట్టియా?'

రుక్మి.— 'వార్తను బట్టియే గాక, మా సోదరుఁడు వ్రాసిన యుత్తరమును బట్టియు.'

లక్ష్మ.— 'ఏమని వ్రాసెను.'

రుక్మి.— 'ఇదిగో. తమయొద్ద దాపరిక మేమున్నది. చూడవచ్చును' అని యుత్తరము చేతి కందిచ్చెను. లక్ష్మణరావా యుత్తరము నిట్లు చదువఁజొచ్చెను.

తిరుపతి,

ప్రియసోదరి రుక్మిణికి:— తేది.........

సోదరీ! నేను ఉన్నపాటున నదృశ్యుఁడైతినని మాతాపితలును, నీవును దుఃఖమున మునిఁగియుందురు కాఁబోలు. అట్లు మీరు వ్యసనాక్రాంత స్వాంతులగుట తగనిపని. నేను పురుషుఁడను గనుక, యెందేగినను సురక్షితముగా తిరిగిరాఁగలను. మఱియు నేను ప్రబలకారణము లేనిదే గ్రామాంతరుఁడను కాలేదు. సుగుణవతియు, సత్కులసంజాతయు, సర్వాంగ సుందరియు నగు జానకి, తన తండ్రి యొనర్చు వివాహమున కిష్టపడక ప్రాణత్యాగమునకు పూనుచుండఁ దప్పించి, ఆమె యిష్టము ననుసరించి వేఱొక ప్రదేశమునకు తోడ్కొనిపోయితిని. మేమిరువురము దైవసాక్షికముగా తిరుపతి కనతిదూరమునగల తిరుచానూరునందు వివాహము చేసికొంటిమి. స్వగ్రామమున కిప్పుడువచ్చుట తలవంపులకు కారణమగుననియు, పోలీసులు మమ్ము బంధింతురనియు ప్రకృతము రాఁదలంప లేదు. ఇఁక సంవత్సరములోపల, లక్ష్మణరావుగారు మా రాకను సమ్మతింతురేని వత్తుము. నేఁడు మే మొక సురక్షితమైన ప్రదేశమునకు ప్రయాణమగుచున్నాము. ఆ స్థల మిదమిద్ధమని ఇప్పుడు వ్రాయజాలను. అవసరమైనప్పుడు ఉత్తరము వ్రాసెదను.

ఇట్లు
సోదరుఁడు శ్యామలుఁడు.

ఈ యుత్తరమును సాంతముగా పఠించి, లక్ష్మణరావొక నిట్టూర్పువదలి 'రుక్మిణీ! మీ సోదరుఁ డింతటి ఘాతుక కృత్యమునకు పాల్పడునని కలనైనను దలంపలేదు. జానకి ప్రాణత్యాగమునకు పూనుట తప్పించిన వీరుఁడు, ఆమెను నాకప్పగింపక, దొంగ విధంబున దోచుకొనిపోవుట యెట్టి న్యాయము. పోయెపో నా కెరుకపరుపక తానామెను పాణిగ్రహణము సేసికొనుట చెల్లునా' యనుచుండ, మాటలకడ్డమువచ్చి, రుక్మిణి 'మహాశయా! గతజలసేతుబంధన మేల? జరిగిన దేదో జరిగినది. రూపమునను, ధనమునను, గుణమునను మా యగ్రజుఁడు మీ తనయకు తీసిపోవువాఁడు కాఁడు. కనుక మీరు మా బంధుత్వమునకు సమ్మతించి, వారిని రప్పించు మార్గ మాలోచింపుఁడు' అనెను. అందులకు లక్ష్మణరావు 'రుక్మిణీ! నేను మీతో బంధుత్వము నెఱపుటకు సమ్మతింపక గాదు. కాని జరిగిన విడ్డూరమునకు వగచుచున్నాను'...... అని కొంచమాలోచించి, 'ఈ దినమే వారిని రమ్మని పత్రికలలో ప్రచురించుచున్నాను. పోలీసువారి చర్యలు ఉపసంహరించుకొనవలసినదిగా వారికి వ్రాయుచున్నాను. నీవును శ్యామలుని యింటికి రమ్మని కమ్మ వ్రాయుము' అని లేచి పచారుఁ జేయఁజొచ్చెను. రుక్మిణి మందస్మితముఖారవిందయై, తన కార్యసాఫల్యమున కానందించుచు, 'మామగారూ! శలవు. కాలవిలంబనము లేక, తమరు సంకల్పించుకొన్న కార్యములు సేయుఁడు' అని విరమించెను. లక్ష్మణరావు పత్రికాసంపాదకులకును, పోలీసుశాఖవారికిని ఉత్తరములు వ్రాసి, తపాలాఫీసులో వేయ నొకరునంపి, రుక్మిణి తెచ్చిన క్రొత్త సంగతులు తన భార్య కెఱిగింపఁ బోయెను.

(6 వ ప్రకరణము సమాప్తము.)

## మలేరియా నిరోధానికి క్లోరోక్వీన్ మాత్రలు.

ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయములో మలేరియా రాకుండా చేయుటకు అనేక మందులు కనిపెట్టిరి. వాటన్నింటిలోను "క్లోరోక్వీన్" అద్భుతముగా పనిచేయుచున్నదట. గత కొన్ని సంవత్సరములలో ఈ ఔషధమును జావా, పెనామా, బెల్జియన్ కాంగోలలో ఉపయోగించగా అద్భుత ఫలితముల నిచ్చినదట. ఒక్కొక్క మాత్ర తూకము 0.5 గ్రాములు. వారమున కొక మాత్ర తీసికొనిన మలేరియా దోమను అణచివేయును. దీనిని వాడుటవల్ల దుర్గుణము లేవియు రావు. మంచినీళ్లతో ఆ మాత్రను తీసికొన వలెను. మలేరియా వ్యాధి వచ్చిన తర్వాత, దానిని నయముచేయుటకు ఇది పనిచేయదు. దానికొరకై ఒక క్రొత్త ఔషధమును కనిపెట్టుటకై అమెరికన్ వైద్యులు పరిశోధనలు చేయుచున్నారు.

ఏకాంక నాటిక

# గ ణ కుఁ డు.

శ్రీ అంపేరాయని సుబ్బరావుగారు.

[గత సంచిక తర్వాత]

## 4—వ రంగము

స్థలము:— రఘుపతిరావు గృహము. అల్లుఁడు శ్రీనివాస రావు,— (ఒక యుద్యోగి) కూర్చొని యుండును.

(రఘుపతిరావు ప్రవేశించును)

శ్రీని— మీరింతవఱుక నెందుబోయితిరి?

రఘు— మాధవరావుతో తాలూకాకచ్చేరికి పోయి యుంటిని.

శ్రీని— కరణముపని కావలయుననియా?

రఘు— అయ్యయ్యో! గణికోద్యోగమిక చేయరాదు. ఆ యుద్యోగమును జేసిన నరకప్రాప్తి కలుగును. కరణాలు గౌరవ్యులని కింవదంతి. అట్టివారకాలమున గౌరవ హేతువులై యున్నారు. నేడు తహశీలుదారుని యెద్ద గణికాగ్రేసరుఁడనందగు మృత్యుంజయు లవమానమును బొందుట గాంచి యీ యుద్యోగము నరకప్రాప్తి కాలవాలంబని గ్రహించితిని. ఇఁక మర్త్యుఁడైనచో గణకోద్యోగమునకు బూనుకొన రాదు.

ఉ॥ శ్రీలకునాట పట్టుగుచు జెన్నలరారెడు గ్రామసీమలన్
జాలినవారటంచుబలు— జాణతనంబున మెప్పుగాంచుక
ర్ణాల పథంబుమారె, నిట రాజిలగల్గిరెవారి సంతతుల్
జాలి గలంగపన్నె జలజాక్షుని—సాక్షిగ వారికియ్యెడన్

మాట— ఉద్యోగులు గ్రామోద్యోగులను (కరణములను) మిగుల లఘువుగను — సేవకులకంటె నీచముగను బరిగణించుచున్నారు. వారొనర్చవలసిన కార్యములతి భారము లై యున్నవి. మోయరాని బరువును మోయగలరా? నేను చిర కాలముగ జూచుచున్నాను. గణకులింతటి దుష్పరిణామమును బొందియుండ లేదు.

శ్రీని— నేనీ విషయమును శాసనసభాధ్యక్షునిఁ గూడి విచారించితిని. వేయేల. గణకుల గౌరవ మంతరించినది. ప్రపంచ పరిణామము నేమని వర్ణింతును. సంస్థానాధీశుని బిడుములం గుడుచుచున్నారు. కడపట వారుద్యోగులుగ మారియున్నారు.

ఉ॥ పూజితులైన గౌర్నరులు పూర్వమువీరలె నేఁటి కాలవై
రాజితగవర్నరుల్ విమలరాములు గారె మనోజ్ఞమూర్తిబి
భ్రాజితమెప్ప గౌర్నరుగ—భాసిలరయ్యె సరోజనీసతీ
రాజులువీరలన్న యనురాగము నియ్యెడఁగోలుపోవరే?

మాట— మునివాకిలిఁదాఁటిరాని మహిళాజనంబు లాంగ్లవిద్య నభ్యసించి యుద్యోగములు చేయుచున్నారు.

రఘు— ఈ దేశమున నాంగ్లవిద్య ప్రబలి ప్రముదాజనశీల మంతరించెను. ఏమికాల మహిమ. భోజునితో సంస్కృతమును, కృష్ణదేవరాయలుతో నాంధ్రభాషయు నంతరించెగదా?

శ్రీని— గ్రామ కరణములు నీతిజ్ఞులని యాంగ్ల ప్రభుండగు (హార్సిల్) (సబ్‌డివిజనలాఫీసరు) తన కరణమునే యాశ్రయించి కార్యసిద్ధి నందెనని కింవదంతి.

రఘు— గణకులు నీతికోవిదులు: వీరు కవులను బాగుగ సత్కరించిరి. సర్ థామస్ మండ్రోకాలమున బ్రాహ్మణ వృత్తులను చతురత గాపాడిరి.

కం॥ చేసిరిగా కరిణీకము
మూసిరిగా లోకమెల్ల మెప్పిరి గొనగన్
వ్రాసిరి లెక్కల నెల్లను
దోసిలి నిండంగధనము దోచిరి గణకుల్

గణకులిప్పట్టున దమ యుద్యోగములను మానుట శ్రేయము. ప్రజలకును బ్రభుత్వమునకును సంబంధించి యున్నారు. ప్రజల విద్యావ్యాప్తిం జేసి పుణికెకొక బుద్ధికలవారై యున్నారు. గ్రామసముదాయమున నెన్నియో కళంకములుండును. ఉద్యోగుల యందవినీతి ప్రబలినది. కళంకములను బయట పెట్టిన, ప్రజలవలనను, బయటపెట్టకుండిన బ్రభుత్వము వలనను, దూషణ పాత్రమును, ద్రోహియగు చున్నాడు. రాజశాసనా బద్ధుఁడైన కరణమునీతిజ్ఞులైన వారిచే గౌరవింపఁబడునా?

శ్రీని— ఎటులైనను వంశ పరంపర హక్కులను వదల లేరు. గణికోద్యోగము వారి లక్ష్మి యందురు.

రఘు— ఇత్తరి నీయుద్యోగమును వాఛించరాదు.

(అని యిరువురు నిష్క్రమింతురు) పరదా పడును.

[4-వ రంగము సమాప్తము]

## ( 5—వ రంగము )

స్థలము:— మాధవరావు గృహము. మృత్యుంజయులు ప్రవేశించును.

మాధ:— మిత్రమా? మీరిందు రాగతంబేమి?

మృత్యుం:— కొణకంచికొక సాధుపుంగవుండేతెంచి యుండెను. ఆతనిందర్శింప జనులందఱు బోవుచుండిరి. నేనును బోయి యాతనిం గాంచితిని. స్ఫురద్రూపియై తుళంగలించుచుండెను.

ఆతడు నన్నుంగాంచి, మీరీరాత్రి స్వప్నమున గాయత్రీ దేవిని గాంతురు. మీకన్నియు నెఱింగించును. ఆ దేవిని ధ్యానించుచుండు మనియెను. అవి కొంత విశ్రాంతి బొందుము.

మాధవ:— పూర్వమున— తరువాత కథనం బెఱింగింపుము?

మృత్యుం:— నాటి రాత్రి దేవిని ధ్యానించి నిదురించితిని. సాధుపుంగవుని మహిమను- వత్సా! భయపడకుమని, గాయత్రీదేవి, సావిత్రీ, సరస్వతీ, ప్రణవఋషి సమేతముగ సాక్షాత్కరించెను. దేవింగాంచి విభ్రాంతినొంది మిన్నకుంటిని. అంత నాదేవి (యని మైకము నభినయించెను.)

మాధవ— ఏమి కారణము. అహో! దేవీ ధ్యానతత్పరుండై మిన్నకుండుట స్వభావముకదా? దేవీ ధ్యానపరులావేశ పూరితులుగ నుందురు. అని యూరకుండును. కొంతవడికి మృత్యుంజయులు అని పిలుచును.

మృత్యుం— (మేల్కాంచినటుల భినయించును)

మాధ— అంత నాదేవి యేమని వాక్రుచ్చెను?

మృత్యుం— ఒక్కతఱి, ముకుందుడనుయోగి యొకచో బర్ణశాలం గట్టుకొనియుండ నాస్థలము నాక్రమించి నందుకు రాజశాసనా బద్ధుడైన కరణ మాక్రమణ నెఱింగించు పత్రమని పెను. అంత తాపసి తామసుండై గణకులెల్లెడలను దుశ్శీలతంగప్పి యగణ్యులై దుర్జన స్తోత్రమును, నీచాశ్రయమును, జేష్టా దేవికి బుత్రులుగను, నకారణనిందలకును నకాలభోజనమునకుం బాత్రులై దుర్జన ప్రజానాను స్మరణయే నిత్యమై, సకల శాస్త్ర విముఖుతం బొందుదురుగాత యని శపించెను. అంత గణకశ్రేష్టుండా శాప కథనం బెఱింగి మౌనిం గాంచి, (బ్రాహ్మణ కోపము క్షణభంగురము కదా) అని—

మధురగతి రగడ—

> ఏపగు కోపము జేటికిమాపై
> తాపసి కీవిధి తామస మొప్పునె
> పార్థివు నాజ్ఞను బాయక మోసితి
> అర్థ మెఱింగిన నొనన బరగున్
> కాపథ మందురె? గణకుల పథములు
> ఏపగు పథముల నెలమిని గూర్తురు
> ధర్మ మెఱింగిన తాపసు లీరిటు
> దుర్మతు లీగని దూఱగ నయమే
> అలరుచు నృపునకు నారట భాగము
> కలుగంగ తపమును కరముగ నొసంగుచు
> బాపుల కర్మము బారగ దోలెదు
> తాపసి కెడదున్ దరమే సేయన్.

తపోధనా! రాజాజ్ఞానువర్తినై నావిధి నాచరించితిని. మీకొక దోసము బొసంగింప నేరను. ప్రజలు నృపునకు బన్నుల నొసంగుదురు. మీరు తపోధన మారట నొకపాలొసంగుదురు. అట్టి మీ కిసుమంత యైన నెడ రొనగూర్తుమా? అనిన మౌని కరుణాకరసంబున గణకశ్రేష్టా! ఈ శాపము హరాణశకమునం దొక్కతఱి గణకుల మనుభవించ వలసి యున్నది. తత్కాలమున రవి కిరణ ప్రసారంబులం దెందును మీరుండ జాలరు. మీరు బ్రాహ్మణులగుట వలన గాయత్రీదేవి నారాధించిన శాపవిముక్తు లగుదురు. అని వచించెను. మౌని వాక్కుల ననుసరించి నీకెఱింగించితిననిన మేల్కాంచితి.

> తే|| గీ|| కలియుగంబున సంఘంబె ఘనమటంచు
> బుధులు పల్కుదు రొక్కింత బుడమిలోన
> దేవి గాయత్రి భజియింపం దేజమెసగు
> గణకులోలిని నెఱుగంగ ఘనియశంబు?

మాధ— మిత్రమా? పురుష కారమును, దైవ బలమును, రెండు నన్యోన్య సహకారములు. కావున వానిం బెంపొందింపం గడంగ వలయును.

మృత్యుం— మీ రికార్యమునకుం దగియుందురు. చతుర్విధోపాయంబు లెఱింగిన దిట్టలు. సుర గురుంబోలిన ప్రజ్ఞయు, త్యాగ మూర్తులును నైయున్నారు. మీ బోటులె సంఘాభివృద్ధికి మార్గ దర్శకులుగ నుందురు.

> ఆ|| వె|| వనమునందుగల్గి వనమందె యడంగును
> ఫుల్లకుసుమగంధ పౌల్పెసంగి
> పరుల నుపకరింపం బనలేని శక్తులు
> నిష్ఫలంబుగాదె నిజమెఱుంగ?

మాధ— మిత్రమా? మంచి యుపమానము నొసంగితివి. దైవమును బురస్కరించుకొని నాశక్తి యుక్తుల గణిక సోదరుల నేకంబొనర్చిన, సంఘ సంపద లెసంగు. అందు బ్రసంగించు విషయంబుల బాలక లోకంబున కెఱింగించి శుభంబొనగూర్తు, దాన బెంపెసలారు ధర్మంబులం బృథ్విం బ్రసరింపం జేతుగాక,

(యని యిరువురు నిష్క్రమింతురు)

ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతి:

---

## గుండె జబ్బుకు క్రొత్త ఔషధము.

"హృదయకోశము దీర్ఘకాలము సక్రమముగా పనిచేయుటకు అమెరికన్ వైద్యులు 'మైయో కార్డిన్' అనే ఒక క్రొత్త ఔషధాన్ని కనుగొన్నారు. దీన్ని మాత్రల రూపములో తయారు చేసినారు. జంతువులయొక్క హృదయ నాళాలనుండి ఈ ఔషధమును తయారు చేసినారు.

చికాగోలోని కుక్ కౌంటీ హాస్పిటల్ లో గుండెజబ్బుతో బాధపడుతున్న ౨౮ మందికి ఒక సంవత్సరము పాటు ఈ ఔసధమును వాడగా, నయమయినాయట. దీనిని ఉపయోగించడము వల్ల వేరే చెడ్డ లక్షణములు ఏవీ రాలేదని గుండెకు బలాన్ని చేకూర్చినదనియు, అమెరికన్ వైద్యుడు డాక్టర్ ఫ్రెడ్రిక్ స్టెయిగ్ మన్ చెప్పిరి. అమెరికాలో ఈ ఔషధమును భారీ ఎత్తున ఉత్పత్తి చేయడము త్వరలోనే ప్రారంభమగును.

స్త్రీలపుట:

# స్త్రీలు ముందుకు రానిదే—దేశము అభివృద్ధికి రాదు.

( శ్రీ యస్. పద్మావతీ దేవిగారు. )

దేశ రాజకీయములకును, దేశ సమస్యలకును, గృహసమస్యలకును, ప్రజల నిత్యజీవితమునకును చాల దగ్గఱి సంబంధమున్నది. స్త్రీలము, మనకు రాజకీయములతో పనియేమని తలచు కాలము పోయినది. ఈ దినములలో ప్రజల జీవితములెల్ల దేశ రాజకీయములపై ఆధారపడియున్నవి. ఆహార ధాన్యముల సమస్య ప్రధాన రాజకీయ సమస్యయైనది. ఆహార ధాన్యములు చిక్కుట, చిక్కక పోవుట, ధరలు పెరుగుట, తగ్గుట; ఇవన్నియు దేశ రాజకీయములుగ పరిణమించినవి. సర్కారువారు డిపోలను పెట్టికాని, పెట్టించికాని, బీదసాదలకు, భూములు లేనివారికి కంట్రోలు ధరకు ధాన్యము పంచుతేపంచవలెను. లేనంతట చీకటి మార్కెటులో,ఒకటికి నాలుగంతలు ధరపెట్టియైనకొనగలిగితే కొనవలెను. ఇది రాజకీయములు కాదా? నాలుగు అణాలకు సేరుమిరియాలు చిక్కుచుండెను. ఇప్పుడు అదే సేరు రు 6/- అయినది. ఒక గజము గుడ్డ మూడుఅణాలు, ఐదు అణాలలోపల చిక్కుచుండెను. ఇప్పుడు రు 1-4-0కు గాని ఒక గజము గుడ్డ చిక్కదు. ఇదికూడ రాజకీయ సమస్యయే. నిత్య కృత్యములకు సంబంధించిన చిన్న చిన్న సమస్యలు, అత్యవసరమైన సమస్యలు మొదలు శరణార్థుల పునరావాసము, కాశ్మీరము, మొదలగు సమస్యల వఱకు రాజకీయ సమస్యలుగ నేర్పడినవి.

వీని యన్నిటిలోను స్త్రీలకు సంబధమున్నదా లేక పురుషులకు మాత్రమే సంబంధమున్నదా అను విషయమును స్త్రీలు బాగా యోచింపవలెను. గృహాజీవితమునకు వలయు కర్చులన్నిటిని సంపాదించుట పురుషుల భారముగను, ఆ సంపాదనతో ఇంటిలోనుండు పిన్నపెద్దలకు ఆహార వస్తువులు, వస్త్రములు, ఇతర వసతులు కలుగజేసి పోషించుట స్త్రీల భారముగను, భారత దేశములోని హిందూ కుటుంబములలో నొక సాంప్రదాయముగ వచ్చుచున్నది. కనుక నిత్యజీవితమునకు సంబంధించిన రాజకీయములను బాగుగ చర్చించి అర్థము చేసుకొనవలసిన అవసరము స్త్రీలపై యెక్కువగనున్నది. తమ తమ కుటుంబముల పోషణ భారమును, అభివృద్ధిని, స్త్రీలు మనస్సునం దుంచుకొనవలెను. అ దృష్టితోనే మంచి చెడ్డలను చర్చించి, ప్రభుత్వ మంత్రులకు, ప్రజాప్రతినిధులకు, తెలుపుచుండ వలెను.

ఇండియా కాన్‌స్టిట్యూషను (రాజ్యాంగ చట్టము) క్రింద 21 సం|| వయస్సు వచ్చిన వారి కందఱికిని ఓటింగు హక్కును యిచ్చియున్నారు. పురుషులతో సమానముగ స్త్రీలకును ఈ హక్కు సంభవించినది. రాష్ట్ర శాసన సభలకును, ఇండియా పార్లమెంటు సభకున్ను ప్రతినిధులను ఎన్నుకొనుటలో స్త్రీలకుకూడ హక్కుకలదు. శాసన సభలకు సభ్యులుగా నిలుచుటకు కూడ హక్కుకలదు. బాధ్యత కలదు. ఏలాటి నిర్బంధములు లేవు. 21 సం|| వయస్సు ఉండవలెను. ఓటర్ల జాబీతాలలో నిదివఱకే ఆ పేరు చేర్చియుండవలెను. పిచ్చి మొదలైన మానసిక వ్యాధులుండగూడదు. దేశ రాజకీయములను సక్రమ మార్గములో నడిపించుటకు గావలసినన్ని అవకాశములు లభించినవి. ఇట్టి యవకాశములను స్త్రీలు వ్యర్థముచేసుకొనరాదని నా మనవి.

నాలుగు సంవత్సరములకు పైగ కాంగ్రెసు పార్టీవారు దేశపరిపాలనమును, సాగించుచున్నను

ఆహారధాన్యముల ధరలను, గుడ్డల ధరలను తగ్గింప జాలకున్నారు. అడుగడుగునకు వాని ధరలు ఇంకను పెరిగిపోవుచున్నవి. ధరలు పెరిగిపోవుట అట్లుండగ రాష్ట్ర ప్రభుత్వములవారు వీనిపై సేల్సుటాక్సు (అమ్మకపు పన్ను)ను విధించుచున్నారు. ఉత్పత్తి దారునినుండి (Producer) ఉపయోగదారుని వఱకు (Consumer) ఎన్ని చేతులు మారునో అన్నిమార్లు రూపాయకు 3పైసాలు ఈసేల్సుటాక్సు ఎక్కువగుచువచ్చి,కట్టకడపటికి ప్రజలనెత్తిమీద పడును. ఒకవస్తువు ప్రజలకు (Consumers) చేసి లోపల నలుగురి చెయ్యి మారినచో, రూపాయ వస్తువుపై ఒక్క అణా పన్ను చెల్లించవలసి యుండును. సేల్సుటాక్సు రూ 1కి 3 పైసాలేకదా అని మాత్రము ఎవ్వరు పొరబాటు పడకూడదు.

ఇదియును కాక ప్రజలు నిత్యజీవితమునకవసరమైన వస్తువులలో ఏ యొక్క దానిని నూత్రిసే కొనుటలేదు. బియ్యమును లేక గోధుమలను లేక జొన్నలు మొదలైన ఏ యొక్క ధాన్యమునో కొని జీవింపజాలరు. ఆహార ధాన్యమునకు తోడు కందిపప్పు, శెనగపప్పు, మొదలైనవి, మిరపకాయలు, చింతపండు మొదలైనవికూడ కొనవలెను. నూనె కొనవలెను. గుడ్డలు కొనవలెను. ఇట్లుకొను ప్రతి వస్తువుపైన సేల్సుటాక్సు ప్రజలు చెల్లించవలెను. బాలబాలికలకు పుస్తకములు కొనవలెనన్న సేల్సుటాక్సు చెల్లింపవలెను. ఇవన్నియు జాగ్రత్తగ లెక్కించినచో, ప్రతి చిన్న కుటుంబము వారును, బీదసాదలునుకూడ, అవసర వస్తువులను కొనుటలో కనీసము రు 1/- పైగ ప్రతి నెల సేల్సుటాక్సు క్రింద చెల్లించుచున్నారు. ఈ ముఖ్యవిషయమును గృహయజమానురాలైన ప్రతి స్త్రీయున్ను గమనింప ప్రార్థించు చున్నాను.

ఆహారధాన్యము పైనను, కోరా ముతక గుడ్డలపైనను, ముతక నేత గుడ్డలపైనను, ఇంకను మఱికొన్ని యవసర వస్తువులపై సేల్సుటాక్సును మినహాయింపు చేయవలెనని యింతకుముందు జరిగిన పార్లమెంటు సభలో కేంద్ర ప్రభుత్వము వారొక బిల్లును ప్రవేశ పెట్టియున్నారు. ఆ బిల్లులో కనపరచిన వస్తువుల పట్టిక చాలదు. ప్రజల ఆరోగ్యమునకు అవసరమైన ఔషధములను, రేడియో గ్రాహకములను,విజ్ఞానాభివృద్ధికి తోడుపడు పుస్తకములను మినహాయింపు లిస్టులో ప్రభుత్వము చేర్పవలెనని స్త్రీలు ఆందోళన చేయవలెను.

చెన్నరాష్ట్ర ఖజానా శాఖమంత్రి గారైన శ్రీ గోపాలరెడ్డిగారు ఈ మినహాయింపును కేంద్ర ప్రభుత్వమువారు ప్రజలకు ప్రసాదింప కూడదని బహిరంగముగ ఆక్షేపణ తెలుపుచున్నారు. పార్లమెంటులో కేంద్ర ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన బిల్లు శాసనమైనను, అదియిప్పుడు యేయే వస్తువులు ఈ రాష్ట్రములో సేలుటాక్సు చట్టము క్రిందికి వచ్చినవో వానికి వర్తింపదని చెప్పుచున్నారు. అనగా కేంద్రప్రభుత్వమువారు సేలుటాక్సును అవసర వస్తువులపైన మినహాయించినా ఆచట్టము ఈ రాష్ట్రమునకు వర్తింపదనుచున్నారు. కేంద్ర ప్రభుత్వము వలదన్నను, వీరు విను నటులలేదు. ఈ విషయములు స్త్రీలు బాగుగా జ్ఞాపకమునందుంచుకొన వలెను. రాష్ట్ర ప్రభుత్వములు, కేంద్ర ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన బిల్లును ధిక్కరించుటకు అవకాశము లేకుండ, అవసర వస్తువుల పై ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వములు విధించుచున్న పన్నులుకూడ రద్దుఅగునటుల బిల్లులో కట్టుదిట్టము చేయవలెనని, స్త్రీలు కేంద్ర ప్రభుత్వము వారికి మహజర్లు, తీర్మానములు పంపవలెను. రాష్ట్ర ప్రభుత్వమువారు అవసర వస్తువులపై సేల్సుటాక్సు తొలగింపనిచో, రాబోవు ఎన్నికలలో స్త్రీలు కాంగ్రెసు పార్టీవారికి ఓటు చేయరని చెన్నరాష్ట్ర మంత్రి వర్గమువారికి స్పష్టముగా తెలియజేయ వలెనని కోరు చున్నాను. ఎన్నికల లోపల ఆహార వస్తువుల పైనను, గుడ్డల పైనను సేల్సుటాక్సు తొలగింపని చో స్త్రీలు మాత్రము కాంగ్రెసు పార్టీకి ఓటు చేయకూడదని ప్రార్థించుచున్నాను.

—— 0 ——

మహారాజశ్రీ ప్రొద్దుటూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టువారి సముఖమునకు

S. C. NO. 81/51

బద్వేలు వీరన్న, సాకిన్ ప్రొద్దుటూరు. ... వాది.

1. A. S. నూరాసుపీరు.
2. T. S. మగాను సాహెబ్.
సాకిన్ గుర్రంకొండ తాలూకు మదనపల్లె...
ప్రతి వాదులు.

వాది ప్రతివాదులపైన లావాదేవి లెక్క సుబట్టి రు.192/- లకు పై నెంబరు దావాను దాఖలు చేసియున్నాడు. సదరు దావా ప్రతివాదుల సమునకు గాను 24_8_1951 తేదికి వాయిదా యుంటూయున్నది. సదరు దావాలో మీకు యేమైనా ఆక్షేపణలుంటే 24_8_1951 తేది పగలు 10 గం॥ లకు కోర్టుకు హాజరై తెలుపుకో వలసినది. లేనంతట మిమ్ము లను యెక్సు పార్టీగా తీర్మానించ బడునని తెలుపడ మైనది.

ప్రొద్దుటూరు. కె. ఆనందరావు, బి.ఏ.,బి.యల్.,
30_7_1951. వాది వకీలు.

---

కడప డిస్ట్రిక్టు జడ్జి కోర్టులో.

I. A, No 78 of 1951 in o S. No. 21 of 1948.
O. S. No 34 of 1949 Sub Court.

గజ్జల చిన్నసుబ్బిరెడ్డి భార్య చాలమ్మ, కమలాపురం తాలూకా మిట్టపల్లె. ... ... పిటిషనరు.

Vs.

పగిలి చెన్నారెడ్డి, కొమార్లు (2) చెన్నారెడ్డి, (3) కొండారెడ్డి, (6) పోచిమిరెడ్డి నారాయణరెడ్డి, (7) మల్లారెడ్డి, (8) సుబ్బిరెడ్డి, మైII గాII తల్లి సాలమ్మ, (9) పగిలి కేశన్న భార్య సుబ్బమ్మ, (10) పగిలి నారమ్మ, (11) పుల్లమ్మ, (12) దర్గా గౌసుబీ... ... రెస్పాండెంట్లు.

పై కనిన రెస్పాండెంట్లకు నోటీసు.

పై పిటీషనరు, దావా భూములలో గత 3 సంవత్సరముల ఫలనష్టము సం॥రం 1కి రు. 2000_0_0 ల ప్రకారం మీ వద్దైరాలవల్ల రాబట్టుటకొరకు డిక్రీ యిప్పించ కోరినది. అందువల్ల మీ ఆక్షేపణల కొరకు 3_9_1951 తేదీకి వాయిదా వేయబడినది. ఆ దినం పగలు 10 గంటలకు హాజరయి మీ ఆక్షేపణలు తెలుపుకోనంతట యెక్సుపార్టీగా తీర్మానించబడునని తెలుపడమైనది.

యస్. సుబ్బరామయ్య, బి.ఏ.,బి.యల్.,
కడప, వి. రామిరెడ్డి, బి.ఏ.,బి.ఎల్..
4_8_1951. అడ్వకేట్లు.

---

రాజశ్రీ కడప డిస్ట్రిక్టు జడ్జి కోర్టులో.

O. S. No. 54/1951.

పుమ్మడిరెడ్డి శేషమ్మ, చిన్నచెప్పల్లి గ్రామం... ...వాది.

Vs.

(1) నాగెళ్ల నరశింహులు శెట్టి, (2) నాగెళ్ల వెంకట సుబ్బయ్య శెట్టి, కమలాపురం గ్రామం.........ప్రతివాదులు.

ప్రతివాదులకు.

పై నెంబరులో వాదిపేర మీరు 1_12_1948 తేదీన వ్రాయించి యిచ్చిన చూపుడాయక దస్తావేజు బాకీ నిమిత్తం మీ పైన ఈ కోర్టులో అస్సలు, వడ్డీ చేరి రు. 3724_11_0 లకు దావా దాఖలుచేసియున్నందున, సదరుదావా 21_8_51 తేదికి వాయిదా వేయబడి యున్నది. సదరు వాయిదాలో 21_8_51 తేదీ ఉదయం 10 గంటలకు యీ కోర్టులో మీరు హాజరు కావలయును. అందుకు తప్పినంతట, మీ పరోక్షమందు విచారించి తీర్మానించబడునని యిందుమూలముగా తెలియజేయడమైనది.

కడప, యస్. రంగారెడ్డి, బి.ఏ.,బి.యల్.,
3_8_1951. వాది అడ్వకేటు.

---

మ॥రా॥శ్రీ. కడప డి॥ మునసబు కోర్టువారి సముఖానకు.

E. P. No. 49 of 1951.
S. C. No. 474 of 1950.

వూటుకూరు నాగిరెడ్డి కుమారుడు వెంకట్రామిరెడ్డి,సాకిన్ పులివెందుల తాలూకా, గుండ్లమడుగు మజరా, కృష్ణంగారి పల్లె గ్రామం. ... ... ... ... వాది.

Vs.

నగరూరి నారప్పభార్య చౌడమ్మ, సాకిన్ పులివెందుల తాలూకా రావులకొలను గ్రామం. ... ... ప్రతివాది.

ఈ నెంబరులో వాది ప్రతివాదికి సేల్ నోటీసును ఎన్ని పర్యాయములు పంపినను తీసుకొనక వాపసు చేయు చున్నందున, ప్రతివాది కోర్టుకు హాజరయి, తన ఆక్షేపణలను తెలుపగోరు నిమిత్తము వాయిదా 27_8_51 తేదీకి వేయబడి యున్నది. వాయిదాకు పై కోర్టులో పగలు 11 గంటలకు ఖుద్దునగాని, లేదా ప్లీడరుద్వారా గాని హాజరై, తన ఆక్షేపణలను తెలుపుకోనంతట, ప్రతివాదిని ఎక్సుపార్టీ చేసి తీర్మానించబడునని యిందువల్ల ఖండితముగా తెలుపడమైనది.

శ్రీ. గాడిచర్ల సుబ్బరావు, బి.ఏ.,బి.యల్
వాది అడ్వకేటు.

---

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

[illegible] REGISTERED No. M. [illegible] [illegible]

# భారత జ్యోతి

సంపాదకులు:— సి. రామకృష్ణ బి.ఏ.

సంపుటము 4.
సంచిక—27.

బుధవారము, అగష్టు 22, 1951.

ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక



—:(౦):—

# "భారత జ్యోతి" ప్రశంస.

(కవిసార్వభౌమ శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారు.)

ఉ॥ ఆతుర వేళలో జననమందితి - వెక్కటి పాచు! బాల్యమా
లేఁతది! దొడ్డనాయకులు లేరు! శిలాతల మట్టిసీమ నీ
మాతృగృహంబు! కాని, బుధమాన్యతఁ గాంచితివీవు! 'భారత
జ్యోతి!' సుమాంజలుల్ గొని మహోన్నత తేజముతో వెలుంగుమా!

శా॥ నీతుల్ పూవులవానలట్లు సెసలన్ నిండించుచున్ రాజకీ
యాతంకంబులమార్చి, యభ్యుదయసౌఖ్యశ్రీలు సంధింపఁగా
నీ తెల్గుల్ నడిగడ్డయందుఁ దులయేదీనీకు! నో 'భారత
జ్యోతీ!' పత్రికలందు నిశ్చలయశస్సున్ గంటి వేభంగులన్.

శా॥ ప్రాతంబైన మనోహరాంధ్రము సగంబున్ - వేఱెయర్థంబు సు
స్ఫీతంబై తగునాంగ్లభాషయయి వీక్షింపంగ నీమేను పల్
చేతఃప్రీతినిగల్గఁజేసి నిరతశ్రీ సార్థనారీశ వి
ఖ్యాతిన్ దిక్కులనింపఁగల్గెఁ! గృతకృత్యత్వంబు నీకయ్యెడిన్?

సీ॥ ఢిల్లీపురంబునుండియు గ్రామములదాక రాజ
 కీయపు విమర్శలు రహించు!
పరమాణువు మొదలు - ప్రాలేయగిరిదాక వైహిక
 విషయంబులన్ని గలవు!
కృతహస్తులగు బుధశ్రేష్ఠుల వ్యాసముల్
 పూబంతులట్లు సొంపులు ఘటించు!
కలువగుత్తులవంటి లలనామణుల వ్యాసములు
 సర్వసుఖము సంధిల రహించు!

గీ॥ నలశివానందఋషివంటి యార్యమునుల
వాగమృతధార నందఱు పంచుకొంద్రు!
తోడిపత్రికలందు నీ తోడిది యని
పలుకఁదగు పత్రిక వెదుకవలయు! నిజము!

సీ॥ రాయలసీమ వీర్యక్షాత్రములు పెంచి
 యాంధ్రదేశంబు విఖ్యాతిఁ బెనిచి
చెన్నరాష్ట్రము వజ్రసింహాసన మొనర్చి
 భారతఖండ వైభవము నిలిపి
దక్షిణాపథమునందలి పత్రికలకెల్లఁ
 దలకట్టనెడు కీర్తి నిలువఁబెట్టి
నీవుచరించు క్షోణీభాగమందెల్లఁ
 బూర్ణసౌఖ్యంబు నభ్యుదయమిచ్చి

గీ॥ నిన్నుఁ బ్రాణాధికముగ మన్నించి పెంచి
ప్రేమగురిపించు మారామకృష్ణశాస్త్రి
హృదయమలరార యశమెల్లయెదలనించి
'భారతజ్యోతి!' శుభములు వడయవమ్మ!

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 27.

శ్రీ ఖరనామ సంవత్సర శ్రావణ బ. ౬, ఆగష్టు, 22, 1951.

ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## పత్రికా స్వాతంత్ర్యము నిజమైనదిగ యొనర్చెదరు గాక!

"రాజ్యాంగచట్టములో హామీగా ఒసగబడిన భావస్వాతంత్ర్యము పరిమితి చేయబడినదని ప్రభుత్వము తీవ్రముగ విమర్శింపబడినది. వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము అన్నిహద్దులు మీరి దుర్వినియోగము చేయునప్పుడుకాని, లేక దేశభద్రతకును సాంఘిక ఐక్యతకును ఉపద్రవకరముగ పరిణమించినప్పుడు తప్ప, ఇతర సందర్భములలో భావస్వాతంత్ర్యమును అరికట్టు ఉద్దేశము మా ప్రభుత్వమునకు లేదు. సాంఘిక ఐక్యత అనునదియే ఈ ప్రభుత్వమునకు పునాది. సాంఘిక ఐక్యతకు ఎక్కువ ప్రాముఖ్యత ఒసగును. అనవసరములైన పత్రికా శాసనములన్నిటిని రద్దుచేయుటకై, ఒక బిల్లును ఈ పార్లమెంటు సభలో ప్రవేశపెట్టదలచి యున్నారు. ఆ సవరణబిల్లులో ప్రాత పత్రికా శాసనములే కాక, ఇండియన్ పీనల్ కోడు, క్రిమినలు ప్రొసీజరుకోడు మొదలైన వానిలో భావస్వాతంత్ర్యమునకును, పత్రికాస్వాతంత్ర్యమునకును ప్రతిబంధకములుగానున్న 124 (ఏ) 150 (ఏ) సెక్షనులు మొదలైనవికూడ తొలగించుటకై చేర్పబడు" నని ఇండియా యూనియన్ అధ్యక్షులైన డా॥ రాజేంద్రప్రసాదుగారు ఈ నెల 6 తేది, ఇండియా పార్లమెంటుసభను ప్రారంభించు సందర్భములో గావించినప్రసంగమందు దెలిపిరి. పత్రికాసంపాదకుల కెంతయు ఈ వార్త ఆశాజనకముగ నున్నది. ఇంతకుముందు చట్టములు గావింపబడి ఇంకను అమలులోనున్న చట్టములవల్లను, ఇప్పుడు గావింపబడిన రాజ్యాంగ సవరణచట్టమువల్లను, ఇండియాలో సౌఖ్యవంతమగు పరిపాలనము నెలకొల్పబడుననుఆశ తొలగి, పోలీసు పరిపాలనమే కొనసాగునను భీతి వ్యాపించి యున్నది. ఇందులో అతిశయోక్తి లేదు. పత్రికాశాసనముల విచారణసంఘము వారు దేశములో అమలులోనుండు ఉపద్రవమైన పత్రికాశాసనముల మంచి చెడ్డల నంతయు సమగ్రముగ విచారించి, చర్చించిరి. ఆ నివేదికలోని సిఫార్సులలో చాలావానిని ప్రభుత్వమువారు నిరాకరించిరి. వ్యక్తిస్వాతంత్ర్యమును, సంఘస్వాతంత్ర్యమును అరికట్టు క్రి॥ ప్రొ॥ కోడులోని 144 సెక్షనును పత్రికలకు వర్తింపచేయకూడదని గావించిన సిఫార్సును కూడ ప్రభుత్వమువారంగీకరించుటకు నిరాకరించిరి. క్రి॥ ప్రొ॥ కో॥ లోని 144 సెక్షను పత్రికలపై ప్రయోగింపవలసి వచ్చినప్పుడు చాల విచక్షణతో మెలగవలసి యుండునని జిల్లామేజస్ట్రేటులకు హెచ్చరిక గావించెదమని హోము శాఖా మంత్రిగారైన శ్రీ రాజగోపాలాచార్యులవారు పార్లమెంటులో ఒక ప్రశ్నకు ప్రత్యుత్తర మొసగుచు చెప్పిరి. శ్రీ రాజగోపాలాచార్యులవారు హోముశాఖా మంత్రిగనుండ, అంతకన్నను అనుకూలమైన ప్రత్యుత్తర మొచ్చునని ఎవ్వరు తలంపజాలరు.

స్వాతంత్ర్య ఇండియాలోగల మేజస్ట్రేటులలో కొందఱికి పత్రికా సంపాదకులయొక్క పనులేవో, బాధ్యతలేవో, పత్రికా ప్రచురణ కర్తయొక్క పనులేవో, బాధ్యతలేవో గుర్తెరుగు విచక్షణ కూడ లేకున్నది. ప్రభుత్వ భాషాంతీకరణ ఉద్యోగికి పంపవలసిన పత్రికలు చేరలేదను కారణముపై, అధికారము తమ చేతిలో నున్నదికదా యని పత్రికా సంపాదకులకు తమయెదుట స్వయముగ హాజరు కావలెనని సమనులను జారిచేయుచున్నారు. పత్రికలను అధికారులకును, చందా

దారులకును అందజేయవలసిన బాధ్యత పత్రికా ప్రచురణ కర్తది. దానిలో పత్రికా సంపాదకుల కేలాటి సంబంధము లేదు. ఈ ముఖ్యభేదము కూడ తెలియని మేజస్ట్రీటులు రిపబ్లిక్ ఇండియాలో నున్నారని హోముశాఖామంత్రికి తెలియదు కాబోలు. పత్రికా సంపాదకులకును, పత్రికా ప్రచురణ కర్తలకునుగల భేదము తెలియని మేజస్ట్రీటు చేతులలో క్రి. ప్రో. కో. 144 సెక్షను పెట్టినచో, అందులోని అధికారములు ఈ మేజస్ట్రీటులు ఎంతమాత్రము దుర్వినియోగము చేయగలుగుదురో ఊహించుకొనుటయే కష్టము.

పత్రికా స్వాతంత్ర్యమునకు ప్రతిబంధకమై చిరకాలముగ అమలులోనున్న ఇండియన్ పీనల్ కోడును, క్రిమినల్ ప్రొసీజరు కోడులోని సెక్షన్‌లనే సవరించుటకు ప్రభుత్వమువారు పూనుకొని యున్న ఈ తరుణములోనే, నిందార్హమైన పత్రికా శాసనములన్నిటిని ఒకేదెబ్బతో తొలగించి, రిపబ్లిక్ ఇండియాలో పత్రికా నిర్వాహణము గౌరవప్రదముగ నుండులాగున చేయవలెనని కోరుచున్నాము.

ఏలాటిఊహకాని, విచక్షణజ్ఞానముకాని లేక పత్రికా నిర్వాహణములో అనుభవము బొత్తిగలేని ఉద్యోగులు నూర్లకొలదిగ గలరు. అట్టివారిచేతిలోని అధికారము తప్పక దుర్వినియోగమగును. వారు పత్రికాస్వాతంత్ర్యమును నామ మాత్రము చేయగలరు. కోతిచేతులో కొరివి ఇచ్చినట్లేయగును. ఎన్నికలు జరుగుటకు ముందు ఇప్పుడు జరుగుపార్లమెంటు సభయే ఆఖరుసభగ ఏర్పడును. ఇండియా హోముశాఖా మంత్రిగారైన శ్రీ రాజగోపాలాచార్యులవారే నూతన పత్రికా చట్టమును పార్లమెంటులో ప్రవేశపెట్టెదరని తెలియుచున్నది.

ఇండియా రాజ్యాంగ చట్టములో 19 వ సెక్షనును సవరించుటవల్ల భావస్వాతంత్ర్యమునకును, పత్రికా స్వాతంత్ర్యమునకును కలిగిన ఉపద్రవమును ఇప్పుడు ప్రవేశ పెట్టబోవు నూతన పత్రికా బిల్లులో తొలగించి, దేశము కీర్తిని, వారికీర్తిని, శ్రీ జవహరిలాలుగారికీర్తిని పత్రికా సంపాదకులు చిరకాలము శ్లాఘించులాగున చేయవలెనని కోరుచున్నాము. పత్రికా శాసనము యూనియన్ ప్రభుత్వ చట్టములోనే చేర్చెదరని యు ఆశించు చున్నాము.

---

# కాంగ్రెసును రద్దుచేయుడు.

ఇది గాంధిజీ కాంగ్రెసు నాయకుల కొసగిన అంత్యసందేశము. మరణశాసనము. దేశమునకు స్వాతంత్ర్యము లభించుటతోనే కాంగ్రెసు సంస్థ పని తీరిపోయినది. ఏనాడు కాంగ్రెసు సంస్థ దేశ పరిపాలనాబాధ్యత నశించెనో, ఆనాడే అది జాతీయసంస్థగా వ్యవహరించుటకుగల హక్కును కోలుపోయినది. కేవలము రాజకీయపార్టీగా మారిపోయినది. ఈ దినముకాని లేక ఇంతకుముందు కాని కాంగ్రెసును రద్దుచేయుమని వ్రాసియుండినచో, అది కొందరికి విపరీతమైన సలహాగా తోచవచ్చును, దేశాభిమానము లేదని విమర్శింపవచ్చును. అది కేవలము పొరబాటైన అభిప్రాయమే. కాంగ్రెసును రద్దుచేయుమని సూచించినపుడెల్ల, గాంధిజీ యొక్క అంత్యసందేశమునే మేము ప్రతిధ్వనింప జేయుచున్నాము. ఇందులో విపరీత మేమియు లేదు. ఈవిషయమును పాఠకులు గమనింతురుగాక.

దేశస్వాతంత్ర్య సంపాదనకై పోరాడుచుండిన స్థితినుండి దేశపరిపాలనా నిర్వాహణ బాధ్యత కాంగ్రెసు సంస్థకు ఎప్పుడు లభించెనో అప్పుడే

కాంగ్రెసు వారిలో అధికార వ్యామోహము ఎక్కువాయెను. త్యాగదీక్ష, దేశసేవాపరత్వము నశించెను. అంతఃకలహములు బయలుదేరెను. ఇదంతయు గాంధిజీకి తన మనోదర్పణము కనబడెను. కాంగ్రెసు కీర్తి చిరస్థాయిగ ఈ దేశమున నెగడవలయుననన్న, కాంగ్రెసు సంస్థను వెంటనే రద్దుచేయుటకన్న వేరుగత్యంతరములో లేదని గాంధిజీ సూక్ష్మబుద్ధి గ్రహించెను. తాను హత్యకావింపబడుటకు ముందే కాంగ్రెసు సంస్థను రద్దుచేయమని గాంధిజీ వ్రాతమూలకముగ తన యనుచర వర్గమునకును, దేశీయులకును అంత్య సందేశమొసగి ప్రాణములను కోలుపోయెను. ఇంకను కొద్దికాలము ప్రాణములతో నుండినచో, తన పలుకుబడి నంతయు వినియోగించి, కాంగ్రెసు సంస్థను గాంధిజీ రద్దు చేయించి యుండెడివాడే. కాని పరిస్థితులు వేరువిధముగ పరిణమించెను. గాంధిజీ అనుచరులైన శ్రీ జవహరిలాలు నెహురు గారును, కీ॥ శే॥ సర్దారు పటేలు గారును గాంధీజీ తుది సందేశమును కార్యరూపమున పెట్టరైరి. అందువల్లనే ఈ దినము అఫలితము కాంగ్రెసు సంస్థ అనుభవించు చున్నది.

గాంధిజీ జీవితకాలములోనే కాంగ్రెసువారిలో ఒకరిపై మఱియొకరికి ద్వేషభావములు ఎక్కువాయెను. కాంగ్రెసు సంస్థలోనే అధికార పదవుల పంపకమునకై భిన్న భిన్న వర్గము లేర్పడెను. ఇది ఎవ్వరైనను కాదనలేరు. ఈ దినము ఆచార్యకృపాలినీగారు, మిష్టర్ కిద్వాయిగారు కాంగ్రెసు నుండిరాజీనామా ఇచ్చినారనిన, కాంగ్రెసు విధానముతో వారికి కలిగిన భేదాభిప్రాయములకై రాజీనామాల నివ్వలేదు. కాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ పురుషోత్తమదాసు టాండనుగారిపై వ్యక్తిగతముగ కలిగిన ద్వేషము వల్లనే వారు రాజీనామాల నొసగియున్నారు. శ్రీ టాండనుగారినిగూర్చి వారు గావించిన విమర్శనలే ఈ విషయమును ఋజువుచేయును.

కాంగ్రెసు దేశమున కంతయు ఏకైక జాతీయ మహాసంస్థయనియు; దానిని రద్దుచేయుటకే వీలుకాదనియు కొందరు భావించుట తటస్థించినది. వివిధమైన సిద్ధాంతములు, భిన్నమైన ఆశయములు కలవారెల్లరికి కాంగ్రెసులో స్థానమున్నదను భావము ఈ క్షణమువఱకు కూడ అనేకులకున్నది. కనుక పరస్పర విరుద్ధమగు ఆశయములు గల వారెల్లరు ఈ సంస్థలో చేరుకొనిరి. భిన్న భిన్న కక్షలుగా ఏర్పడిరి. ఏ పక్షమువారైనను కానిండు; ఏవర్గమువారైనను కానిండు వారికి ఎవరిపై వ్యక్తిగతమైన ద్వేషము కలదో అట్టివారు కాంగ్రెసునుండి వైతొలగినచో, కాంగ్రెసు సంస్థ పవిత్రమై, ముందుండిన ఉన్నతస్థితికి రాగలదని కాంగ్రెసు నాయకులని చెప్పుకొనువారెల్లరు తలంచుట పరిపాటియైనది. ఈ దృష్టితోనే ఒక వర్గమునకు చేరినవారు మఱియొక వర్గమునకు చేరినవారివైపు చూచుచున్నారు. ఏవర్గమువారు, ఏ కక్షవారు కాంగ్రెసులోనే యుండవలెను? ఎవరు వైతొలగి పోవలెనను ప్రశ్నకు ఎవ్వరును సరియైన ప్రత్యుత్తర మివ్వజాలకున్నారు. ఇదే కాంగ్రెసు సంస్థకు దాపరించిన విషాదము.

కాంగ్రెసువారిలో అధికారమను రొట్టెముక్కలకై పోరాటము శ్రుతిమించి పోయినదనియు; నైతికపతన మెక్కువైనందున కాంగ్రెసు సంస్థ కుళ్ళిపట్టి పోవుచున్నదనియు శ్రీ జవహరిలాలుగారు గ్రహించియున్నారు. గాంధిజీ ఆదేశానుసారము వీరికి కాంగ్రెసు సంస్థను రద్దుచేయుటకు ఇష్టములేదు. అట్టిసందర్భములో కాంగ్రెసు సంస్థలో పుట్టిన కుళ్ళును శస్త్రచికిత్సచేసి, తొలగింపనైనా తొలగింపవలెను. అదిసాధ్యముకానిచో, తానైనా అందుండి వైతొలగవలెను. పాముచావకుండ కట్టెవిరుగకుండ చూడవలయునను వారిసిద్ధాంతమే ఈ దినము కాంగ్రెసుకు ఏర్పడిన దుస్థితికి కారణమైనది.

కాంగ్రెసు సంస్థకు పట్టిన కుళ్ళును తొలగించుటకై శ్రీ జవహరిలాలుగారు ఒక చికిత్సా విధానమును సూచించుచున్నారు. (1) అధ్యక్షులైన శ్రీ పురుషోత్తమదాసు టాండనుగారు తమపదవికి రాజీనామా ఇవ్వవలసిన పనిలేదు. (2) ప్రస్తుత కాంగ్రెసు వర్కింగుకమిటీని, పునర్నిర్మాణము గావింపవలెను. అప్పుడే కాంగ్రెసు సంస్థ పవిత్ర వంతమైన దగుననియు, ప్రజాదరణమును పొందగలుగుననియు శ్రీ జవహరిలాలుగారు భావించుచున్నారు. ఇది వారి చికిత్సా విధానము.

ఇక శ్రీ పురుషోత్తమదాసు టాండనుగారు కాంగ్రెసు సంస్థ వినాశనమునకై గావించిన ద్రోహములేవో లెక్కించెదము. 1. 1950 సం॥ అక్టోబరు నెలలో కాంగ్రెసు వర్కింగు కమిటీని ఏర్పరచుటకు ముందు వర్కింగు కమిటీ సభ్యుల పేర్లుగల పట్టికను శ్రీ జవహరిలాలు, కీ॥ శే॥ సర్దారు పటేలు గార్ల ఆమోదమునకై పంపిరి. 2. అందులోని పేర్లను వారామోదించిన తర్వాతనే కాంగ్రెసు వర్కింగు కమిటీని ఏర్పరచిరి 3. యూనియన్ ప్రభుత్వ మంత్రి వర్గములో విఖ్యాతిగల నాయకులైన శ్రీ జవహరిలాలుగారికిని, శ్రీ రాజగోపాలాచార్యులవారికిని, మౌలానా అబ్దుల్ కలాంఅజాద్ గారికిని వర్కింగు కమిటీలో స్థానముల నొసగిరి. 4. రాష్ట్ర రాజకీయ రంగములో అతిరథులు అని మహారథులు అని చెప్పుకొనబడు శ్రీ రంగా, శ్రీ కామరాజనాడర్ ప్రభృతులను కూడ చేర్చుకొనిరి. 5. అధ్యక్షస్థానము వహించినది మొదలు ప్రతివర్కింగు కమిటీ సమావేశములోను శ్రీ జవహరిలాలుగారు సూచించుచు వచ్చుచున్న విధానముల కంతయు తలయొగ్గుచు, వారు స్వయముగా వ్రాసిన తీర్మానములనే అంగీకరించుచు వచ్చిరి. ఇవేనా శ్రీ టాండనుగారు గావించిన తప్పులు?

శ్రీ జవహరిలాలు, శ్రీ రాజగోపాలాచార్యులు మౌలానాఅజాద్ గార్లు కార్యనిర్వాహక వర్గములో సభ్యులుగనే ఉన్నారుకదా ఎందుకు వారు కాంగ్రెసులో కనబడుచున్న విభేదములను, కుళ్ళును తొలగించుటకై ప్రయత్నింపరైరి. ఈ ముగ్గురు నాయకులు ఇన్నిరోజులుగా కాంగ్రెసులో కనబడుచున్న కుళ్ళును తొలగించుటకే ప్రయత్నించి యుండినచో, అందుకు విరోధము కలిగించువారెవరైన నుందురా? లేక అట్టివిరోధము కలిగించినవారెవరు? మిగత కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులేనా? కార్యదర్శులైన శ్రీయుతులు కాళా వెంకటరావు, గౌతమ ప్రభృతులేనా? వీరునైతొలగినచో, కాంగ్రెసు సంస్థ పవిత్రవంతమై దేశీయుల విశ్వాసము మరలా సంపాదింప గలుగునా? ఇదేనా శ్రీ జవహరిలాలుగారు చెప్పునది? ఇందుకొరకేనా వారు కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యత్వమునకును, ఎన్నికల బోర్డుసభ్యత్వమునకు రాజీనామా యొసగినది?

శ్రీ జవహరిలాలుగారికి కాంగ్రెసు పైగల భక్తినికాని, వారి సదుద్దేశ్యములనుకాని ఎవ్వరు శంకింపజాలరు. వారు ఒక సంస్థకును, ఒక ప్రదేశమునకును చేరినవారుకారు. భారత దేశమునకంతయు ఏకైక నాయకులు, వారి స్థానమాక్రమించు యోగ్యత గలవారెవ్వరును లేరు. కాని వర్కింగు కమిటీలోనుండి ఏకొద్దిమంది సభ్యులో తొలగిపోవుటవలన నిర్వీర్యమై, నవ్వులపాలై, కుళ్ళుపట్టిన కాంగ్రెసు సంస్థ పవిత్రవంతమైనదై చైతన్యము కలిగి ఒక గొప్ప శక్తిగా రాజకీయ రంగములో పనిచేయగలదని తలచుటయు, అందులకై రాజీనామా నొసగుటయు శ్రీ జవహరిలాలుగారు గావించిన పొరబాటని చెప్పక తప్పదు. వారి చికిత్సావిధానము సరియైనది కాదు. గాంధీజీ ఆశయముల ప్రకారము కాంగ్రెసు సంస్థను రద్దుచేయవలెను. ఉపయోజనకమైన సిద్ధాంతముల పై ఒక రాజకీయపార్టీగా కాంగ్రెసును తయారు

# తెలంగాణా - తెనుగు పత్రికలు

( శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు బి.ఏ.,బి.యల్.,)

బ్రిటిషు ప్రభుత్వ కాలములో బ్రిటిషాంధ్ర ప్రాంతములలో తెనుగు పత్రికలను, తెనుగు ముద్రణమును మొదలుపెట్టిన వారు ఇంగ్లీషు పాదరీలు. క్రైస్తవ మతబోధకై వారీయుపకారమును చేసిపోయిరి. తెనుగులో మొదటి ముద్రిత గ్రంథములుగూడ బైబిల్ భాగములే. బ్రిటిష్ ఆంధ్రములో 1835 ప్రాంతమునుండి క్రైస్తవాంధ్ర పత్రికలు వెలువడెను. 1860–70 ప్రాంతములలో బళ్ళారి నుండి శ్రీ "యక్షిణి" అను పత్రికను క్రైస్తవులే నడిపించిరి. అటుపై కొక్కొండ వెంకటరత్నంగారు, కందుకూరి వీరేశలింగముగారు, పూండ్ల రామకృష్ణయ్యగారును మరి పలువురు పండితులును పత్రికలను సాగించిరి. కాని అవియన్నియు వాఙ్మయ సంబంధమైనట్టివి.

తెలంగాణములో పత్రికా ప్రచారము చాల వెనుకబడి యుండెను. నేటికిని వెనుక దిక్కు తెలంగాణమున్నది. తెలంగాణమున అచ్చుయంత్రములను మొదట నెలకొల్పిన వారు వనపర్తి సంస్థానమువారును, గద్వాల సంస్థానము వారును నై యుండిరి. ఆ ప్రెస్సులకు ముద్దు పేరులుగూడ పెట్టియుండిరి. ఇంచుమించు నూరు సంవత్సరముల క్రిందట ఆ ప్రెస్సు లందేర్పడియుండెను. వానిలో కొన్ని పూర్వకావ్యములు, కొన్ని సమకాలికకవుల కృతులు, కొన్ని మతాచారములకు సంబంధించిన రచనలు ముద్రింపబడెను.

తర్వాత బహుకాలమువరకు తెలంగాణమందు తెనుగు ముద్రణాలయములు కానరాలేదు. 21-6-1935 క్షయ చైత్ర శు ౧౧ నాటి "నీలగిరి" పత్రికలో ఆ పత్రికాసంపాదకులగు శ్రీ నరసింహారావుగారు సంపాదకీయ మందిట్లు వ్రాసిరి.

"హైదరాబాదు సికిందరాబాదు నగరములను వీడి రాష్ట్రమంతయు వెదికినచో ఒరంగల్లు, నల్లకొండ, ఇనుగుర్తి యందు తప్ప మరేస్థలమందు నాంధ్ర ముద్రణాలయము గోచరింపదు. మొత్తముపై రాష్ట్రమంతటను గల ఈ ముద్రణాలయములను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. వీనికైనను తగిన పని కలదా లేదా యని విచారించునపుడు మాత్రమాశ్చర్యము జనింపక మానదు... ఈ వృత్తిలో ప్రవేశించినవారు దండుగలు పడి, ముద్రణాలయమును సగము వెలకమ్ముకొని తమ వృత్తిని మానుకొను చున్నారు...ఇప్పటికి హైదరాబాదు వంటి ముఖ్యపట్టణములో కేవల మాంధ్రాక్షరముల నుంచుకొని జీవించు ముద్రణాలయమే గోచరింపదు."

ముద్రణాలయముల గతి యిట్లుండగా నిక పత్రికల నెవ్వరడిగిరి? నేటికిని హైదరాబాదు దినపత్రికలను రూపుమాపుట కనువైనస్థలము గదా? ఇచ్చట టెలిప్రింటర్ కలదా? టప్పా సౌకర్యాలుకలవా? ౨౨000 గ్రామాలలో 2000 గ్రామాలకైనను దినదినము టప్పాయుండదు. ఏడాదికొకనాడైనను శ్రాద్ధదినమునాటి పితరులవలెనైనను టప్పా జవాను యొక్క యరుదైన ముఖారవిందమును చూచుటకు నోచుకొని గ్రామాలు నూర్లుకావు; వేలుకలవు. మరికొన్ని యదృష్టరేఖలు గల గ్రామాలకు చంద్రునివలె పక్షానికొకమారైనా టప్పాజవాను కనబడకుండునా? మనలో అక్షరాస్యత నూటికేమువరకే గదా! అందులో తౌరక్యాంధ్రమున కెంత యాద

రమో ఉర్దూలో మాట్లాడుకొను నాంధ్రసోదరులను, తండ్రి కొడుకులను, మామలనువారి దళమ్మగహములను, విచారించిన తెలియకుండునా! ఇట్టి వాతావరణములో తెలుగులో యేసునాధుని ఈ ఇరవైయవ శతాబ్దారంభములో గూడ తెలంగాణమందు తెలుగు పత్రికలు లేకుండెననిన ఆశ్చర్యపడవలసిన యవసరమేమి గలదు?

ఈ తెలంగాణములో మొదటి తెనుగు పత్రిక "హితబోధిని" యని పిడికెడు మందికి మాత్రమే తెలియును. నావద్ద 'హితబోధినీ' మాసపత్రికయొక్క నాల్గవసంచిక కలదు. అది సెప్టెంబరు 1913 నాటిది. దానిముఖపత్రముపై ఇట్లున్నది.

"సంవత్సరముచందా అభిమానులకు 2రు॥ లేక 12సి॥ సామాన్యులకు 5 స॥"

శ్రీనివాసశర్మ, "ఎడిటరు." పత్రికలోని వ్యాసాలు - వ్యవసాయము, మిరియముపంట, వరి పంట, వైద్యము, పారిశ్రామికము. (సబ్బులు చేయువిధము, పింగాణిగిన్నెలు, రంగులు.) సంఘసంస్కరణము (రెడ్డిగారి ప్రహసనము)" పత్రికలోనిపుటలు 16.

ఇవి యాపత్రికలోని విశేషములు. అది సంవత్సరములోపలనే యంతరించిపోయెను.

తర్వాత మరల ఐదేండ్లవరకేపత్రిక జాడయులేకుండెను. ఇంచుమించు 1920 లో తటాలున రెండు తెనుగు పత్రికలు బయలుదేరెను. ఒరంగల్లుజిల్లా 'ఇనుగుర్తి' అను గ్రామమునుండి శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు "తెనుగు పత్రిక" అను వారపత్రికను ప్రారంభించిరి. వారును వారిసోదరులు శ్రీ రాఘవరంగారావుగారును ప్రాచీన సాంప్రదాయమున సంస్కృతాంధ్రములందు కృషిచేసి గొప్పపండితులైన వారు. కాని ఒకగ్రామమునుండి పత్రికను పెట్టుటయు, దానికి చందా దారులు 500వరకే ఉండుటయు, వారును స్థిరచిత్తులు గాకుండుటయు, మొదట నుండియు బాలారిష్టములేయుండెను. అయినను సంపాదకుల పట్టుదలవలన నది యైదేండ్లు సేవ చేసెను.

రెండవ వారపత్రిక 'నీలగిరి' యనునది. అది నల్లగొండనుండి కీ॥ శే॥ నరసింహారావుగారిచే నడుపబడెను. వీరు ఒద్దిరాజుసోదరులవలె నుద్దండ పండితులు గాకున్నను, తెలుగు ఉర్దుభాషలలో గట్టి పాండిత్యము గలవారు. వారును ఐదేండ్లపాటా పత్రికనునడిపించిరి. అంతలో 'గోలుకొండ' అర్ధవారపత్రిక 1925లో తెలంగాణా రంగముపై కెక్కెను. తలననితలంపుగా ఆపత్రిక వెలువడుటచే పై రెండు పత్రికలకును దెబ్బతగిలెను. అవి 'గోలుకొండ' వెలువడిన సంవత్సరకాలములో నంతరించెను. ఆరెండు పత్రికలును మొదటిసారి తెలంగాణాజనులలో జాగరూకత కలిగించెను. 'గోలుకొండ' తోపాటు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు "నిజాంరాష్ట్ర ఆంధ్రజనసంఘము"ను స్థాపించిరి. నాటినుండి ఆంధ్రోద్యమము ప్రారంభమయ్యెను. దానికి మొదట తెనుగు, నీలగిరి పత్రికలును, తర్వాత గోలుకొండ పత్రికయు సంపూర్ణముగ దోహద మిచ్చినవి.

'గోలుకొండ' ప్రారంభమైన రెండవసంవత్సరమందె శ్రీ పి. యన్. శర్మగారి సంపాదకత్వమున 'సుజాత' పత్రిక వెలువడెను. వారొక సంవత్సరము నడిపించి వకీలు సన్నదు పుచ్చుకొన్నందున, వేరొక సంపాదకుని పెట్టవలసివచ్చెను. ఆ తెరవెనుక భాగవతకథనుగూడ నిందులో దెలుపుదును. 'సుజాత' మూడు సంవత్సరములు నడిచెను. 500 చందా దారులుండిరి. రాజపోషకుల ధనముచే స్వయంపోషకముగా నుండెను. తుదకు నాల్గవసంవత్సరపు మొదటి సంచిక వెలువడిన తర్వాత దానినాపవలసివచ్చెను. పి. యన్. శర్మగారు వకీలుగానుండినను సుజాతను విచారించుకొనుచుండిరి. శ్రీ శర్మగారును, శ్రీ మాడపాటి హనుమంతరావుగారును, ఈ వ్యాసకర్తయు దాని లాభనష్టాలకు (అనగా నష్టాలకే యని యన్వయము) బాధ్యులని కలబలుకకొని యుండిరి. పత్రిక నాపిననాడు ముగ్గురికిని తలా 200 రూపాయల ప్రకారము నష్టము చేతికి తగిలెను.

(సశేషము)

# చచ్చేవారిని చదువమనుటయా?

వినయము, వివేకము, బాగోగుల తారతమ్యము, పరేంగిత జ్ఞానము మొదలగు ఉత్తమోత్తమ గుణములను బ్రసాదించునది విద్య. ఇట్టి అమూల్యమైన విద్య ప్రతి మానవుడును అవశ్యము నేర్వదగినది. నేడు భారత దేశము స్వతంత్రదేశముగా రూపొందియున్నది. స్వతంత్రదేశములోని ప్రతి పౌరుడును తన కర్తవ్య మేమో గ్రహించి, తా నెప్పుడెప్పు డేయే విధుల నేయేరీతిగ నిర్వర్తింపవలసి యుండునో తెలిసికొనుట అత్యంతావశ్యకమై యున్నది. విద్యాగంధము లేకపోవుటచే నేడు భారతీయులలో జాలమంది స్వతంత్ర పౌరులుగా తమ కర్తవ్యమును, తమ విలువనే తాము గుర్తించ లేకున్నారు. నూతన రాజ్యాంగ చట్టము ప్రకారము ప్రతి యువకునకు ఓటు నిచ్చు హక్కున్నది. కాని ఓటు అనగా నేమో తెలియని వ్యక్తులు నేటికిని మన దేశమున చాలమంది యున్నారు. తాము ఓటుల నిచ్చి, ఎవరికి అధికారమును గలిగించుచున్నారో, అట్టి నాయకుని యోగ్యతా యోగ్యతలు, శక్తిసామర్థ్యములు, మంచి చెడ్డలు మొదలగున వన్నియు ముందుగ నాలోచించి, బాధ్యత నంటగట్టుట ప్రజల విధి. ఈ విషయ జ్ఞానము గలిగియుండుటకు గూడ విద్య అవసరము. దేశమునందు నానాటికి ఆర్థిక, సాంఘిక, రాజకీయములలో నెన్నియో మార్పులు కలుగుచున్నవి. ఈ పరిణామముల నన్నిటిని యెప్పటి కప్పుడు బాగుగ గుర్తించి, తారతమ్యముల నాలోచించి, తదనుగుణముగ బ్రవర్తించుట దేశవాసుల ధర్మము. ఇందులకుగూడ విద్య అవసరము. సంఘసేవ జేయుటకు, నాగరకతా విశేషముల గ్రహించుటకు విద్య సంపూర్ణ జ్ఞానమును బ్రసాదించును. ఈ కారణముల బట్టియే వయసు వచ్చినవారు మొదలు వయసు సడలినవారి వఱకు, సర్వులను విద్యావంతుల గావించి, తన్మూలమున అక్షరాస్యుల శాతమును బెంచి, విదేశములలో మన పరువు ప్రతిష్టలను నిలుపవలెనని ప్రభుత్వమువారీ వయోజన విద్యా విధానమును అమలు పరుప నెంచిరి.

కాని ఈ విద్యావిధానము కేవలము పట్టణవాసులకేనా, గ్రామవాసులకుసైత మన్వయించునా అను విషయము నిప్పు డాలోచింపవలసి యున్నది. మన దేశమున పట్టణముల కన్న బల్లెల సంఖ్య యెన్నియో లక్షల రెట్లు ఎక్కువ. పల్లె ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము. వారు నిరంతరము పొలములలో కృషి సలుపుచుందురు. ఒకవేళ ఏదైన కొంచము విశ్రాంతి దొఱకినను, మరు దినమునకు గావలసిన పరికరములను సిదపఱచుకొనుటలోనే వారికి వ్యవధి చాలదు. వారి కత్యంతోపయుక్తంబులై, వారిచేతలకు జేదోడై, నిరంతరము యెడతెగని సేవ లొనరించుచు, వారిపాలిటి భాగ్యదాయకములైన వృషభరాజముల కలసట గలిగిననేకాని వారు తమ యలసట బాటింపరు. ఇట్లహర్నిశము కాయకష్టములలో మునిగి తేలు పల్లె ప్రజలు వయోజనవిద్యా ప్రచారమునకు జెవియొగ్గి చదువుకుందురా? ఈ పద్ధతి 'చచ్చేవానిని చదువు' మన్నట్లున్నది. ఒకవేళ కొందరు యువకు లారంభశూరత్వము బ్రకటించినను, వారికి ఆదినుండియు అంతరాయములే కలుగుచుండును. ఇట్టి పరిస్థితులలో వయోజన విద్యావిధానము పల్లెవాండ్ర కెంతమాత్ర ముపకరింపదు.

ప్రజాదృష్ట్యా ప్రభుత్వమువారే ప్రణాళిక నమలు పరుప నెంచినను, పల్లె ప్రజల నొక దృష్టిలో నుంచి చేయవలసి యుండును గదా? ఈ విషయమున పల్లెవాసులను విస్మరించిరో లేక వారి కేవైన సదుపాయముల గల్పింప నెంచిరో కాని, యే విధముననైనను వయోజన విద్యావిధానము ప్రభుత్వమువారు తలచినంత జయప్రదము గాదని భావించెదను. ఇంకను బాలబాలికలకు బ్రవేశపెట్టిన నిర్బంధ విద్యావిధానము కొనియాడ దగినదే. కాని వయోజన విద్యావిధానము మాత్రము ప్రభుత్వమువారికి ఆర్థికముగా మఱికొన్ని చిక్కులు గల్పించుట దప్ప, అనుకొన్న ఫలితముల బ్రసాదింప జాలదు.

పి. శేషమరాజుగారు.

# ప్రజాభిప్రాయ వేదిక

## పౌరసత్వ హక్కులకై ప్రభుత్వమునకు మహజర్లు.

ఆర్యా,

గంగిరెడ్డిపల్లె ఫిర్కాలో చేరిన 10 గ్రామములనుండి చెన్నరాష్ట్ర ప్రధానమంత్రిగారికిని, కడపజిల్లా కలెక్టరుగారికిని మహజర్లు పంపుకోబడినవి.

కేంద్ర కమ్యూనిష్టు కమిటీ మొదలు, జిల్లా కమిటీల వరకు ప్రతిఘటనా చర్యలు విరమించినామని, ఎన్నికలలో పాల్గొందుమని స్పష్టముగ ప్రకటించినను, ప్రభుత్వ వైఖరిలో మార్పులేకుండుట విచారకరము. డిటెన్యూలందరిని విడుదల చేయవలెననియూ, అన్ని పార్టీలకు ఎన్నికలలో సమానావకాశములు గలిగించవలెననియు, కడపజిల్లాలోనున్న గంగిరెడ్డిపల్లె, సింహాద్రిపురము పోలీసుక్యాంపులు ఎత్తివేయవలెనని, జిల్లా కమ్యూనిష్టు నాయకులపైనున్న వారంట్లు, కేసులు రద్దుచేయవలెనని, సభలు, ఊరేగింపులు, బుర్రకథలు, నాటక ప్రదర్శనలు వగైరా ఎన్నికల ప్రచారానికి వీలు కల్గించవలెనని, వెంటనే ప్రభుత్వము బహిరంగ ప్రకటన గావించవలెనని ఆ మహజరులో కోరబడినది.

అనిమెల. జి. సి. వెంకటరెడ్డి.

## "అధికాహారోత్పత్తి — కాగితముల ఖరాబేనా?"

ఆర్యా,

ప్రజల ప్రాణాధారమైన 'అధికాహారోత్పత్తి' పంచవర ప్రణాళికల క్రింద జమకట్టబడుచున్నదేకాని అభివృద్ధి గోచరించుట లేదు. రాయలసీమలో స్వల్పవ్యయముతో అధికాహారోత్పత్తిని పెంపుచేయగల ప్రణాళికలెన్నో ప్రభుత్వమువారి దయలేక మూలబడిన కారణముగా రాయలసీమలో క్షామదేవత స్థిరనివాస మేర్పరచుకొని తాండవమాడుచున్నది. 'విశ్వామిత్రుడు కుక్కమాంసమును దొంగిలించినట్లు' ఆకలికి దాసులై ప్రజలు కమ్యూనిజానికి తాళము వేయ మొదలిడిరి. లేకున్న కమ్యూనిజానికి ఈ దేశములో తావుదొరకుట కల్ల.

మా కడపజిల్లాలో మాగానిభూములే అరుదు. ఉన్న మాగాని భూములను మూడు విధములుగా భాగించవచ్చును. (1) కడప—కర్నూలు కెనాల్ ఆధారముగాగల భూములు. ఈ భూములలోని పంట పి. డబ్లియు. దయాదాక్షిణ్యాలపై ఆధారపడి యున్నది. (2) కేవల ఋతుకాల వర్షములపై ఆధారపడిన చెరువులే ఆధారముగా గల మాగానిభూములు. ఇవి దేవునిదయ కలిగినపుడే పంట; లేకున్న సర్కారు శిస్తు తంట తప్పినది కాదు. (3) ఈ జిల్లాలో ప్రవహించు నదులనుండి త్రవ్వబడిన ఊటకాల్వలు. ఈ ఊటకాల్వల బాగోగులు 'కుడిమరమత్తు' విధులక్రింద రైతుల కేబాధ్యత. సర్కారువారి కేమీ లేదు. కుడిమరమత్తు అనగా కాల్వలలో అప్పుడప్పుడు చేరు పూడు మొదలగునవి తొలగించి, పాయదలకు యోగ్యముగా నుంచుట. ఈపని రైతుల సాంఘికాభివృద్ధులపై మాత్రమే ఆధారపడి ఉన్నది. విద్యాధికులలోను, త్యాగశీలులలోను సాంఘికమర్యాదలు సమసిపోయిన ఈ కాలములో, విద్యాగంధ మెఱుంగని పల్లెటూరి సామాన్య ప్రజలలోని సాంఘికాచారములపై ఆధారపడిన ఊటకాల్వల స్థితి వేరుగా చెప్పవలసినది లేదు. కొన్ని కాల్వలు పూడునిండి పాడుపడినవి. మరికొన్ని విచారణాధికారము లోపించి, చక్కగా ప్రవహించుట లేదు. ఇట్టి లోపభూయిష్ఠమైన 'కుడిమరమత్తు' విధుల నాధారపరచుకొని, ప్రభుత్వాధికారులే జోక్యము కలిగించుకొనుట లేదు. ఇట్టి దుస్థితికి లోనై, అవాంతరములపాలై, ఇదివఱకే పాడుపడిన, పాడుపడనున్న 'ఊటకాల్వల' స్థితి పక్రమమైన పై విచారణాధికారముతో ప్రభుత్వము చక్కబరచక పోయినట్లైన, అధికాహారోత్పత్తి కాగితములు — బుట్టదాఖలా కాకపోదు.

ఎఱ్ఱగుంట్ల—కోడూరు. క. ఎల్లప్పశర్మ.

## కడపజిల్లా విద్యార్థి ఫెడరేషన్.

ఆర్యా,

కడపజిల్లాలో వివిధ స్కూళ్లనుండి వచ్చిన 20 మంది విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తలు జూలై నెలలో కడపలో సమావేశమై అంతర్జాతీయ, జాతీయ రాజకీయములు మొదలయినవానిని చర్చించుకున్నారు.

ఈ ఏడాదికి వెంటనే ఫెడరేషన్ సభ్యత్వము కనీసము 1000 చేయవలెనని, జిల్లా విద్యార్థి ఫెడరేషన్ ఆఫీసు కడపలో పెట్టవలెనని, జిల్లామహాసభను అక్టోబరు మధ్యలో తప్పక జరుపవలెనని నిర్ణయించిరి. అందరికి అందుబాటులో యుండే విద్యావిధానాన్ని ప్రవేశపెట్టి, ప్రస్తుతమున్న సీట్ల కొఱత, ఉపాధ్యాయులకొఱత తీర్చుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల బడ్జెట్లలో మిలటరీ, పోలీసులకు చేసిన ద్రవ్యము కేటాయింపులను కోసి, విద్యాశాఖకు పెంచవలెనని, క్రాస్‌వర్డ్సు పరీక్షావిధానాన్ని తొలగించవలెనని తీర్మానము చేసిరి.

తమ హక్కులకై శాంతియుతముగా పోరాటము సలిపిన ఒరిస్సా విద్యార్థులపై సాగించిన కాల్పులకు బాధ్యులను బహిరంగముగా విచారించి శిక్షింపవలెననియు; కాశ్మీరు విషయములో అమెరికా—బ్రిటీషువారు జోక్యము కలుగజేసికొనరాదనియు తీర్మానముల నామోదించిరి.

డి. బాలసంగిరెడ్డి.

కడప. జిల్లా విద్యార్థి ఫెడరేషన్ అధ్యక్షుడు.

## విద్య మానవులకు ప్రధానమైనది.

ఆర్యా,

స్త్రీపురుషులు గృహకృత్యాది లోకవ్యవహారంబుల మెలఁగువిధ మెఱుంగుట పసదనంబు. బంధువులయెడ, భృత్యులందు, సజ్జన దుర్జనులయెడ, విద్వాంసులందు, శత్రువులందు, పెద్దలయెడ, స్త్రీలయెడను, దత్తత్కార్యాలోచనంబుల బుద్ధి చాతుర్యమావశ్యకము. విద్య బుద్ధిని వికసింపజేసి, యూహాలోచనఁ గుచున్నది. ప్రతి మానవునికిఁ బుట్టుకతో బుట్టిన బుద్ధి యొకటి కలదు. కాని యంతమాత్రపు బుద్ధివలన సదూహాలు దయింపఁ జాలకుండును. కానఁ దమకార్యముల నడిపించుకొనఁజాలకున్నారు.

పల్లెటూరులందు జనులు విద్య నేర్చుకొనవలెననిన, కొందఱు మోటుమానవులు హసింతురు. అదేమనిన మాకచ్చు బాటు లేదందురు. మఱియు, మేము చదువుకొని ఉద్యోగము చేయవలయునా యనుచున్నారు. చదువనిన యుద్యోగమునకే నని పల్లెటూరివారి యభిప్రాయము. కాని విద్య వలన మంచి తెలివి కలుగుననియు, దానఁ బెక్కుకార్యసిద్ధి కలుగుననియు వారెఱుంగకున్నారు. ఓటు యన నర్థమెఱుంగక, దుస్తులను ధరించి యాడంబరముగఁ దిరుగు మోసగాండ్ర నను సరింతురు, నవిద్యావ్యాప్తిని, పరస్పర కలహంబుల కాకరం బై యున్నారు. "విద్యాదదాతి వినయం", విద్య వినయము నిచ్చును. దానఁ బూజింపఁబడుదురు. కటువగు వాక్యములు కలహకారకము లందురు. వినయ కఠోరముల వలననే మంచిచెడుగు లనుభవించ వలెను. విద్య లేమి భయభక్తులకు దూరమై, దేవుడే లేడను నాస్తికమత సాంప్రదాయంబున మగ్గుచున్నారు. పల్లెటూరివారి జీవిత మేమని వక్కాణింతును? భూస్వాములుగ నుండియు, తమ భూముల కివ్వఁదగు శిస్తు నెఱుంగఁజాలరు. రాజకీయ చట్టంబు లెఱుంగరు. బజారు వస్తువులను గొనుట కొకడలాలి; పరపతి కొకడలాలి. ఇఁక వ్యవహారిక్యములకుఁ జెప్ప వీలుకాదు. పల్లెటూరివా రమాయకులనుట సత్యమె. కాని మోసగాండ్ర సహవాసంబున బాపపు కార్యముల కొడిగట్టుచు, నజ్ఞుల విజ్ఞులుగను, విజ్ఞుల నజ్ఞులుగను దలంచుచు, బ్రమాదంబులకు గుఱియగుచున్నారు. జనపదంబుల ధర్మము, నీతి, మతములను బోధించు విద్యయే యుప్పియున్నచో, జనపదంబులు స్వర్గతుల్యంబులనుటకు సందియము లేదు. దేశభాషలు దేశాచారంబుల బురిగొల్పును. హిందూ మతసంబంధ ప్రబంధములు, భారత, భాగవత, రామాయణాది గ్రంథరాజంబుల జదివి, చవు లెఱింగినవారు నీతి, మత, సాంఘికాచారంబుల నిపుణులై మెలంగుదురనుటకు సందియము లేదు. భారత, భాగవత, రామాయణాది గ్రంథముల యర్థ మెఱుంగఁజాలని విద్య విద్యకాదు. విద్యారసం బెఱుంగని వార కేమి చెప్పిన నుపయోగించుట లేదు. పట్టున గావ్యనాటక ప్రబంధరసంబుల గ్రోలినగదా విద్యానంద మెఱుంగవలయు. పల్లెల బత్రికాపఠన మత్యావశ్యకమని గుర్తెఱుంగవలసి యున్నది.

ఎత్తిరాజుపల్లె. అంపేరాయని సుబ్బారావు.

---

## ఎన్నికలు వాయిదా వేయరాదు.

ఆర్యా,

స్వాతంత్ర్యమునకై పోరాడిన కాంగ్రెసు సంస్థయొక్క లక్ష్యసిద్ధులు కాంగ్రెసువారిలో తుదముట్ట నశించడమేగాక, రాజ్యాంగచట్టములోని ప్రజల హక్కులగు, పత్రికా స్వాతంత్ర్యము—వాక్స్వాతంత్ర్యము—భావస్వాతంత్ర్యము తొలగింప బడినవి. అంతేగాక హిందూదేవాలయములపైన రాష్ట్ర ప్రభుత్వములు చట్టములపై చట్టములు వెదజల్లుటకు ప్రారంభించినవి. ఇట్టిచర్యల వల్ల మతస్వాతంత్ర్యముకూడా మంట కలిసినట్లే.

క్రైస్తవ, మహమ్మదీయ మతములకుగాని, వారి గుళ్లకుగాని ఇంతవఱకు ఏ చట్టములు ప్రయోగింపకపోవుట వారి అదృష్టమే. స్వాతంత్ర్యము బడిసి చాలకాలము కాలేదు. నిర్మల మనస్సుతో బ్రిటీషువారు మనల విడిచి పోలేదు. దేశ విభజనరీత్యా కలిగిన చిక్కులు పెనవేసుకొని యున్నవి. ప్రజలు అన్నమో రామచంద్రా, వస్త్రమో వాసుదేవాయని విలపించు చున్నారు. పైగా కాశ్మీరుసమస్య, కాపట్యవిధాన విస్తారతతో జాజ్వల్యమానముగా సాగిపోవుచున్నది. ఎన్ని చిక్కులుండినా ఎన్నికలు జరిగితీరునని గౌ॥ మన ప్రధాని వాక్రుచ్చియున్నారు. కాని మరలా ఎన్నికలు జనవరికి వాయిదావేయు సూచనలు కన్పించుచున్నవి. ఎన్నికలు వాయిదావేయుట కాంగ్రెసు పార్టీకి లోపము

ఎఱ్ఱగుంట్ల—కోడూరు. కె. ఎల్లప్పశర్మ.

[హిందూధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లు, బ్రిటీషుప్రభుత్వమువారి కాలములోనే తయారు కాబడినది. అందుకు డా॥ అంబేద్కరుగారుకాని లేక శ్రీ జవహరిలాల్ గారి ప్రభుత్వముకాని బాధ్యులుకారు. తయారై, సిద్ధముగనున్న బిల్లును అక్కడక్కడ సవరించి, శాసనము చేయవలెనని మాత్రమే యూనియన్ ప్రభుత్వ మంత్రివర్గము వారు తలపెట్టి యున్నారు. ఎన్నికలు జరుగులోపల ఆ బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టబడదని తలంచుచున్నారు. ఈ విషయమును పై ఉత్తరమువ్రాసిన లేఖకులు గమనింప ప్రార్థన.

సం॥ 'భారత జ్యోతి.]

## స్త్రీలకు ప్రసవమునకు సెలవు.

ఆర్యా,

సర్కారు ఉద్యోగములలో పనిచేయుచున్న స్త్రీలకు ప్రసవమునకు రెండు నెలలు పూర్తి జీతముపై సెలవుచిక్కును. ఫాక్టరీ చట్టము ప్రకారము ఒక్క సంవత్సరము సర్వీసు పూర్తిచేసిన స్త్రీలకు, స్త్రీ కూలీలకు రెండు నెలల సెలవుకు హక్కు కలదు. ప్రయివేటు సంస్థలలో పనిచేయు స్త్రీలకు కానుపుకై ఒక్క నెలకన్నను యెక్కువ సెలవు యిచ్చుట లేదు. ప్రయివేటు సంస్థలవారి వాద మేమనగా సర్కారు వారు స్త్రీలకు ప్రసవమునకై ఒక్క నెల గ్రాంటును మాత్రమే యిచ్చెదరు. అందువల్ల రెండు నెలలు జీతముపై సెలవు యిచ్చుటకు వీలు కాదందురు. సర్కారునౌకరులుగ పనిచేయు స్త్రీలేమి, ఫాక్టరీలలో పనిచేయు స్త్రీలేమి, ప్రయివేటు సంస్థలలో పనిచేయు స్త్రీలేమి— అందరు స్త్రీలే. అందరికి బిడ్డలను కనిన తర్వాత రెండు నెలలు పూర్తి విశ్రాంతి యుండుట యత్యవసరము. కనుక ప్రయివేటు సంస్థలలో పనిచేయు స్త్రీలకుకూడ రెండు నెలలు సెలవు లభించునటుల సర్కారువారు కఠినముగా ఉత్తరువు చేయవలెనని ప్రార్థించుచున్నాను.

బళ్లారి. ఎ. కామేశ్వరమ్మ.

## ఎన్నికలలో అన్నిపార్టీలకు స్వేచ్ఛ యివ్వవలెను.

ఆర్యా,

రాష్ట్రశాసన సభలకు, భారతపార్లమెంటుకు, వయోజన వోటింగుద్వారా ప్రథమముగ జరుగబోవు ఎన్నికలు మన దేశచరిత్రలో చాలా ప్రధాన ఘట్టమని గుర్తించుచున్నాము. ఇట్టి సందర్భములో దేశములోని అన్నిపార్టీలకును, వ్యక్తులను ఈ ఎన్నికలలో పాల్గొనుటకు, పోటీచేయుటకు స్వేచ్ఛయుండునని ప్రభుత్వము నొక్కిచెప్పుచున్నది. వేలకొలది కమ్యూనిష్టులు, తదితర రాజకీయ ఖైదీలు, డిటెన్యూలు జైళ్లలో ఉన్నారు. ఎందరో అజ్ఞాతవాసములో ఉన్నారు. వారి మీద వారంట్లు రద్దుచేయడముద్వారా, అన్ని పార్టీల వ్యక్తులకు ఈ ఎన్నికలలో పాల్గొనుటకు అవకాశ మిచ్చుట న్యాయము. అందుచేత మా కడపజిల్లా కమ్యూనిష్టులకు గూడా ఎన్నికలలో స్వేచ్ఛగా పాల్గొనుటకు పూర్తి అవకాశము కలిగించవలెనని ప్రభుత్వమువారిని కోరుచున్నాను.

కోడుగుంట్లపల్లె. డి. రామకృష్ణారెడ్డి,
మాజీ తాలూకా కాంగ్రెస్ ప్రెసిడెంటు.

## ప్రాథమికోపాధ్యాయుల జీతములు.

ఆర్యా,

4 సంవత్సరముల క్రిందటనే ధరలకు తగినట్లు జీతము లుండవలయునని ఆమోదించి, తాము నిర్ణయించుకొన్న సూత్రమును, ఆనాటికంటె ఈనాడు అన్ని వస్తువుల ధరలు విపరీతముగా పెరిగిపోయి, ఆకాశములోని చుక్కల నంటుకొనుచుండినాగూడ, సెంట్రల్ పేకమిషన్ స్కేళ్ళను అమలు జరుపక పోవడము చాలా ఘోరము.

1. అన్ ట్రయిండ్. ... రు. 35—1—40—2—60.
2. హైయ్యర్ గ్రేడు. ... రు. 40—2—60—3½—75.
3. సెకండరీగ్రేడు. ... రు. 55—3—85—4—125—5—130.

(25 నుండి 35 వరకు అలవెన్సు ప్రత్యేకము)

కాన ఉపాధ్యాయలోకములో కలిగిన నిరాశా నిస్పృహలను తొలగించుటకు, ఆర్థిక సంక్షోభమునుండి దరిచేర్చుటకు తక్షణము ప్రభుత్వము పై స్కేళ్ళను అమలుపరుచునని విశ్వసించుచున్నాను.

కమలాపురము. సీలా వెంకటప్ప.

## రాబోవు ఎన్నికలు — హెచ్చరిక.

### కాంగ్రెసు అభ్యర్థుల ఎన్నిక.

రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు పక్షమున రాష్ట్రశాసన సభలకును, ఇండియా పార్లమెంటు సభకును అభ్యర్థులుగా పోటీచేయదలచినవారు ముద్రింపబడిన దరఖాస్తు ఫారములను వ్రాసి, దానివెంట ప్రమాణ పత్రములో సంతకముచేసి, రు. 250/- రుసుముతో కూడ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయము (విజయవాడ) లో సెప్టెంబరు 5-వ తేదీ లోపల చేరునట్లు పంపుకొనవలెను. రుసుముగా పంపిన పైకము వాపసు ఇవ్వబడదు.

* * *

వచ్చే ఎన్నికలలో మైనారిటీ సంఘాలవారిని, అందు ముఖ్యముగా క్రైస్తవులను, మహమ్మదీయులను, స్త్రీలను తగినంతమందిని అభ్యర్థులుగా ఎన్నుకొనవలెనని కేంద్ర ఎన్నికల సంఘమువారు రాష్ట్ర కాంగ్రెసు సంఘములకు ఉత్తరువులు పంపియున్నారు.

# శుభాశీస్సులు.

[శ్రీ. పి. వి. సుబ్బయ్యగారు.]

గీ|| మూఁడు వర్షాలు నిండిన - ముద్దరాలు
'భారత జ్యోతి' యనియెడు - పత్రికాంబ
కడపపురమున వెలసి న-ల్గడలు ద్రొక్కి
ఖ్యాతి నార్జించె వర్ధిలు-గాత పుడమి.

సీ|| రాజకీయంబుల-బ్రజలకు బోధించి
చైతన్యమును గూర్చు-చాడ్పునందు,
సాంఘిక జీవిత-స్థాయిని బోధించి
సామరస్యంబును-జాటుటందు,
నైతిక పథమును-ద్యోతకంబును జేసి
ప్రజలను నడిపించు-భంగి యందు,
వైజ్ఞానికంబగు-వ్యాసముల్ ప్రచురించి
జవసుద్దీపింపఁ-జేయుటందు,
ఆర్థిక సమస్యలందలి-కర్థమయిన
యట్లు బోధించుటందు, మ-హత్తరమగు
కీర్తి నార్జించె పత్రిక-గేరలు వొడిచి,
యవని నాకల్పకంబుగ-నలరు గాత!

క|| వేగపడక సత్యము పూనక
సోదనులఁ జూపించునపుడు-నిశ్చయబుద్ధిన్
చరియింతురు సంపాదకు
లరు దౌవిధముగ, శుభంబు-నందెదు భువిలో.

ఉ|| భారతి సాంప్రదాయముల-
పాఠకలోకము ముందు పెట్టి మీ
భారము చూచుకొందని స్వ-
భావ విచారము పెచ్చుగొట్టి యిం
పౌఁగగ భాగతావని వి-
హారము సల్పెదు పత్రికామణీ!
పేరమి గాంచి వర్ధిలుము-
వృద్ధిని బొందుచు వేయివర్షముల్.

*గీ|| మృగ మృగేంద్రము లిరువంక-జగములందు
గల జనంబు లహింసను-గడచునటుల
నిలచియుండగ, మధ్యలో-జలజరుహము
భావసంపదఁ దెలుపఁగ-భాస్వరమగు
జ్యోతి విజ్ఞాన రోచుల-శోభ నిలుప,
తరుణభానుఁడు నవయుగో-దయము దెలుప,
మూఁడు లోకాలు పయనించి-ముమ్మరముగ
ఖ్యాతిఁ గనుమమ్మ పత్రికా-గ్రిణి ధరిత్రి.

* పత్రికాముఖమున చిహ్నము.

## కాంగ్రెసును రద్దుచేయుడు.

(6 వ పేజీ తరువాయి)

చేయవలెను. ఆశాజనకమగు ప్రణాళికను తయారుచేసి, ఆ ప్రణాళిక ననుసరించి ఎన్నికలలో పోటీచేయవలెను. అప్పుడే కాంగ్రెసు పునర్జీవితమును పొంది, పవిత్రమైనదై, దేశములో బలమైన రాజకీయ పార్టీగా పనిచేయగలదు. కనుక ప్రస్తుత వర్కింగు కమిటిని రద్దుగావింపవలెనని ప్రయత్నించుటకు బదులు, కాంగ్రెసు సంస్థనే రద్దుగావించుటకు శ్రీ జవహరిలాలుగారు ప్రయత్నించి కృతకృత్యులగుదురుగాక యని కోరుచున్నాము.

—0.—

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనములక్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి ప్రకటింపవలయునో తెలియకున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయుజాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటించుట కెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము:—

సంపాదకులు, "భారత జ్యోతి"

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి.)

[గత సంచిక తర్వాత]

## (7)

[చంద్రశేఖర, శ్యామలారావులు వాహ్యాళి వెడలి, తిరిగివచ్చునపుడు జానకీ రుక్మిణుల కలసికొనిరి. తొలి చూపులలోనే చంద్రశేఖర, జానకులకు పరస్పరము ప్రేమ జనించెను. ముక్కోటి యేకాదశినాఁడు జానకిని బలవంతపెట్టుటకు శ్యామలుఁడు పన్ను పన్నాగము నుండి చంద్రశేఖరుఁడు తప్పించెను. ఈ సంఘటన జానకీ చంద్రశేఖరుల ప్రేమ వృద్ధియగుటకు కారణమయ్యెను. జానకి వివాహము కానుండెను. చంద్రశేఖరుఁ డిది తెలిసి, సహాయార్థము తన్నుఁగోరిన శ్యామలునితో కలసి, జానకిని కారుమీఁద నెక్కించుకొని తిరుపతి జేరిరి. జానకిని దేవస్థానమువారి సత్రమునందు బెట్టి, చంద్రశేఖర, శ్యామలులు చంద్రగిరికోటఁ జూడబోయిరి. అచ్చట ఇరువురిమధ్య వాగ్వాదము పెరిగి, పోట్లాటవరకు దిగినది. చంద్రశేఖరుఁ డేమరియుండ శ్యామలుఁడు తల బగలఁగొట్టి, తిరుపతి జేరి, జానకిని దోడ్కొని ఎగువ తిరుపతికిఁ బోయెను. కొన్ని దినముల యనంతరము జానకీశ్యామలుల పెండ్లి వార్తాపత్రికల యందు ప్రకటింపఁ బడెను. జానకి తలిదండ్రు లీ వార్త విని సంతసించి, పోలీసుల కిచ్చిన ఫిర్యాదు నుపసంహరించుకొనిరి. తరువాత ఈ ప్రకరణమున.—]

వియత్తలమంతయు మేఘాచ్ఛాదితమై రానున్న ధారా సంపాతమునకు సూచనయై దుర్దినము నా గన్పట్టుచుండెను. భోరునవీచు గాలుల తాకుడున కాగలేక క్ష్మాజములు వంగి వంగి సలాములు సేయుచుండెను. ప్రకృతి ప్రళయకాల ప్రగల్భముల బయల్పఱచుచుండ, ప్రజలు భయవిషాద సంతప్తహృదయులై అవసథయముల యందే యుండిరి. పాడిపాడి చినుకులు రాలుచుండెను. ధూళి చిమ్మ రేగి ఆకాశవీథుల ధూమప్రసారమా యనునట్లు భ్రమ గొల్పుచుండ జీవరాసులు గిక్కురుమనక వానివాని యునికిపట్టుల డాగియుండెను. ఇట్టి దుర్దినమున స్వక్షేమమును సరకుగొనని ఒకానొక వ్యక్తి తిరుపతి పరిసరమునగల యొక మామిడివనమునందలి వేదికపైఁ గూర్చొని దీర్ఘముగా నాలోచించుచుండెను. అతని ముఖము వైవర్ణ్యము నెందియుండెను. హృదయమునందలి సంతాపమును కపోలయుగళంబును, రోషమును ఉచ్ఛ్వాసనిశ్వాసములును, క్రోధమును నేత్రద్వయమును వ్యక్తీకరించుచుండెను. తైలపరామర్శ నెఱుంగని వెంట్రుకలును, చిఱుగువస్త్రములను పుట్టుదారిద్ర్యమును గాకపోయినను, తాటస్థ్యదారిద్ర్యమును చాటుచుండెను. ఆతఁడు గడువరాని ఆపదయందున్నటుల బోధపడుచుండెను. అప్పుడపుడు జేబునందున్న చిఱుగు కాగితపు ముక్క నొకదానిని వెలఁ బలికిలాగి చూచుచు, పండ్లు గీటుచు, నిట్లు తలపోయఁ జొచ్చెను. 'అహా! కాలమెంత విపరీతమైనది. ఒకనాఁ డొకరిని ఆనందడోలికల నూగించి, మఱియొకనాఁడు దుర్భర దుఃఖసాగరమున ద్రోయును. అందుల కనుగుణ్యముగు పాత్రల సృష్టించి, వారిచే కపట నాటకముల నభినయింపఁ జేయును. స్త్రీలు ప్రేమనటింతురు. పురుషులు వారియందు లగ్నహృదయులగుదురు. తుదకు నా వలె వంచింపఁబడి సిలుగులఁబడుదురు' అని నిట్టూర్పు విడిచి, 'జానకి—సాధ్వియట, శీలవతియట, నను ప్రేమించెనట, ప్రాణత్యాగమునకైనను సాహసించి పెండ్లియాడుదునట.—వహ్వా! ఏమి వెఱ్ఱియాలోచనలు నన్ను ముంచియెత్తెను. తుదకు కసరికొట్టిన శ్యామలునే వివాహమాడెను. నన్ను భగ్నహృదయుని జేసెను' అని యందుండి లేచి, వెఱ్ఱివాని చందమున నా జడివానయందు తిరుపతి తూర్పుస్టేషనువైపు పోవుచుండెను.

ఈతఁ డెవరో పాఠకమహాశయు లిదివరకే గ్రహించియుందురు. చంద్రశేఖరుఁడు శ్యామలునిచేఁ దల చితుకఁ గొట్టబడి, రాత్రియంతయు చంద్రగిరి కోటయందే మూర్ఛాగతుఁడై బడియుండెను. తెల్లవారగనే అందు వసించు కావలివారిచేఁ గనుగొనఁబడి స్థానిక వైద్యాలయములో పదునైదు దినంబులు చికిత్సనొంది గాయమారఁగనే తిరుపతికి పయనము గట్టెను. చేత చిల్లిగవ్వయైనను లేని కతమున కాలినడకయే గతి యయ్యెను. పండ్రెండుమైళ్లు నడచి తిరుపతి జేరి, దేవస్థానమువారి సత్రమున ముందు జానకి వసించియుండు గదిని దర్శించి ఆశాభంగము జెంది, ఆమె యెందేగినది తెలియక పట్టణమున పరిభ్రమించుచుండెను. ఇంతలో, నొక పఠనాలయమున వారము క్రిందట వెలువడిన పత్రికయందు జానకీ శ్యామలరావుల వివాహవార్తను చదివి, విచ్ఛిన్న హృదయుఁడై, ఉన్మాది యయ్యెను. ఈ స్థితిలోఁగల చంద్రశేఖరుడే ఇప్పుడు స్టేషనువైపు నడచుచున్నది.

స్టేషనుచేరి మూడవతరగతి ప్రయాణీకులు విశ్రమించు చోట ఒక బెంచిమీఁద నుపవిష్టుఁడయ్యెను. అప్పటికే ఆ గది ప్రయాణీకులచే క్రిక్కిరిసి యుండెను. బొంబాయివాలా,

మదరాసువారు, ఉత్తరాదివారు గలరు. చంద్రశేఖరుఁడు తెలుఁగువాడయ్యెను, అరవదేశములో విద్య నభ్యసింపఁబోయి కొంతకాల ముండుండు కతమున అరవము వర్థము చేసికొనఁ గలడు. అందుచే అరవల మాటల కప్పుడపుడు తల యూచుచుండెను. తడిసిపోయితి, పొడిగుడ్డ నిచ్చెదరా అన్నట్లు వారి దెసఁ జూచుచు, అదృష్టహీనుఁడనగు నాకు వాటితో పఁయేమి? అని పరికించుచుండెను. ధూళిధూసర పరివ్యాప్త శరీరుడై యుండియు, మసిపాఁతఁ జుట్టిన మణివోలె కన్పట్టుచుండెను. ప్రయాణీకులం దొక విద్యావిశారదుఁ డుండెను. ఆతఁడు విజ్ఞాని. ఉదారస్వభావుఁడు. సుగుణ సంపత్తి గలవాఁడు. ఆతఁడు చంద్రశేఖరుని గాంచి సమీపించి, పొడివస్త్రముల బహూకరించెను, నిరాకరింపబోఁయి మఱల నందుకొని, తడిబట్టల నూడిచి, క్రొత్తవి గట్టుకొనెను. మనసు శాంతము గోల్పోయియుంట ఆ నూతన పురుషునకు కృతజ్ఞతయుఁ దెలుపకపోయెను. అయ్యది కొఱతగా నెంచుకొనక, చంద్రశేఖరుని వాలకముగని 'ఈతఁడు ముందు విద్యార్థిగా నుండినవాఁడనియు, కాలవశమున ఈ స్థితికి వచ్చె' నని యుఁ దలంచి, 'ఆర్యా! మీదేవూరు?' అని ప్రశ్నించెను. భగ్నజీవున దె యూరైన నేమి? అని చంద్రశేఖరుఁడు ప్రత్యుత్తర మొసఁగెను. ఓహో! ఈతఁడేదో మహాపదయందు మునిగియున్నాఁడనియు, ఈతఁడు గత చరిత్రమును స్మృతికిఁ దెచ్చుకొన్న మఱింత బాధపడుననియుఁ దలంచి, 'ఆర్యా! మీరు మావెంట వచ్చెదరా?' యని ప్రశ్నించెను. అందులకు చంద్రశేఖరుఁడు తన సమ్మతిని దెలుపుచు తల పంకించెను.

ఈ క్రొత్త పురుషుఁడు నెల్లూరుపురవాసి. ఉదాత్త చరిత్రుఁడు. ఈతఁడు ఎం. ఏ. పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడై యుండినను, ఉద్యోగముకొఱకు దేబురింపక, స్వాతంత్ర్యజీవితము సాగించుచుండెను. ఈతని తలిదండ్రులు ధనికులు. ఏటావచ్చెడు ధాన్యము తన సంసారమునకు సంవత్సర భృతికి పోఁగా, పది పుట్ల ధాన్యము మిగులుచుండును. ఈతఁడు విద్యాధికుఁడగుట సోమరిపోతుగా నుండఁజాలక గూడూరున కనతి దూరమున ఒక అభ్రకపు (Mica) పరిశ్రమను స్థాపించెను. అందు ఏటా ఈతనికి లక్షకుమించి యాదాయము వచ్చుచుండును. ఈతఁడు సుమారు ముప్పదివర్షముల ప్రాయము గలవాఁడు. ఆరడుగుల యెత్తుగలిగి, యెత్తునకుఁ దగిన బలము గలిగి, వాలకమున దుర్మార్గుఁడుగా గోచరించినను సహృదయము గలవాఁడు. ఉదారస్వభావుఁడు. కఠినమగు టెంకగల నారికేళమున సుధకెనయగు మధురపానీయములు లభించుట లేదా? ప్రళయకాల ఘర్జనముల ఘటించు నీలమేఘుఁడు ప్రాణాధారమగు జలమును వర్షించుట లేదా? అటువలెనే మన నూతన పురుషుఁడు బాహ్యమునకు వెగటుగఁ దోఁచినను వెన్నపూసవంటి మనసు గలవాఁడు. పేరు మధుసూదనుఁడు.

ఇంతలో ధూమశకట మరుదెంచెను. ప్రయాణీకు లందరు తొందరపాటున బండి నెక్కుచుండిరి. మధుసూదనుఁడు చంద్రశేఖరునికిని, తనకును, తన కుటుంబము వారికిని మొదటి తరగతి టిక్కెట్లుకొనెను. అందఱును బండి నెక్కిరి. చంద్రశేఖరుని బిల్చుకొని మధుసూదనుఁడు నిర్జనమగు మొదటి తరగతి యందు గూర్చుండెను. స్పెన్సరు కంపార్టుమెంటు నుండి ఫలహారమును, తేనీరును దెప్పించి, చంద్రశేఖరుని ముందు బెట్టించెను. చంద్రశేఖరుఁడు క్షుత్పిపాసచేఁ బీడింపఁబడుచుండుట మొదట నిరాకరించినను, తదుపరి భుజింప నారంభించెను. మధుసూదనుఁడును తేనీరు బుచ్చుకొనెను. బండి బయలుదేరెను. రేణిగుంటయందరగంటకాల మాగెను. చంద్రశేఖరుఁడు భోజనానంతరము నిదురాసక్తుఁ డయ్యెను. మధుసూదనుఁడు వార్తాపత్రికను జదువుచుండి యప్పుడప్పుడు చంద్రశేఖరుని వైపు దృష్టిసారించి 'పాపము, అన్నపానీయములు లేని కతమున భుజించినతోడనే నిదురజెందె' ననుకొనుచుండెను.

చంద్రశేఖరుఁ డిట్లు నిదురించుచుండ, నాతని జేబునందుండి యొక కాగితపు ముక్క క్రింద బడెను. మధుసూదనుఁ డీ కాగితపుముక్క భగ్నజీవుఁడగు ఈ యువకుని యుదంతము నేమైన వెలువరించునేమో యని, మడత విప్పి చదువఁ జొచ్చెను. అందున్న వార్త 'జానకీశ్యామలరావుల కల్యాణ వార్త'. ఈ యుదంతము మధుసూదనుని కలవరపెట్టెను. ఈ విషయమునకును, తన పెట్టెయందు నిదురించుచున్న వ్యక్తికిని సంబంధమేమో బోధపడకుండెను. ఇట్లుఁ దలంప మొదలిడెను. 'జానకి— అవును లక్ష్మణరావు తనయయే. నాఁడు మహూర్త సమయమున పారిపోవకున్న నాకు సహభాగినియై యుండెడిది. శ్యామలారావను వ్యక్తితో లేచిపోయి, కల్యాణముగూడ జేసికొన్నది. ఈ మందభాగ్యురాలు నాకు పత్నియై సుఖించు నోములు నోచుకొన లేదు. ఐన మించినదేమి? నాకు భార్యలు లభింపరా! సత్కులసంజాతయనియు, సుశీలయనియు భ్రమించితిని....... ........ ఇప్పు డీ గొడవ యేల? ఈ కాగితము యథాస్థితి నితని జేబునందే యుంచెద. తరువాత ఈ కథయం దీతని కెట్టి పాత్రగలదో తెలిసికొనియెద' నని కాగితము మడిచి యాతని జేబునందుంచెను.

చంద్రశేఖరుఁడు కొన్నిదినములుగా భోజనపానాదులు లేనివాఁడగుట, కొంత భుజించిన తోడనే గాఢనిద్రాపరవశుఁ డయ్యెను. అందుచే, రేణిగుంట, కాళహస్త్రి, వెంకటగిరి స్టేషనులగపించి రైలుబండి గూడూరుచేరుచున్నను, ఇంకను మేల్కొన లేదు. మధుసూదనుఁడు బండి గూడూరుయందాగగనే చంద్రశేఖరుని మేల్కొలిపి, సకుటుంబ సమేతము గూడూరులోఁ గల తన భవనమునకు పిల్చుకొనిపోయెను.

మధుసూదనుఁడు నెల్లూరిపురవాసి యైనను, అభ్రకపు పరిశ్రమ స్థాపించుటచే నెక్కువకాలము గూడూరులోనే యుండువాఁడు. ఈతనికుటుంబమువారు తిరుపతితీర్థయాత్రకు బోవుచు రమ్మనివార్తనంపగా తానును తిరుపతి వేంకటేశ్వర దర్శనార్థమేగి, తిరుగు ప్రయాణమున తనవారు అభ్రకపుగని దర్శింప నభిలషింపగా నిందు వారిని దిగబెట్టును.

(7 వ ప్రకరణము సమాప్తము.)

మ॥రా॥రా॥శ్రీ. కడప డి॥ మునసబుకోర్టువారి సముఖానకు.

S. C. 286/51.

కుప్పము పెద్ద శేషప్పగారి రామయ్య ... ... ...వాది.

And

పటాన్ ఉమాంఖాన్ .. ... ...ప్రతివాది.

## నోటీసు.

ఈ నెంబరులో వాదికి, ప్రతివాది అనగా రాయచోటి తాలూకా కూలిపేడు గ్రామంలో యుండే పటాన్ ఉమాంఖాన్ యివ్వవలసిన ప్రోనోటు బాపతు, చేబదులు బాపతు చేరి రు. 305_7_0 లకు యీ కోర్టులో వాది ప్రతివాదిపైన దాఖలు చేసియున్నాడు. సదరు నెంబరు 10_9_1951 తేదీకి నోటీసు వాయిదా వేసినారు. ప్రతివాదికి ఆక్షేపణయున్న యెడల 10_9_1951 తేది పగలు 11 ఘంటలకు యీ కోర్టు యెదుట హాజరై, ఆక్షేపణ తెలుపుకోవలెను. అట్లు వాయిదానాడు హాజరుకానియెడల, ప్రతివాదిని యెక్సుపార్టీ చేయబడునని తెలుపడమైనది.

కె. సీతారామయ్య,

కడప. వాదిపక్షం అడ్వకేటు.

---

చిత్తూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో.

E P. 249/50

O S. 263/41

యస్. కృష్ణయ్యశెట్టి వగైరా ... ... వాదులు.

Vs

చంద్రపిళ్లె అనే కోదండగాడు వగైరా... ...ప్రతివాదులు.

## ఏలం నోటీసు.

ఈ దిగువ వివరించు స్థావర సొత్తులను 27_8_1951 తేదీన పగలు 10 గంటలకు ఈ కోర్టు యెదుట బహిరంగమయిన ఏలం వెయబడును. కోరువారు ఏలం నిబంధనలకు లోబడి అడుగవచ్చును.

### సొత్తులు.

చిత్తూరు తాలూకా వావిల్‌తోట గ్రామంలో ప్రతివాదులకు బాధ్యపడిన నేలలు.

| | | | |
|---|---|---|---|
| 1. | పుంజ సర్వే | 751_ఎ | 1_27 |
| 2. | ,, | 757_1 | 0_9 |
| 3. | ,, | 757_3 | 0_35 |
| 4. | ,, | 757_ఎ | 0_43 |
| 5. | ,, | 757_బి2 | 0_46 |
| 6. | ,, | 757_5 | 0_31 |
| 7. | ,, | 757_8 | 0_26 |
| 8. | ,, | 759_9 | 0_11 |
| 9. | ,, | 757_6 | 0_6 ఇందులో ½ భాగంభావి. |
| 10. | ,, | 751_బి | 0_12 |
| 11. | ,, | 751_1 | 0_14 |
| 12. | ,, | 751_2 | 0_8 |

చిత్తూరు, కె. సి. శ్రీనివాసాచార్యులు,

21_8_1951. వాది వకీలు.

---

కడప జిల్లా కోర్టులో.

O. S. 56/51

1. బోశిగారి బయ్యపురెడ్డి, (2) శ్రీరామిరెడ్డి, మైనర్లు, నెక్స్టు ఫ్రెండు పెద్దతండ్రి మల్లంగి బయ్యపురెడ్డి ... ... ... వాదులు.

Vs.

1. బోశిగారి శ్రీరామిరెడ్డి, 2. జెట్టి చిన్నగంగమ్మ, 3. పాములూరు యెర్రిబయన్న ... ...ప్రతివాదులు.

వాదులు ప్లయింటు షెడ్యూలుదాఖలా ఆస్తిలో వారల 2/3 భాగం భాగపరిష్కారమునకు యీ కోర్టులో పై దావా తేబడినది. సదరు నెంబరు 4_9_1951 తేదీన వాయిదా యున్నది. పై వాయిదా తేదీకి ప్రతివాదులు ఈ కోర్టు యెదుట పగలు 10 ఘంటలకు హాజరయి, తమ ఆక్షేపణ తెలుపుకోవచ్చును. లేని యెడల యక్సుపార్టీ చేయబడును.

యన్. సుబ్బరామయ్య, బి.ఏ., బి.యల్.,

కడప. వాదుల ప్లీడరు.

---

## నోటీసు.

కమలాపురము గ్రామము లేటు పుల్లారెడ్డి వెంకటసుబ్బమ్మ (నా పినతల్లి) తాలూకు యావదాస్తి నాకు సంక్రమించి, నా స్వాధీనానుభవములో యున్నది. నాకు సరిపడని చావలి చెంచిరెడ్డి, వెంకటరెడ్డి (అక్కులంపేట) అనువారు యీ ఆస్థి తమదేనని చెప్పుచూ లాకట్టు, విక్రియము చేయుటకు ప్రయత్నములు చేయుచున్నట్లు తెలియుచున్నది. సదరు ఆస్థిలో యెవరికిని యేలాటిహక్కు లేదు. అట్టి దస్తావేజులు చెల్లవనియు, నా హక్కును బాధించవనియు హెచ్చరిక చేయుచున్నాను.

కమలాపురము, 11_8_1951. శి. యం. శేషారెడ్డి.

---



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.

PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.

EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

రాజకీయ వార పత్రిక.

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఎ.,

సంపుటము 4. సంచిక-28.

బుధవారము, అగష్టు 29, 1951.

ప్రతి బుధవారము వెలువడును.

## విషయానుక్రమణిక



—:(0):—

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 28.

శ్రీ ఖరనామ సంవత్సర శ్రావణ బ. ౧౨, ఆగష్టు, 29, 1951.

ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## భూమిపై అభివృద్ధిపన్ను.

స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత పోలీసు రాజ్యముగా నుండిన మన దేశము, శ్రేయోరాజ్యముగ ఎటుల మార్పు చెందుచున్నదో సామాన్య ప్రజలెల్లరు గ్రహించెదరుగాక!

"బ్రిటీషువారు మన దేశముపై పరిపాలనాధికారము సాగించుచుండినపుడు పంటల అభివృద్ధికై జలాశయములను, ప్రాజక్టులను నిర్మింపవలెనన్న, వారు త్వరగా పూనుకొనేవారు కాదు. ఆ నిర్మాణములకగు కర్చులపై 100 టికి ఎంత మాత్రము వడ్డీ (ప్రతిఫలము) చేకూరునా అని మొదలు అంచనా వేసి, ప్రతిఫలము (వడ్డీరేటు) గిట్టదని తోచినచో, ప్రజాశ్రేయస్సుకై ప్రాజక్టులు ఎంతటి అవసరమైనవైనను వానిని చేపట్టకుండెడివారు. మేము పరిపాలనాధికారమునకు వచ్చిన తర్వాత ఆదృష్టినిమార్చి, ఏ ప్రాజక్టు అయినను సరే—దానివల్ల ప్రభుత్వమునకు ప్రతిఫలము లభింపనీ, లభింపకపోనీ, ప్రజల ధాన్యసంపద అభివృద్ధికి ఉపయోగపడుచో చాలునని, అన్ని ప్రాజక్టులను నిర్మించుటకు పూనుకొనుచున్నా" మని మన రాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గము వారు నిన్న మొన్నటి వరకు విధి విరామము లేక చెప్పుచుండిరి. ఇట్టి మంత్రివర్గము వారిదృష్టి ఒక్క క్షణములో మార్పుగాంచినది. తీర ఐదు నెలలలోపల ఎన్నికలు జరిగి క్రొత్త శాసన సభలు ఏర్పడనుండగా, ఇప్పుడు భూములపై అభివృద్ధిపన్ను వేయవలెనని రాష్ట్ర శాసన సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టియున్నారు.

"నేను ఈ బిల్లును ప్రవేశపెట్టలేదు, రెవిన్యూ శాఖామంత్రిగారైన శ్రీ. సీతారామరెడ్డి గారే దానికి బాధ్యు" లని శ్రీ. గోపాలరెడ్డిగారు చెప్పుచున్నారు.

"శాసన సభ్యులకిష్టముండిన ఈ బిల్లును ఆమోదింపవచ్చును. లేకుంటే నిరాకరింపవచ్చు" నని శ్రీ. సీతారామరెడ్డిగారు చెప్పుచున్నారు.

ఇది చాల తమాషాగా యున్నది.

"ఇరిగేషను బిల్లు అనునది మఱియొకటి ప్రత్యేకముగ తయారు చేయబడుచున్నది. అది పెద్దబిల్లు, దానిని శాసనముగా ఒనర్చుటకు కొంత కాలముపట్టును" కనుక ఈ మధ్యకాలములో ఎంతవరకు బంగారుగనినుండి పన్నులు రాబట్టుకొనవచ్చునో అంతవరకు రాబట్టుకొనుటకై ప్రస్తుతము అవసరముగా ఈ బిల్లును ప్రవేశపెట్టినారట.

నీటిపారుదలకున్ను మురుగునీరు పోవుటకును వసతులు కల్పించుటకై ప్రభుత్వమువారు విస్తారముగ కొన్ని ప్రాంత్యములలో ద్రవ్యమును కర్చుపెట్టి యున్నారట.

ఈ నీటివసతులు చేయుటవల్ల భూముల యొక్క విలువ ఎక్కువైనది. ఎక్కువ కానున్నదట.

అట్టి భూములనుండి లాభపడిన రైతుల పిల్లవారికి హెచ్చిన ఆదాయములో కొంత భాగమును ప్రభుత్వమువారు చందాగా కోరుటలో న్యాయమున్నట. సకారణముగ నున్నదట.

అధికాహారోత్పత్తి ప్రణాళిక క్రింద 1943 సం॥ జనవరి 1-వ తేది నుండి, ఏ యే ప్రదేశములలో నీటివసతులు కల్పింపబడినవో ఆయా ప్రదేశములకంతయు ఈ బిల్లువర్తించునని మంత్రి వర్గమువారు చెప్పుచున్నారు.

ఏ యే జలాధారముల క్రింద (ఇరిగేషన్ స్కీములక్రింద) ఈ అభివృద్ధిపన్ను రాబట్టబడునో ఆస్కీముల జాబితాను మంత్రివర్గమువారు ప్రకటింపలేదు. గేట్లను కూడ తెలుపలేదు. హెచ్చుధరలపై 100 టికి 50 వంతువసూలు చేయవచ్చునని ఒక కనిష్ఠపరిమాణమును మాత్రమేసూచించియున్నారు. ఏ యే భూములు ధరలలో హెచ్చినవి, ఏ యే భూములకు ఎంతెంత రేటు పన్నులు విధింపవలెనను విషయములో ప్రభుత్వమువారి నిర్ణయమే (మంత్రుల నిర్ణయమే) ఆఖరు. ఈ విషయములపై ప్రజలకెంత మాత్రము అధికారములేదు.

ఇందులో ఇంకొక విపరీతమున్నది. ఈ అభివృద్ధి పన్నును వసూలు చేయువిషయమై మంత్రులు కొన్ని రూల్సులు (నిబంధనలు) చేసెదరు. ఆ రూల్సులు శాసనసభల ఆమోదము పొందనవసరములేదు. భూస్వామి యొక్క సంజాయిషీని విని, మొట్టమొదట జిల్లా కలెక్టరుగారు ఈ నూతన పన్నును విధించెదరు. ఆ క్షేపణగలవారు రెవిన్యూ బోర్డుకు అపీలు చేసుకొనవచ్చును. ఆతీర్పుకూడ అసంతృప్తిగానున్నచో, మంత్రులకు అపీలు చేసుకొనవచ్చును. అంతేకాని న్యాయాన్యాయములు విచారించుటకు న్యాయస్థానములకు (కోర్టులకు) అధికారము లేదు. ఆహా! ఏమి ప్రజారాజ్యమిది!

ప్రస్తుత శాసనసభలు, మంత్రివర్గములు కాలదోషము పట్టినవి. నూతన ఎన్నికలు జరుగు కాలము సమీపించుచుండగా, ఎక్కడ లేని తొందరతో ఈ బిల్లును ప్రవేశపెట్టి, శాసనముగా చేయవలెనని మంత్రులు చేయుచున్న ప్రయత్నము గొప్ప సాహసమనక తప్పదు.

వయోజన ఓటింగుపై రాబోవు ఎన్నికలు జరుగును. ఈ బిల్లు, భూములు ఉండువారినే బాధించునుకాని భూములులేని వారి నెంతమాత్రము బాధింపదు. భూములున్న వారిసంఖ్య కొద్ది. భూములులేని దౌర్భాగ్యులసంఖ్య యే యెక్కువ. అధిక సంఖ్యాకులైన ఓటర్లెల్లరు భూములు లేని వారే. వారిమేలుకొరకై భూములున్న వారిపై పన్నులెక్కువ చేయుచున్నామనిన, బీదలు ఒప్పుకొందురుకదా. వారి ఓట్లు తప్పకలభించును కదా యని మంత్రులు యోచించియుందురు. ఈ కొద్దిమంది భూస్వాములు అసంతృప్తి పడినను పడుదురుగాక అనుదృష్టితోనే ఈ బిల్లును ఇంతత్వరలో ప్రవేశపెట్టుటకు మంత్రులు సాహసించిరని స్పష్టమగుచున్నది.

మంత్రులకు ద్రవ్యము యొక్క ఒత్తిడి ఎంత ఎక్కువగనుండినను, ఇష్టమొచ్చినపుడెల్ల పన్నులు చెల్లించువారి జీవితాను శోధింపరాదు. పన్నులను ఎక్కువ చేయతలచినప్పుడు కాని లేక నూతన పన్నులను వేయదలచినప్పుడు గాని పరిపాలనా కర్చులలో అగుచుండు దండగ కర్చులనన్నిటిని తొలగించి పరిపాలనావ్యయమును గరిష్ఠపరిమాణమునకు తగ్గింపవలెను. నూతన పన్నులు వేయుటకు సరియైన కారణముచెప్పి, మంత్రులు ప్రజలను ఒప్పింపవలెను. ఆ పన్నులు విధించుటలోను, వసూలు చేయుటలోను ప్రభుత్వోద్యోగుల హింసలకు ప్రజలు లోను గాకుండచూడవలెను. ఇది ప్రజాప్రతినిధులైన మంత్రులు చేయవలసిన మొదటిపని.

ఈ దౌర్భాగ్య దేశములో అనేక దశాబ్దములుగ ఏలాటి జలవసతులు, ఇతర సౌకర్యములు లేకపోయినను, మూగపశువులవలె రైతులు పన్నులు చెల్లించుచువచ్చియున్నారు. అది పోలీసు పరిపాలనము కావున ఇదిచేయమని, అది చేయమని బ్రిటీషు అధికారులను అడిగే దౌర్భాగ్యమైన ప్రజానాయకులకును, ప్రజలకును లేకుండినది. వారు పెట్టినది భిక్షము. అట్టిసందర్భములో ఎన్నితరములుగనో పన్నులు మాత్రము చెల్లించుచువచ్చి, వాని ప్రతిఫలము ననుభవింపని ప్రజలకు కొంత ద్రవ్యమును కర్చుపెట్టి ఇరిగేషన్ స్కీములను తయారు చేసియున్నచో, ప్రభుత్వమువారు ప్రజల యెడల నిర్వర్తింపవలసిన ధర్మమును మాత్రమే నిర్వర్తించియున్నారు. ప్రత్యేకముగ ఏమియుచేయలేదు. ఇందుకై ఇప్పుడు పన్ను వేయుట ఏమి న్యాయమో తోచుటలేదు.

ఇక ఈ "అధికాదాయోత్పత్తి" ప్రణాళిక చూచెదము—ఈ ప్రణాళిక యుద్ధకాలములో బ్రిటీషు అధికారులు ప్రారంభించిన కేకలలో చేరినది. దీనిక్రింద కొన్ని ఇరిగేషన్ స్కీములు తయారైనవికాని, ద్రవ్యము ఎక్కువ దుబారాగా కర్చు అయిపోయినది. కొంచముగ మాత్రమే ప్రజలుబాగు పడినారు. 1951 సం॥లో కాంగ్రెసు ప్రభుత్వము వారు ఈ స్కీములక్రింద వచ్చుభూముల కన్నిటికి ప్రత్యేకమైన పన్ను వేయుదురని తెలిసియున్నచో రైతులు అప్పుడే ఆ స్కీములను వద్దనిచెప్పెడివారే. ఇప్పుడు తలవనితలంపుగ ఎక్కువ ఆదాయమునుండి విరాళమైన ఇవ్వుము, లేదా భూమిలో కొంత భాగమునైన ఇవ్వుమని కోరుటలో న్యాయమెంతమాత్రము లేదనియే మా అభిప్రాయము. ఇరిగేషన్ రేటును ఎక్కువ చేయమని ప్లానింగుకమిషన్ వారు సూచించియున్నారు. కాని ఇరిగేషన్ రేట్లను ఎక్కువ చేయువిషయము సావకాశముగ చర్చింప వలసియున్నదని మంత్రివర్గము వారు గావించిన పత్రికా ప్రకటనలో తెలుపబడినది. ఇంత వరకు అమలులో నుండిన రేటునే యెక్కువ చేయుటకు సావకాశముగ చర్చింపవలసియుండిన, క్రొత్తపన్నులను రైతులపై వేయవలెనన్న యింకను ఎక్కువ సావకాశముగ చర్చింపవలదా? ఎన్నికలుజరిగి క్రొత్త శాసన సభలు ఏర్పడు లోపల క్రొత్తపన్నులను, వేయుటకై ఈ మంత్రులకు ఇంత ఆత్రమెందుకో అర్థమే యగుటలేదు. న్యాయస్థానములనిన ఈ మంత్రివర్గము వారికి ఎక్కువ భయమున్నట్లున్నది. వీరుచేయదలచిన ఏ చట్టముకాని న్యాయస్థానముల విమర్శకు గురికాకూడదట. ఇదేనా కాంగ్రెసు మంత్రుల ప్రజా పరిపాలనా సిద్ధాంతము? ఇది నియంత ప్రభుత్వ సిద్ధాంతముకాదా? ప్రజల సహజహక్కులను భ్రష్టుపట్టించడముకాదా? భూములపై వేయదలచిన అభివృద్ధిరుసుము (బెటర్ మెంటు ఫీసు) ఒక ప్రత్యేక పన్నుకాదు. పన్నులువేయు అధికారము శాసనసభలకేయుండిన యుండుగాక. అభివృద్ధికై ఇవ్వవలెనను కోరువిరాళములపైనకూడ కోర్టులకు అధికారముండరాదని శాసించుట ప్రజల సహజ హక్కులను ఈ బిల్లుద్వార ఎగురకొట్టుటయే యగును. ఈ విషయమును పాఠకులు గమనించెదరు గాక!

ఇరిగేషన్ స్కీములు, జలాశయ నిర్మాణములు కావలయునన్న కొంత ధనము వెచ్చింపనిదే ఏప్రభుత్వము నెరవేర్పజాలదు. ఏయే ఇరిగేషన్ ప్రాజక్టులక్రింద ప్రభుత్వబొక్కసము నుండి ఎంతద్రవ్యము ఖర్చుపెట్టినారో, అంత వరకు ఆయాస్కీముల క్రింద లాభపడిన రైతుల నుండి చిన్న చిన్నకిస్తీలుగా వసూలు చేసుకొని, అసలు మొత్తము తీరగనే ఆ వసూళ్లు ఆపివేయుట ఏ ప్రభుత్వమునకైనను ధర్మమైయుండును. అంతకు మించి రైతుల-నుండి వసూలుచేయుట దోపిడీక్రిందికే పరిణమించును. ఈ సిద్ధాంతమును కాంగ్రెసు మంత్రులంగీకరించెదరా?

---

# తెలంగాణా - తెనుగుపత్రికలు

(శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు బి. ఏ., బి. యల్.,)

[గత సంచిక తర్వాత]

"గోలకొండ" పత్రిక నీరచయిత ప్రారంభించి మూడేండ్లపాటు సాగించిన తరువాత, వకాలతుచే యవలసివచ్చెను. అప్పుడు పత్రికకు నామకార్థముగా శ్రీ కొండా వెంకటరంగారెడ్డి గారి సోదరులు శ్రీ కొండా బాలకృష్ణారెడ్డి గారు సులభముగా లభించిరి. అది వెంకటరంగారెడ్డిగారి అనుగ్రహము. బాలకృష్ణారెడ్డిగారు మొగలాయిమనిషి. ఇంగ్లీషు ఉర్దూలను మిడిల్ స్కూలు వరకు చదివి యుండిరి. తెనుగులో కలమెత్తి పత్రిక కెన్నడును వ్రాసినపాపాన పోలేదు. "సుజాత" కును శర్మగారి స్థానములో బాలకృష్ణారెడ్డిగారే సంపాదకులైరి. తెరవెనుక భాగవతమును "గోలకొండ" కీ రచయిత, "సుజాత" కు శ్రీమాడపాటి హనుమంతరావు గారును సాగింపవలసివచ్చెను. పలుమారు శ్రీ మాడపాటి వారిట్లనుచుండిరి. "సంపాదకత్వము యెంతటి అసామాన్య కార్యము. అట్టిది బాలకృష్ణారెడ్డిగారి కయాచితముగ బలవంతముగ లభించినది."

"సుజాత" ఉత్తమ మాసపత్రిక యనిపించుకొన్నది. అది యాగిపోయిన 24 యేండ్లకు మరల అదే పేరుతో వెలవడుచున్నది. దీని జాతక మెట్లున్నదో? తెలుగు, నీలగిరి, పత్రికల కాలమందే "ఆంధ్రాభ్యుదయము" అను మరొక పత్రిక యుండెను. "సుజాత" యాగిపోయిన పదేండ్లవరకు మరల యే మాసపత్రికయు లేకపోయెను. అటుపై సికిందరాబాదునుండి "ఆంధ్రశ్రీ" అను మాసపత్రిక ఒక సంచిక వెలువడి ఆగిపోయెను.

శుక్లసంవత్సరమందు "దేశబంధు" యను మాసపత్రికను అత్రాపుబల్దాలోని యొక గ్రామమునుండి ఒక (శ్రీ) వైష్ణవులు ప్రారంభించి, మూడేండ్ల వరకు సాగించిరి. ఒక చిన్న గ్రామమునుండి దాని నంతకాలము పట్టుదలతో నడిపించుట ప్రశంసాపాత్రము. అది అంతటితో ఆగిపోయెను.

1934లో సికిందరాబాదునుండి అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు "దక్కన్ కేసరి" అను ఆంగ్ల ఆంధ్ర మాసపత్రికను నడిపించిరి. అది యేడెనిమిది నెలలవరకు సాగి యాగి పోయెను.

1936లో సికిందరాబాదునుండి "౧౯౩౬" అను విచిత్ర నామకరణముతో నొక మాసపత్రిక బయలుదేరెను. ఆ పత్రికా శిశువు పురిటిలోనే గంతుగొట్టెను. 1938లో "తెలుగుతల్లి" అను మాసపత్రిక సికిందరాబాదు నుండి గాచమళ్ళ సత్యవతీ దేవిగారి సంపాదకత్వమున వెలువడెను. అదియు నేడాదిలోనే క్రిందబడనుండ కొందరు హైదరాబాదు యువకులు చేరి దానిని మరొక సంవత్సరము సాగించిరి. తరువాత సికిందరాబాదు నుండి "విభూతి" అను మాసపత్రికను పండిత చిదిరె మఠము వీరభద్ర శర్మగారు మూడేండ్లు నడిపించి వారంతలో కాశీలో నొక శైవపీఠమునకు అధిపతులుగ వెళ్ళుటచే నాపివేసిరి. అది యుత్తమముగా సాగినట్టి మాసపత్రిక.

ఇంచుమించు 1937 నుండి సికిందరాబాదులోని "దివ్యవాణి" అను వారపత్రికను శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు సంపాదకులై నడిపించుచున్నారు. శాస్త్రిగారు గొప్ప పండితులు; పూర్వాచార పరాయణులు. అందుచే వారిపత్రిక సంఘసంస్కార విముఖమైనది.

"హైదరాబాదులో శ్రీ భాగ్యరెడ్డిగారను హరిజన నాయకులుండిరి. వారు "భాగ్యనగర్" అను వారపత్రికను ఇంచుమించు 15 సంవత్సరముల క్రిందట సంపాదకత్వము వహించి నడిపిరి. కాని పత్రిక వెలువడిన మరుసంవత్సరమే అతడు క్షయ చికిత్సకు బెంగుళూరికిపోయెను. అప్పుడు దానిని శ్రీకంఠము సత్యనారాయణ నాయుడుగారు నడిపిరి. అదియు 2-3 యేండ్ల తరువాత అంతరించెను.

హైదారాబాదులోని శ్రీ బి. యన్. శర్మగారు తెలంగాణా కొరకై బెజవాడకు వెళ్ళి అచ్చటినుండి "ఆంధ్రవాణి" యను పత్రిక నొక సంవత్సరముపాటు నడిపిరి. శర్మగారు పత్రికా రచనాసమర్థులే కాని ఆర్థిక దుస్థితిచే పత్రిక ఆగిపోయెను.

హైదారాబాదులోకూడ దినపత్రికను పెట్టవలెనను నభిలాష ఇద్దరికి జనించెను. శ్రీ రాజగోపాల్ మొదలియారుగారు 1945లో "తెలంగానా" అను దినపత్రికను ప్రారంభించిరి. ఉర్దూ, ఇంగ్లీషు దినపత్రికలతోపాటు "మీజాన్" అను అరబ్బీ పేరుతో తెనుగు దినపత్రికను కలకత్తావాలా అనువారు లేవదీసిరి. తెలంగానా పత్రికా సంపాదకులు తమిళులు. మీజాన్ పత్రికాధిపతులు ముసల్మానులు. తమిళునకు తెలుగు మాటలైన వచ్చును కాని ముసల్మాను తెలంగీ యెట్టిదో తెలిసికొన ప్రయత్నించిన వాడుగాడు. అందుచే తెలంగానాకు కీ॥ శే॥ బుక్కపట్టణము రామానుజాచార్యులుగారును, మీజాన్ పత్రికకు అడవి బాపిరాజుగారు సంపాదకులుగా నిర్వహించిరి. బుక్కపట్టము వారు హైదరాబాదు రాజ్య పత్రికా రంగములో నసాధారణులు. దిట్టముగా గట్టిగా ఆంధ్రాంగ్లములలో పత్రికల నడుపగలవారు. వారి జీవనమంతయు నందే గడచెను. తెలంగానా పత్రిక రెండు మూడేండ్లు వెలువడి చందాదారులు పడిపోవుటచే పడిపోయెను. మీజాన్ పత్రికయు రెండుమూడేండ్లకే ఆగిపోయెను. అది ఆగిపోవుటగూడ విచిత్రమైనది. రజాకారు కాలములో దానికి ప్రభుత్వద్రవ్య సహాయము బాగుగానుండెను. కాని చందాదారు లెవ్వరును లేకపోయిరి. అందుచే దానిని లోకవ్యవహారముగా ప్రచురించునట్లుచేసి, ప్రభుత్వానికి, తమకు మాత్రమే దాని యస్తిత్వము తెలియునట్లుగా కొన్ని మాసాలు సాగింపగా "సహేంద్ర తక్షకాయ స్వాహా" యన్న పోలీసు చర్యాహోమములో నదియు దానితోబాటుండిన ఉరుదూ ఇంగ్లీషు పూర్జములును ఆహుతి యయ్యెను. ఇప్పుడు హైదరాబాదులో "గోలకొండ" దినపత్రిక యొక్కటే యొకటి కలదు. అదే తెలంగాణమ్మ ముక్కుపై వ్రేలాడు కొలికిపూస.

శ్రీ శేషులపల్లి రామానుజ రావుగారు ఇంచుమించు 1937లో 'శోభ' అను మాస పత్రికను వరంగలునుండి ప్రశంసాపాత్రముగ ప్రకటించిరి. అది యుత్తమముగా నుండెను. కాని ఒక సంవత్సరము తరువాత ఆగిపోఁయి మరల 1950లో పునరుద్ధరింపబడి హైదారాబాదు నుండి వెలువడుచున్నది.

క్రీ. శ. 1945లో సికింద్రాబాదునుండి 'తరణి' అను మాసపత్రిక వెలువడి సారస్వత, జ్యోతిష విషయాలను గురించి ప్రచారమొక వత్సరము పాటుచేసి ఆరిపోయినది.

ఆంధ్రమహాసభ కమ్యూనిస్టుల చేతులలో బడినకాలములో "ఆంధ్ర కేసరి" యను వార పత్రిక యించుమించు నొకసంవత్సరము వరకు నడచి ఆగిపోయెను,

హైదరాబాద్ ప్రభుత్వపక్షాన కొన్ని తెనుగుపత్రికలు నడుపబడెను. అందు ముఖ్యమైనది సమాచార శాఖవారి "హైదారాబాదు సమాచారము." అది పక్షపత్రికగా నుండెను. పోలీసుచర్యతర్వాత దానిస్వరూపము మారి ఉత్తమపత్రికయయ్యెను. కాని గోర్వాల కమిటీ దాని నాపివేయించెను. ప్రభుత్వ సహకార సంఘం

వారును, విద్యాశాఖ వారును మాసపత్రికల నడపిరి. మరియు కో-ఆపరేటివ్ యూనియన్ వారును నొక మాసపత్రికను నడిపిరి. అవన్నియు నాగిపోయినవి.

హైదరాబాదు సంస్థానములోని పత్రికల చరిత్ర రెండు భాగములు కలది. 1. పోలీసు చర్యలకు పూర్వస్థితి. 2. తదనంతరస్థితి. పూర్వము నుండి హైదరాబాదు నిరంకుశ ప్రభుపాలితము. హుజూరు ఫర్మానాలే ఖానూనులు! నిజాం ప్రభువు వాక్కులే యాజ్ఞలు. పత్రికలపై పర్యవేక్షణచేయుశాఖ హోంశాఖ. అందులోని పోలీసుశాఖయే పత్రికలను మందలించి, బెదరించి బాధించు నధికారశాఖ. ప్రభుత్వమునకు సరిపడని పత్రికల నాపివేయుచుండిరి. అట్టి చర్యలపై అపీలు లేదు. మరల హోంశాఖయే దయదలచి, మన్నించి కటాక్షించిన పత్రికకు పునర్జన్మ కలిగెడిది. పత్రికకు శలవువొసగుట యనగా పద్మవ్యూహమునూ, భూల్ భులియాను ఛేదించుకొని పోవు నంతటి ఘనకార్యము. పత్రికను స్థాపించువాని పుట్టు పూర్వోత్తరములు, వాని యేడుతరాల యింటిదనము, వారి స్వీయ చరిత్ర, వాని కృతకముకాని మెతకదనము, ఇవన్నియు విచారించి, తృప్తిపడిన తర్వాత వానిని పిలిపించుకొని బహు నియమములు కల పత్రముపై వాని సంతకము తీసుకొనెడి వారు. ఆ నియమములో—"నేను రాజకీయములను చర్చించను. నే నే మతముల వారిని చెనకను. నిజాం ప్రభుత్వమునకుగాని, బ్రిటీషు ఇండియా ప్రభుత్వమునకుగాని వ్యతిరేకముగా విమర్శలు చేయను—" అను నవి ముఖ్యమైనవి. అటిస్థితిలో తెనుగు పత్రికల వృద్ధి యెట్లగును?

పోలీసుచర్యల తర్వాత పత్రికలపై నిరోధకములు తక్కువయ్యెను. కాని, పూర్తిగాపోలేదు. ఇది జయింపబడిన రాజ్యముకదా? మిలిటరీ గవర్నరు పాలించిన కాలములో కోరదగిన స్వేచ్ఛ లేకున్నను, పూర్వముకంటె కొంత మేలు పరిస్థితు లేర్పడెను. క్రమముగా పత్రికలకు స్వాతంత్ర్యము లభించుచువచ్చెను. అందుచేత పత్రికలసంఖ్య పెరిగిపోయెను. పోలీసుచర్య తర్వాత యీ క్రింది పత్రికలు వెలువడినవి.

| | సంపాదకులు: | |
|---|---|---|
| 1. 'సుజాత' మాస పత్రిక | గడియారము రామకృష్ణ శర్మ, | హైదరాబాదు |
| 2. 'ప్రగతి' వార పత్రిక | భండారు చంద్రమౌళీశ్వరరావు | ,, |
| 3. 'భాగ్యనగర్' పక్ష పత్రిక | అడ్లూరి అయోధ్య రామకవి | ,, |
| 4. 'పద్మశాలి' మాస పత్రిక | బూర్గుల రామకృష్ణయ్య | ,, |
| 5. 'జనశక్తి' వార పత్రిక | జి. గౌతమరావు | ,, |
| 6. 'ప్రజాశక్తి' వార పత్రిక | రషీద్ | ,, |
| 7. 'మేధావి' మాస పత్రిక | బిదురు వెంకట శేషయ్య | ,, |
| 8. 'జయభారత్' మాస పత్రిక | వెల్దండ ప్రభాకరరావు | ,, |
| 9. 'తెలుగు దేశము' వార పత్రిక | రాజ్యలక్ష్మీ దేవి | ,, |
| 10. 'కాకతీయ' వార పత్రిక | పి. వి. సదాశివరావు | వరంగల్లు |
| 11. 'చిత్రవిచిత్ర' వార పత్రిక | దామోదరరావు | ,, |
| 12. 'సుదర్శన్' (తె.హిం.) మాసపత్రిక | సుదర్శనా దేవి | వనపర్తి |
| 13. 'శ్రీ. కుసుమ హారనాధ' ఆంధ్రాంగ్ల మాస పత్రిక | హరిహరయ్యర్ | సికింద్రబాద్ |

నాకు తెలిసినంతవరకు నిప్పటి పత్రికల పేర్లు తెలిపినాను. పత్రికలు తొందర తొందరగా వెలువడును. అదే తొందర తొందరతో మాయ మగుచుండుట కొన్ని స్మృతిపథమున నుండక పోవచ్చును. 1914 నుంచి 1951 వరకు తెలంగాణములో వెలువడిన పత్రికలను చూచిన 23 ఏండ్లకు అర్ధవార పత్రికయు, అయిదేండ్లు రెండు వారపత్రికలును, మూడేండ్లకు మాస పత్రికయు, నొక వారపత్రికయు, రెండేండ్లు రెండు దినపత్రికలు సాగి, యాగిపోయినట్లు విశదమైనది. తక్కిన పత్రికలలో సగమునంతు యేడాదిలోనే యాగిపోయెను. ఇపుడు సాగుచున్న తెనుగు పత్రికలలో దేనికిని 1000కి మించిన చందా దారులుండు నటుల కానరాదు. ఈ పత్రికలు తెలంగాణ ప్రజల నాకర్షింప జాలినవి కావనుట కనబడుచునే యున్నది. ఆంధ్ర వారపత్రికలో కథలు, సినిమా విలాసినుల బొమ్మలు పూర్తిగా నుండుట మొదలు పెట్టిన తర్వాత, తెలంగాణమున నివెన్ని ప్రతులు వ్యయమగునో అంతమాత్రమైన తెలంగాణా తెలుగుపత్రికలు అమ్ముట లేదు. 'ఆంధ్ర ప్రభకు' 'ఆంధ్ర పత్రికకు' రెంటికిని కలసి పదిహేను వేల వరకు తెలంగాణలో చందాదారులు కలరు. కావున మనము పత్రికలనెంత అభివృద్ధి చేయవలయునో, యెంత ఆకర్షణీయముగా ముద్రింపవలయునో, యెంతటి సంపాదకత్వ అర్హత సంపాదించుకొనవలెనో, యెంతటి ఆర్థికపుష్టి కలిగి యుండవలెనో, యెంత పట్టుదల కలిగియుండవలెనో సంపాదక మహాశయులు బాగుగా ఆలోచించుకొందురుగాక!

## వాణిజ్య పంటలకు పన్ను :- బిల్లు వివరాలు.

చెన్నపట్టణము ఆగస్టు 25: చెన్న రాష్ట్రములో రయితువారీ భూములలో పండే వాణిజ్య పంటలు, తోట పంటల మీద ఈ క్రింది విధముగ పన్ను విధించుచూ ఒక బిల్లును మంత్రులు ఈ దినము ప్రచురించినారు. ఈ పన్ను ప్రతి రిజిస్టర్డు భూస్వామినుండి 1951 జూలై 1 నుండి వసూలు చేయ ఉద్దేశింప బడినది.

దిగువ పేర్కొన్న పంటలమీద ఆ భూముల యజమాని వద్దనుండి ఈ క్రింది రేట్ల ప్రకారము ప్రత్యేకపన్ను వసూలు చేయడమగును. (ఎ) తమలపాకుల తోటలు, (బి) కరి, కొబ్బరికాయలు, నిమ్మజాతికి చెందిన పండ్లు, పసుపు, ద్రాక్షమీద—చెల్లిస్తున్న భూమిశిస్తుకు రెట్టింపు.

(బి) మామిడిపండ్లు, ఉల్లిపాయలు, అరటి పంటలమీద ఆ భూములకు చెల్లిస్తున్న శిస్తుకు -సగము వంతు (సి) ప్రత్తికి భూమిశిస్తులో రూపాయమీద 6 అణాలు. (డి) మిరియాలు, పొగాకుకు యకరానికి రూ 10. (ఇ) యాలక, కాఫి, తేయాకు పంటలకు ఎకరాకు రూ 3. (యఫ్) వేరుసెనగ ఎకరాకు రూ 1-8-0, రబ్బరు ఎకరాకు రూ 1.

ఏ భూమిలోనైనా రెండు కంటే ఎక్కువ పంటలను పండిస్తే యే పంటకు ఎక్కువశిస్తు ఉందో ఆ రేటు ప్రకారము చెల్లించవలెను.

### భూమి శిస్తుపై అదనపు పన్ను.

భూమిశిస్తుపై అదనపుపన్ను విధింపు ఈ రేట్లు అనుసరించి జరుగునట్లు ప్రకటన తెలుపుచున్నది. (ఎ) చెల్లించ వలసియుండే భూమి శిస్తులో మొదటి రూ 150ల మీద పన్ను లేదు. (బి) తరువాత వందరూపాయల భూమిశిస్తుమీద ప్రతి రూపాయకు అణన్నర చొప్పున పన్ను. (సి) ఆతరువాత రూ 500 పైన రూ 1500ల వరకు రూపాయకు 6 అణాల పన్ను. (డి) పై మొత్తాలకు పైబడి మిగిలే శిస్తుభాగానికి ప్రతిరూపాయకు అర్థ రూపాయి.

రాష్ట్ర ప్రభుత్వము శిస్తు పరిమాణాలను కాని వాటి రేట్లనుగాని రూపాయకు 8 అణాల మించకుండా యేరీతిగానైనా ప్రకటనద్వారా మార్చటానికి వీలున్నది.

[భూమిశిస్తుపై అదనపు పన్నును మానివేయుటకు మంత్రు తీర్మానించుకొనినారు.]

# నాట్యకళ — అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

నటుఁడు తన హృద్గత క్రోధాది భావములను శరీరాది చేష్టలవలన వ్యక్తీకరించుట అభినయము. రామ, యుధిష్ఠిరాదుల యవస్థలను అంకరంగాది సహాయ్యముచేఁ జూపుట యభినయము యొక్క ప్రయోజనము. అభినయమున కనుకరణ మావశ్యకము. లోకమునందుఁ దండ్రి తన కుమారుని ముద్దాడుట యభినయ మనపించుకొనదు. పితాపుత్రులు కానివారు వారి వేషములు వేసికొని, యందుఁ దండ్రి వేషము వేసికొనిన వాఁడు కొడుకు వేషము వేసికొనినవానిని ముద్దాడిన నది యభినయ మగును.

భరతముని ప్రణీత నాట్యశాస్త్రమతమున అభినయము నాలుగు విధములు.— ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము. ఇఁక వీనిని గుఱించి కొంచెము కొంచెము విచారింతము.

ఆంగికము:—

నేత్ర, ముఖ, హస్త, పాదాదికముల వ్యాపారము వలన మనోవ్యాపారములను దెలియఁజేయుట యాంగికాభినయము. లోకమునందు, జనులు కోపము వచ్చినప్పు డొక విధముగను, ప్రియ యాధిక మైనప్పు డొక విధముగను, విషాదము కలిగినప్పు డొక విధముగను, ముఖవికాసమును, హస్తపాద విక్షేపములను జేయుట మనము చూచియున్నారము. ఒకని బహిరింద్రియ వ్యాపారమును బట్టి యతని మనో వ్యాపారములను మనము కనుగొనగలము. లోకమందలి యీ శరీర మనో వ్యాపారములను నటులు చక్కఁగ ననుకరణమును జేసినగాని ప్రేక్షకులకు రామాది తాదాత్మ్య బుద్ధిచే నానందము కలుగ నేరదు. ఇంతియ కాదు; ఈ యంగవ్యాపారములు లోకము ననుసరించి బాలురకు, తరుణులకు, వృద్ధులకు, యజమానులకు, భృత్యులకును వేఱువేఱుగ నుండవలయును. గంభీరుఁడైన నాయకుఁడు దుఃఖసమయమున బాలునివలెఁ బొవ్వుమని యేడ్చినచోఁ బాగుగ నుండునా? ఒక పురుషుఁడే ఒక్క భావమునే భిన్నభిన్న వ్యక్తులయెడఁ గనబఱచునప్పుడు భిన్నాభినయములను జూపవలయును. ఒకానొక పురుషుఁడు ప్రేయసిని ప్రేమించునప్పుడును, సోదరిని ప్రేమించునప్పుడును, పుత్రుని ప్రేమించునప్పుడును, ఒక్క విధమైన అభినయమే చూపుటకు వీలులేదు గదా! నాటకమునం దాంగికాభినయ ప్రాధాన్యమును జూపుటకు రెండుదాహరణములను జూపెదను. శాకుంతల నాటక ప్రథమాంకమునందలి ఈ క్రింది భాగము చూడుఁడు:

శకుంతల.— (శృంగార లజ్జ నభినయించుచున్నది)

సఖి.— (ఆమె చేష్టలు తెలిసికొని-జనాంతికముగా) సఖీ! శకుంతలా! ఆయన యిప్పు డిచట నుండిన యెడల?

శకుంతల.— (రోషముతోఁ) ఉండిన నేమి?

సఖి.— జీవిత సర్వస్వమేని యిచ్చి యీ యతిథిని కృతార్థుని జేయుదువు. — ఇచ్చట శకుంతల గూర్చుండియున్నది. మాటలాడుట లేదు. కాని యామె యనురాగ వ్యంజకములను — ఉర్వీలేఖన, చింతన, ముఖావన, మనన, నఖకర్తన, వస్త్రాంగుళీయక స్పర్శాదికములయిన యంగచేష్టల వలన శృంగార లజ్జ నభినయించినందున సఖుల కామె భావము తెలిసెను. అట్లే నాయికానాయకుల యాకారమునను, పరస్పర స్నిగ్ధావలోకనము వలన వారి భావమును, సఖు లెఱింగిరి. కావున శకుంతలా దుష్యంత వేషములను వేసికొనినవారు వారి భావము ప్రేక్షకులకుఁ దెలియున ట్లభినయింప వలెను. లేనియెడల నీ భాగము ప్రేక్షకులకు రమ్యముగ నుండదు.

(ఇంకొక యంకమున)

శకుంతల.— అనసూయా! సూదివంటి క్రొత్త దర్భపుడక నా పాదమున గ్రుచ్చుకొన్నది. నా చీర కురవక వృక్షము యొక్క కొమ్మకుఁ జిక్కుకొన్నది. దీనిం దీసికొనువఱకును నిలిచి, నన్ను వెంటకొనిపొండు. ఇచ్చట శకుంతల కాలికి దర్భాంకురము గ్రుచ్చుకొనియెననియు, పయ్యెద చెట్టుకొమ్మకు బట్టుకొనియెననియు, వ్యాజము కల్పించుకొని కొంతకాల యాపనము చేసి, యితరులకుఁ దెలియనట్లుగ రాజును చూచును. పైని జూపిన యభినయముకంటె నిది యెక్కుడు కష్టము. ఇచ్చట కాలికి దర్భగ్రుచ్చుకొనినట్లు, కొంగు చెట్టునకు బట్టుకొనినట్లును, అభినయము చేయుటయే కాక, యా చేష్టలన్నియు రాజును చూచుటకై కల్పింపబడిన వ్యాజములని ప్రేక్షకుల కభినయము వలననే — బోధపడునట్లు నటింప వలెను. ఇది యభినయ విశేషము. ఈ యాంగికాభినయము మూఁడు విధములు.— శారీరకము, ముఖజము, చేష్టాకృతము. మొగము గాక, శరీరముయొక్క యితర భాగములవలన గానవచ్చునది శారీరకము. ముఖరాగము వలన గానవచ్చునది ముఖజము. క్రియారూపముగఁ గానవచ్చునది చేష్టాకృతము. ఇందు ముఖరాగాన్వితము శ్రేష్ఠమయినది. మనస్సునందలి భావము మారినకొలఁదియు ముఖముమీఁది వికారములు (రాగములు) మారుచుండ వలెను. ముఖము హృదయ ప్రతిబింబమును జూపునట్టి యద్దము. హృద్గతభావములు ముఖముమీఁద జూపగల్గినవాఁ డతిశ్రేష్ఠుఁడు. మనసునందలి భావము మాఱిన కొలఁదియు ముఖరాగములు మార్చవలసి యుండును. ముఖ

ఫేస్సము—స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామము—నెల్లనాలుగు విధములు. మధ్యస్థాది భావ నిరూపణకు స్వాభావికము, అద్భుత హాస్యశృంగారములకు ప్రసన్నము, వీర రౌద్ర కరుణ మదాదికములకు రక్తము, భయానక భీభత్సములకు శ్యామము యను ముఖరాగముల నుపయోగింప వలయునని భరతాచార్యుల యభిప్రాయము. ఆంగికాభినయము మఱల రెండు విధములుగ విభజింపఁబడినది. షడంగాభినయము, ఉపాంగాభినయము. శిరస్సు, హస్తములు, ఉరము, పార్శ్వము, కటిపాదములనునవి షడంగములు. నేత్రములు, భ్రూవు, నాస, అధరము, కపోలము, చుబుక మనునవి యుపాంగములు. ప్రత్యంగములని యాఱు కలవు. మూపు, బాహువు, వీపు, కడుపు, తొడ, పిక్క. కొందఱు మణికట్లు, మోకాళ్లు, మోచేతులు గూడ ప్రత్యంగములని చెప్పుదురు. ఈ ప్రకార మంగములన్నియు విభజించి, యొక్కొక యంగము యొక్క చలన భేదములను నాట్యగ్రంథకారులును, అభినయగ్రంథకారులును విశేషముగ వర్ణించి యున్నారు. అవి యసంఖ్యములు. హస్త భేదములు మూఁడువందలకు హెచ్చుగ నున్నవి. (అవి నాట్యమున కెక్కువగ నుపయోగించును) కాన రవివర్మాది చిత్రకారులచే జిత్రింపఁబడిన రాధామాధవాది పటములవల్ల కొంతవఱకు నేర్చుకొనవచ్చును. కాని నిజమైన యభినయమును నేర్చుకొనవలెనన్న, లోకమందలి ప్రజల యాచరణమును జూచియే నేర్చుకొనవలెను. ప్రేమ హెచ్చుగ నున్నపుడు తల్లి తన చంటిబిడ్డ నెట్లు ముద్దాడునో, శోక, విషాద సంతాపములలో ముఖవికాసము లెట్లుమారునో తెలిసికొనవలయునన్న నట్టి సందర్భముల లోకమునందుఁ జూచితీరవలయును.

వాచికాభినయము:

నటుఁడు శరీరాభినయము వలనఁ దన భావములను దెల్పుటయేకాక వాక్కువలనను దెల్పును. ధ్వనిభేదము చేతను, కాకుస్వరభేదముచేతను, విరామభేదముచేతను, ఒక వాక్యమునకే వేఱువేఱు తాత్పర్యము లేర్పడును.

ఉదా.— కం॥ స్వామి విను (1), మట్లి వేంక
టాద్రిమనృపతి (2), నీదుకీర్తి—రణజయభేరీ
ధామ ధ్వనివిని తొలఁగడె (3),
వేములచినిబసవశేని—వెంకటనృపతీ॥

(కవి చౌడప్ప)

(1)వ, యల్పవిరామము దగ్గర, మఱియు (3)వ, యల్ప విరామము దగ్గఱ నిల్పి చదివినప్పుడు యొక యర్థము; (2)వ, యల్పవిరామము దగ్గఱనే నిల్పిచదివినప్పుడు మఱియొక యర్థము స్ఫురించును.

అనగా:— కం॥ స్వామి విను — "మట్లి వేంకటాద్రిమనృపతి నీదుకీర్తి రణజయభేరీధామ ధ్వనివిని తొలఁగడె"— వేములచినిబసవనేని వేంకటనృపతీ॥ యని యొక యర్థము.

కం॥ స్వామి విను మట్లి వేంకటాద్రిమనృపతి— "నీదు కీర్తి రణభేరీధామ ధ్వనివిని తొలఁగడె వేములచినిబసవనేని వేంకటనృపతీ" యని వేఱొక యర్థము స్ఫురించును. కావున పాత్రమునకు దగినట్లును, సందర్భమునకు దగినట్లును మాటలాడవలయును. ఉపన్యాసములఁ జేయు వక్తలకునుగూడ నీ యభినయ మావశ్యకము.

నాటకము లోకవ్యవహార ప్రతిబింబము గనుక పాత్రములను బట్టి వారి భాషయు మాఱుచుండ వలెను (అని సంస్కృతశాస్త్రకారుల మతము. కాని యిచ్చట నొక విశేషము చెప్పవలసి యున్నది. శౌరసేన్యాది ప్రాకృత భాషలు నాటకములోఁ బాత్రోచితముగా వాడవచ్చునని చెప్పి, బర్బరాంధ్ర ద్రావిడ భాషలు నాటకమున నిషేధింపఁ బడినను వికల్పముగా స్థానోచితముగా వాడవచ్చునని భరతుఁడు చెప్పియున్నాడు). శాకుంతల నాటకమునందు శార్ఙ్గరవ, దుష్యంత సంభాషణములో మొదట శార్ఙ్గరవుఁడు శాంతముగా మాటలాడి పిదపఁ గోపముతోఁ మాటాడును. ఆ రెండు సమయములందలి మాతని ధ్వని వేఱుగ మాఱవలెను. అనగా రసానుగుణ్యముగా మాట్లాడవలయునేకాని, శాంతరసమున గట్టిగా, కఠినముగా; రౌద్రరసమున బేలవముగా మాటాడిన వినుట కసహ్యముగా నుండుటేకాక ప్రేక్షకులకు విసుగు కలిగించును. (సశేషము.)

## విజ్ఞప్తి

చిరునామాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చిరునామాలు చేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనముల క్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి ప్రకటింపవలయునో తెలియకున్నది.

చిరునామాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయుజాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటించుట కెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము:—

సంపాదకులు, "భారత జ్యోతి"

# ప్రజాభిప్రాయ వేదిక.

## గోధుమల ధరను తగ్గింపవలెను.

ఆర్యా,

పెండ్లిమర్రి, నందిమండలము ధాన్యపు డిపోలలో ఇటీవలనే బీదప్రజలందరకు రేషన్ కార్డు మేరకు గోధుమలు, బియ్యము వగైరా ధాన్యము ఇవ్వబడినది. ఎచ్చటను ధాన్యము దొరకని ఈ కష్టకాలములో గోధుమలు శేరు 1-కి రు. 0-10-9 వంతున కొనుట సులువుగానే యుండినది. గోధుమల వాడకము బీదప్రజలకు కష్టమైనప్పటికిని, ధర కొంచము చౌకగా యున్నందున ఏదో ఒక విధముగ తీసుకొనెడివారు. కాని హఠాత్తుగా ప్రభుత్వమువారు శేరు 1-కి మూడణాల వంతున ధర పెంచిరి. ఇది కొనుగోలు శక్తిలేని బీద ప్రజలకు కడుపుమీద కొట్టినట్లున్నది. అప్పుడే ఈ ధర పెరుగుదలను చూచిన బీదప్రజలు చాల భయపడుచున్నారు. ధాన్యపు డిపోలు తెరచినంతమాత్రముచేత, బీదప్రజలకు లాభములేదు. రేట్లుగూడ అందుబాటులో నుండవలెను. లేనిచో ద్రవ్యము దొరకని బీదప్రజలు ఏమి కొనగలరు? కాన ప్రభుత్వము దీనిని గమనించి, ధరలను తగ్గించవలెనని కోరుచున్నాను.

కొత్తగంగిరెడ్డిపల్లె. జి. సి. వెంకటరెడ్డి.

---

## విద్యాభివృద్ధికి ఉపాధ్యాయుల కొఱత తీర్చవలెను:

ఆర్యా,

దేశములో నిర్బంధ విద్యావిధానము సక్రమముగ సాగవలెననిన అనేకమంది ఉపాధ్యాయులు కావలెను. ఈ జిల్లాలో ట్రయినింగు తర్ఫీదు పొందుటకు 750 అభ్యర్థులు రాగా 270 మంది మాత్రమే తీసికొనబడిరి. సెలెక్షనుకని 300 మందిని రప్పించి, మూడు వేల రూపాయలు వృథాగా ఖర్చుపెట్టించినారు. ఉపాధ్యాయుల లోటును తీర్చనెంచు యీ ప్రభుత్వమువారు గూడ, తమంతకు తామే వచ్చు ఉపాధ్యాయ విద్యార్థులను చేర్చుకొనలేక వాపసు పంపరు. రాష్ట్రములో చాలినన్ని ట్రయినింగు పాఠశాలలు తెరచి, ఉన్న స్కూళ్లలో అదనపు సెక్షన్లు పెట్టి, జీవనభృతికి తగిన వేతనములు, పౌరసత్వపు హక్కులు యిచ్చుటద్వారా ఉపాధ్యాయుల కొఱతను తీర్చవలెను. ఇట్లు చేసి సత్వర విద్యాభివృద్ధికి పాటుపడవలెనని ప్రభుత్వమును కోరుచున్నాను.

కడప. వి. విజయరామరాజు.

---

## ఉపాధ్యాయుల సభ తీర్మానములు.

ఆర్యా,

ఆగష్టు నెల 19-వ తేదీ పులివెందుల తాలూకా ఉపాధ్యాయులు సభ జరిపి, ఈ క్రింది తీర్మానములను ఆమోదించిరి. శ్రీ. యస్. వి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., అధ్యక్షత వహించిరి.

(1) ప్రభుత్వమువారు ఉపాధ్యాయులను ప్రజావసర సిబ్బంది క్రింద చేర్చి, రేషన్ యివ్వవలెనని ఆర్డరుచేసినారు. కాని సప్లయి ఆఫీసర్లు కొంతమంది టీచర్లకు మిశ్రమ ఆహారమిచ్చుచున్నారు. ఇతర ఉద్యోగులకు వలెనే ఉపాధ్యాయులకు ఉత్తర్వుమేరకు బియ్యము, చక్కెర సప్లయి చేయవలెను. (2) కొద్దిగా మెట్టభూమి ఉన్నదనే కారణముచే రేషన్ కార్డులు ఇవ్వకున్నారు. ధాన్యము పండక శిస్తు రెమిషన్ కూడ యిచ్చినారు. కాబట్టి కొద్ది మెట్టభూమి యున్నదనే సాకు చెప్పక కుటుంబ సభ్యులందరకు రేషన్ ఇవ్వవలెను. (3) కుటుంబ సభ్యుల సంఖ్యకు, కరణము సర్టిఫికెట్ బదులుగా, డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారి సర్టిఫికెట్ అంగీకరింపవలెను. (4) తినుటకు యోగ్యమైన బియ్యమునే సప్లయి చేయవలెను. (5) ఒకేతూరి రెండువారముల రేషన్ యివ్వవలెను. ఆ రేషన్ 15 దినములలోపల యే తేదీన యిచ్చినను స్టాకు లేదను కారణము చెప్పకుండ డీలర్లు యిచ్చునట్లు ఉత్తర్వు చేయవలెను. (6) కేంద్ర ప్రభుత్వోద్యోగుల వలెనే ఉపాధ్యాయులకు కూడ కరువు భత్యమును పెంచవలెను.

పులివెందుల. జి. వెంకటప్ప,
సెక్రటరి.

---

# ధర్మవిజయము.

(శ్రీ వాల్మీకి.)

[గత సంచిక తర్వాత]

(8)

[చంద్రశేఖర, శ్యామలారావులు వాహ్యాళి వెడలి, తిరిగివచ్చునపుడు జానకీ రుక్మిణులు కలిసికొనిరి. తొలి చూపులలోనే చంద్రశేఖర, జానకులకు ప్రేమ జనించెను. క్రమేపి ప్రేమ వృద్ధి గాంచెను. జానకికి పెండ్లి గానుండ, చంద్రశేఖరుఁడు శ్యామలారావు సహాయముతో గ్రామాంతరము తీసికొని పోయెను. శ్యామలరావు, తానే జానకిని పెండ్లిచేసికొన దలంచుటచేత, మోసముతో చంద్రశేఖరుని తల బగుల గొట్టి, జానకిని యెగువ తిరుపతికి దోడ్కొని పోయెను. శ్యామలుఁడు జానకిని పెండ్లి చేసికొన్నాడను వార్త పత్రికలలో వెలువడెను. జానకి తలిదండ్రులు కులమువాఁడగు శ్యామలరావును పెండ్లియాడెనని సంతసించిరి. గాయపడిన చంద్రశేఖరుఁడు దెబ్బ మాన్పుకొని, జానకి కనుబడనందునను, శ్యామలుని వివాహమాడినదను వార్తచేతను, పిచ్చివాడయ్యెను. మధుసూదనుఁడను యాత్రికుని సాయముతో గూడూరు చేరెను. తర్వాత ఈ ప్రకరణమున.—]

దక్షిణ భారత దేశమున ప్రసిద్ధి జెందినది శ్రీ వేంకటేశ్వర దేవస్థానము. ఈ స్థానమున నెలకొనిన దేవునకు ఏడుకొండల వేంకటేశ్వరుఁడనియు, బాలాజీ యనియు ప్రతీతి. తీర్థయాత్రికులు వేలతరబడి యేటేటా శ్రీ స్వామివారి దర్శనార్థము వచ్చి, మొక్కుబడులు చెల్లించి పోవుచుందురు. మొక్కుబడులు చెల్లించుటయందేదేని లోపము గలిగిన దేవుఁడలుగును. అందుచే నీయనకు 'వడ్డికాసులవాఁ'డనియు పేరు గలదు. ఈ దేవస్థానమున విశేష మేమన, యాత్రికులు శ్రీ స్వామివారి దర్శనార్థము బయలుదేరి, మొదటి గోపురమును జేరునప్పటికి కొంత ప్రయాణము కాలినడకను సాగింపవలసి వచ్చుటచే సహజ శరీర పటుత్వము సన్నగిల నలఁతులగుదురు. దర్పమడఁగును. ప్రాపంచిక విషయములకు స్వస్తిఁ జెప్పితిననియు, నీచోత్తమ భావముల దొలఁగించుకొంటిననియు, యాత్రికులు ప్రమాణము సేయవలసిన స్థానమిది. 'అవును పరిశుద్ధుఁడనైతిని. దైవ దర్శనమున కర్హుఁడను' అని నిర్ణయించుకొనుటకు నిదర్శనముగ శ్రీ స్వామివారి పాదరక్ష నొకదానిని నెత్తియందుఁ దాల్పవలయును. తరువాత ఏడుకొండలు శ్రమించి దాటుకొనవలయును. ఆలయము జేరిన యనంతరము శ్రీ వేంకటేశ్వర దర్శనార్థమునకు పూర్వము శిరోజముల దీయించుకొనవలయును. దానితో గర్వాదులు దూరమై నిర్మల హృదయులమైతిమనియు, ఇఁక పాపములఁ జేయమనియు, యాత్రికులు విశుద్ధమతులగుదురు.

పై విధులు ప్రకృత మనుసరింపఁ బడుచున్నను యాత్రికులు యదార్థమును గుర్తించుట లేదు. పైపెచ్చు సత్యము తాండవ మాడవలసిన చోట, అసత్యము వ్యాపించుట శోచనీయము. దొంగలిందు పెక్కుర వశించుచున్నారు. యాత్రికులగు ధనికులను వంచించి, వారి ధనమును హరించుచున్నారు. వీరికి నాయకులు గలరు. శ్యామలరావా నాయకులలో నొక్కనికి కొంత ధన మొసఁగి, రహస్యముగ నున్న యొక గృహము నద్దెకు తీసికొని యందు జానకిని వసింపఁ జేసెను.

ఆ గృహము దేవస్థానమున కుత్తర భాగమున గల లోయ నానుకొని యున్నది. అయ్యది చిన్నది యయ్యును మిక్కిలి రామణీయకముగ నిర్మింపఁ బడియున్నది. ఉత్తర దిశయందు గల లోయయు నందలి ప్రకృతి విలాసములను దిలకించుటకు మధ్యగదియందు నేలకు మూఁడడుగుల యెత్తున రెండడుగులు వెడల్పును, ఐదడుగుల యెత్తును గల ఒక వాతాయనము నిర్మింపఁబడి యున్నది. అద్దానికి కిటికీలు లేవు. గదియందు నిలుచుండి వన సౌందర్యమును విలోకింప వచ్చును. విశ్రమించుట కుపయోగపడుచుండుట ఈ గదియందొక పడక ఒకవైపునను, మఱియొకటి రెండవవైపునను గలవు. ఒక పడక నానుకొని ఒక వాలుకుర్చీ వేయబడి యున్నది. ఈ గది కిరుపార్శ్వముల రెండు చిన్నగదులు గలవు. ఒకటి వంటఁ జేసికొనుటకు, మఱియొకటి స్నాన మొనరించుటకు ఉపయోగపడుచున్నవి. భోజనానంతరము జానకి ఈ గది ప్రవేశించి, వాతాయనముఖమున వనరామణీయతను గాంచి వినుగున వెనుకకు మఱలి వాలుకుర్చీయందాసీనయై, ఇట్లు తలంపఁగడంగెను. 'చంద్రశేఖరా! మనమ్మ రమ్మని, నీ వెందు డాగియుంటివి. శ్యామలుఁ డిదిగో వచ్చునని నన్నీ గదియందుంచి, తా నెచ్చటికో నేగెను. బహుశా నిన్ను తోడితెచ్చుటకే యేగి కాబోలు. ఇప్పుడు నాల్గు గంటలు కావచ్చుచున్నది. నీ విఁకను రాలేదు. నీ వియోగము నే నెట్లు భరింతును' అని లేచి, వాతాయనము చెంత కేగి, వన విలాసముపై దృష్టి సారించి, 'ఆహా! కమ్మని ఈ మందమారుతము మనోహరుఁడగు చంద్రశేఖరుఁడు లేమి, శాంతమునకుమారు వెగటు గలిగించుచున్నది' అని వెనుదిరిగి పడకపైఁ గూర్చుండెను. ఇంతలో శ్యామలుఁ డా గది ప్రవేశించి, వాలుకుర్చీయం దాసీనుఁ

దయ్యెను. చంద్రశేఖరుఁడు తోడరానందున జానకి శంకించి, యిట్లు ప్రసంగింపఁ దొడఁగెను,

జానకి.— 'సోదరా! చంద్రశేఖరుఁడు మనల నిటకు రమ్మని తానేమయ్యెను.'

శ్యామ.— 'జానకీ! పోలీసులు వెంటాడుట పగటిపూట తలఁ జూపలేక యెందేని దాగియుండును. బహుశా చీఁకటి పడిన పిదప వచ్చును.'

జానకి.— 'మన మిందుండుట దాతనికి దెలియునా?'

శ్యామ.— 'తెలియకేమి— తానే గదా! ఈ గది నిర్ణయించినది.'

జానకి.— 'అయిన నిన్ని దినములుగా నాతనికి రా వీలు పడలేదా! మీరు వెళ్ళి యాతని దోడ్కొని రండు.'

శ్యామ.— 'పోవుదును. కాని జానకీ! నా దొక్క మాట.'

జానకి.— 'ఏమిటది!'

శ్యామ.— 'నీవు నన్ను సోదరా యని పిలుచుట తగదు.'

జానకి.— 'మఱి యేమని పిలువమందువు?'

శ్యామ.— 'మా పూర్వులు, మీ పూర్వులతో వియ్యము నందుకొని యుండువారగుట నేను నీకు బావ నగుదును.'

జానకి.— 'అట్లని ముందే చెప్పియున్న తద్విధముగనే సంబోధించి యుందును. ఏల జెప్పవైతివి?'

శ్యామ.— 'వీలు దొరకనందున జెప్పనైతిని. ఇపుడు మన మిర్వురమే యుండుటచేత మున దెల్పితిని.'

జానకి.— 'అటులనే పిల్చెదను. పోయి చంద్రశేఖరుని తోడ్కొని రండు.'

శ్యామలుఁడీ మాటల కలరి యిల్లు వీడెను. కాని యేమి చేయుటకు తనకు స్ఫురింపలేదు. ఒక మారును మొదల గూర్చుండి తల గోకికొను చుండెను. శ్యామలుఁడు పలహా గొని పనిచేయ సమర్థుఁడేగాని, స్వయముగా నొనరింప నాలోచన తట్టదు. రుక్మిణి శ్యామలుని యుత్తరము ననుసరించి వెంటనే స్వగ్రామము నుండి బయలుదేరిన దగుట, అచ్చటికి నాఁటి సాయంత్రమునకు జేరుకొనెను. చెట్లమఱుగున నుండి యరుదెంచు రుక్మిణి, నీలమేఘముల చాటుననుండి వెలువడు చంద్రబింబమువడువున గన్పట్టుచుండెను. శ్యామలుఁడు సంభ్రమమున జూచుచుండెను. అంతలో రుక్మిణి సమీపమునకు వచ్చి నిలుచుండెను. శ్యామలుఁడు కుశలప్రశ్న మొనరించి, పాదపక్రిందికి కూర్చుండ నియోగించెను. తదుపరి వారిట్లు సంభాషింపఁ దొడంగిరి.

శ్యామ.— 'రుక్మిణీ! జానకిని యేకాంతగృహమున బంధింపఁ గల్గితిని కాని, సాహసించి యామెను నన్ను పెండ్లాడుమని కోరలేక యుంటిని.'

రుక్మి.— 'చంద్రశేఖరుని జంప సాహసించినవాఁడవు, ఒక్క స్త్రీని లోబరచుకొనలేకుండుట వింతగా నున్నది.'

శ్యామ.— "లోబరచుకొనలేక కాదు, జానకి శీలత్వమును శంకించుచున్నాను."

రుక్మి.— 'అయిన జానకి చంద్రశేఖరునికి లోబడియుండు ననియా నీ యనుమానము.'

శ్యామ.— "అవును."

రుక్మి.— "అయినచో, నేను చంద్రశేఖరుని వేషమున జానకిని పరీక్షింతును. నీవు ప్రక్కన దాగియుండి గమనించుము."

శ్యామ.— 'సోదరీ! నీవు మంచి యెత్తుగడ జేసితివి. ఇద్దాని వలన జానకి శీలత్వమునకు కళంక మేర్పడదేని బలవంతముచేతనైనను ఆమె నుద్వాహమాడుదును.'

రుక్మి.— "మంచిది. ఇప్పుడే చీకటి పడుచున్నది. మన తెరచాటు నాటకమునకు తగిన సమయ మిదియే. రమ్ము, కార్యమున కుపక్రమింతము" అని వంటగదిలోనికి బోయిరి.

జానకి చీకటి బడుకొలఁది చకోరము చంద్రుని రాకకై ఁ దపించునట్లు చంద్రశేఖరుఁడు రామి భయవిహ్వలయు, దుఃఖమానసయు నగుచుండెను. ఇంతలో చంద్రశేఖరుఁడు ప్రవేశించెను. జానకి యాతురతతో నెదురేగి 'రండి, రండి, మీరాక కెదురుజూచుచు నా కండ్లు వాచిపోయినవి. ఇంత జాగు సేయుట మీకు తగునా? నా యెడబాటు మీకు దుఃఖమును కలిగింపలేదు కాబోలు' అనుచుండ, మాయా చంద్రశేఖరుఁడు, చంద్రశేఖరుని గొంతు వెట్టి, 'జానకీ! నీ యెడబాటు నాకసిధారావ్రతముగా నుండినది. పోలీసులు వెంబడించుటఁ జేసి యిన్నిదినములు నిగూఢముగా ప్రవర్తించి, నేఁటికి వారి దృష్టికి లొంగెడకుఁ బోవుటచే రాగల్గితిని. నా యపరాధమును సైరింపుము.'

జానకి.— 'మహాశయా! ఇందుకూర్చుండుడు. భోజనము సేయుదురా!'

మా. చం.— 'అక్కరలేదు. భుజించి వచ్చితిని; కాని జానకీ! ఇన్నిదినముల నిగూఢవర్తనముచే బడలియున్నాను. కొంచము పాదములు పట్టుదువా?'

జానకి.— 'ఆర్యా! మీరేనా మాటలాడునది? (స్వగతమున) ఓహో! అలసట జెందినవారగుట శబలత యావహించె కాబోలు. (ప్రకాశముగ) ఆర్యా! అట్టి సపర్య కేనింకను నోచుకొన లేదు. ఏనాఁడు నేను తమ యర్ధాంగి నగుదునో నాఁడు సపర్యలేమి, తమ యిచ్చవచ్చినరీతి ప్రవర్తింతును.'

మా. చం.— 'జానకీ! ఇదియేనా నీకు నాయెడ గల ప్రేమకు గుర్తు. నీవే నా యారవ ప్రాణమని నమ్మి నిన్నింటనుండి యిట తోడ్కొని వచ్చితిని. కష్టకాలమున లేని సపర్య తరువాత యెందులకు? మెడలో మూఁడు ముళ్ళు పడినంత మాత్రమున యొఱిగిన దేమున్నది? మనసులు కలిసిన చాలదా?'

జానకి.— 'చంద్రశేఖరా! నీవు పూర్తిగా మారినట్లున్నది?'

మా. చం.— "జానకీ! మారుట కేమున్నది. ఇన్నిదినములుగా నీ యాలింగన చుంబనాది సుఖముల నభిలషించియేగదా నేను నిన్ను ప్రేమించుట. ఏదీ! ఒక ముద్దుపెట్టుము."

జానకి.— (వెనుకకు తగి) 'ప్రేమించితిని, త్రికరణశుద్ధిగా నిన్నే ప్రేమించితిని. కాని దైవసాక్షికముగా మనము వివాహము చేసికొనలేదు. దేవతలకును, ధర్మమునకును, విరుద్ధమైన యధర్మము నాచరించి, నా శీలమును చెరుపుకొన జాలను. రేపే మన వివాహ ప్రయత్నము సేయుదము. తొందర యేల?'

మా. చం.— 'జానకీ! నీవు పాశ్చాత్య విద్యావైదుష్యము గలదానవయ్యును పూర్వాచారపరాయణవువోలె మాటలాడుట నే సహింపజాలను. రమ్ము, యాలింగనసుఖ మిచ్చినగాని నే మనజాలను' అని లేచి కౌగిలించుకొన బోవును. జానకి గవ్వున వెలుపలి కేగబోవ, శ్యామలుడు వాకిట కడ్డముగ నిలుచుండి "ఆగుమాగుము. నీ చంద్రశేఖరుని యభిమత మీడేర్చుము."

జానకి.— 'సోదరా! కాదు-కాదు, బావగారు! మీరైన చంద్రశేఖరునకు హితబోధ యొనర్పుడు' అని వెనుదిరిగి చూచునరికి వేషముం దొలగించిన రుక్మిణి కనుబడెను. జానకి నివ్వెరబోయి చూచుచుండెను. రుక్మిణి సమీపించి, "జానకీ! భయపడకుము. నేను నీ నెచ్చెలిని రుక్మిణిని" అని పకపక నవ్వెను. జానకి మండిపడి కోపముతో 'ఈ కపట నాటకము ప్రదర్శించి, నన్ను బాధపెట్టుటవలన నీ కేమి లాభము.'

రుక్మి.— 'జానకీ! బాధపెట్టుట నా యుద్దేశ్యముగాదు. నీ శీలత్వమును బరీక్షించినది నిన్ను నా వదినం జేసికొనుటకు.'

జానకి.— 'అనఁగా.'

రుక్మి.— 'ఏమున్నది. ఇడిగో ఈ సుందర విగ్రహుండు నా సోదరుఁడు, నీ మగఁడు కాబోవువాఁడు.'

జానకి.— 'ఛీ! ఏమనుచుంటివి? నీ సోదరుఁడు నాకు మగఁడు కానున్నాడనియా! అది కలలోని వార్త. ఎన్నటికిని జరుగదు. చంద్రశేఖరుని ప్రేమించిన నేను అన్యుల ప్రేమింపఁ జాలను.'

శ్యామ.— 'సోదరీ! జానకి యెందుబోగలదు. తప్పక నన్ను పెండ్లియాడును. ఆమె తండ్రి ప్రచురించిన వార్త చదువుము' అనియెను. రుక్మిణి పత్రిక నొకదానిని దీసి, దీపము వెలుఁగున నిట్లు చదివెను.

'రుక్మిణీ! నీవు శ్యామలుని వివాహమాడుట మాకు సమ్మతము. మీరుభయులు, ఏ ప్రదేశము నందున్నను వెంటనే బయలుదేరి రావలయును. మీ యాగమనమునకై ఎదురు చూచుచున్నాము.' లక్ష్మణరావు — కంచి.

జానకి యద్దానిని విని 'నా తండ్రి యభిమతముతో నాకు బనిలేదు. నేను చంద్రశేఖరుని నా హృదయాధి నాథునిగాఁ జేసికొంటిని' అనియెను. అందులకు శ్యామలుఁడు కనిసి, 'చంద్రశేఖరుఁడు, చంద్రశేఖరుఁడని కలవరించెద వేల? అతఁడు శూద్రుడు. నేను నీ కులమువాఁడను. నన్ను చేపట్టక ఏమేమో ప్రేలుచున్నావు. నీవు నా బారినుండి తప్పించుకొని పోగలవా?'

జానకి.— 'కులములు మానవ కల్పితములు. వాటితో నాకు బనిలేదు. నేను ప్రేమించినది చంద్రశేఖరుని. అతఁడే వచ్చి నన్ను దోడ్కొని పోవును.'

రుక్మి.— 'చచ్చినవాఁడు బ్రతికిననాఁడు నీవు సుమంగళి వగుదు వేమో!'

శ్యామ.— 'చంద్రశేఖరుఁ డింకను బ్రతికి యున్నాడనియే భ్రమపడుచున్నది పాపము!'

జానకి.— 'అయితే నానాథుఁడు సజీవుఁడు గాడా!'

శ్యామ.— 'జానకీ! నీ ప్రేమ నభిలషించినవాఁడ నగుట చంద్రగిరికోటం జూడబోయిననాడే అతని జంపివైచితిని. ఇఁక నీవు నా బాహుబంధముల సుఖింపుము' అని సాచిన బాహుద్వయముతో ముందుకు నడువ జొచ్చెను. జానకికి చంద్రశేఖరుడు మరణించెనను వార్త పిడుగుపడినట్లయ్యెను. ఇఁక బ్రతికి ప్రయోజనము లేదని నిశ్చయించుకొనెను; కాని, శీలమును రక్షించుకొనుమార్గము దోపలేదు. శ్యామలుఁడు రోష కషాయిత నేత్రములతో, బలవంతపరుచు నుద్దేశ్యముతో ముందునకు వచ్చుచున్నాడు. నల్దిశలు పరికించెను. వాకిట భూతమువలె రుక్మిణి నిలచి యున్నది. ఏమి చేయుట! గోడవైపు దృష్టి బోయినది. వెంటనే చేయవలసిన పని బుద్ధిలో మెరపు-వలె మెరసినది. రెండంగలు వేసి మూడవ యంగకు, ఒక్క గంతున కిటికీపై నిలిచి, 'శ్యామలా! నీవు దుర్బుద్ధివై నా మనోహరుని నీపొట్ట బెట్టుకొని, నన్ను పొందదలంచితివి. జానకి తన నిశ్చయమును మార్చుకొనని దృఢ సంకల్పయని నీ వెఱుఁగజాలవైతివి. చంద్రశేఖరుఁడు శరీర విహీనుఁడైనను, నా హృదయాంతరాళమున భాసిలుచున్నాడు. దివ్యశరీరధారియై నాకొరకీ క్రింది లోయలో నెదురు జూచుచున్నాడు. ఇదే నే నాతని జేరుటకై బోవుచున్నా' నని కిటికీనుండి లోయలో దూకెను. శ్యామలరావు, రుక్మిణీలు 'ఆ! యని ఒక్కపెట్టున కిటికీ జేరి క్రిందికి జూచిరి. జానకి కొండశిఖరమునుండి క్రిందకుబడు గాయివోలె క్రిందు మీందులుగాఁ దిరుగుచు అదృశ్య మయ్యెను. రుక్మిణి భయభ్రాంత యయ్యెను. శ్యామలుఁడు 'హా! జానకీ! జానకీ! నీ కింత సాహసము దగునా! అయ్యో! అయ్యో! నిన్ను జూడకున్న నే నెట్లు జీవింతును' అని గోడకు తల మోదుకొన జొచ్చెను. రుక్మిణి 'అన్నయ్యా! అన్నయ్యా! నీకేమి మతిపోయినదా? బెంగబెట్టుకొనకుము' అని యాతని నివారింపఁ జూచెను. శ్యామలుఁడు చుఱుకున రుక్మిణిని జూచి, 'ఛీ! దుర్మార్గురాలా! నీ మూలమున నా జానకిని గోలుపోయితిని. బ్రతికియుండిన, ఆమె మీపైనను జూచి సంతసించువాఁడనే. అయ్యో! జానకీ! జానకీ! నన్ను విడనాడి పోతివా! జానకీ! జానకీ!' అనుచు గృహమునుండి విసరివేసిన రాయివోలె బైటంబడి యడవిలో నదృశ్యుఁ డయ్యెను.

(౧-వ ప్రకరణము సమాప్తము.)

గ్రంథ విమర్శనము:

# అమరసింహచరిత్రము.

(కవిసామ్రాట్టు శ్రీ. విశ్వనాథ సత్యనారాయణగారు,
ఎం. ఏ., ఎల్. టి.)

ఇది కవిసార్వభౌమ రాజశేఖర శతావధానిగారు రచించిన మఱియొక పద్యకావ్యము. ప్రబంధములకు ప్రబంధలకు కీర్తి ప్రతిష్ఠలకు ఉదాత్తనాయక వర్ణనము ముఖ్యమని పూర్వుల యభిప్రాయము. కొందఱు కవుల మనస్సే యుదాత్తనాయకాభిముఖమై యుండును. వారిలో రాజశేఖర శతావధానిగారొకరు. వారి రాజపుత్రకథాభిమానము ప్రతిష్ఠకోసము మలచుకొన్నది కాదు. ఇది వారితో పుట్టిన గుణము. ఈ విషయము వారు రచించిన 'ప్రతాపసింహచరిత్ర', 'ప్రభావతి' మొదలైన పద్యకావ్యములే ఋజువు చేయును.

ఇప్పుడిది యొక క్రొత్త కావ్యము. ఈ అమరసింహుడు స్వాతంత్ర్యముయొక్క ప్రమాకారమైన ప్రతాపసింహుని కుమారుడు. ఇది యొక విచిత్రమైన కథ. ప్రతాపుని తరువాత పదియేండ్లు యుద్ధములు లేవు. అమరసింహుడు కాంతాలోలుడై, తండ్రినే మఱచిపోయెను. తనకు దైవస్వరూపుడైన సలుంబ్రా కృష్ణసింహుని 'ద్రోహి' యనెను. ఆ వృద్ధసింహము సభలోని కమరసింహుని మెడబట్టుకొని గెంటుకొని వచ్చెను. అమరసింహుడు పశ్చాత్తప్తుడై తండ్రియొక్క చరిత్రను చివరివఱ కనుసరించెను. ఆశ్చర్యకరమైన విషయ మేమనగా నమరసింహుడు తాను సన్యసించువఱకు, కృష్ణభూపతి చేసిన యీ యవమానమును కలలోగూడ భావించ లేదు.

అమరసింహుడు మహా ప్రతాపశాలి. ఆహా! సంపద యెట్టిది! ఇంత మహానుభావుడైన అమరసింహుని మోహములో ముంచివైచినది. పురాణకథ లిట్లు మహా విషయములను బోధించునవిగా నుండును. ఈ దివ్యమైన తాత్పర్యమును బోధించు నట్టి కథను రాజశేఖర శతావధానిగారు రచించిరి. ఈ విషయమున నీయన యొక ఋషివంటివాడని చెప్పవలెను.

కథారంభము మోహము — కథాంతమందు సన్యాసము —— ఈ కథా నిర్మాణవైఖరియే చమత్కారముగా నున్నది. ఆ మోహముననే సన్యాసము ఫలితమా! తరువాత మహారాణా చక్రవర్తి (చిన్నప్పుడు ఖుర్రమ్)— ఈ ఖుర్రము మెంత సత్పురుషుడు. అతని కమరసింహునియం దెంతటి గౌరవము. ఈ గౌరవమే అమరసింహుని రాజపుత్రునిచావు చావనీలేదు. ఈ చరిత్రమును రాజపుత్రులయొక్క స్వాతంత్ర్యపు కథగా మిగులనీయలేదు.

రాజశేఖర శతావధానిగారు కాకలుదీఱిన కవిగండడు. మా మిత్రు డొకడన్నట్లు కొందఱు అర్ణవాభికవు లుందురు. సాలెపురుగు తనలో నుండి దారము లెట్లు తీయునో, కొందఱు కవులు తమలో నుండి పద్యముల నట్లు తీయుదురు. కూచిమంచి తిమ్మకవి — తిక్కన — మద్దురువర్యులు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు —— వీరందఱట్టి కవులు. పద్యరచన వారితో పుట్టిన విద్య. శ్రీ. రాజశేఖర శతావధానిగారీ రాశిలోనివారు. ఒకరియందు కవితా గుణము అధికముగా నుండుట, మఱియొకరియందు లేకపోవుటయు ననునది వేఱే విషయము. కాని పద్యరచన యొక పాకములో సాగుట, యాద్యంతములు దానియందున్న యొక నిత్యస్థితికి భంగము లేకుండుట, వేలకొలది పద్యములు వ్రాసినను, మొదటి పద్యము లెట్లుండునో చివరి పద్యము లట్లుండుట —— ఇది యొక చమత్కారమైన లక్షణము. ఈ కవి పద్యము వ్రాయుటకు కష్టపడెనన్న సూచనయు నెచ్చట కన్పించదు. ఇతర మహాకవులున్నారు. వారియందా ప్రయత్నము గోచరించును. వీరియందా ప్రయత్నపు జాడయు గన్పించదు. ఈ జాతి కవు లందఱకు రచనలో నొక విశిష్టమైన గుణముండును. ఒక పరిస్థితి దీసికొన్నచో - తదనుబంధి భావపరంపర పుంఖానుపుంఖముగా త్రవ్వుకొని వచ్చుచుండును. అట్టితరు లూహించ లేరు. వ్రాయలేరు. ఈ గుణమే ముందుచెప్పిన పద్య రచనా లక్షణమునకు మిక్కిలి సహాయకారి.

ఈ ప్రధాన గుణ మిట్లుండగా నీకావ్యమునం దనేకమైన కవితాగుణము లున్నవి. ఒక సిద్ధహస్తుడు వ్రాసినప్పుడెందుకుండవు! రెండు మూడు విశేషములు చూపించి వదలెదను. సంస్థాపనయన్న ఖండములో వర్షవర్ణనమున్నది. ఈ వర్ణనము చదివినచో, నెంత స్వభావసిద్ధముగ నున్నదో తెలియును. రెండవది సంవర్తమన్న ఖండములో వందిసలుంబ్రా రాజులను స్తోత్రము చేయును. తెలుగును సంస్కృతమును గలిపి మణిప్రవాళశయ్యలో రచింపబడినవి. వందిస్తోత్రము లకీ శయ్యాపెట్టులు చాల రమ్యముగ నున్నది. ఈ కవి నిలిచి వ్రాసినచో, 'నాచన సోమన' వంటి మహాకవి యయ్యెడువాడు. ఈ పద్యమును చూడుడు:

ఒక గరుడపక్షికి, నొక కూర్మమునకు చెలిమి. ఈ తాబేలు గరుడపక్షితో 'నన్ను మింటికి గొనిపోయి వదలుము. అచ్చటినుండి నే నెగిరెద' నని యన్నది. ఇది గరుడి సమాధానము.

చ॥ "మనుగడ యెట్టులో గనిన మాంసపుముద్దవు! కాళ్లు లేవు! వీ
పునమొక యున్న బాణలిని బోలిన నల్లని పెద్ద చిప్ప! లో
చనములు గూడ చిన్నవి! విశాలపతత్రములున్నమే మె యొ
య్యన గతి యుగాడ నోడెదు మహాంబరయానము నీకసాధ్య
మే!

మాంసపుముద్ద — యున్న బాణలిని బోలిన నల్లని పెద్దచిప్ప — ఇవి ప్రౌఢమైన పలుకుబళ్లు! అనగా కవి తనయొక్క యూహనుండి కలిపించి, వస్తుస్వరూపము గోచరింపజేయును

కావ్యత్వమును భాసింపజేయుచు, నౌచిత్యమును చెడకుండ తద్గత రస భావ సంవాదము వలనే మనః ఫలమునకు కలిగించు నట్టి యొక విలక్షణమైన రచన.

ఈ కావ్యమునందు మఱియొక సొగసున్నది. ఇది యొక సమ్యక్కృతి యని భాసింపజేయుటకు దీనియందున్న యాశ్వాసము లన్నియు సంబోధము— సంప్రార్థన— సన్నాహము— సంస్థాపన— సంబంధము— సంవర్తము— సంత్యాగము— సంయోగము— సంభావన— సంఘర్షము— సంధ్య యన్న పేర్లతో కవి వెలయించెను. ఇదియు నొక చమత్కారమే! కవి గారికి షష్ఠిపూర్తియైనది. ఇదియే తమ చివరి కృతి యన్నట్లు వ్రాసినారు. పాపము శాంతించుగాక — వీరింకను కృతులు వ్రాయుదురు గాక.

ప్రజాభిప్రాయ వేదిక :—

## ఇంట గెలిచి—రచ్చ గెలువవలెను.

### —శ్రీ. పి. రమణారెడ్డిగారే ఆదర్శము.—

ఆర్యా,

మన దేశము 7 లక్షల పల్లెప్రాంతములతో విలసిల్లుచున్నది. మన పల్లెలలో అనాగరికత, అనారోగ్యము ప్రబలియున్నవి. నాడు 'రామం భజే' అనుటకు నేడు 'గ్రామం భజే' అని అందరు అనినారు. గ్రామాభివృద్ధికి పునాది కావలెనన్న మన్నూరు కోట మంటపంపల్లె ఆదర్శమని చెప్పక తప్పదు. అన్ని విధములైన కోఆపరేటివ్ సొసైటీలు— తపాలాఫీసు— వైద్యాలయము— ప్రసూతి కార్యాలయము— విశాలవంతమై, ఆరోగ్యకరమైనగాలి వచ్చు విద్యాలయము— రహదారులు— మున్నగు సదుపాయములతో విలసిల్లుచున్న మంటపంపల్లె గ్రామమునకు ఇవి అన్నియు గ్రామ సౌకర్యములే. కూలీలకు పనికల్పించుటయు, వస్తుపరికరములు ప్రజలకు అందుబాటులో న్యాయమైన ధరలకు లభించుటకును వీలుకలుగ జేసిన కృషి శ్రీ. పి. రమణారెడ్డిగారిదే నని భావింపబడుచున్నది. ఇటులనే గ్రామములలో గ్రామసేవకులు తయారు కావలెనని కోరుచూ, శ్రీ. పి. రమణారెడ్డిగారిని అభినందించు చున్నాము.

బద్వేలు. మన్నెము సుబ్బారెడ్డి.

## రాయలసీమ గ్రామోద్యోగుల సంఘము.

ఆర్యా,

'తమకొరకు ఉద్యోగమా — ఉద్యోగముకొరకు తామా' అను ప్రశ్నను చర్చించి తేల్చుకొని, చట్టబద్ధమైన చర్య గైకొనుటకు రాయలసీమ గ్రామోద్యోగులు సెప్టెంబరు 9-వ తేదీ కడపటవునులో ఒక సభ జరుపదలచి యున్నారు. ఆ సభకు రిటైర్డు జిల్లాజడ్జిగారైన శ్రీ. తాడిపత్రి భుజంగరావు పంతులుగారు అధ్యక్షత వహించెదరు. కె. ఎల్లప్పశర్మ.

# రాబోవు ఎన్నికలు—హెచ్చరిక.

రాబోవు ఎన్నికలలో, కాంగ్రెసుపార్టీ పక్షమున, రాష్ట్ర శాసనసభలకు అభ్యర్థులుగా నిలిచి, పోటీచేయదలచువారు రు. 100/- దరఖాస్తు రుసుముగా చెల్లింపవలెను. ఇండియా పార్లమెంటు సభకు నిలువదలచినవారు రు. 250/- చెల్లింపవలెను. హరిజనులు, షెడ్యూలుట్రయిబువారలు రు. 50/- చెల్లింపవలెను. దరఖాస్తుఫారములు జిల్లా కాంగ్రెసు కార్యాలయమందును, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమందును చిక్కును. సెప్టెంబరు 15-వ తేదీ లోగా దరఖాస్తులు, రుసుము ఆం॥రా॥ కాంగ్రెసు కార్యాలయము (విజయవాడ) చేరవలెను.

# సవరణ.

ఆగష్టు నెల 22-వ తేదీ ప్రకటింపబడిన 'భారతి జ్యోతి' పత్రికలో 4-వ పేజీలో 'కాంగ్రెసును రద్దుచేయుడు' అను శీర్షిక క్రింద ప్రకటింపబడిన వ్యాసములో 5-వ పంక్తిలో 'పరిపాలనా బాధ్యత నశించెనో' అను పదములు అచ్చు పొరబాటువలన పడినవి. వానిని 'పరిపాలనా బాధ్యత వహించెనో' అని పాఠకులు చదువుకొన ప్రార్థితులు.

మేనేజరు.



భారతదేశమును రాజకీయముగను, సాంఘికముగను, ఆర్థికముగను, అభివృద్ధిచేయుటకు కాంగ్రెసు సంస్థకు ఇంకను పనియున్నది:— శ్రీ. జవహరిలాల్ నెహ్రూ.

రాబోవు ఎన్నికలలో

మీ ఓట్లను

కాంగ్రెసు అభ్యర్థులకే ఇవ్వవలెనని

ప్రార్థించుచున్నాము.

టి. పుల్లారెడ్డి, బి. ఏ., బి. ఎల్.,

పి. రమణారెడ్డి, బి. ఏ.,

రహింతుల్లా సాహెబ్.

Space Donated — Advertisement: E. No.1.

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah. for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE

రాజకీయ వార పత్రిక.

REGISTERED No. M. 5285.

# భారత జ్యోతి

సంపాదకులు:— సి. రామకృష్ణ, బి.ఏ.,

సంపుటము 4.
సంచిక—29.

బుధవారము [illegible]బరు 12, 1951.

ప్రతి బుధవారము
వెలువడును.

## విషయానుక్రమణిక



——:(o):——

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 29. | శ్రీ ఖరనామ సంవత్సర భాద్రపద శు. ౧౧, సెప్టెంబరు, 12, 1951. | ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## పత్రికా స్వాతంత్ర్యములు ఎండమావులు.

పండిత జవహరిలాలు నెహురుగారును. శ్రీ. రాజగోపాలాచార్యులవారును, పత్రికా స్వాతంత్ర్యములను కాపాడుటలో ఇద్దరు రెండు బలిష్ఠములైన స్తంభములుగ దేశము పరిగణించుచుండెను. వీరిద్దరును పత్రికారచయితలే. అందులో శ్రీ. రాజగోపాలాచార్యులవారు గాంధిజీచే నిర్వహింపబడుచుండిన "యంగు ఇండియా" పత్రికకు కొంతకాలము సంపాదకత్వము వహించి యుండిరి. అధికారము చేతిలో లేనప్పుడు ఎవ్వరైనను ఎన్ని శ్రీరంగనీతులైనను చెప్పవచ్చును. ఇతరులనెంతగనైనను తూలనాడి విమర్శింపవచ్చును. అధికారము చేతిలోనికి వచ్చినప్పుడు అట్టివారు విమర్శలకు, తావివ్వక మెలగినప్పుడుకదా సరియైన ధీరులనియు, తగుమైన నాయకులనియు భావింపబడుదురు. ప్రజల గౌరవాదరణలకు పాత్రులయ్యెదరు.

స్వాతంత్ర్య భావములకంతయు పునాదిరాయి అని ఖ్యాతికి వచ్చిన శ్రీ. జవహరిలాలు నెహురుగారు అ న వ స ర ము గా, ఇండియా రాజ్యాంగ చట్టములో మానవ ప్రాథమిక హక్కులకు హామీ యొసగిన 19 (2) సూత్రమును సవరించి, వాక్స్వాతంత్ర్యమును, భావ స్వాతంత్ర్యమును, స్వతంత్ర ఇండియాలో చేతులార భగ్న మొనర్చిరి. బూడిదెపాలు చేసిరి. తమ కీర్తికే శాశ్వతమైన మచ్చను తెచ్చుకొనిరి.

నూతన ఎన్నికలు జ రు గు లో ప ల నే శ్రీ. రాజగోపాలాచార్యులవారు హోముశాఖ మంత్రిపదవి నలంకరించెదరని ఎవ్వరు కలలోనైనను తలంపలేదు. దేశ దౌర్భాగ్యమువలన సర్దారు పటేలు అదృశ్యమగుటయు, ఆయన స్థానమునకు తలవని తలంపుగ శ్రీ. రాజగోపాలాచార్యులను వేయుటయు తటస్థించెను. వీరు ఏదో ఒక నూతన పత్రికా శాసనమును తయారు చేయుదురనియు; దానివల్ల రాజ్యాంగ చట్టములోని 19 (2) సూత్రమును సవరించుటచేత వాక్స్వాతంత్ర్యముపైనను, భావ స్వాతంత్ర్యముపైనను, పత్రికా స్వాతంత్ర్యముపైనను ఏర్పడిన విషమ ప్రమాదములు తొలగింప బడుననియు భావింప బడెను. కాని నూతన పత్రికా బిల్లు ప్రకటింప బడగనే ఆ యాశలన్నియు అడియాశలైనవి. శ్రీ. రాజగోపాలాచార్యులవారికి ఇండియా యూనియన్ హోముశాఖ మంత్రిపదవి శాశ్వతమైనను, కాకపోయినను, పత్రికాస్వాతంత్ర్యమునకు మాత్రము మహాపచార మొనర్చిన వారని మాత్రము వీరి పేరు పత్రికా ప్రపంచములో చిరస్థాయిగ నిలుచును. ఇప్పుడు ప్రకటింపబడిన పత్రికల బిల్లును చూచిన శ్రీ. జవహరిలాలుగారును, శ్రీ. రాజగోపాలాచార్యులుగారును తమ అధికార పదవులను స్వాతంత్ర్యభావముల అభివృద్ధికై వినియోగింపక స్వాతంత్ర్య భావములను ఈ నూతన ప్రజాస్వామిక దేశములో వ్రేళ్ళతోకూడ పెరికి వేయుటకే వినియోగించుచున్నారని స్పష్టమగును. శ్రీ. రాజగోపాలాచార్యులవారి సలహాకే శ్రీ. జవహరిలాలు లోబడెనో, లేక శ్రీ. జవహరిలాలుగారి సలహాకే శ్రీ. రాజగోపాలాచార్యులుగారు లోబడి ఈ నూతన బిల్లును తయారుచేయించిరో చెప్పలేము. అది తెరలోని రహస్యము. కాని శ్రీ. రాజగోపాలా

యిట్టి ప్రతిఘాతమైన బిల్లును ప్రవేశపెట్టుటకు సాహసించి యుండురని మా అభిప్రాయము.

"పరిపాలనా క్రమమునకు (పబ్లిక్ ఆర్డరుకు) భంగము రాకుండుటకై వాక్స్వాతంత్ర్యముపైనను, భావస్వాతంత్ర్యము పైనను సహేతుకమైన హద్దులను ఏర్పరచుటకు పార్లమెంటుకు అధికారము కలుగ జేయుటయే రాజ్యాంగచట్టము 19 (2) సూత్రమునకు ఉపపాదించిన సవరణ తీర్మానము యొక్క ముఖ్యోద్దేశ్యము. అందులోని అధికారములను ఇప్పుడే చెలాయించు సంకల్పము ప్రభుత్వమునకు లేదు. ముందు కాలమందెప్పుడో అసాధారణ పరిస్థితులు ఏర్పడినచో, అట్టి సందర్భములో మాత్రము ఉపయోగించుట కనుకూలపడుటకై ఆ యధికారములు సవరణ తీర్మానములో చేర్పబడినవని ఆనాడు పార్లమెంటులో శ్రీ. జవహరిలాలు గారు దానిని విపరీతముగ సమర్థించుచు దీర్ఘోపన్యాసము గావించిరి. అప్పటి ముద్దువాక్కులు ఈ నాడేమైనవి? పత్రికలకు ముఋకులుగా క్రొత్త బిల్లు తయారైనది.

ఈ నూతన పత్రికల బిల్లుకు (ప్రెస్ బిల్లుకు) మూడవ సూత్రములో ఎంతటి విషమును చేర్పవలయునో అంతటి విషమును శ్రీ. రాజగోపాలాచార్యులవారు చేర్చియున్నారు. ఆ మూడవ సెక్షను ఈ బిల్లుయొక్క లక్ష్య నిర్వచన సూత్రము వలె నున్నది. ఈ బిల్లులో ప్రస్తుతము చేర్పబడిన నిర్బంధములన్నియు ఇదివఱకే ప్రభుత్వమువారు ప్రజాస్వాతంత్ర్యమునకు నిరోధముగా ఉపయోగించియే యున్నారు. అట్టి అధికారములను ప్రభుత్వము చెలాయించుట అశాస్త్రీయమని న్యాయస్థానములు తలపై నోరుపెట్టుకొని ఘోషించినవి. కాని ఎక్కడలేని తొందరతో శ్రీ. జవహరిలాలు ప్రభుత్వము రాజ్యాంగ చట్టమునే సవరించి, న్యాయస్థానముల నోరు మూయించినది. స్వాతంత్ర్య నిరోధమునకై అనుకూలించు అధికారములనే ఈ నూతన బిల్లుద్వార ప్రభుత్వములకు కలుగజేయ సమకట్టిరి.

(1) దౌర్జన్య చర్యలు చేయమనికాని లేక అట్టిచర్యలకు ప్రోత్సహించుటకాని లేక విధ్వంసక చర్యలచే ప్రభుత్వమును కూలద్రోయుటకు ప్రయత్నించుటకాని లేక దాని అధికారమును చులకనచేయుటకాని (2) హత్యలను కావించుటకు, విధ్వంసక చర్యలు చేయుటకు లేక దౌర్జన్యముతో కూడిన ఏలాటి నేరమునైనను చేయుటకు పూనుకొనమని చెప్పుటకాని లేక ప్రోత్సహించుటకాని; (3) న్యాయపరిపాలనలో జోక్యము కలిగించమనుటకు కాని లేక శాంతిభద్రతల కాపాడుటలో ప్రతిబంధకములు కలిగించుటకాని లేక కంట్రోళ్ళను నిర్వహించుటకై గావింపబడిన వివిధచట్టముల నిర్వాహణలో జోక్యము కలిగించుకొని నిరోధము కల్పించుటకాని (4) సైనికులకు, పోలీసువారికి గల దేశభక్తిని తొలగించి దేశద్రోహ చర్యలకు గడంగునటుల చేయుటకాని లేక వారు చేయవలసిన కార్యములను చేయవలదని ప్రోద్బలపఱచుటకాని, సైనికులుగా చేర్చుకొను కార్యములకు ప్రతిబంధకము కలిగించినకాని లేక వారి క్రమశిక్షణ తగ్గునటుల చేసినకాని (5) ప్రభుత్వోద్యోగిని అక్రమకార్యములను చేయమని బలత్కరించుటకాని లేకవిధ్యుక్తధర్మములు నెరవేర్చుటకు ప్రతిబంధకములు కలుగజేయుటకాని (6) వివిధ సంఘములమధ్య మతద్వేషములు రెచ్చగొట్టినకాని (7) ఏ వ్యక్తినికాని భయపెట్టి అక్రమకార్యములకు గడంగునటుల చేయుటకాని లేక తన వశములో నుండు ఆస్తిని ఇతరుల వశమున కొప్పగించునటుల చేయుటకాని (8) అసహ్యకరమైన లేక అమర్యాదకరమైన లేక దూషణకరమైన వ్రాతలు, భావములు ప్రకటించినచో ఈ ప్రెస్‌బిల్లు (పత్రికాశాసన బిల్లు) క్రింద నేరములని నిర్వచింపబడినది.

వీనిని చదివిన హిరణ్యకశిపుని వరములు జ్ఞాపకమున కొచ్చుచున్నవి. తపోఫలితముగ బ్రహ్మ ప్రత్యక్షము కాగా — గాలిలోగాని, భూమిలోగాని, అగ్నివల్లకాని, నీరువల్లకాని, ఆకాశములోకాని ఎనిమిది దిశలలోకాని, రాత్రి కాల

ముకాని, పగటికాలముకాని, వృక్షములవల్లకాని, జంతువులవల్లకాని మానవులవల్లకాని లేక సమస్త అస్త్ర శస్త్రముల వల్లకాని మృత్యువులేని జీవితమివ్వమని హిరణ్యకశిపుడు కోరెను. ఇటులనే పత్రికా స్వాతంత్ర్యమను పేరుక్రింద, క్రొత్త శాసనము ప్రవేశపెట్టుచున్నామను సాకుతో హిరణ్యకశిపుని వరములన్నియు ఆబిల్లులోచేర్చి శ్రీ. రాజగోపాలాచార్యులవారు పత్రికాసంపాదకులకు తమ కట్టకడపటి బహుమతిగా — సంకెళ్ల నొసగుచున్నారు. శ్రీ నృసింహమూర్తి మానవాతీతశక్తి కావున, బ్రహ్మదేవుడొసగిన అగ్నివరములను గౌరవించి, వానికి భిన్నముగా ప్రవర్తింపక దుష్టశిక్షణ మొనర్చెను. పత్రికా సంపాదకులు కేవలము మానవమాత్రులే కనుక, శ్రీ. రాజగోపాలాచార్యులవారు నూతన పత్రికల బిల్లులో, మూడవ సూత్రములో జొప్పించిన కత్తులనెల్ల తప్పించుకొని, నిర్భయముగ పత్రికా సంపాదక వృత్తిని నిర్వర్తింప జాలరు.

“శాంతి భద్రతల నిర్వాహణమునకు నిరోధము” (లా అండ్ ఆర్డరుకు నిరోధము) అను పదములను 3-వ సెక్షనులో 3-వ క్లాజుక్రింద చేర్చియున్నారు. శాంతి భద్రతల నిర్వాహణమను పదములలోగల అర్థము ఆకాశమంత విశాలమైనది. ఏ విమర్శనుకాని ఈ మాటలబంధములోనికి (వలయములోనికి) తీసుకురావచ్చును. ప్రభుత్వోద్యోగులు చేయు ప్రతి చర్యయు లా అండ్ ఆర్డరు నిర్వాహణమునకే అని అన్వయము చేయవచ్చును. వారి అధికార దుర్వినియోగమును గూర్చి విమర్శించినచో, అది లా అండ్ ఆర్డరు నిర్వాహణమును నిరోధించు వ్రాతలని చెప్పవచ్చును. పోలీసువారు కాల్పులు చేయవచ్చును. అత్యాచారములు గావింపవచ్చును. అవన్నియు శాంతి భద్రతల నిర్వాహణమునకే నని అందుకు సంబంధించిన ఉద్యోగులు సమర్థించుకొనవచ్చును. అట్టి సందర్భములలో పోలీసువారి చర్యలను విమర్శించుచు పత్రికలు వ్యాఖ్యానము గావించుచో, ఆ వ్యాఖ్యానము 3-వ సెక్షన్ 3-వ క్లాజును ధిక్కరించినటుల సంపాదకులపై నేరము మోపవచ్చును. అనవసరముగా ప్రజల సంఘస్వాతంత్ర్యమును నిరోధించుచు ఒక మేజస్ట్రీటు క్రి॥ప్రో॥కో॥ 144 సెక్షను ఒక ప్రదేశములో ప్రకటింపవచ్చును. సభలను, ఉత్సవములను నిషేధింప వచ్చును. అట్టి సందర్భములో మేజస్ట్రీటు చర్యను విమర్శించినచో అది 3-వ సెక్షన్ 3-వ క్లాజు క్రిందికి వచ్చును.

ఇదంతయు శాంతముగ చూచినచో బ్రిటీషు అధికారులకు భారతీయ పత్రికలపై అడుగడుగునకు ఎంతటి అనుమానములుండెనో అదే అనుమానము, అంతకన్న ఎక్కువ అనుమానము అధికారములోనున్న ఈ కాంగ్రెసు పార్టీనాయకుల నావరించినటుల స్పష్టమగుచున్నది. శాంతి భద్రతల నిర్వాహణకు ప్రతిబంధకమని చెప్పడము, ఉద్యోగులు తమ ఉద్యోగధర్మములు అతిక్రమించులాగున ఒత్తిడి చేయడము, అనుపదములను 3-వ సెక్షనులో చేర్చుటవల్ల — అధికారములోనున్న పార్టీవారి సిద్ధాంతములకు వ్యతిరేకముగ సాగునట్టి ప్రచారము నంతయు అడ్డగించుటకే ఈ బిల్లు ఉద్దేశింప బడినదని తేటతెల్లమగుచున్నది. అధికారములోనుండు రాజకీయ పార్టీకి వ్యతిరేకముగ ఎట్టి ప్రచారమును ఇకముందు చేయుటకు వీలుండదు. లంచగొండి ఉద్యోగులను, అధికార దుర్వినియోగముచేయు ఉద్యోగులను, అసమర్థులైన ఉద్యోగులను విమర్శించుటకు ఈ శ్రేయోరాజ్యములో ఇక వీలుండబోదు.

పత్రికలలో విమర్శనలు, విషయములు ప్రకటింపకముందే అధికారులకు చూపవలెననెడి నిర్బంధము తొలగింపబడినది. పత్రికా సంపాదకులు నేరము చేయుదురని ముందుగా మనస్సులో తలంచి, పత్రికలను నిరోధించు చర్యలు ఇక తీసుకొనబడవు. పత్రికా సంపాదకులు నేరముచేసిన

(మిగత 6 వ పేజీలో)

# రాబోవు ఎన్నికలు — కమ్యూనిష్టు పార్టీ.

— (సంపాదకులు) —

రాబోవు ఎన్నికలలో కమ్యూనిష్టు పార్టీ వారు సర్వసంపూర్ణ స్వేచ్ఛతో పాల్గొనుటకై (1) ఇప్పుడు నిర్బంధములో నుంచిన వారినెల్ల తక్షణమే విడుదల చేయవలెననియు (2) అరెస్టులకై వారంట్లు జారీచేయబడిన వారిపై వారంట్లు రద్దుచేయవలెననియు, (3) ఎన్నికల ప్రచారము స్వేచ్ఛగా సాగించుకొనుటకై వారికెల్ల పౌర హక్కులు కలుగజేయవలెననియు, (4) సింహాద్రిపురము, గంగిరెడ్డి పల్లెలలో నుండి పోలీసుక్యాంపుల నెత్తివేయవలెననియు, కడపజిల్లా కలెక్టరుగారికిని, చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రి గారికిని ప్రతిదినము పంపుకొనుచున్న మహజర్ల నకళ్లు మాపత్రికా కార్యాలయమునకు విశేషముగా పంపబడుచున్నవి.

అక్కడక్కడ సభలుచేసి, పై విషయములనే తీర్మానరూపముతో అంగీకరించిన లేఖలు కూడ మాకార్యాలయమునకు పంపబడుచున్నవి.

కొంతమంది కాంగ్రెసు వారు కూడ, పై విషయములనే వ్రాయుచు ప్రకటనార్థమై సంపాదకులకు లేఖలను బంపుచున్నారు.

మరికొందరు బర్లిన్ శాంతి ఒడంబడికపై ఈ జిల్లాలోను, పరిసరజిల్లాలలోను ప్రజలనుండి నూర్ల కొలది సంతకములు గ్రహించుచున్నటుల ప్రతి దినము మూడు నాలుగుకు తక్కువ లేకుండ లేఖలు మాకు చేరుచున్నవి. వీనినన్నిటికి ఎప్పటికప్పుడు సముచితస్థానమొసగి, ప్రకటింపవలెనన్న ఒక దినపత్రిక కావలెను. న్యూసుప్రింటు అభావమువల్ల దినపత్రికలు కూడ వానినన్నిటిని, ప్రకటింపజాలవు.

“భారతజ్యోతి” దినపత్రిక కాదు. సాధ్యమైనంతవరకు రాజకీయ చర్చలకే ఎక్కువ ప్రాముఖ్యత యొసగుచున్నాము అన్ని రాజకీయ పార్టీలకును, అందరి వ్యక్తులకును, సమానమైన పౌరహక్కులుండవలెననియే మా ఆశయము. ఆవిషయములను పలుమారీ పత్రికయందు నిర్భయముగ చర్చించుచునే యున్నాము. ఇప్పుడు మాకు చేరుచున్న లేఖలు, మహజర్లు, వార్తలు, తీర్మానములు ప్రకటింప స్థలము చాలనందులకు చింతించుచున్నాము.

కాని కమ్యూనిష్టు పార్టీ వారందరు ఒక్క ముఖ్య విషయమును మరచుచున్నారు. కమ్యూనిష్టు పార్టీ వారికి రాబోవు ఎన్నికలలో పోటీచేయుటకు స్వేచ్ఛయివ్వడమా, ఇవ్వక పోవడమా అను నది జిల్లా కలెక్టరుల స్వాధీనములో కాని లేక ముఖ్యమంత్రి స్వాధీనములో కాని లేదు. దౌర్జన్యమును పూర్తిగ కమ్యూనిష్టులు వదలుకొనినారని ఇండియా ప్రభుత్వమువారు, అందు ముఖ్యముగ హోముశాఖా మంత్రిగారైన శ్రీ. రాజగోపాలాచార్యులవారు, తృప్తిపడవలెను. ఆ భారము కమ్యూనిష్టులపై నున్నది. వారి నడవడికపై నున్నది. ఇది కేంద్రప్రభుత్వ విధానముపై ఆధారపడియున్నది. కనుక పార్టీనాయకులు కేంద్రప్రభుత్వమువారిని తృప్తిపరచుటకై ఏ విధానమును అవలంబించి, హృదయ పరివర్తనము కలిగినదని ఏ విధముగా ఋజువు చూపకలుగుదురో ఆ ప్రయత్నములను ముందు ముఖ్యముగా చేయుటకు పూనుకొనవలెనని కోరుచున్నాము.

పత్రికా స్వాతంత్ర్యములు ఎండమావులు.

(4 వ పేజీ తరువాత)

తర్వాతనే, న్యాయస్థానములో నేరము ఋజువు పెట్టబడిన తర్వాతనే, పత్రికలపై చర్య గైకొనబడునని తెలుపబడినది. కార్యనిర్వాహకవర్గము వారు వారికిష్టమొచ్చినరీతి పత్రికానిర్వాహకుల నుండి ధరావతులను కోరుట, వానిని వశపఱచుకొని క్రొత్త ధరావతులను కట్టమని శాసించుట, ఇక ముందు జరుగబోదు. న్యాయస్థానములో విచారణజరిగి, పత్రికలనుండి ధరావతు కోరవలెనని జిల్లా జడ్జిగారు ఉత్తరువు చేసిననేకాని, వేరువిధముగ పత్రికలకు ధరావతులుండబోవు. ఇంతవఱకు ఈ క్రొత్తబిల్లు బాగున్నది. కాని ఇందులోకూడ ఇండియా హోంశాఖా మంత్రిగారు ఒక కత్తిని ఇరికించి యున్నారు. పత్రికలపై ధరావతు కోరవలెనా లేదా అను విషయము న్యాయస్థాన విచారణకు వదలి పెట్టినను, ఇంత ధరావతు పత్రికల నుండి కోరమని సూచించు అధికారము రాష్ట్రమంత్రి వర్గమువారికి కలుగచేసి వున్నారు. ధరావతు కోరవలెనా లేదా అను సమస్యను తీర్చుటకు యోగ్యతగల జడ్జి, ఎంత ధరావతు కావలెనో నిర్ణయింప జాలడా? ప్రభుత్వమువారే (అధికారములోనుండు మంత్రులు) ఆ ధరావతు మొత్తమును ఎందుకు సూచింప వలెను. ఇట్టి అనవసర జోక్యమును మంత్రులకు కలుగ జేయుటలో హోంశాఖా మంత్రిగారి ఉద్దేశ్య మేమోస్పష్టముగా తెలియకున్నది. ఈ విషయములో హైకోర్టుల అధికారమును సంకోచపఱచుటకై చూచుచున్నటుల యున్నది.

న్యాయవిచారణలో ముద్దాయి, జూరీలచే విచారింప వలెనని కోరుచో, జడ్జిగారు అందుకు ఏర్పాటు చేయవలెనని యున్నది. పత్రికా రచయితలను, ఇతర పెద్దలను, జూరర్లుగా కోరుకొను హక్కు ముద్దాయిలకే ఒసగబడినది. ఇది కూడ బాగున్నది. ఇవితప్ప, ఇక ఈ నూతన ప్రెస్ లాస్ బిల్లులో హర్షించ తగిన విషయము లేవియు లేవు. ఈ బిల్లులోని హిరణ్యకశిపుని వరములతో సమానమైన 3-వ సెక్షనును ఇండియా పార్లమెంటు సభ్యులు అంగీకార మొసగినచో పత్రికా స్వాతంత్ర్య మనునది సర్వసంపూర్ణ స్వతంత్ర రిపబ్లిక్ ఇండియాలో ఎండమావులవలె పరిణమించును. శ్రేయోరాజ్యము (రామరాజ్యము) వెనుకకు నెట్టబడును. పోలీసు పరిపాలనమే మంచి పునాదులపై సుస్థిరముగ ఈ భారతావనిలో నిలిచి పోవును. పుట్టుకతోనే స్వాతంత్ర్య ప్రియుడు (బొర్న్ డిమోక్రాట్) అని ఖ్యాతిగాంచిన శ్రీ. జవహర్ లాలుగారి స్వాతంత్ర్య భావములు, శ్రీ. రాజగోపాలాచార్యులవారి మంత్రిత్వము — సారధ్యము తుట్టతుదకు ఇంతకు దిగెనా!

—0—

# ఆసియా — అనాథయా.

(శ్రీ. భూతపురి నారాయణస్వామిగారు.)

పాశ్చాత్యుల దృష్టిలో నాసియాఖండవాసు లనార్యులు; అనాగరకులు; అసభ్యులు; స్వపరిపాలన కనర్హులు. వీరిని పరిపాలించుట తమకు భగవంతు డప్పగించిన బాధ్యత. సర్వవిధముల నట్టి బాధ్యత నిర్వహించుట తమవిధి. ఆసియాఖండదేశముల యభివృద్ధియే తమ యాశయము. ఇయ్యది పాశ్చాత్యుల ప్రచారము. ఆసియాఖండ దేశములు తమ భాషల నేర్చుకొని, తాము బోధించిన మత మవలంబించి, తాము చెప్పినటుల నడచుకొని ముడివస్తువు లుత్పత్తిచేసి తమ కందిచ్చు చుండిన జాలును. కత్తిబట్టవలసిన యవసరము గలుగ నీయక, కడుపులోని చల్లకదలనీయక తామే, వీరి యోగక్షేమము లరయు నధికారము వహించిరి. ఈ విధమున పాశ్చాత్య

సీమలాసియా ఖండ దేశముల నిస్సార మొనర్చి, నిర్వీర్య మొనర్చి సర్వ సంపత్సారమును బీల్చినవి. ఏనాడైన స్వాతంత్ర్య వాంఛ పొడము నేమో యన్న భయముచే ముమ్మరముగ భేదతంత్రముల బన్ని, ఎచ్చట నేని స్వాతంత్ర్య ప్రచార లక్షణము లగపడిన నాక్షణమే వాని నంకురమున కడగ ద్రొక్కుచు పాశ్చాత్యులు ఆసియాఖండ వాసులను కోతులను బట్టి యాడించి నటుల నాడించిరి.

ఈ యాట లెంత కాలము సాగ గలవు? మొదటి ఐరోపా యుద్ధముతోనే గ్రహగతులు మారినవి, రెండవ ప్రపంచ యుద్ధముచే స్థితిగతులు తలక్రిందులైనవి. ఆసియాఖండ దేశములొక్కొక్కటియే క్రమముగా స్వతంత్రత సంపాదించు కొనినవి. పాశ్చాత్య దేశములు మెత్తబడి యుండుటచే దాని నరికట్ట జాలక పోయినవి. తుదకు వాతోద్ధూత సక్తువును కృష్ణార్పణ మన్నటుల స్వాతంత్ర్యమును బ్రసాదించినవి.

ఈ ప్రసాదము చేతః ప్రీతిగ నా, గత్యంతరము లేకయా? ఈజిప్టునకు సుడాను; అరబు దేశములకు పాలస్తీను; భారత దేశమునకు పాకిస్థానము — ఈ కల్పితములు బ్రిటీషువారి దుస్తంత్రములు. పాశ్చాత్యులు ఆసియాఖండ దేశముల నడమంటలో తావు దొరకినచోట తంటాలు చేయుట మానిన వారు కారు. ఇత్యాది వారి రాజనీతి. కమిటీలు, కమీషనులు, రాయబారములు, కాన్ఫరెన్సులు, వారి ముఖ్య సాధనములు; కాలహరణోపాయములు; అమాయకులగు నాసియావాసులను బుట వేయుట కొడ్డిన వలలు.

ఈ కుతంత్రములలో నందె వేసిన చేయి బ్రిటీషు వారిది. ఈ బ్రిటనునకు దోడు అమెరికా. ఈ రెండు రాజ్యములు కనుములలోని దొంగలవలె గలిసి పనిచేయు చున్నవి. బ్రిటిషు పాచిక పారనిచోట నమెరికాయును, అమెరికా యాటసాగనిచ్చట బ్రిటను రాయబారములు, మధ్యవర్తిత్వము నెలుపుచు, పరస్పర లాభేచ్ఛతో వర్తింపు చున్నారు. కొరియాలో నమెరికాకు మేలు సేయు నుదేశముతో బ్రిటను రష్యాచైనాలను బుజ్జగించుట, పర్షియా నూనె గనుల తగాదాలో బ్రిటిషు శ్రేయమునకై అమెరికా పరిషియాతో సంధానము జేయుట — ఇందుకు నిదర్శనములు. ఈ యుభయ దేశముల నాశ్రయింపని దేశములకు నొత్తిడి గలిగించి కుంగ దీయుదురు, మఱి యే యకృత్యమునకైన నొడిగట్టుదురు. ఈ కార్యసాధనకొఱకే ఐక్యరాజ్య సమితిని స్థాపించినారేమో యను సందేహము గలుగు చున్నది.

ఈ పాశ్చాత్య దేశము లే దేశమునకు మేలు చేసినను అదియు నొక కుతంత్రము. అద్దాన స్వప్రయోజన మంతర్గతమై యుండును. దురదృష్టము కొలది ఆసియా ఖండములో నంతటను ఈ పాశ్చాత్యులకు రష్యాఅడ్డుగా తోచు చున్నది. ఆసియాఖండ దేశముల స్వాతంత్ర్య మేయేటబోయినను సరియే, రష్యావిజృంభణము నెదిరించుటకే దేశములలో ముఖ్యస్థానములు తమ హస్తగతములు కావలయును. దీనిని సాధించుటకై యీ ఆసియా దేశములను కమ్యూనిజమను పులినోట బడకుండ రక్షించుట ప్రపంచశాంతిరక్షణ కార్యముగ జెప్పుచున్నారు. ఔరా! చందన సమశీతల వాక్కు. కర్తరి సంయుత హృదయము. ఇవి పాశ్చాత్యులకు నైజ భూషణములు.

ఆసియా ప్రాక్పశ్చిమ భాగములకు నడుమంతరమున గల భారత దేశమున నాశ్రయస్థానముల సంపాదించుట అమెరికా బ్రిటనుల యెత్తు. వారి వాంఛా సాఫల్యమునకు భారత దేశము తోడ్పడ లేదు. తోడ్పడ నందుచే భారత దేశముపై నాగ్రహము. తోడ్పడ బూనుకొనిన పాకిస్థానముపై ననుగ్రహము. కాశ్మీరము విషయముపై భారత దేశమునకు ప్రతికూల ప్రచారము. పాకిస్థానమున కనుకూల ప్రచారమే కాక యాయుధము లందించుట. భారత దేశము ఆహారధాన్యము లడిగినప్పుడు అమెరికాలో ప్రజ లెంతగ మంటలు గ్రక్కిరో ప్రపంచమునకు దెలియును.

కొరియాలో నమెరికాబాణము పారలేదు. ఈ కొఱతి దీర్చుటకు అమెరికా జపానులో దన సైన్యము నిలుపుకొన సంకల్పించినది. అందుచే

జపానుతో నొక యొడంబడిక జేసికొను చున్నది. ఈ యొడంబడిక పై నాసియాఖండ రాజ్యములను దస్కతులు పెట్టింప జూచుచున్నది. రష్యా చైనా లిందుకు సమ్మతింప వనుట వారెఱుగుదురు. భారతదేశము నిందుకు సమ్మతించుట లేదు. భారతదేశముతో బాటు మఱి కొన్ని ఆసియా రాజ్యములు తిరస్కరించినవి. ఇందుపై నమెరికాకు భారతదేశముపై పట్టరాని కోపము గలిగినట. ప్రతీకార మేమి యొనర్చునో తెలియదు.

తమ రాజనీతి తమకే ముప్పు గలిగించుచుండుట అమెరికా బ్రిటను లింకను గ్రహింప జాలకున్నవి. రష్యా నణగించు ప్రయత్నములు రష్యా విజృంభణమునకే తోడ్పడు చున్నవి. చైనాలో షియాంగ్ కెషెక్, అరబు రాజ్యములో శోర్డను ప్రభువు — ఇట్టి చీలదీయు పద్ధతుల వలన నావల పక్షములకు రష్యాపై నభిమానము తప్పక గలుగు చున్నది. ఆసియా ఖండములో కమ్యూనిజము వ్యాపించుచో నయ్యది అమెరికా బ్రిటను లవలంబించిన రాజనీతి ప్రతిఫల మనవలసి యుండును. ఇందుకొఱకే దొఱకిన యవకాశమును రష్యాయు విడువకున్నది. భారతదేశమున కాహారము పంపవలెనా, మానుకొని బుద్ధిచెప్పవలయునా యని అమెరికనులు వాదోపవాదములతో కాలహరణ మొనర్చు చుండ, ఒడంబడికలో దస్కతులు కాకమునుపే రష్యా ధాన్యమును ఓడలకెక్కించి భారతదేశమునకు వన సానుభూతిని గన్పరచెను. యుద్ధములో జిక్కికొని తనకే చాలియు జాలకున్నను చైనా యాహార మంపి తన యౌదార్యమును జూపెను. ఆసియా ఖండ రాజ్యములకు మిత్రరాజ్యమేది? రష్యాయా, లేక బ్రిటను — అమెరికా దేశములా?

ఆసియా ఖండ మనాథ యనిపించు కొనుటకు కారణము ఆసియా ఖండ వాసుల లోపము కొంతయున్నది. ఆసియాఖండమున కాలానుగుణ రాజనీతి కొఱవడి యున్నది. మాయోపాయములు తొలుదొలుత గ్రహింప లేరు. పైగా పురుషోత్తమునిపై నలెగ్జాండరు నెగడొల్పిన అంభి యొక్క, పృథ్వీసింగు పైకి విదేశీయ, మహమ్మదీయ ప్రభువు నాహ్వానించిన జయచంద్ యొక్క మనస్తత్వ మింకను ఆసియాఖండములో పీఠము వేసికొని యున్నది. ఇట్లు పరస్పరమాయాపరు లున్నచోట పరాయి వారు ప్రవేశించుటలో వింతయేమున్నది? తలుపులు తెరచి యుంచినచో కుక్కలు దూరకుండునా? ఇట్టి యవివేకమే పాకిస్థాను స్థాపనమునకు దారిదీసినది. భారతదేశమున కాహార ధాన్యమంప వలదని పాకిస్థాను అమెరికాలో ప్రచారము చేసిన దట.

అమెరికా బ్రిటనులు తన నెత్తిపై కుచ్చుల కుళ్లాయి పెట్టెదరని పాకిస్థాను సంబర పడుచున్నది. వారి యాసరాతో కాశ్మీరమును మ్రింగ జూచుచున్నది. ధన మొకటికి రెండంతలు లాగి యాయుధము లీయవచ్చు; సలహాలు చెప్పవచ్చును కాని బ్రిటను అమెరికాలు ప్రత్యక్షముగ సమర సాహాయ్యము జేయ గలవా? తుద కుభయ భ్రష్టత బొందినపుడు మిత్రులెవరో శత్రులెవరో పాకిస్థాను గ్రహించును గాబోలు.

భారత దేశము చేసిన తప్పులును బోలెడున్నవి. రెండుజాతుల సిద్ధాంత మెదిరించు చుండిన భారత నాయకులు మౌంటుబేటను చెవిలో నూదిన మాత్రముననే పాకిస్థాన స్థాపనమున కంగీకరించిరి. బుద్ధినిలకడ లేని వారి నెవరు విశ్వసించెదరు? ఆసియాఖండ రాజ్య స్వాతంత్ర్య వాంఛ శంఖనాదముతో జాటిన నెహ్రూగారు భారతదేశమును బ్రిటిషు కామన్వెల్తులో జేర్చియున్నారు; ఐక్యరాజ్యసమితిపై నాసలు పెట్టుకొని యున్నారు. ఆసియాఖండ రాజ్యముల నొకటిగ జేర్చి నాయకత్వము వహింపగలడని యాశించిన రాజ్యములకు నెహ్రుగా రాశాభంగ మొదవించిరి. అటువై నొక పాద మిటు వై నొక పాదము పెట్టుకొను నెహ్రుగారి నీతిని పలువురు శంకించు చున్నారు. ఆసియాఖండ నాయకత్వము తనంతటా లభింప నుండిన యవకాశ మిప్పటికేమో భారతదేశము కోల్పోయినది.

(మిగత 16 వ పేజీలో)

# హిందువుల సాంప్రదాయములు - సంస్కృతి చెఱ పెట్టబడుచున్నవి.

( శ్రీ. బాబూరావు పటేలుగారు, "ఫిలిం-ఇండియా" సంపాదకులు. )

ఏదో ఒక కారణముపైన మన ప్రధానమంత్రిగారు ఢిల్లీనగరమును నుండు ఎఱ్ఱకోట నెక్కి సాటిలేని మన సంస్కృతిని గుఱించి నెలకొకమారు ధర్మోపన్యాసము గావించెదరు. శ్రీ. జవహరిలాలుగారు మోటారుకారులో ఎక్కగనే సంస్కృతి విషయమై చెప్పబడినదంతయు మఱచి పోబడును. శ్రీ. జవహరిలాలు కష్టపడి పనిచేయు రాజకీయ నాయకుడు. కనుక, విరామచిహ్నముగా మఱియొకమారు మన సంస్కృతినిగూర్చి మాటలాడుటకు ప్రారంభించును.

బాబూ పురుషోత్తముదాసు టాండన్ గారు గద్దెను కలిగిన కాంగ్రెసు అధ్యక్షులు. వారమున కొక పర్యాయము ఏదో ఒక పట్టణములో మన ఆర్యసాంప్రదాయమునుగూర్చి మాటలాడుదురు. వండిన ఆహారమును, ఉప్పును, చక్కెరను, వెన్నను, తేనెను, పాలను, తుదకు నీటిని మానివేయ వలెనని మనకు చెప్పుదురు. వెంటనే తన రాజకీయపార్టీని బలమైన దానినిగా ఒనర్చుకొనుటకై ప్రయత్నించుచుండును.

మన వనబాలుడైన శ్రీ. కె. యం. మున్షి గారు, ఆహార శాఖామంత్రి; మూడు దినముల కొక సారి ఆహారవిషయమై మఱచిపోవును. మన ప్రాచీన విజ్ఞానమును గూర్చి ప్రసంగించును. నారగుడ్డలు, ఆకులు కట్టుకొనిన భార్యలతో రాజులు అడవులలో కాపురము చేయుచు, కోతులు దేవతలుగా భావింపబడుచుండిన రామాయణమునాటి దినములకడకు మనలను గొనిపోవును. కవితాధోరణితో అడవులలో చెట్లు ఉండుటే గమనింపజాలక, ఆహారము పైరగు భూములను వదలిపెట్టి, శ్రీరామచంద్రుడు సీతతోకూడ వనవాసముండిన కాలములో వనము లేరీతిగా నుండెనో ఆరీతిగా వానిని ఇప్పుడు తయారుచేయుటకు చెట్లను నాటుటకై పరుగెత్తును.

అప్పుడప్పుడు బాలసాహెబ్ ఖేర్; మొరరాజ్ దేశాయి; బి. సి. రాయ్; గోవిందవల్లభపంతు మొదలగువారు మహోపేతమైన మన ప్రాచీన సంస్కృతిని గుఱించి ఉపన్యసించెదరు. దానిని తక్షణమే పునరుద్ధరింప వలెనని చెప్పుచుందురు.

పాశ్చాత్య నాగరికత అను వ్యామోహ వొత్తిడివల్ల కలుగుచున్న అభిఘాతమువలన, గంటగంటకు మన ప్రజలు ఎక్కడికి కొట్టుకొని పోబడుచున్నారో గొప్పగా మాటలాడు ఈ పిచ్చివారు కన్నులెత్తి చూడజాలకున్నారు.

తొమ్మిది శతాబ్దములుగా తప్పించుకొనుటకు వీలుకాని మొగలుల ఏలుబడిక్రింద మనదేశముండి, ముస్లింల గోరీలను, మసీదులను క్రొత్త సంస్కృతి చిహ్నములని చెప్పుకొనుచు, మన సనాతన సంస్కృతి ఆదర్శములతో సమైక్యత గావించుకొని యున్నాము.

బ్రిటీషువారు మనదేశమును స్వాధీనము చేసికొనిన వెంటనే ఇస్లాం సాంప్రదాయమైన అర్ధచంద్రాకృతి చిహ్నము మన దేశ సాంస్కృతి చరిత్రలో ఒక స్థాన మాక్రమించెను. ఇవన్నియు హిందూ-మహమ్మదీయ ఐక్యచిహ్నములని విదేశీయులకు చెప్పబడుచుండెను. తుదకు పాకిస్థాను ఈ అపోహను బయలుపఱచెను.

రెండువందల సంవత్సరముల బ్రిటీషు పరిపాలనము హిందూ-ముస్లిం సంస్కృతి అని చెప్పు రంగుల తెరను చించివేసెను. ధోవతులు, పైజమాలు పోయి, చిన్నవైన పొడుగైన ప్యాంటులు వచ్చెను. రొమ్ము ఎత్తుగల మేజాలపై భోజనములు చేయు అలవాటు వచ్చెను. పాశ్చాత్యుల దగ్గఱనుండి వారికి ఎక్కువగా నుండిన వస్తుసముదాయమును అవమానకరముగ దెచ్చుకొని, శిథిలమైన ప్రాత సంఘముపై క్రొత్త సంఘమును నిర్మింప సమకట్టిరి.

మన ప్రాచీన సంస్కృతి చిహ్నములైన రామాయణమునాటి కోతులు పాశ్చాత్యుల ప్యాంట్లతోను, బూడ్సులతోను లక్షలకొలదిగ 1904-వ సంవత్సరమే దేశమందంతటను దిగబడెను. చలన చిత్రములు ప్రజలపై మచ్చుమందురీతి పనిచేసెను.

పాశ్చాత్యులయొక్క పద్ధతులను, కపటోపాయములను ప్రజలు పూర్తిగా చూచిరి. ఈ వలసదేశములో పాశ్చాత్యులు అవలంబించుచు, వీధులవెంబడి తిరిగి విక్రయించుచుండిన చౌకనీతులను వంశాచారము ననుసరించి, కోతులవలె మనవారు అనుకరించిరి.

కడచిన రెండుయుద్ధములు (1914–1918; 1939–1945) ప్రపంచమును, ఇండియాను ఒక్క ఊపు ఊపివైచినవి. భూగోళరీత్యా ముఖ్యప్రదేశముగ నున్నందున, చిన్నదైనను, ప్రపంచ పటములో ఇండియా పెద్దచుక్కగా కనపడెను. మనుష్య దేవతలు, కోతులకు సమానమైన మనుష్యులు, దిగంబరులైన సాధువులు, ఉపవాసవ్రతములు చేయు రాజకీయవేత్తలు, సాంస్కృతిక సంపత్తు, ఆర్థిక దౌర్భాగ్యము, బ్రతికియున్న దేవతలు, చచ్చిన మనుష్యులు, రాతిదేవాలయములు, పూరిగుడిసెలు గల ఈ దేశము సర్వశక్తి సమన్వితమైన బ్రిటీషువారిని ఎదిరించుచున్నందున అమెరికావారి దృష్టి నాకర్షించినది. తమ జీవితవిధానములను, సాంప్రదాయములను ఎక్కువ వొత్తిడితో ప్రచారము సాగించుటకు అమెరికనులకు ఇండియా కేంద్రస్థానముగ మారిపోయెను.

చలన చిత్రములు ఎక్కువ శక్తివంతములైన ఆయుధములు. ఈ ఆయుధములతో (ఫిలిములతో) 40 కోట్ల ప్రజలలో సాంస్కృతిక సర్వనాశనము చేయుటకు హాలివుడ్ ఒప్పందమునకు వచ్చెను. 'రుంబా' 'సంబా' నృత్యములను నేర్పుటకును, 'హిక్కప్పులు' 'గిగ్గులు' నేర్పుటకును, మితిమీరి త్రాగించుటకును, ప్రేమను ప్రకటించుటకును, స్వేచ్ఛగా తిరుగుటకును, హత్యలు, దొంగతనములు చేయుటకును, దయ్యాల చేష్టలను చేయుటకును, వివాహములను విచ్ఛేదము గావించుకొనుటకును, మద్యలోలత్వము మొదలగునవి నేర్చుకొనుట కొరకు ఈ ఫిలిములు తోడ్పడెను. నేర్పెను.

అందమైన రవికెలను, చీరలను హాలివుడ్ మన స్త్రీల నుండి తొలగించెను. లాగులను, చొక్కాలను వారికి తొడిగించెను. గుడ్డకన్న చర్మమే ఎక్కువగ కనపడు దేహములతో ఈతాడు కొలనులలో మన స్త్రీలను హాలివుడ్ దింపెను. మన సముద్రపు దరులను అవినీతికరమైన సంభోగములకై, పడకగదులుగా హాలివుడ్ మార్పుచేసెను. మన పురుషుల మెడలనుండి హాలివుడ్ పట్టులను చించి, వివిధరంగులుగల టైలను తొడిగించెను; మన మగవారినుండి సత్ప్రవర్తనమును దోచుకొని, ఇతరులను దోచుటకై తుపాకుల నిచ్చెను: మన ఇండ్లను నాశనముచేసి, ఆ శిథిలములపై క్లబ్బులు, నృత్యశాలలు నిర్మించెను; పవిత్రమైన మన దాంపత్యజీవితములను చెఱబట్టి (జారత్వముచేసి), అక్రమమైన స్వేచ్ఛా ప్రణయము యొక్క ప్రాముఖ్యతను కీర్తించెను. ప్రాచ్యదేశ ఆధ్యాత్మిక నారులను త్రెంపివేసి, ఇంద్రియలోలత్వమువల్ల పిచ్చి పట్టినవారిగ హాలివుడ్ మనల నొనర్చెను.

మన ఆహారమును, పానీయమును, గాలిని, కళలను, సంగీతమును, విజ్ఞానమును (సంస్కృతిని), మర్యాదలను, తత్త్వదృక్పథములను, నిత్యజీవనమును, మానవత్వమును హాలివుడ్ భ్రష్టపట్టించినది. హాలివుడ్ తాకినదెల్ల అపవిత్రమాయెను. అమెరికావారి పాపములు హైందవుల సొగసులుగ మారెను. వినోదములను చూపు సాకుపై అమెరికావారు అనుసరించు జీవిత పద్ధతులను మనకు నేర్పెను. 'ఎమిల్ జులా'; 'లూఇస్ పాస్టర్'; 'జూరెజ్' అను శ్రేష్ఠమైన కొన్ని చిత్రములను మనకు చూపినది. కాని వేలకొలది అవినీతి కరమైన చిత్రములను చూపి, మన ప్రజలకు విషము త్రాపినది.

ఢిల్లీ కళాశాలలో చదువుకొను ఒక చిన్న పిల్ల ఒక అరగంట నీతో సంభాషించినచో, పదహైదుమారులు 'హీ' అని పిలిచి, 'గిగ్గిగ్గి' అని ఉచ్చరించును. గాంధీటోపీలు ధరించు రాజకీయ గురువులు పలుమారు గర్వించి చెప్పుచుండు మన ప్రాచీన సంస్కృతికి, మన అమెరికా స్నేహితులు ఏమి చేయుచున్నారో అప్పుడు నీవు తెలుసుకొన గలవు.

అదే కళాశాలపిల్ల, ఒక క్లబ్బుకుచేరిన ఈతకొలను దగ్గఱ, గుడ్డలకన్నను ఎక్కువ చర్మమునే ధరించి, నిర్భయముగ పొగబీల్చుచు, సగము దిగంబరులుగాయున్న మగవారి మధ్యనుండుట నీవు చూచినచో, అదే గుడ్డలతో, అట్టి గుంపు మధ్య సీతాదేవి యుండినచో, ఆ దృశ్యమును శ్రీరామచంద్రుడు చూచియుండినచో ఏమి చేసియుండునా అని నీవు యోచించుచు, ఆశ్చర్యచకితుడవయ్యెదవు.

ఈ విధముగ హాలీవుడ్ మన జీవితమునకును, సంఘమునకును విషము నెక్కించినది. అది చేసిన ఈ కల్మషమైన పనికిని, ఇంకను చేయుచున్న పనికిని ఇండియాలో చలనచిత్ర నిర్మాతలు దోహద మొసగుచున్నారు గదా!

అమెరికా దేశ ప్రజల జీవితమును అమెరికా చిత్రములు ప్రతిబింబించును. ఇష్టము లేకున్నచో హైందవులు వానిని చూడవలసిన జరూరు లేదని హాలివుడ్ చెప్పవచ్చును. సనాతన జాతికి వారు చేయుచున్న అపచారమునకై హైందవ చలన చిత్ర నిర్మాతలు ఈ సాకు చెప్పజాలరు.

1913 సంవత్సరములో దాదాభాయిఫాల్కే ఈ దేశములో చలన చిత్రముల రాకను ప్రకటించెను. అవి మన సాంప్రదాయములకును, సంస్కృతికిని పూర్తిగా సరిపోయెను. సత్యమునే దైవముగా నమ్మిన శ్రీ హరిశ్చంద్ర చక్రవర్తి కథను అతడు మొట్టమొదట చలన చిత్రముల ఉయ్యాలలలో వేసెను. ఇతడు సుమారు ఒక వందకుపైగా చలన చిత్రములను నిర్మించెను. ఒక్కదానిలో కాని మన సాంప్రదాయములకును, సంస్కృతికిని మచ్చ కలిగించు ఫిల్మును తయారు చేయలేదు. అతడు కళామూర్తి. ఆదర్శజీవి. దేశ ప్రేమా తత్పరుడు.

దాదాభాయిఫాల్కేచే అంతప్రకాశవంతముగ ప్రారంభింపబడిన ఫిల్ము పరిశ్రమ నేడెచ్చటనున్నది?

హాలీవుడ్ ఎగుమతి చేయగల విషము నంతయు ఈ దినము మన చిత్రములు దిగమ్రింగి యుండుటే గాక, మనవారు పెట్టుచున్న విషమునుగూడ త్రాగుచున్నవి. తుపాకులు, నేరములు, ఆత్మహత్యలు, హత్యలు మన చిత్రములలో చూచుచున్నాము. స్త్రీలను బలాత్కరించుట, వివాహము కానిదే కన్యలు మాతృత్వము వహించుట, హద్దులేని స్వేచ్ఛా ప్రణయములను మన చిత్రములలో ప్రతిబింబింపజేయు చున్నాము. హాలీవుడ్ చిత్రములరీతి చెట్లక్రిందను, నదీ పరిసరములలోను యువతీయువకుల శృంగార చేష్టలను కొత్త సాంకేతికమును అలవరచుకొన్నాము. భరతనాట్యమును, కథాకళీ, మణిపురి నృత్యములను వదలి, జాజ్, రుంబా, సాంబాలను తెచ్చుకొన్నాము. భావోద్రేకమును కలిగించు శాస్త్రీయ గానమును వదలి, హవేలియన్ గానము, దాని వెంబడి నడుము త్రిప్పుట, రొమ్ములు ముందుకు తెచ్చుట మొదలైన సాధనములను అలవఱచుకొనుచున్నాము.

మన దుస్తులు కూడ మారిపోయినవి. ఒకానొకప్పుడు మన స్త్రీలు తలనుండి పాదముల వఱకును తమ దేహములను కప్పుకొను చుండెడివారు. వారి దేహ చర్మము, వారి దేహ

కాంతులు పవిత్రమైన వారి పడకగదులలో చీకటి కాలములలో భర్తలు ఊహించుకొనుటకు మాత్రమే అవకాశ ముండెడిది. అట్టివారి దేహములపై, ఇప్పుడు చర్మము తప్ప గుడ్డ బొత్తిగా కనబడుట లేదు. వారికి మానవ చర్మముకన్న గుడ్డయే ఎక్కువ అపరూప మైనది.

యం. జి. యం. వారి "బేతింగ్ బ్యూటీ" అను చిత్రములో ఈస్టర్ విలియమ్స్ నూరు విధములైన ఈత ఛడ్డీలను కలిగి యుండవచ్చును. రెండు సంవత్సరములకు తరువాత వివాహితయైన హిందూ స్త్రీ నళినీజయంత్ అను ఆమె నిత్య జీవితములోకూడ కొద్దిగానుండు ఈతాడు ఛడ్డీనే ధరించుచు వచ్చెను. ఆమె దేహముపై గుడ్డ అత్యల్పముగా కలిగి, నదీ పరిసరములలో అశోక్ కుమారుతో ఉండిన దృశ్యమును "సంగ్రామ్" అను చిత్రమునుండి చూసియున్నాము.

దుశ్శాసనుడు పాండవుల రాణియైన ద్రౌపదియొక్క వలువను విడిపించి ఆమె చర్మమును చూడ ప్రయత్నింపగా, లక్షలకొలది యోధులు యుద్ధము చేసిరి. అటువంటి దౌర్జన్యమును తలపెట్టిన నాగరికతనే అంత్యమొందించిరి. స్త్రీలు పురుషుల కొప్పగింపబడిన పవిత్రసంపదలని మనము ఎంత మాత్రము తలచుట లేదు. కనుక "నళినీజయంత్"ను గురించి మహాభారత యుద్ధ ముండజాలదు. ఈ దినములలో పురుషులు కోరుటకన్న ఎక్కువగనే స్త్రీలు తమంతటతామే గుడ్డలను దేహముపైనుండి తీసివేయుచున్నారు.

మన చీరలు, రవికెలు కన్యత్వమున కుచితమైన కవచములు. కళకును, సౌమ్యతకును, సాంప్రదాయములకును ఒప్పిన దుస్తులు. అవి పాశ్చాత్య నాగరికతయొక్క సంధ్యా వెలుగులో పారవేయబడెను. వాని స్థానములో వలపులను, వయ్యారములను ఎక్కువచేయుట కనుకూలించు చొక్కాలు, లాగులు వచ్చెను.

రెండు సంవత్సరముల క్రిందట, ఫిలిము తారలైన ప్రమీలా దాసు గుప్త; బేగంపారాలు సిగరెట్లు టిన్నును చేత పట్టుకొని లాగూ చొక్కాలను ధరించి పోవుచుండగా మన హోముశాఖామంత్రిగారైన శ్రీ. మొరార్జీ దేశాయిగారు చూచి, సిగ్గుతో తలవంచుకొనెను. ప్రతి ఫిల్ము తారయున్న ఈ దినములలో ఇదే దుస్తులను వేయుచున్నది. క్లబ్బులకు పోవు వేలకొలది స్త్రీలు, అదే రీతి పోవుచున్నారు. కాని మన ప్రాచీన సంస్కృతిపై ఇంకను నమ్మకము గల లక్షల మంది పురుషులు, వారిని చూచినప్పుడంతయు, సిగ్గుతో తలలు వంచుకొనుచున్నారు.

స్త్రీలకు 16 విధములైన సౌందర్యాలంకారము లున్నవని మన దేశములో ఒక సాంప్రదాయ మున్నది. శిరస్సు మొదలు పాదముల వఱకును ప్రాచీన సాంప్రదాయము ప్రకారము ప్రతి భాగము ఏదోఒక ఆభరణముతో అలంకరింపబడును. ఇప్పుడు సినిమాలలో మన హైందవ స్త్రీలు పాశ్చాత్య సాంప్రదాయములతో చూపబడుచున్నారు. విదేశములనుండి వచ్చే నమూనాలతో శిరోజముల నలంకరించుకొనుచున్నారు.

మనస్సును ఉన్నతస్థాయికి తీసుకొనిపోయి, ఆత్మానంద మొసగునట్టి సాంప్రదాయసిద్ధమైన మన సంగీతము మన చిత్ర నిర్మాతలవల్ల పేడదొడ్లలో వేయబడెను. దాని స్థానములో శృంగారచేష్టల నుద్రేకించు కోతి సంగీతము హాలీవుడ్ నుండి అనుకరింప బడుచున్నది.

దక్షిణ ఇండియాలోని ఒక బ్రాహ్మణ ఫిలిము నిర్మాత కూడ తన ప్రాచీన సంస్కృతిని —వారి పూర్వీకుల పనులను— మఱచిపోయెను. "మంగళ" అను చిత్రములో "డవున్ ఆర్జంటయిన్ వే" అను చిత్రము ననుసరించి, కార్మెన్ మిరాండ మాదిరే భానుమతి పెదవుల కదలింప జేసెను. కండ్లను త్రిప్పునటుల జేసెను. భుజములు సంకోచపఱచి, స్థనములు సన కండ్లకు నూటిగా కనపడునట్లు చేసెను. చిత్ర నిర్మాతయైన వాసన్ను తన పూర్వీకుల వలె పాప విముక్తికొఱకై కాశీకానగరమునకు బోయి, గంగలో స్నానము చేయుమని మేము చెప్పుట లేదు. కాని గొప్పవాడై, ధనవంతుడైన చిత్ర నిర్మాత మన ప్రాచీన సంస్కృతికి కొంచము ఎక్కువ గౌరవమును చూపి, లక్షలకొలది సంవత్సరములుగా వచ్చుచున్న మన సాంప్రదాయములను ప్రతిబింబింప జేయవలయునని కోరుచున్నాము.

రాజకీయ దాస్యము మనలను విదేశీయుల సంస్కృతికి కూడ దాసులుగా రొనర్చెను. అన్నము తినుటలోను, గుడ్డలు ధరించుటలోను, నడవడికలలోను, జీవిత ఆదర్శములోను తెల్లవారిని, కోతులవలె మనము అనుకరించుచున్నాము.

స్వాతంత్ర్యము వచ్చి నాలుగు సంవత్సరములు గడచినను, తెల్లజాతివారికి ఈ దినమునకు కూడ మన బుద్ధీంద్రియములు దాస్యభావముతోనే యున్నవని మన దైనందిన జీవితమే చూపుచున్నది. మన సంస్కృతిపై ఉపన్యసించుటలో అగ్రగణ్యుడైన పండిత జవహరిలాలుగారు తెల్లవారు కరిస్పర్శ గావించినచో, వారికి ప్రత్యేకమైన నవ్వుముఖమును చూపును. తన దేశీయులైన 35 కోట్ల భారతీయుల ప్రేమకన్న, అంతర్జాతీయ ఖ్యాతియే ఎక్కువ వాంఛనీయమైన బహుమానమని తలచును. ఉత్కృష్టమైన సామర్థ్యముగల భారతీయ రచయితలు తన పంచ కాచుకొని యుండినను, గాంధీజీకి ఒక్కసారి చూచుటకు కూడ కష్టముగా నుండెను. వ్యవధి లేకుండెను. మూడవ తరగతికి చేరిన పాశ్చాత్య పత్రికా రచయితలు వచ్చినచో, వారితో సంభాషించుటకు వ్యవధి కలుగుచుండెను. ఛాయాపటమును తీసుకొనుటకు అంగీకరించు చుండిరి.

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి.)

[గత సంచిక తర్వాత]

## (9)

[చంద్రశేఖర, జానకులు ఒకరినొకరు ప్రేమించుకొనిరి. జానకి తండ్రి ఈ ప్రేమబంధమునకు వివాహము ద్వారా భంగమొనర్ప సంకల్పించుటతో, చంద్రశేఖరుడు జానకితో లేచిపోయెను. శ్యామలుడును జానకిని ప్రేమించెను గనుక, చంద్రశేఖరుని యనుసరించెను. ఒంటరిగా నుండు సమయమున చంద్రశేఖరుని తల బగులగొట్టి, శ్యామలుడు జానకిని ఎగువతిరుపతికి దోడ్కొనిపోయెను. శ్యామలుడు జానకిని వివాహమాడెనని వెలువడిన ప్రచురణను గాంచి చంద్రశేఖరుడున్మాదియై, మధుసూదనుని సాయమున గూడూరు చేరెను. జానకి తండ్రి లక్ష్మణరావు ఈ ప్రచురణను గాంచి సంతసించి, జానకి, శ్యామలరావుల నింటికి రమ్మని ప్రచురించెను. ఈ ప్రచురణ నాదరువుగా గొని, శ్యామలుడు జానకిని పెండ్లిజేసికొన ప్రయత్నించెను. జానకి చంద్రశేఖరునుండి మనసు త్రిప్పుకొనలేక, లోయలో దూకి ప్రాణ త్యాగమును సేయ సమకట్టెను. తర్వాత ఈ ప్రకరణమున.—]

తిరుపతికి మూడుమైళ్ళ దూరములో తుమ్మలగుంటయను గ్రామ మొండు గలదు. ఆ పల్లియ నానుకొని బెస్త గూడె మొకటి గలదు. ఆ గూడెనునందలి బెస్తవారికి జీవనోపాధి జరుగుటయే దుస్తరముగా నుండెను. తిరుపతి దేవస్థానమువారి భూముల కవులుకు సేద్యముసేయువారు గొందఱు, శేషాచల దుర్గమారణ్యముల సొచ్చి యెండుకట్టెయల నేరికొని, తిరుపతి పురమున విక్రయించి జీవించువారు కొందఱు, మడుగులలో చేపలుపట్టుకొని, విక్రయించి జీవనము సాగించువారు గొందఱుగా నా గ్రామవాసులు పలువృత్తులతో బ్రతుకుచున్నారు. ఆ గూడెమునం దేనాడును ఉత్సవము జరిగిన జాడయే గానరాదు. అసలు భోజనమునకే గడువనప్పుడు ఇక పండుగలు, పబ్బములు కలనైనను దలంపగలరా? అట్టి గూడెమునం దొకనాడు సూర్యోదయము తోడనే పిల్లలు, పెద్దలు, ఆడవాండ్రు గుంపులుగుంపులుగా జేరి, గుసగుసలాడుచుండిరి. ఒక గుడిసెయందు గొల్లుమని యేడ్చుచుండిరి. అప్పుడే గుగ్గిళ్ళ నమ్ముకొన వచ్చిన రంగమ్మ యనునామె సుబ్బయ్య యనువానితో నిట్లు సంభాషించుచుండెను.

రంగ.— 'సుబ్బిగా! ఏమిటది, గుంపులు గుంపులుగా జేరి ఏదో గుసగుసలాడుచున్నారు?'

సుబ్బ.— 'ఏమిచెప్పాల తల్లీ! ఒక చిత్తరం. నిన్న చాపలు పట్టుకొచ్చేదానికి వెంకటాయ, కొండాయ పూడ్చినారు. కొండలోయలో మడుగుండ్లా! ఆ మడుగులో వలలు విశిరార్రు. ఒక వలలో ఒక మాంచి చక్కని అమ్మోరు పడింది. ఆమెను ఎత్తుకొచ్చినారు.'

రంగ.— 'అట్లనా? ప్రాణాలతో ఉందా?'

సుబ్బ.— 'చావలేదమ్మా. ఊపిరాడ్తాఉండాది.'

రంగ.— 'పోయి చూద్దాము పద' అని రంగమ్మ గుగ్గిళ్ళ తట్టతో వెంకటాయ గుడిసెదగ్గరకు పోయినది. గుంపుగానున్న వాళ్ళందరు తొలగి, రంగమ్మకు దారియిచ్చిరి. రంగమ్మ ఆ స్త్రీవ్యక్తి ముఖము పరికించిచూచి, 'అయ్యో! జానకమ్మా! నీవా తల్లీ! నీకీగతి యెందుకుపట్టిందమ్మా! నీవు నన్ను బొంబాయికి తోడుకపోతానంటివి గదే తల్లీ! మా తల్లీ!' యనికేవ్వున నేడువ దొడగెను. 'ఏందిరో! రంగమ్మ యిట్టేడుస్తా ఉండాది. ఈమెకు చుట్టమేమోరా?' అని మగవాళ్ళనుకొనజొచ్చిరి. రంగమ్మ యేడుపు చాలించిన తర్వాత ఒకడు 'ఏం రంగమ్మా, నీకు చుట్టమా యీమాని' అని ప్రశ్నించెను. అందుల కామె 'నేను పత్రింలో పనిచేస్తున్నప్పుడు ఈ బంగారుతల్లి అక్కడికొచ్చింది. అక్కణ్ణించి యెగువ తిరుపతికి పోయింది నెల కిందట. ఇప్పటి కీస్థితొచ్చిందీమెకు' అని హృదయభారముతో బల్కెను.

ఉదయమాది వేంకటయ్య అతని భార్య మొదలగువారు జానకికి సపర్య జేయుచునే యున్నారు. కాని జానకి కన్ను దెఱువలేదు. రంగమ్మ దుఃఖము దిగమ్రింగి 'వేంకటయ్యా, ఆ తల్లిని మాయింటిదాకా తీసుకరా, ఆమె బాగోగులు నే చూచుకుంటాను' అనియెను. వేంకటయ్య 'సరే గాని, రంగమ్మా! ఆ యమ్మోరు బాగయితే నాకు యినాము యిప్పించాలమ్మా!' అనుచు, బండి జేసికొని రంగమ్మ యిల్లుజేర్చెను. రంగమ్మ వేంకటయ్యకు కృతజ్ఞత నూపెను.

తరువాత రంగమ్మ వైద్యుని రప్పించి ఔషధ మిప్పించెను. సుమారు వారము దినములకుగాని జానకి కన్ను తెఱచి చూడలేదు. క్రమముగా జానకి తేరుకొన జొచ్చెను. ఒకనాడు రంగమ్మను గుర్తించినది కాబోలు. ఇట్లు సంభాషింప దొడగినది. 'రంగమ్మా! నే నిక్కడికెట్లొచ్చానో! నేను ప్రాణత్యాగము చేసికొనుటకు మేడమీదినుండి లోయలో

దూకినది మినహా నాకేమియుఁ దెలియదు.' రంగమ్మ పరమానందముతో 'నాతల్లీ, నీ నోట యెప్పుడెప్పుడు మాట విందునా యని గంపెడంత యాశతో నున్నాను. తల్లీ, నీ విప్పు డెక్కువ మాటలాడగూడదు. ఆయాసపడుదువు. ఇఁక నాలుగు దినాలు వైద్యుఁడు పెట్టిన గడువున్నది. తరువాత మాటలాడవచ్చును.

నెల దినములు జరిగినవి. జానకి బాగుగా తేరుకొన్నది. ఆమె రంగమ్మ నాలోకించి 'రంగమ్మా! నీ ఋణ మెన్నటికీ తీర్చుకోజాలను. నే నీప్రపంచము చూడడము పునర్జన్మ మెత్తినట్లున్నది. నీ పేద తనముతో నాకు వైద్యము, పరిచర్య చేయించుచు, నీ వెంతయో ఋణము చేసియుందువు. ఈ నగ నమ్మి ఆ ఋణమును తీర్చుకొమ్ము' అని చేతిలోని స్వర్ణ కంకణముల నూడదీసి యందిచ్చెను. అందులకు రంగమ్మ, 'జానకమ్మా! నేను కూటికి లేనిదాననగుట కొంత ఋణము సేయక తప్పినది గాదు. అంతమాత్రముచేత నీ నగల నమ్మి నా ఋణము తీర్చుకొమ్మందువా? తల్లీ నీవు కులాసాగా యుంటే చాలు. అదియే పదివేలు.' అంత జానకి, 'అట్లు గాదు రంగమ్మా! నేను బహుచిక్కులలో చిక్కుపడియున్నాను. ఇంటనుండి ధనమువచ్చుత్రోవ లేదు. ఇప్పటికి చేసికొన్న అప్పు తీర్పకపోయినను, ఇఁకముందు పూటజరుగుటకు ధనము కావలదా? నీ వెక్కడనుండి తేగలవు? నీ వన్యథా భావింపక యీ నా గాజుల నమ్మి, పైకము తీసికొనిరా!' అని గాజుల నందిచ్చెను. రంగమ్మ 'పేదతనము చెడ్డది. ఏమిచేయుదును తల్లీ' యనుచు గాజుల నందుకొనెను.

ఇంతలో వెంకటయ్య రంగమ్మ యింటియొద్దకు వచ్చెను. తర్వాత ఇట్లు సంభాషణ జరిగెను.

వెంక.— 'రంగమ్మా! రంగమ్మా!' (అనుచు లోపల ప్రవేశించును.)

రంగ.— 'నాయనా! వెంకటయ్యా! రా! రా! ఇట్లు కూర్చుండు' మని పీట నిచ్చెను. వెంకటయ్య కూర్చుండి ఇటు మాటాడజొచ్చెను.

వెంక.— 'రంగమ్మా! అమ్మగోరు సేమంగున్నారా! నా యినాము మాటేమి రంగమ్మా.'

రంగ.— "నా బంగారుతల్లి నీమూలాన బ్రతికి బయట పడింది." (అని జానకివైపు చూచును.)

జానకి.— "రంగమ్మా, ఈతఁ డెవరు? ఈతని వలన నే నెట్లు బ్రతికితిని?"

రంగ.— "ఆమాట ఈ వెంకటయ్యద్వారానే విను తల్లీ" (వెంకటయ్యవైపు తిరిగి) "వెంకటయ్యా, అమ్మగారి యనుమానము తీర్చు."

వెంక.— 'ఏముంది తల్లీ. ఆపొద్దస్తమానము చేపలు పట్టుదామని కొండపేట మడుగులో వలలు వేయడం, తీయడంగా ఉంటిమి. ఆపొద్దెమిపేట పొరవందున మడుగులో మంగచెక్కగొట్టి దీటీలతో వేటాడేటందుకు తయారు పడుతుండగా, పైనుండి ధమ్మున నట్టనడిమడుగులో ఈ యమ్మోరు దూకింది. వెంటనే వలలు వేసినాము. పాతాళగంగలోకి పోయి పైకొచ్చి మా వలలలో పడింది. బయటికిలాగి, ఇంటికి మోసకొచ్చి మంచీచెడ్డ చూత్తుండగా నీ వొచ్చావు రంగమ్మా. అంతే.'

రంగ.— 'చూశావమ్మా! ఈతఁడు నీ ప్రాణము రక్షించినాడు. ఏమైనా యినాము కావాలంటాడు. పేదవాడు.'

జానకి.— 'అయ్యో! నన్ను చావనిచ్చియుంటే బాగుండేది. నేను బ్రతికి యేమిచేయను! దిక్కులేనిపక్షినై నిలబడినాను. నా మనోహరుఁడు చంద్రశేఖరుఁడు ఈ లోకములో లేడు.' ఈమాట ముగియకముందే, వచ్చి కూర్చొనియున్న వైద్యుఁడు చంద్రశేఖరమను పేరు విని 'అయ్యో! పాపము శమించుగాక! చంద్రశేఖరుఁడను యువకుఁడొకఁడు చంద్రగిరి ఆసుపత్రిలో సుమారు నెల నాళ్లు చికిత్స పొందినాడు. నే నప్పు డక్కడ యుండి, ఆయనకు వైద్యముసేయుట తటస్థించెను. అప్పుడప్పుడతఁడు 'జానకీ! జానకీ!' యనుచుండువాఁడు. ఆతఁడు నేఁడు బ్రతికే యున్నాడు' అని ముగించెను. జానకి యీ మాట విని 'అయ్యా! నిజమేనా! బ్రతికియున్నాడా? నిజము చెప్పుము. నే నాతని భార్యను. ఆతఁ డెందుండునది చూపి పుణ్యము గట్టుకొనుడు' అని యేడువఁజొచ్చెను.

చంద్రశేఖరుని చంపివైచితినని శ్యాములుఁడు చెప్పగా జీవితాశ త్యజించి, ప్రాణత్యాగమునకు బూనిన జానకి చంద్రశేఖరుఁడు బ్రతికియున్నాడను మాటతోడనే బ్రతుకుపై నాశ బుట్టి మనోహరుని సందర్శనమునకు తహతహ పడెను. చంద్రశేఖరుని జూపి పుణ్యము గట్టుకొనుడని వైద్యుని బ్రతిమాలెను. వైద్యుఁడు తుమ్మలగుంటవాని. చంద్రగిరి వైద్యాలయములో పనిసేయుచుండి పించను పుచ్చుకొని, కొన్నిదినములుగా స్వగ్రామముననే యున్నాడు. సుమారరువది సంవత్సరముల వయస్సుండును. పెద్దవాఁడగుట జానకియందు దయబుట్టి 'అమ్మా! నీ భర్త కేమియు కీడు మూడలేదు. ఆతఁడు పూర్తిగా స్వస్థతజెంది, ఆసుపత్రినుండి తిరుపతికి బోయినాడు. తదుపరి యెందుబోయెనో తెలియదు. నేను విచారించి ఆయన జాడలరసి, నీకు దెలియజేయుదును. నీవు భయపడకుము' అని వెడలిపోయెను.

జానకి కొంతవడికి నిబ్బరముచెంది, తన మెడలో నున్న మూఁడుపేట్ల బంగారుగొలుసును వెంకటయ్యచేత నిడి, 'అయ్యా! నీ ఋణ మింతటితో దీరదు. నేను నాడు మృతి జెందియుండిన నానాథుఁడు బ్రతికియున్నాడనువార్త వినుటకేని నోచుకొనియుండను. ఆయన దర్శనభాగ్యము గలిగినపుడు నీకు మఱింత సన్మానము సేయుదును. ఇఁక పోయిరండు' అని పంపివేసెను. రంగమ్మ ఈ యుదంతమంతయు వినుచు నాశ్చర్యమగ్నాంతరంగయై చంద్రశేఖరుఁడు చంద్రగిరి

ఆసుపత్రిలో చికిత్సనొందుట, జానకి కొండశిఖరమునుండి మడుగులో దూకుట, బోధపడకుండెను. జానకి ఆమె స్థితి గమనించి, 'రంగమ్మా! నీ కంతయు భోజనానంతరము సావధానముగా జెలిపెదను రమ్ము' అని లోపలికి బోయెను. రంగమ్మ అనుకరించెను.

పది దినముల తర్వాత రంగమ్మ తిరుపతి పట్టణమున కొన్ని వస్తువులుగొని వీథుల గమించి తిరుపతి ఉన్నతపాఠశాల నానుకొనియుండు బాట ననుసరించి పోవుచుండెను. కొంత దూరములో నా బాటను కలియు మఱియొక చిన్నబాట కలదు. అయ్యది తుమ్మలగుంట చేరుటకు మార్గము. ఈ రెండు బాటలు కలియుచోట ఒక పెద్ద వట వృక్షము గలదు. ఆ వృక్షముక్రింద గల ఒక వేదికపై నొక స్త్రీ అవనతవదనయై దుఃఖాశ్రువులు రాల్చుచు, అప్పుడప్పుడు పైటకొంగుతో తుడిచికొనుచు ఖిన్నహృదయయై యుండెను. రంగమ్మ కొంత దూరమునుండియే ఈ స్త్రీవ్యక్తిని గమనించెను. సమీపమునకు వచ్చెను. కాని పలుకరింపక పోవుట కెనకు మనసు రాకుండెను. ఎవరో స్త్రీ దుఃఖించుచున్నపుడు మఱియొక స్త్రీ గాంచి, బాగోగులు విచారింపక పోవుట మంచిది గాదని చేయవలెబోయి, నెత్తిమీఁద గల గంప దించుకొని, ఒక ప్రాతిపైఁ గూర్చుండి యిట్లు మాట్లాడఁదొడఁగెను.

రంగ.— 'అమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు? మీ దేవూరు? నీ కేమి గలిగిందమ్మా?'

నూతనవ్యక్తి.— (కనులు తుడిచికొనుచు) 'నా దేవూరైతే నీ కేమి? నే నెందుకేడిస్తే నీకేమి? నీ దారిని నీవుపో. నాతో నీకేమిపని?' అని విసరికొట్టెను.

రంగ.— 'అబ్బో! అంతకోప మెందుకమ్మా! ఏమో ఆడుదాని ఏడుస్తుంటే, ఆడుదానిని చూస్తూ పోవడమెట్లా అని పలుకరించాను. సాధ్యమైతే సాయము చేస్తాను.'

నూ. వ్య.— 'నీవు నా కష్టాలు తీరుస్తావేంటి? పో! నోరు మూసికొని, అధికప్రసంగము చాలించి.'

రంగ.— 'ఏమి మిడిసిపోతావే తల్లీ! అందుకనే యిట్లు ఏడుస్తూ ఉండేది. మా తల్లి ఉంది జానకమ్మ తల్లి. చల్లని తల్లి. ఆమె కాలిగోటికైనా పనికిరా రీ మిడుసరపు ఆడోండ్లు' అని లేచి, తట్ట నెత్తికొని ముందుకు నడువసాగెను.

నూ. వ్య.— (జానకిపేరు వినగానే ఏవో పాతసంగతులు స్ఫురణకు వచ్చినట్లదిరిపడి, లేచి రంగమ్మ కెదురుగా నిలువబడి). 'ఏమే జానకమ్మ కాలిగోటికికూడా పనికిరాదంటావ్! ఎవరే ఆజానకి! చచ్చి స్వర్గలోకములో ఉందా! ఆ పాపిష్టి ముండవలన మాయన్న పిచ్చెత్తి పోయాడు.'

రంగ.— 'ఏమమ్మా! నీ కింత కోపము! శాంతమనేది నీకు లేనే లేదే. జానకమ్మ నీకు తెలిసిన జానకమ్మగాక వేరే లేదా?'

నూ. వ్య.— 'మా జానకి లోయలోదూకి నుజ్జుయిపోయింది. దానితో నేనిలే.'

రంగమ్మ ఈమాట వింటూనే కొంత విస్మయపడింది. తన జానకినే నూతనవ్యక్తి ప్రసక్తికిఁ దెచ్చుచున్నదని గ్రహించి— శాంతముతో "అమ్మా, నీకేమో కష్టములు కలిగినట్లున్నది. నేను నాచేతనైనంత సహాయము చేయుటకు తయారుగా ఉన్నాను. నీవు కోపపడితే లాభములేదు" అనియెను. నూతనవ్యక్తి కొంత కోపమును తగ్గించుకొని ఆలోచనలో బడియెను. కొంతవడికి దెప్పతిలి రంగమ్మతో, 'నేను కోపముతో ఏమేమో అన్నాను. క్షమించు. నే నిప్పుడీ యూరిలో దిక్కులేకుండా నిలిచిపోయినాను. నేను మా యూరికి పోవుటకు వీలులేదు. నే నిక్కడే మఠమువీధిలో ఒక యిల్లు అద్దెకు తీసికొని యున్నాను. నిన్నరాత్రి నన్నొకడు మోసముచేసి, నా నగలన్నీ తీసికొని పారిపోయినాడు.'

రంగ.— 'ఆతఁ డెవరమ్మా! ముందు మీకు తెలియునా?'

నూ. వ్య.— 'తెలియదు. మాయన్న పిచ్చిబట్టి పారిపోయిన తర్వాత, నేను దిక్కుదోచక ఈ వూరి కొచ్చితిని. పెద్దమనిషివలె మంచిచెడ్డలు విచారించి, నాకు యిల్లు కుదిర్చి, నా ప్రేమను దొంగిలించి, తుదకు మోసముచేసెను. వాడు నన్ను ప్రేమింపలేదు. నా నగలకోసర మిత్తుచేసిన ట్లిపుడు తెలియుచున్నది. వాని జాడ తెలియరాకున్నది. పోలీసు పిర్యాదు చేసితిని.'

రంగ.— 'అయ్యో! వెఱ్ఱితల్లి! ఈ వూరిలో మోసగాండ్రెక్కువ. దేవుని కొండకు వచ్చి దెయ్యాన్ని పూజించినట్లు వచ్చిన వాండ్లంతా మోసపోతుంటారు.'

నూ. వ్య.— 'నీవు నాకు కొంత సాయపడవలెను. నీ పేరేమో చెప్పెదవా?'

రంగ.— 'నాపేరు రంగమ్మ — నీ పేరేమి తల్లి?'

నూ. వ్య.— 'నాపేరు రుక్మిణి.'

రంగ.— జానకి చెప్పిన కపట నాటకములో మాయాచంద్రశేఖరుని వేషము వేసిన దీ రుక్మిణియే నని రంగమ్మకు ఇప్పుడు తెలిసినది. ఆ సంగతి వెలువరింపక, రుక్మిణితో 'అమ్మగారూ! నేను ప్రక్కపల్లెలో నున్నాను. ఇంటి సామానులు తీసికొని పోవుచున్నాను. చీకటికూడ పడింది. రేపు ఉదయము వచ్చి మీతో మాట్లాడుతాను. మఠము వీధిలోగదా తల్లీ ఉండేది. తప్పక వస్తాను' అని లేచి, గంపె నెత్తికొని దారి బట్టును. పోవుచున్న రంగమ్మవైపు జూచి, 'తప్పక రావలెను రంగీ!' అని రుక్మిణి పట్టణముదారి బట్టెను.

(9-వ ప్రకరణము సమాప్తము)

# నాట్యకళ—అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

[గత సంచిక తర్వాత]

ఆహార్యాభినయము:—

ఆహార్యమనఁగా నేపథ్యవిధానము. కేవలము వేషము చేతనే పాత్రమనోభావముల సామాజికుల హృదయమున కందఁజేయుట యాహార్యాభినయము. అనఁగా నటులను వారివారి భూమికలకు దగినట్లుగా వస్త్రభూషాదుల నలంకరింప జేయుట. ఇందులకు తమ కాలములందలి వస్త్రభూషాదుల జ్ఞాన మావశ్యకతయేగాక, పూర్వకాలమందలి ఋషి, నృప, కంచుక్యాదుల వస్త్రభూషాదులజ్ఞానమును గొంతవఱకు గలిగి యుండవలయును. మాలతీమాధవ నాటకమందలి యఘోరఘంటుఁడు—కపాలకుండల మొదలయిన భూమికలకు వేషములు వేయుటకై, తాంత్రిక మతములవారు పూర్వము వేసికొనునట్టి వేషము నెఱుంగ వలయును. అట్లే ప్రబోధ చంద్రోదయమునందలి పాత్రములను సింగారించుటకు నందు వర్ణింపఁబడిన మతమువా రెట్టి దుస్తులు మొదలయినవి ధరించుచుండిరో తెలిసి యుండవలయును. లేని యెడల వేషములు శోభింపనేరవు. రంగాలంకారము లన్నియు రంగముమీఁద జూపఁబడు వన, జల, పర్వతాదు లన్నియు, నిప్పటివారిచేఁ బ్రదర్శింపఁబడు తెరలు మొదలగునవియు నాహార్యాభినయమునకు సంబంధించినవియే.

సాత్వికాభినయము:—

సాత్వికమన మనస్సత్వముచే నిర్వర్తింపఁబడునది. సాత్వికాభినయ మనఁగా రస నిష్పత్తిని గలిగించు విభావ, స్థాయి, సంచారి, సాత్త్విక భావములను యను భావములచే సామాజికుల హృదయములకుఁ దత్తద్భావముల నుజ్జ్యోతింపఁ జేయు ప్రక్రియ. కావున సాత్వికాభినయమున నాయికానాయక ప్రవృత్తులును, మనోవృత్తి రూపములగు రస విశేషములోని స్థిరభావములను రతి, శోకము, ఉత్సాహము, భయము, విస్మయము, క్రోధము, నగవు, జుగుప్సయు, నిర్వేదాదులగు ముప్పదిమూఁడును స్తంభప్రళయాదులగు నెనిమిదియు, అనుభావములచేఁ జూపఁబడును. అనుభావములనగా క్రియలు. ఉదాహరణముగా:— క్రోధమున, వికృష్టనాసాపుటము, ఉద్వృత్తనయనము, సందంష్టోష్ఠపుటము, గండస్ఫురణము మొదలగునవి యనుభావములు. వీనిచేఁ గ్రోధభావము నభినయింపఁ దగు. ఇట్లే శంకకు:— ముహుర్ముహురవలోకనము, యవకుంఠనము, ముఖశోషణము, జిహ్వాపరిలేహనము, ముఖవైవర్ణ్యము, స్వరభేదము, కంపము, శుష్కోష్ఠము, కంఠాయాసము మొదలగునవి యనుభావములు. వీనిచే శంకావస్థ నభినయింపఁ దగు.

సాత్విక భావములగూడ నిట్లే అభినయింపఁ దగు. అలంకారికుల మతమున సాత్విక భావము లెనిమిది. ఇతరుల సుఖదుఃఖములను జూచి వానియెడ మనస్సునకు సానుభూతి కలిగినగాని యీ భావము లుత్పన్నము కావు. కనుక వీనికి సాత్విక భావములని పేరు వచ్చెను. సత్వములనఁగా మనస్సులో నుండి పుట్టినవి. లోకధర్మము ననుసరించుటచేఁ నాట్యమునకు సత్వము కావలయును. ఏ భావము నభినయించు నప్పు డా భావముగల పురుషునితోఁ దాదాత్మ్యమును బొందవలెను. దుఃఖము రోదనాత్మకము—దానిని అదుఃఖితుఁ డెట్లభినయించును? కావున నటుఁడు తాను గైకొనిన భూమికతోఁ గొంతవఱకైన నైక్యమును జెంది, యీ భావముల నటింప వలెనని భరతాచార్యుల మతము. ఈ సాత్వికాభినయమున స్థాయి సంచారి, భావాభినయమే కాక సాత్విక భావముల నభినయించుటయు నైని సూచింపఁబడియె. సమస్త భావములకును ప్రయోజనస్థానములు కలవు. అందులో సాత్విక భావముల నేయేపట్ల నభినయింప వలసినది యిట్లు చెప్పినాఁడు. హర్ష, భయ, శోక, విస్మయ, విషాద, రోగములను జూపుటకు స్తంభమును; క్రోధ, భయ, హర్ష, లజ్జా, దుఃఖ, శ్రమ, రోగ, తాప, వ్యాయామ, శ్రమల, పరిణామములగు స్వేదమును; శీత, భయ, హర్ష, రోష, స్పర్శ, జరా, రోగములకు గంపము; స్పర్శ, భయ, శీత, హర్ష, క్రోధ, రోగముల వలన రోమాంచము. భయ హర్ష క్రోధ జరా రోగ మద జనిత స్వరభేదమును, సంతోషము, బెదరించుట, జ్వరము, కోపాదులచేఁ వేపథువును; ఆనందము, కోపము, ధూమము, కజ్జలము, శోకము, అనిమిషత్వము, శీతము, రోగముల వలన యశ్రువులు; శ్రమ, మూర్ఛ, మద, నిద్రాభిఘాతమోహాదుల వలన ప్రళయము; ఇట్లు వీని పుట్టుపూర్వోత్తరములఁ జెప్పుచు నభినయమునందు వీనిని నెట్లు చూపవలయునో ఈ క్రింది విధమున జెప్పెను.

(సశేషము)

## కోర్టు నోటీసులు :

కడప డిస్ట్రిక్టు కోర్టులో.
1951 సం॥ O. S. No. 66 రు లో.

పెన్నపూస వెంకటరెడ్డి, తాడిపత్రి తాలూకా వెంకటాంపల్లె... ... ... .. వాది.

And

1. సి. యం. రామచంద్రారెడ్డి, యితని అవిభక్త కుమారులు 2. రామసుబ్బారెడ్డి, 3. బాలరామిరెడ్డి, 4. రామనాధరెడ్డి, 2 to 4 ప్రతివాదులు మైనర్లు, గార్డియన్ తండ్రి 1టో ప్రతివాది సి. యం. రామచంద్రారెడ్డి, జమ్మలమడుగుతాలూకా కొండాపురం... ... ... ప్రతివాదులు.

ఈ వ్యాజ్యములో వాది ప్రోనోటును బట్టి ప్రతివాదుల పైన రు. 7000_0_0 లకు దావా చేసియుంటున్నాడు. సదరు వ్యాజ్యము, ప్రతివాదులు హాజరు కావడమునకుగాను, 28_9_1951 తేదీకి వాయిదా వేసియున్నారు. కనుక నాటి దినము పగలు 11 ఘంటలకు ప్రతివాదులు పై కోర్టులో హాజరయి, తమ ఆక్షేపణలు తెలుపుకొన వలసినది.

కడప, 11_9_1951. } పి. నారాయణ రెడ్డి, బి. ఏ., బి. ఎల్., అడ్వకేటు.

---

కడప డిస్ట్రిక్టు జడ్జి కోర్టువారి సముఖానకు.
A. S. No. 67 of 1951.

Between :

తుంగా నర్సయ్యనాయుడు వగైరాలు ... అప్పీలెంట్లు.

Vs.

(1) నన్నూరు పీరయ్య, (3) నన్నూరు పెద్దగురప్ప, (9) నన్నూరు చలమయ్య, (10) నాయుడుపల్లె వేమయ్య, (11) నన్నూరు వెంకట్రామయ్య, (12) మునుకు చెంగయ్య. సాకీన్ రాజంపేట తాలూకా పొందలూరు మజరా గోవిందంపల్లె ... ... ...రెస్పాండెంట్లు.

ఈ నెంబరులోని పై రెస్పాండెంట్లకు.

ఈ నెంబరులోని అప్పీలెంట్లు, నెందలూరు మునసపు కోర్టువారు E. P. 5/51 in O. S. 27 of 43 రు లో చేసిన తీర్మానముపైన యీ కోర్టులో పై అప్పీలును దాఖలు చేసినారు. సదరు అప్పీలును కోర్టువారు మీ ఆక్షేపణలకుగాను 26_9_51 తేదీకి వాయిదా వేసినారు. సదరు తేదీన పగలు 10 ఘంటలకు కోర్టుయెదుట హాజరై, మీ ఆక్షేపణలను తెలుపుకొన వలసినది. అట్లు హాజరు కానిపక్షమున మిమ్ములను యెక్స్ పార్టీ చేయబడునని యుండువల్ల ఆజ్ఞాపించడ మైనది.

కడప, 8_9_1951. } కె. యల్. శ్రీనివాసరావు, అప్పీలెంట్ల అడ్వకేటు.

## ప్రకటన.

ప్రొద్దుటూరు తాలూకా మైదుకూరు మజరా తిమ్మాయిపల్లె గ్రామం కాపురస్తుడు తోట చిన్నసంజీవయ్య (నా పినతండ్రి) మనస్థిమితములేక, యితరుల దుర్బోధలకు లోబడి మా చరస్థిరాస్థులను తాకట్టు లేక విక్రయములు వగైరా ప్రయత్నములు జరుపుచున్నట్లు తెలియుచున్నది. ఒక వేళ అట్టివి ఇంతకుముందు జరిపియున్నను, యికముందు జరిపినను యెంతమాత్రము చెల్లనేరవు. నా పినతండ్రియగు తోట చిన్నసంజీవయ్యగారికి చరస్థిరాస్తులయందు ఎట్టి హక్కు ఉండబోదని ఖండితముగా తెలుపడ మైనది.

తిమ్మాయిపల్లె. తోట సుబ్బరాయుడు.

---

## ఆసియా అనాథ యా

( 8 వ పేజీ తరువాత )

కాలగతి నెవరడ్డగలరు? ఎవరెన్ని తంటాలు పడినను ఆసియాఖండము ననాథ యగుచున్నది. బ్రిటను అమెరికాలకే స్థానచ్యుతి గలుగుచుండ, ఫ్రాన్సు, పోర్చుగలు రాజ్యముల యుక్తులు సాగగలవా? ఇవి యెప్పుడో రాలిపోవును. అచిర కాలముననే ఆసియాఖండ రాజ్యములు సంపూర్ణ స్వతంత్రములు కాగల ఆశా రేఖలు కాన్పించుచున్నవి. ఓం తత్సత్.



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER : K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

REGISTERED No. M. 5285.

రాజకీయ వార పత్రిక.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఏ.,

సంపుటము 4.
సంచిక-30.

బుధవారము, సెప్టెంబరు 19, 1951.

విడి పత్రిక వెల
మూడు అణాలు.

## విషయానుక్రమణిక



——:(౦):——

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 30.

శ్రీ ఖరనామ సంవత్సర భాద్రపద బ. ౮, సెప్టెంబరు, 19, 1951.

ప్రతి బుధవారము ప్రకటింప బడును

## శ్రీ జవహరిలాలు కలలు నిజమగునా?

అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులగు శ్రీ. జవహరిలాలుగారు కలలు కనుచున్నారో ఏమో తెలియకున్నది. ఈ నెల 9-వ తేది న్యూఢిల్లీలో సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశములో మాటలాడుచు, రాబోవు ఎన్నికలలో న్యాయబుద్ధి, నిష్కపటము, సామర్థ్యముగల వారినే అభ్యర్థులుగా కాంగ్రెసు సంస్థ పక్షమున నిలుపవలె ననిరి. ఇట్టి గుణములు గల వారు కాంగ్రెసు సంస్థలో సభ్యులుగా లేకున్నను తొందరలేదు. వారు కాంగ్రెసు ముఖ్యాశయములతో ఏకీభవించిన చాలును. న్యాయైకదీక్ష, సామర్థ్యము గలవారు అందఱి రీతిగా ఎన్నికలలో అభ్యర్థిత్వమునకై దరఖాస్తులు పంపుకొనక పోయినను తొందర లేదు. ఏ కారణము వల్లనైనను అట్టి వ్యక్తులను ఎన్నికలలో అభ్యర్థులుగా ఉండుటకు ఆక్షేపింప కూడదని స్పష్టమైన పదములతో చెప్పిరి. శ్రీ. జవహరిలాలుగారు సూచించిన ఆదర్శములు, వెలిబుచ్చిన భావములు చాల ప్రశంసార్హమైనవి. ఇట్టి ఆదర్శములను సూచించుటయందు కాని —ఇట్టి భావములను వెలిబుచ్చుటయందు కాని ఈ నాడు ఈ దేశ రాజకీయములలో శ్రీ. జవహరిలాలుగారికి ఆయనే సాటి. ఆయన సూచించిన ఆదర్శములను కాని, లేక పలుమారు వెలిబుచ్చుచుండు భావములను కాని కార్యరూపమున పెట్టవలసిన వారు ఏకారణము వల్లనో ఉపేక్షించు చున్నారు. ఇదే ఇందుండు విషాదము. ఆయన చుట్టు కంటికి కనపడని దుర్మార్గమైన పరిధి యొకటున్నట్లు తోచుచున్నది. కోట యొకటి ఉన్నట్లు తట్టుచున్నది. ఆ పరిధిని ఛేదించుకొని బయట కొచ్చునంతటి బలము ఆయన కున్నదో లేదో అని సందేహము కలుగుచున్నది.

పరిపాలనా యంత్రములోనేమి, కాంగ్రెసు సంస్థలలోనేమి ఆయన భావములను కార్యరూపమున పెట్టవలసినవారు పెట్టుచూ వచ్చియుండినచో, శ్రీ. జవహరిలాలుగారి నాయకత్వమున, కడచిన ఐదు సంవత్సరములుగ కొనసాగిన పరిపాలన క్రింద, భారత దేశము స్వర్గముగా మార్పు, పొంది యుండెడిది. గాంధిజీ కలవరించుచుండిన రామరాజ్య మీవఱకు స్థాపితమై యుండెడిది. దురదృష్టవశమున అట్లు జరుగలేదు. ఆయన దేశీయుల ఎదుట పెట్టుచూ వచ్చిన ఆశయములు, వెలిబుచ్చుచూ వచ్చిన భావములు, ఆయన అనుచరవర్గమువారు అములు జరుపక —ఆయన ఆశయములకే ప్రత్యక్ష విరోధముగ ప్రవర్తించుచు వచ్చుచున్నందుననే, ఆయన పేరుకు బలముతగ్గినది. కాంగ్రెసు సంస్థకు అప్రతిష్ట వాటిల్లినది.

ఇండియా రాజ్యాంగ చట్టమునకు సవరణ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టినపుడు 19 (2( సూత్రమును సవరించు సందర్భములో తీవ్రమైన ఆక్షేపణ, విమర్శన, బయలు దేరెను. శ్రీ. జవహరిలాలుగారు అప్పుడు లేచి 19 (2) సూత్రమును సవరించుటలో వాక్స్వాతంత్ర్యమును కాని, భావ స్వాతంత్ర్యమును కాని లేక పత్రికా స్వాతంత్ర్యమును కాని అరికట్టు ఉద్దేశ్యము ప్రభు

త్వమున కెంతమాత్రమును లేదు. అవసరము కలిగినప్పుడు పార్లమెంటుకు చట్టము చేయుటకు అధికారము కల్పించుటకు మాత్రమే ఆ సవరణ (ఎనేబులింగు క్లాజు) ఉద్దేశింప బడినది. ఆ సవరణలో సూచించిన అధికారములను చెలాయించుటకై ఇప్పటి ప్రభుత్వమువారెట్టి చట్టములను చేయరని ఇండియా ప్రధానమంత్రి హోదాతో ఒక హామీ యొసగిరి. తీర ఈ వాక్యములు పత్రికలలో ముద్రించుటకై ఉపయోగించిన సిరా ఆరీ ఆరకమునుపే — హోంశాఖా మంత్రిగారు "నేరములకు ప్రోత్సహించు ప్రెస్ బిల్లు" అను పేరుతో — శ్రీ. జవహరిలాలుగారు బహిరంగముగ పార్లమెంటులో ఇచ్చిన మాటకు (హామీకి) ప్రత్యక్ష విరోధముగా ఒక బిల్లును ప్రవేశపెట్టి, శాసనము చేయుటకు ఈ నాడు ముందున కొచ్చి యున్నారు. శ్రీ. జవహరిలాలుగారు వెలిబుచ్చిన భావములకు అనుగుణ్యముగా ప్రవర్తించుచున్నారో లేక ఆయన మాటలను చులకన చేయుటకై — ఆయన పలుకుబడిని తగ్గించుటకై, ఎల్లరు "వద్దు" "వద్దు" అని ఘోషించినను వినక, ఈ దినము ఆ బిల్లును సెలెక్టు కమిటీకి శ్రీ. రాజగోపాలాచార్యులవారు పంపియున్నారో మాకు అర్థము కాలేదు.

రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు పక్షమున, ప్రారంభ దశలో అభ్యర్థులను సూచించుటకు రాష్ట్ర ఎన్నికల బోర్డులు నియమింపబడినవి. అభ్యర్థులను నిర్ణయించుటలో శ్రీ. జవహరిలాలుగారు వెలిబుచ్చిన భావములో నూటికి ఒక్క పాలైన, రాష్ట్ర ఎన్నికల బోర్డువారిలో ప్రాకి, వారి అంతరాత్మల నుద్రేకింపచేయగలుగుచో, న్యాయైక దీక్ష, సర్వసామర్థ్యముగల వ్యక్తులే అభ్యర్థులుగ సూచింపబడుదురనుట కెంతమాత్రము సందేహముండదు. కడచిన ఎన్నికలలో రాష్ట్ర శాసన సభలకును, రాజ్యాంగ నిర్మాణ పరిషత్తునకును, (రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సభనే పార్లమెంటుగ మార్చు చేసినపుడు కలిగిన ఖాళీస్థానములకు) పార్లమెంటు సభకును, కుర్చీలకు బరువైన వారిని, నోరే తెరవజాలని వారిని, అసమర్థులైనవారిని, సందేహాస్పదమైన ప్రవర్తన కలవారిని ఏరుకొని రనుటలో వివాదమెంత మాత్రముండజాలదు. కొన్ని ఉన్నత పదవులకును, కమిటీలకును, బోర్డులకును, నియమింప బడిన వ్యక్తులలో, కొందఱిని చూచినను, నామినేషను చేయబడినవారిలో కొందఱిని చూచినను, పరిపాలనా సామర్థ్యమును, ప్రభుత్వగౌరవమును, ఉన్నతస్థాయికి తెచ్చుదృష్టితో మంత్రులు ఆ నియామకములను, ఆ నామినేషనులను చేయలేదనియు, తమ తమ వర్గములను బలపఱచుకొనుటకే అటుల చేసియున్నారనియు, ఎట్టివారికైనను తట్టక మానదు. న్యాయబుద్ధి కలవారును, సత్యనిరతులు, సర్వసామర్థ్యముకలవారు ఈ దేశములో లేరా, ఈ దేశము గొడ్డుపోయినదా అని ఒక్కొక్కప్పుడు తోచును.

శ్రీ. జవహరిలాలుగారు చెప్పినటుల దేశములో అత్యుత్తమ రకమునకు చేరినవారీ దేశములో కావలసినంతమంది యున్నారు. కాంగ్రెసువారు అధికార పదవులను, రొట్టెముక్కలకు, వారిలో వారే తగవులాడుచుండగ, దేశమునకు కాని, కాంగ్రెసునకుకాని తమసేవను ఉపయోగ పెట్టుటకు సిగ్గుతో ముందుకు రాజాలకున్నారు. కాంగ్రెసు వారిలో అధికార పదవులకు వారిలో వారికే తగవులు లేనిచో, కొన్ని రాష్ట్రములలో పలుమారు మంత్రి వర్గములు మారుట కవకాశముండెడిదే కాదు. ఒక మంత్రివర్గము ఎంతమంచిదో లేక చెడ్డదో, రెండవ మంత్రివర్గము కూడ సమానముగ మంచిదే లేక చెడ్డదే. ఇందులో ఒకటి మేలని, ఒకటి కీడని చెప్పుటకు వీలుకాదు.

ఎన్నికలకు దరఖాస్తులను పిలువకమునుపే కాంగ్రెసులో బలమైన వర్గమునకు చేరినవారు, రాష్ట్ర శాసన సభలకును, ఇండియా పార్లమెంటుకును, ఏ యే నియోజక వర్గములకు ఎవరెవరు నిలు

వలయునో అను విషయమై అప్పుడే ఒడంబడికకు వచ్చినారనియు; దరఖాస్తులను పిలుచుట, ప్రజాభిప్రాయమును సేకరించవలెనను మిషపై పర్యటనలు సలుపుట, కేవలము నామకార్థమైన విషయములే నని పలువురు భావించుచున్నారు. ప్రజలలో వ్యాపించిన ఈ అభిప్రాయమందు నిజముండవచ్చును. లేక కేవలము ఊహాగా నుండవచ్చును. ముందుగనే నిర్దుష్టమైన అభిప్రాయమొసగుట సమంజసము కాదు.

సుమారు నాలుగు వేల స్థానములకు అభ్యర్థులను ఏర్పరచుకొనవలసి యున్నది. ఇప్పటికిని, ఎన్నికలకై నామినేషన్లు దాఖలు చేయవలసిన తేదీకిని గడువు తక్కువగా నున్నది. ఇంత విశాలమైన దేశములో న్యూఢిల్లీ పట్టణములో కూర్చుండి, ఎంతటి సాహసోపేతుడైనను శ్రీ. జవహరిలాలుగారు ఒక్కరే అన్ని స్థానములకును, తాను దేశీయుల ముందిడ పెట్టిన ఆదర్శముల ప్రకారము, అభ్యర్థుల నేర్పరచుట మానవ శక్తికి సాధ్యముకానిపని. దుర్ఘటమైన కార్యము. యోగ్యులైన వారిని, న్యాయబుద్ధి కలవారిని అభ్యర్థులుగా నియమించుటకు రమ్మని చెప్పువారెవరు? కోరువారెవరు? ఇది ఒక గొప్ప సమస్య.

ఈ సమస్యను పరిష్కరించుటకును, శ్రీ. జవహరిలాలుగారి కీర్తికిని, కాంగ్రెసు పేరును నిలవబెట్టుటకును రెండేమార్గములు కలవు. రాష్ట్రీ ఎన్నికల బోర్డువారు వారి హృదయములలో ఒక గొప్ప పరివర్తనము తెచ్చుకొని — అభ్యర్థుల నెన్నుకొనుటలో శ్రీ. జవహరిలాలుగారు సూచించిన షరతులపైననే దృష్టినంతయు కేంద్రీకరించినచో, న్యాయైక దీక్ష, సత్యనిరత, యోగ్యతగల వ్యక్తులు వారికంటికి పడగలరు. అట్టివారిని అభ్యర్థులుగా సూచించి శ్రీ. జవహరిలాలుగారి కలలను నిజము చేయవచ్చును. లేదా కాంగ్రెసు బుకింగు ఆఫీసులో ఎవ్వరికి టికెట్టు యివ్వక, ప్రతినిధులను ఎన్నుకొను పని ప్రజలకే వదలి పెట్టవచ్చును. అట్టి ఎన్నికలలో జయమొందినవారిలో, అన్ని యోగ్యతలు కలిగి క్రమశిక్షణకు లోనై యుండు సభ్యుల నెల్లరిని కాంగ్రెసు పతాకము క్రిందికి పిలుచుకొని, ఒక బలమైన రాజకీయపార్టీని స్థాపించుకొనవచ్చును. దేశపరిపాలనా బాధ్యత అప్పుడంగీకరింపవచ్చును. ఇంకను కొంత వ్యవధియున్నది. శ్రీ. జవహాలాలుగారి కలలు కలలుగనే నిలిచిపోవునో లేక కొంతకు కొంతవఱకైన నెరవేరునో చూడవలెనని దేశీయులు ఆతురత పడుచున్నారు.

పత్రికా పరిచయము:

# "సుజాత"

పవిత్ర సారస్వత మాసపత్రిక. సంపుటము ౨, సంచిక ౧. (జన్మదిన తెలంగాణా ప్రత్యేకసంచిక) సంపాదకులు; శ్రీ. గడియారము రామకృష్ణ శర్మగారు: హైదరాబాద్. విడిప్రతిక: రు 1/-

«సుజాత» ఉత్తమ శ్రేణికి జెందిన మాసపత్రిక. ప్రథమ జన్మదినసంచిక మాకార్యాలయమలంకరించినది. «స్వవిషయము» అనుశీర్షిక క్రింద వ్రాయబడిన సంపాదకీయ వ్యాసములో మేమాసించినట్లు, పెద్దలు ఆదరాభిమానములుంచి, తమరచనలచే «సుజాత» నలంకృతను జేసిరి. మేమనినట్లు నడిచితిమో లేదో నిర్ణయించి సూచింపవలసినది లోకము. ఇంకను క్రొంగ్రొత్తసొబగులు గూర్చి «సుజాత»ను ముద్దుగా తీర్చవలయునను కోరికలుచాల కలవు. కాని ఈమె దరిద్రుల ఇంటిబిడ్డ"యని సంపాదకులు తెలిపిరి. పత్రికా సంపాదకు లెట్టిసామర్థ్యులైనను, పత్రికలు ఎంతటి విజ్ఞానమును ప్రతిబింబింప జేయునట్టి రచనలుకలిగినను, వానివంక జూచుమహనీయ మూర్తులుకానరారు. అందుకే ఉత్తమ పత్రికా రాజములు దరిద్రుల ఇంటి బిడ్డలైనవి. సామాన్య పాఠకులు వానిని కన్నెత్తిచూడరు. ఏమి దౌర్భాగ్యమో కాని పాఠకుల దృష్టి యంతయు తారా చిత్రములపైనను, కల్పిత కథలపైనను, శృంగారభూయిష్ఠమైన అల్లికలపైననే ఎక్కువగ కేంద్రీకరింప బడుచున్నది. సినీమాతారలు ముఖచిత్రముపై చిత్రింపని వార పత్రికలనుకాని, మాస పత్రికలనుకాని అడుగువారే కనబడరు. పత్రికా రంగములో వ్యాపారచింత యెక్కువైనందున, పాఠకులదృష్టి నాకర్షించుటకు, ప్రఖ్యాతిచెందిన పత్రికలుకూడ — వాని ఆదర్శములను మార్చుకొని, — ముఖపత్రములపై కళాస్థానములనుచూపు సినిమా తారలను వేయుచు, లోభాగమంతయు కథలతోనింపి, ప్రతియింట చేరుటకు పోటీచేయుచున్నవి. పాఠకుల అభిరుచి ఆ తీరుననుండ ఎవ్వరేమి చేయగలరు?

"తప్పుత్రోవ బట్టిన లోకమును దిద్దవలసిన బాధ్యత వహించు పవిత్ర పత్రికారచన, ప్రజల అజ్ఞానమునే అవకాశముగ తీసికొని, అర్జన వైపు మొగ్గుట దేశదౌర్భాగ్యము. సినిమా, కామపత్రికల ధాటికి విజ్ఞాన వాఙ్మయ మాగలేక పోవుచున్నది. ప్రభుత్వమున కీవిషయ మక్కర లేదు. 'మనరాజ్యాంగము సువిశాలమైన'దని సంపాదకులు తెలిపిన అభిప్రాయముతో మేము సంపూర్ణముగ ఏకీభవించుచున్నాము.

"తెలంగాణము" అనుశీర్షిక క్రింద శ్రీ. ఆదిరాజు వీరభద్రరావుగారును: "తెలంగాణము — ప్రకృతి సంపద" అను శీర్షిక క్రింద శ్రీ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారును; "తెలంగాణము — ప్రాచీనాంధ్ర వాఙ్మయము" అను శీర్షిక క్రింద శ్రీ. దూపాటి వెంకటరమణాచార్యుల వారును: 'తెలంగాణా రాజకీయోద్యమములు' అను శీర్షికక్రింద శ్రీ. మాడపాటి హనుమంతరావు పంతులుగారును; తెలంగాణము — తెనుగు పత్రికలు" అను శీర్షికక్రింద శ్రీ. సురవరము ప్రతాపరెడ్డిగారును; తెలంగాణము — ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము"అను శీర్షిక క్రింద శ్రీ. దేవులపల్లి రామానుజరావుగారును; "తెలంగాణము — ప్రాచీన శిల్పము"అను శీర్షిక క్రింద శ్రీ. పుటపర్తి శ్రీనివాసాచార్యులుగారును, "నేటిహైదరాబాదు — కొన్ని అంకెలతో" అను శీర్షిక క్రింద శ్రీ. కొమ్మవరపు సుబ్బారావుగారును; శ్లాఘుపాత్రమైన శైలిలో వ్యాసములనీప్రత్యేక సంచికకు వ్రాసియున్నారు. తెలంగాణములోని వివిధ సమస్యలను అద్దములోవలె విపులముగ ఆ వ్యాసరాజములలో చూపియున్నారు.

సౌందర్యమైన తెలుగు భాషామతల్లిని, పై ఉత్తరాంధ్రులు ఇప్పుడు దౌర్జన్యముచేసి చెఱ పట్టి చెఱుచుచున్నరీతి, 'సుజాత'కు వ్యాసములను వ్రాసిన ప్రసిద్ధరచయితలు తెలుగుభాషా సౌంద ర్య స్వరూపమును చెఱపట్టరైరి. సహజరూపము తోనే తెలుగు భాషను నడిపించి, 'సుజాత' సంచి కకు ప్రత్యేక వన్నె దెచ్చిరి. రాయలసీమ రచ యితలు ఈ విషయమును ముఖ్యముగా గమనించి భాషలో కూడ భావదాస్యమునకు రాయలసీమ వారు తలయొగ్గకూడదని మా మనవి.

'సుజాత' ప్రోత్సహింప బడుట కెంతయు అర్హమైన పత్రికయనుట నిర్వివాదము. రాయల సీమవారు హైదరాబాదులో ప్రకటింప బడు చున్న ఈ మాసపత్రికను చదివి, అందలి సమస్య లను బాగుగ తెలుసు కొందురు గాక యనియు, ఆ పత్రికామతల్లికి తగుప్రోత్సాహ మొసగెదరు గాక యనియు ఆశించు చున్నాము.

—0—

# సరియైన చీవాట్లు.

(శ్రీ. భూతపురి నారాయణస్వామిగారు.)

ఈ సెప్టంబరు నెల 9 వ తేది పాకిస్థానము భారత దేశముపై యుద్ధము ప్రకటించునని యెవ రో జోస్యము చెప్పిరట. కొన్ని పత్రిక లీవార్త కు ప్రాముఖ్య మిచ్చి పెద్దక్షరములతో ప్రకటిం చెనట. ఈవార్తను సత్యమనినమ్మి భీతచిత్తులై చాల మంది ప్రజలు మూటముల్లెల గట్టుకొని గ్రా మములవదలి కాందిశీకులై పారిపో జొచ్చిరట. ఈ యలజడి యెంత వఱకు ప్రాకినదో యేమో భారత ప్రధాన మంత్రి శ్రీ జవహరిలాలు నెహ్రూగారు అఖిలభారత కాంగ్రెసు సంఘము నెదుట నుపన్య సించుచు వీరందఱను చివాట్లు పెట్టిరి. ఈచీవాట్లు సరియైనవనుట నిస్సంశయము.

ఇట్టి యసత్య ప్రచార మీ యొక సందర్భ మున నే కాదు. ఇట్టి దానిచే నెందరో సర్వప్రాం తముల వంచింప బడుచున్నారు. ఈ వంచనము మన దేశమున పరిపాటి యైనది. జ్యోతిషిక లర్ఘ నిర్ణయము చేయుచు "తేజీ—మందీ" అను పేరు తో ప్రకటించు వానిని నమ్మి యెందరో వ్యాపా రులు నష్ట పడుచున్నారు. జాతక ఫలముల విని గుండెచెడిన వారెందరో యున్నారు. కొందఱు ధనసంపాదనమునకై ప్రశస్తమైన జ్యోతిశ్శాస్త్ర ము నీ జాలునకు ద్రిప్పి యుండుట శోచనీయము.

జ్యోతిశ్శాస్త్ర మతి ప్రాచీనము. గ్రహ ములకును భూమండలమునకు నేదోకొంత సంబంధ మున్న దని మనపూర్వుల యభిప్రాయము. గ్రహ గతుల ప్రభావము కొంతవఱకైన భూమండలము నకు ప్రసరించునని నవీన విజ్ఞాన వేత్తలు కొందఱు నుడువుచున్నారు. గ్రహముల గూర్చి పరిశోధన లెన్నియో జరుగుచున్నవి. ఎన్నియో వింతలు ద్యోతకము లగుచున్నవి. దైవసృష్టిలోని రహస్య ముల నెన్నిటినో వీరు తెలిసికొన గలుగు చుండు టచే వీరికి దైవజ్ఞు లనిపేరు. వీరు సర్వదా పూజ నీయులు.

జ్యోతిశ్శాస్త్రి మన గుడ్డి నమ్మకముల మూటకాదు. దానిని సిద్ధాంత, జాతక, ముహూ ర్తములను మూడు ముఖ్యభాగములుగ మన పెద్ద లు నిర్ణయించిరి. సిద్ధాంత భాగము గణితముపై నాధారపడిన స్థిరమైన పక్షము. నాలుగారు లిరు వదినాలుగనుట యెట్టిదో అట్లే ఖండనము లేనిది సిద్ధాంత భాగము. గ్రహగతులను బట్టి నిర్ణయిం చు నమావాస్య గ్రహణాదులు ప్రత్యక్ష గోచ రము లగుచుండుటచే జ్యోతిషికులను పేరున నీవ

రేమి ఫలములు చెప్పినను ప్రాకృత జనులు తప్పక విశ్వసించెదరు. మన దేశములో నిట్టి విశ్వాసము హెచ్చుగ నుండ వచ్చునేమో కాని, యీ బాధ ప్రతిదేశము నందు, కేవల ప్రత్యక్ష వాదులైన పాశ్చాత్యుల యందు సైతము కలదు. మానవ ప్రకృతి యంతట నించు మించుగ నొకే విధమున నుండును.

మానవులు సర్వసాధారణముగ దమ భవిష్యత్తును దెలిసి కొన గోరుదురు. దీనిని పురస్కరించు కొని కొందఱు విపరీత ఫలముల జెప్పి మానవుల మానసముల తబ్బిబ్బు చేయుదురు. ఈ ఫలములు సరిగ జరిగెనా ప్రగల్భములు గొట్టుదురు. తప్పిపోయెనా, గౌరీశాపమున్నదని తప్పించు కొందురు. ఈ ఫలనిర్ణయము చాల కష్టమైన పని. భిన్న పద్ధతులు, భిన్న మతములు కలవు. మన ప్రాచీన ఋషులు, కాళిదాస వరాహమిహిరాదులు ఎంతో శ్రమించి పరిశోధించి వెల్లడించిన భావములు నిరాధారములు కావు. కాని వానిని జక్కగా గ్రహించుటయే చాలకష్టమైన పని. ఎవరు పట్టిన వారు భావి ఫలములను జెప్ప బూనుట అవివేకము; లోకమునకు (జేయు ద్రోహము. శాస్త్రమున కపకృతి గావించిన వారగుదురు.

ఇంతకు నే యాధారము పైన 9 వ తేది యుద్ధ ప్రకటనము జరుగునని జోస్యము చెప్పిరో దురూహ్యము. 9 వ తేదిన గ్రహముల స్థితి పరికించుదము. చంద్రుడు వృశ్చికమున, గురువు మీనమున, అంగారకుడు కర్కాటకమున, శని కన్యయందు, రాహువు కుంభమున నుండినవి. సింహరాశియందు రవి, బుధ, శుక్ర, కేతువు గ్రహము లుండినవి. ఈ చతుర్గ్రహ కూటమును బట్టి యీ భయంకర ఫలము వచించిరా? ఈ కూటము కాక పంచగ్రహ కూటములు సైతము ఈ సంవత్సరమున జరిగినవి. నా డీ యభిప్రాయము వెల్లడింపక 9 వ తేదిని మాత్ర మేల నిర్ణయించిరో బోధ పడకున్నది. ఈ లాటి కూటములు దేశారిష్ట సూచకము లని చెప్పుదురు. అయినను సింహరాశిలో స్వక్షేత్రాధిపతి యగు సూర్యుడు నుండుటచే నీ కూటము అరిష్టము కలుగ జేయదు. గురుశనులకు గల సమసప్తక దోషమొకటియే గణింప దగిన విషయము. ఈ దోషము సంవత్సరము పొడవున నుండగా, సెప్టంబరు 9 వ తేది కింత ప్రాముఖ్యమేమి వచ్చినది? ఇట్టివి ప్రతి సంవత్సరము తరచు కలుగు చుండును. వీనిని బట్టి గోరంతలు కొండంతలుగా జేసి ప్రజలను భయపెట్టుట చాలతప్పు.

పాకిస్థాన మొనర్చు ప్రయత్నముల బట్టి యుద్ధము తప్పదని యనుకొన వచ్చును. గాని యీ యూహను జ్యోతిషముతో ముడిపెట్టరాదు. ఒక వేళ పాకిస్థానము యుద్ధమునకు దిగినచో నెదుర్కొనుటకు మన ప్రభుత్వమున్నది. అందు వలని భయము ప్రజల కక్కఱ లేదు.

విపరీత జ్యోతిష ఫలములను బట్టి పురుష ప్రయత్నము మానరాదు. పురుషకారము విడిచి భవిష్యత్తు కేవలము గ్రహగతులపై నాధారపడియుండునని చేతులు ముడుచుకొని యుండువారు యద్భవిష్యులనబడు వ్యర్థులు. పురుష ప్రయత్నమొనర్పక మూఢ విశ్వాసములను బట్టు వారిని నెహూర్గారు చీవాట్లుపెట్టుట సమంజసకార్యము. పౌరుషమునకే మనపూర్వులు ప్రాధాన్యమిచ్చిరి. పురుష ప్రయత్నము చేయువారికే భగవంతుడు తోడ్పడునని చెప్పిరి. నిర్వ్యాపారత్వము కాపురుష గుణముగా నిందించిరి. శుభ ఫలములు గలిగినపుడుబ్బి తబ్బిబ్బు కారాదనియు నశుభ మొదవినపుడు నిరుత్సాహపడి ప్రతిక్రియాహీనుడు కారాదనియే మనపూర్వులు హెచ్చరించిరి.

> 'సర్వమేవేహ హి సదా సంసారే రఘునందన,
> సమ్యక్ప్రయుక్తాత్ సర్వేణ పౌరుషాత్ సమవాప్యతే'.
> (యోగ వాసిష్ఠము.)

"రఘునందనా! ఈ లోకమున యథోచితముగ పురుషకారము నుపయోగించిననే వాంఛితము సిద్ధించును", అని శ్రీరామ చంద్రునికి వసిష్ఠ మహాముని యుపదేశించెను. పురుషప్రయత్నము సరియైన విధమున నాచరింప వలెననియు, ఫలము మాత్రము భగవ దధీన మనియు మనపూర్వులు చాటిరి. పౌరుషమే భగవంతుడని కూడ వచించిరి. కావున భారతీయులు పౌరుషము నెరపి, భారతదేశ సౌభాగ్యమునకు నప్రమత్తులై కృషిచేయవలెనని నెహ్రూగారొనర్చిన బోధను భారతీయులు గ్రహింతురు గాక. (ఓం. తత్ సత్)

—(0)—

సినిమారంగము.

# శ్రీ ఘంటసాల వెంకటేశ్వర రావుగారు.

ఎంత విశాలమైన ప్రపంచములో ప్రజలు ఎన్ని కష్టములకు లోనైనను, పైకి రావలెనను తీవ్రమైన పట్టుదల యున్నచో, అట్టివారి కృషి తప్పక ఫలించునని శ్రీ. ఘంటసాల వెంకటేశ్వరరావుగారి జీవిత సంగ్రహము కొంత ఋజువు పెట్టుచున్నది. ఇతడు గొప్ప ధనవంతుడు కాడు. అధునిక ప్రపంచము గుర్తించు నటువంటి ఉన్నత విద్యల నభ్యసించి, విశ్వవిద్యాలయ పట్టములను బొందలేదు. కేవలము కళోపాసి. కాని సినిమా రంగములో నితని పేరు మాత్రము వినని వారుండరు. ఒక దిశ నుండి కొంచము కొంచముగ ఇతని పేరు మారు మ్రోగుచునే యున్నది. నిత్యబ్రతుకునకే కష్టపడుచుండిన జీవి, ఈ నాడు 'నాకేమికొరత'అను స్థితికొచ్చినాడు. ఈ వ్యక్తి ఇట్టి స్థితి కొచ్చుటకు అంతరంగిక (వ్యక్తిగతమైన) పరిస్థితు లేతీరున ఒత్తిడి చేసినవో, బాహ్య పరిస్థితు లేతీరున తోడుపడినవో కొంత చర్చించుట సమంజసము.

శ్రీ. వెంకటేశ్వర రావుగారు వయస్సులో పెద్దవాడుకాడు. ముప్పది సంవత్సరములకు లోబడిన యువకుడు. జన్మస్థానము గుడివాడ. సామాన్య కుటుంబమునకు చేరినవాడు. పండ్రెండు సంవత్సరముల ఈడుననే తండ్రిని కోలుపోయెను. స్థానిక పాఠశాలలో నాల్గవ ఫారము చదువుచుండి, తండ్రి వియోగము వలన పాఠశాల విద్యకు తిలోదకముల నొసగెను. ఇతని తండ్రికి సంగీతమునందభిరుచి మెండుగ; కొంత పాండిత్యమును కూడ గడించి యుండెను. అందువలన సంగీతమను నది వెంకటేశ్వర రావు రక్తములోనే మిళితమై యుండెను. ఇందు కనుగుణ్యముగ బాల్య దశనుండియే తనతండ్రి ఇతనికి సంగీతమును నూరిపోయుచు వచ్చెను. తండ్రి చనిపోయిన వెంటనే పాఠశాల విద్యకు స్వస్థి చెప్పెను. కాని తనలో సహజముగ ఇమిడియున్న సంగీత విద్యను దీక్షతో కొనసాగించుటకు మాత్రమీబాలుడు దృఢతీర్మానమును గావించు కొనెను. తండ్రి గతించిన తర్వాత తన పరిసరగ్రామములలో సంగీత పాఠకులున్నారని తెలుసుకొని, వారి దగ్గరికేగి ఆకళను అభివృద్ధి చేసుకొనుచు వచ్చెను.

ఇంతలో విజయనగరములో సంగీత కళాశాల స్థాపింప బడెను. దానిలో శ్రీ. ద్వారము వెంకటస్వామి నాయుడుగారికి ప్రాధాన్య మెక్కువగ నుండెను. ఈ సంగతులు బాలుడైన వెంకటేశ్వర రావుగారి చెవులకు సోకెను. వెంటనే ఈ బాలుడచ్చటికి పరిగెత్తిపోయెను. సనాతన విద్యార్థుల సాంప్రదాయము నవలంబించి, ప్రతి ఇంటికిపోయి 'భవతీ భిక్షాందేహి'అని చెప్పి అన్నము సంపాదించుకొనుచు, కళాశాల యందు సంగీత విద్యను నేర్చుకొనుచు వచ్చెను. ఒకటిన్నర సంవత్సర మీతీరున గడిపిన తర్వాత కళాశాల హాస్టలులోనే ఉచిత భోజనము లభించెను. ఐదు సంవత్స

రములు సంగీతవిద్య నభ్యసించి, 1941 సంవత్సరము యోగ్యతా పత్రమును పొంది, గృహోన్ముఖుడాయెను. ఇవన్నియు ఆంతరంగిక పరిస్థితులవల్ల కలిగిన పరిణామములు. 1941 సంవత్సరముననే విజయనగర పట్టణములో అనేక సభలలో తనయోగ్యతను ప్రకటించెను. ఋజువు పెట్టెను.

1942 సంవత్సరములో దేశ రాజకీయ వాతావర్ణము చాలసంక్షోభ కరముగా నుండెను. గాంధీజి 'క్విట్ ఇండియా' ఉద్యమమును ప్రారంభించెను. బ్రిటీషు పరిపాలకుల నిర్బంధ విధానము అగ్ని జ్వాలలరీతి దేశమంతయు నావరించెను. దేశనాయకు లెల్ల కారాగృహములలో బంధింపబడిరి. మన వెంకటేశ్వరరావుగారు కూడ ఈ జాతీయ యుద్యమములో తగులుకొనిరి. విధ్వంసక చర్యలలో తాను స్వయముగా పాల్గొనకున్నను, జాతీయ భావముల నుద్రేకింప జేయునట్టి పాటలను తన మాధుర్యమైన కంఠస్వరముతో పాడి, తోడియువకులకు మత్తు ఎక్కించిరి. టెలిగ్రాఫ్ తంతెలను కోసినారను నేరముక్రింద తనస్నేహితులు పట్టుకొనబడిరి. అట్టి కార్యములలో తాను జోక్యము కలిగించుకొనలేదని చెప్పవయ్యెను. పోలీసువారి అరెస్టుకు లొంగిపోయెను. ఆరు నెలలు కేసువిచారింప బడిన పిదప ఒక సంవత్సరము కఠినశిక్ష విధింపబడెను. ఈ సంవత్సర కాలము బళ్ళారి ఆలిపూర్ జయిలులో వెంకటేశ్వరరావుగారు కాలము గడిపిరి.

ఈ యువకుని సంగీత మాధుర్యము అద్భుతమైనది. ఏ యే సందర్భములలో, ఏ యే రసమువల్ల ప్రేక్షకుల భావముల నాకర్షింప వచ్చునో ఆ విధమున కంఠస్వరము మారుచుండును. వీరు వారనక, సర్వజనులపై మచ్చుమందువలె ఈ యువకుని సంగీత ప్రతిభ పనిచేయును. ఇది దైవదత్తమగు ఆంతరంగికశక్తి. ఈ శక్తికి కట్టుపడని వ్యక్తియే కానరాదు. ఇదియే ఆశ్చర్యమగు గొప్ప పరిణామము.

ఇక బాహ్య పరిస్థితులు ఈ వ్యక్తికి ఎటుల తోడుపడెనో చూతము. కారాగృహశిక్ష ఈ యువకుని పాలిట భాగ్యలక్ష్మిగా మారెంచెను. తనమాధుర్యమైన సంగీతముచేత తోడి రాజకీయ ఖైదీల నెల్ల ఆనందింప జేయుటవల్ల, వారి పరిచయ భాగ్యము, స్నేహభాగ్యము ఇతనికి లభించెను. రాత్రి చాల పొద్దు పోవువఱకును జయిలులో నుండు కాలములో పాడుకొను చుండెడివాడు. ఇతని శిక్షాకాలము పూర్తియై విడుదల కాబడు దినము సమీపించు కొలది, తోడి రాజకీయ ఖైదీలకు విచారము ఎక్కువ కలుగ మొదలిడెను. ఆకర్షనీయమై, తన్మయత్వ మొనరించు ఇతని గానామృతము తప్పును కదాయని వారు చింతింపసాగిరి. ఇట్టి వాతావర్ణమును ఈ వ్యక్తి జయిలులో వ్యాపింప జేసెను. బమ్మెర పోతనామాత్యుని వర్ణనలను చదువునపుడు దృశ్యములు ఎటుల కంటి ఎదుట కనబడు చుండునటులుండునో, అదే విధముగ శ్రీ. వెంకటేశ్వరరావు పాడుచో, దృశ్యములన్నియు అప్పుడు కంటి ఎదుట చూచుచున్నటులనే పాఠకుల మనోభావము మారొందును.

కారాగృహమునుండి విడుదలయైన పిదప ఇతడు వివాహమాడెను. వివాహముతో ఇతని కష్టములుకూడ ఎక్కువాయెను. కాని సినీమారంగములో ఖ్యాతిగాంచిన శ్రీ. నాగయ్య పరిచయము లభించు కాలము దగ్గఱకి వచ్చెను. చెన్నపట్టణము చేరెను. శ్రీ. నాగయ్యగారి 'త్యాగయ్య' చిత్రములో పాటలు పాడు అవకాశ మొసగబడెను. ఆ పాటలు ఎల్లర మెప్పుబడసెను. పిదప 'రత్నమాల'లోను 'బాలరాజు' చిత్రములోను పాటలు పాడి ఆబాల గోపాలమును తలయూపించెను. ఇప్పుడు 'విజయా'వారి చిత్రములలో సంగీత డైరెక్టరుగ పనిచేయు చున్నాడు. కష్టదినము లెల్ల తొలగి పోయినవి. దక్షిణ భారత దేశమంత శ్రీ. ఘంటసాల వెంకటేశ్వరరావును గుర్తించిన

(మిగత 16 వ పేజీలో)

# నాట్యకళ — అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

[ గత సంచిక తర్వాత ]

1. అంగములన్నియు నిష్క్రియముగ నుండుటయే స్తంభము.

2. చెమట తుడుచుకొనుట, విసనకఱ్ఱతోఁ విసరుకొనుట, గాలిని కోరుట యను క్రియలచేత స్వేదమును;

3. శరీరమును స్పృశించుట వలన రోమాంచము;

4. దగ్గుత్తిక మొదలైనవానిచేత స్వర భేదమును, ధ్వని కంపమును;

5. స్ఫురణ, శరీర కంపముల వలన వేపథువును;

6. ముఖముమీఁది కళను మార్చియు, ఇడాపింగళాది నాడులను బిగబట్టియు వైవర్ణ్యమును;

7. కనులు తుడుచుకొనుట, కన్నీరు కార్చుట మొదలయిన వాటివలన నశ్రువులను;

8. నిశ్చేష్ట, నిష్కంపశూన్య జడాకృతి దాల్చుటవలన, భూమిపైఁ బడుటవలనను ప్రళయము నభినయింప వలెను.

పై భావములు గనుపఱుపవలసిన విధము లిట్లు తెల్పఁ బడినను, అభినయమునకు నటునియొక్క యనుకరణ కౌశలమే మూలాధారము. ఈ చాతుర్యము లేనివాఁడు నటుఁడుగ నెన్నబడఁడు. అందఱునటులకు నన్ని రసములనుగాని, యన్ని భావములనుగాని యనుకరణసేయు కౌశల ముండదు. కొందఱకు వీర రౌద్రాదులను జూపుటయందును, గొందఱకు శాంతాదికముల నటించుట యందును మాత్రము ప్రజ్ఞయుండును. గాన వారివారి ప్రజ్ఞల ననుసరించి, వారివారికి పాత్రల నిరూపింప వలయును. (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము)

## నాయక ప్రకరణము.

నటుఁడు తాను ధరింపఁబోవు పాత్రోచితమైన కులము, రూపము, ఉదారము, తేజము, విద్యాచాతుర్యము, ధర్మము, పాండిత్యము, యశము, ప్రతాపము, ధురంధరత్వము, గుణము మొదలగునవి ముందుగా గ్రహింప వలయును.

**నాయకులు :**

ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాన్తుఁడు యని నాలుగు విధములు.

**ధీరోదాత్తుఁడు:**

ధర్మయుద్ధమును ప్రధానముగాఁ గలిగి, కోపము లేకయుండి, సాపరాధులను దండించుటకొఱకై క్షణకోపము దాల్చి, పరుగిడు శత్రువును విడుచునట్టి శౌర్యముగలిగి, పరులు కీర్తింప నవనతవదనుఁడై గాంభీర్యాది గుణములు గలిగి యుండును.

**ధీరోద్ధతుఁడు:**

వీర రౌద్రరసముల ప్రధానముగాఁ గలిగి, దర్పము, శౌర్యము, మదము, అసూయ, సులభముగఁ గలుగు కోపము, ఆత్మశ్లాఘము, వంచకత్వము, మాయ మొదలగు గుణములు గలిగియుండును.

**ధీరలలితుఁడు:**

వీర శృంగార రసముల ప్రధానముగాఁ గలవాఁడు పుత్ర మిత్ర కళత్రాది ఆత్మజన యోగక్షేమములఁ దలంపడు. సంగీత సాహిత్యములయందుఁ బ్రీతి గలిగి, సుఖము, భోగము, శృంగారము లనుభవింప నభిలాష గలిగి యుండును.

**ధీరశాన్తుఁడు:**

వీర శాంతరస ప్రధానముగాఁ గలిగి, దాన ధర్మముల నాచరించువాఁడై, కష్టములు సహించి, శాంత ప్రసన్న గుణములఁ గలిగియుండును.

**శృంగార నాయకులు:**

అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నాలుగు విధములు.

ఏకపత్నీ వ్రతస్థుఁడు 'అనుకూలుడు'.

అనేక నాయికల కనుకూలముగ నుండువాఁడు 'దక్షిణుఁడు'.

నాయిక ఎంత వేడుకొనుచున్నను బెడముఖము పెట్టువాఁడు 'శఠుఁడు'.

తాను జేసిన నేరమును నిర్భయముగ నాయికకు జెప్పువాఁడు 'ధృష్టుఁడు'.

**సహాయకులు:**

పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడు అని నాలుగు విధములు.

నాయకునికన్నఁ గొంచెము తక్కువయైనవాఁడు — పీఠమర్దుఁడు. (సుగ్రీవుఁడు, మకరందుఁడు మొదలగువారు)

నాయకున కుపశాంతి చేయుటకు గీతము మొదలుగాఁ గల విద్యలలో నొక విద్య తెలిసినవాఁడు — విటుఁడు.

సంధానచతురుఁడు — చేటుఁడు.

వాక్యములు, అంగములు, వేషము వికృతముగా జూపి నవ్వించువాఁడు — విదూషకుఁడు.

(సశేషము)

# వంశ పారంపర్యమైన గ్రామోద్యోగములు: —నూతన రాజ్యాంగ చట్టము.—

(శ్రీ. తాడిమర్రి భుజంగరావు పంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్., రిటైర్డు జిల్లా జడ్జి, కడప.)

మన రాయలసీమ గ్రామములలో కక్షలు మెండు అని మొన్నటి కడప పర్యటనలో గవర్నరుగారు నుడివిరి. దీనికి మనము తల వంచుకొన వలసినదే. కాని కొన్ని ఆర్థిక కారణముల వలన ఈ దుస్థితి ఏర్పడినదనియు, ఇక్కడి ప్రజల స్వభావజనిత దోషముచేత పుట్టినది కాదనియు, మునుపటి బ్రిటిషు ప్రభుత్వపు రాజ్యాంగనీతి రాయలసీమ విషమస్థితిని ఎక్కువ చేసినదనియు నేను మనవి చేసికొనుచున్నాను. కక్షల విషయమై, మనలను ఇతర జిల్లాల జనులు దూఱుట తఱచుగ జరుగుచుండుట వల్ల, కొన్ని సంగతులు చెప్పుట అవసరము. ఈ కక్షలకు మూలకారణము లేవి? 1. గ్రామములలో భూ విభజన సరిగా లేకుండుట. ఏ కారణము వలన అయినను కొన్ని కుటుంబములయందు మాత్రము ఎక్కువ విస్తీర్ణము గల భూమి చేరియున్నది. అందువలన ఆ కుటుంబములకు మాత్రము పలుకుబడి యున్నది. అట్టి కుటుంబములలో నెవరైన దుష్టులు జన్మించినయెడల కక్షలకు అవకాశ మేర్పడుచున్నది. 2. పల్లెలనుంచి పట్టణములకు జనుల నిరంతర యాత్ర జరుగుచునే యున్నది. జీవనోపాధికై ఉద్యోగములను సంపాదించుట, పిల్లల చదువు, రోగ నివారణ,— ఇత్యాది కారణముల వలన జనులు 100 ఏండ్లనుంచి గ్రామములను విడిచి పట్టణములకు పోవుచున్నారు. దీనివలన పల్లెలలో జనసంఖ్య తగ్గినది. ముఖ్యముగ ధనికులు గాక, కష్టజీవులు గాక యుండు మధ్యమతరగతి జనులు ఇప్పుడు గ్రామములలో లేరు. ఇట్టి వారుండిన యెడల ఎంతటి బలవంతునకైనను కొంత మనోభీతి యుండును. ఇప్పుడు దుష్టులు నిరంకుశులగుటకు వీలు కలిగినది. 3. చాల పల్లెలలో పాఠశాలలు లేవు. చదువురానివారి సంఖ్య చాల ఎక్కువ. చదువురాని బీదవారికి, దుష్టప్రవర్తన గలిగిన బలవంతులను ధిక్కరించు ధైర్య మెక్కడనుండి రాగలదు? 4. మన గ్రామములు దూరదూరముగ వ్యాపించి యున్నవి. మెట్టగ్రామములలో పరిసరముల 5, 6 మైళ్ళ వరకు భూములు లేనియెడల, ఆ గ్రామములు కొన్నిచోటుల స్వయంపోషకములు కావు. మనకు పెద్దరోడ్లు బహు స్వల్పము. చాలచోటుల ఈ పెద్దరోడ్లకు మన గ్రామములు దూరముగ నున్నవి. ఏదైన సంఘటన జరిగిన యెడల తొందరగా పోలీసువారు కాని, ఇతర అధికారులు గాని పోవుటకు వీలు పడదు. మన గ్రామముల దుస్థితికి కడపటి కారణము పల్లెలలో క్రింది తరగతివారి పరమదారిద్ర్యము. ఆ దారిద్ర్యము చేత పశుప్రాయులై గ్రామములను విడిచిపోవుటకు శక్తిసామర్థ్యములు లేక ఆ దరిద్ర జనులు ఎట్టి దుష్కార్యమైనను చేయుటకు సిద్ధపడుదురు. ఇద్దరు బలవంతులకు కక్ష ఏర్పడిన, మొదటివాని అనుచరులు రెండవవానిని, రెండవవాని అనుచరులు మొదటివానిని, నిష్కారణముగ స్వల్పధనార్థమై చంపుటకు సిద్ధులుగ నుండెదరు. ఇది వారి దారిద్ర్య దోషము వలన ఏర్పడిన పరిస్థితి. ఈ సందర్భములలో నాకు రాయలసీమజిల్లాలలో కక్షలున్నవనిన ఆశ్చర్యము కాదు. కక్షల ఉపద్రవము ఎంత తక్కువగ ఉన్నదని ఆశ్చర్యము. పై మూలకారణముల నశింపచేయుట బ్రిటిషు ప్రభుత్వమువారికి అసాధ్యమై యుండెనా? లేదు. వారి రాజ్యాంగనీతి వేరు. గ్రామములను నశింపచేయు బ్రిటిషువారి వైఖరిని చూచికదా గాంధీమహాత్ముడు సహాయ నిరాకరణ మార్గమును అనుసరించెను. సస్యశ్యామలమైన కోస్తా జిల్లాలలో మన గ్రామములో నుండు రీతి కక్షలున్నవా? అక్కడ పార్టీలు ఉండవచ్చును. కాని కత్తులు, కటారులు, గండ్రగొడ్డండ్ల మెరవణీలు (మొన్న కమ్యూనిష్టువారి ఆగమనమునకు ముందు) కోస్తా జిల్లాలలో ఎప్పుడైనను వినియుంటిమా? కనుక రాయలసీమ దుస్థితికి రాయలసీమ జనులకు బాధ్యత ఉండినను, ప్రభుత్వమువారి బాధ్యత కూడ నున్నది.

ఈ సంగతి ఎట్లుండినను, ప్రస్తుతమేమో కక్షలున్నవి. గ్రామాభివృద్ధిని కోరువారు తమ పలుకుబడి నుపయోగించి కక్షలను నశింప జేయవలసినదిగ నా ప్రార్థన. కక్షల ఉద్రేక ముండిన గ్రామాభివృద్ధి శూన్యము.

## గ్రామోద్యోగులకు భయము కలుగ జేసిన ముఖ్యాంశము.

ఇక గ్రామోద్యోగులకు భయము కలుగజేసిన ముఖ్యాంశ విచారణ కుపక్రమించెదను. అది ఏమనగ, నూతన రాజ్యాంగ చట్టములోని 16-వ ఆర్టికల్, ఒకటి, రెండవ క్లాజుల వలన, వారి పారంపర్య హక్కులకు ఏమైనా అపాయము వాటిల్లినదా యనెడి యంశము. మొదట ఆ రెండు క్లాజులు ఏమి చెప్పునది మనము ఆలోచించ వలెను. మొదటి క్లాజు తాత్పర్య మేమన, రాజ్యాంగమునకు సంబంధించి, దానికి చేరిన ఏ నౌకరి విషయమైగాని, ఏ ఉద్యోగపు విషయమైగాని రాజ్యాంగములోని

సర్వ పౌరులకు అట్టి నౌకరీలను, ఉద్యోగములను సంపాదించుటకై ప్రయత్నములు చేయుటకు సమాన వసతులు, సౌకర్యము ఉండవలసినది. రెండవ క్లాజు (i) ఇదే విషయము విశదీకరించుచున్నది. దాని తాత్పర్య మేమనః— ఇతర కారణములు లేక మత, జాతి, కుల, లింగ, సంతతి, జన్మస్థాన, వాసస్థాన కారణములచే మాత్రము, రాజ్యాంగమునకు సంబంధించి, దానికి చేరిన ఏ నౌకరి విషయమైగాని, ఏ యుద్యోగము విషయమైగాని, ఏ రాజ్యాంగపు పౌరునికిగాని అనర్హత ఏర్పడుటగాని, తారతమ్యము చూపబడుటగాని జరుగకూడదు. (ii) అనగా వీడు హిందూమతస్థుడు—వీడు కాడు, ఇత్యాది మత భేదతారతమ్యములు; వీడు ఆంగ్లోఇండియన్—వీడు కాడు, ఇత్యాది జాతిభేద తారతమ్యములు; వీడు బ్రాహ్మణుడు—వీడు బ్రాహ్మణేతరుడు, ఇత్యాది కులభేద తారతమ్యములు; ఈ వ్యక్తి పురుషుడు—ఈ వ్యక్తి స్త్రీ, ఇత్యాది లింగభేద తారతమ్యములు; వీడు శివాజీ సంతతివాడు—వీడు కృష్ణదేవరాయల సంతతివాడు, ఇత్యాది సంతతి భేద తారతమ్యములు; వీని జన్మస్థానము చెన్నపురి—వీనిది కలకత్తా యనెడి జన్మస్థాన భేద తారతమ్యములు; వీడు కడప నివాసి—వీడు రాజమహేంద్ర నివాసి, ఇత్యాది వాసస్థాన భేద తారతమ్యములుః— ఇట్టి తారతమ్యము లేవియు నుండరాదు. రాజ్యాంగ పౌరులెల్లరికి వృత్తి ఉద్యోగములు సంపాదించుకొనుటకు చేసెడి ప్రయత్నములకు సమాన అవకాశములు, వసతులు ఉండవలెను. ఇది 16-వ ఆర్టికల్ రెండవ క్లాజుయొక్క తాత్పర్యము. ఇది ఎక్కువ ప్రశంసనీయమైన క్లాజు అని చెప్పుటకు ఏమియు సందేహము లేదు.

ఈ రెండు క్లాజులలో ముఖ్యముగ గమనించవలసిన విషయములు రెండున్నవి. మొదటిది సందర్భము వచ్చినప్పుడు సమాన ప్రయత్న వసతులు అందరికి కలిగించ వలసినదని మాత్రము ఈ క్లాజులు చెప్పుచున్నవికాని, ఉన్న నౌకరీలను, ఉద్యోగములను, ఏకకాలమందు తీసివేసి, తత్క్షణమే ఖాళీలు సృష్టించి, ఆ ఖాళీలకు అందరిచేత పోటీ చేయించవలెనని ఈ క్లాజులు చెప్పడములేదు. రెండవది; ఈ క్లాజులు కేవలము క్రొత్తవిగావు. 1935 వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టులో నుండినవే. ఆ చట్టములోని 275(ఎ), 278 (1) (బి) సెక్షనులు ఇదే అర్థమును జూపుచున్నవి. 1935 వ సంవత్సరపు రాజ్యాంగపు ఆక్టులో జాతి, కులభేదముల ప్రత్యేక ప్రశంస లేదుగాని, మత శబ్దములో నవి చేరినవే. ఇట్లు ప్రాత రాజ్యాంగపు చట్టమునకును, క్రొత్త రాజ్యాంగపు చట్టమునకును భేదము లేనపుడు, మునుపటి నిబంధనలు మారినవని చెప్పుటకు కారణ మేమియు కనిపించుట లేదు. 1935 వ సంవత్సరపు ఆక్టు ఉండువరకు, చెన్నరాష్ట్ర పారంపర్య హక్కుగల గ్రామోద్యోగుల చట్టము ఇండియా ఆక్టుకు విరోధమని ఎవరు చెప్పగా వినలేదు. ఇప్పుడు మాత్రము ఈ వాదము బయలుదేరుట ఒక వింతగా నున్నది. నూతన రాజ్యాంగచట్టపు 372 వ ఆర్టికల్‌లో, మార్చబడిన నిబంధనలు తప్ప, మిగిలిన నిబంధనలు జారీలోనే యుండునని చెప్పుటచేత, మార్చబడినదని ఋజువగువరకు చెన్నరాష్ట్ర గ్రామోద్యోగుల ఆక్టు జారీలో ఉన్నటులే భావించవలెను.

అయితే, రెవిన్యూ బోర్డువారికి చెన్నరాష్ట్ర గ్రామోద్యోగుల పారంపర్య హక్కుల విషయమై ఎందుకు సందేహము వచ్చినదని అడుగవచ్చును.

వారి ప్రస్తాపనలేఖ నాకు అందలేదు. కనుక ఏ కారణముతో వారికి సందేహము తోచినదో నేను నిక్కర్షగా చెప్పలేను. కాని ఈ రీతిగ వారికి సందేహము జనించి యుండునని నాకు దోచుచున్నది. చెన్నరాష్ట్ర గ్రామోద్యోగుల పదవులు ప్రభుత్వమువా రేర్పరచిన పదవులు. వానికిని, రెవిన్యూశాఖలోని గుమాస్తా వగైరా ఇతర పదవులకు భేదము కనబడుట లేదు. గుమాస్తా వగైరా ఇతర పదవులకు క్రొత్త రాజ్యాంగపు 310 వ ఆర్టికల్ అన్వయించుచున్నది. ఆ ఆర్టికల్ ప్రకారము అన్ని సివిల్ ఉద్యోగములు గవర్నరుగారి ఇష్టముండువరకు మాత్రముండునవి. గవర్నరుగారికి, తనకు ఇష్టము వచ్చినపుడు ఆ యుద్యోగములను నిలిపివేయు అధికారమున్నది. కనుక ఇటువంటి ఉద్యోగములలో ఖాళీలు ఏర్పడిన వెంటనే ఆ ఖాళీలను భర్తీ చేయుటయందు నూతన 16-వ ఆర్టికల్ ప్రకారము చేయవలసి యున్నది. ఇట్టుండగ, ఒక గ్రామోద్యోగి మరణించి, వాని యుద్యోగము ఖాళీకాగా, ఇతర అభ్యర్థులను త్రోసిపుచ్చి, మరణించిన వాని వంశపువారికే ఆ పని నియ్యవలయునని చెప్పెడు చెన్నరాష్ట్ర 1895 వ చట్టము, నూతన రాజ్యాంగపు చట్టములోని 16వ ఆర్టికల్‌కు వ్యతిరేకము కాదా? అటులయినచో చెన్నరాష్ట్ర 1895 వ చట్టము నూతన రాజ్యాంగపు చట్టములోని 254 వ ఆర్టికల్ ప్రకారము రద్దు అయినటుల భావించవలసినదే గదా?

పై వాదమే రెవిన్యూ బోర్డువారికి సందేహము గలుగజేసి యుండునని నేను తలంచెదను. అన్ని సివిల్ ఉద్యోగములను ప్రభుత్వమువారు వారికి ఇష్టము వచ్చినప్పుడు రద్దు చేయవచ్చునని చెప్పు నూతన రాజ్యాంగ చట్టపు 310 వ ఆర్టికల్ మీద పై వాదము ఆధారపడి ఉన్నది. అయితే పై ఆర్టికల్ కేవలము క్రొత్తదికాదు. 1935 వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టులోని 240 వ సెక్షనులో ఒక రూపముగ నుండినదే. పై ఇండియా ఆక్టు జారీలో నుండగా స్ఫురించని సందేహము, ఇప్పటి నూతన రాజ్యాంగ చట్టము వచ్చిన తరువాత ఎందులకు స్ఫురించినదో నాకు ఆశ్చర్యముగ నున్నది.

అది ఎట్లుండినను, రెవెన్యూబోర్డువారికి అనుమానము కలుగజేసినదని నేను నిరూపించిన వాదమునకు ఆధార మేమి? పారంపర్యపు హక్కుతోకూడిన గ్రామోద్యోగులకును, సామాన్య గుమాస్తా ఇత్యాది సివిల్ ఉద్యోగములకు ఏమియు

భేదము లేదనెడి సిద్ధాంతము. ఈ సిద్ధాంతమునకు ఆధారము లేనియెడల పై వాదమంతయు నిరాధారమై ఆకాశపుష్పము లేక అభూతవస్తువుగ పరిణామము జెంది నశింపవలసి యున్నది కదా!

ఇప్పుడు నేను సాహసించి చెప్పుట ఏమనగా పారంపర్యపు హక్కులతో గూడిన గ్రామోద్యోగములకును, సామాన్య సివిల్ ఉద్యోగములకును భేదమున్నది. పై గ్రామోద్యోగములు నౌకరీ బాధ్యతతో గూడినవైనను, కేవల నౌకరీ పనులు గావు. అవి ఒక విధమైన స్థిరాస్తి తరగతికి చేరిన ఆస్తి. కనుక వానికి 310 ఆర్టికల్ అన్వయించదు. ఇతర స్థిరాస్తుల వలె ఇవి, వానికి సంబంధించిన వారసత్వపు హక్కుకు లోబడి యుంటున్నవి.

పారంపర్యపు హక్కుగల ఉద్యోగములు స్థిరాస్తిగ పరిగణింపబడి ఇంగ్లీషు 'లా' లో 'ఇన్ కార్పోరియల్ హెరిడిటమెంట్లు (Incorporal Hereditaments) అనెడి నామము వహించి యున్నవి. మన హిందూ 'లా' లో కూడ అట్లే పరిగణింపబడి "నిబంధ" మనెడి నామమును వహించి యున్నవి. వీనికి ఒక విశేష లక్షణము కద్దు. భూమందు మరణించిన వెంటనే, ఇతర ఆస్తుల వలె, ఈ ఆస్తి తక్షణమే వారసునందు సంక్రమించు చున్నది. ఎవరికిని సంక్రమింపక, కొంతకాలము ఆకాశమార్గములో నిలువడము లేదు. వారసు ఎవ్వరైనది గుర్తించుటకు ఆలస్యము కావచ్చునుగాని, భాగసుని గుర్తించినతోడనే వాని హక్కులు పూర్వపు భూమందు మరణించిన కాలముతుంచి, వానికి సంక్రమించుచున్నవి. సామాన్య ఉద్యోగములకు పై తత్వము అన్వయించదు. ఒక గుమాస్తా మరణించిన వెంటనే, ఆ పదవి, లేక నౌకరి, నిజమైన ఖాళీ అవస్థను పొందుచున్నది. ఇంకొకరిని నియమించువరకు ఎవనికి ఆ పదవికి హక్కు ఉండదు. నియామకమైన వానికికూడ, నియామక కాలమునుండియే కాని, దానికి పూర్వమునుండి ఏ హక్కులు ఉండవు. పారంపర్యపు హక్కుగల ఉద్యోగములు అట్టివి కావు. ఒక ఉద్యోగి మరణించినతోడనే, ఆ పదవీధరుని అభావ మేర్పడవచ్చుగాని, పదవికి చ్యుతి లేదు. ఆ పదవి తక్షణము వారసునకు సంక్రమించి, వానిలో ఇమిడియుండును. ఇట్లు పదవిధరుని అభావమున్నను, పదవికి చ్యుతి, రాహిత్యము, ఎప్పుడు ఉండదని విస్తరించి చెప్ప నవసరము లేదు. రెవిన్యూబోర్డువారే దీనిని గుర్తించి, 154-వ స్టాండింగు ఆర్డరు (Standing Order)లోని 7-వ సెక్షనులో ప్రస్తావించి యున్నారు. కనుక దీని వలన ఏర్పడున దేమన, గ్రామోద్యోగపు పదవీధరుని నియామకము (Appointment) అనునది నిజముగ సర్కారువారి గుర్తింపు లేక ఆమోదము ఖాళీ (Vacancy) అనునది పదవీధర నిర్ణయము లేని స్థితిగాని, పదవీ అభావము గాదు.

కొందరికి నా వాదము విపరీతముగా తోచవచ్చును. వారు వేరు వేరు విధములుగ, పూర్వపక్షము చేయవచ్చును. మీరు చెప్పినటుల ఈ గ్రామోద్యోగములు ఆస్తులయితే ఇవి పారంపర్య హక్కులతో గూడినవి కావున, శాశ్వతముగ ఉండవలసినవే నా యని నన్ను అడుగవచ్చును. నేను అటు చెప్పుట లేదు. ఈ యుద్యోగములు ప్రభుత్వమువారిచే సృష్టింపబడినవి. కనుక ప్రభుత్వమువారికి, వానిని తొలగించు హక్కుగలదు. అయితే నూతన రాజ్యాంగ చట్టపు 31-వ ఆర్టికల్ మొదటి క్లాజు క్రింద, జమీందారీ రద్దుబిల్లు తెచ్చినటుల, ప్రత్యేక చట్టము తెచ్చిగాని ప్రభుత్వమువారికి కూడ నశింపజేయుటకు వీలుగాదు.

ఇదే పూర్వ పక్షము. ఇంకొక రూపము తీసికొనవచ్చును. 1895-వ ఆక్టు వలన కొన్ని గ్రామములు గ్రూపు కాబడి ఉద్యోగములు నశించి పోయినవేయని— ఇది జరిగినది నిజమే.

కాని ఇందు చర్చించు విషయము, ఉండు ఉద్యోగముల విషయము; లేని ఉద్యోగముల విషయముగాదు. ఉండు గ్రామోద్యోగములకు 1895-వ సంవత్సరపు ఆక్టులోనే పారంపర్యపు హక్కు ఉన్నదని నమూదు చేయబడి యున్నది.

ఇంకొక పూర్వపక్షవాదము ఈ క్రింది రీతిని ఉండవచ్చును. 1895-వ సంవత్సరపు ఆక్టు గ్రామోద్యోగములను ఆస్తిగా గణించి యుంటే, మునుపు ఎప్పుడును లేని వారసత్వపు రూల్సు ఆ ఆక్టులో ఎట్లు వచ్చినవి? వారసుడు చదువు రాని వాడయిన, వానిని త్రోసివేయ వచ్చును. వారసు స్త్రీ అయిన ఆమె అనర్హురాలు. ఉద్యోగిని సకారణముగ కొంతకాల పర్యంతముగాని వాని జీవితాంతము వరకు గాని, ప్రభుత్వమువారు తొలగింప వచ్చును. ఇటువంటి నిబంధనల పెట్టిన ఉద్యోగము ఆస్తి ఎట్లు కాగలదు?

ఈ ఆక్షేపణకు సమాధానము సమగ్రముగ చెప్పవలసిన యెడల ఎక్కువ స్థలము కావలెను. కాని బహుశాః ఇంతమాత్రము చెప్పిన చాలునేమో. 1895-వ సంవత్సరపు ఆక్టు ఉపోద్ఘాతము (Preamble) లో ఇట్టి తాత్పర్యముగు వాక్యమున్నది. (ఎ) 'చెన్నరాజధానిలో కొన్ని పారంపర్యపు హక్కుగల ఉద్యోగముల విషయమై వారసత్వపు సంక్రమణను గురించిన నిబంధనలను వివరముగాను, తప్పనిలుగాను నమూదు పఱచుటకు ఆ ఆక్టుయొక్క ఉద్దేశ్యము.' అట్లయిన ఈ ఆక్టులోని నిబంధనలు పూర్వపు నిబంధనలు కావనిగాని, పూర్వపు నిబంధనలకు అనుగుణ్యముగ విశదీకరణార్థమై చేసిన నిబంధనలు కావని ఎట్లు చెప్పుటకు వీలున్నది? కొందరు జనులు వారసులైనను వారికి ఆస్తి సంక్రమించదను నిబంధనలు మన హిందూ 'లా' లో లేవా? సంక్రమణ నిరాకరణ (Exclusion from inheritance) ప్రతి వారసత్వపు న్యాయశాస్త్రములో నున్నదే గదా? అట్లయిన 1895-వ ఆక్టు గ్రామోద్యోగులు పారంపర్యపు హక్కును ఆస్తిగా గణించలేదని ఎట్లు చెప్పవచ్చును?

ఈ కారణము వలన పారంపర్యపు హక్కుగల గ్రామోద్యోగములు గ్రామసేవకు ఏర్పరుపబడి, ఉద్యోగ శబ్దము అన్వయించునవయ్యును, సామాన్యోద్యోగములు గాక, ఆస్తి తరగతికి జేరి, ఆస్తి స్వభావము గలవి. కావున నూతన రాజ్యాంగపు చట్టములోని ఏ నిబంధనయు గాని అవి విరోధము కావని నా యభిప్రాయము.

# ప్రజాభిప్రాయ వేదిక.

## హరిజనోద్ధరణ ఎక్కడ?

ఆర్యా,

రాజంపేటలో ఏ కొద్ది బావులలోనో తప్ప, మొత్తము బావులలో నీరడుగంటినవి. నీరున్న బావులదగ్గర ప్రజలు గుంపులు గుంపులుగా చేరి, నీరు తోడి తెచ్చుకొనుచున్నారు. ఏ దేశములోగాని, గ్రామములోగాని, కటువు సంభవించినప్పుడు, అందుండు ప్రజల కందరికి అన్వయించును. అందులో కుల, మత, విచక్షణ యుండదని నా భావము. అన్ని బావుల వలెనే, రాజంపేట గ్రామమునకు చేరిన యెర్రబల్లి మాదిగవాడ లోని బావి యెండిపోయిన దనుటలో అతిశయోక్తి లేదు. నీటికిగాను వారు పడు యిబ్బందులు చెప్పుటకే మనసొప్పదు. ఆ గ్రామమునకు పడమటదిశగా నొక దిగుడుబావి యున్నది. ఇతర జాతులవారు దానిలో నీరు తోడుకొనిపోవుట మామూలు. ప్రభుత్వమువారు సర్వజాతులకు ప్రవేశ ముండునట్లు ప్రకటించినారు. ఏమి ప్రకటించితే నేమి ఆ ఇతర జాతుల ముందర! "కడుపున కనిరి, కౌగిలించుకొన్న వచ్చునా" యను లోకోక్తి మేరకు, పెద్దజాతులవారి హృదయములలో ఐక్యభావము లేనప్పుడు, యెన్ని ప్రకటనలు ప్రకటించితే నేమి ప్రయోజనము? వారి దృష్టిలో హరిజనులు జంతుజాలములు. హరిజనులు అంటే వారికి బానిసలని వారి తాత్పర్యము.

విశాల హృదయుడు, లోకజ్ఞాని, లోకానుభవము గలవాడే వ్యక్తియైనను సరే, హరిజనులు పడు యిబ్బందులను చూచి, నేటి హిందూ దేశములో పల్లెల కుల, మత భేదములు విమర్శించక పోడు. నిత్య జీవితములో వారు (హరిజనులు) నీళ్ళకు ఎచ్చటికి పోయినా నిర్బంధాలే ఈ స్వతంత్ర ప్రజా సామ్రాజ్యములో. మాదిగవాని చేతులలో మెదిగిన బొక్కెనను, ఆ బావిలో దేవుటకైనా ఒప్పుకొందురుగాని, వారిని మాత్రము బావిలోనికి అడుగు పెట్టనివ్వరు. అథవా ప్రవేశించినచో, పెద్దజాతులవారి దౌర్జన్యాలు, ప్రగల్భాలు చెప్పుట కలవిగాదు. పాపము! దౌర్భాగ్యులు, అనాగరికులు, అజ్ఞానులు, అల్పసంఖ్యాకులైన హరిజనులు ఏమి చేయగలరు?

ఒకనాడా వాడలోని పిల్లలు, పెద్దలు నీటికై అచ్చటికి పోయినారు. అచ్చట ఏమి జరిగినదో తెలియదు. తిరిగి వచ్చినారు. వారి కడవలలో నీరు లేదుకాని, కందినరక్తము వారి ముఖములలో ప్రవహించినది. కడకొక మాట. స్వతంత్ర మంటే ఇదేనా? హరిజనోద్ధరణ ఇదేనా?

ఎఱ్ఱబల్లె (రాజంపేట). యం. వెంకటయ్య.

## శ్రీ. రమణారెడ్డిగారు— రాజంపేట ఎన్నికలు.

ఆర్యా,

మంటపముపల్లె శ్రీ. పి. రమణారెడ్డిగారు రాజంపేట—సిద్ధవటము తాలూకాలకు పోటీచేయుదురని వినుచున్నాము. కాంగ్రెసు పార్టీ వారికి కూడా అప్లికేషను పంపినటుల తెలియుచున్నది. ఇటీవల శ్రీ. నెహ్రూగారు, యెన్నికలకు నిలుచువారికి యోగ్యత ఉండవలెనని నొక్కి నొక్కి ఎ. ఐ. సి. సి. మీటింగు సందర్భములలో చెప్పినారు. ఆ యోగ్యత లన్నియు శ్రీ. రమణారెడ్డిగారి యందున్నవి. శ్రీ. రమణారెడ్డిగారిని యెన్నికలబోర్డువారు తప్పకుండా సెలెక్టు చేయుదురని మా అందరి నమ్మకము. ఆయనను సెలెక్టు చేయలేదంటే కాంగ్రెసు దేశములో లేదన్నమాటే. కాంగ్రెసునకు నీతిపరులు రాకూడదన్నమాట స్పష్టమౌతుంది. కనుక ఎన్నికల బోర్డువారు అతనిని సెలెక్టు చేయుదురని మా నమ్మకము.

ఓటర్లపని యేమి? శ్రీ. రమణారెడ్డిగారేగాక, ఇంకా ఇద్దరో, ముగ్గురో పోటీచేయనిండి. ఈ డివిజనులో ఇంతటి యోగ్యుడు చిక్కుట కష్టము. ధనవంతులలోకి పెద్దవాడు. విద్య గలవాడు. బీదలయందు ప్రేమ గలవాడు. అన్యాయములకు, అక్రమములకు లొంగని పసివాడు. దరిద్రనారాయణుల సేవకే ఎప్పుడు ఎదురుచూచు చుండును. ఇందులకు ఆదర్శముగా ఆయన ఊరికి పోయిచూచిన, అందరికి మనసునకు వచ్చును. లంచాలకు లొంగడు. అధికారాల ఆశపడి తలయొగ్గడు.

కనుక ఇట్టి యోగ్యత గలవానిని ఎన్నికలయందు గెలిపించి, మన రాజంపేట—సిద్ధవటము తాలూకాల కీర్తి నిలువబెట్ట వలెనని అందరిని కోరుచున్నాము. రాజంపేట తాలూకాలో మూడు హైస్కూళ్ళు, సిద్ధవటము తాలూకాలో ఒక హైస్కూలు ఉన్నవి. ఇందు చదువు విద్యార్థులు వీరి ఎన్నిక విజయమునకై ఓట్లకొరకు ప్రచారము చేసిన, శ్రీ. రమణారెడ్డిగారికి విజయము తప్పదని నా నమ్మకము.

రాజంపేట. టి. యస్. వెంకటేశ్వరం.

నవల

# ధర్మ విజయము.

(శ్రీ వాల్మీకి.)

[గత సంచిక తర్వాత]

## (10)

[చంద్రశేఖర, జానకు లొకరి నొకరు ప్రేమించుకొనిరి. జానకి తండ్రి ఈ ప్రేమబంధమునకు వివాహము ద్వారా భంగమొనర్ప సంకల్పించుటతో, చంద్రశేఖరుడు జానకితో లేచిపోయెను. శ్యామలుడును జానకిని ప్రేమించెను గనుక, చంద్రశేఖరుని యనుసరించెను. ఒంటరిగా నుండు సమయమున చంద్రశేఖరుని తల బగులగొట్టి శ్యామలుడు జానకిని ఎగువ తిరుపతికి దోడ్కొని పోవును. శ్యామలుడు జానకిని వివాహమాడెనని వెలువడిన ప్రచురణను గాంచి చంద్రశేఖరు డున్మాదియై, మధుసూదనుని సాయమున గూడూరు చేరెను. జానకి తండ్రి ఈ ప్రచురణను జూచి సంతసించి, జానకి శ్యామలరావుల నింటికి రమ్మని ప్రచురించెను. ఈ ప్రచురణ నాదరువు గాఁగొని జానకిని, పెండ్లియాడుమని బలవంత పెట్టెను. జానకి చంద్రశేఖరునుండి మనసు ద్రిప్పుకొన లేక, లోయలో దూకి ప్రాణ త్యాగము సేయ సమకట్టెను. దైవవశాత్తు లోయలోగల మడుగులో బడి, చెస్తవారి వలలో దగుల్కొని జానకి బ్రతికెను. శ్యామలుడు పిచ్చిపట్టిపోగా, రుక్మిణి దారిలేక, కులటవృత్తికి దిగెను. తర్వాత ఈ ప్రకరణమున,—]

గూడూరు మైకా గనులకు ప్రసిద్ధిఁ జెందిన దనియు, మధుసూదనుఁడు ఒక ప్రసిద్ధమైన మైకా వ్యాపారియనియు, పాఠకు లిదివరకే గ్రహించి యున్నారు. అతఁడు ఉన్మాదియైన చంద్రశేఖరుని ఒక ఉద్యానవనమున గల గృహమునందుంచి, అతనికి పలయు సపర్యలు చేయించుచుండెను. అతఁడు ఆ గృహమును వీడి, తోట పరిహద్దులను దాటి పోవుటకు వీలులేని యట్లు నౌకర్లను కావలి యుంచెను.

ఒక దినము మధుసూదనుఁడు నిపుణుఁడగు వైద్యుని రావించి, "అయ్యా! నా మిత్రుఁడొకఁడు ఉన్మాదియయి కష్టపడుచున్నాఁడు. అతనికి చికిత్స చేయవలయును" అనఁగా

డాక్టరు.— "అతఁ డెట్టి పరిస్థితులలో పిచ్చివాఁ డాయెనో మీ రెరుగుదురా?" యనెను. తరువాత వారిట్లు మాటాడఁ దొడఁగిరి.

మ. సూ.— "తెలియదు"

డాక్ట.— "అతఁడు నిత్య మే మాటల పలుకుచుండును"

మ. సూ.— "జానకి— కులట" అని మాత్రమనుచుండును.

డాక్ట.— 'బోధపడినది. అతఁ డొక స్త్రీవ్యక్తిని విశ్వసించి, ఆమె తనను మోసముచేయఁగా పిచ్చివాఁడయ్యెను. ఈ పిచ్చిని మనుప్పు చికిత్స నే నెఱుఁగుదును. మొదట రోగిని నాకు జూపుడు.

మధుసూదనుఁ డా మాట వెంట లేచి, ఉద్యానవనము ప్రవేశించి, అప్పుడే గృహమునందుఁగల హాలులో నటు నిటు పచారుచేయుచున్న చంద్రశేఖరుని రహస్యము గానుండి చూపెను. డాక్టరాతనిని చూచి, అతఁ డుచ్చరించు మాటలు గ్రహించి, 'సరియే, చికిత్స రేపటి యుదయమునుండి ప్రారంభింతును. నాకు కొన్ని పరికరములు కావలయును. అవన్నియు సమకూర్చుట మీ వంతు' అనెను. మధుసూదనుఁ డా పరికరముల తెప్పించి, చికిత్సచేయ నియోగించెను. చంద్రశేఖరుఁడు తన నిత్య కార్యకలాపము,— గొణుగుకొనుట, అటు నిటు పచారుసేయుట, జానకి కులట యనుట, యెడతెగక సాగించుచునే యుండెను. డాక్టరీ విషయము ప్రశాంత మతితో పరికించి, చికిత్సచేయ సంకల్పించెను. చంద్రశేఖరుఁడు పచారుచేయు గదిలో నొక రేడియో యంత్రము నాతనికి తెలియనట్లుగ స్థాపించెను. గదికి వెలుపల హాలులో నొకటి, ఉద్యానవనమున నొక పూపొదరింటిలో నొకటియు ను నిర్మించెను.

వైద్యుఁడు చికిత్సకు నిర్ణయించిన నాఁటి ఉదయము, ఉన్మత్తుఁడుగా నున్న మన కథానాయకుఁడు ఉద్యానవనము నుండి వచ్చుచు, 'జానకి కులట' యనెను. వెంటనే అక్కడ నున్న రేడియో యంత్రమునుండి 'కాదు, జానకి శీలవతి' యని వినబడెను. చంద్రశేఖరుఁ డద్దాని నంతగా గ్రహింపలేదు. జానకి కులట యనుచునే ఆరామగృహమునందలి వరండాలోనికి పోయెను. అందుండి రేడియో యంత్రము 'జానకి శీలవతి' యనెను. చంద్రశేఖరుడు 'ఆఁ!' యని వెనుకకు తిరిగి చూచెను, మనుజు లెవ్వరును గానరాలేదు. కాని 'అవును. జానకి శీలవతి' యని వినఁబడెను. కాదు, కులట యనుచు గది ప్రవేశించెను. గది యందు గూర్చుండి 'జానకి కులట' యనెను. 'కాదు, జానకి శీలవతి' యను శబ్దము వినఁబడెను.

ఇయ్య దేమియు చంద్రశేఖరునికి బోధపడలేదు. ఈ వాక్యము లెవరు వచించుచున్నారియుఁ దెలియలేదు. ఈ విధము ఒక పక్షము దినములు గడచెను. తోటయందును, హాలునందును, వరండాయందును 'జానకి శీలవతి' యను వాక్యము చెవులలో మెల్లగా చెప్పినట్లు ప్రతి దినము వినబడుచునే

యుండెను. ఇయ్యది చంద్రశేఖరుఁ డుచ్చరించు పదమునకు విరుగుడు. నానాఁటికి అతనియందు మనోపరివర్తనము గాన వచ్చెను. అందుచే గ్రిమముగా 'జానకి కులట' యనునది మానివేసి, 'జానకి శీలవతి' యను పదమును పలుక నారంభించెను. ఒకనాఁడు ఉన్నట్లుండి "జానకి శీలవతి' అవును; 'జానకి శీలవతి" అనుచు తోటలోనికి పోయెను. అచ్చట డాక్టరు కూర్చుండి యుండెను. అతని యెడ కేగి "నా జానకి శీలవతి" యనెను. డాక్టరందులకు 'జానకి శీలవతి, ఆమె గుణగణములు వర్ణింప నేరికి తరము' అని వచించెను. అంత చంద్రశేఖరుఁడు పట్టరాని యానందముతో డాక్టరు భుజములు చేతులతో నదిమిపట్టుకొని ఊగించుచు 'చెప్పుము, నిజమేనా? నా జానకి శీలవతియేనా' అని వచించెను. డాక్టరందులకు నెమ్మదిగా 'అవును, జానకి శీలవతి, పరమసాధ్వి; తను విశ్వసించిన చంద్రశేఖరుని మఱువలేదు. అతని దర్శించుటకు పరితపించు చున్నది' అని బలికెను. అంత చంద్రశేఖరుఁ డాతని చెంతఁ గూర్చుండి ఇట్లు సంభాషింపఁ బొడఁగెను.

చంద్ర.— 'జానకిని మీరు చూచియున్నారా?'

డాక్ట.— 'లేదు. ఆమెను గురించి వినియున్నాను. దిన పత్రికలు, వార పత్రికలు, ఆమె శీలమును కీర్తించుచున్నవి.'

చంద్ర.— (ఆలోచించి) 'నే నిప్పు డెక్కడున్నాను! ఈ తోట యెవరిది? ఈ రమణీయమగు గృహమును ఎవరు నిర్మించిరి?'

డాక్ట.— 'మీ రిప్పుడు మధుసూదనుని యాదరణలో నున్నారు.'

చంద్ర.— 'మధుసూదనుని యాదరణలోనా? అసంభవము. అట్లెన్నటికిని జరుగదు. నేను కంటబడినచో, మధుసూదనుఁడు వెంటనే నన్ను ముక్కముక్కలుగా నఱికివేయును. మహాపరాధము చేసిన నన్నాతఁడు మన్నించునా?'

డాక్ట.— 'మహాశయా! మీరు పొరబాటు బడుచున్నారు. అతఁడు నీవు ఉన్మాదస్థితిలోనుండ ధనము వెచ్చించి, చికిత్స చేయించిన ఉదార స్వభావుఁడు. అపకారికి నుపకారము చేయువాఁడు. భూతదయ గలవాఁడు. అతఁడు నీ విప్పుడున్న స్థితిని జూచి యానందించును' అనుచు చేయిబట్టుకొని తోడ్కొని పోయెను. మధుసూదనుఁ డప్పుడే సోఫాలోఁ గూర్చొని పొగఁబీల్చుచుండెను. చంద్రశేఖరుఁ డాతని జూచిన తోడనే ఒక్కపరుగున పరుగిడి, యాతని కాళ్లమీఁద వ్రాలి, 'ఆర్యా! నేను మహాపకారము చేసినవాఁడను. కానున్న వివాహమును చెడగొట్టి, జానకిని శ్యామలుని సాయముతో లేవఁదీసికొనిపోయిన వాఁడను. నన్ను క్షమింపుడు' అని దీనముగా బల్కెను. మధుసూదనుఁడు చంద్రశేఖరుని లేవనెత్తి కూర్చుండఁబెట్టి, 'చంద్రశేఖరా! నే నాజరిగిన సంఘటనమునకు దుఃఖపడుట లేదు. విధివిధానము వేరుగా నున్నపుడు మానవుని భాగీరథ ప్రయత్నములు మాత్ర మేమి సేయగలవు? జరిగిన దేదో జరిగినది. నీవు సంకటపడక నా యొద్దనే యుండుము. మైకా వ్యాపారమునందు సుప్రసిద్ధుఁడ వగుము. నా వ్యాపారమునందు నీకు ఒకణా భాగమిత్తును' అని మహోదారబుద్ధిని ప్రకటించెను. చంద్రశేఖరుఁడు మహానందముతో తన కృతజ్ఞతను జూపెను.

---

శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారు.

(9 వ పేజీ తరువాత)

నది. ఈ యువకుని పట్టుదల, శ్రమ ఫలించినది. ప్రతిపల్లెలోను ఇతని పాటలు మారు మ్రోగు చున్నవి. ఇప్పటికి వయస్సు 30 సంవత్సరముల లోపలనే యున్నది. భావికాలములో ఇంకను ఉచ్చదశకు రాగల చిహ్నములన్నియు ఈ యువకుని యందు ప్రతిబింబించు చున్నవి. ఈ వ్యక్తి జీవిత పరిణామము ఇతర యువకులకు మార్గదర్శకముగ నుండునని భావించు చున్నాము.

---

కోర్టు నోటీసు:

మ॥ రా॥ రా॥ శ్రీ. కడప స్మాలు కాసెస్ కోర్టులో.

S. C. 222/1951.

యస్. మాబూసాబ్ కుమారుడు రంతూమియ్యా, సాకిన్ కడప టవున్ ... ... ... వాది.

వల్లెపు గంగన్న కుమార్డు గంగన్న, సాకిన్ ఎల్లటూరు, కడప తాలూకా .. ... ... ప్రతివాది.

పై గ్రామములో యుండే ప్రతివాది వల్లెపు గంగన్నకు.

వాది నీ పయిన ప్రోనోటుబాకీ రు. 79_2_0 లకు దావా చేసినాడు. సదరు దావా 27_9_1951 తేదికి కోర్టులో వాయిదా వేయబడినది. వాయిదానాడు నీవు పగలు 10 గంటలకు కోర్టులో హాజరై ఆక్షేపణను తెల్పుకొనవచ్చును. లేనంతట నిన్ను ఎక్సుపార్టీ చేసి, వాదిపరము డిక్రీ చేయబడునని తెలుపడమైనది.

కడప,
14_9-1951.

జె. పిచ్చయ్య,
వాదిపరము అడ్వకేటు.

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

REGISTERED No. M. 5285.

రాజకీయ వారపత్రిక

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఏ.,

| సంపుటము 4. సంచిక–32. | బుధవారము, అక్టోబరు 17, 1951. | విడి పత్రిక వెల మూడు అణాలు. |
| --- | --- | --- |

# విషయానుక్రమణిక



——:(o):——

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 32. | శ్రీ ఖరనామ సంవత్సర ఆశ్వీయుజ బ. 3, అక్టోబరు, 17, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## ఆంధ్ర కాంగ్రెస్ — అభ్యర్థుల నియామకము — జవహరిలాలుగారు కండ్లు తెఱచెదరా?

"కాంగ్రెసు అభ్యర్థులను నియమించుటలో ఎవరైనను, ఏ ఒక్క అభ్యంతరము చెప్పినను, నిర్ణయము చేయుట లేదు. ఇంతవఱకు జరిగిన నిర్ణయము లన్నియు ఏకగ్రీవముగ జరిగినవని ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ. యన్. సంజీవరెడ్డిగారు ఒక ప్రకటన చేసియున్నారు. ఇది నిజము కాదు. అభ్యర్థుల నిర్ణయము నిశ్చితమైన ప్రమాణము, సూత్రముల మీద జరుగలేదు. ప్రమాణములు జిల్లా జిల్లాకును మారుతూ వచ్చినవి. అభ్యర్థుల నిర్ణయములో ఏకాభిప్రాయము లేదు. శ్రీ. బి. వి. సుబ్బారెడ్డిగారు నాద్వారా అక్టోబరు 2-వ తేదీ ఇచ్చిన ఉత్తరమును పార్లమెంటరీ బోర్డుకు అందజేసినాను. కర్నూలు జిల్లా నుండి అభ్యర్థులుగా నియమించినవారి పేర్లక్రింద వారి పేరు ఉండుట నాకు కూడ ఆశ్చర్యము కలిగించిన"దని— కడప జిల్లా కాంగ్రెసు అధ్యక్షులును, రాష్ట్ర పార్లమెంటరీ బోర్డు సభ్యులలో నొకరగు శ్రీ టి. పుల్లారెడ్డిగారు ప్రకటించి యున్నారు.

"నా అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొనుచు, అక్టోబరు 5-వ తేది నేను రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శికి లేఖను పంపియున్నాను. అభ్యర్థులను నియమించుటలో న్యాయము జరుగలేదు. కాంగ్రెసు అధ్యక్షులు (శ్రీ. జవహరిలాలుగారు) సూచించిన వానికన్న భిన్నమైన ఆదర్శములనే వారు (రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల బోర్డువారు) అనుసరించి యున్నారు. అభ్యర్థుల దేశసేవ, అభ్యుదయ దృక్పథములకు ప్రాముఖ్యత ఇవ్వక, ఇతర కారణములకు ప్రాముఖ్యము చూపి, అభ్యర్థులను నియమించినందు వలన నేను చిత్తూరు జిల్లాలో ప్రజల ముఖము చూడలేని పరిస్థితి ఏర్పడిన"దని – చిత్తూరు జిల్లా బోర్డు సభ్యులును, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సహాయ కార్యదర్శి గారైన శ్రీ. యన్. పి. చెంగల్వరాయ నాయుడుగారు ప్రకటించి యున్నారు.

"పండిత జవహరిలాలుగారు సూచించిన సూత్రములను కాకుండ, ఇతర నియమములను రాష్ట్ర ఎన్నికల బోర్డువారు అభ్యర్థులను నియమించుటలో అనుసరించినటుల కనుపించుచున్నది. వారు కావించిన నిర్ణయములు తృప్తికరముగ లేవు. ఈవిషయమై చేయబడు అపీళ్ళనన్నిటిని కేంద్ర పార్లమెంటరీ బోర్డువారు పరిశీలించి, ఇంకనూ కాంగ్రెసు సంస్థలో న్యాయమునకు స్థానమున్నట్లు నిరూపించెదరని ఆశించుచున్నా"నని కర్నూలు జిల్లా బోర్డు అధ్యక్షులైన శ్రీ. బి. వి. సుబ్బారెడ్డిగారు ప్రకటించి యున్నారు.

ఈ ప్రకటనలు గావించిన ముగ్గురు వ్యక్తులు, కడప, చిత్తూరు, కర్నూలు జిల్లాలలో బాధ్యతగల పెద్దమనుష్యులు. శ్రీ. యన్. సంజీవరెడ్డిగారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి వచ్చుటకెంతో సహాయపడి యున్నారు. ఈ విషయమును శ్రీ. సంజీవరెడ్డిగారు లేదని చెప్పజాలరు. ఇట్టివారు, కాంగ్రెసు అభ్యర్థుల నియామకములో, స్పష్టమైన అసంతృప్తిని బహిరంగముగ వెలిబుచ్చిరి. శ్రీ. జవహరిలాలుగారు సూచించిన ఆదర్శములను గాలికి విడిచి, అందుకు ప్రత్యక్ష విరుద్ధమైన నియమములనే పాటించిరని తెలిపిరి. శ్రీ. సంజీవరెడ్డిగారి కీర్తిని తగ్గించుటకై ఈముగ్గురు వ్యక్తులు నిరాధారములైన ఆరోపణలు గావించిరని శ్రీ. సంజీవరెడ్డిగారు ఒక పత్రికా విలేఖరితో (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరితో) తెలిపిరి. కాని ప్రపంచము మాత్రము నమ్మజాలదు. తెర చాటున జరుగుచున్న అక్రమములను బహిరంగ

పఱచి, ఏకగ్రీవముగా కాంగ్రెసు అభ్యర్థుల నియామకము జరుగలేదనియు, శ్రీ. జవహరిలాలు గారు దినదినము వాపోవుచున్న ఆశయముల కనుగుణ్యమైన అభ్యర్థులను నియమింప లేదనియు, ఈ ముగ్గురు వ్యక్తులు తెలుగు ప్రజానీకమునకు తెలియ జేసినందులకు వారి నెంతయు అభినందించుచున్నాము. ఒక నియోజక వర్గమునకు దరఖాస్తులు పెట్టుకున్న వారిలో, ఒక వ్యక్తి సామర్థ్యమును, సత్యనిరతిని, నైతిక ప్రవర్తనమును, కలిగియున్నాడు. ఆ నియోజక వర్గమునకు నియమింప బడుట కన్ని విధముల తగి యున్నాడని పార్లమెంటరీ బోర్డు సభ్యు లెల్లరు అభిప్రాయ పడియున్నారు. ఇదే నియోజక వర్గమునకు దరఖాస్తు పెట్టిన మఱియొక వ్యక్తి యొక్క నైతిక ప్రవర్తనముపై పార్లమెంటు బోర్డు సభ్యుల కెల్లరికి విశ్వాసము లేదు. కాని పార్లమెంటు సభ్యులలో ఒకరగు శ్రీ. గోపాల రెడ్డిగారు నైతిక ప్రవర్తనము కొఱతపడిన వ్యక్తినే బలపఱచు చున్నందున మిగత సభ్యులెల్లరు నోరుమూసికొని యున్నారని రూఢిగా తెలియు చున్నది. పాఠకులు ముఖ్యముగ ఈ విషయమును గమనింప గోరుచున్నాము.

సెప్టెంబరు నెల 19 వ తేది వెలువడిన "భారతజ్యోతి" పత్రికలో 'శ్రీ. జవహరిలాలు కలలు నిజమగునా'అను శీర్షిక క్రింద ప్రకటింపబడిన సంపాదకీయ వ్యాసములో, మేము తెలిపిన విషయములన్నియు ఆంధ్ర రాష్ట్ర ఎన్నికల బోర్డువారు అక్షరాలా ఋజువుచేయు చున్నారనుటకు సందేహ మున్నదా? శ్రీ. జవహరిలాలుగారి ఆదర్శములు, ఉన్నత భావము లెక్కడ? — ఈ రాష్ట్ర నాయకు లెక్కడ? ఏనుగకును, చీమకును ఎంత వ్యత్యాస మున్నదో శ్రీ జవహరిలాలుగారికిని — కాంగ్రెసు ఆదర్శములకును, ఈ రాష్ట్ర కాంగ్రెసు సంస్థయొక్క ముఖ్య స్థంభములని చెప్పుకొనుచున్న ఈ వ్యక్తులకును అంత భేదముకలదు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వ్యవహారములలో శ్రీ. రంగాగారి ప్రాజాపత్యము తొలగిపోయినదనియు, నూతన పాలక వర్గము వచ్చినదనియు సంతోషించుట కెంతమాత్రము అవకాశము లేదు.

రాష్ట్ర పార్లమెంటరీ బోర్డులోనుండు సభ్యులలో నొకరగు శ్రీ. టి. పుల్లారెడ్డిగారు విద్యలో అందఱికన్నను (శ్రీ. పల్లమురాజు గారుతప్ప) ఎక్కువైనను, వయస్సులో చిన్నవారు. వయస్సులో చిన్నవాడై, కాంగ్రెసు పద్మవ్యూహముల అనుభవములకు (కుతంత్రములకు) క్రొత్తయైనందున, మేమందఱ మెట్లు ఆడించిన అట్లు ఆడడా అని ఇతర సభ్యు లెల్లరు భావించిరి కాబోలు. ఇది పొరబాటైన అభిప్రాయము. అతని నైతిక ప్రవృత్తిని, సామర్థ్యమును, ఇతరసభ్యులు అర్థము చేసుకొనలేదు. కాంగ్రెసు అభ్యర్థుల నియామకములో ఎప్పుడు అవక తవకలు జరుగు చున్నవని అతనికి తోచెనో — వెంటనే — తన యాక్షేపణలను తెలిపి పార్లమెంటు బోర్డు వ్యవహారములలో తత్కాలికముగ జోక్యమును వదులుకొనిరి. తమ నైతిక ఆక్షేపణను అధ్యక్షులకును, ఇతర సభ్యులకును తెలియజేసిరి. పార్టీ ఒత్తిడులకు లొంగువాడు కాదని తెలియ పరచిరి. ఆత్మగౌరవమును కాపాడుకొనిరి. ఇందులకై శ్రీ. పుల్లారెడ్డి గారిని ప్రత్యేకముగ అభినందించు చున్నాము.

కాంగ్రెసు అభ్యర్థులను నియమించు విషయములో ఇప్పుడు బహిరంగముగ అసంతృప్తిని వెలిబుచ్చిన సభ్యులెల్లరు, పత్రికా ప్రకటనలతోనే తృప్తినొంది, తమ ధర్మమును నెరవేర్చినామని తలచినచో లాభము లేదు. శ్రమయనక వారెల్లరు న్యూఢిల్లీ పట్టణమునకు పోయి, వారి యనుభవముల నన్నిటిని, శ్రీ. జవహరిలాలుగారికి తెలిపి ఆయన కండ్లను తెఱిపించినచో, అప్పుడే వారి ధర్మమును నెరవేర్చిన వారయ్యెదరని హెచ్చరించు చున్నాము. జవహరిలాలంతటి జవహరిలాలు కలలు కనుచుండ నలసిన దేశాని, ఆయన ఆశయములను కార్యరూపమున పెట్టు ధీరోదాత్తులు కాంగ్రెసు రంగములో లేరని అతని ఎదట శంఖారావము గావించెదరు గాక! 3

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానత్వము — హిందూ కోడుబిల్లు

(శ్రీమతి. యస్. పద్మావతీదేవిగారు.)

(1)

హిందూకోడు బిల్లుపై చర్చ భారత పార్లమెంటుసభలో వాయిదాపడినది. కొంతమంది స్త్రీల కిందువలన ఆశాభంగము కలుగుట సహజము. పురుషులలోకూడ కొందఱు ఆశాభంగమును వెలిబుచ్చుట నా కాశ్చర్యముగ నున్నది. రాజకీయ వాతావర్ణములో పెరిగి, అధికార పదవులను జేబట్టవలెనని కుతూహలముగల స్త్రీలు మాత్రమే ఈ బిల్లు చట్టము కానందులకు అసహనము చూపుచున్నారు. సంసార జీవితములో కాలముగడుపుచున్న ఏ హిందూ సంపన్న గృహిణియైనను, ఈబిల్లు శాసనము కానందులకు చింతింపలేదు. చింతింపబోదు. స్త్రీలు పురుషులతో సమానులు. పురుషులతో బాటు వారికి సమాన హక్కులు కావలెనని చెప్పుట ప్రాచ్యఖండ సాంప్రదాయముకాదు. ఈ భావములు పాశ్చాత్య దేశములనుండి మన దేశమునకు దిగబడినవి. సెప్టెంబరు నెల 12-వ తేది వెలువడిన "భారత జ్యోతి" పత్రికలో "హిందువుల సాంప్రదాయములు— సంస్కృతి చెఱబట్ట బడుచున్నవి" అను శీర్షిక క్రింద ఒక యుత్తమోత్తమమైన వ్యాసము ప్రకటింప బడినది. ఆ వ్యాసమును ముందుకు నడుచుచున్న వారమని (Progressive women) చెప్పుకొను ప్రతి హిందూ స్త్రీయును చదువ వలెనని కోరుచున్నాను. ప్రతి గృహస్థ స్త్రీ కూడ చదివి తీరవలెనని కోరుచున్నాను. ఇవన్నియు వ్రాయుటవలన నన్ను ప్రతిఘాతమైన స్త్రీయని (Reactionary woman) చెప్పిన చెప్పెదరు గాక. అటుల చెప్పువారు తమ ప్రకృతి సిద్ధమైన స్థానమును గుర్తింపక విమర్శించు చున్నారని మాత్రము చెప్పక తప్పదు.

ప్రకృతి స్త్రీలని, పురుషులని, కర్మేంద్రియముల నిర్మాణములోనే భేదముచూపి పుట్టించుచున్నది. సృష్టి క్రమము కొనసాగుటకై స్త్రీలు నిర్వహింపవలసిన కార్యములను ప్రకృతియే వేరు పఱచినది. అందు కనుగుణ్యముగ అవయవ నిర్మాణముల నేర్పరచినది. కోడెను, ఆవును, చూచిన మాత్రమున భేదము చెప్పవచ్చును కదా? పుంజును, పెట్టను చూచినమాత్రమున భేదము చెప్పవచ్చును కదా? మృగరాజైన మగసింహమునకు ప్రకృతి సిద్ధముగ మెడపై కేసరములుండును. ఆడసింగమునకు కేసరములుండవు? మగసింహముయొక్క ఎత్తునకును, గాంభీర్యమునకును, ఆడసింగముయొక్క ఎత్తునకును, గాంభీర్యమునకు భేదము లేదా? ఇవన్నియు ప్రకృతి సిద్ధముగ ఏర్పడిన భేదములు. అటులనే స్త్రీ పురుషులలో కూడ అసమానత్వము ప్రకృతి సిద్ధముగ ఏర్పడినది. కల్పితమైనది కాదు. వలదన్న పోవునది కాదు. పురుష జన్మమునకు బహిష్టను దోషము —మైల లేదు. స్త్రీ జన్మమునకు దానంతకదే ప్రకృతిసిద్ధముగ కలుగు పరిణామము. దాచియుంచిన దాగునది కాదు. పోవునది కాదు. గర్భము నిచ్చువారు పురుషులు కాని, దానిని భరించి, ధరించి, పరిపక్వమునకు తెచ్చుకొని, ప్రకోత్పత్తికి తోడుపడునది స్త్రీలుకాదా? బలములో స్త్రీలు పురుషులతో సమానులమని చెప్పగలరా? చెప్పలేము. బుద్ధిబలములో కూడ స్త్రీలు పురుషులతో సమానులని చెప్పుటకు వీలు లేదు. స్త్రీల బుద్ధి చంచలమైనది. స్థిరత్వము లేనిది. స్త్రీలు ప్రకృతికి బద్ధురాండ్రే. పురుషులు ప్రకృతికి బద్ధులే. ఏ విషయములో స్త్రీలు పురుషులతో సమానులని చెప్పుటకు వీలుపడునో నాకు తెలియుట లేదు. బహుశా నాకంతటి బుద్ధి సూక్ష్మత లేదేమో.

(సశేషము)

# రాష్ట్రములో ఎన్నికల కార్యక్రమము.

రాష్ట్రమునకు చెందిన అసెంబ్లీ, పార్లమెంటరీ నియోజక వర్గములనుండి సభ్యులను ఎన్నుకోవలెనని నవంబరు 7 వ తేది ఒక ప్రకటన జరుగును. పోలింగ్ 1952 వ సం॥ జనవరి 2 వ తేదీన ప్రారంభమై, 25 వ తేదీనాటికి పూర్తి కాగలదు. నవంబరు 21-వ తేదీ నామినేషనుల స్వీకరణకు ఆఖరు తేదీగ నిర్ణయము కావచ్చును. నూతన అసెంబ్లీ సభ్యులచే లెజిస్లేటివు కౌన్సిల్ సభ్యుల ఎన్నిక 1952 వ సం॥ ఫిబ్రవరి మధ్యలో ఆరంభమై 1952 వ సం॥ మార్చి 18 వ తేదీకి పూర్తి కాగలదు.

ఈ కార్యక్రమమును అనుసరించి నూతన మంత్రివర్గము 1952 వ సం॥ ఏప్రియల్ 1 వ తేదికి ఏర్పడవచ్చును.

ఎన్నికల కార్యక్రమము.

మామూలుగా ఒక్కొక్క పోలింగ్ బూత్ కు 750 ఓటర్లు వున్నారు. ఓటర్లు 3 మైళ్ళకు మించి ప్రయాణము చేయవలసిన ఆవశ్యకతవుండదు. పోలింగు కేంద్రములలో స్త్రీ పురుషులకు పోలింగుబూత్ లు విడివిడిగా నుండును. పర్దాస్త్రీలకు ఉద్దేశించిన బూతులలో సిబ్బంది యావత్తూ స్త్రీలుగనే వుంటారు.

చెన్నరాష్ట్ర లెజిస్లేటివు అసెంబ్లీకిని, హౌస్ ఆఫ్ ది పీపుల్స్ (ప్రజా ప్రతినిధి సభ) కు ఎన్నిక 9 రోజులమీద ఈ క్రింది కార్యక్రమము ప్రకారము జరుగును.

2—1—1952.—రాజమండ్రి, ఒంగోలు, బళ్లారి, వెల్లూరు, కడలూరు, మధుర, ద. కెనరా (ఉత్తరము), పొన్నాని.

5—1—1952.—నరసారావుపేట, నెల్లూరు, కర్నూలు, నందవాసి, దిండివనం, శ్రీవిల్లిపుత్తూరు.

8—1—1952.—విశాఖపట్నము, గుంటూరు, చెంగల్పట్, కాంచీపురము, కృష్ణగిరి, కోయంబత్తూర్, అరువుకోట్టై, రామనాథపురము, ద. కెనరా (దక్షిణం), మల్లాపురము.

9—1—1952.—అనంతపురము, మయూరము,

11—1—1952.—తెనాలి, తిరువళ్ళూరు, ధర్మపురి.

12—1—1952.—విజయనగరము, కాకినాడ, పెనుకొండ, పొల్లాచి, తంజావూరు, శ్రీవైకుంఠము, దిండిగల్, కోజికోడ్.

16—1—1952.—శ్రీకాకుళము, గుడివాడ, విజయవాడ, నంద్యాల, చెన్నపురి, సేలము, తిరుప్పూరు, పుదుకోట, కుంభకోణము, తిరునెల్వేలి, పెరియాకుళము, తెల్లిచేరి.

21—1—1952.—పార్వతీపురము, ఏలూరు, కడప, తిరుపతి, తిరుచెంగోడ్, తిరుచిరాపల్లి, శంకరనాయినార్ కోయిల్, కన్ననూర్.

25—1—1952.—పాతపట్నము, మచిలీపట్నము, చిత్తూరు, ఈరోడ్, పెరందూర్.

ప్రతి పార్లమెంటరీ నియోజక వర్గములోని అసెంబ్లీ నియోజక వర్గములోను, ఏకకాలమందు పోలింగు జరుగును.

ఈ ఎన్నికల్లో ఒక విశేషమేమంటే ఓటర్లకు బాలెటు పత్రము ఇచ్చేముందు ఓటరు ఎడమచేతి చూపుడు వేలికి చెరగని సిరా అంటించెదరు. ఈ సిరా దాదాపు మూడు వారాలవరకు మాసిపోదు. ఇందువలన ఒకరే మరల మరల వచ్చి ఓటు చేయుటకు వీలుపడదు.

ఓటర్ల జాబితాలు.

నికర ఓటర్ల జాబితాలు తాలూకా తాలూకా వారీగా గాక, నియోజక వర్గముల వారీగా ప్రకటించబడినవి. అందులో అసెంబ్లీ నియోజక వర్గానికి

తహాశీల్దార్, లేక డిప్యూటి తాహాశీల్దార్; పార్ల మెంటరీ నియోజక వర్గానికి రివిన్యూ డివిజనల్ ఆఫీసరును ఎన్నికల రిజిస్ట్రేషన్ ఆఫీసరుగా ఉంచ వచ్చును.

ఓ ట ర్ల జా బి తా ల ఖ రీ దు.

రాష్ట్రములో సుమారు 2 కోట్ల 70 లక్షల ఓటర్లున్నారు. అసెంబ్లీ నియోజకవర్గము ఓటర్ల జాబితా ఖరీదు తెలుగులో రు 15-6-0 పార్లమెంటు నియోజక వర్గముజాబీతా ఖరీదు రు.76-14-0 అయినది.

పార్లమెంటు సభ్యత్వ ఎన్నిక బాలెటు పెట్టెకు ఆకుపచ్చ, అసెంబ్లీ ఎన్నిక బాలెటు పెట్టెకు చాక్లెటురంగు నిర్ణయించ బడినది. ప్రతి పోలింగు కేంద్రములో రెండు బూతులు వుండును. ప్రతి ఒక్క బూతుకు సుమారు నలుగురు మనుష్యులు కావలెను. ఆ ప్రకారము మొత్తము 35,500 బూతులకు 1,42,000 మంది అవసర మగుదురు.

## అ వీ — ఇ వీ

ప్రత్తి గింజల రవాణా.

బళ్ళారి, అనంతపురము, కడప, కర్నూలు, జిల్లాలనుండి చెన్న రాష్ట్రములోని యితర ప్రాంతములకు (అనుమతి పొందిన ప్రదేశములు తప్ప) ఇదివరకు ప్రత్తిగింజల రవాణాపైనున్న నిషేధమును ప్రభుత్వమువారు రద్దుచేసినారు.

సే వా స ద న ము.

నికృష్ట పరిస్థితులలోనున్న వితంతువులకు, భర్తలచే విడనాడబడిన భార్యలకు మూడు సంవత్సరాలపాటు బ్రతుకు తెరువు మార్గాలను బోధించడాని కుద్దేశించబడిన "సేవాసదనము"లో (రాయపురములో స్త్రీజనాభ్యుదయశాఖ ఆధ్వర్యాన నిర్వహించ బడుచున్నది) మరొక 50 మందిని క్రొత్తగా చేర్చుకోవలసినదిగా రాష్ట్ర ప్రభుత్వమువారు ఉత్తరువు చేసివున్నారు. ఇట్టి అనాథలకు చెందిన పిల్లలు కూడా ఈ 'సేవాసదనము' లో చేర్చుకోబడుదురు. ఈ పిల్లలకగు ఖర్చుకై మంజూరుచేసిన గ్రాంటును ప్రభుత్వము పెంచినది. (మునుపు నెలకు ఒక్కపిల్లకు లేక పిల్లవానికి ఖర్చు డబ్బు రూ. 12. ఇప్పుడు అది రూ. 15. వరకు పెంచబడినది.) ఈ సేవాసదనములో చేర్చుకోబడిన పిల్లల బట్టలకై 500 రూపాయలు; సంగీత పరికరాలు, చేతి పనులకు సంబంధించిన వస్తు సామగ్రిని విక్రయించుటకై రూ. 700 మంజూరు చేయబడినది.

ఈ శరణాలయములో 150 మంది స్త్రీలు, 50 మంది పిల్లలు వున్నారు.

'లా' కోర్సు చదివే వెనుకబడ్డ తెగలవారికి స్కాలర్ షిప్పులు.

1951-52 వ సంవత్సరములో అర్హత గలిగిన కులాలకు చెందిన విద్యార్థులలో 'లా' కోర్సు నదువుచున్న వారికై ఉద్దేశించబడిన 16 స్కాలర్ షిప్పులు ఈ క్రింద పేర్కొన్న విధముగా మంజూరు చేయడానికి ప్రభుత్వమువారు నిశ్చయించినారు. హారిజనులు —13; ఎరుకలవారితోసహా యానాదులకు—3. ఈ స్కాలర్ షిప్పులకు సంబంధించినంతవరకు యితర మతాలకు చెందిన హరిజనులు వెనుకబడిన జాతులవారుగా పరిగణించ బడుదురు.

నవల

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (12)

బొంబాయి నగర వీధులు ట్రాముబండ్ల చేతను, టాక్సీలు, మోటారుకారులు, సైకిళ్ళు మొదలుగాగల బండ్లతో క్రిక్కిరిసి యుండెను. అట్లుండినను ప్రజలు రవాణా సౌకర్యములకై యేర్పడిన దారుల తప్పించి, ప్రక్కలకు నడచుచుండిరి. ఈ కథనాటికి బొంబాయి హార్బరులో నుండు నావికాదళము ప్రభుత్వముపై యెదురుతిరిగెను. ఇయ్యది అప్పటి బ్రిటీషు ప్రభుత్వమునకు తలనొప్పి యయ్యెను. నావికాదళమును బెదరించెను. కాని ప్రయోజనము లేక పోయెను. వారినందరిని కోటలో బంధించివైచినది. అనునయ వాక్యములతో రాయబారములు జరుగుచుండెను. లాభము కనుపించ లేదు. బ్రిటీషు ప్రభుత్వము భారత దేశమును యుద్ధములో దింపినందుకు కాంగ్రెసు నాయకులు ప్రబలముగా సహాయ నిరాకరణోద్యమమును సాగించుచున్న దినములవి. ఈ తిరుగుబాటును అణచివేయు నిమిత్తము సంప్రదింపులు జరుపవచ్చి, సర్దారు పటేలు బొంబాయిలో నుండుటచే నా దినములలో తండోపతండములుగా ఆయనసేయు బహిరంగ సభలకు జనులు పోవుచుండువారు. సముద్ర పరిసరమున గల యొక ముఖ్య వీధిలో సంచలన మెక్కువగా నుండెను. కారణ మా వీధిలో నొక మేడయందు కొందరు విలాసినులు కాపురముండిరి. వారి వృత్తి పడుపు వృత్తి. నావికా దళమునకు చెందిన యొకఁడా యింటియందున్నాడని విని, ప్రభుత్వోద్యోగులు వానిని పట్టుకొని పోవుట కచ్చటికి వచ్చి, నిరాశాపూరితులై, పోవుచుండిరి. జనులా వినోదమును జూడవచ్చి హార్బరు వైపునకు మరలిరి.

ఆ సమయమున నొక యువతి, యా వీధిని బోవుచుండి, ఆ వినోదమును జూడ నట నాగియుండెను. బొంబాయి పట్టణమునకు క్రొత్త యగుటచేతను, తన్నెఱిగినవా రొక్కరేని యు లేకుండుటచేతను, విషాద మనస్కయై యుండెను. తన చేత నున్న కానులు మూడునాళ్ళకే ముగియుటచేత, తిండికి వాచిపోయి, యెవ్వరైన భోజనమునకు పిలుతురేమో యని యెదురు చూచుచుండెను. ఆ నగరవాసు లందఱు హిందీ మాటలాడుట వలనను, తన కా భాష తెలియనందు చేతను, ఈ క్రొత్త యువతి నీటినుండి బైటబడిన చేప విధముగా గిజగిజలాడుచుండెను. అటనుండి మెల్లమెల్లగా నడుగులు వేయుచు ముందుకు బోవుచుండెను.

ఇంతలో నొక వయస్సు మళ్లిన యాడుది, మేడమీఁది నుండి ఈ క్రొత్త జవరాలిని జూచి, త్వరత్వరగా క్రిందికి దిగివచ్చి, ఇటు మాటాడ దొడగెను. 'అమ్మాయీ! మీ దే వూరు? తెలుఁగువాని లాగున్నావే?'

క్రొత్త స్త్రీ.— 'అవునమ్మా, మా దీనగరము గాదు. తెలుఁగు దానినే.'

వృద్ధ స్త్రీ.— 'నీ కెవరైనా బంధుగు లున్నారా?'

క్రొ. స్త్రీ.— 'లేరమ్మా లేరు. నేనొక దిక్కుమొక్కు లేని పక్షిని.'

వృ. స్త్రీ.— 'అయితే ఈలా రా? భోంచేసెదవుగాని' అనియెను. ఆ మాటల కలరి, క్రొత్త స్త్రీ సంతోషమున ఆమెను వెంబడించెను. మేడ యెక్కిన యనంతర మొక సేవకురాలిని బిల్చి, భోజనము వడ్డింపుమనెను. భోజనాదులైన పిదప, వారిరువు రిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

వృ. స్త్రీ.— 'అమ్మా! నీ పేరేమి?'

క్రొ. స్త్రీ.— 'నా పేరు జానకి.'

వృ. స్త్రీ.— 'మీ దే యూరు?'

జానకి.— 'కంచి.'

వృ. స్త్రీ.— 'కంచా! నాదికూడా అవ్వూరే నమ్మా. మీ తండ్రి పేరు, మీ యింటి పేరు చెప్పు.'

జానకి.— 'మా తండ్రి లక్ష్మణరావు. మా యింటిపేరు రత్నగిరివారు.'

వృ. స్త్రీ.— 'ఓసి పిచ్చితల్లీ! రత్నగిరివారా? ఐతే మాకు నిండా కావలసిన వారే నే.'

జానకి.— 'అమ్మా! తమ యింటి పేరు, తమ పేరు చెప్పెదరా?'

వృ. స్త్రీ.— 'తప్పక చెప్పెదను. నా పేరు కామాక్షి. మా యింటి పేరు ఉత్పలవారు. మీ తండ్రిని నే నెఱుగుదును. నేను చిన్నతనమునందే బొంబాయి నగరమునకు వచ్చి యుండినందున నేను నీకు తెలియదు.'

జానకి.— 'అమ్మా! నాపని రొట్టె విరిగి నేతిలో బడినట్లయింది. దిక్కులేక యల్లాడుచుండ, భగవంతుడు నట్టమగు నిన్నే చూపి పుణ్యము కట్టుకున్నాడు.'

కామాక్షి.— 'జానకీ! నీ విఁక శ్రమపడ నక్కర లేదు. నీ స్వంత ఇంటిలో నున్నట్లు నీ విచట నుండవచ్చును. నీకు కావలసిన వన్నియు ఈ సేవకురాలు సమకూర్చు' నని చెప్పి సేవకురాలిని చూపించి, పనియున్నదని లోనికి పోయెను.

జానకి సేవకురాలిని బిలిచి, నీరు తోడించుకొని, స్నానము చేసి, శుభ్రమగు వస్త్రముల ధరించి, ఒక సోఫామీద కూర్చుండెను. అప్పటికి సుమారు నాలుగు గంటలు కావచ్చినది. ఇంతలో నలుగురు జవరాండ్రు మేడమీదికి వచ్చి, జానకిని చూచి, మాటలాడు నుద్దేశ్యముతో సమీపమున గల కుర్చీలపై కూర్చుండిరి. జానకి వారి యలంకారములను,

వారి వైఖరులను గమనించి. వీరు విటకత్తెలుగా నున్నారని శంకించి, మాటలాడ వెఱచి, గోడమీదగల చిత్తరువులవైపు దృష్టి సారించెను. వారిలో నొక జవరాలు 'అమ్మా! మీరు చాలా మంచివారని మా యజమానురాలు చెప్పినది. మీ పేరు జానకమ్మట కదూ!

జానకి.— 'అవును.'

2-వ స్త్రీ.— 'మీ రేకార్యార్థమై ఇంతదూర మొచ్చితిరి.'

జానకి — 'తప్పిపోయిన నా నాథుని వెదకుచు వచ్చితిని.'

3-వ స్త్రీ.— 'అతడీనగరములో నెందుండునది తెలియునా.'

1-వ స్త్రీ.— నీది మఱీ చాదస్తము. తెలిసుంటే సూటిగా అక్కడికి పోక ఇక్కడి కేల వస్తుంది?'

4-వ స్త్రీ.— 'దారి తప్పిన మగని వెదకుచు తానుగూడ దారి దప్పినది.'

జానకి.— 'అవునమ్మా, నీవు నిజము చెప్పితివి. దిక్కులేక నిలిచిపోయిన నాకు కామాక్షమ్మ గక్కయింది.'

2-వ స్త్రీ.— 'ఆమె యుక్తమ్మ ప్రకారము చేస్తే నీ విందరి భోగ మనుభవింతువు.'

జానకి.— 'అమ్మా! శిరసావహించి, నా చేతనైన పనిని చేయుదును.'

3-వ స్త్రీ.— ఏమీ లేదు. వచ్చిపోయే విలాస పురుషులను తృప్తిపఱచుచుండ వలెను.'

జానకి.— 'అంటే! విటకత్తె కావలయునా?'

1వ-స్త్రీ.— 'అఁ! అదే. దేహ మున్నందుకు సార్థక పరుప వలెను. పరోపకారార్థ మిదం శరీరమ్మన విన లేదా?'

జానకి.— 'ఆలోచించి, వీరితో అనవసర వాగ్వాద మెందులకని (ప్రకాశముగా) 'ఓహో! అట్లనా. సరే అటుల నే చేయుదును.'

ఆ మాటతో నల్వురు సంతోషముతో లేచి తమ యజమానురాలి కీ యుదంతము తెలుప బోయిరి. వారేగిన యనంతరము జానకి 'అయ్యో! దైవమా! పెనము మీద నుండి నిప్పుల లోనికి ద్రోసిన విధముగా మఱలా నన్ను ఈ బందికానాలో ద్రోసితివా? నా యిడుమల కంతము లేదా? నీ వార్త రక్షా పరాయణుఁడవు కావా? నా నాథుఁడు సజీవుఁడై యున్నాఁడని విని, ప్రాణముల మీద ఆశఁ బెంచితిని. బొంబాయి నగర మొక చిన్న పట్టణమని భ్రమించి అందు నా హృదయేశ్వరుని కనుగొనలేనా యని తెగువతో వచ్చితిని. వచ్చినందుకు తగిన శాస్తియైనది. ఇందుండి తప్పించుకొను విధానము దెల్పి కాపాడు' మని ప్రార్థింప మొదలిడెను.

సుమారు రాత్రి ఎనిమిది గంటలైనది. భోజనమున కాహ్వానము వచ్చినది. జానకి యాకలి కాలేదని వార్తనంపి, యందే యుండెను. ఫలహారము కొనితేబడెను. కొద్దిగా నాహారించి, లోలోన చింతతో కుములుచుండెను. పది గంటలైనది. ఆ గదియం దెవ్వరును లేరు. తనకే ఆ గది నిర్దేశింప బడినట్లుండెను. ఒకమంచముపై బడక వేయబడి యుండుటచూచి శయనింపఁబోయెను. కాని యామె శయనమున కడ్డు వచ్చినట్లొక పురుషుఁ డా గది బ్రవేశించెను. జానకి యాతని జూచి, తటాలున మంచము దిగి, నమస్కరించెను. అతఁడును నమస్కరించి, యందున్న ఆసనముపైఁ గూర్చుండి, రమ్మని పిలిచెను. ఆమె నిరాకరించుచు, 'నేను విటకత్తెనుగాను. సంసారిని. మాది కంచి. నా నాథుఁడు బొంబాయి నగరమునకు వచ్చి, తిరిగి రాకుండుట చేత, వెదకుకొనుచు వచ్చి నే నిందు చిక్కువడితిని. అనాథనగు నన్నాదరింప నభయమిచ్చి, ఈ యింటి యజమానురాలు తుద కీ వృత్తిలో దిగ నాదేశించినది.'

విటుడు.— "వృత్తిలో దిగితివిగదా? ఇఁక నాకోరిక దీర్చుట కాలస్య మెందులకు"

జానకి.— "మహాశయా! నే నా వృత్తిలో దిగలేదు. నే నీ దిన సాయంత్రమే యీయిల్లు జేరితిని. మీరు నాపై దయయుంచి, సోదరిగా భావించి మఱలి పోయినచో, నే నిందుండి ఈ రాత్రికే పారి పోవుదును."

విటుఁడు.— "సరే! నిన్ను నా సోదరిగానే భావింతును. నీ విచ్చటినుండి తప్పించుకొని యెక్కడికి పోగలవు?"

జానకి.— 'ఎక్కడికి పోవలయునో వచింపలేక మౌనముగా నుండెను.'

విటుడు.— "కనుక ఎక్కడికి పోయినను అనాథవగు నీకు ఈ గతి తప్పదు. ఈ నగరములో భిక్ష మెత్తుకొన్నను పెట్టువారు లేరు."

జానకి.— 'మహాశయా! అటులైనచో నా శరీరమును సముద్రుని కర్పింతును. కాని ఈ నీచవృత్తికి పాల్పడ జాలను' అని యాతని పాదములపై వ్రాలి యేడువఁదొడఁగెను. అంత నాతఁడు ఆమె దృఢ నిశ్చయమున కాత్మ మెచ్చుకొని 'సోదరీ! లెమ్ము. నీవు పవిత్ర భారత నారివి. నీ కేమియు భయము లేదు. నేను నీకు శరణ్యమిత్తును' అనియెను.

విటవృత్తికి వచ్చిన యాతఁడు జానకి వాలకమును, సుగుణములను, మనో నిశ్చయమును, చూచి మెచ్చుకొని తా [illegible] వచ్చిన కార్యమును మఱచి, సాయమొనర్ప [illegible], యజమానురాలి కనులు గప్పి, రహస్యముగ నామెను దోడ్కొని పోయి తన గృహమున నిలిపెను. అతని భార్య జానకి గుణములకు మెచ్చుకొని ఆదరముతోఁ జూచుచుండెను.

ఈ క్రొత్త పురుషుఁడు రాధాకృష్ణుఁడను నామధేయము కలవాఁడు. వ్యాపార నిమిత్తము బొంబాయి నగరములో కాపురము జేసెను. ఈతఁడు ధనవంతుఁడు. తెలుఁగువారియం దభిమానము కలవాఁడు. కనుక జానకికి వారింట నాశ్రయము లభించెను.

జానకి పని, ఉదయము తోడనే లేచి, స్నానమాచరించి, శుచియైన వస్త్రముల ధరించి, రాధాకృష్ణుని బిడ్డలకు చదువు చెప్పుట. పిల్లలు ఆరేండ్లు, ఎనిమిదేండ్లుగల కృష్ణ, గమల, సుశీల యను వారలు. సుశీల పేరునకు దగిన గుణములు గలది. జానకిని అత్తమ్మాయని పిలుచుచు, తన బాల్య క్రీడల చేత మురిపించుచుండును. స్కూలునకు పోయినప్పుడు దప్ప, తక్కిన సమయములందు జానకిని విడిచి పోవునదిగాదు. అప్పుడప్పుడు

(మిగత ప్రక్క పేజీలో)

# మంత్రులు - ఎన్నికల ప్రచారము.

మంత్రులుగా అధికారములో నుండి ఎన్నికల ప్రచారములో జోక్యము కలిగించు కొనకూడదు. అట్లు చేయుటవల్ల యితర రాజకీయ పార్టీలకు సమానమైన స్వేచ్ఛ, అవకాశములు ఉండవని సోషియలిస్టు పార్టీవారును, ఇతరులును చెప్పుచున్నారు. కాని రాజ్యాంగ చట్టములో ఎన్నికకు ముందు మంత్రులు రాజీనామాల నివ్వవలయునని సూచింపలేదు. ఒక వేళ రాజ్యాంగ చట్టములో కూడ అట్టి నిబంధనలుండినను, దానిని నిర్లక్ష్యము చేయుటకే సాధ్యమైనంతవఱకు ప్రయత్నించెదరు. కట్టకడపటి వఱకును మంత్రి పదవులలోనే యుండ దలచువారు ఎన్నికల ముందు రాజీనామాల నివ్వవలెనని నిర్బంధము లేనందున, వారు రాజీనామా యిచ్చి, ఎన్నికల ప్రచారము సాగించుకొందురని తలచుట కెంతమాత్రము అవకాశము లేదు. దేశపరిపాలనా విషయములోను, స్వంత పనులను చూచుకొనుటలోను ఇతర దేశములలోని మంత్రులు అవలంభించుచున్న పద్ధతులకును, మన దేశములోని మంత్రులు అనుసరించుచున్న పద్ధతులకును వ్యత్యాసము చాలగానున్నది. శ్రీ. జవహరిలాలుగారు ఇండియా ప్రధాన మంత్రియేకాక, కాంగ్రెసు సంస్థకు కూడ అధ్యక్షులు. రాష్ట్ర మంత్రులలో ఎంతమాత్రము త్యాగబుద్ధి యున్నదో తెలుసు కొనుటకై, ఎన్నికలకు నామినేషన్లు దాఖలుచేయుటకు ముందు, మంత్రి పదవులలో నున్న వారందఱు రాజీనామా నివ్వవలెనని కాంగ్రెసు అధ్యక్షుని హోదాతో రాష్ట్ర మంత్రుల కొక సూచన గావించుచో, అప్పుడు అధికారములకై ప్రాకులాడు చేపలన్నియు బయటపడును. ఈ రాష్ట్ర మంత్రి పుంగవుల త్యాగబుద్ధి యంతయు బయటబడును. వారి త్యాగమును గుఱించి తనకు గూడ ఒకమతింపు కలుగును.

◆◆◆ ◆◆◆ ◆◆◆

చెన్నరాష్ట్ర మంత్రివర్గమువారు, ఎన్నికల ప్రచారమునకై పోవు సందర్భములలో ప్రయాణపు కర్చులను తీసుకొనుటలేదని ఒక ప్రకటన గావించి యున్నారు. ఎన్నికలకై రాష్ట్రములో పలు ప్రదేశములలో సంచారమొనర్చుచుండినను, రాష్ట్ర పరిపాలనమునకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములను చూచుచుండవలెను. అట్టి కార్యములు నిర్వహించినను కూడ ప్రయాణపు కర్చులను తీసుకొనుటలేదని తెలిపియున్నారు. ఇది బాగున్నది. కాని వీరు దిగు ఇండ్లచుట్టును పోలీసు కాపలాలు, బందోబస్తులు, కారులు, ఉద్యోగుల రాకపోకలు మొదలైన అట్టహాసములు లేక, మంత్రులుగానున్నను, సామాన్య పౌరుని వలెవచ్చి, తమ మిత్రులతోను, పార్టీ సభ్యులతోను మాటలాడి పోవుటకు తీర్మానించుకొనిన నేకాని, వారి ఎన్నికల ప్రచారము అధికార ముద్రలేనిదని చెప్పుటకు వీలుండదు. వీరు బహిరంగ సభలలో ఉపన్యసించి నపుడంతయు, ఆచుట్టు ప్రక్కలలో ఎఱ్ఱటోపీలు కనపడకూడదు. అప్పుడే వారి ఎన్నికల సభలకు విలువ హెచ్చును. ఎన్నికలకై రాష్ట్రములో వివిధ ప్రదేశములలో సంచారము చేయునపుడు, ఏ అధికారి కూడ తమ్ము చూచుటకు రాకూడదని స్పష్టముగా తెలియజేయవలెను. బహిరంగ సభలు మొదలైనవి, పార్టీ సంఘములు ఏర్పాటు చేయవలెనేకాని, వానిలో ఉద్యోగుల కెంతమాత్రము జోక్యముండరాదు. ప్రభుత్వము వారి కారులలో ప్రయాణములు సాగించరాదు. ఇట్టి ఉన్నత సాంప్రదాయములను మన మంత్రి పుంగవులు అమలులోనికి తెచ్చెదరా?

---

తండ్రి కడ కేగి "అత్తమ్మ చాలమంచిది నాన్నా! పాఠములు బాగుగా బోధించుచుండె నాన్నా!" అని చెప్పుచుండెడిది. ఆమె తండ్రి "అవునమ్మా! మీ యత్తగారు చక్కని శీలము గలవారు. మీరు కూడ ఆమెవలె మంచిగుణములు అలవాటు పఱచుకొనవలె" ననుచుండువాడు.

భోజనమునకు కూర్చున్నప్పుడు ఇంగ్లీషు వారి పద్ధతివలె మేజాయొద్ద కూర్చొను వారు. అప్పుడు ఏవేవో లోకాభిరామాయణములు, రాజకీయములు, చర్చించుకొను వారు. రాధాకృష్ణుఁడు, జానకి సమర్థనలకే విలువ నిచ్చి తన భార్యను ఏలాకోశము పట్టిచ్చువాఁడు. ఈ విధముగా జానకి వీరింట కష్టముల మఱచి సుఖముగా నుండెను.

గత సంవత్సరము పంటలు పండనందువల్ల, ఏదో కొద్ది పండి భూస్వాముల దగ్గర మినహా, మిగతావారి దగ్గర తిండి గింజలు బొత్తిగా లేవు. వ్యవసాయ కూలీల దగ్గర కొనుగోలు శక్తి బొత్తిగా లేదు. ఈ కారణముల వల్ల ఎక్కడైన అరుదుగా స్టార్సులో (గోనెమాకులపల్లె, నందిమండలము) ధాన్యము దొరికినా, వానిని ఉపయోగించుకోలేక పోవుట కూడా జరుగుచున్నది. ఈ పరిస్థితులలో దినమంతా పస్తు ఉండే కుటుంబాలు చాలా యున్నవి. కూలీలకు రోజుకు ఒకపూట కూడ తిండిగింజలు లేవు. రైతాంగము ఎట్లు పస్తులుంటున్నారో, వారి పశువుల పరిస్థితి కూడా అంతే. గత సంవత్సరపు నిలువమేత అంతా అయిపోయినది. కొండ గుట్టలలో సైతము గడ్డి లేదు. ఎద్దులతో సహా పశువులను అమ్మి వేయుటకు సిద్ధపడుచున్నారు.

ఈ పరిస్థితులలో మంత్రులు వెంటనే (1) ప్రజానీకమునకు పనులు కల్పించుటకు రోడ్లు వగైరా పనులు తీసుకోవలెను. గండికోట వగైరా మైనరు ప్రాజెక్టుల నిర్మాణమునకు వెంటనే పూనుకోవలెను. (2) పశువులకు మేత సప్లయి చేయవలెను. (3) ప్రతి గ్రామములోను ధాన్యపు డిపోలు పెట్టవలెను. (4) వ్యవసాయ కష్టులకు గాను వడ్డీ లేకుండా దీర్ఘకాల వాయిదాలమీద రైతాంగమునకు విరివిగా పైకము అప్పు ఇవ్వవలెను.

కమలాపురము. పి. చెన్నారెడ్డి.

గ్రంథ పరిచయము :

# కేనోపనిషత్తు.

గ్రంథకర్త: శ్రీ అరవిందులు.
తెలుగు అనువాదకులు: శ్రీ భరద్వాజ్.
ప్రచురణము: తెలుగు ప్రచురణ శాఖ, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి.
వెల: మేలుప్రతి ...... రు. 2—8—0.
సాధారణప్రతి ...... రు. 2—0—0
చిన్నసైజు: 366 పుటలు.

తత్వ శాస్త్రములు (వేదాంత శాస్త్రములు) నిగూఢ మైనవి. ఇట్టి విషయమును చర్చించుటలోను, కొన్ని మూల సిద్ధాంతములను ప్రతిపాదించుటలోను, మానవుల బుద్ధి సూక్ష్మత, విజ్ఞాన ప్రతిభ, ఊహా ప్రపంచములోనైనను, ఎంత దూరము పోగలదో అంతవఱకు మన ప్రాచీన మహర్షుల బుద్ధిసూక్ష్మత, విజ్ఞాన శక్తి, పోయినదని నిరూపించుటకు ఉపనిషత్తులే ముఖ్యాధారములు. "బ్రహ్మ – ఆత్మ" అనువాని ఐక్యత, అభేదత్వము అందులో నిరూపింపబడినది. ప్రతి మానవ వ్యక్తి హృదయాంతరాళములో బ్రతిష్ఠింప బడి యున్న 'ఆత్మ' దృశ్య ప్రపంచములోను, సృష్టి యంతటిలోను, యంతర్యామియై యున్న 'బ్రహ్మ' మే యని ఉపనిషత్తులు మొట్టమొదట సిద్ధాంతీకరించి యున్నవి. 'భగవంతుడను మహాశక్తి (ఒకడు) యొకటి యుండవచ్చు' నని ఇతర మతము లూహించుచున్నను, (Speculation) ఉపనిషత్తుల మతములో (వేదాంత మతములో) అట్టి ఊహలకు తావియ్య లేదు. ఈ జన్మములోనే 'ఆత్మను' – 'బ్రహ్మను' (భగవంతుని) పొందవచ్చునని ఉపనిషత్తులు నిరూపించుచున్నవి. ప్రతిమానవుని శరీరము (దేహము) బ్రహ్మపురి యనియు, అందులో హృదయమను దేవాలయములో (హృదయాకాశములో) సూక్ష్మాతి సూక్ష్మమైన వాయురూపకముగా బ్రహ్మ (భగవంతుడు) సూర్యుని మించిన కాంతితో ప్రకాశించుచున్నాడని ఉపనిషత్తులు చాటుచున్నవి. మానవుని హృదయాకాశములోని బ్రహ్మమునకును, ఈ సృష్టినంతయు వ్యాపరించుకొని యుండు బ్రహ్మకును ఏమాత్రము భేదము లేదనియు ఉపనిషత్తులు తెలుపుచున్నవి. మహోత్కృష్టమై, అద్వితీయములైన ఇట్టి సత్యము లెన్నియో ఉపనిషత్తులలో నిండియున్నవి. మానవ ఔన్నత్యము, విశ్వమానవ ప్రేమ, ఈ ఉపనిషత్తులొసగు సందేశము. ఇందులోని మహోన్నత భావములు, మూలసిద్ధాంతములు, జాతి, మత, దేశ కాలములకతీతమైనవని నవీన ప్రపంచ విజ్ఞాన వేత్తలెల్లరు అంగీకరించుచున్నారు.

'మానవ జాతికి ఉపనిషత్తులను చదువుట వల్ల కలుగు ప్రయోజనము, భావౌన్నత్యము, మరి దేనిని జదివినను లభింపవు. నా జీవితమున కోదార్పు నొసగుచున్నవి ఉపనిషత్తులే. మరణాంతరము నాకు దుఃఖోపశమనము కలుగజేయునవి ఉపనిషత్తులే' యని జర్మనీ దేశములోని విఖ్యాత తత్వవేత్త షోపన్‌హవర్ గారు తెలిపియున్నారు. ఇందులో అతిశయోక్తి ఎంతమాత్రము లేదు.

ఇట్టి అపూర్వ సత్యములను వెదజల్లుచున్న ఉపనిషత్తులను తెలుగు భాషలో సర్వజనులకు అర్థమగురీతి సులభముగ వచనములో వ్రాయబడిన గ్రంథము లీనాడు అరుదుగ నున్నవి. అందువలన ఉపనిషత్తులలోని మహోన్నత సత్యములను తెలుపు వచన గ్రంథములు వెలువడుట ఎంతయు హర్షింపదగిన విషయము.

ఇప్పుడు చర్చింపబడుచున్న గ్రంథముయొక్క శీర్షికను చదివి, 'ఇది కేనోపనిషత్తే కదా' యని పాఠకులు పొరబాటు పడవచ్చును. ఇది 'కేనోపనిషత్తు' మాత్రమే కాదు. ఇందు అరవింద యోగీంద్రుల అద్భుతమైన తత్త్వ పరిణామ మంతయు బహు విపులముగ తెలుపబడి యున్నది. ఇందు నాలుగు ముఖ్యభాగము లున్నవి. మొదటి భాగమందు 'తొలిపలుకు' అను శీర్షిక క్రింద జగత్పావన పుణ్యమూర్తియైన శ్రీ అరవింద యోగీంద్రుల జీవిత సంగ్రహ మొసగబడి యున్నది.

ఏ గ్రంథములోని విషయముల నైనను సరే గ్రంథకర్తను, పూర్తిగా అర్థము చేసికొనవలెనన్న, గ్రంథకర్తయొక్క జీవిత సంగ్రహమును తెలుసుకొనుట అత్యవసరము. మానవుని జీవిత పరిణామము ననుసరించియే, భావ పరిణామములు కూడ ఆధారపడి ఉండును. వ్యక్తిగతమై, అద్భుతములైన అంతరంగిక శక్తులు ఆ గ్రంథకర్త యొక్క జీవితగతిని, భావ క్రమమును, ఏ విధముగ మార్చినవో, మార్పుపొందుట కే విధముగ తోడుపడినవో, బాహ్య పరిస్థితు లే తీరున అనుకూలించినవో లేక ప్రతిఘటించినవో, ఏ పరిస్థితులలో ఆ గ్రంథములు వెలువడెనో తెలుసుకొనుటకు గ్రంథకర్తల జీవిత సంగ్రహము తోడుపడును.

రెండవ భాగము "ఆర్య" అను శీర్షిక క్రింద వ్రాయబడినది. ఇది శ్రీ యోగీంద్రుల సంపాదకత్వమున పుదుచ్చేరి నుండి వెలువడు చుండిన "తత్త్వ వైజ్ఞానిక ఆంగ్ల మాస పత్రిక." సృష్ట్యాను బంధములైన మూల సమస్యల సాకల్యముగ పరిశీలించుటయును, ప్రాక్పశ్చిమములందలి మానవజాతి యొక్క వివిధ మత సాంప్రదాయములను, సమరస మొనర్చ నపార సమన్వ యజ్ఞాన నిరూపణమును, తదుద్దేశ ద్వయము ఆ పత్రికయొక్క ఆశయమని తెలిపి యున్నారు. ప్రాచీన శ్రుతుల యనువాద వ్యాఖ్యలను, అంతరీక్షణ, యాత్మవికాసోపకరణములైన యాచరణ విధానములు, దివ్య జీవనము, యోగసమన్వయములకు తోడు, వేదరహస్యము ఏర్చి తీసిన సుక్తాను వాదము, ఈశ, కేనోపనిషద్భాష్యములును, ప్రాచీన శ్రుతువుల యనువాద వ్యాఖ్యలును, మానవ ఐక్యతాశయము, వేదమందలి సాంకేతిక భావములను స్పష్టీకరించుట, గీతా వ్యాసములు ఈ "ఆర్య" యను పత్రికయందు వ్రాసిరి.

"సృష్టియొక్క మూలసత్యమునకును, మనకు గోచరానుభవములగు దాని రూపములకును మధ్య గల సంబంధమును పరిశీలించునది తత్త్వజ్ఞానము. ఇందు ప్రాక్పశ్చిమములు భిన్న మార్గముల నవలంబించినవి. జీవన సత్యమునే గట్టిగా నమ్మి ప్రతీచి కొంతకాలము సర్వస్వమును జీవన సత్యమునకే ధారవోసి, ఆత్మను త్యజించినది. పూర్వ మన్నతో సత్యము నే గట్టిగా నమ్మి, కొంతవరకు ముఖ్యముగ హిందూదేశమందు దానికే సర్వస్వమును ధారవోసి, సాధ్యతల నన్నిటిని త్యజించినది. ఈ రీతి రెండిటి మధ్య కల్పితమైన వైరుధ్యము వాస్తవమైనది కాదని" శ్రీ యోగీంద్రుల మతము. సృష్టియొక్క మూలము ఆత్మయైనందున సృష్టినంతయు నాత్మ వికాసమే కాగలదు. మనకు గోచరానుభవములైన సృష్టిగత నానారూపము లొక్కటూరి ఆత్మను వ్యక్తము జేయు నుపకరణములను, ఆత్మను మరుగు పఱచు ముసుగులును అగుచున్నది. అవి కేవలము ముసుగులు కాక, ఆత్మయొక్క సిద్ధోపకరణములగు వఱకు మానవుడు జ్ఞానాభివృద్ధిని జెంది, అధ్యాత్మిక గుణశక్తులందు పెంపొందవలెను. దివ్య పరిపూర్ణత గాంచుటయే మానవుని నిజధర్మము. అతని భౌతిక స్థితి యంతయు దైవమును ప్రతిబింబించునటుల పరివర్తనము గాంచుటయే పరిణామమందలి యర్థము. మానవునితో గూడ సృష్టియంతయు పరివర్తనము గాంచుటే నవయుగ స్థాపనము—అంత సులువైనది గాక యతి కష్టసాధ్యమైనది." ఇదియే శ్రీ అరవిందుల నిజతత్త్వ స్వరూపము. ఈ తత్త్వ నిరూపణమునకే శ్రీ అరవిందయోగీంద్రులు తమ వ్రాతల నన్నిటిని వినియోగించిరి. మానవుడు వ్యక్తిగతముగ తాను ఈశ్వర సాక్షాత్కారమును బొంది, బ్రహ్మైక్యమగుటయేగాక మానవకోటి నంతయు తరింప జేయగలడనియు, అందులకే సృష్టిలోని ప్రకృతియు, సర్వశక్తులు పని చేయుచున్నవనియు, శ్రీ యోగీంద్రుల సిద్ధాంతము.

మూడవ భాగములో "ఆర్య" పత్రికలో నాల్గవ సంవత్సరము చర్చించిన, ఉద్దేశము—లక్ష్యము, సంస్కృతిని భేదములు, నిజతత్త్వ స్వరూపము, దివ్య జీవనము, వేదాంత విరుద్ధములు, రహస్య వేత్తల సిద్ధాంతము, ఈశోపనిషత్తు, కేనోపనిషత్తు, గీతావ్యాసములు, యోగసమన్వయము, మానవ ఐక్యతాశయము మొదలైన విషయములు సంగ్రహముగ చర్చింపబడి, కేనోపనిషత్తు మూలము, ఆంగ్లవ్యాఖ్యానము ప్రకటింపబడినది. అపూర్వ పదనిఘంటు కూడ ఇందు చేర్చబడి యున్నది.

శ్రీ భరద్వాజులవారిచే ఆంగ్లమునుండి తెలుగులోనికి గావింపబడిన అనువాద మద్వితీయముగ నున్నది. మూలములోని భావమును ఉన్నదున్నట్లు భాషాంతరీకరణము గావింపబడి యున్నది. భావాను భవములైన తత్త్వశాస్త్రములను, యోగశాస్త్రములను, వ్రాయవలయునన్నను, అనువదింపవలె నన్నను కొంతసాధన, ప్రత్యక్షానుభవము లేనిదే, ఎల్లరకును సాధ్యము కాదు. శ్రీ భారద్వాజులుగారి భాషాంతరీకరణముచూడ, మూలము లేకున్నచో, అదే మూలమనునటు లున్నది. వీరికి యోగ సంస్కారము కూడ పూర్ణముగ అబ్బినట్లు స్ఫురించును.

విషయమునకు తగినట్లు శైలి మనస్సున కానందము కలిగించుచున్నది. రహస్యవేత్తల సిద్ధాంత సంగ్రహము నెల్లరు చదివితీరవలెను. స్థల విస్తర భీతిచే దాని నిచ్చట చర్చింపలేదు. ప్రాచీన మహర్షుల విజ్ఞాన నిధులైన ఉపనిషత్తుల సారమును, శ్రీ అరవిందుల తత్త్వ సిద్ధాంతము యొక్క నూతన దృక్పథమును తెలిసికొనవలెనను కుతూహలము కలవారెల్లరికి, ఈ గ్రంథము చదువ తగియున్నది. తెలుగుభూమి శ్రీ భరద్వాజులగారి కెంతయు ఋణపడియున్నది. వీరింకను ఇట్టి గ్రంథములను తెలుగున వచన రూపమున అనువదించి ఉపనిషత్తులలోని మూల సిద్ధాంతములను సామాన్యప్రజలకు వెల్లడి చేయుదురు గాక యని ఆశించుచున్నాము.

# రాబోవు ఎన్నికలు - ఓటర్లకు హెచ్చరిక.

ఇండియాకు స్వాతంత్ర్యము లభించిన తర్వాత 1952 వ సంవత్సరము జనవరి నెల 2-వ తేదీ ప్రారంభము కానున్న ఎన్నికలే మొట్టమొదటి ఎన్నికలు. 1947-వ సంవత్సరము ఆగష్టు 15-వ తేదీ నుండి ఈ దేశములో కేంద్రములో కాని, రాష్ట్రములలో కాని ఏర్పడిన మంత్రివర్గములు (ప్రభుత్వములు) ప్రజా ప్రాతినిధ్యము కలిగిన మంత్రివర్గములు కావని ప్రజలెల్లరు స్పష్టముగ గ్రహింప వలెను. ఇవి తాత్కాలిక మంత్రివర్గములే. కేంద్ర ప్రభుత్వమును నిర్వహించుచున్న శ్రీ. జవహర్‌లాలు నెహురు గారిపై, ప్రజా సామాన్యమున కున్న ప్రేమ, విశ్వాసముల వల్లను, ప్రజల మంచితనము వల్లను, ప్రజలపై జొప్పింపబడి, ఈ దినము వఱకును కొనసాగుచున్న మంత్రివర్గములు, అందు ముఖ్యముగ రాష్ట్ర మంత్రివర్గములు సహింపబడి యున్నవి. గడచిన నాలుగు సంవత్సరములుగ కాంగ్రెసు సంస్థ యాజమాన్యము క్రింద కొనసాగిన ప్రభుత్వములు, ప్రజలలో చాల అసంతృప్తిని కలుగ జేసినవి. దేశమును, దేశ ప్రజలను, ఎదుర్కొనిన అత్యవసరములైన సమస్యలను పరిష్కరించుటలో, సంపూర్ణమైన అసమర్థతను ఋజువు చేసినవి. బలమైన ప్రతిపక్ష పార్టీలు శాసన సభలలో లేకపోవడము చేత, ఒకే పార్టీకి సంబంధించిన మంత్రుల యొక్క పరిపాలనము నిరంకుశముగ పరిణమించినది. ప్రజాభిప్రాయమునకు ప్రత్యక్ష విరోధముగ కొనసాగినవి. నిష్పక్షపాత బుద్ధితో విమర్శించినచో,- విదేశీయుల యాజమాన్యము క్రింద కొనసాగిన ప్రభుత్వములే మేలుగా నుండెనని అనిపించినవి.

ఈ లోపముల కంతయు, సమర్థులైన వ్యక్తులు మంత్రివర్గములలో లేకపోవుటయే అను విషయమును ఓటరులెల్లరు బాగుగ గ్రహింప వలెను. శాసన సభలకు ఎన్నుకొనబడు సభ్యులు సర్వసమర్థులై, సత్యనిరతి, సేవాపరత్వము, న్యాయైక దీక్ష లేనివారగుచో, వారినుండి ఏర్పడు మంత్రివర్గములు అసమర్థములై, పరిపాలనమే అవినీతికరముగ మార్పొందును. దేశమునకు సర్వ సంపూర్ణ స్వాతంత్ర్యము లభించి కూడ వ్యర్థమగును. అది దేశ ప్రజలకు, అందు ముఖ్యముగ బీద సాదలకు ఒక శాపముగ పరిణమించును.

గడచిన దేమో గడచిపోయినది. ఇకముందైనను బీద సాదలను దృష్టియం దుంచుకొని, దేశ హితార్థమై దీక్షతో పాటుపడ గల మంత్రివర్గములను (ప్రభుత్వములను) కేంద్రములోను, రాష్ట్రములలోను ఏర్పరచుకొనుటకు, దేశ ప్రజ లెల్లరికి గొప్ప అవకాశ మేర్పడినది. దేశములో ఎన్నికల సన్నాహము ప్రారంభమైనది. ఇప్పుడీ దేశములోనున్న రాజకీయ పార్టీలలో కాంగ్రెసు పార్టీ ఒక్కటియే బలమైన పార్టీ యని అంగీకరింపక తప్పినది కాదు.

కాంగ్రెసు పార్టీ పక్షమున శాసన సభలకు అభ్యర్థులుగా నియమించుటలో, కాంగ్రెసు సంస్థకు చేరిన వారైనను, కాంగ్రెసు సంస్థతో సంబంధము లేనివారైనను సరే, ఉత్తమోత్తము లైన వ్యక్తులనే అభ్యర్థులుగా నియమింప వలెనని కాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ. జవహర్‌లాలు నెహురుగారు రాష్ట్ర కాంగ్రెసు సంఘముల వారికిని, రాష్ట్ర ఎన్నికల సంఘము వారికిని, ఆదేశములను పంపియున్నారు. కాంగ్రెసు పార్టీ పక్షమున నిలుపబడు వ్యక్తులు, ధర్మనిష్ట కలవారై, తమ బాధ్యతను చక్కగా నిర్వహింపగల యోగ్యత గల వారుగ నుండవలెనని శాసించియున్నారు. కాంగ్రెసు సిద్ధాంతములకును, ఉన్నతాశయములకును, ప్రతిబింబముగా నుండునట్టి యోగ్యతగలవారిని మాత్రమే అభ్యర్థులుగా నియమింప వలెనని శ్రీ. జవహర్‌లాలు గారు స్పష్టమైన పదములతో రాష్ట్ర సంఘములవారికి తెలియజేసి యున్నారు. కాని ఈ దౌర్భాగ్య దేశములో ఒకే ఒక్క గాంధీజీ యుండెనాడనియు, ఉన్నతాశయములతో నిష్కామసేవ జేసి, దేశ కీర్తిని ఇనుమడింప జేయవలయునని పాటుపడుచున్న వ్యక్తి ఒక్క జవహర్‌లాలు మాత్రమే ఉన్నాడనియు, మఱియొక జవహర్‌లాలు లేడనియు ఆయనకు స్ఫురించ లేదు.

ఇప్పుడు కాంగ్రెసు పార్టీ పక్షమున అభ్యర్థులుగా నియమింపబడిన వారి పట్టీలను చూడ, ఆశయములకు చాలకొరత పడి యున్నవని మాత్రము నిస్సందేహముగ చెప్పవచ్చును. వ్యక్తుల యొక్క యోగ్యతలను, అయోగ్యత్యలను ప్రత్యేకముగ చర్చించుట మాపని కాదు. వారి యోగ్యతలు, అయోగ్యతలు దూరముననున్న శ్రీ జవహర్‌లాలు గారికిని - కేంద్ర పార్లమెంటు బోర్డువారికిని తెలియకపోవచ్చును. ప్రతి నిత్యము దగ్గరగా నుండి చూచు ప్రజలకు, ఓటర్లకు బాగుగ తెలిసియే యుండును.

కనుక రాబోవు ఎన్నికలలో - ఓటర్లెల్లరు ఒక్క ముఖ్య విషయమును మాత్రము మనస్సునందుంచు కొనవలెనని హెచ్చరించుచున్నాము. ఓటర్లకు ప్రస్తుతము దేశములోనున్న రాజకీయ పార్టీలతో పనిలేదు. ఎన్నికలకు పోటీచేయుటకై అభ్యర్థులుగా నిలుచువారు కాంగ్రెసు పార్టీకి చేరినవారు కాని- లేక ఏ యితర రాజకీయ పార్టీలకు చేరినవారు కాని. దానితో ఓటర్లకు పనిలేదు. శ్రీ జవహర్‌లాలు గారు సూచించినటుల న్యాయబుద్ధి, నిష్కాపట్యము, సామర్థ్యము కలవారు ఎవరో - ఉన్నచో వారు ఏ పార్టీకి చెందినను సరే, లేక ఏపార్టీకి చెందక స్వతంత్రముగ నిలిచియున్నను సరే అట్టి ఉత్తములైన అభ్యర్థులకే ఓట్లనిచ్చి, ఇతర ఓటర్లచే ఓట్ల నిప్పించి, సామర్థ్యము గల మంచి మంత్రివర్గములు, సామర్థ్యము కలిగిన బలమైన ప్రతిపక్షము, ఇండియా పార్లమెంటులోను, రాష్ట్ర శాసన సభలలోను ఏర్పడుటకు గట్టిగా దీక్ష వహించి, ప్రయత్నింప వలెనని ఓటర్ల నందరిని హెచ్చరించుచున్నాము.

చిన్నకథ.

# మాలతి.

(శ్రీమతి లీలావతీ నారాయణ గారు, బి. యస్. సి.)

ఇవి 1947 సంవత్సరము ఆగష్టు నెల దినములు. ఉత్తర హిందూస్థానమంతయు గడగడలాడి, భీతావహమొందిన దినములు. కాళి ప్రచండ రూపమున మానవుల శవములపైనను, రక్తముపైనను తాండవమాడిన దినములు. యువతులు, స్త్రీలు స్వాతంత్ర్య మెందుకోయని ఆక్రందనములు గావించిన దినములు. తండ్రిని కొడుకు, తల్లిని బిడ్డ, భర్తను భార్య, మఱచిపోయిన దినములు. ముస్లిములకు హిందువులనినను, సిక్కులనినను ప్రాణములతో వారిని చూచి, తాళజాలనటువంటి దినములు. ముస్లింలను హిందువులు కాని, సిక్కులు కాని చూచి ఓర్వజాలని దినములు. స్వాతంత్ర్య దినోత్సవము ఆగష్టు 15-వ తేది భారత దేశమునకు కేంద్రస్థానమైన ఢిల్లీ పట్టణములో జరిగెనో లేదో, మరునాడు నుండియే పాకీస్థానములోను, హిందూస్థానములోను మారణ హోమములు ప్రారంభమాయెను. వేలకొలది హిందువులు, సిక్కులు పాకీస్థానునుండి హిందూస్థానమునకు ప్రాణసంరక్షణార్థమై పరుగెత్తుకొని రాబట్టిరి. ముస్లింలుకూడ హిందువుల దౌర్జన్యములకు తాళజాలక, పాకీస్థానమునకు పరుగెత్త ప్రారంభించిరి. ఇట్టి భయంకరమైన దినములలో, పురుషులు క్రూర హృదయులై అబలలైన స్త్రీలను, బిడ్డలను వారివారి గతికి విడిచిపెట్టి తమ ప్రాణములు కాపాడుకొనుటకే ఎక్కువ తహతహ పడిరి. కొంతమంది తమ వెంటనే తమ భార్యా బిడ్డలను పిలుచుకొని పోయిరి. ఈ రెండు నూతన స్వతంత్ర దేశములలోను, ఉన్నట్టుండి రగుల్కొనిన మతద్వేషానల జ్వాలలను చూచి భిన్నమతస్థులైన మగవారిలోనే క్రోధము ఎక్కువగ కనబడినది. మగవారు చూపినంత ద్వేషము, అసహనము, స్త్రీలు ప్రదర్శింప లేదు. విధిలేక స్త్రీలను, బిడ్డలను వదలిపోయినను, హిందువులు, సిక్కులు వారి జోలికి పోరని ముస్లింలకొక విధమైన విశ్వాసము మాత్రముండినది. అట్టి నమ్మకము యెక్కువ గలవారే, వారి యాలుబిడ్డలను హిందూస్థానములో వదలి పురుషులు మాత్రము పాకీస్థాన్‌కు పరుగెత్తిపోయిరి.

ఈ యల్లరుల సమయములో ఢిల్లీ పట్టణములోను, పరిసర గ్రామములలోను నివసించు హిందువులు, సిక్కులు, ముస్లింలు. తమ యింటి తలుపులను తెఱచిన పాపమున పోరైరి. ఏ క్షణమున నెవరొచ్చి మీదపడి చంపెదరో యన్న భయము ప్రజలెల్లరని యావహించి యుండెను. ఇట్టి విషాద దృశ్యములను చూచి, ప్రభుత్వ నాయకులైన జవహరిలాలు నెహురు, సర్దార్ వల్లభాయి పటేలుగార్ల ముఖములు విహీనములై కత్తితో పొడిచినను రక్తము లేకుండెను. తలవని తలంపుగా వారి నెదుర్కొనిన హింసా కాండను చూచి, వీరిరువురికి పిచ్చెత్తెను. వెఱ్ఱి ముఖములుగా మారిపోయెను. వారి నైతిక బలమును, ప్రభుత్వ బలమును ఉపయోగించి, శాంతిని నెలకొల్పుటకై యిరువది నాలుగు గంటలు నిద్రాహారములు మాని ప్రయత్నించుచుండిరి. వీధుల వెంట మోటారు కారులలో తిరుగుచుండిరి. హిందువుల యుద్రేకములను శాంతింప జేయుచుండిరి.

న్యూఢిల్లీ పట్టణమునకు పదిమైళ్ళ లోపుగనున్న ఒక గ్రామములో సూర్యాస్తమయ సమయము నందొక యువకుడు స్కావుటు దుస్తులను వేసుకొని న్యూఢిల్లీ పట్టణమువైపు జరూరుగా వచ్చుచుండెను. కొందరు అల్లరిమూకలు చేరి యా యువకుని వీపుపై కత్తితో పొడిచి నలువిశల పారిపోయిరి. "అమ్మా" యని నావ్రకేక వేసి యా యువకుడు క్రిందపడెను. చూచువారెవరు? విచారించువారెవరు? ఎవరు దిక్కు? ఇండ్ల తలుపులు తెఱచుకొని ఆ సమయములో వీధిలోనికివచ్చి చూచుట కెవ్వరికి ధైర్యము కలదు?

ధైర్యమున్నదో లేదో ఈ యువకుని ఆర్తనాద మొక యువతి చెవికి సోకెను. ఆమెను కలవరి పఱచెను. ఆకేక తన యింటికి సమీపము నుండి వచ్చెనని గ్రహించెను. ఎవరో హత్యకావింపబడిరని యూహించెను. చీకటి ఎక్కువగుచున్నది. ఇంటిలో పురుషులెవ్వరును లేరు. మధ్యవయస్సులో నున్న తల్లి మాత్రమున్నది. ఇంటి తలుపులు తెఱచి చూచుటయా, చూడకుండుటయా యనుబాధతో తాళజాలకుండెను. హంతకు లంచే దాగి యుండెదరేమో, తాను తలుపుతెఱచిన తన యింటిలోనికి ప్రవేశించెదరేమో యను భీతికూడ ఆ యువతి కుండెను. పాపము యేమి చేయగలదు. ఆమె హృదయము మాత్రము ఆ యువకుని హృదయమునకు ప్రత్యుత్తర మిచ్చుచున్నది. ఏమియుతోచక యింటిలో కొంచెము సేపు అటు నిటు తిరుగుచుండెను. కొంతసేపు కుర్చీపై కూర్చుండును. మరలా కొంచెముసేపు మంచముపై కూర్చుండును. మరలా లేచును. వాకిలి దగ్గఱకు వచ్చును. తెఱచుటకు ధైర్యము చాలక వెనుకకుపోవును.

తుట్టతుదకు ధైర్యము తెచ్చుకొనెను. తల్లి వలదని చెప్పుచున్నను వినక వాకిలి తీసి యిరువైపుల చూచెను. తన యింటి ముందఱనే యెవరో పడియున్నటుల యింటినుండి వ

చ్చు దీపము వెలుగులో తెలుసుకొనెను. తల్లిని టార్చిలైటు తెమ్మని సైగచేసి, క్రిందపడియున్న వానికి ప్రాణములున్నవా — ప్రాణములు పోయినవా చూడమని తల్లికి చెప్పెను. తాను మాత్రము తలుపు దగ్గరనే యుండెను.

తల్లి టార్చిలైటు వేసి చూచువరకు ఆ యువకుని వీపు నుండి రక్తము ప్రవాహముగా కారుచుండెను. తెలివి తప్పి యుండెను. ప్రాణము మాత్రమున్నటుల తట్టెను. టార్చిలైటు వెలుగులో ఆ రక్తమును, ఆ యువకుని చూచి, ఆ పిల్ల క్రింద పడెను.

కొంత సేపటికి లేచి, తల్లిని లోనికి రమ్మని, కర్తవ్యము నాలోచించెను. తల్లికి యేమిచెప్పవలెనో తోచలేదు. ఆ పిల్ల యింటినుండి మంచము తీసుకొని తల్లిని రమ్మని, యిద్దరును ఆ యువకుని మంచమునందు పరుండబెట్టి, చరచర, దక్కులు చూడక యింటిలోనికి దెచ్చిరి. ఇంటి తలుపులు పదిలముగ మూసివేసిరి.

అప్పటికి సుమారు రాత్రి 9 గంటల కాలమై యుండును. ఆ గాయపడిన యువకుని కులమును కాని, స్థలమును కాని విచారింపవలెనను తలంపు ఆ యువతికిగాని, ఆమె తల్లికి గాని తట్టలేదు. వెంటనే చల్లని నీరు తెచ్చి, నెత్తురుమయమైన దేహము నంతయు తడిగుడ్డలతో తుడిచిరి. నెత్తురయిన గుడ్డలను విడిచిరి. వేరు గుడ్డలను, స్త్రీలైనను సిగ్గుపడక తొడిగిరి. నెత్తురు కారుచున్న గాయమును శుభ్రముచేసి, తడి గుడ్డలను కట్టిరి. తెలివి తప్పి పడియున్న వ్యక్తికి గొంతులో కొంచెము చల్లని నీరును పోసిరి. రెండు మూడు గుటకలు మ్రింగి ఆ యువకుడు కదలక మెదలక పరుండి యుండెను. తెలివి పూర్తిగా రాలేదు. స్టౌను వెలిగించి వెచ్చని "ఛా"ను తయారు చేసిరి. ఆ యువకునికి త్రాపుటకు ఆ యువతి ప్రయత్నించెను కాని లాభము లేకపోయెను.

గాయముపై తడి గుడ్డ వేయుటతోనే కొంతసేపటికి రక్తము కారుట నిలిచిపోయెను. యువకుడు 'అమ్మా' 'అమ్మా' యని బాధతో అరచుటకు ప్రారంభించెను. కాని కన్నులు తెరువజాల దయ్యెను.

ఇదంతయు పూర్తియగు సరికి రాత్రి పదకొండు గంటల కాలమాయెను. వైద్యు డెక్కడున్నాడు? వైద్యుని కొరకు పోవువారెవరు? పిలుచుకొని వచ్చువారెవరు? ఇంత ఘాతపడి యింత రక్తము పోయిన రోగి, వైద్య చికిత్సలేక ప్రాణముతో దక్కునా యను విషయముపైననే యువతి బుద్ధియంతయు నిమగ్నమై యున్నది. అన్నము తినమని తల్లి బ్రతిమాలినను ప్రపంచ వాసన చూడని యువతి, ఆ రాత్రి ఆ యువకుని బాధను చూచి, అన్నము తినదయ్యెను. నిద్రపోదయ్యెను. ఈ యువతి జీవితములో నిదే యిట్టి మొట్టమొదటి సంఘటన కాబోలు. "అమ్మా" మన యింటిలోనికి తెచ్చుకుంటిమే. ఈ యువకుడు బ్రతుకునా? ఏ వైద్య సహాయము లేదే? మనమిద్దరము ఆడువారము. ఆ యువకుని ప్రాణములు దేవుని చేతిలోనున్నది. నేనేమి చేయజాలకున్నానే. మనుష్యులెంతటి నిస్సహాయులు. అని తనలో తాను వాదురుకొనుచు, వళ్లు పట్టి చూచును. నోరు తెరచియున్నట్లున్నచో స్పూనుతో నీరుపోయును. ప్రమాద స్థితియందు రోగుల యెడ ఆస్పత్రులలో నర్సులు యప్రమత్తతలేక జాగ్రత్తగ నెటుల చూచుకొందురో అదే విధముగ ఆ రాత్రి యంతయు ఆ యువతి ఆ యువకుని చూచుకొనుచుండెను. (సశేషము)

## కోర్టు నోటీసు :

మదనపల్లె డిస్ట్రిక్టు మునసపు కోర్టులో.

O. S. No. 501/1951 — I. A. 1935/1951.

రాయవరము నాగిరెడ్డి, representing the entire body of reversioners of late దేవా యర్రింరెడ్డి ... ... వాది.

(1) ఓబేటి యర్రింరెడ్డి; (2) దేవా జయరామిరెడ్డి; (3) దేవా మంగమ్మ ... ... ... ప్రతివాదులు.

పై నెంబరులోని వాది పోతీ దేవా యర్రింరెడ్డియొక్క యితర వారసులు అందరి తరపున పై దావాను దాఖలు చేయుటకు కోర్టువారి అనుమతి పొందగోరి, పై కనిన I. A. 1935/1951 గల మనవి దాఖలుచేసి యున్నాడు. అందుపైన ఎవరికన్నా ఆక్షేపణలున్న యెడల ఖుద్దునగానీ, వకీలుద్వారాగానీ 19—10—1951 తేదీన పగలు 11 గంటలకు పై కోర్టువారి యెదుట హాజరయి, తెలుపుకొనవలెనని యీందు మూలముగ సర్వులకు తెలియ జేయడమైనది.

మదనపల్లె, 2—10—1951.

ఎ. నంజుండప్ప, బి. ఏ., వాదిపరము వకీలు.



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

REGISTERED No. M. 5235. రాజకీయ వార పత్రిక.

# భారత జ్యోతి

సంపాదకులు:- సి. రామకృష్ణ, బి.ఏ.,

సంపుటము 4. సంచిక-33. | బుధవారము, అక్టోబరు 24, 1951. | విడి పత్రిక వెల మూడు అణాలు.

## విషయానుక్రమణిక



—:(o):—

# భారత జ్యోతి

సంపుటము. 4. సంచిక 33.

శ్రీ ఖరనామ సంవత్సర ఆశ్వీయుజ బ. ౯, అక్టోబరు, 24, 1951.

ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## ఓటర్ల దృష్టిని మార్చుటకు ఇది ఒక ఎత్తా?

ఇండియా ప్రధాన మంత్రిగారైన శ్రీ. జవహారిలాలు నెహురుగారు ఈ మధ్య మతవైషమ్యమును గూర్చి ఎక్కువ తీక్షణముగ మాటలాడుచున్నారు. గాంధీజీ హత్యతోనే భారత దేశములో మత వైషమ్యములు రూపు మాసిపోయినవి. మత వైషమ్యములే లేవు. భారత దేశములో అధిక సంఖ్యాకులు హిందువులై యుండవచ్చును గాక. కాని హిందువులకును, మహమ్మదీయులకును, సిక్కులకును, క్రైస్తవులకును, బౌద్ధులకును, జైనులకును, పారసీకులకును, ఇతర మతములవారికిని ఈ దేశములో నివసించుటకును, అందరును సరిసమానమైన పౌరహక్కులు అనుభవించుటకును హక్కుయున్నదని ఎల్లరు అంగీకరించియున్నారు. మహమ్మదీయులను హిందువులు ద్వేషించుట లేదు. హిందువులను మహమ్మదీయులు ద్వేషించుట లేదు. గాంధీజీ తనరక్తముతో ఒకరితో నొకరికి సద్దుబాటు కుదిర్చియున్నాడు.

దేశములో ఇప్పుడు ఆంతరంగిక శత్రువుగా పరిణమించినది — పరిణమింపనున్నది — మత వైషమ్యము కానేకాదు. దుర్భరమైన ఆహార సమస్య, వస్త్ర సమస్య, గృహసమస్య, ఆరోగ్య సమస్య. ఇవే మానవ నిత్య జీవితమున కత్యవసరములైన సమస్యలు. ఈ దేశమునకు సర్వస్వాతంత్ర్యము లభించి నాలుగు సంవత్సరములు దాటిపోయినది. కేంద్రములోను, రాష్ట్రములలోను ఏర్పడిన కాంగ్రెసు పార్టీ మంత్రి వర్గములు, ఈ ప్రధాన సమస్యలను ఈ నాలుగు సంవత్సరముల కాలములో పరిష్కరింప జాలరైరి. 1947 సం॥ ఆగష్టు నెలలోని పరిస్థితులకును, ఇప్పటి పరిస్థితులకును పోల్చి చూచిన, సంవత్సర సంవత్సరమునకును, ప్రజల జీవిత సమస్య బాగుపడుటకు మారు భరించుటకే శక్యము కానట్టి ప్రమాదమైన స్థితికి వచ్చినది. ఈ ప్రధాన సమస్యలను పరిష్కరించుటకు "మేము" మా "కాంగ్రెసు ప్రభుత్వములు" ఏమియు చేయజాలక పోయినవని స్పష్టముగ ఓటర్లకు చెప్పి, ఇక మీకు ఇష్టమొచ్చిన వారిని ఎన్నుకొని, ఇష్టమొచ్చిన ప్రభుత్వములను ఏర్పచుకొనవచ్చునని ప్రకటించుటకు మారుగ, మత వైషమ్యములు శత్రురూపమున తలలెత్తుచున్నవి; కాంగ్రెసు ప్రభుత్వములు సర్వశక్తులు ఉపయోగించి మత వైషమ్యములను హతమార్చునని శ్రీ. జవహారిలాలు గారు చెప్పుట ఎంతమాత్రము భావ్యముగా లేదు. ఎన్నికల సందర్భములో మతవైషమ్య సమస్యను అనవసరముగ పైకి లేవదీయుట వలన, ప్రధాన సమస్యల నుండి ఓటర్ల మనస్సు మార్చుటకై పన్నిన ఎత్తాయని తోచుచున్నది.

లక్షల కొలదిగాగల ఓటర్లు ఎల్లరు దరిద్రనారాయణులై ఈ నాలుగేండ్లుగ, కాంగ్రెసు పరిపాలనక్రింద అన్నవస్త్రములు లేక నలిగి పోవుచున్నారు. ఈ భారత జాతికి వెన్నముకవలె నుండిన మధ్యతరగతి వారెల్లరు తమ సర్వస్వమును ఈ నాలుగు సంవత్సరముల కాలములో గోలు

పోయి భిక్షకులై యున్నారు. ఎన్నిమాటలు చెప్పినను కాంగ్రెసు ప్రభుత్వముల క్రింద వీరు పడుచున్న కష్టములను మఱచి, మరిలా అసమర్థమైన పార్టీకే ఓటుచేయుదురని నమ్ముటకు వీలులేదు.

ఇప్పుడు దేశములోనున్న బలమైన రాజకీయ పార్టీలలో కాంగ్రెసు పార్టీ ఎక్కువ బలమైనదని అంగీకరింపక తప్పినది కాదు. రెండవ బలమైన పార్టీ సోషియలిష్టుపార్టీ. కాని ఈ సత్యమును మఱచి, లెక్కకు లేనన్ని క్రొత్త రాజకీయపార్టీలు ఎన్నికలు సమీపించు కొలది బయలుదేరుచున్నవి. ఇది చాల విషాదకరమైన విషయము. ఏదో ఒక విధముగ కాంగ్రెసు పార్టీని ఓడింపవలెనని, దేశములో ఎన్ని తలకాయలున్నవో అన్ని పార్టీలను స్థాపించుట చాల ప్రమాదము. కాంగ్రెసు పార్టీపాలనతో కాని, కాంగ్రెసు పార్టీ సిద్ధాంతములతో కాని తృప్తిపడి అంగీకరింపని వారెల్ల, ఒకే ఒక పార్టీగా చేరి, నీతినియమములు, సామర్థ్యము, యోగ్యతలుగల అభ్యర్థులను వెదికి, ఏర్పచుకొని, ఎన్నికలలో పోటీచేసినచో, అప్పుడు ప్రజలెల్లరు ఆ ప్రతికక్ష పార్టీకి ఓటుచేసి బలపఱచెదరుకాని లెక్కలేనన్ని పార్టీలను స్థాపించుట వల్లను, ఆపార్టీల పక్షమున అభ్యర్థులను నిలుపవలెనని ప్రయత్నించుట వల్లను ఎంతమాత్రము దేశమునకు కాని లేక దేశీయులకుకాని లాభముండబోదు. కనుక దేశములో కల వివిధ పార్టీలన్నియు ఒక పార్టీగా చేరి రాబోవు ఎన్నికలలో పోటీ చేయుట సమంజసమని తెలుపుచున్నాము.

—*—

# ఎన్నికలు — కాంగ్రెసు — శ్రీ. జవహారిలాలుగారి హెచ్చరిక.

"దేశభవిష్యత్పరిపాలన దృష్ట్యా ఎన్నికలు ముఖ్యమే. అయినా ఇందులో గెలుపొందే తీరవలెనన్న బుద్ధిని పెంచుకొని, ఏ సిద్ధాంతములను మనము పాలించవలెనని అనుకొనుచున్నామో, వానినే మరచిపోయ్యే పక్షములో, ఈ ఎన్నికలకు ఎంత ప్రాముఖ్యము వుండి కూడా లాభములేదు. అట్లుకాక, మనసిద్ధాంతముల విజయము కోసరము ఈ ఎన్నికల్లో పాల్గొని, ఆ సిద్ధాంతములకు తగిన విధముగా అభ్యర్థులను ఎంచుకొని, ఆ విధముగా పనిచేసే పక్షములో, ఆ ఎన్నికలలో పాల్గొనడము మర్యాదగా ఉండును. దేశానికి లాభము చేకూరును. కాని ఎన్నికల్లో విజయాన్ని సాధించవలెనన్న తొందరలో, అపసవ్యమైన విషయాలలో కూడా సర్దుకుపోవుదము అన్నట్లు వ్యవహరించిన, యిందులో విజయముపొందీ లాభములేదు; ఇక అప్పుడు ఎవరు గెలిచినారనునది ముఖ్యముకాదు.

"ఈ మహాకార్యము అంతా నేను చెప్పినట్లు కొనసాగవలెననిన, ముందు మనమందరము సంకుచితమైన ఆలోచనలను వదలి పెట్టవలెను. కుంతిత కార్యాలకు ఒడి గట్టడము మానుకోవలెను. ముఠాతత్వాలకు స్వస్తి చెప్పవలెను. పరస్పర దూషణలకు దిగరాదు. సంఘములో దుష్టశక్తులను సహించి వూరుకోరాదు. తిరిగి మనమంతా ఒక మహదాశయాన్ని సాధించేందుకు గాను, ఉన్నత సిద్ధాంతములను పాల్చించేందుకు గాను, నడుములు కట్టుకోవలెను. ఎన్నికలలో గెలుపు, ఓటమి, దీనికి అంత ప్రాముఖ్యము కాదు ఇవ్వవలసినది. ముందు మనలను మనమె జయించుకోవలెను. అప్పుడు తక్కిన అన్ని విజయాలు వాని అంగట అవి మన కాళ్ళమీద వచ్చిపడును. మనకంటే ఉన్నతమైన ఒక మహా ఆశయాన్ని సాధించడము కోసరము మనము కృషిచేయవలెను. ఆ కృషిచేయడములో కూడా ప్రలోభాలి కలు ఏమీ లేవన్నట్లు పనిచేసిన, అదే పెద్ద విజయము. యదార్థమైన విజయము అదే."

—శ్రీ. జవహారిలాలు గారు.

# రాబోవు ఎన్నికలు - ఓటర్లకు హెచ్చరిక.

దేశమునకు స్వతంత్రము రాకముందు పలుమారు శాసన సభలకు ఎన్నికలు జరిగినవి. ప్రజలు ప్రభుత్వము పక్షమునున్నా గాని లేక వ్యతిరేకముగ నున్నాగాని అయినదే అప్పటి ఎన్నికల లోని సవాలు. అప్పుడు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ పక్షమున ఒక పోగకప్పల్లను పెట్టినను, గెలువ గలదని సగర్వముగ ప్రభుత్వమువారిని — వారితో సహకరించు పార్టీవారిని, వ్యక్తులను, సవాలు చేయుచుండెడివారు. అప్పుడు కాంగ్రెసు పార్టీ పక్షమున పోటీచేయు వ్యక్తులయొక్క యోగ్యతలనుకాని అయోగ్యతలనుకాని ప్రజలంతగా గమనించుచుండెడివారు కారు. పార్టీ బలమును ఎక్కువగ చూచుకొనుచుండిరి. అదియును కాక, కాంగ్రెసు పార్టీ సాధారణముగ ప్రతికక్షి వర్గములో (Opposition Party) నుండి, బ్రిటీషు వారి యాజమాన్యము క్రింద కొనసాగుచుండిన ప్రభుత్వములను విమర్శించుచుండినది. ప్రభుత్వ పక్షమువారు ప్రవేశపెట్టు బిల్లులను, బడ్జట్టును నిరాకరించుచుండిరి. గవర్నరులు, గవర్నరు జనరల్సు, అసాధారణాధికారముల (certification) నుపయోగించి, ఆబిల్లులను, బడ్జట్టులకు ప్రాణము పోయుచుండిరి.

అప్పటికిని, ఇప్పటికిని (1921-30 కిని 1947-51 కిని) కాలము, పరిస్థితులు ఎంతో మారిపోయినవి. దేశమునకు సర్వస్వతంత్ర మొచ్చినది. ఇప్పుడు సర్వ సామర్థ్యముగల ప్రభుత్వము కావలెను. సామర్థ్యముగల పరిపాలనము కావలెననిన — ఎన్నికలలో పరకప్పల్లను నిలువపెట్టిన — పరకప్పల్లను గెలిపించుట కాదు. పరకప్పల్లను, గడ్డిపోచలను, అవినీతికరమైన వ్యక్తులను ప్రభుత్వ పరిపాలనా యంత్రమునుండి నెట్టివేయవలెను. ప్రభుత్వ పరిపాలన యంత్రములు శాసన సభలతోనే ప్రారంభమగును. శాసనసభలకు ఎన్నుకొనబడు సభ్యుల నుండియే మంత్రివర్గము ఏర్పడును. ఏ యుద్దేశ్యముతో కాని, ఏ బలహీనత వల్లకాని, అసమర్థులను, స్వార్థపరులను, అవినీతి పరులను, గర్వోన్మత్తులను శాసన సభలకు పంపుచో, అందువల్ల మన కేర్పడు ప్రభుత్వముకూడ అసామర్థ్యమైనదై, అవినీతికరమైనదై ప్రజలకు కంటకమైనదిగా పరిణమించును. ఈ ముఖ్యవిషయమును ఓటర్లు గమనింప కోరుచున్నాము.

1939-46 వరకు ఈ దేశ పరిపాలనమునకై అగుచుండిన ఖర్చులకును, 1947-51 సంవత్సరములలో ఖర్చుపెట్టబడిన మొత్తమును పరీక్షించినచో, పరిపాలనా ఖర్చుల క్రింద ఎంత ఎక్కువ ద్రవ్యము నీటిలో పోయుచున్నదో స్పష్టమగును. 1939 సంవత్సరమునకును 1951 సంవత్సరమునకును పన్నుల విషయము యోచించినచో, అప్పటికిని, ఇప్పటికిని ఎన్నియో రెట్లు ఎక్కువైనవి. పన్ను మినహాయింప బడిన వస్తువుకాని, వ్యక్తికాని కనపడదు. గాలికి ఒక్కదానికి పన్ను లేదేమో. బీదవారు కూడ ఈ పన్నుల బాధనుండి తప్పింపబడలేదు. ఆహారమునకై కొను గింజలపై పన్ను చెల్లించుచున్నారు. మాన సంరక్షణ కొఱకై కొను గుడ్డకు పన్ను చెల్లించుచున్నారు. ఈ పన్నులయొక్క విధానము—అవి బీద ప్రజలనుండి ఏ విధముగ వారికి తెలియకనే వసూలు చేయబడుచున్న పద్ధతులు—వారికి తెలియవు. బాగుగ నచ్చచెప్పువారు లేరు.

ఇంతేకు, దేశ పరిపాలనము ఏమైన బీద బిక్కలకు సుభిక్షముగ ఏర్పడినదాయని యోచించిన — పరిపాలన ఖర్చులు; ఉద్యోగుల సంఖ్య — పన్నుల వసూళ్ళు ఎంత ఎక్కువగుచున్నవో, బీదసాదల జీవితములు అంత దుర్భరముగ పరిణమించుచున్నవి. కొని తినుటకు గింజలు లేవు. కట్టుకొనుటకు గుడ్డలు లేవు. అన్నమో రామచంద్రాయని దేశమంతట ఒకే ఘోష బయలు దేరినది. అధికారములోనున్న కాంగ్రెసు మంత్రులు ఏమేమో అసందర్భమైన సంజాయిషీలను చెప్పెదరు. కాని వానివల్ల ఆకలి తీరదు. దప్పి తీరదు. రోడ్డుపై ఉపయోగించు రోడ్డు రోలర్లు ప్రజల దేహములపై పోవుచున్నవి.

కనుక రాబోవు జనవరి నెలలో జరుగనున్న ఎన్నికలలో అభ్యర్థులుగా నిలుచువారి యోగ్యతా యోగ్యతలను ఓటర్లు బాగుగ గుర్తించి, ఏ పార్టీకి చెందినవారైనను సరే — పార్టీ కేకలను లెక్కపెట్టుకొనక, యోగ్యులైనవారికే ఓట్లు నిచ్చి, మీ క్షేమమును మీరే కాపాడుకొందురు గాక యని హెచ్చరించుచున్నాము.

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానత్వము — హిందూ కోడుబిల్లు.

( శ్రీమతి. యస్. పద్మావతీదేవిగారు. )

[17-వ తేది వెలువడిన "భారతజ్యోతి" పత్రికలో ఈ వ్యాసములోని మొదటిభాగము పూర్తిగ ప్రకటింప లేకపోతిమి. మధ్యలోనిలిచి పోయినది. అక్కడనుండి ప్రారంభించిన, వ్యాసములోని భావము పాఠకులు బాగుగ గ్రహింపలేరని, దీనిని మరలా ప్రకటించి —దీని శేషమును కూడ ప్రక్కపుటలో ప్రకటించుచున్నాము —సం॥ భారతజ్యోతి]

(1)

హిందూకోడు బిల్లుపై చర్చ భారత పార్లమెంటుసభలో వాయిదాపడినది. కొంతమంది స్త్రీల కిందువలన ఆశాభంగము కలుగుట సహజము. పురుషులలోకూడ కొందఱు ఆశాభంగమును వెలిబుచ్చుట నా కాశ్చర్యముగ నున్నది. రాజకీయ వాతావర్ణములో పెరిగి, అధికార పదవులను జేబట్టవలెనను కుతూహలముగల స్త్రీలు మాత్రమే ఈ బిల్లు చట్టము కానందులకు అసహనము చూపుచున్నారు. సంసార జీవితములో కాలముగడుపుచున్న ఏ హిందూ సంపన్న గృహిణియైనను, ఈ బిల్లు శాసనము కానందులకు చింతింపలేదు. చింతింపబోదు. స్త్రీలు పురుషులతో సమానులు. పురుషులతో బాటు వారికి సమాన హక్కులు కావలెనని చెప్పుట ప్రాచ్యఖండ సాంప్రదాయముకాదు. ఈ భావములు పాశ్చాత్య దేశములనుండి మన దేశమునకు దిగబడినవి. సెప్టెంబరు నెల 12-వ తేది వెలువడిన "భారత జ్యోతి" పత్రికలో "హిందువుల సాంప్రదాయములు— సంస్కృతి చెఱబట్టబడుచున్నవి" అను శీర్షిక క్రింద ఒక యుక్త్యోత్తమమైన వ్యాసము ప్రకటింప బడినది. ఆ వ్యాసమును ముందుకు నడుచుచున్న వారమని (Progressive women) చెప్పుకొను ప్రతి హిందూ స్త్రీయును చదువవలెనని కోరుచున్నాను. ప్రతి గృహస్థ స్త్రీ కూడ చదివి తీరవలెనని కోరుచున్నాను. ఇవన్నియు వ్రాయుటవలన నన్ను ప్రతిఘాతిమైన స్త్రీయని (Reactionary woman) చెప్పిన చెప్పెదరు గాక. అటుల చెప్పువారు తమ ప్రకృతి సిద్ధమైన స్థానమును గుర్తింపక విమర్శించుచున్నారని మాత్రము చెప్పక తప్పదు.

ప్రకృతి స్త్రీలని, పురుషులని, కర్మేంద్రియముల నిర్మాణములోనే భేదమునుచూపి పుట్టించుచున్నది. సృష్టి క్రమము కొనసాగుటకై స్త్రీలు నిర్వహింపవలసిన కార్యములను ప్రకృతియే వేరు పఱచినది. అందు కనుగుణ్యముగ అవయవ నిర్మాణముల నేర్పరచినది. కోడెను, ఆవును, చూచిన మాత్రమున భేదము చెప్పవచ్చును కదా? పుంజును, పెట్టను చూచినమాత్రమున భేదము చెప్పవచ్చును కదా? మృగరాజైన మగ సింహమునకు ప్రకృతి సిద్ధముగ మెడపై కేసరములుండును. ఆడసింగమునకు కేసరములుండవు? మగసింహముయొక్క ఎత్తునకును, గాంభీర్యమునకును, ఆడసింగముయొక్క ఎత్తునకును, గాంభీర్యమునకు భేదము లేదా? ఇవన్నియు ప్రకృతి సిద్ధముగ ఏర్పడిన భేదములు. అటులనే స్త్రీ పురుషులలో కూడ అసమానత్వము ప్రకృతి సిద్ధముగ ఏర్పడినది. కల్పితమైనది కాదు. వలదన్న పోవునదికాదు. పురుష జన్మమునకు బహిష్టను దోషము —మైల లేదు. స్త్రీ జన్మమునకు దానంతకదే ప్రకృతి సిద్ధముగ కలుగు పరిణామము. దాచియుంచిన దాగునది కాదు. పోవునది కాదు. గర్భము నిచ్చువారు పురుషులు కాని, దానిని భరించి, ధరించి, పరిపక్వమునకు తెచ్చుకొని, ప్రజోత్పత్తికి తోడుపడునది స్త్రీలుకాదా? బలములో స్త్రీలు పురుషులతో సమానులమని చెప్పగలరా? చెప్పలేము. బుద్ధిబలములో కూడ

స్త్రీలు పురుషులతో సమానులని చెప్పుటకు వీలు లేదు. స్త్రీల బుద్ధి చంచలమైనది. స్థిరత్వము లేనిది. స్త్రీలు ప్రకృతికి బద్ధురాండ్రు. పురుషులు ప్రకృతికి బద్ధులే. ఏ విషయములో స్త్రీలు పురుషులతో సమానులని చెప్పుటకు వీలువడునో నాకు తెలియుటలేదు. బహుశా నాకంతటి బుద్ధి సూక్ష్మత లేదేమో.

పక్షులలో పవిత్రమైన దాంపత్య జీవితము సంపూర్ణత్వ మొందినట్లు, సృష్టిలో మఱి, ఏ జీవరాసులలోను కనపడదు. ఒకసారి ఒక ఆడపక్షి మగపక్షి కూడెనా, వాని ప్రాణములుండువఱకును ఒక దానిని విడిచి మఱియొకటి పోదు. రెండును చావువల్ల వేరుచేయబడువఱకును, ఒకే గూటిలోనే, ఆడపక్షి పాతివ్రత్య ధర్మమును నెరవేర్చుచు, మగపక్షి ఏకపత్నీ వ్రతమును నెరవేర్చుచు, జీవితములను గడుపును.

జంతువులలో ఈ నియమ బద్ధమైన జీవితము లేదు. మగజంతువులు ఆడజంతువులు జంటలు జంటలుగా ఒకే తెరచాటున నుండవు. మగజంతువు తన కిష్టమొచ్చిన ఆడజంతువును కలియును. అంతటితో వాని సంబంధ బాంధవ్యములు వదలి పోవును. పిదప ఆ కూడికవల్ల కలుగు పర్యవసానము, పిల్లల నీని పెంచు బాధ్యత, ఆడజంతువులే నిగ్రహించు కొనును.

మానవులు రెండుకాళ్ళ మృగములే. విజ్ఞానము (విమర్శజ్ఞానము) మృగములనుండి మానవులను వేరుచేయుచున్నది. ఆహార నిద్రా భయములు మృగములలో నెంత సహజమో, మానవులలోగూడ నంత సహజమే. పురుషులు స్త్రీలను సహింపజేయునది కామశక్తి (కామతృప్తి) కాని ప్రేమశక్తి (ప్రేమతృప్తి) కాదను విషయము స్త్రీ లెన్నటికిని మఱువరాదు. కామోద్రేకము తగ్గినపిదప స్త్రీ లెట్లున్నను, ఎచ్చటనున్నను పురుషులకు కాబట్టదు. ఈ విషయములో మగపశువులకును, పురుషులకును ఎంతమాత్రము తారతమ్యము లేదు. స్త్రీలు గర్భవతులై, బిడ్డలను కని, పోషించు భారము సహింపలేక, దుర్భర కష్టముల పాలగుదురను తలంపుతోనే, ఎంతో అనుభవముపై, స్త్రీ పురుషుల మధ్య వివాహమను సూత్రమును మన పెద్దలు కనిపెట్టి, మానవ సంఘములో ప్రవేశపెట్టి యున్నారు. ఈ వివాహమను సాంప్రదాయము ఎవరు ఎన్నివేల యేండ్లక్రిందట మానవ సంఘములో ప్రవేశపెట్టి యున్నారో తెలుసుకొనుటకు స్పష్టమైన ఆధారములు లేవు. కాని ఇట్టి నియమబద్ధమైన దాంపత్య జీవిత మర్యాదలను ప్రవేశపెట్టిన వారికి మనమెంతో ఋణపడి యున్నామని చెప్పక తప్పినదికాదు. అట్టి దాంపత్య జీవిత సాంప్రదాయము వలననే ఈ దినము నా భర్తయని స్త్రీలు చెప్పుకొనుటకును, నా భార్యయని పురుషులు చెప్పుకొని గర్వించుటకును, మా తండ్రియని బిడ్డలు పిలుచు ప్రేమాస్పదమైన పలుకులు వినబడుటకును కారణమై యున్నదని, అభ్యుదయ కాముకురాండ్రయి, ముందుకు నడచుచున్న నా తల్లులెల్లరు అంగీకరింతురు గాక. (సశేషము)

నవల

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (13)

[ఒకరి నొకరు ప్రేమించుకొన్న జానకి, చంద్రశేఖరులను విడదీసి, జానకి తండ్రి లక్ష్మణరావు వేరొకరికి పెండ్లిచేయ తలపెట్టెను. పీఠమీద పెండ్లి వితాకు జెందునటుల జానకి చంద్రశేఖర, శ్యామలరావులతో లేచిపోయెను. శ్యామలరావు చంద్రశేఖరుని మోసగించి, తానే జానకిని పెండ్లిచేసికొన్నట్లు ప్రకటించెను. జానకి శ్యామలుని బారి నుండి తప్పించుకొన సాహసించి, కొండపేటు నుండి మడుగులో దూకెను. జానకి ప్రాణములు బెస్తవానిచే రక్షింపఁబడెను. శ్యామలుఁడు పిచ్చివాఁడయ్యెను. జానకి కనుబడనందున ముందే పిచ్చివాడైన చంద్రశేఖరుడు మధుసూదనుని సాయమున స్వస్థతజెంది, ధనవంతుడయ్యెను. శ్యామలుఁడు పిచ్చి ఆసుపత్రిలో చేర్చబడెను. శ్యామలుని చెల్లెలు రుక్మిణి కులటయై ఒక డాక్టరుతో కాపురము బెట్టెను. జానకి స్వస్థత జెందిన యనంతరము, తన మనోహరుని వెదకుచు బొంబాయినగరమునకు బోయి, రాధాకృష్ణుని యాశ్రయమున నుండెను. తరువాత ఈ ప్రకరణమున,—]

రెండవ ప్రపంచ సంగ్రామము భయంకరముగా వ్యాపించుచుండెను. హిట్లరు బ్రిటనుపై నురుకనున్నాడని వార్తలు వినవచ్చుచుండెను. ఎందుఁజూచినను యుద్ధమునకు సాయము జేయుఁడను నినాదములు, ప్రభుత్వమువారు, జస్టిసు పార్టీ వారు, కమ్యూనిష్టు పార్టీ వారు ఆంగ్లేయుల పరముగా ప్రచారము సాగించుచుండిరి. యుద్ధము మన కయిష్టమైనను బ్రిటిషువారు మనల సంగ్రామమున దించిరి గనుక, మనము సహాయము చేయరాదని కాంగ్రెసుపార్టీ మహాత్మా గాంధీ నాయకత్వము క్రింద దిగ్విజయముగా ప్రచారము చేయుచుండెను. దేశములు ఆహార ధాన్యములను, నిత్యజీవితావసరములగు వస్తువులను ఉత్పత్తి సేయక, మారణాస్త్రముల నుత్పత్తి సేయ మొదలిడినవి. మిలిటరీవారి ఖర్చుల నిమిత్తము నాఁటి బ్రిటిషు ప్రభుత్వము భారతదేశమున మితిమీరి కరెన్సీ నోట్లను, నాణెములను అచ్చువేయుట వలన ఆహార ధాన్యముల విలువ ఒకటికి పదంతలుగా పెరిగి, సామాన్యుల జీవితములను దుర్భరము గావించెను.

ఇంతలో హిట్లరు రష్యాపై లంఘించెనను వార్తలు వ్యాపించుటతో కమ్యూనిష్టుపార్టీ 'యుద్ధము మనదే, మీరందఱు యుద్ధమున దిగుడు' అని ఢంకా బజాయించుచుండెను. దేశమున కా యుద్ధ మెంత యనర్థదాయకమైనను సరకుగొనలేదు.

వాతావరణ మిట్లుండ, విదేశ వ్యాపారము పెరిగి, భారతదేశమునకు కొంత నిల్వధన మేర్పడ జొచ్చెను. ఈ వ్యాపార సరళిలో మైకావ్యాపారము పెచ్చుపెరిగిపోయెను. బొంబాయిలో నున్న రాధాకృష్ణుఁ డియ్యదియే తరుణమని, మైకా గనులు గల ప్రదేశములకు బోయి, యెగుమతి చేయుచుండెను. ఈ పర్యటనములో గూడూరు మైకావ్యాపారియగు మధుసూదనునితో రాధాకృష్ణునకు గాఢమైత్రి కుదిరెను. మధుసూదనుని బొంబాయికి రావలసినదిగా రాధాకృష్ణుఁడాహ్వానించెను.

మధుసూదనుఁడు బొంబాయికి వెళ్ళి రాధాకృష్ణునింట బస పెట్టెను. అప్పటికి జానకి రాధాకృష్ణునింటిలో ఒకర్తెగా పరిగణింపఁ బడుచుండెను. అతఁడు భోజనమునకు, ఫలాహారమునకు, డైనింగ్ హాలులోఁ గూర్చున్నపుడు క్రొత్తవారికి ఈమె నా సోదరి యని పరిచయము చేయువాఁడు. మధుసూదనునికి భోజనశాలలో జానకి పరిచయము చేయఁబడెను. మధుసూదనుఁ డామె రూపమునకు, సౌజన్యమునకు మెచ్చుకొనుచుండెను. జానకి మధుసూదనుని వర్తనమునకు, సంభాషణా చాతుర్యమునకు శ్లాఘించుచుండెను. జానకి నగరవాసియైన దాది విచ్చలవిడిగా మాటలాడుట, క్రొత్తవారిఁ గనినప్పుడు కరచలనము గావించుట మొదలగు పాశ్చాత్య పద్ధతుల నేర్చుకొనెను. అందుచే నీ జానకి తనకొక నాఁడు వధువుగా నిశ్చయింపఁ బడిన జానకి యని తోపలేదు. రాధాకృష్ణుఁడును ఆమె చరితము నాతనితోఁ జెప్పలేదు.

నాల్గుదినముల యనంతరము భోజనమునకు గూర్చున్న సమయమున జానకిభర్త ఏ యుద్యోగమున నున్నాడని మధుసూదనుఁడు రాధాకృష్ణుని ప్రశ్నించెను. రాధాకృష్ణుఁ డందులకు ఆతని దొక విషాదగాథ యని మాత్రము వచించి మిన్నకుండెను. మధుసూదనుఁ డొకరి ప్రత్యేక జీవితముతో తనకేల నని యూరకుండెను. జానకి ఆమాట విని, లోలోపల చంద్రశేఖరుని జ్ఞాపకమునకు దెచ్చుకొని కుములఁ జొచ్చెను. మాటల సందర్భములో మధుసూదనుఁడు 'తాను నెల్లూరివాడననియు, కంచిలోఁగల నొక ధనికుని కుమారిని వివాహమాడ నిశ్చయించుకొని, పెండ్లి కానున్న తరుణములో ఆ పెండ్లి విఘ్నమయ్యె ననియు' రాధాకృష్ణునితోఁ జెప్పెను. ఆమాటలు జానకి విని భయభ్రాంత యయ్యెను.

ఆ రాత్రి జానకికి నిదురపట్ట లేదు. బుద్ధి పలువోకలు పోవుచుండెను. మధుసూదనుఁడు తన్ను గుర్తించిన యేమగునో యనియు, మహాపద మూడనున్నదనియు దిగులు పడఁజొచ్చెను. దిక్కు మొక్కు లేని తన్ను ఆదరించిన రాధాకృష్ణునను, అతని భార్యనను, ప్రేమతో అత్తాయని పిలచుచు, తన్ను మాడని నిముసమేనియు యుగముగా గడుపు సుశీల యెడలను తాను ఋణపడినట్లు భావించుచుండెను. కాని ఈ ప్రేమ బంధమును త్రెంచుకొనలేక పోయిన మానభంగమగునని నిశ్చయించి, దృఢ నిశ్చయముతో నిలు వీడి పోవ సమకట్టెను. అందరు గాఢనిద్రా పరవశులై యుండిరి. జానకి ఒక టోపి, ఒక చొక్కా, ఒక లాగు తీసి మూట గట్టుకొని, నిదురించు సుశీలను ముద్దిడుకొని, రాధాకృష్ణునకు, అతని సహభాగికిని నమస్కరించి, అర్ధరాత్రి సమయములో నిలు వీడి యెందో పోవుచుండెను.

వీధులు విద్యుద్దీప ప్రకాశముతో వెలుగుచుండెను. పహరా జవాను లందందు దిరుగుచుండిరి. జానకి మేడల నీడలలో నెవరి కంటిలోను బడక, త్వరత్వరగా వీధులు నిర్గమించి, సముద్రపు టొడ్డును జేరెను. జన సంచారము లేదు. సముద్ర తరంగముల 'హోరు' శబ్దము భయంబు గొల్పుచుండెను. నిశీధ సమయంబున నడిరేయి నే వీరాధివీరుఁడైనను చెలియలికట్టపై నడువ సాహసించునా? తెల్లవారిన యేమగునో యను భయము హృదయమును ముంచి యెత్తుటవలన తక్కిన భీతు లామెను దాక లేదు. తెల్లవారు సరికి దక్షిణముగా సుమారు ఇరువది మైళ్ళ దూర మేగెను.

రాధాకృష్ణుని యింటిలో జానకి కనుబడనందున కళవళము రేగెను. మధుసూదనుఁడు జానకి యదృశ్యమగుటకు తానే కారణమనియు, తనకు వధువుగా నిర్ణయింపఁబడిన యువతి యీపెయే యనియు, తన యుదంతము విని, యేదేని హాని కలుగునని భయపడి పారిపోయి యుండుననియుఁ జెప్పెను. రాధాకృష్ణుఁడు ఆపెను వెదకుటకు సేవకుల నియోగించెను. ఎందు వెదకినను జానకి కానరాలేదు. మధుసూదనుఁడు కొన్ని దినములకు గూడూరు చేరుకొనెను. తన మిత్రుఁడగు చంద్రశేఖరుని రావించి, బొంబాయిలో జరిగిన యుదంతము నెఱుకపఱచెను. జానకి శ్యాములుని విడిచి ఏల బొంబాయి చేరుకొనెనో, ఎంత తర్కించుకొన్నను మిత్రులగు వారికి బోధపడ లేదు. జానకి రాధాకృష్ణునితో తన నాథుఁడు కనుబడనందున వెదకుచు బొంబాయికి వచ్చియుండెనని మాత్రము చెప్పియుండెను. ఆమాట చంద్రశేఖరునితో జెప్పి, మఱియు నిట్లనెను. 'శ్యాములుఁడు బుద్ధిపూర్వకముగా తను ప్రేమించిన వనితను విడనాడి యుండునా?'

చంద్ర.— 'ప్రేమింపక పోయినను, బలవంతముగా పెండ్లి చేసికొన్న వాఁడగుట జానకి అతని యెడ నిరసన భావము వెల్లడించి యుండును. అందుచే విసిగి యెందేని జనియుండును.'

మ. సూ.— 'అట్లగుచో నతని వెదకుచు బొంబాయి నగరమున కేల వచ్చెను.'

చంద్ర.— 'కట్టుకొన్న వాఁడగుట, నతని గేలుకొనక తప్పదని కాబోలు వెదకుచు వచ్చియుండును.'

మ. సూ.— 'నిన్ను ప్రేమించిన దగుట, అతని బారినుండి తప్పించుకొని నిన్నేల వెదకుచు వచ్చియుండగూడదు?'

చంద్ర.— 'వారి వివాహవార్త పత్రికలలో వెలువడుట మీ రెఱిఁగియే యున్నారు. అట్లగుట జానకి అన్యుఁడనగు నన్ను మనసున దలంచుట కల్ల.'

మ. సూ.— 'ఏ కారణము వలన తాను పూరు విడిచెనో మనకు దృఢముగా దెలియదు. కనుక ఆపెను కనుగొనుట శ్రేయస్కరము.'

చంద్ర.— 'ఇప్పు డేమి చేయమందురు.'

మ. సూ.— 'మీరు పూనా వెళ్ళి, కొందఱి సేవకుల నంపి, బొంబాయి వరకు గల పల్లెలలో వెదకిన, జానకి పట్టువడును.'

చంద్ర.— 'అటులనే చేయుదును. రేపే ప్రయాణము గట్టుదును.'

(13-వ ప్రకరణము సమాప్తము)

---

## ప్రజాభిప్రాయ వేదిక :

### రాజంపేట తాలూకా హరిజన సంఘ స్థాపన.

ఆర్యా,

ఈ నెల 13-వ తేదీ బలిజపల్లెలో (రాజంపేట తాలూకా) హరిజన సభ జరిగినది. తాలూకా హరిజన సంఘము స్థాపించ బడెను.

"హరిజనులు" అను పదమునకు రాజకీయ, సాంఘిక, ఆర్థిక బలహీనులగు మాల, మాదిగలు,— అని నిర్వచనమును; రాజకీయముగను, సాంఘికముగను, ఆర్థికముగను కలిగిన యిబ్బందులు తీర్చుట: ప్రభుత్వ మిచ్చిన యనుకూలములు, హరిజనులకు అందునటుల కృషి చేయుట; విద్యార్థులకు స్కాలరుషిప్పులు, హాస్టలు అనుకూలములు కలుగ చేయుట; ఇండ్ల సౌకర్యములు, గ్రామములకు చేరు బాటలు, కక్కసులు, బావులు నిర్మించుటకు కృషిచేయుట; నిరుద్యోగ సమస్య నిర్మూలత; ప్రభుత్వ శాసనములు:— (1) సివిల్ డిసెబిలిటీస్ ఆక్టు, (2) టెంపిల్ యెంట్రీ బిల్లు, (3) కాన్స్టిట్యూషన్ ఆక్టు,— ఆర్టికల్ 17, ప్రజలలో ప్రచారము చేయుట;— ఉద్దేశ్యము లనియు తీర్మానింపబడినది.

బలిజపల్లె. రావూరి సుబ్బయ్య.

# ఇండియా రాజకీయములు

ఇండియా ప్రభుత్వ మంత్రి వర్గములో పని చేయుచున్న వ్యక్తులు ఒకరొకరు క్రమక్రమముగ తగ్గుచున్నారు. హోముశాఖా మంత్రిగారైన శ్రీ. రాజగోపాలాచార్యులుగారు పత్రికా బిల్లు చట్టముకాగానే, ఈ నెల ఆఖరునుండి మంత్రిపదవి చాలించుకొనునని ఇదివరకే ప్రకటింప బడినది. దీనికి కారణము వృద్ధాప్యమని చెప్పియున్నారు. వీరు పంతము పట్టి పత్రికా బిల్లును శాసనముగా ఒనర్చియున్నారు. ఈ దేశములో రెండు సంవత్సరముల వఱకు పోలీసు ప్రభుత్వమునకు జీవితమొసగియున్నారు. ఇంతటి గొప్ప ఘనకార్యమును సాధించినామని వీరు గర్వింప వచ్చును. ఆనందింపవచ్చును. కాని ఈ దేశములో విజ్ఞానము, బుద్ధి కలవారొక్కరైనను, శ్రీ రాజగోపాలాచార్యులు వారి ఆనందములోను, ఘనకార్యమును సాధించినామని చెప్పుకొను సంతృప్తిలోను, పాల్గొను వారుండబోరు. పత్రికా బిల్లును శాసనముగ ఒనర్చినందులకై వీరిని అభినందించు వారొక్కరు కూడ యుండరు. దురదృష్టమైన శాసనమొకదానిని యూనియన్ ప్రభుత్వ ఆయుధశాలలో నుంచి, తమ హోముశాఖా మంత్రి పదవి కాలమును, పత్రికా నిర్వాహకులు పదేపదే జ్ఞాపకము చేసుకొను లాగున చేసియున్నారు. ఇట్టివారు అధికార పదవులనుండి తొలగినచో, చింతించు వారుండెదరా?

♦ ♦ ♦ ♦

డా॥ భీమరావు రాంజీ, అంబేద్కర్ 1947 సం॥ ఆగష్టు నెలలో ఇండియా ప్రభుత్వ న్యాయశాఖా మంత్రిగా చేరిరి. వీరు కాంగ్రెసు పార్టీకి చేరినవారుకారు. ఆ కాంగ్రెసు ఆశయములతోను, సిద్ధాంతములతోను వీ రంగీకరించు వారుకారు. కేంద్రములో ఏర్పడిన ప్రభుత్వమూ కేవలము కాంగ్రెసు పార్టీ యాజమాన్యము క్రిందనే ఏర్పడినది. డా॥ అంబేద్కరుగారు కాంగ్రెసు పార్టీతో తీవ్రమైన భేదములు గల వారైనను, గాంధీజీని, కాంగ్రెసు పార్టీని తీవ్రవిమర్శనలకు గురిచేసియున్నను, శ్రీ. జవహర్లాలు నెహరుగారు విశాలహృదయము, దూరదృష్టిచూపి, వీరిని మంత్రి వర్గములోనికి ఆహ్వానించిరి. వీరు నాలుగు సంవత్సరములు, ఒక నెల, ఇరువైఆరు దినములు న్యాయశాఖా మంత్రి పదవి చేసిన తర్వాత ఈ నెల 11–వ తేదీ పదవిని విరమించుకొని, ఇండియా పార్లమెంటు సభను విడిచిపోయిరి. రాబోవు జనవరి మాసములో ఎన్నికలు జరిగి, నూతన మంత్రివర్గ మేర్పడు వఱకును వీరు మంత్రి పదవియందుండుట కిష్టపడరైరి. ముఖ్యకారణములు రెండు. మొదటిది దేహారోగ్యము. రెండవది "హిందూకోడు బిల్లు". వీరికి హిందూ మతమన్న ద్వేషమెక్కువ. "హిందూకోడుబిల్లు"ను శాసనము గావింపవలెనని డా॥ అంబేద్కర్ గారికి ఎంతపట్టుదలయున్నదో, ఇండియా ప్రధాన మంత్రికి కూడ అంతేపట్టుదలయున్నది. కాని ఈ బిల్లు శాసనమగుటకు పార్లమెంటుకు వెలుపలనున్న విశాలమైన హిందూదేశములో అనేకమంది హిందువులు ప్రతికూలముగ నున్నారు. పార్లమెంటు సభ త్వరలోనే రద్దుకానున్నది. ఇట్టి సమయములో వివాదాస్పదమైన సాంఘిక బిల్లును, బలవంతముగ స్టీముగోడ్డు రోలరును (Steam Road-roller) ఉపయోగించి శాసనము గావించుటకు ఇండియా ప్రధాన మంత్రి గారిష్టపడ లేదు.

* ♦ ♦ *

బిల్లును చర్చకు తీసుకొని, రెండు మూడు క్లాజులపై ఓటు తీసుకొనినపుడు కొద్దిమంది సభ్యులే వ్యతిరేకముగ ఓటుచేసిరి. ఇది ఒక అవకాశముగ గైకొని, పార్లమెంటు సభలో ఎక్కువ ఆక్షేపణ లేదే అని డా॥ అంబేద్కరుగారికి పార్లమెంటుసభలో బిల్లువిషయమై ఎక్కువ ప్రతికూలము కనిపింపక పోవచ్చును. కాని దేశపరిపాలనమున కంతయు బాధ్యత వహించు ప్రధాన మంత్రిగారు, పార్లమెంటు వెలుపలగల ప్రతికూల

(మిగత 11 వ పేజీలో)

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

( అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్., )

( న్యాయశీలుడు — మిరిల్. )

1815వ సంవత్సరమున చార్లె ఫ్రాంకో—బిన్‌వెను మిరిల్ డి—పురమున బిషప్పు. ఆయన వయస్సు డెబ్బదియైదు. 1806 నుండి ఆయన గురుస్థానము నందుండెను. ఆయన ఈ స్థానమునకు వచ్చినది మొదలు ఆయనను గురించి ప్రచారమునకు వచ్చిన వార్తలకును, మనము చెప్పబోవు వృత్తాంతమునకును సంబంధము లేదు. ఉన్నదున్నట్లు చెప్పినట్లగును. పూర్తిగ నిరుపయోగమును కాదు.

నిజమో కాదో ఎవరిని గురించియైన నేమైన చెప్పితేమేని ఆ కథనము వారి జీవితముపై పనిచేయును. ముఖ్యముగా భవిష్యత్తుపైనను పలుమారు ప్రాబల్యము గాంచును. వారి పనుల వలెనే ఈ కథనములును వారిని స్వాధీన పఱచుకొనును.

ఎ— పురపార్లమెంటుకు మిరిల్ తండ్రి వలహాదారుడు. ఆతనికి న్యాయవాది హోదా కలదు. కుమారునకు తన స్థానము సంక్రమించవలయునను ఉద్దేశ్యముతో పదునెన్మిదిరువదేండ్ల ప్రాయముననే తండ్రి కుమారునికి పెండ్లి కావించెను. పార్లమెంటు కుటుంబములలో ఆ నాటి యాచారమది. పెండ్లియైనప్పటికిని మిరిల్ పెక్కుర నాకర్షించుచునే యుండెను. తీర్చి దిద్దిన యాకార మతనిది. లావు పొడుగులట్టె లేకున్నను ఆ మూర్తిలో సొజాను, సొగసుదనము నిండుకున్నవి. అతని యౌవన దశయంతయు ప్రపంచ సుఖములకే అంకితమై గన్నది. విప్లవము వచ్చినది— వివిధ సంఘటనలొకటిపై నొకటి గుంపులు కట్టినవి. పార్లమెంటరీ కుటుంబముల సంఖ్య దశాంశమైనది. తరిమి, వేటాడి ప్రజలా కుటుంబములను చిందర వందర చేసిరి. విప్లవము ప్రారంభము కాగానే మిరిల్ తన భార్యతో కలసి యిటలీకి పరుగుపెట్టెను. చాలాకాలముగా ఆమెకు శ్వాసకోశముల జబ్బుండినది. ఆమె యిటలీలో మరణించెను. ఆ దంపతులకు సంతానము లేదు. మిరిల్ అదృష్టమెట్లు మారినది! ఏనాటినుండియో వచ్చిన సంఘ విధానము నశించినది. తన కుటుంబము కూలి పోయెను. వలసపోయి దూర దేశము లందుండిన తన బోటి వారికి, 1793 నాటి విషాద దృశ్యములు కన్నులార గన్నవారి కంటె భీభత్స ప్రథములై భయముచే అతిశయము గాంచినవి. ఇవి యన్నియు సన్యాస బుద్ధి పురికొల్పి, ఏకాంత జీవితమును ప్రేరేపించినవా? ప్రాణ ధననాశనము చేయనుంకించిన సంఘోపద్రవములకును, చలించని మానవులు, అభేద్యములు, భయంకరములు నగు హృదయాఘాతములచే నలిగిపోదురు. దీర్ఘాలోచనలును, హృదయోద్వేగములును అప్పుడతని జీవితమును పీల్చివేయుచుండినవి. అతని హృదయమున కేమేని గాయములు తగిలినవా? ఎవరును చెప్పలేరు. ఇటలీనుండి మరలి వచ్చునప్పు డతడు మత గురువు. అందరికును తెలిసిన దింతే.

1804లో మాంప్యుర్ (గౌరవ సూచకముగ పేరుకు ముందు మనము 'శ్రీ' యనునట్లు ఫ్రెంచిలో "మాంప్యుర్" అందురు.) మిరిల్ బి— పురమున క్యూరె (క్యూరె కూడ మత బోధకుడే. బిషప్పు హోదాకంటె తక్కువ) అప్పుడాత దన్త్యకాంతవాసి. వృద్ధుడు.

నెపోలియన్ చక్రవర్తి పట్టాభిషేక సమయమున తన పదవికి సంబంధించిన చిన్న విషయమేదో అతనిని పారిస్‌కు కొంపోయినది. తన ప్రజల తరఫున మాంప్యుర్ మిరిల్ పెక్కురధికారులను సందర్శించెను. వారిలో కార్డినల్ ఫెష్ (బిషప్ కంటె పెద్దహోదాగల మత గురువు) ఒకడు.

ఒకనాడు చక్రవర్తి తన బంధువైన కార్డినల్‌ను చూడవచ్చి, అంతకు ముందచ్చట కాచియున్న మిరిల్‌ను చూచెను. ఆ వృద్ధుడు తన్నుత్సుకతతో చూచుచుండుటను పొడగని, నెపోలియన్ కఠిన స్వరమున "నన్ను పరీక్షించుచున్న యీ సత్పురుషుడెవ్వడు?" అని ప్రశ్నించెను.

ప్రభూ, తాము మంచి వానినే చూచుచుంటిరి. నేను గొప్ప వారినే చూచుచున్నాను. దాన మనకిద్దరికును మంగళమగునుగాక? అని మిరిల్ పలికెను.

నాటి సాయంకాలమున చక్రవర్తి 'ఆ క్యూరె పేరేమి?' అని కార్డినలును ప్రశ్నించెను. తరువాత కొంతకాలమునకు మిరిల్ డి— పుర బిషప్పుగా నియమింపబడి యున్నాడు.

మిరిల్ తొలి జీవితమును గురించిన పై యంశము నేదృఢముగా చెప్పగలము. ఆయనను గురించి ప్రచారము నందున్న యితర వార్తలలో సత్యమెంతో చెప్పలేము. విప్లవమునకు మునుపు పెక్కు కుటుంబములకు మిరిల్ కుటుంబము తెలియదు.

చిన్న యూర్లలో క్రొత్తగా వచ్చిన వారిని గురించి సాధారణముగ అందరును మాటలాడుదురు. యోచించువారరుదు. ఈ వాగుడుకు తలవంచక, మిరిల్‌కు తప్పినదిగాదు బిషప్పయు, బిషప్పు కాపట్టియు, తల యొగ్గవలసి వచ్చినది.

మైపివా గానీ ఆయుబులుపోక సంభాషణలు వ్యర్థప్రలాపము లే-వట్టి యల్లరి వదరు పలుకుల దర్జాకును తగనిది.

అది యెట్లయినను ఆ-డి పురమున తొమ్మిదేండ్లతడు మత బోధ చేయునప్పటికి ఆ కథలు చిన్న యూళ్ళలోని జనులు వాగ్వాదముల కాస్పదమగు విషయములు నున్నగున వన్నియు మఱపు సీమల బడిపోయినవి. ఇప్పుడు మాటాడరు కదా, స్మరించరు కూడ.

మిరిల్ డి-కి వచ్చినప్పుడు ఆయన తోబుట్టువు మాడమజెల్ (శ్రీమతి) బాప్టిస్టిన్ కూడ వచ్చినది. ఆయన కంటే పదేండ్లు చిన్నది.

మెగ్లార్ ఒకర్తియే వారి పరిచారికా గణమంతయు. ఆమెయు బాప్టిస్టిన్ కూడ సమ వయస్కులు. మిరిల్ క్యూరేగా యుండినప్పుడును మగ్లారే పరిచారిక. మిరిల్ గొప్ప పదవి పొందియున్న ఈ నాడును పనికత్తె, వంటకత్తెయు ఆమెయే.

బాప్టిస్టిన్ పొడుగరి. పాలిన రంగు. బక్కపల్చని శరీరము. అతి మృదు స్వభావము. "గౌరవనీయులు" అను పదార్థమును ఆమె పరిపూర్ణముగ అవగతము చేసికొన్నది. పూజింపబడుటకు మాతృత్వ మవసరము కాదనిపించినది. ఆమెలో అంద మేనాడు నుండలేదు. ఆమె జీవిత మంతయు ధర్మనిష్టాపరమే. ఆ నిష్ఠ అతిస్వచ్ఛమగు ధావళ్యమును ప్రసాదించి గాజువలె ఆమె మనో హృదయములలో గూఢత్వము లేశమే లేకుండగ జేసినది. వయస్సు కడచిన కొలదిని ఆమె మంచితనమునూ పెరిగి, ఒక సురూపము కలిగినది. యౌవన దశ యందలి పలుచదనము వయఃపరిపాకమున పారదర్శకమై, లోపలి దివ్యతేజః కిరణములను పైకి ప్రకాశింప జేయుచుండినది. ఆమె నొక మర్త్యకన్య యనుటకంటె, సుకృతాత్మ యనుట మేలు. నీడవంటి ఆమె శరీరము లింగ వివేచన చేయుటకు చాలినది కాదు. మినుకు మినుకు మను మృత్తికాలేశ మనవచ్చును. ఆమె విశాలనయనము లెప్పుడును భూమినే చూచుచుండును. పరిశుద్ధాత్మ. భూమిపై నిల్చుటకని సాకు కాబోలు.

మగ్లార్ పొట్టి. లావు. ఉల్లాసవతి. సందడి కత్తె. ఎప్పుడును వగర్చు చుండును. విరామము గొనక పనిచేయుచుండుట అందుకు మొదటి కారణము. ఉబ్బసము రెండవది.

బిషప్ పదవి ఫీల్డ్ మార్షల్ హోదాకు క్రిందిది. కావున చక్రవర్తి శాసనము దానికేర్పరచిన గౌరవాదరములలో మిరిల్ ను, అతనికి నిర్దేశించిన భవనమున ప్రవేశపెట్టిరి. మేయరు ప్రెసిడెంటు తొలుత ఆయనను చూడవచ్చిరి. తన పైవారిని ఆయన కూడ అట్టి పరామర్శ చేసి గౌరవించెను.

ఉద్యోగమునం దభిషేకించి పురమంతయు ఆయన కార్యకౌశల్యమును చూడ ఉబలాట పడసాగెను. (సశేషము)

ఇండియా రాజకీయములు (9-వ పేజీ తరువాత)

తను తూలనాడజాలరు. దేశములో ఈ బిల్లు విషయమై ప్రబలిన ప్రతికూల భావమునకు తలయొగ్గి, ఇండియా మంత్రిగారు ఈ బిల్లుపై చర్చనిలుపుదల చేసిరి. ఇందువల్ల డా॥ అంబేద్కరుగారికి కోపము వచ్చినది. రాజీనామానొసగిరి. మంత్రిపదవిని విరమించుకొనిరి.

ఈ సందర్భములో పదవినుండి విరమించుకొను మంత్రులు శాసనసభల ఎదుట నిలిచి, రాజీనామాలనిచ్చుటకు కారణములను బహిరంగముగ తెలుపుటకు హక్కు కలదు. సాంప్రదాయముకూడ నున్నది. కాని డిప్యూటి స్పీకరు (ఉపాధ్యక్షులు) ప్రకటన చేయదలచిన విషయము యొక్క నకలును ముందుగా ఇవ్వమని కోరుటయు, దానికి డా॥ అంబేద్కర్ గారిష్టపడక, పార్లమెంటులో మాటలాడకనే లేచిపోవుటయు తటస్థించినది. డిప్యూటీ స్పీకరు గారు ఏలాటి షరతులు లేక డా॥ అంబేద్కరు గారిని ప్రసంగించుట కంగీకరించి యుండిన బాగుండెడిది. అటుల జరుగదయ్యెను.

డా॥ అంబేద్కర్ గారు పత్రికా ప్రకటనలో కాశ్మీరమును గురించియు, తూర్పుపాకిస్తానములోని హిందువులను గురించియు, కొన్ని అసందర్భములైన భావములను వెలిబుచ్చి యున్నారు. కాశ్మీరమును విభజింపమని సూచించి యున్నారు. ఇట్టి సూచనలు చేయకుండినచో ఎంతో బాగుండెడిది. ఇప్పటికి కూడ ఏరికి ఈ దేశము పై భక్తిలేకపోవుట విషాదము. ఇండియా ప్రధాన మంత్రి గారి పరిపాలనా సిద్ధాంతములతోకాని లేక విదేశాంగ విధానముతో గాని డా॥ అంబేద్కర్ గారు అంగీకరింప కుండినచో, వెంటనే రాజీనామాను ఇచ్చి, బయట రావలసి యుండెను. ప్రధానమంత్రికి సహాయముచేయుటకై మిగత మంత్రులందరు అందున్నారు. కాని ఆయన విధానమును విమర్శించువారికి అందు స్థానము లేదు. ఎప్పుడు ప్రధాన మంత్రి గారి సిద్ధాంతములతో ఏకీభవింపజాలక పోయెనో, అప్పుడు రాజీనామా నిచ్చి బయటకు రాకపోవడము డా॥ అంబేద్కరు గారి తప్పు కాని, ప్రధాన మంత్రిగారి తప్పుకాజాలదు.

# నవ చైనాలో వెలుగు వెల్లువలు.

ఎన్. కొరొలెవ్.

పర్వత లోయలో వున్న సియోపింగ్‌టో అనే ఒక చిన్న చైనీస్ గ్రామమునకు మేము చేరుకునేసరికి బాగా చీకటి పడినది. సన్నగా, వంకరలు తిరిగిన, నిర్మానుష్యమైన వీధులలో నుంచి, మా కారు నడచినది. వీధుల కిరుప్రక్కలా రాతికంచెలున్నవి. మాకారు దీపాల కాంతి అప్పుడప్పుడు పండ్ల చెట్లమీదను, పెంకుటిండ్లమీదను పడుచుండినది.

దీపాలతో అందముగా ప్రకాశించుచున్న ఒక పెద్ద భవనము ముందు మాకారు నిలిచినది. మేము భవనములోనికి పోతిమి. చలికి దెబ్బతిన్న ముఖములతో, సాధారణమైన దుస్తులు ధరించిన రైతులు. బెంచీలమీద రెండు వరసలుగా కూర్చొని యుండిరి. వ్రాయడము, చదువడము నేర్పుచునే తరగతి అది. అక్కడ వున్నవారిలో మాషివెయ్ అనే బీదరైతు కూడా వున్నాడు. కడచిన కాలములో ఇతడు ఒక భూస్వామికి పాలేరుగా వుండేవాడు. అతనికి చదువుకొనుటకు తీరిక లేక పోయినది; స్కూలు కూడా లేక పోయినది. యాభై ఆరేండ్ల వయస్సుగల సుసింగ్‌ఫి కూడా ఇక్కడ వున్నాడు. అతడు బహుశ్రద్ధగా చదువు నేర్చుకొనుచున్నాడు.

క్లాసురూము కలకల లాడుచున్నది. విద్యార్థులు చిత్రాక్షరములను వ్రాసి గట్టిగా చదువుచుండిరి.

చదవడము, వ్రాయడము నేర్చుకొనడములో నవ చైనా రైతులు మహాపట్టుదలగా వున్నారు. కాని ఇది సులువైన పనికాదు. అక్షరాస్యులు కావలెననిన కనీసము 800 నుండి 1000 చిత్రాక్షరాలవరకు నేర్చుకోవలెను. కాని కష్టాలని న ఎవరు భయపడడములేదు. ఈ గ్రామము అందులకు ఉదాహరణము. క్రొత్త ప్రజాతంత్ర వ్యవస్థ, దేశపు మారు మూలకు సంస్కృతీ వికాసమును ఎంత అధికస్థాయిలో తెచ్చిపెట్టినదో తెలియజేయును. ఇటీవలవరకూ నూటికి 98 మంది చైనారైతులు నిరక్షరాస్యులుగా వుండేవారు.

దేశములో బ్రహ్మాండమైన మార్పులు జరిగినవి. ఈ మార్పులు సియోపింగ్‌టో గ్రామానికి కూడా వచ్చినవి. పూర్వపు ఒక జపనీస్ భూస్వామికి చెందిన అనేక పెద్దభవనాలు యీగ్రామములో వున్నవి. ఈనాడు అవన్నీ సంస్కృతీ భవనాలుగా వుపయోగింప బడుచున్నవి.

అభ్యుదయకరమైన రాజకీయ, ఆర్థిక సంస్కరణలతోబాటు, చైనాకమ్యూనిష్టు పార్టీ, ప్రభుత్వమూ సాంస్కృతిక రంగములో కూడా సంస్కరణలను అతిచురుకుగా అమలు జరుపుచున్నవి.

పై చెప్పిన గ్రామములో అనేక పౌర భవనాలున్నవి. అన్నిటిలోకూడా ఉదయమునుండి అర్థరాత్రివరకూ విద్యాభ్యాసము జరుగుతూనే వుండును. మొట్టమొదట గ్రామములో చురుకుగా పనిచేసేవారు, ఉదయమే పిల్లలకై పాఠశాల తెరవకముందు వచ్చి, చదువుకుని వెళ్ళిపోదురు. తరువాత పిల్లలు వచ్చెదరు. సాయంత్రము వూరిలోని పెద్దవారు వచ్చి చదువు నేర్చుకొందురు. మొత్తముమీద గ్రామములో ప్రజలందరూ చదువు కొనుచున్నారు.

పూర్వము సియోపింగ్‌టో జిల్లా అంతటికీ ఒక్క భూస్వామికీ, జిల్లాఅధికారులకు మాత్రమే వార్తాపత్రికలు వచ్చేవి. ఈనాడు నందలకొలది పత్రికలు రైతులకందుచున్నవి. చదువు నేర్చుకోవడము ప్రారంభించిన వారికి ప్రత్యేకముగా బొమ్మలతోవున్న చిన్నచిన్న పుస్తకాలు ప్రచురింప బడుచున్నవి.

సాయంత్రము వేళలో సంస్కృతీ భవనము వివిధ కార్యకలాపములతో అలరారుచుండును. మేము వెళ్ళిన నాడు సాయంకాలము ఒక గదిలో

ఆరోగ్య రక్షణను గురించి ఉపన్యాసము జరుగుచుండినది. ఒక సినీమా ఆపరేటరు తన ప్రొజక్టరును తనిఖీ చేసుకొనుచుండెను. తరువాత అతడు దేశభక్తులైన చైనా స్త్రీలను గురించి ఒక ఫిల్మును చూపించెను. ఫుట్‌బాల్, వాలీబాల్ క్రీడాదళాలు ఆదివారమునాడు జరుగనున్న పందెములకు సిద్ధమగుచు, యువకులు తమ పరికరాలను సర్దుకొనుచుండిరి. ఈ భవనములోగల పెద్ద స్టేజీమీద అమెచ్యూర్ నృత్యసాధన జరుగుచుండినది.

గ్రామ ప్రజలందరూ తమ పాఠశాలను చూచి గర్వపడుదురు. దీనిని రైతులు తమ స్వచ్ఛంద కృషితో నిర్మించుకున్నారు. గ్రామములో స్కూలుకు వెళ్ళే వయసు వచ్చిన పిల్లలందరూ యీ పాఠశాలకు వెళ్ళుచున్నారు. కడచిన కాలములో పాఠశాలకు వెళ్ళేవయసు వచ్చిన పిల్లలలో నూటికి 18 మంది మాత్రము స్కూలుకు వెళ్ళేవారు. క్రొత్త ప్రభుత్వ మేర్పడిన తరువాత నూటికి 94 మంది పిల్లలు బడికి వెళ్లి చదువుకొనుచున్నారు.

సియోపింగ్‌లో గ్రామ యువతీ యువకులనేకమంది పట్టణాలకు వెళ్లి, ఉన్నత విద్యా సంస్థల్లో ప్రవేశించినారు. నిజమైన బుద్ధిజీవుల వర్గము యీ విధముగా తయారగుచున్నది.

పోస్టుద్వారా పాఠాలు తెప్పించుకొని, నేర్చుకోవడము కూడా బాగా ప్రాముఖ్యతలోనికి వచ్చుచున్నది. పోస్టుద్వారా విద్యనేర్చుకునే వారికి పాఠాలు పోస్టులో వచ్చును. ఉపాధ్యాయులు వచ్చి పరీక్షలు పెట్టెదరు.

అక్షరాస్యత వ్యాపించడముతో బాటు, పుస్తకాలు, పత్రిక ప్రచురణ అధికమగుచున్నది. ఈ ఏడాది వాని సంఖ్య పదిరెట్లు పెరిగినది. లెనిన్, స్టాలిన్ వ్రాసిన రచనలకు మంచి గిరాకీ వున్నది. ఎందువల్లననిన తమ నూతన జీవితాన్ని నిర్మించుకొనుటకది చైనా ప్రజలకు తోడ్పడును.

గ్రామాదులలోను, పట్టణాలలోను గల పాఠశాలలలో పెద్ద ఎత్తైన నల్లటి బల్లలుండును. వానిద్వారా తాజావార్తలు తెలియజేయబడును. కొమింటాంగు బలాలను తరుముకుంటూ ప్రజావిముక్తి సైన్యము దక్షిణానికి పురోగమించినపుడు, ప్రతిరోజూ ఇటువంటి బల్లలమీద క్లుప్తముగా వార్తలు సుద్దముక్కతో వ్రాయుచుండేవారు. ఈ నాడు యీ బల్లలు కొరియావార్తలను ప్రజలకు తెలియజేయుచున్నవి. ఇంతేకాదు. అప్పుడప్పుడీ బల్లలు పత్రికలలో ప్రచురింపబడిన మంచి వ్యాసములను ప్రజలకు చదవమని సిఫారసు చేయును. క్రొత్త పుస్తకములగురించి, ఫిల్ములను గురించి, సాంస్కృతిక కార్యకలాపాలను గురించి, తెలియజేయుచుండును. ఈ గ్రీష్మము ప్రాంతాలలో ఇవి చీడలను చంపడమును గురించి సలహాలు ఇస్తూవుండును. ఈ బల్లలు నిరక్షరాస్యతను పూర్తిగా రూపుమాపుటకు ఎంతో తోడ్పడుచున్నవి.

---

**కోర్టు నోటీసు :**

మ. రా. శ్రీ. నందలూరు డి|| ము|| కోర్టువారి సముఖానకు.

O. S. No. 60/1948 — E. P. 177/1950.

నారపురెడ్డి తిమ్మారెడ్డి, సాకిన్ మాలేమార్పురము మజరా, నారపరెడ్డి పల్లె, తాలూకా రాజంపేట ... ...వాది.

Vs

బోనగిరి పుల్లయ్య, సాకిన్ రంగంపల్లె మజరా, గొల్లపల్లె, తాలూకా రాజంపేట ... ... ... ప్రతివాది.

ఈ నెంబరు వాద ప్రతివాది తాలూకు స్థావరాస్తిని యేలమునకు కోరివున్నాడు. కోర్టు యెదుట 15_11_1951 తేదీన యేలము జరుగును. సవాల్‌దార్లు యెవరయినను వాయిదారోజు వచ్చి, సవాల్ చేసుకోవచ్చును.

షెడ్యూలు.

కడప డిస్ట్రిక్టు పుల్లంపేట సబ్‌డిస్ట్రిక్టులో చేరిన రంగంపల్లె గ్రామం పొలములోని జమీనులకు నెంబరువారి వివరం.

| బాబువారి. | డి. నె. లె. | య. శె. | తరం. |
|---|---|---|---|
| యి. ఖు. | 301 పైకి | 0_28 | 0_5_0 |
| న. ఖు. | 289 (7) | 0_27 | 0_7_0 |
| వ. తరి. | 171 | 0_23 | 1_6_0 |
| ,, | 177 (1) | 0_17 | 0_12_0 |
| యి. తరి. | 187 (1) | 0_35 | 1_9_0 |
| ,, | 175 (1) | 0_12 | 0_12_0 |

యీ ఆస్తి.

కె. లక్ష్మీనరసయ్య,
వాది ప్లీడరు.

నందలూరు.

# నాట్యకళ — అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

[3—10—1951 సంచిక తర్వాత]

## రసప్రకరణము.

ప్రబంధము దృశ్యము, శ్రావ్యమని రెండు విధములు. సరస కావ్యములు చదువుటచేత గాని, నిపుణుడైన నటుఁడు రామాది వేషములు వేసి, తదనుగుణ్యముగా సుఖదుఃఖాది యనుభవముల జూపినపుడు జూచిగాని, ప్రేక్షకు లనుభవించు యానందాది భావములకు రస మని పేరు. (రస ముత్పన్న మగునది ప్రేక్షకునిలోఁగాని నటునిలోఁగాదు. నటుఁడును పుస్తక పఠన సమయమునందు ప్రేక్షకునివంటి వాడే గనుక, తాను రస మనుభవించును. అందువలన ప్రేక్షకులలో రసోద్భవము గలుగ జేయును.) అట్లుత్పన్న మగు రసములు తొమ్మిది యని కొందఱు. (శాంతవత్సల సహితాదశే) పది యని కొందఱు, శృంగార రస మొక్కటే; దానిలో నుత్పన్నమైనవే హాస్య, కరుణాది రసములని కొందఱు, అనుచున్నారు. ఇవి శృంగార, హాస్య, కరుణా, రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంత రసములని సాధారణముగా తొమ్మిది. ఈ రసములను ప్రతిపాదించు స్థాయీ భావములు వరుసగా రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము; భయము, జుగుప్స, విస్మయము, శమమని తొమ్మిది. ఇవి క్రమముగా శృంగారమునకు రతి, హాస్యమునకు హాసము: కరుణకు శోకము; రౌద్రమునకు కోపము; వీరమున కుత్సాహము; భయానకమునకు భయము; భీభత్సమునకు జుగుప్స; అద్భుతమునకు విస్మయము; శాంతమునకు శమము— స్థాయీభావములు. స్థాయీభావ మనఁగా మనసున బుట్టు విషయాను రాగములను సజాతీయ భావముల చేతగాని, భీభత్సాదికముల వలన గలుగు విజాతీయ భావముల చేతగాని చలనము నొందక స్థిరత్వము నొందునది యని యర్థము. ఈ భావములను ప్రదర్శించుటకు సామగ్రియైన విభావానుభావ సాత్విక సంచారీ (వ్యభిచారీ) భావములని నాలుగు విధములు.

### విభావము.

ఆలంబనము, ఉద్దీపనమని రెండు విధములు.

(1) ఆలంబన విభావము, — నాయికా నాయకులు తటస్థమగుట.

(2) ఉద్దీపన విభావము— యౌవన కామ వికారముల వలన గలుగు గుణములు నూపురము మొదలు గాగల భూషణాలంకారముల వలన, మలయానిల, చంద్ర, కోకిల విలాసాదుల వలన గలుగు గుణములు. పై గుణముల నుద్దీపింపజేయు హావభావాదుల పదునెనిమిది. భావము, హావము, హేలన, మాధుర్యము, ధైర్యము, లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టుమితము, బిబ్బోకము, లలితము, కుతూహలము, చకితము, విహృతము, హాసము యని పదునెనిమిది.

### భావము.

బాల్యము వీడి యౌవన ముత్పన్న మగు నపుడు శృంగార విషయకముగా మొదట మనస్సున గలుగు వికారము భావము.

### హావము.

రతి సంబంధమైన నవ్వు. రహస్యపు మాటల యర్థము కనుగొనుట, వ్యంగోచ్ఛారణమును తర్కించుట మొదలగునవి హావము.

### హేలనము.

కొద్ది తూష్ణీం భావమును సులభముగా నర్థమగునట్లు క్రియల చేత జూపుట హేలనము.

### మాధుర్యము.

ప్రయత్నము చేత మూఁడు లోకములను గూడ మోహింప జేయవలెనని యలంకరించుకొనుట మాధుర్యము.

### ధైర్యము.

ఎంత మోహమున్నను కుల ధర్మమును, శీలరక్షణమును పాటించుట ధైర్యము.

### లీల.

రాజ్యము, సంపద మొదలు గాగల భోగాదుల యందు ప్రియుని యనుసరించుట లీల.

### విలాసము.

తాత్కాలికముగా నాయకునకు నేత్ర, భ్రూ, వక్త్రముల కర్మలను వికారముగా జూపుట విలాసము.

### విచ్ఛిత్తి.

తాంబూలము, చందనాది సుగంధ ద్రవ్య లేపనము, స్వాభావికముగా నున్న యలంకారము గాక, కృత్రిమాలంకారము గాగల సురత భోగాను కూలములు విచ్ఛిత్తి.

### విభ్రమము.

ప్రియుఁడు వచ్చుటెఱిఁగి మోహజన్య మహోత్సాహ సంభ్రమములు పెనగొన భూషణాదుల ధరింపబోయి తొందరపాటున విపరీత స్థానముల ధరించుట విభ్రమము.

(సశేషము)

చిన్నకథ.

# మాలతి.

(శ్రీమతి లీలావతీ నారాయణగారు, బి. యస్. సి.)

(గత సంచిక తర్వాత)

కోడికిని, ఆ యువతికిని ఆ రాత్రి నిద్ర లేదు. ఎంత పరితాపము చూపినను ఆ యువకునికి తెలివి రాలేదు. తెల్లవారెను. సూర్యోదయ మాయెను. ఆ యువతి రాత్రి యంతయు మేలుకొనియుండినను, అలసట పొందలేదు. పలుమారు మంచము కడకు పోయి చూచును. ఆ యువకుడు కదలడు — మెదలడు. చచ్చినపాము వలె పడిపోయి యుండెను. ఆ యువతికి అతనిని చూచినప్పుడు, ఒక్కొక్క సారి ప్రాణములతో యున్నాడా లేడా అని సందేహము కలుగుచుండెను. తల్లిని వచ్చి చూడమని బలవంతము చేసెను. తల్లికూడ వచ్చి చూచెను. దేహము చల్లబారి యుండెను. శీతము కప్పుచుండెను. ప్రమాదము సంభవించునేమో యను భీతితో ఆమె కంట నీరు పెట్టెను. బిగ్గరగా ఏడ్చుటకు వీలులేదు. ఎవరైన ఏడ్పు శబ్దమును వినిన తలుపు తెరువుమని లోనికి ప్రవేశించి, అమాయకులైన ఈ ఇద్దరి స్త్రీలను చెఱబట్టవచ్చును,— లేదా చంపివేయ వచ్చును. ఏమి సంభవించినను ఆ దినములలో అడుగువారు కాని, విచారించువారు కాని లేకుండిరి. అందుచే ఆ యువతి ఏడ్చుటకు నోరాడక, క్రిందపడి పొరలుచుండెను. తల్లికి దేహమంతయు కంపాయమానము పట్టెను. అచ్చట నున్నవారిలో ఆమెయే పెద్దదగుటచే, కొంత ధైర్యము తెచ్చుకొని, బిడ్డ దగ్గఱకు పోయి, ఆమెను యోదార్చెను. ఆ యువకునకి ఉష్ణము ఎక్కివచ్చుటకు గాను పాదములకు పసుపు రాచమని కూతురకి చెప్పి, తాను వెచ్చని గుడ్డలతో అతని దేహమును కప్పివైచెను. వెంటనే ఒక తట్టలో వేడినీటిని తెచ్చి, అతని పాదములను అందులో పెట్టెను. అరచేతులకు పసుపు రాచెను. ఇట్లు రెండు గంటలు చికిత్స చేయుటవలన, ఉష్ణము ఎక్కివచ్చెను. అందుచే నాతడు కండ్లు తెఱచుచూ మూసికొనుచుండెను. అప్పుడా యువతి కొంత ధైర్యము తెచ్చుకొన్నదై, 'టీ' తయారుచేసి, ఒక కప్పుతో అతని యొద్దకు తీసికొని వచ్చి, అతని ముఖమును తడి గుడ్డతో తుడిచెను. అతడు కండ్లు తెఱచుట తోడనే, ఆమె 'టీ — టీ' యని సైగచేయగా, అతడు నోటిని కొద్దిగా తెఱచెను. వెంటనే ఆమె ఒక స్పూనుతో ఆ వెచ్చని 'టీ' ని అతని గొంతులో కొంచెము కొంచెముగా పోయుచుండెను. ఒక కప్పు త్రాగిన తర్వాత, ఇక చాలునని సైగచేసెను. ఆ యువతి చాలించి, ఆ పానీయమును తాను త్రాగినంతటి యానందమును అనుభవించెను. ఆమె ముఖము వికసించెను. ఆ యువకుడును విశ్రాంతి గైకొనుటకై, ప్రక్కకు తిరిగి కండ్లుమూసికొని పరుండెను.

ప్రాణాపాయము తప్పినదని ఆ పడుచుకు, కొంత యుత్సాహము చేకూరెను. కాని మంచము వదలి రాజాలకుండెను. తల్లి దీని నంతయు గ్రహించి, కూతురిని పిలచి, 'రాత్రికూడ భుజింప లేదు. పోయి, ఉదయ కృత్యముల తీర్చుకొని, రొట్టె తిని, 'టీ' త్రాగి రమ్మని చెప్పెను. సంతోషము సగము బలము. కనుక వెంటనే ఆమె తన గది లోనికి పోయి, ఉదయ కృత్యముల నన్నిటిని తీర్చుకొని, 'టీ' మాత్రము త్రాగి, మరల మంచము దగ్గర ఈజీచేయిను వేసుకొని కూర్చుండెను. యువకునకు గాయమునుండి కొంచము కొంచముగా రక్తము కారుటయు, ఈగలు గాయముపై వ్రాలుటయును గమనించి. తల్లికి దెల్పెను. ఆమెకు యేమి జేయుటకును తోచక, పసుపు ఉడికించి గాయమునకు పట్టు వేయమనెను. ఆ యువతి అటులనే పసుపు ఉడికించి, వేడి వేడిగా గాయమునకు తాకించగా, ఆ యువకుడు ఆ వేడికి తాళజాలక "అమ్మా! అమ్మా!" యని ఆమె వైపునకు తిరిగి, కండ్లు పూర్తిగా తెరచి, ఆ యువతి యెవరయి యుండునా యని, రెప్పవాల్పక ఆమె ముఖారవిందమును, వీక్షించుచుండెను. గాయమునకు పట్టువేయుచున్న యువతియు, తనకు తెలియకనే ఆ పనిని నిలిపి, తన దృష్టితో ఆ యువకుని దృష్టికి ప్రత్యుత్తర మొసగెను. అదృశ్యమైన విద్యుచ్ఛక్తి ఒకరి దేహమునుండి మరియొకరి దేహములోనికి ప్రవహించెను. ఇరువురి దేహములు పులకాంకితము లయ్యెను. దీని నంతటిని చాటున నుండి గమనించుచున్న తల్లి తనలో తాను నవ్వుకొనుచుండెను. పసుపు చల్లారిపోయి యుండును. మరల ఉడికించి గాయముపై వేడివేడిగా వేయుమని కూతురునకు దెల్పెను. అప్పుడా యువతి పసుపు చల్లారిపోవుటను గమనించి, మరల వెచ్చబెట్టుకొని వచ్చి, గాయమున కంతటికిని బాగుగ పట్టించి, కట్టు కట్టుచుండ, ఆ యువకునికి గాయముపై ఉడుకు తాకుటచే, జివ్వు జివ్వు మని బాధించు నొప్పి కొంచము తగ్గినట్లుండెను. అందుచే 'అమ్మా! అమ్మా!' యనుచు అవతలి ప్రక్కకు దిరిగి పరుండెను.

మంచముపై పరుండిన ఆ యువకుడు తా నచ్చటికి కెట్లు వచ్చినదియు, తన్ను యింతగా ఆదరించి, ఉపచారము చేయుచున్నవా రెవరయి యుందురనియు, ఎందులకు తన కిట్లు ఉపచారములు చేయుచున్నారనియు, తనలో తానే ఊహించుకొనుచు చర్చించుకొనుచుండెను. ఈ యువతి ప్రపంచవాసన యెరుగని బిడ్డ యని యిదివరకే తెలుపబడినది. కళాశాల వేళకు విద్యార్థినులకై ప్రత్యేకింపబడిన బస్సులలో నెక్కి ఢిల్లీలో నుండు స్త్రీల కళాశాలకు పోవుట, కళాశాల వదలిన తరువాత, సాయంకాలమునకు మరల బస్సులో వచ్చుట తప్ప, ఇంకొకటి యెరుగదు. ఒక్క సినిమా ప్రదర్శనమునకైనా పోయి యెరుగదు. షికార్లకు పోవునది కాదు. తల్లితో మాటలాడుట యందే ఆ యువతి కాలము గడిపి, తృప్తి జెందుచుండును. తల్లి పనిపై యున్నచో పుస్తకములు, వార్తా పత్రికలు చదువుచు తృప్తి జెందును. తండ్రి యింటికి వచ్చి ఆమెను పలుకరించినను, ఎక్కువగా మాటలాడు స్వభావము లేదు. యుక్తవయస్సు వచ్చినది మొదలు తండ్రియొద్ద కూడ దూరదూరముగనే యుండునట్టి యువతి. ఉత్తర హిందూస్థానము హిందూ, సిక్కు—ముస్లిముల మధ్య ద్వేషములు ఆకాశమార్గము నంటుచున్న దినములలో, ఢిల్లీ నగరమున గల తన యింటి యెదుట యెవరో గాయపడి. "అమ్మా" యని చావుకేక వేసి, క్రింద పడుట చూచి. పరుగిడుచువచ్చి, క్రింద పడినవాని జాతి మతములను విచారింపకయే, యింటిలోనికి గొనిపోయి ఉపచారములు చేయ సాహసించినది. సుమారు పది దినముల క్రిందనే తన తండ్రి, మతోన్మాదుల వలన ఏమైనా ఉపద్రవములు గలుగునేమోయని భీతి జెంది, తన ప్రాణరక్షణార్థమై, స్వగృహమును, భార్యాబిడ్డలను వీడి ఎచ్చటికో పారిపోయెను. ఇట్లుండియు ఆయువతి యొనర్చిన కార్యము అమోఘము. అట్టి కార్యమున కామెను పురిగొల్పిన మహాశక్తి వేరొకటి గలదు. అదియే పరమ పవిత్రమైన ప్రేమ.

ప్రేమ పరిపూర్ణత నొందిన ఈ యువతి లావణ్యము వర్ణనాతీతము. చూచువారి కన్నులు మిరుమిట్లు గొల్పును. పరమేశ్వరుని సృష్టి వైచిత్ర్యమును చాటుటకై వెలసిన నారీరత్నమా యనిపించును. షోడశ కళలతో శోభిల్లుచున్న జవ్వని. ఇట్టి యువతి హస్త స్పర్శయే ఆ యువకుని గాయమును మాన్పగలుగును. ప్రేమపూరితమైన దృష్టియే వైద్యచికిత్సను మించి పనిచేయ గలిగియుండెను.

గాయపడిన ఆ యువకు డెంత యోచించినను ఏమియు బుద్ధికి తోచినది కాదు. తనకు గాయము ఎట్లు తగిలినదికూడ స్ఫురణకు రాలేదు. ఇట్లుండ ఆ యువతి ఒక కప్పుతో పాలు తీసికొని, మంచము సమీపించి, ఆతని కివ్వబోయెను. అంతలో యువకుడు మంచము నుండి లేచి త్రాగుటకు ప్రయత్నించెను. కాని శక్తి లేదు. లేవ వలదని ఆ యువతి చెప్పి స్పూనుతో పాలను నోటిలో పోసెను. ఇది ఆ యువకునికి అమృత పానముగ యుండెను. అతనికి ఆ యువతి ఎవరనియు, తా నెచ్చట నుండినదియు అడుగుటకు కుతూహలము కలిగెను. కాని మాట్లాడుటకు శక్తి లేకపోవుటచేతను, సిగ్గుచేతను మానుకొనెను. ఇట్లు ఒకటి రెండు దినములు గడిచెను. యువకునికి కొంచెము బలము చేకూరెను. పసుపు వ్రణములకు దివ్యౌషధము. విషమును, దోషమును హరించును. ఈ సూక్ష్మమైన పసుపు పట్టువలననే గాయము మానుటకు ప్రారంభమాయెను. నాలుగురోజులు గడిచెను. పాలకు తోడు రొట్టెకూడ ఆహారముగ యిచ్చుటకు ప్రారంభించిరి. ఈ యువకుని రూపచిహ్నముల వలనను, మెడలోని చిహ్నములవలనను హిందువేననియు, శాకాహారియనియు ఈ ఇరువురు స్త్రీలు గ్రహించిరి. అందుకనుగుణ్యమైన ఆహారము తయారుచేసి యిచ్చుచూ వచ్చిరి.

ఈ స్త్రీల సేవభావలను చూచి వీరు తన మతస్థులు కారని యువకుడు గ్రహించెను. ఆపన్నరక్షకు లెవరైన నేమి. వారే దైవ సమానులను భావము, మర్యాద ఈ యువకుని యందు చూపట్టెను. ఇట్లొక వారము దినములు గడిచెను. ఇంటిలోని యిద్దరు స్త్రీలు ఇతనికి బాగుగ పరిచయమయిరి. సన్నిహితులు కాజొచ్చిరి. ఒకరినొకరు అర్థము చేసుకొనజొచ్చిరి.

(సశేషము.)



Printed at the "BHARATHA JYOTHI" Printing ress. Published and issued at 257, Trunk Road. Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

సంపాదకుడు:— సి. రామకృష్ణ, బి.ఏ.

సంపుటము 4. సంచిక–34.

బుధవారము, అక్టోబరు 31, 1951.

విడి ప్రతిక వెల మూడు అణాలు.

# విషయానుక్రమణిక



—:(౦):—

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 34. | శ్రీ ఖరనామ సంవత్సర కార్తిక శు. ౧, అక్టోబరు, 31, 1951. | ప్రతి బుధవారము ప్రకటింప బడును.


## రాబోవు ఎన్నికలు — విద్యావంతుల కర్తవ్యము.

రాబోవు ఎన్నికలు దేశభవిష్యత్తును నిర్ణయింప గలవు. అసమర్థమైన దుష్పరిపాలనమును తొలగించి, సామర్థ్యమై, నీతిదాయకమైన ప్రభుత్వమును దేశమునకును, ప్రజలకును చేకూర్ప గలవు. ఈ ఎన్నికలలో ఓటు చేయ హక్కుగలవారిలో 100 టికి 90 మంది చదువురాని అమాయక ప్రజలున్నారు. వారికి ఓట్లు అననేమియో; వాని నెటుల వినియోగింప వలెనో తెలియదు. వారి హక్కులు, వారి బాధ్యతలు వారికే తెలియవు. దేశరాజకీయ పరిస్థితులు అర్థముకావు. ఎన్ని రాజకీయపార్టీలున్నది; ప్రతి రాజకీయ పార్టీ యొక్క ప్రత్యేకతయే మనునది వారికి తెలియదు. కడచిన ముప్పది సంవత్సరములుగ గాంధిజీ పేరును, కాంగ్రెసు పేరును మాత్రమే వినియున్నారు. దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత ఇండియా ప్రధానమంత్రి శ్రీ. జవహరిలాలు నెహురుగారిపేరును విశేషముగ వినుచున్నారు. కాని శ్రీ. జవహరిలాలు పేరును, కాంగ్రెసు పేరును ఎన్నికల సందర్భములో ఉపయోగించుకొని మరలా 5 సంవత్సరముల పాటు మంత్రిపదవులను సంపాదించుకొని, అసమర్థమైన ప్రభుత్వమునే కొనసాగించుటకై ప్రయత్నము చేయుచున్న స్వార్థపరులైన తోడేళ్ళు, పెద్దపులులు గలవను విషయములు ఓటర్లకు తెలియదు. ఎన్నికలలో పోటీ చేయు వ్యక్తులలో ఎవరు యోగ్యులు, ఎవరు అయోగ్యులు అను విమర్శన జ్ఞానము అధికసంఖ్యాకులైన ఓటర్లకు లేదు.

ఎన్నిక కాలము సమీపించు చున్నది. ఈ ఎన్నికలలో ఓటర్లు ఏమి పొరబాటు గావించినను, దానివల్ల కలుగు మంచిచెడ్డలు — దానివల్ల ఏర్పడబోవు మంచిప్రభుత్వమో — చెడ్డ ప్రభుత్వమో మఱి ఐదు సంవత్సరముల వఱకు ప్రజలెల్లరు అనుభవింపక తప్పదు.

బీదవారును, విద్యావంతులును సరిసమానముగ కష్టము లనుభవింప వలసియున్నది. ప్రజాస్వామ్యమునకు— అస్పష్టవాక్కులుగల బీదప్రజలకు రాజకీయ పార్టీలతోను, పార్టీరాజకీయములతోను పనిలేదు. ఎన్నికలలో ఏ వ్యక్తి యోగ్యుడో, ఏ వ్యక్తి నీతిపరుడో, ఏ వ్యక్తి సామర్థ్యముకలవాడో, ఏ వ్యక్తి బీదసాదల కష్టసుఖములను బాగుగ గ్రహించగలడో, ఏ వ్యక్తి ఉద్యోగులచేతులలో కీలుబొమ్మవలె ప్రవర్తింపక, స్వతంత్రముగ వ్యవహరింపగలడో అట్టివ్యక్తికే ఓట్లివ్వవలెనని చదువుకొనినవారును, విజ్ఞానులును, న్యాయవాదులును చదువురాని అమాయకులైన ఓటర్లకు నచ్చచెప్పవలెను. ఇప్పుడు కాంగ్రెసు పార్టీపక్షమున ప్రకటింపబడిన అభ్యర్థుల పట్టికలను చూడ, అందరూ యోగ్యులని కాని, సామర్థ్యముకలవారని కాని, న్యాయక దృష్టి కలవారని కాని చెప్పుటకు అవకాశములేదు. కాని కాంగ్రెసు పార్టీపేరుతో వ్యవహరించువారెల్లరు, యోగ్యులుకాని, అయోగ్యులుకాని, శ్రీ. జవహరిలాలుగారి పేరును ఉపయోగించెదరు. కాంగ్రెసు పార్టీపక్షమున నిలువబెట్టిన అభ్యర్థి అయోగ్యుడని

ప్రజలు భావించుచో, అట్టివారికి ఓట్లనివ్వమని శ్రీ. జవహరిలాలుగారు ఎన్నటికిని చెప్పువారు కారు. అటువంటి వ్యక్తిని, రాష్ట్ర ఎన్నికలలో వారు సిఫారసుచేసి, నిలువబెట్టినందుకు ఆయన సిగ్గుతో తలవంచుకొనును. తప్పు తనదేనని అంగీకరించును. శ్రీ. జవహరిలాలుగారిపేరు కాంగ్రెసు పార్టీ నాయకులు, అభ్యర్థులు ఎన్నికల సందర్భములో నుపయోగించినను, ఉపయోగింప నున్నను, కాంగ్రెసు పార్టీలో సర్వవిధముల యోగ్యులైన అభ్యర్థులుండిరా —వారికే ఓటుచేయమని విద్యావంతులు, విద్యరాని ఇతర ఓటర్లకు చెప్పవచ్చును. అట్టియోగ్యతలులేని వ్యక్తి కాంగ్రెసులో లేకున్న, యోగ్యులైన ఇతరవ్యక్తులకు ఓట్లనివ్వమని చెప్పవలెను. ఎటులైనను అన్నివిధముల యోగ్యులైన వారినే శాసనసభలకు పంపు దృష్టియే విద్యావంతుల కుండవలెను. అట్టిప్రయత్నమే చేయవలెను. అప్పుడే వారికి విద్యవచ్చినందులకు సార్థకము కనపడును. అప్పుడే దేశాభిమానము బయటపడును.

—(*)—

# కాంగ్రెసు మంత్రులు — ఎన్నికల ప్రచారము.

కాంగ్రెసు మంత్రులు ఎన్నికల ప్రచారము చేయువిషయమున్ను, ప్రయాణ ఖర్చులను తీసుకొను విషయమున్ను, మొన్న చెన్నరాష్ట్ర కౌన్సిలు సభలో చర్చకు వచ్చెను. ఈ ఎన్నికలు, ఈ అధికారపదవులు, నూతదేశ ప్రజలకు క్రొత్త. మంత్రిపదవులలో నున్నను ఎన్నికలలో తమ అధికారమును దుర్వినియోగము చేయరను నమ్మకము ఒక్క శ్రీ. జవహరిలాలుగారు తప్ప మరి ఎవ్వరును అట్టి నమ్మకమును ప్రజలలో గలిగింపజాలరు. శ్రీ. జవహరిలాలుగారియందున్న విశ్వాసము నూటికి నూరుచెప్పినను ప్రజలకు ఇతరమంత్రులపై —అందు ముఖ్యముగ రాష్ట్ర మంత్రులపై కలుగజాలదు. పెన్షన్ కు పోవు ఉద్యోగులలో కట్టకడపటి దినము వఱకును అధికార పదవియందే ఉండవలెననియు, కడపటిదినమే క్రొత్త ఉద్యోగికి చార్జి ఇవ్వవలెననియు కొందఱు తలంచెదరు. కొందఱు పెన్షన్ కాలము సమీపించుటకు రెండు మూడు నెలలుండగనే సెలవుపైకొని, తమ ఉద్యోగ పదవికి స్వస్తిచెప్పి చెయ్యి కడుగుకొనెదరు.

మంత్రులు కూడ ఎన్నికలు జరిగి నూతన శాసనసభలు, మంత్రివర్గములు, ఏర్పడువఱకు— కట్టకడపటి దినము వఱకు, మంత్రి పదవులకు తగులుకొనియే యుండవలెనను ఆశకు లొంగి, బాసులగుట అంత సమంజసముగ కనపడదు. గౌరవప్రదముగ కూడ నుండజాలదు.

"నేను లేకపోయిన ప్రభుత్వము స్తంభించిపోవును —ఆకాశము క్రిందపడు"నను భావము ఏ మంత్రి యందును ఉండకూడదు. ఎన్నికలకు ముందు తమంతట తామే మంత్రి పదవులకు రాజీనామాల నిచ్చినచో, ప్రభుత్వ కార్యకలాపము ఎంతమాత్రము నిలిచిపోదు. సూర్యుడు తూర్పున పుట్టకపోడు. మీదుమిక్కిలి అట్లు రాజీనామాల నిచ్చు మంత్రుల గౌరవము హెచ్చును. ప్రజాదరణకు పాత్రులయ్యెదరు. కనుక మనమంత్రులు అట్టిగౌరవమును సంపాదించు కొనుటకై నామినేషన్లు దాఖలుచేయకముందే రాజీనామాల నిచ్చెదరా?

—)0*0(—

చిన్న కథ.

# మాలతి.

(శ్రీమతి లీలావతీ నారాయణ గారు, బి. యస్. సి.)

(గత సంచిక తర్వాత)

—(3)—

ఆకస్మిక పరిస్థితుల వలన ఈ స్త్రీల యింటి యావర్తములోనికిని, చికిత్సావరణములోనికిని వచ్చిన యువకుని పేరు సుధాకరుడు. హిందువుడు. శరణార్థుల పునరావాసము కార్యములో స్వచ్ఛంద సేవకుడుగా పనిచేయుచుండెను. ముందు సంవత్సరమే పట్టభద్రుడై ఇండియా ప్రభుత్వము క్రింద ఉద్యోగము వెదకుచుండెను. దినములు గడుచుకొలది వీరిగృహములో గాయము పూర్తిగా మానవచ్చెను. ఈ స్త్రీల పరిచయ స్నేహములు యెక్కువయ్యెను. వీరికి ఏ విధమైన ప్రత్యుపకారము చేయగలనా యనుభావము యెక్కువగుచుండెను. వీరి నుండి ఎడబాటు కావలయునను తలంపు సహింపరానిదిగా యుండెను. ఆయువతి తనను ప్రేమించుటకు కాని లేక తానా యువతి ప్రేమకు ప్రత్యుత్తర మిచ్చుటకు కాని, "మతము" "కులము"లను సంఘభేదములు అడ్డువచ్చునని భయపడుచుండెను. అందువల్ల ప్రకృతినే స్తంభింప జేయగల లావణ్యవతియైన ఆయువతి వైపు చూచుటకును, మాటలకు సరియైన ప్రత్యుత్తరమిచ్చుటకును సుధాకరుడు సిగ్గుపడుచుండెను.

ఆ యువతి సూక్ష్మబుద్ధి గలది. సుధాకరుని మనోవ్యాకులతను గమనించుచుండెను. సుధాకరుడు తమ యింటిలోనికి వచ్చిన పరిస్థితులనెల్ల ఈ యువతి తనలో తాను విమర్శించుకొనకొలది, అది దైవదత్తమా యను భావము ఆమె మనస్సునకు ఎక్కువగా తట్టుచుండెను. "మాయింటి యెదుటనే సుధాకరుడు దుష్టుల క్రూరత్వమునకు బలియై,అమ్మాయిని అరచి క్రింద పడుటకు కారణమేమి. ఇరుగు పొరుగు వారున్నారు. వారెవ్వరును సాహసించి, తలుపు తెఱచి చూడనైనా చూడక పోవుట ఏమి ఇట్టి సంఘటనలు విని, భయపడు పిరికిదాననైన నాకా తరుణములో ఎక్కడలేని ధైర్యము కలుగుట యేమి. వాకిలి తెఱచి చూచుట యేమి"అని యిట్లు పరిపరి విధములుగా తలచుకొనుచు తిరిగి యిట్లనుకొనెను."క్రిందపడి తీవ్ర గాయపడిన వ్యక్తి స్త్రీగా నెందుకుండగూడదు. లేక వృద్ధుడుగా నెందుకుండకూడదు. అట్టి భయంకర స్థితిలోనే గాయముతో క్రిందపడిన వ్యక్తి స్త్రీయా, పురుషుడా, వృద్ధుడా లేక యువకుడా, నా మతస్థుడా యను భావములు నాకుకాని, నా తల్లికికాని స్ఫురణకు రాలేదు. క్రింద పడినది మానవవ్యక్తి. చేతనైనంత వఱకు ప్రాణములున్న, ఉపచారములు చేయుదమన్న భావము తప్ప మరేమియు తోచినది కాదు. నాకు బుద్ధి తెలిసినది మొదలు పరపురుషుని తాకలేదు. వయస్సువచ్చినది మొదలు తండ్రికి కూడ దూరముగ నున్నదానను. ఇదే మొట్ట మొదటిసారి సుధాకరుని తాకుట, ఉపచారములు చేయుట తటస్థించినది. ఇది దైవయోగమే. ఇందులో నా ప్రయత్నమేమియు లేదు"అను భావమే ఈ యువతిలో నాటుకొనెను. సుధాకరునే వివాహమాడ వలెనను దృఢమైన సంకల్పము కలిగెను.

ఒక దినము సాయంకాలమున సుధాకరుడు మేడపై కూర్చొని త్వరలోనే తనయింటికి పోవలయునని యోచించుకొనుచుండ, ఈ యువతి మేడపైకి "టీ"ని తీసుకొనిపోయి సుధాకరునికిచ్చి, తన మనోభావము అతని కెఱిగింప వలయునని ప్రక్కనున్న కుర్చీపై కూర్చుండెను. మెల్లగా వినయముతో తన మనోభావమును సుధాకరుని కెఱుక పఱచెను.

"మీకును నాకును ఇదివఱకు [illegible] ఏవిధమైన ముఖము మాటలు కాని, పరిచయము కాని లేదు. [illegible] మ్మలను ఇచ్చటికి ఆకస్మికముగనే పంపినాడు. మీపై నాకు ప్రేమ కూడ ఆకస్మికముగనే అంకురించినది. ఆకస్మికముగ మొలకెత్తిన ప్రేమ చంచలమైనదా లేక సత్యమైనదా యను సందేహము మీకు కలుగవచ్చును. [illegible] నేను ఏ యువకుని కన్నెత్తి చూచి [illegible]. [illegible] యనునది యెట్టిదో నాకు తెలియదు. నా [illegible], నా యనుభవములోను ఇదే మొట్ట మొదటిసారి [illegible] ఏదో ఒక భావము మొలకెత్తినది. [illegible] చిన తర్వాతనే ఆభావము నాలో [illegible]. [illegible] ముందు ఆభావముయొక్క యనుభవ [illegible] నాకు [illegible] యదు. అండములోనుండి బయటపడు పక్షి [illegible] రహితమై, ఎంతటి పవిత్రమైనదై యుండునో, నేను అంతటి పవిత్రవంతురాలను. నా పుట్టుక [illegible] మంచి చెడ్డలతో కాని, కుల, మతములతో కాని, నాకు [illegible] బంధము లేదు. నేనెవరిని [illegible] వరి యందు జేరుదునో వారి మతమే నా మతము. వారి కులమే నా కులము. కనుక నా ప్రార్థనను అంగీకరించి, నా మనసునకు సమాధాన మొసగ"మని యా యువతి అతనిని ప్రార్థించెను.

సుధాకరుడు విని విస్మయుడయ్యెను. ఏమి మాటలాడుటకును నోరాడదయ్యెను. తన కుర్చీనుండి లేచి, యాయువతి హస్తములను పట్టుకొనెను. ఇప్పుడీ యువతీ యువకు లిద్దరును శృంగార భావములకును, చేష్టలకును క్రొత్తవారు. ప్రణయ సుఖమన నెట్టిదో తెలియని అమాయక ఉద్ధులు. సుధాకరుడు ఆ యువతి చేతులను పట్టుకొనిన వెంటనే, ఏలాటి ప్రయత్నము లేక ఆ యువతి నిలుచుకొనెను. సుధాకరుడు యువతి కౌగిటిలో చేరకొనెను. ఒకరి ముఖము మరియొకరి ముఖమువైపు తిరిగెను. ఒకరి చెంప మరియొకరి చెంపకు కలిసెను. తల్లి మిద్దెపైకి పనిపై వచ్చి ఈ దృశ్యమును చూచి నవ్వుకొనుచు, క్రిందికి దిగిపోయెను. తన తల్లి వచ్చినది; వారిరువురి సన్నివేశమును చూచినది, వీరిలో ఎవరును గమనించలేదు. ఈ బంధము నుండి వేరగు విధము, ఎవరు ముందుగ వైదొలగ వలసినది ఈ యమాయక ఉద్ధులకు తోచలేదు. ఎట్టకేలకు సుధాకరుడే జాగ్రత్తావస్థకువచ్చి ఆ విద్యుల్లత కౌగిటనుండి వైదొలగెను. నిలుచుకొని యున్న ఆ యువతి కుర్చీపై కూర్చుండెను.

వీరిద్దరు ఒకరినొకరు కొంతసేపు మాటలాడజాలరైరి. ఈ యాలింగనమువలన కలిగిన ప్రకృతి జనితమైన ఆనందమునకు లోనై, ముగ్ధులైరి. సుధాకరుడు తన కుర్చీని ఆ యువతి సమీపముగా జరపి కూర్చొని:—

"నీవు తెలిపిన ప్రతిభావముతో నే నేకీభవించుచున్నాను. నీ ప్రేమ నిరుపమానమైనది. అగాధమైనది. నిష్కళంకమైనది. అవ్యాజమైనది. మానవ కారుణ్యముతో సమ్మిళితమైనది. అపూర్వమైనది. నీవు చెప్పినటుల మన మిరువురము ఇచ్చట చేరుటలో మన కిద్దరికిని తెలియని యర్థమున్నది. నీ యింటి యెదుట నేను గాయపడిపోకుండినచో, నిన్ను చూచు భాగ్యము నాకు ఈజన్మలో కలిగియుండెడిది కాదు. నన్ను చంప ప్రయత్నించినవారు నాకు పరోక్షముగ మహోపకారము నే గావించిరి. నీ కౌగిటి భాగ్యము నాకబ్బునటుల చేసిన ఆ హంతకులకు నా నమస్కారము. ప్రేమ, జాతి మతముల కతీతమైనది. కాని మానవ సంఘము దుర్నీతుల పాలగునని కొన్ని నియమములను పెద్దలు ఏర్పరచి యున్నారు. ఆ నియమములు ప్రకృతికి సిద్ధమైనవి కావు. కేవలము కల్పితమైనవి. వానిలో మంచి అగపడుచున్నప్పుడు వానిని తూలనాడ నవసరము లేదు.

"నాకు తల్లిదండ్రులు లేరు. మా అన్నగారు మేఘహస్తుగారు. వదినె సాధ్వీమణి శ్రేష్ఠయైన సుమిత్రాదేవి. సనాతన హిందూమతమునకు చేరినవారు. నీవు హిందూ యువతివి కావు. నీ ప్రేమానుభూతిని నే ననుభవించుటకు వారి యనుజ్ఞ నావసరము. బాల్యమునుండి పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించినవారు వారే. నీపై ప్రేమచే నేను వారిని ధిక్కరించినచో, కామ పరవశత్వము క్రింద, మతభ్రష్టుడ నైతినని వారు చింతించెదరు. పుత్రవాత్సల్యముతో నన్ను ప్రేమతో పెంచిన మా వదినెగారు కంట నీరు పెట్టినచో, అది నాకు క్షేమము కాదు, నీకు క్షేమము కాదు.

"రెండవది నీవుకూడ స్వతంత్రురాలివి కావు. మీ తల్లిగారి కారుణ్యానుభూతి నాపై యుండుటవలననే పోవు ప్రాణములు నిలిచినవి. మీరిద్దరును నాకు ప్రాణదాన మొనర్చినవారు. కాని నీ ప్రేమ నాపై నిలుపుటకు మీతల్లిదండ్రుల ఒప్పుదల అవసరము. నీవు వారిని నాకొఱకై వేరు చేసుకొనరాదు. మన కూడికను మీ తండ్రి ఓర్చునో లేదో ముందుగ తెలిసికొనుట నీ ధర్మము. దంపతులుగా చేరు విషయములో నీవు నీకు స్వతంత్రురాలవు. నాకు నేను స్వతంత్రుడను. కాని పెద్దలను వారు మన పుట్టుకకును, పెంపకమునకును కర్తలు. వారి యనుమతి పొంది, మనము దాంపత్య జీవితమును ప్రారంభించినచో అది మనకు శాశ్వతానందము నిచ్చును. మన యభివృద్ధికి శ్రేయస్కరము.

"ఒక్కమాట. నేను జీవితములో పెండ్లి చేసుకొంటినా, నిన్ను తప్ప నితరులను పెండ్లి చేసుకొనుట కాని, కన్నెత్తి చూచుటకాని, ఈ చేతులతో తాకుటకాని, జరగనీయను, అని లేచి చేతిలో చేయికలిపి, ప్రమాణము చేసెను. అంత ఆ యువతి సుధాకరుడు తన యెదుట చేసిన ప్రమాణమున కానంద పరవశురాలై, యంగీకార సూచకముగ అతని పాదములపై వ్రాలెను. పాదములపై వ్రాలిన యువతిని లేవనెత్తి మరల కుర్చీపై కూర్చుండబెట్టెను.

సుధాకరుడు చెప్పిన దంతయు శాంతముగ వినుచు అందులోని యున్నత భావములకు మెచ్చుకొని ఆనంద పరవశురాలై ఆనంద బాష్పములను కంటినుండి విడిచెను. సుధాకరుడా కన్నీటిని చేతిగుడ్డతో తుడిచెను. సుధాకరుడును చేసిన దృఢ ప్రమాణమునకు ఆ యువతి హృదయము కరిగిపోయెను. వెంటనే తాను ప్రత్యుత్తర మిచ్చుటకు ప్రయత్నించెను. కొంత మనస్థిమితము తెచ్చుకొనవలెనని లేచి తేనీరు తెచ్చుటకు క్రిందికి పోయెను.

(సశేషము.)

# అడుగడుగునకు తప్పేనా?

శ్రీ. జవహరిలాలుగారు కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీకరించిన తర్వాత, కాంగ్రెసు సంస్థలోనేమి, ఎన్నికల నిర్వాహణ విషయములోనేమి ఎన్నో మార్పులు కలుగుననియు, దేశము బాగుపడుటకు కాలము వచ్చినదనియు, కొందరనుకొని యుండవచ్చును. కాంగ్రెసు చెట్టు వేరులతోగూడ ఎండిపోయినది. దానికి ఎంత ఎరువు పెట్టిన ఏమి ఉపయోగము? ఎంత నీరుపెట్టిన ఏమి లాభము? ఎండిపోయిన దానిని తీసివేసి క్రొత్త మొలకను నాటియుండిన బాగుండెడిది. శ్రీ. జవహరిలాలుగారు అటులచేయరైరి. వారికి ఈ విషయమే బొత్తిగా తోచినట్లు లేదు. ఎండిపోయినట్టి చెట్టు మరలా ప్రాణము కలిగి చిగురించకలదా? దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తర్వాత కాంగ్రెసు సంస్థలో కుళ్ళు బయలుదేరినది. ఈ నాలుగేండ్లలో సంస్కరించుటకు వీలుకానటువంటి అవినీతి పాలైనది. దానిని తొలగించి, దానిస్థానములో వేరొక రాజకీయ పార్టీని స్థాపించినకాని లాభముండబోదని ఎవరెన్ని మంచి సలహాల నిచ్చినను, శ్రీ. జవహరిలాలుగారు వినరైరి. చచ్చిన చెట్టుకే ప్రాణముపోయ ప్రయత్నించు చున్నారు.

57-వ జాతీయ మహాసభలో శ్రీ. జవహరిలాలుగా రొసగిన అధ్యక్షోపన్యాసమును చూడ, కాంగ్రెసు సంస్థ రాజకీయ సంస్థగా గాక, జాతీయ సంస్థగానే యుండవలెనని, గడచిపోయిన కాలమువలెనే ఈ నాడును కలలు గనుచున్నారు. జాతీయ సంస్థగనే కాంగ్రెసు వ్యవహరించుటకు యోగ్యమైన కార్యనిర్వాహక వర్గము నేమైన ఏర్పరచిరాయనిన శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ గారి కార్యనిర్వాహక వర్గమునకన్న ఎక్కువ యోగ్యులు కలదానిని ఏర్పఱుప జాలరైరి. దేశములో యోగ్యులే శూన్యులైనారా అను అభిప్రాయము కలుగునట్లు, తెలిసి తెలిసి, మరల అయోగ్యులతోనే నింపిరి. మామూలు పద్ధతులైన రాష్ట్ర కాంగ్రెసు కమిటీల అధ్యక్షులను వర్కింగు కమిటీలో చేర్చుకొనుట మానరైరి. కాంగ్రెసులో యోగ్యులై ప్రజల విశ్వాసమునకు పాత్రులైనవారిని నియమింపరైరి.

పోనీ కాంగ్రెసు పార్టీ పక్షమున ఎన్నికలకు అభ్యర్థులను నియమించు పద్ధతులలో నేమైన మార్పు చేసియున్నారా అని యోచించిన, ఏవో కొన్ని ఆదర్శములను మాటలాడుటతోనే తృప్తిపడిపోయి, తనపని తీరిపోయినదను కొనుచున్నారు. ఇంత వఱకును కాంగ్రెసు పార్టీ పక్షమున వివిధ రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల బోర్డులు అభ్యర్థులుగా ఏర్పరచి, ప్రకటించిన పేర్లను గాంచిన, దేశములో ఎటుచూచినను తీరని ఆశాభంగమునే ప్రజలు ప్రకటించు చున్నారు. ఆ పట్టికలు ఎవ్వరికిని సంతృప్తి నొసగ జాలకున్నవి. ప్రతిదినము ఈ నియామకములను ఆక్షేపించుచు, అఖిలభారత కాంగ్రెసు సంఘ ఆఫీసుకు చేరుచున్న వేలకొలది తంతెలే యిందుకు నిదర్శనము.

రాష్ట్ర ఎన్నికల బోర్డులకును, కేంద్ర ఎన్నికల బోర్డుకును సభ్యులుగా నుండు వారు ఎవరు తకు తాము ఏ నియోజక వర్గమునకును పోటీ చేయకూడదను నియమము నొక దానిని ఏర్పరచి, దానిని అన్ని రాష్ట్ర సంఘములు గమనించితీరవలెనని శ్రీ. జవహరిలాలు నెహ్రూగారు ఆదేశించి యుండినచో, అప్పుడు అభ్యర్థుల నియామకము ఎంతో బాగుండెడిది. అధికారములలోనున్న రాష్ట్రమంత్రులు అప్పుడు ఎన్నికల బోర్డు సభ్యులుగా యుండుటకు వీలుండెడిది కాదు. ఇప్పుడిట్లు జరుగలేదు. రాష్ట్ర ఎన్నికలబోర్డులో సభ్యులుగానున్న ప్రతి ఒక్కరు ఏదో ఒక నియోజక వర్గమునకు పోటీచేయువారే. అందువల్ల వారి

(మిగత 12 వ పేజీలో)

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానత్వము — హిందూ కోడుబిల్లు.

( శ్రీమతి. యస్. పద్మావతీదేవిగారు. )

(2)

స్త్రీ పురుషులు పరస్పర విరుద్ధమైన శక్తులు (POSITIVE and NEGATIVE FORCES) అయస్కాంతమువలెను, సూదులకును ఉండుపరస్పర ఆకర్షణశక్తి స్త్రీ పురుషుల రక్తనాళములలో విద్యుచ్ఛక్తిగవలె ప్రవహించు చుండును. సురూపవతికాని, సాధారణమైన స్త్రీ యాకారము కలిగిన వ్యక్తి కాని లేక కురూపవతికాని — స్త్రీలు పురుషుల నాకర్షించు మహాశక్తులను మూలసిద్ధాంతమును పాశ్చాత్య నాగరికతా వ్యామోహ పరవశులైన స్త్రీలు మఱువరాదు. ప్రకృతిని కాముమాదుగా వించు సమ్మోహన శక్తి స్త్రీలయం దిమిడి యున్నది. కళాస్థానములలో ప్రాధాన్యమైనవి స్తనములని ప్రాచీన హైందవ ఋషులచే వ్రాయబడిన కామసూత్రములు తెలుపుచున్నవి. ఇవి బాహ్యకళాంగములు. వీనిని మూసిపెట్టవచ్చును. కానిచూపరి దృష్టికి కనబడకుండ దాచుటకు వీలులేదు. స్త్రీలు పురుషులకు కనపడిన మాత్రమున, వారి దృష్టి యంతయు మొట్టమొదట కళాస్థానమైన స్తనములపైననే ప్రసరించును. తర్వాత ఆ దృష్టిని స్త్రీల ముఖమునైపు ప్రసరింప జేయును. స్త్రీ పురుష విశేషముల నే యెఱుగని మహాత్ములను కూడ ఈ బాహ్య కళాస్థానములు చలింపజేసినవి. ఇందుకు అనేక సాదృశ్యములు కలవు.

పాశ్చాత్య విద్యలలో అంతర్భాగములైన శారీరక శాస్త్రములను, ప్రసవ శాస్త్రమును (OBSTETRICS) చదివిన హిందూ యువతులు, మన నిర్భాగ్యమైన దేశములో పదివేలకొకరైన లేరు. విద్యాసనములలో ప్రాచీన ఋషిపుంగవులు, మానవాభ్యుదయమునకై రచియించిన కళాశాస్త్రములను శాస్త్రదృష్టితో (with purely scientific view and not with sexual passion) చదివి, అర్థము చేసికొనిన హిందూ యువతులు కొద్దిమందే యుండవచ్చును. ఇట్టివిజ్ఞానము మన హిందూ స్త్రీలలో పూర్ణముగ నశించి పోవుట వల్ల, వారిలో వివిధములైన దురాలోచనలు బయలుదేరుచున్నవి. హిందూ దాంపత్య జీవిత పవిత్రతనే, వేరులతో పెరికివేయవలెనని తలపోయుచున్నారు.

"Here I wish to remark that while it is admitted that the actual reception of some portion of the semen into the Ovule is necessary, in order to impregnate it, still this portion need be no more than the minutest particle, which in organised bodies corresponds to the elementary or primary atom of the inorganic world; and that, in addition to this, the *old doctrine of the universal impregnation of the blood of the female by means of seminal aura of the male* seems to be confirmed rather than disputed by the later discoveries of modern physiological science. *The entire system of the female is influenced most powerfully and in a direction highly favourable to reproduction both by general magnetic sphere of the male and by that richly endowed secretion which is given off as the representation of his energetic vitality*"

— Dr. TYLER SMITH,
Lectures on Obstetrics, American Edition–Page 343

స్త్రీల దేహములో నిరంతరము ప్రవహించుచున్న రక్తములోనే గర్భాధారణమున కనుకూలమైన ద్రవములు కలవు. అయస్కాంతము సమీపమున ఇనుపముక్కలెటుల కదలునో అజేవిధమున స్త్రీలు, పురుషులను సమీపించువో, వారి దేహములోని సర్వశక్తులు (దేహమంతయు) కదలును. పురుష రేతస్సును విద్యు

చ్ఛక్తివలె యీడ్చుకొని, గర్భమును ధరించుటకై స్త్రీల ప్రకృతి సంసిద్ధత చూపును.

అందుకని స్త్రీలు విశేషముగ పురుషుల దృష్టిలో పడకూడదని పెద్దలు చెప్పుచుందురు. బహిష్టులైన స్త్రీలు పురుషుల ముఖమునే (ముఖ్యముగ పరపురుషులముఖముల) చూడరాదని మునలవ్వలు చెప్పుదురు. కామసూత్రములు వచించుచున్నవి. స్త్రీల గర్భాశయములో (UTERUS) ఛాయాగ్రహణ శక్తి (యంత్రము) యున్నది. దీనికి లెన్సు (అద్దములు) స్త్రీకండ్లే. ఈ సూక్ష్మాంశములన్నిటిని గమనించియే, స్త్రీలు శక్తిసంపన్నులైనను, సుకుమార శరీరులనియు, బయలుపఱచుటకు వీలుకాని వారనియు పెద్దలు చెప్పియున్నారు.

ఇందుకనే స్త్రీలను గృహావర్ణములలోనే పెంచి పోషింపబడుట యుక్తమని అనుభవజ్ఞులైన పెద్దల తలంపు. ప్రకృతి జనితమైన ఈ విషయములను గుఱించి స్త్రీలు తమలో తాము యోచించుట లేదు. ప్రాచీన సాంప్రదాయములు సంకుచితమైనవనియు; స్త్రీల సహజ స్వేచ్ఛలను అరికట్టుచున్నవనియు; స్వేచ్ఛావిహారముల వలన, తమకును, తమజాతికిని ఎక్కువ గౌరవమర్యాద లబ్బుననియు తలంచుచున్నారు. ఈ యభిప్రాయముతో విజ్ఞానవతులైన స్త్రీ లంగీకరింప జాలరు.

కుటుంబ జీవితములో పురుషుల స్థానము చాల స్వల్పమైనది. అప్రధానమైనది. నామమాత్రమైనది. కుటుంబమంతయు స్త్రీలదే. ఇల్లు స్త్రీలదే. బిడ్డలు స్త్రీలదే. తల్లిదే. పురుషుడు తన కామతృప్తికై స్త్రీని చేపట్టిన దోషమువల్ల, ఆమె పోషణ భారమును, ఆమె సంతానము యొక్క పోషణ భారమును తననెత్తిన వైచుకొని, కష్టముల పాలగుచున్నాడు. తనకు కూడ సౌఖ్యము బ్బుటలేదా యని స్త్రీలు చెప్పవచ్చును. ఒంటరిగానుండు పురుషునికి ఇల్లెందుకు. ఇంటిలోని పరికరములెందుకు. తన పొట్టకొఱకై ఎక్కువగా కష్టపడవలసిన అవసరముండదు. ఏ కాకిగానుండు వాడు సుఖపురుషుడే. ఎప్పుడతడు స్త్రీతో కూడెనో, అప్పుడే ఎక్కడలేని కష్టములు, ప్రతిబంధకములు యేర్పడును. వివాహమైన పురుషునికి స్వేచ్ఛ తక్కువ. భార్యచేతులలో (స్త్రీ చేతులలో) భర్త (పురుషుడు) ఖైదీయగుచున్నాడు. భార్యకును, ఆమె సంతానమునకును జీతములేని నౌకరీ యగుచున్నాడు. భార్య 'ఈ బిడ్డలు నీబిడ్డ' లని చెప్పిన — వారినెత్తుకొని ముద్దాడును. "అదో మీతండ్రి గారని" భార్య బిడ్డలకు చూపునపుడు, నిస్సహాయుడై పురుషుడెంతో ఆనందమనుభవించును. స్త్రీలకును, బిడ్డలకును నిరంతరము చేయుచున్న సేవకు ఇదేకదా పురుషులకు ప్రతిఫలము.

మృగములలో మగజంతువులకు దాంపత్య జీవితములో నెట్టి బాధ్యత లేదు. ఆడ జంతువులే భారమునంతయు వహించుచున్నవి. ఆహార పానీయములు ప్రకృతి యొసగుచున్నది (పచ్చిక — నీరు — మొదలైనవి) పొదలు, గుహాలు, ఇండ్లగా నుపయోగపడును. బిడ్డలు కనినను పురుష జంతువుల తోడుబాటు లేక అవి జీవింపగలవు. బిడ్డలను పెంచుకొనగలవు. మృగములలో నుండు స్వేచ్ఛా విహారములు, ప్రణయములు, కూడికలు మానవ సంఘములో నుండినచో, పురుషులలో నీతి తొలగి, దాంపత్య జీవితములో మృగములవలె వారు బాధ్యతారహితులుగ ప్రవర్తింతురు. అప్పుడు స్త్రీలు యెక్కువ కష్టముల పాలగుదురనుతలంపుతోనే, వివాహము, గృహ జీవితము అనునవి పురుషుల కంటగట్టె, వారి స్వేచ్ఛను బంధించి యున్నారను విషయమును స్త్రీలు, హిందూ యువతులు ముఖ్యముగ గమనింప కోరుచున్నాను. హిందూ కుటుంబములలో స్త్రీలకే స్వేచ్ఛ ఎక్కువ; అధికారమెక్కువ; గౌరవ స్థానమెక్కువ, అనువిషయమును హిందూ యువతులు గ్రహించెదరు గాక.

—(*,*)—

# నాట్యకళ — అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

[గత సంచిక తర్వాత]

### కిలికించితము.

రోషము, సంతోషము, భీతుల వలన గలిగిన వికార కంపములయొక్క సమ్మేళనము కిలికించితము.

### మోట్టాయితము.

ప్రియగుణ కథనము, స్వాభిలాష ప్రకటనము మొదలగునవి మోట్టాయితము.

### కుట్టుమితము.

తన మనోభీష్టము నెరవేర్చుకొనుటకై నిర్మర్యాదగా, నిర్దయగా, కేశభూషణాద్యలంకార రహితమైన వ్యాజకోపమును ప్రకటించుట కుట్టుమితము.

### బిబ్బోకము.

గర్వాభిమానముచేత ప్రియులు మొదలగువారిని యనాదరించుట (తూష్ణీంభావము) బిబ్బోకము.

### లలితము.

ఏకాంతవాసము, మణిమంజీరాది మృదు ధ్వనితో గూడిన నానరాగాది యాలాపనము, మందహాసము, మధురమైన పలుకులు మొదలగు సుకుమార సూచకములు గలిగియుండుట లలితము.

### కుతూహలము.

రమ్యమైన వస్తుదృశ్యాదులను జూడగోరుట, యెత్తైన శిఖర గోపుర హర్మ్యములనెక్కుట మొదలగు పనులు సేయుటయందుత్సాహము కుతూహలము.

### చకితము.

ప్రియులు వెనుక భాగమున, నిశ్శబ్దముగా వచ్చి, చేయు పరిహాసాది క్రియలను చకితులగుట, తత్కాలికముగా భయము పెట్టుటకు చేయు ప్రియుల వికృత రూపములుచూచి అదరిపడుట, అకస్మాత్తుగా నులికిపడుట చకితము.

### విహృతము.

కౌగిలించుకొనుట, స్పృశించుట, భుజముమీద నభిమానముతో చేయి వేయుట, మొదలగు పనులు ప్రియులు చేసినను తలవంచుకొనుట, చిరునవ్వు నవ్వుట, కృత్రిమకోపము మొదలగునవి ప్రకటించుట విహృతము.

### హసితము.

యౌవనము వలనను, మన్మథ వికారము వలనను ప్రియుల యల్పవాంఛితముల వినినప్పుడు కలుగు నవ్వు హసితము.

### అనుభావము.

హృదయస్థిత భావములను, భ్రూ విక్షేప కటాక్షాదికములచే నభివ్యక్తముచేయుట యనుభావము. (ఇది రెండు విధములు. మానసికము లైనప్పుడు సాత్వికము లనియు, శారీరకము లైనప్పుడు సంచారీ భావములనియు చెప్పుదురు).

### సాత్విక భావములు.

మనసుచే వారింపజాలనప్పుడు శరీరమున కలుగు వికారములు. ఇవి స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వివర్ణము, కంపము, అశ్రువు, విశ్వరత్వము. (దీనిని గురించి ప్రథమములో విపులముగా నున్నది.)

### స్తంభము.

విషాదము, విస్మయము, భయము మొదలగు రాగముల చే గలుగు శరీర నిశ్చలత్వము. (ఏ యంగముగాని కదలక యుండుట యను భావము.)

### ప్రళయము.

సుఖదుఃఖములచే జనించిన సర్వేంద్రియ వివశత్వము. (మూర్ఛ యను భావము.)

### రోమాంచము.

సుఖము, ఉత్సాహము, భయము, విస్మయము మొదలగువాటి వలన, ప్రియుల గాఢాలింగన స్పర్శముల వలన, గలుగు గగుర్పాటు. (వళ్ళు జలదరించుట యను భావము.)

### కంపము.

భయము, జ్వరము, ముసలితనము మొదలగువాటి వలన శరీరమునకు గలుగు కంపము. (వణకుట యను భావము.)

### స్వేదము.

ఎండవేడిమి, శ్రమము, హర్షము, వ్యాయామము, లజ్జ, క్రోధముల వలన శరీరమున గలుగు చెమట. (శరీరమును దుడుచుకొనుట, తాళ వృంతాదికములచే విసరుకొనుట యను భావము.)

### వివర్ణము.

కోపము, చల్లదనము, భయము, విఫల మనోరథము, విరహము మొదలగువాటి వలన ముఖమున, శరీరమున గలుగు మార్పు.

### అశ్రువు.

క్రోధము, సంతోషము, భయము, దుఃఖము వలనను,

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్.,)

( న్యాయశీలుడు — మిరిల్. )

## ( 2 )

బిషప్ భవనము ఆస్పత్రి నానుకొని యున్నది. అది అతి విశాలమైనది. అందమైనది. 1712 లో డి కె బిషప్పుగా ఉండిన హెన్రి పూజగారితో ఆ భవనమును కట్టించెను. అది రాజులకు తగిన గృహము, అందలి గదులు, భోజనశాల వస్తువులు అన్నియు మహా వైభవ స్ఫోరకములై, పురాతన ఫ్లారెంటిక్ విధానమున నిర్మింపబడినవి. చుట్టును సుందరమై, సమున్నత వృక్షములతో గూడిన తోట గలదు.

దివ్యమైన ఆ భోజన శాలలోనే, 1714-వ సంవత్సరము జూలై 29-వ తేదిన, పూజతోడి బిషప్పు గారును, ప్రధాన బిషప్పును, విందారగింపబడి యుండెను. పూజ్యులగు వారి చిత్రపటములు ఆ హాలు గోడల నలంకరించియున్నవి. ఈ స్మరణీయమగు ఆ తేదీ బంగారు అక్షరములతో పాలరాతిపై చెక్కబడి యున్నది.

ఆస్పత్రి మలుగుజ్జు. ఇరుకు. మేడ లేదు. చిన్న తోట. తాను వచ్చిన మూడు రోజులకు బిషప్పు ఆస్పత్రికి వచ్చెను. మరలిపోవునపుడు ఆస్పత్రి డైరెక్టరును తన భవనమున కాహ్వానించెను.

బిష.— 'అయ్యా! ఈ ఆస్పత్రిలో ఎందరు రోగులున్నా' రని ప్రశ్నించెను.

డైర.— 'ఇరువదారుగురు స్వామీ.'

బిష.— 'నా లెక్క కట్టే యున్నది.'

డైర. 'మంచములలో రోగులు క్రిక్కిరిసి యున్నారు.'

బిష.— 'అదియు చూచితిని.'

డైర.— 'వార్డులు ఇరుకు గదులు. మంచి వెలుతురు లేదు.'

బిష.— 'నే నా సంగతినే యోచించుచున్నాను.'

డైర. 'అంటువ్యాధుల వేళలలో, ఇదివరకే విషజ్వరము మన వారిని బాధించినది. కొన్నేండ్లకు ముందు మిలిటరీ జ్వరము పీడించినది. ఒకొక్కప్పుడు నూరు మందిని! పనిచేయుటకును మాకు తోచుట లేదు.'

బిష.— 'నా కది తోచినది.'

'ఏమి చేయగలము స్వామీ. తలయొగ్గవలసినదే' అని డైరెక్టరు నిస్సహాయముగ పలికెను.

ఈ సంభాషణ భోజనశాలలో జరిగెను. బిషప్ కొంతసేపు ఏమియు పలుకకుండి, తటాలున డైరెక్టరు వంక తిరిగి, 'ఈ హాలులో ఎన్ని మంచములు పట్టునని మీ యభిప్రాయ' మని అడిగెను.

డైరెక్టరు ఆశ్చర్యపోయినట్లయి, 'స్వాముల భోజనశాలలోనా?' అనెను.

బిషప్ కన్నులు ఆ హాలంతయు పరుగిడినవి. అవి రేఖలు కొలతలు వేసి, గణించినవి కాబోలు! 'ఇందులో ఇరువది మంచములు పట్టు' నని తనలో తానను కొని, 'అయ్యా! డైరెక్టరు గారూ, నా మాట వినండి. ఇందేదియో పొరపాటున్నది. ఐదారు చిన్న గదులలో ఇరువదారుగురున్నారు. అరువదిమందికి చాలినంత జాగాలో మేము ముగ్గురమే యున్నాము. నా మాట నిజము. ఇందేదో పొరబాటున్నది. మీరు నా యింట నున్నారు — నేను మీ యింట నున్నాను. నా యిల్లు నాకిండు; మీ యిల్లు మీ కుంచుకొనుడు.'

మరునాడా యిరువదారుగురు రోగులు బిషప్ భవనమున ప్రవేశించిరి. బిషప్ తొలుతటి యాస్పత్రి ప్రవేశించెను.

మిరిల్ కే యాస్తిపాస్తులును లేవు. విప్లవ సమయమున ఆయన కుటుంబము దోపిడికి గురియైనది. ఏడాది కైదు వందల ఫ్రాంకులు యావజ్జీవ మాయన చెలియలికి ఏర్పాటైనది. మిరిల్ చిన్న యుద్యోగము నందుండినపుడా మొత్తమామె ఖర్చులకు సరిపోయెడిది. బిషప్పైన తరువాత మిరిల్ కు సంవత్సరమునకు పదునైదు వేల ఫ్రాంకుల జీతమైనది. ఆస్పత్రిలో నివాస మేర్పరచుకొన్న నాడే ఒక వేయి ఫ్రాంకులు సొంత ఖర్చులకనియు, మిగిలిన పదునాలుగు వేల ఫ్రాంకులు అనాథ శరణాలయములు, ప్రసూతి వైద్యశాలలు, మున్నగు సంస్థల కనియు, తీర్మానించుకొనెను. తాను బిషప్పుగానున్న కాలమున ఈ ఏర్పాటు కెన్నడును ఆయన భంగము కలిగింపలేదు.

ఈ ఏర్పాటును బాప్టిస్టిన్ కిమ్మన లేదు. మిరిల్ ఆమెకు రక్తసంబంధమున్న అన్న మాత్రమే కాదు. మతాధికారము గల గురువు కూడ. ఏ యాడంబరమును లేక, అన్నను ప్రేమించి పూజించెడిది. ఆయన మాటాడినా వినును. కార్యరంగమున దిగిన సహకారము నెఱపును. మగ్లోర్ మాత్రము గొణుగు చుండెడిది. బిషపు వెయ్యి ఫ్రాంకులే

నిలుపుకొన్నాడు, బాప్టిస్టినకు ఒక ఐదు వందలు వచ్చును. దీనిలో ఆ ముగ్గురు ముసళ్ళను జీవింపవలెను.

అదృష్టమాయని మిగ్లోర్ అతిపాదుపరి, బాప్టిస్టినా అద్భుత నిర్వాహకురాలు. కావున అతిథులు వచ్చినపుడు బిషప్ తెల్లమొగము పెట్టవలసి యుండెడిది కాదు. మూడు నెలలు కడచిన తరువాత 'ఇంత ధనము వచ్చుచున్నను, చాలుట లేదు' అనెను. 'నాకును అట్లే తోచుచున్నది. ప్రయాణపు కర్చులకని యిచ్చు ధనమైనను మీరు తీసుకొనుట లేదు. పుచ్చుకొనుట బిషప్పు లందరి యాచారము,' అని మగ్లోర్ సలహా చెప్పెను.

'అవును. నీవన్నది సరియే' అని బిషప్ దరకాస్తు పంపెను.

కౌన్సల్ జనరల్ ఆ దరకాస్తు నందుకొనిన కొన్నాళ్లకు, బిషప్ ఉపదేశ పర్యటనము చేయుటకై బండి ప్రయాణ కర్చుల అలవెన్సు అని షేరిడి సాలీనా మూడువేల ఫ్రాంకులు ఏర్పాటు చేసెను.

ఊరిలోని ధనికులందరికి కిందుమూలమున కన్నెర్రనైనది. పుష్కలమైన యినాము ననుభవించు చుండిన యొక రాజ్యాంగ సభ్యుడు దేవాదాయముల మంత్రికి, ఈ యలవెన్సును తీవ్రముగ ఖండించుచు రహస్యముగ ఒక జాబు వ్రాసెను. దానిలోని కొంతభాగము ఈ క్రింద ఉదహరింప బడినది:

'బండి కర్చులు! ఈ యూరిలో 4000 మంది మాత్రమే కలరు. బండి యెందుకు? ఉపదేశ పర్యటనము! అసలు కీ యుపదేశము లేమక్కరకు వచ్చును? ఈ కొండ ప్రదేశమునకు బండి యెందుకు? రోడ్లే లేవు. గుఱ్ఱముపై పయనింప వలసినదే. డ్యురాన్సు నది మీది వంతెన చాలీచాలనిది. ఈ గురువుల బుద్ధి యింతే — ఆశపోతులు, పిసినిగొట్లు. మొదట మొదట యితడేమో మంచివాడనుకొంటిమి. ఇప్పుడందరవలెనే ప్రవర్తించుచున్నాడు. ఈయన కొక వాహనము కావలయునా బోలు. తొలుతటి బిషప్పులకు వలె ఇతనికి భోగము లవసరము. హా! ఈ గురుజాతి! ఈ యపహాస్యపు గురువులనుండి చక్రవర్తి మాకు విముక్తి కలిగించినగాని స్థితిగతులు చక్కబడవు. పోప్‌ను త్రొక్కివేయవలెను. నామట్టుకు నే నేమో ప్రభు పక్షపాతినే?.

మగ్లోర్ కీ దరకాస్తు సంతోషము కలిగించినది. బాప్టిస్టిన్‌తో 'ఇప్పుడు సరి! స్వామి పరుల చింతతో ప్రారంభించెను కాని, తనను జాగ్రత్తగా చూచుకొనవలెనని యిప్పటి కెరము చేసికొనెను. అంతయు దాన ధర్మములకే యైపోయినది. అందుకే ఇప్పుడీ మూడు వేల ఫ్రాంకులు కావలసివచ్చినది' అని వచించెను.

(సశేషము.)

---

అడుగడుగునకు తప్పేనా?

( 6-వ పేజీ తరువాత )

ఎన్నికలను అనుకూలించువారిని, ఎన్నికలైన తర్వాత వారి అధికారము మరలా 5 సంవత్సరముల కాలము స్వేచ్ఛగా కొనసాగుటకు తోడుపడగల వారినే అభ్యర్థులుగా ఏరుకొనుట తటసించినది. ఎన్నికలబోర్డు సభ్యులు అభ్యర్థులుగా పోటీ చేయకూడదను నియమమే ఒకటి యుండిన, ఈ ఆంధ్రరాష్ట్ర ఎన్నికల బోర్డులో శ్రీయుతులు గోపాలరెడ్డి, సంజీవరెడ్డి మొదలగువారు రాష్ట్ర ఎన్నికల బోర్డులో సభ్యులుగా నైనా లేకుండెడివారు. లేదా సభ్యులుగా నుండినచో, ఎన్నికలకైనా పోటీ చేయకుండ యుండెడివారు. నాలుగైదు సంవత్సరములుగ కొనసాగిన అసమర్థమైన దుష్పరిపాలనమునుండి శ్రీ. జవహరిలాలుగారు చెన్నరాష్ట్రమును కాపాడి యుండెడివారు. గొప్ప దేశనాయకుడని అనిపించుకొనిన వీరికి, ఇంత మాత్రమైన తోచకపోవుట చాలవిషాదము. ఇండియా ప్రధానమంత్రి హోదాతో రాష్ట్ర మంత్రులను రాజీనామాల నివ్వమని శ్రీ. జవహరిలాలుగారు చెప్పజాలరు. కాని కాంగ్రెసు అధ్యక్షుల హోదాతో రాష్ట్రమంత్రులందరిని తమపదవులకు రాజీనామా యొసగవలెనని చెప్పుట కెట్టి అభ్యంతరముండెడు. రాష్ట్ర శాసన సభలను, ఇండియా పార్లమెంటును, రద్దుచేయవలెను. ఎన్నికలై నూతన శాసన సభలు, నూతన పార్లమెంటు ఏర్పడు వరకును రాష్ట్రములలో పంజాబు రాష్ట్రములోవలె గవర్నరుల పరిపాలనము నెలకొల్పి — ఎన్నికలు స్వేచ్ఛగా జరుగుటకై ఏర్పాటులు చేయవలెను. కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ. జవహరిలాలు గారైనందుకు ఇంతమాత్రమైన మార్పు చేయజాలనిచో — వారు కాంగ్రెసు సంస్థకును, దేశమునకును ఎంతమాత్రము ఉపకారము చేసినవారు కాజాలరు.

అధ్యాత్మిక పుట:-

# శ్రీ బ్రహ్మానందస్వామి హాస్య చమత్కారములు.

( రచయిత: శ్రీ చిరంతనానందస్వామిగారు, బేలూరు మఠము, కలకత్తా. )

యోగులు, జ్ఞానులు, పరమ హంసలును సదా గంభీర వదనులై యుందురనియు; నవ్వులను హాస్య చమత్కారములను వారికడ నెన్నడును ఆసింపరాదనియు లోకులు గొంద- అనుకొనుచుందురు. కాని యిట్లనుకొనుటయే నిజముగా హాస్యాస్పదము. తాము నోరారదెఱచి నవ్వినచో, తమ యాధ్యాత్మికౌన్నత్యమున కెక్కడ ముప్పు వాటిల్లునోయని తమ యాకృతియందును, చేష్టలందును, మాటలందును లేనిపోని బింకమును ప్రదర్శించు కొందఱు పాశ్చాత్య మతాచార్యు లొకప్పుడు శ్రీ వివేకానందస్వామిని సమీపించి "స్వామీ! మీరు మతాచార్యులు గదా? సామాన్యులవలె మీరు నవ్వుట, హాస్య సంభాషణలు చేయుట మీకు దగదు" అని హితోపదేశము చేయబోవ నాతడు నవ్వుచు, "ఏల? అమృత పుత్రులము, బ్రహ్మా[illegible] పుత్రులము నగు మన మేల మొగము ముడుచుకొని ముక్కుమూల గూర్చుండవలయునో నాకు బోధపడకున్నది!" అని బదులు చెప్పెనట.

శ్రీ వివేకానంద స్వామి వలెనే శ్రీ రామకృష్ణ పరమహంసకు అత్యంత ప్రియశిష్యుడును, ఆతనిచే దన మానస పుత్రునిగా పరిగణింపబడిన మహాయోగియు నగు శ్రీ బ్రహ్మానందస్వామి హాస్యచమత్కారములకు బట్టుకొమ్మయై యొప్పెను. వింతలతో నాతడు మహోన్నతాధ్యాత్మిక విషయముల [illegible]వాడు.

సంభాషణమున [illegible], సాగర గర్భమున రత్నముల [illegible] నిమిడియుండు [illegible] మహనీయుల హాస్య చమత్కారోక్తులు సైతము విశేష భావ గంభీరములై, యంతరార్థ సమన్వితములై [illegible]. స్వామి తన శిష్యులలో నొకని [illegible] హాస్య చమత్కారములతో గూడినవియు ఛందోబద్ధములు గానివి [illegible] పద్యములను వ్రాసి పంపుచుండువాడు. [illegible] లొక్కొక్కప్పుడు అంతగా ప్రాయము [illegible]. స్వామి చెన్నపట్టణములో నుండినప్పుడు తన లేఖకుడును, [illegible] నుండిన శ్రీ ప్రభవానందస్వామి యను శిష్యునకు పద్యములను [illegible], యాతనిచే వ్రాయించి [illegible] "శుచియైన హాస్యమును [illegible]" [illegible]. [illegible] శ్రీ ప్రభవానందస్వామి [illegible] సం[illegible], స్వామి దానిని [illegible] యిట్లు పలికెను: "[illegible] మీరు [illegible] చేయు[illegible] దీనిని [illegible]! మఱియొక [illegible] నను ఆ స్త్రబ్ధునకు నా భావము తలకెక్కదు." సద్గురూత్తముల శిక్షణ విధానము నిరర్థకమగునా? శ్రీ బ్రహ్మానందస్వామి యాశయము లాశిష్యుని మనఃఫలకమున ముద్రితమైయొప్ప, నచిరకాలముననే యాతనికి మహత్తరమగు నాత్మ ప్రబోధ మొదవెను.

శ్రీ బ్రహ్మానంద స్వామిని శ్రీ రామకృష్ణునితో బోల్చుచు శ్రీ మహేంద్రనాథగుప్త మహాశయుడు (శ్రీ రామకృష్ణ వచనామృత సంకలన కర్త) విశ్వానందస్వామియను బ్రహ్మానంద శిష్యునితో నొకప్పుడిట్లు పలికియున్నాడు: "స్వామి వర్తనమును నీవు పరిశీలించుచో, శ్రీ గురుదేవుడు (శ్రీరామకృష్ణుడు) ఎట్టివాడో నీకు గొంతయవగాహన కాగలదు. సమాధి స్థితినుండి యాతని మనస్సు బాహ్య ప్రజ్ఞ నొందినప్పు డాతని యందలి హాస్యగసము ప్రదీప్తమై యుండెడిది." స్వామి విషయమునను నిదియథార్థమై యొప్పెను. అంతర్వలోకన ప్రభావమున దమ మాన సోద్యానమున బొచ్చి యానంద పరిపూర్ణులై బాహ్య లోకమునకు మరలు మహనీయులు తమ సరస సల్లాపములచే, హాస్య చమత్కారములచే నవ్వులనెడి పువ్వులను వెదచల్లుచు, నెల్లరి యుల్లములను బల్లవింప జేయుచుందురు కదా!

కన్నులు మూసికొని ధ్యానస్థితుడై యుండు శిష్యుని చెంత గొన్ని ఫలములనో, మధురాహారములనో పెట్టించుచుండుట స్వామి కొక వేడుక. శిష్యుడు తన ధ్యానమును ముగించియు, ముగింపక మునుపే తన యిష్టాహారములు ప్రత్యక్షమగును. అటుపిమ్మట స్వామి యిట్లు ప్రశ్నించును: "సరి, నాయనా! నీతపః ఫలములు సిద్ధించినవా?"

తఱచుగా స్వామి తన శిష్యులను ప్రక్కలుపడ నవ్వించును. ఒకప్పుడు తాను నవ్వుచుండ, స్వామి తన్ను మెల్లిగా గిల్లి, విశ్వానందస్వామియను మఱియొక శిష్యుని సూచించుచు, "అదిగో చూడు; అతడెట్లు ఆడుపాపవలె ముసి ముసి నవ్వులు నవ్వుచున్నాడో!" అని పలుకుట తానింకను స్మరించుచుండునని శ్రీ ప్రభవానందస్వామి తెలిపి యున్నాడు.

జగత్ప్రసిద్ధులగు శ్రీరామకృష్ణ శిష్యులలో మఱియొకరగు శ్రీ అఖండానందస్వామి యాతనిని మఱికొన్ని దినము లుండుమని కోరెను గాని యాతడు వినడయ్యె. అంతట స్వామి 'సరియే' యని వేకువజామున నాతనిని రైలుబండి బయలుదేఱు స్టేషను కడకు గొనిపోవుటకై యొక పాలికి నియమించెను. సరిగా బయలుదేఱుటకు ముందాతడు బోయీల చెవిలో

(మిగత ప్రక్క పేజీలో)

# ప్రజాభిప్రాయ వేదిక

## ఎన్నికలు — ఓటర్ల ప్రశ్నలు.

ఆర్యా,

కడప నియోజక వర్గమునకు కాంగ్రెసు టికెట్టుపై నిలువబడిన శ్రీ కోటిరెడ్డిగారు ఎన్నికల ప్రచార సందర్భములో అయనభార్య శ్రీమతి రామసుబ్బమ్మగారితో సహా మా ఊటు గ్రామమునకు ఈ నెల 15-వ తేదీ వచ్చిరి. పెద్దమనుష్యులను పిలిపించి, మా గ్రామములోని ఓట్లన్ని కాంగ్రెసుకే యివ్వవలెననిరి. అంతలో గ్రామములో యువకులు గుమిగూడి, అయ్యా, గత 5 సం॥ నుండి కాంగ్రెసు చల్లని పరిపాలనను అనుభవించితిమి. అన్నమడిగిన ప్రజలను, ప్రజాసేవకులను నిర్బంధానికి గురిచేసిరి. వేలకొలది మందిని ఎట్టి విచారణ లేకుండా జయిళ్ళలో పెట్టిరి. అక్కడకూడ కొంత మందిని కాల్చి చంపిరి. కాటూరు, ఎలమర్రు గ్రామములలో స్త్రీ పురుషులను దిగంబరులు చేయబడిరి. స్త్రీలను చెరిచిరి. ఇవన్నియు మీ కాంగ్రెసువారు కరువు కాటకాలతో అన్నమో రామచంద్రా యని అలమటిస్తుయుంటె, మీకు చీమ కుట్టినట్లు కూడాలేదు. ఇంతకుముందు డిస్ట్రిక్టు ఎలెక్షనులో శ్రీమతి రామసుబ్బమ్మగారు జమ్మలమడుగు ఫిర్కాలో పోటీ చేసినప్పుడు అవినీతి మార్గములు అవలంభించి, ఓటు సంపాదించిరి. ఇప్పుడు అట్లు చేయుటకు లేదు. మీరు దీనికి సమాధానము చెప్పుడు. అంతటితో శ్రీ కోటిరెడ్డిగారు కారు యెక్కిరి. ఈ యెన్నికల సందర్భములో కూడ ఉన్న అనుమానాలను అడిగిన వారికి తీర్చక కోపముతో వెళ్ళుట యెందుకు?

ఊటుకూరు. జి. సుబ్బారెడ్డి.

## శ్రీ బ్రహ్మానందస్వామి చమత్కారములు.

(13 వ పేజీతరువాత)

నేమియో చెప్పెను. అంతట వారారాత్రి తెల్లవారు పర్యంతము నాతనిని మఠ ప్రాకారము చుట్టును త్రిప్పి త్రిప్పి యుదయమున మఠద్వారము ముందు దింపి, "ఇదిగో మీస్టేషను!" అని పల్కిరి! ఆతడు దిగుసరికి కట్టెదుట శ్రీ బ్రహ్మానంద స్వామి ప్రత్యక్షమై పకపక నవ్వుచు, "అప్పుడే తిరిగి వచ్చితివా!" యని సోదర శిష్యువాలింగన మొనర్చుకొనెను. ఇరువురును పసిబాలురవలె కడుపు చెక్కలగునట్లు నవ్వసాగిరి.

శ్రీ బ్రహ్మానంద స్వామి వివర్శగా నిట్లు పలుకును: "అనుదినము నవ్వుచుండుట మంచిది. అది మన శరీరములకు విశ్రాంతి నొనర్చును."

## కోర్టు నోటీసు:

In the court of the Dt. Munsiff, Cuddapah
O. P. No. 3/51.

వోర్స రెడ్డెమ్మ ... ... పిటిషనరు. (వాది)

And

వోర్స రామన్న ... ... రెస్పాండెంటు (ప్రతివాది).

రెస్పాండెంటుకు (ప్రతివాదికి) నోటీసు.

ఈ నెంబరు పిటిషనరుకు యీ దావాకు స్థాపనసొమ్ము కట్టుటకు శక్తి లేనందున పాపరుగా అంగీకరించవలెనని పిటిషనరు మన్వి దాఖలు చేసి యున్నారు. కనుక నీవు అభ్యంతరము యున్నయెడల యీ కోర్టులో పగలు 10 గంటలకు 26 11 51 తేదీ వాయిదా నాడు హాజరయి, తెలుపుకో వలెను. లేనియెడల నిన్ను యక్సపార్టీగా తీర్మానించ బడును.

కడప, 27_10_1951. — ఇ పి. నారాయణరెడ్డి, పిటిషనరు అడ్వకేటు.



## గాంధీజీ జ్ఞాపకార్థము.

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!

నవల

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (14)

[ఒకరి నొకరు ప్రేమించుకొన్న జానకీ చంద్రశేఖరులను విడదీసి, జానకి తండ్రి లక్ష్మణరావు వేరొకరికి పెండ్లి చేయఁ దలపెట్టెను. పీఠమీఁద పెండ్లి వితాకు చెందునటుల జానకి, చంద్రశేఖర, శ్యామలరావులతో లేచిపోయెను. శ్యామలరావు చంద్రశేఖరుని మోసగించి, తానే జానకిని పెండ్లిచేసికొన్నట్లు ప్రకటించెను. జానకి శ్యాములుని బారి నుండి తప్పించుకొన సాహసించి, కొండపేటు నుండి మడుగులో దూకెను. జానకి ప్రాణములు బెస్తవానిచే రక్షింపఁబడెను. శ్యాములుఁడు పిచ్చివాఁడయ్యెను. జానకి కనుబడ నందున ముందే పిచ్చివాఁడైన చంద్రశేఖరుఁడు మధుసూదనుని సాయమున స్వస్థత జెంది, ధనవంతుఁ డయ్యెను. శ్యాములుఁడు పిచ్చి ఆసుపత్రిలో చేర్చబడెను. శ్యాములుని చెల్లెలు రుక్మిణి కులటయై, ఒక డాక్టరుతో కాపురము బెట్టెను. జానకి స్వస్థత జెందిన యనంతరము తన మనోహరుని వెదకుచు బొంబాయి నగరమునకు బోయి, రాధాకృష్ణుని యాశ్రయమున నుండెను. అట్లుండ వ్యాపార నిమిత్తము వచ్చి మధుసూదనుఁడు రాధాకృష్ణుని యింట విడిసెను. అతఁడు ముందు తన్ను పెండ్లియాడ నెంచినవాడని యెంచి, తన్నెఱిఁగిన ముప్పు వాటిల్లు నని, జానకి అర్ధరాత్రిపూట పరారయ్యెను. తరువాత ఈ ప్రకరణమున—]

బొంబాయి నగరమునకు దక్షిణమున ఏబదిమైళ్ళ దూరములో సముద్రము నానుకొని ఒక పల్లియ గలదు. ఆ పల్లె వాసులు సముద్రమున గ్రుంకిడి, ముత్యపు చిప్పల సేకరించి, అందలి ముత్యములతో విదేశ వ్యాపారము సలుపువారు. వ్యాపార నిమిత్తమున వివిధ పట్టణముల నుండి, యిటకు నెడతెగని యేకధారగా బేహారులు వచ్చి పోవుచుందురు. గ్రామస్థులు కొందఱు మిక్కిలి ధనవంతులుగా నుండినను, విజ్ఞానవంతులు గారు. భారత రామాయణముల పారాయణ మొనర్చి వచ్చిన కథకులు రొక్కము మిక్కుటముగా నార్జించి, పోవుట సామాన్య కార్యము.

ఒకనాడీ యూర నొక వృద్ధుఁడు రామాయణము నడుపుచుండెను. వాలకమున నతఁ డాంధ్రుఁడుగా గన్పట్టినను, హిందీయందు గల తులసీరామాయణమును కర్ణరసాయనముగాఁ జదివి, వ్యాఖ్యానము సేయుచుండెను. జనములు మెండుగా నుండిరి. కథ పూర్తియైన పిదప, నాతఁడు జనంబుల సాంగోపాంగముగాఁ జూచి, 'సోదరులారా! నాది యాంధ్ర దేశము. నే నొక కార్యార్థమై యిటకు వచ్చితిని. మీ సాయ మవసర' మనెను. ఆ మాటలకు సభికులు కొందఱు 'తప్పక సాయ మొనర్తుము. మీరు వచ్చిన కార్యము తెలియఁజేయుఁడు' అనిరి. అందుల కాతఁడు 'ఏమియు లేదు. జవ్వనియైన భార్యను విడనాడి సుమా రిరువది యారేండ్ల ప్రాయము గల ఒక యువకుఁడు బొంబాయి నగరమును జేరబోయెను. నగర మంతయు గాలించినను, ఆతని జాడ కానరాలేదు. అతఁడీ గ్రామమును జేరి యుండునని కొందఱు సూచించిరి. మీ గ్రామ క్రొత్తవాని నెవ్వరి నున్న చూపి, పుణ్యము గట్టికొనుఁడు' అని దీనముగాఁ బల్కెను. 'సభికు లాతని పేరే యేదియో చెప్పు' మనిరి. అందుల కాతఁడు ఆ యువకుని పేరు చంద్రశేఖరుఁడు' అని ముగించెను. సభికులు 'రెండు మూఁడు దినములలో మీ కే సంగతియుఁ దెలిపెద' మని యందుండి జనిరి.

ఆ వృద్ధ సన్యాసి అయ్యాది సత్రమగుట నందే యుండెను. వీధులు గ్రుమ్మరి కనుబడిన ప్రతి నూతన పురుషు నెల్లను పరికించుచు, చంద్రశేఖరుని యన్వేషించుచుండెను. రాత్రి యగుసరికి సత్రమునకు చేరుకొనుచుండెను. ఇట్లు రెండు దినములు గడువగా, మూఁడవనాఁడు వృద్ధుఁడు బయలుదేర నుండు సమయమునకు ఇరువురు గ్రామస్థు లొక నూతన పురుషుని దోడ్కొని వచ్చి, 'అయ్యా! ఈతఁ డాంధ్రుఁడు; క్రొత్తవాఁడు; పేరు చంద్రశేఖరుఁడటః మీవాఁడేనా?' యనిరి. అంత నాతఁడు పరికించి చూచి, క్రొత్తయువకు నిట్లు ప్రశ్నించెను.

'అయ్యా! మీ దే పూరు.'

క్రొ. యు.— 'మాది కంచి.'

వృ. స.— 'మీ రే కార్యార్థ మీ పురి కొచ్చితిరి.'

క్రొ. యు.— 'నా భార్య దారి దప్పి యెటుబోయినది తెలియక వెదకులాడుచు నిట కొచ్చితిని.'

వృ. స.— 'ఆమె పేరు చెప్పెదరా?'

క్రొ. యు — "జానకి."

వృ. స.— "మీ రెన్నఁడైనా చంద్రగిరి ఆసుపత్రి యందు చికిత్స పొందితిరా?"

క్రొ. యు.— 'అవును. మీరు జ్యోతిష్యములో గట్టివారుగా నున్నారే? అయినా మీకు ఈ గొడవతో బనియేమి?'

వృ. స.— 'నాయనా! నేను నీ కొఱకే దేశదేశములం

తిరిగి, యిట కొచ్చితిని. నీ భార్య జానకీదేవి శీలవతి. నా తపోబలముచేత నాపె బడు యిడుములు దెలిసికొని, నీ జాడ లరసి వచ్చితిని. రేపే ప్రయాణము గావింతము. (గ్రామస్థుల వంక జూచి) అయ్యలారా! మీకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇఁకఁ బోయిరండు' అని ముగించెను. చంద్రశేఖరుని లోపలికిఁ దోడ్కొని పోయెను.

భోజనము ముగించి, రాత్రి యందే గడిపి, వృద్ధ సన్యాసి, చంద్రశేఖరుని దోడ్కొని పూనా జేరెను. పూనా నుండి రైలు ప్రయాణమున చెన్నపురి చేర సంకల్పించి, టిక్కెట్టుకొని, ప్లాటుఫారము మీద కూర్చొని యుండిరి. చంద్రశేఖరుఁ డా సన్యాసితో 'మునిపుంగవా! మీరు జానకి యం దంత ప్రేమ జూపుటకు కారణ మరయ వచ్చునా' అని యడిగెను. అంత వారిరువురికి ఈ క్రింది విధముగా సంభాషణ జరిగెను.

వృ. స.— 'నాయనా! నేను ప్రభుత్వ వైద్యాలయములో డాక్టరుగా పని చేయుచుంటిని. అప్పుడు తల గాయపడి నీ వక్కడికి వచ్చి, చికిత్స పొందితివి. తరువాత నీ భార్య జానకి, శ్యామలుని బారి నుండి తప్పించుకొనుటకు, ఒక మడుగులో దూకి, బెస్తవారిచే రక్షింపఁబడి, రంగమ్మ యింటిలో నుండెను. నే నామెకు చికిత్స చేసితిని. ఆమె నీ వియోగమును భరింప లేక యేడ్చుచుండ, నిన్ను వెదకి తెచ్చెదనని ప్రమాణ మొనరించి, ఇట్లు బయలుదేరి తుదకు నిన్ను కనుగొంటిని.' ఈ మాటలు వినుచున్న చంద్రశేఖరుఁడు పొంగి పొరలివచ్చు నవ్వు నాపుకొన లేక తుదకు 'అహాహా! హా—హా—హా' యని నవ్వ సాగెను. వృద్ధసన్యాసి, 'చంద్రశేఖరా! ఏమది. నాతో పరిహాసమా. ఊరకొమ్ము' యని గద్దించెను. అందులకు చంద్రశేఖరుఁ 'డది కాదు తాతా! నీవు పెద్ద జ్యోతిష పండితుఁడవే. పైగా తపోబలము గలవాఁడవు కూడాను. అందుచేత నవ్వు పట్టరాకున్నది' యనియెను. అంత వృద్ధ సన్యాసి 'అయితే నీవు చంద్రశేఖరుఁడవు గావా' అనగా 'అవును; చంద్రశేఖరుడనే. సరిగా వెదకి పట్టుకొన్నావు. ఆతఁడు నా హృదయములోనున్నాడు' అని మఱింత నవ్వ సాగెను. అందులకు సన్యాసి కినిసి, 'మూర్ఖా! నాతో బొంకులాడి మోసము చేసితివి, చంద్రశేఖరుని వలె నటించితివి. నిన్నేమి చేసెదనో చూడు' మని క్రోధావేశపరవశుఁడై పలికెను. యువకుఁడు 'నీవు నన్నేమియు చేయఁజాల' వనుచు లేచి, ప్రక్కనే యున్న స్త్రీల విశ్రాంతి గదిలోనికి బోయి, ఉడుపులు దీసివైచి, వేరు వస్త్రములు ధరించి వెలుపలికి వచ్చి, 'తాతా! కోపింపకు. నన్ను చూడు' అనెను. వృద్ధ సన్యాసి తలయెత్తి చూచి, 'తల్లీ! జానకీ! నీవా! నీ వేషము అచ్చము చంద్రశేఖరుని వలె నుండినది. భ్రమించితిని. నీ వీ సంగతి నాకేల ముందుగా జెప్పవైతివి?' యనెను. అందుల కామె 'తాతగారూ! దానికి కారణ మున్నది. తరువాత నీకు సావధానముగా జెప్పెదను. ఇప్పుడు మనము చెన్నపట్నము పోవుట మంచిది. చంద్రశేఖరుని కొరకై బొంబాయిలో వెదకితిని. కాని నిష్ప్రయోజన మయ్యెను. ఆతఁడు బహుశా చెన్నపట్నము నుండవచ్చును' అని ముగించు లోపల బొంబాయినుండి పట్నమునకు బోవు 'ఎక్స్‌ప్రెస్' వచ్చి స్టేషనులో నాగెను. అంత వారిరువురు రైలు నెక్కిరి. ఇరువది నిముసముల యనంతరము రైలు కదలెను. అంతవరకు జానకి జరిగిన సంగతంతయు తాతకు పూసగ్రుచ్చినట్లుఁ దెలియ బరచెను. తాత సరియే. మన యన్వేషణ మింకను ముగియ లేదు. భగవంతు డెపుడు దయ జూచునో యని ముగించెను. రైలు వాయువేగమున పోవు చెండెను.

(14 వ ప్రకరణము సమాప్తము)

—



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE :

REGISTERED No. M. 5285.

రాజకీయ వార పత్రిక.

# భారత జ్యోతి

సంపాదకులు:— సి. రామకృష్ణ, బి.ఏ.,

సంపుటము 4.
సంచిక—35.

బుధవారము, నవంబరు 7, 1951.

విడి పత్రిక వెల
మూడు అణాలు.

## విషయానుక్రమణిక



——:(o):——

# భారత జ్యోతి.

సంపుటము. 4. | శ్రీ ఖరనామ సంవత్సర కార్తీక శు. ౮, నవంబరు, 7, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.

సంచిక 35.


## మంత్రులు రాజీనామా నివ్వరాదా?

శా॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే భూమిపై
పేరైనం గలదే ... ... ... ... ...

ఎన్నికలు పూర్తియగు వఱకును, క్రొత్త మంత్రి వర్గములు ఏర్పడు వఱకును, అధికారపదవులలోనే ఉండి, రాబోవు ఎన్నికలలో పోటీచేయవలెనని మంత్రులు తలచుచున్నారు. ఇట్టి భావములుగల మంత్రులున్నంత కాలము ఎన్నికలు నిష్పక్షపాతముగను, స్వేచ్ఛగను జరుగునని చెప్పుటకు వీలుండునా? ప్రభుత్వ నిర్వాహణ యంత్రము విరామము లేక ఎప్పుడును కొనసాగుచుండు సంస్థ. ఎవరున్నను, లేకున్నను, ఈ ప్రపంచము కాని, ప్రభుత్వములుకాని స్తంభించిపోవు. తాము లేకున్న ప్రపంచ వ్యవహారములు, ప్రభుత్వకార్యకలాపములు స్తంభించి పోవునని కొందఱు పొరబాటుగా భావించు చున్నారు. ఎన్నికలు స్వేచ్ఛగా జరుగు విషయములో, తామెంత మాత్రము జోక్యము కలిగించు కొనమనియు; అధికారమును దుర్వినియోగము చేయమనియు చెప్పవచ్చును. కాని మానవసహజ ప్రకృతి యంతయు ఒకటే. మంత్రులు ఎన్నికలలో పోటీ చేయదలచినపుడు ఎటులైనను జయమొంద వలయుననియే వారు ప్రయత్నించుట సహజము. తమపార్టీని బలపఱచుకొనవలెనని తలంచుట సహజము. ఈ భావములున్నంత కాలము, తమ అధికార లాంఛనములను, అట్టహాసములను ఓటర్లకుచూపి, తమ ప్రత్యర్థులకన్న తాము అతీతమైన వ్యక్తులని భ్రమింప జేయవలెనను ఆశ ఉండియేతీరును. ఈ మంత్రుల వెంబడి అనేకులైన ప్రభుత్వోద్యోగులు చుట్టుకొని యుండడము, పోలీసు సిబ్బంది, యూనిఫారములు ధరించి, నియమము ప్రకారము నిలిచి, సెల్యూటు చేయడము, దేవతలు చూడ తగిన దృశ్యములు. ఎవరేమైన చెప్పవచ్చుగాక. ఈ ఎన్నికల సమయములో అధికార యుతమైన పనులు వేరు; సొంతపనులు వేరు అని ప్రత్యేకించుట చాలకష్టము. అధికారములో లేని ప్రత్యర్థులకు (పోటీ చేయువారికి) ఏలాటి రాజలాంఛనములుండవు. వీరిమాదిరిగనే మంత్రులు, ప్రజలయెదుటను, సభావేదికలపైనను లాంఛనగర్వితముగ నిలుచుటకు, సామాన్యమైన ఓటర్లను కలుసుకొనుటకు సిగ్గుపడెదరు. తమ హోదాకు తక్కువ యని తలచెదరు.

మంత్రి పదవులలోనే యుండి ఎన్నికలలో పోటీ చేయుచో, ఎన్నికల సభలలో ఓటర్లు మంత్రులకు కొన్ని ప్రశ్నలు వేసి, వారు చేసిన కార్యములను తెలుపుమని కోరుటకు భయపడెదరు. మంత్రుల వెంబడి రహస్య పోలీసులు, సాధారణ పోలీసులు చుట్టుకొని యుండెదరు. శాంతి భద్రతలను కాపాడుటకై యుండు ఉద్యోగులపై మంత్రులు సర్వాధికారములు కలిగియుందురు. బహిరంగ సభలలో మంత్రుల నెవరైన ప్రశ్నించినా,

వెంటనే ఈ పోలీసుల కోపమంతయు వారిపై కురియును. హతమార్చ బడెదరు. లేదా పరోక్షముగనైనను, వారి కోపావేశములకు పాత్రులు కావలసివచ్చును. కనుక చదువుకొని నక్కగ విమర్శింపగలవారు కూడ మంత్రులను ప్రశ్నింప సందేహించెదరు. అధికారములోనుండి పోటీ చేయు మంత్రులకును, అధికారము లేని సామాన్య అభ్యర్థికిని ఇదే గొప్ప వ్యత్యాసము.

వేలకొలది రాజులు, రారాజులు, చక్రవర్తులు, సార్వభౌములు, యుద్ధములను చేసి, గొప్పగొప్ప రాజ్యములను ప్రపంచములో స్థాపించి, వారెల్ల కాల ప్రవాహములో మాయమైపోయినారు. వారిస్థానములలో వేలకొలదినుండి వచ్చి పరిపాలన జరిపినారు. వారుకూడ కాలప్రవాహములో నే మాయమైరి. ప్రపంచముకాని, ప్రభుత్వములు కాని, ఒక్కదినముకూడ నిలిచిపోయినది వినలేదు. మంచికో చెడ్డకో— ముఖ్యముగ మంచికే పంజాబు రాష్ట్రములో మంత్రులు లేరు. అందువలన ఆకాశము క్రింద పడలేదు. సముద్రము ఉప్పొంగ లేదు. ప్రభుత్వము నిలిచిపోలేదు. ఇండియా యూనియన్ అధ్యక్షుల అనుమతిపై రాష్ట్రగవర్నరు, పరిపాలనా బాధ్యతను వహించి యున్నాడు. పదవీ వ్యామోహులైన మంత్రుల పరిపాలనమున కన్నను ఎక్కువ సమర్థతతో నిర్వహించుచున్నాడు.

యుద్ధకాలములో 1938 సంవత్సరములో కాంగ్రెసు మంత్రి వర్గములు రాజీనామాల నిచ్చినపుడు రాష్ట్రగవర్నరులు అడ్వయిజర్ల (సలహాదారుల) సహాయముతో రాష్ట్రముల పరిపాలనమును కొనసాగించిన విషయము అందరికి జ్ఞాపకముండవచ్చును. వారు సామర్థ్యముతో పరిపాలన సాగించుటేగాక, ద్రవ్యమును చేర్చిపెట్టి కాంగ్రెసు మంత్రులకు మరలా ఒప్పగించిరి. కనుక ఎన్నికలు పూర్తియై క్రొత్త మంత్రివర్గము ఏర్పడు వరకును ప్రస్తుతమంత్రులు అధికారములోనుండియే తీరవలెనని చెప్పుట సామాన్యమానవుని విజ్ఞానముపై దౌర్జన్యము చేయుట యగును. చాల అనుభవము కలిగిన సెక్రిటరీలు, పెద్దఉద్యోగులు కలరు. మన రాష్ట్రములో శ్రీయుతులు. యస్. కె. చెట్టియారు, వి. యస్. హెజ్మాడి, యస్. రంగనాధన్ మొదలగు ఉద్యోగులయొక్క నీతిని, ప్రవర్తనమును, సామర్థ్యమును ఎవ్వరును శంకించుటకు వీలుకాదు. వీరు గవర్నరుకు సలహాదారులగ యుండి, రాష్ట్ర దైనందిన పరిపాలనమును సర్వసమర్థతతో నిర్వహింపగలరు. ఎన్నికలు నిష్పక్షపాతముగను, స్వేచ్ఛగను కొనసాగ గలవను నమ్మకము అన్ని పార్టీల వారిలోను, అభ్యర్థులలోను, ఓటర్లలోను కలుగ జేయగలరు.

మేము లేనియెడల రాష్ట్ర పరిపాలనము ఏమగునో ఏమో అను యోచన యుంచుకొనక, తమంతకు తామే నవంబరు 21 వ తేది లోపల మంత్రులు తమ పదవులకు రాజీనామాల నిచ్చుచో, ప్రజల దృష్టిలో వారికీర్తి అతిశయించును. వారి త్యాగము బుజువగును. వారి స్వశక్తి బయలుపడును. రాజ్యాంగ చట్టము క్రింద మంత్రి వర్గములను ఎన్నికల కాలములలో రద్దుపరచి, గవర్నరుల కొప్పగింప వలెనను సూత్రము లేదు. కాని మంత్రులు తమంతకు తాము రాజీనామాల నొసగుటను ఎవ్వరు ఆక్షేపింప జాలరు. ఎన్నికలకు ముందు మంత్రులు తమంతకు తాము రాజీనామాల నిచ్చినచో, భావిసంతతికి మంచి సాంప్రదాయముల నేర్పరచిన వారయ్యెదరు. కాన ఈ యవసరమును గుర్తెరిగి మంత్రులు ఈ విషయములో రాజీనామాల నిచ్చెదరా?

—)•*•(—

చిన్న కథ.

# మాలతి.

( శ్రీమతి లీలావతీ నారాయణ గారు, బి. యస్. సి. )

(గత సంచిక తర్వాత)

—(4)—

త్రైనీటిని తెమ్చు మిషపై క్రిందికి పోయిన యువతి ఆనందము ను పట్టజాలక తల్లిని పోయి కౌగలించుకొనెను. సిగ్గుతో తల వంచుకొని సుధాకరుని ప్రేమ పూరితములైన మాటల నెల్ల పూస గుచ్చినట్లు చెప్పెను. తన్ను పెండ్లి చేసుకొనుట కంగీకార సూచకముగ బాస చేసినది కూడ తెలిపెను. ఏమి తెలియని అమాయకురాలు కావున సుధాకరుని ఆలింగన మొసర్చిన విషయము కూడ తెలిపెను.

"నీవే ఆలింగనము చేసికొంటివా, లేక సుధాకరుడే నిన్నాలింగనము చేసుకొనెనా" యని హాస్యముగా తల్లి వేసిన ప్రశ్నకు "అమ్మా అది నేను చెప్పలేను. ఆ సన్నివేశమును వర్ణింప జాలను. అది తప్పని నాకు ఆ సమయమున తోచలేదు. ఇప్పుడు సిగ్గుచున్న" దనెను.

తల్లి:— సుధాకరుని మతము వేరు. నీ మతము వేరు. నిన్నతడు పెండ్లి యాడుట కంగీకరించెనా?

యువతి:— అమ్మా! అతడు నా చేతిలో చెయ్యిపెట్టి నిన్ను తప్ప యింకొక స్త్రీని పెండ్లియాడను అని ప్రమాణము చేసెను.

తల్లి:— సుధాకరుని మంచి చెడ్డలు నీకు తెలియవు. అవి విచారింపకనే యతనిని పెండ్లి యాడుటకు నిశ్చయించు కొంటివా? ప్రపంచ జ్ఞానము నీకు తెలియదు. ఉన్నట్లుండి సుధాకరుని చూచి నప్పటి నుండియు పెండ్లి చేసుకొనవలయునను బుద్ధి నీ కెట్లు కలిగినది.?

యువతి:— అమ్మా! కారణము చెప్పలేను. అతనిని చూచి నప్పటి నుండి నాలో ఏదో క్రొత్త భావము ఏర్పడినది. ఆ భావ మిట్టిదని చెప్ప యోగ్యత నాకులేదు. భావమేమో నాలో కలిగినది కాని, దానిని ప్రేమయని చెప్పెదరో, భక్తి యని చెప్పెదరో, లేక మోహమని చెప్పెదరో నాకు తెలియదు. నీవు పెద్దదానవు. నీకు అనుభవము యెక్కువ. అతనితో అప్పుడప్పుడు మాటలాడిన దానివల్ల అతడన్ని విధముల యోగ్యుడని నాకు తట్టినది. నీ పైనను నా పైనను చూపుచున్న మర్యాద, కృతజ్ఞతా భావము, వినయము చూడ ఉత్తముడని నాకు నమ్మిక ఏర్పడినది. నాకు సుధాకరునే పెండ్లి చేసికొనవలెనను భావము దానంతకదే కలిగినది. ఇది నా కృష్ణదేవుడు ఏర్పరిచిన సంఘటన మని తోచును.

తల్లి, బిడ్డ మాటలన్నియు ఆలకించుచూ, తనలో తాను నవ్వుకొనుచు, వారి వివాహమునకు తన యంగీకార సూచకముగ బిడ్డను కౌగలించుకొని ముద్దిడుకొనెను.

యువతి తన ఆశకు తల్లి దగ్గఱనుండి ప్రతిబంధకము లేదను ఉత్సాహముతో "టీ"ని సుధాకరుని కిచ్చుచూ:—

"మీరు నా మాటలను విని, నా యందు ప్రేమ దృష్టిని సరల్చితిరి. నా చేతిలో చేయి పెట్టి ప్రమాణము చేసితిరి. కాని నా సంతోషమును తెలుపుటకు నాకు మాటలు తోచకున్నవి. దొర్లకున్నవి. "ఫీజీ" దీవులు నా పుట్టుక స్థలము. అందే పదహారు సంవత్సరములు పెరిగితిని. అందు భారతీయులు కూడ కలరు. ఇక్కడున్నట్లు అక్కడ కుల, మత భేదములు పాటింపరు. ఒక కుటుంబము వారిలోనే తండ్రి హిందూ దేవాలయమునకు, తల్లి బౌద్ధ దేవాలయమునకు, కొడుకు మసీదుకు, కూతురు బౌద్ధ దేవాలయమునకు పోవుదురు. మతము వ్యక్తిగతము.

"నాకు బుద్ధి తెలిసినది మొదలు నేను హిందూ దేవాలయమునకే పోవుచుంటిని. యుద్ధ కాలములో "ఫీజీ" దీవులు, బర్మా దేశము, జపానువారి స్వాధీనమైన తర్వాత మేము ఇండియా దేశమున కొచ్చితిమి. ఇచ్చట లేడి ఇర్విన్ కళాశాలలో చేరితిని. అప్పుడప్పుడు బిర్లా గారి లక్ష్మీనారాయణ దేవాలయమును దర్శించుచుంటిని. ఆగష్టు 15—వ తేదీన నా కడపటి ప్రార్థన చెల్లించితిని. ఆ నాడు జరిగిన విభజన వల్ల మత వైషమ్యములు గాఢస్వరూపము తాల్చినప్పటినుండి దేవాలయమునకు పోవుట చాలించితిని. ఈ నిమిత్తమునకు కూడ నా గదిలో శ్రీకృష్ణ విగ్రహమున్నది. ఈ బుజువును మీరు నా గదిలోనికి వచ్చి చూడవచ్చును."

సుధాకరుడు:— నే నిన్ని దినములుగ చూచుచున్నాను. మీ తల్లి నీ గదిలోనికి అడుగు పెట్టినది నేను చూడలేదు. నీ గదిలోనికి అడుగు పెట్టుటకు ఆమెకే హక్కు లేనప్పుడు నా కెట్లు కలుగును. నీ రహస్య గదిలోనికి అడుగు పెట్టుటకు నా కింకను అధికారము కలుగలేదు. నేనెట్లొచ్చి నీ గదిలోని కృష్ణ విగ్రహమును చూడగలను. నీ మాటలు చాలవా" యని నవ్వుముఖముతో ఆ యువతి ముఖమును చూచెను. ఆ యువతి అచలోక్తిలోని అర్థమును గ్రహించి:—

“ఎప్పుడు మీరు నాచేతిలో చెయ్యిపెట్టితిరో అప్పుడే మీకు సర్వహక్కులు నాపై కలిగినవి. నేనే మీదాననైనప్పుడు నా గదిలోని కొచ్చుటకు మీ కేమి ఆటంకము కలదనెను.

“చిన్నతనము నుండియు నేను మాంసాహారిని కాను. నాకు మాంసమన్న సరిపడదు. బౌద్ధుల సహవాసము వల్ల దానిపై నాకు అసహ్య భావ మేర్పడినది. నా భవిష్యత్తు మీతో యున్నదేమో. మొదటి నుండియు నా గుణములను, నా పద్ధతులను, నా మతములను అంతా కనుణ్యముగ దేవుడు మార్చినాడు.

సుధాకరుడు:— ఇదంతయు మా వదినగారిని ఒప్పించుటకు మంచి కారణములు. నీకు నేను పేదవాడనను విషయము ముందుగా తెలుపుట నా ధర్మము కదా? నీవు ధనికులైన తల్లిదండ్రుల కేకైక పుత్రికవు. కావున నిన్ను ఎక్కువ గారాబముతో పెంచియున్నారు. స్వావిగముల నీకిచ్చుట సౌకర్యములున్నవి. నన్ను కట్టుకొని నీవు కష్టముల పాలు కావలసినదే కదా! నా కింత వరకు ఉద్యోగము లేదే!

యువతి:— నేను మీ పురాణములను చదివి యున్నాను. భాగ్య భోగములు నా కక్కర లేదు. రాజభ్రష్టుడై, అడవులలో కాపురము చేయుచుండిన సత్యవంతుని రాజకుమారియైన సావిత్రి వలచి పెండ్లాడలేదా? విఖ్యాతిని గడించ లేదా? అరణ్యమునకు తన వెంట రావలదనియు, ఇంటి కడ నుండి తల్లిదండ్రులకు సేవచేయుచు, సుఖముగా నుండుమని శ్రీరామచంద్రుడు ఎంత చెప్పినను సీతాదేవి వినక, భర్త వెంబడి అడవుల పాలై, పడరాని కష్టములు పడి, ఎట్టకేలకు సీత వంటి స్త్రీ లేదని జగద్విఖ్యాతి గాంచ లేదా? దమయంతి రాజకుమార్తెయై, చక్రవర్తి అర్ధాంగియై, పతితో పాటు అడవుల పాలై తోడు నీడ లేక ఒక్కతెయై — భర్తచే విడువ బడినదై, వివిధ కష్టములకు గురికాలేదా! సార్వభౌముని రాణియైన చంద్రమతి దాసీ వృత్తి నవలంబించి, సర్పదష్టుడై ఏక పుత్రుడు మరణింప, కాటి కట్టు విడుచుటకుకూడ గతిలేక విలపింప లేదా? ఇట్టి పతివ్రతలలో నే నెంత దానను. నా భాగ్యమెంత? నా సుకుమారి మెంత? నా కీర్తి యెంత? మీ హిందూ పౌరాణిక స్త్రీల చరిత్రలను చదువు నప్పుడంతయు, నా దేహము గడగడ వణకును వీరి యొక్క చరిత్రలే నా మనస్సును, నా పరివర్తనమును, నా దృష్టిని మార్చివేసినవి. కనుక మిన్నుములను కట్టుకొని అడవిలోనైనను అనులింద్రగా కట్టుకొని, ఆకులలములను తిని పోషింపగలను. శ్రీకృష్ణుడు భీష్మకుగారాలైన రుక్మిణిని చేబట్టినట్లు మీరును నన్ను జేపట్ట వేడెదను.”

ఆ యువతి నోటినుండి యిట్టి యున్నతాశయ భూయిష్టములైన వాక్కులు వెలువడుకొలది, సుధాకరుని దేహము పొంగ మొదలిడెను. ఈ యువతి యొక్క పవిత్రత అద్దములో చూచినట్లు కనబడ జొచ్చెను. మనోద్రేకమును పట్టజాలదయ్యెను. వెంటనే లేచి, భావానుగుణముగ ఆ యువతిని ఆలింగనము చేసుకొని, ముద్దుకొని, రూపములోనే కాక, గుణములలో కూడ నీ వసమానురాలవు. నీ యట్టి దివ్యాంగన నాకు లభించుట నా భాగ్యము కాని, మరొకటి కాదు. మా వదినెగారిని ఒడబఱచి, త్వరలోనే నిన్ను పెండ్లి యాడుటకు ప్రయత్నించెదను. నీవు మీ తండ్రిగారి యనుమతి పొంది సిద్ధముగా నుండుమనెను.

యువతి:— మా తండ్రి గారు నా మాట కాదనరు. మా తల్లి మాట కాదనరు. ఆ నమ్మకము లేకుండిన నే నిట్టి ప్రయత్నమునకు పూనుకొని యుందునా! మా తండ్రి యెచ్చట నున్నాడో, ఎప్పుడు వచ్చునో తెలియదు. మే మిరువురము స్త్రీలము. ఒంటరిగా యిప్పుడిచ్చట యుండుట కూడ మాకు మంచిది కాదు. మా తండ్రి మిలిటరీ ఉద్యోగములో యుండగా మణిపురము నుండి నాకు ఒక జాబు వ్రాసి యుండెను. ఆ జాబులో నా వివాహ విషయమై పూర్తిగ చర్చించి యున్నారు. మా తండ్రి బంధు వర్గములోని వారు నన్ను పెండ్లి యాడ వలయునని మా తండ్రిపై ఒత్తిడి చేసిరి. కాని ఆ నాడు వ్రాసిన జాబు చూడ నా పెండ్లి విషయమై నా కొసగిన స్వాతంత్ర్య మెట్టిదో మీ రా జాబును చదివిన మీకే విశదమగును. నా కిదివరకే అనుజ్ఞ ఇచ్చి యున్నారు. ఆ జాబును మీకు తెచ్చి చూపెదనని చెప్పి, తన గదిలోనికి పోయి జాబుల ఫైలును తెచ్చి, సుధాకరుని ముందు పెట్టెను. అందులో ఆమె తండ్రి ఆమె వివాహ విషయమై వ్రాసిన జాబును చదివి, తృప్తి పడి మరునాడే తన యింటికి పోయి జరిగిన వృత్తాంతమెల్ల తన అన్నకును, వదినె గారికి తెలియజేసి, వారి యాజ్ఞను బడయుటకు తీర్మానించుకొనెను.

( సశేషము )

# ఓటు విలువ.

( శ్రీ పి. వి. సుబ్బయ్యగారు. )

మానవు లనాగరికులుగా నున్నప్పుడు సాంఘిక వ్యవస్థ తారుమారుగా నుండెను. ప్రజలు ముఠాలు ముఠాలుగా చీలి, వేరువేరు స్థలములలో నివసించుచు, ఒకరికొకరికి వైషమ్యము కలిగినపుడు పోరాటములకు దిగుచుండిరి. ఈ పోరాటములందు శక్తి సామర్థ్యములు జూపగలిగిన దిట్టరిని తమ నాయకుఁడుగా నియమించుకొనుచుండిరి. ఇట్లధికారము సంక్రమింపగా నతఁడు సర్వాధికారియై ఆ ముఠాను తన యిష్టము వచ్చినరీతి నడుపుచుండెను. తర్వాత కాలక్రమమున నాతఁడు రాజయ్యెను. ఇట్లేర్పడిన రాజులు రాజ్యములు స్థాపించి, నిరంకుశులై తమ కరగతమైన యధికారమును ప్రజోపకరముగా నుపయోగింపక, తమయాజ్ఞ నెల్లరు శిరసావహింపవలసినదని శాసించుచుండిరి. తద్వారా ప్రజలెల్లరు అష్టకష్టముల పాలైనను పరుకు గొనక వ్యవహరించుచుండిరి. ఇట్టి రాజులు మన దేశముననేగాక బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ మొదలగు దేశములయందు మితిమీఱి యుండిరి. అచ్చట రాజులకేగాక మతాధికారులకును ప్రజలపై యధికారముండెడిది. అందుచే రాజులకును, మతాధికారులకును ఘర్షణలు పలుమాఱులు జరుగుచుండెను. వీరిరువుర మధ్య ప్రజలు నలిగిపోజొచ్చిరి. ప్రజలిది సహింపలేక, విప్లవము లేవదీసి తమ హక్కుల స్థాపించిరి. ఈ హక్కులు:—

1. వ్యక్తి స్వాతంత్ర్యము.
2. మత విశ్వాస, ఆరాధనా స్వాతంత్ర్యము.
3. భావ (అభిప్రాయ) ప్రకటనా స్వాతంత్ర్యము.
4. ఆస్తి కలిగి యుండుటకు, అనుభవించుటకు స్వాతంత్ర్యము.
5. సర్వసమానత్వమునకు సంబంధించిన హక్కు.

ఈ హక్కులు 19-వ శతాబ్దములో, యూరపు, అమెరికాలలో రాజ్యాంగ విధానములందు చేర్పఁబడెను.

అంతటితో రాజుల పరిపాలనపోయి ప్రజా పరిపాలన ప్రారంభమాయెను. అనఁగా ప్రజాప్రతినిధులు ప్రభుత్వాధికారమును స్వీకరించి, ప్రజల ప్రాథమిక హక్కులు కుంటువడనీక పాలింపఁజొచ్చిరి. దీనినే ప్రజాస్వామ్యము (Democracy) అందురు. ఈ ప్రజాస్వామ్యములో పరిపాలనసాగించు మంత్రులు, ప్రధానమంత్రులు తప్పుదారులు ద్రొక్కరేని, అభియోగములు తేబడి తొలగింపబడుదురు. ప్రజాప్రతినిధులతో నేర్పడిన సభలు — లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలులు పరిపాలనా విధానమున మంత్రులకు తోడ్పడుచుండును. మంత్రులొనరించు కార్యములను విమర్శించుచుండును. ఒకతూరి యెన్నుకొనబడిన ఈసభలు కలకాలముండవు. వానికి పరిమితి గలదు. ఆ గడువు దీరగనే ప్రజల సమక్షమున నిలువబడి వారిని "మీరు మమ్ము అధికారమునకు బంపుడు" అని యాశ్రయింప వలసియుండును. ప్రజలు వారి సేవను ప్రశంసించి పంపినను సరే — లేక క్రొత్తవారిని యెన్నుకొన్నను సరే — అట్టి వ్యక్తులతో సభలు మంత్రివర్గములు, ఏర్పడును.

ఇట్లు ప్రజాప్రతినిధుల నెన్నుకొనుట — ఎలెక్షను అని వ్యవహరింపఁబడుచున్నది. వ్యక్తిగతముగా పౌరుడు చెలాయించు అధికారమునకు 'ఓటు' అని పేరు. ఈ ఓటు నేఁటి ప్రపంచ రాజ్యాంగ విధానములలో ప్రముఖ పాత్ర వహించుచున్నది. ప్రజాసామ్యమున ప్రఖ్యాతి నందిన బ్రిటను దేశములో నేఁటి స్థితిని పరికింతము. గత ఎలెక్షను జరిగి ఇరువది నెలలైనను నిండకపూర్వమే ప్రభుత్వమును నిర్వహించుచున్న 'లేబర్ పార్టి' మఱల ఎలెక్షను జరుగునటుల నిశ్చయించినది. ఏలనన ఎదురు పార్టి సభ్యుల సంఖ్యకును, తన సంఖ్యకును వ్యత్యాసము నాలుగైదు మాత్రమే. ఈ నాలుగైదు మెజారిటీతో ప్రభుత్వము నడుపుటకు లేబరు పార్టికి గడ్డు సమస్యయైనది. జబ్బులుపడి సభ్యులు రానపుడు, తమ పథకములు నెగ్గుటకు, వారిని మంచముల మీద పార్లమెంటుకు తీసుకగా వలసి వచ్చుచుండెను. అట్లగుట ప్రజాభిప్రాయము కోఱి ఎలెక్షనులో ఎక్కువ సభ్యులతో విజయము పొందిన పార్టి ప్రభుత్వము నేర్పాటు సేయును. కనుక ఓటునకు ప్రభుత్వములను నిర్మించుట, కూలద్రోయు నటువంటి శక్తి కలదు.

మన రాజ్యాంగ చట్టమునందు ప్రాథమిక సత్వములు ఈ క్రింది విధముగా నున్నవి.

| | |
|---|---|
| 1. సమానత్వపు హక్కు. | (ఆర్టికలు 14 నుండి 18 వరకు) |
| 2. స్వాతంత్ర్యపు హక్కు. | ( ,, 19 — 22 ,, ) |
| 3. దోచుకొను విధానముపై తిరుగుబాటు సేయఁగల హక్కు. | ( ,, 23 — 24 ,, ) |
| 4. మత స్వేచ్ఛ ... | ( ,, 25 — 28 ,, ) |
| 5. విద్యావిజ్ఞానముల నార్జించు హక్కు. | ( ,, 29 — 30 ,, ) |
| 6. ఆస్తి కలిగియుండు హక్కు | ( ,, 31 ) |
| 7. చట్టమును సవరించుటకు గల హక్కు. | ( ,, 32 ) |

పై హక్కులు ప్రజలకు ప్రసాదింపఁ బడియున్నవి. ఇయ్యవి సమగ్రముగా మనకు కలుగులాగున పరిపాలింపఁ గల

(మిగత 9-వ పేజీలో)

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానత్వము — హిందూ కోడుబిల్లు.

( శ్రీమతి. యస్. పద్మావతీదేవిగారు. )

(3)

హిందూ సంఘములో స్త్రీలను తల్లులనియు, మహాశక్తులనియు, పరాశక్తులనియు, పూజించుట, గౌరవించుట, ఈ దినమునకు కూడ కలదు. బిడ్డల నెత్తుకొని బిడ్డలను ప్రక్కన నిడుకొని, గర్వింప తగిన మాతృస్థానములో వారు (స్త్రీలు) నిలుచున్నపుడు వారికి జోహారులొనర్పని పురుషుడు హిందూ కుటుంబములో గలడా అని నా ప్రశ్న. భర్తయైనను కూడ ఆ గౌరవస్థానమైన మాతృస్థానమునకు శిరించివాడే. స్త్రీలకు హిందూ సంఘములో అసమానత్వము, అగౌరవ స్థానమిచ్చుట కలదో నాకు తెలియదు. ఇది యొక భ్రమ. పాశ్చాత్య నాగరికత మనపై చల్లిన మచ్చుమందు. అన్నిలోహములకన్నను బంగారమునకు ప్రతివారును, ప్రతిదేశములోను ఎక్కువ విలువ యొసగుచున్నారు. హిందూ కుటుంబములలో స్త్రీలను బంగారముతో సమానముగ చూచెదరు. అంత జాగ్రత్తగ రక్షించుకొందురు. ఏలయన జాతి పవిత్రతయు, సంఘపవిత్రతయు, వ్యక్తుల పవిత్రతయు స్త్రీలపై ఆధారపడి యున్నది. నాగరీకులమని విర్రవీగుచు, ఉపన్యాస వేదికలపై స్త్రీల హక్కులకై పోరాడుచున్నామని చెప్పుచున్న హిందూస్త్రీలు, యువతులు, ఎందరు ఈ సత్యమును గమనించి యున్నారు? స్త్రీలు ఎప్పటికిని ఆకర్షణ యంత్రములనియు (Receptive instruments), పురుషులనుండి పునరుత్పత్తి శక్తిని గ్రహించువారే కాని (In their mutual adaption to each other,--man and woman, in general and in particular, the male is formed for giving and the female for receiving.—DR HENRY N. GUERNSEY, M.D.) ఇవ్వగల వారు కారని విద్యావంతులైన స్త్రీ లెంతమంది గ్రహించియున్నారు? రాత్రికాలమున దీపముల ప్రకాశమువల్ల వివిధరకములైన పురుగులు ఆకర్షింపబడి, దీపముపై బడి చనిపోవుచున్నవి. ఈ దృశ్యములు సాధారణముగ అందరి స్త్రీల యనుభవములోను కలవు. స్త్రీలు దీపములతో సమానమైన వారు. పురుషులు పురుగులతో సమానమైన వారు. ఆ స్త్రీల దీపపు కాంతులలో, పురుగులను పురుషులు పడి, కాలిపోవుచున్నారను సత్యమును గ్రహించిన హిందూయువతులెంతమంది గలరని ప్రశ్నించుచున్నాను. స్త్రీలకు తెలియక పోవచ్చును. కాని వారికి తెలియకనే, పురుషులను పురుగులు మాత్రము వారి వెలుగులోపడి ప్రతినిత్యము కాలిపోవుచునే యున్నారు. ఇది ప్రకృతి సిద్ధమైన విషయము. వైద్యశాస్త్రములను, మనోశాస్త్రమును (Psychology) చదివినచో, స్త్రీలు ఈ విషయమై కండ్లు తెరచెదరు. ఇంత ఎందుకు? తమ భర్తలనే అడుగవచ్చును. వారికి వచ్చు కలలేమో విచారించ వచ్చును. 100 మంది యువకులలో 95 మందికి కలలయందు స్త్రీలు వచ్చెదరు. 100 టికి 75 మంది యువకులు స్వప్నస్ఖలన రోగములతో కృశించుచున్నారు. స్వప్నములలో స్త్రీలు కనపడని యువకుల సంఖ్య తక్కువ. స్ఖలన రోగములేని యువకుల సంఖ్య తక్కువ. అట్టివారు యోగి పుంగవులుగ భావింప వచ్చును.

తల్లులు ఎక్కువ అనుభవము. ప్రపంచ జ్ఞానము కలవారై యుందురు. వారు తమ పుత్రులైన యువకులతో ఈ విషయమును చర్చించి నిజము నిరూపింప వచ్చును. (Verification)

సినీమాలలో ప్రదర్శింపబడు రహస్యశృంగార దృశ్యములను చూచుటవల్ల, ఎంతమంది యువకులు 'స్త్రీ'లను మానసిక రోగమునకు గుఱియై, కలలలో స్ఖలన రోగములకు పాత్రులై, పటుత్వముతగ్గి, దేహ దౌర్బల్యమును, మనో దౌర్బల్యమును పొంది, జీవితములే దుర్భరములని వాపోవుచున్నారో- స్త్రీలను యువతీదీపములకు తెలియునా? సాధారణముగ నా వైద్య వృత్తిలో అనేక తరగతులకు జెందిన స్త్రీలను కలుసుకొని యున్నాను. ఆగర్భశ్రీమంతులయిండ్లలోని యువతులను చూచియున్నాను. బీద కుటుంబములోని యువతులకు కాన్పులు చేసి యున్నాను. సూతికా రోగములకు చికిత్స జేసియున్నాను. వారివారి రోగములకు సంబంధించిన ప్రశ్నలనే గాక, స్త్రీ పురుష సంయోగములకు సంబంధించిన ప్రశ్నలను వేయుచు, పరీక్ష (General Survey) చేసి యున్నాను. రతిరహస్యముల విషయమై వారు వెలిబుచ్చిన భావములు ఘోరముగ నున్నవి. దాంపత్య జీవితములోని పరమార్థమును, పరిపూర్ణ ఆనందమును, ప్రకృతి యొసగిన ఆ కళా సౌఖ్యమును, యువతీయువకులు అనుభవింప జాలకున్నారనిన, నా తల్లులును, నా సోదరీమణులును నమ్మెదరుగాక!

ఈ దేశములోనే కాదు. పాశ్చాత్య దేశములలోని యువతీ యువకుల దాంపత్య జీవితములు మరీ ఘోరముగ నున్నవి. దాంపత్య రహస్యములకు సంబంధించిన పుస్తకములు విరివిగా అచ్చు ప్రచురింప బడియున్నవి. వందలకొలది యువతీ యువకుల స్వానుభవములు కూడ ఆ పుస్తకములలో వర్ణింపబడి యున్నవి. వానిని చదువుచో, "స్త్రీ పురుష సమానత్వము"ను భావములు పాశ్చాత్య దేశములో ఎంత యనర్థములకు దారి తీసినవో అర్థమగును. ఇప్పుడిప్పుడు యువతీయువకులుచేరి ఒకే పాఠశాలలో చదువుట తప్పనియు; బాల్య వివాహములు శ్రేయోదాయకములనియు; స్వేచ్ఛాప్రణయములు, వివాహములు హానికరములనియు, పాశ్చాత్యులు గ్రహించు చున్నారు. ముందుకెక్కువగ పరుగెత్తి యున్నారు కావున, ఇప్పుడు వెంటనే వెనుకకు మఱలజాలని యవస్థలో పడియున్నారు. పాశ్చాత్య నాగరికత సంపర్కమువలన వారి నవీనపద్ధతులు, భావములు మనకు పూజనీయమై, ఆదర్శము లగుచున్నవి. మన ప్రాచీన సాంప్రదాయములు, భావములు, అనుభవములు, హేళనీయ మగుచున్నవి. ఎంతటి తుపానుకైనను కదలవటువంటి పునాదులపై మహర్షులు హిందూ ఆదర్శములను, దాంపత్య జీవిత ధర్మములను, సాంప్రదాయములను పెట్టియున్నారు. అందువలన ఎన్నియో అవాంతరములు కలిగినను, ఎన్ని అలలు తాకినను, ఎన్ని దండయాత్రలు జరిగినను, మహమ్మదీయుల విధ్వంసక చర్యలకును, పాశ్చాత్యుల దాడులకును కదలక, ఈ దినమునకు కూడ హిందూ స్త్రీల పాతివ్రత్యము, ధర్మనిరతి, కొంతకు కొంతయైనను నిలచి, భారత భూమి కీర్తి గడించు చున్నది. ముందునకు నడుచుచున్నామనియు, హిందూ స్త్రీల అభ్యుదయమునకును, సాంఘిక స్వాతంత్ర్య హక్కులకును పోరాడుచున్నామనియు తలచుచున్న నాతల్లులు, నాఅక్కచెల్లెండ్రు ఈమూడు వ్యాసములలో నేను వ్రాసిన విషయములనెల్ల శాంతముగ చదువుడు. నేను వెలిబుచ్చిన భావములలో లోపములేమైన నున్నచో, వానిని నాకు దెలియజేయ వలెనని ప్రార్థించు చున్నాను. (సశేషము)

సమకాలికాభిప్రాయము:

# సిగ్గుతో తల వంచుకోక తప్పదు.

### ఢిల్లీ కాంగ్రెసు.

ప్రస్తుతమునకు ఢిల్లీ కాంగ్రెసులో తీర్మానములన్నియు ఏకగ్రీవముగా జరిగిపోయినవి. అన్నిటికంటె ముఖ్యమైన తీర్మానము ఆర్థిక విధానమునకు సంబంధించినది. ఈ తీర్మానములో కాంగ్రెసు లక్ష్యములు కొంత విపులముగా చర్చించబడినవి. దేశమున కిప్పుడు ముఖ్యముగ కావలసినది ఇదే కదా? కాంగ్రెసు ప్రభుత్వములు తను ఈ ఆరేండ్ల హయాములోను ఎన్నెన్ని ఘనకార్యములు సాధించినను, ఆర్థిక రంగములో మాత్రము పరాజయమునే పొందినది. ఇందుకు సంజాయిషీ లెన్ని చెప్పుకున్నప్పటికిని, ప్రజానీకమును అవి సంతృప్తి పరుప జాలవు. ధరలు అంతకంతకు పెరుగుచున్నవే గాని తరగడము లేదు. ప్రజల కొనుగోలు శక్తి క్షీణగతిలో ఉన్నది. ఆకలి మంటలు నలుగడల చుట్టుముట్టుకొని ప్రజ్వరిల్లుచున్నవి. ప్రక్కనే చీకటి వ్యాపారము వీనిని చూచి వికటాట్టహాసము చేయుచున్నది. ఇది చేసితిమి; అది చేసితిమి; అని ఎన్ని ఏకరువు పెట్టిన ఏమి లాభము? ఫలితము మాత్రము శూన్యము. ఇందుకు కాంగ్రెసు ప్రభుత్వములు సిగ్గుతో తలవంచుకొనక తప్పదు.

("కృష్ణా పత్రిక")

♦♦♦ ♦♦♦ ♦♦♦

## ఎన్నికలలో అభ్యర్థులను అడుగు ప్రశ్నలు.

శాసన సభ్యులు తమ సమావేశ కాలమును వృథా చేసిరని విమర్శించుట సబబనిపించుకోదు. ప్రపంచములో కని విని ఎరుగని బ్రహ్మాండమైన ఎత్తున ఎన్నికలు జరుగబోవుచున్న ఈ సమయములో ఎన్ని మంత్రివర్గములు మారినా, ఎన్నిసార్లు శాసనసభ సమావేశమైనా, తమకు జరిగిన మేలేమి అని ప్రజలు ప్రశ్నించుట సహజము. ప్రతిమానవునికి అవసరమైన అన్నవస్త్రముల సమస్యగాని, తల దాచుకొనుటకు "నీడ" సమస్యగాని పరిష్కారమైనదా? పరిష్కారము చేయుదురా? రేపు ఎన్నికలలో ప్రతి అభ్యర్థి తన నియోజకవర్గమునకు వెళ్ళి ప్రచారము చేసుకోవలసి వచ్చినపుడు, ఎదురొక్కొనే ప్రశ్నలే ఇవి.

ఇంతే జనానీకపు కూడు—గుడ్డా; ఇల్లూ—వాకిలీ చూడవలసినవే మాటలు అనీ, ఇదంతా నిదానముమీద జరుగవలసినవని అనీ, అభ్యర్థులు సమాధానము చెప్పి వేయ వచ్చును. ప్రజలు ఇంకా తరిచి తరిచి ప్రశ్నించిన, పంచవర్ష ప్రణాళిక ఉన్నదని కూడా సమాధానము చెప్పవచ్చును. పంచవర్ష ప్రణాళిక ఆచరణలోనైనా, ఏ పథకాన్ని ముందు ఎత్తుకున్న ఎంత త్వరగా ఫలితమునకు వచ్చి, ముఖ్యాతి ముఖ్యమైన ఆహార సమస్యను పరిష్కరించునే దృష్టి అవసరము.

("ఆంధ్ర పత్రిక")

* * *

## ఓటు విలువ.

(6—వ పేజీ తరువాత)

ప్రజాపక్షము నేడు మనకు కావలయును. ఈ హక్కులను త్రోసి రాజను ఏ పార్టీయైనను ప్రమాదమున ప్రభుత్వమునకు వచ్చుట తటస్థించెనేని దేశము అరాజకమునకు నిలయమగును. మనమిక మూడు మాసములలో మనకు వచ్చిన ప్రభుత్వమును మన ఓటును వినియోగించుట ద్వారా స్థాపింపబోవుచున్నాము. పౌరులు తమకు గల ఓటింగు హక్కును విచక్షణ బుద్ధితో నుపయోగింప వలసి యున్నది. పై ప్రాథమిక హక్కులు ఏలెక్కన ప్రణాళిక ద్వారా ఏ పార్టీ మన కిచ్చుచున్నది? మనల ఓటుకై ఆశ్రయించిన అభ్యర్థి పై హక్కుల గౌరవించుచున్నాడా? అను ప్రశ్నల వేసికొని, విషయము వితర్కించి, సరియైన పార్టీకి మన ఓటు నియ్యవలెను.

అట్టి విచక్షణా జ్ఞానము వలన ఓటుకు మంచి విలువయో, చెడ్డ విలువయో ఆపాదింప బడుచున్నది. విచక్షణా జ్ఞానము కోలుపడి, చెడ్డ వ్యక్తికి గాని, మానవ సత్యముల పాడుసేయు విద్రోహకరమగు పార్టీకిగాని ఓటు నిచ్చినచో, ఆ ఓటునకు నీచత్వ మారోపింపబడును; మంచి వ్యక్తికి గాని, సత్యమును పాటించు పార్టీకి గాని ఓటునిచ్చినచో, ఆ ఓటునకు మహోత్తమ స్థానము లభించును. పౌరులియ్యది గుర్తించి, తమ ఓటును సద్వినియోగము సేయుదురు గాక.

---

**గాంధీజీ జ్ఞాపకార్థము**

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

# నాట్యకళ — అభినయము.

(శ్రీ. కేదారనాథ్.)

[గత సంచిక తర్వాత]

### విషాదము.

ప్రారబ్ధము వలన గలిగిన నపుంసకత్వము. కార్యభంగము, అపరాధము, అపరిచయము మొదలగువాటి వలన గలిగిన చిత్త సంక్షోభము. (ఉపాయాన్వేషణ, వేగుమనస్సు, ముఖ శోషాద్యను భావములు.)

### ఔత్సుక్యము.

ఇష్టులు, రమ్యవస్తువులు, విరహాకారకులు మొదలగు వారిని జూడగోరుట.

### నిద్ర.

నిశ్చింత, నిమీలనము మొదలగు బాహ్యేంద్రియ సంబంధమైన విరహము; అనగా అంగముల నిష్క్రియ. (అనిమేషము, నిమీలనము, కనులు మూయుట యను భావములు.)

### అపస్మారములు.

మోహము, దుఃఖము, భూతావేశము మొదలగువాని వలన చిత్తమునకు భరింపరాని యావేశము. (భూపాత, భ్రమణము, ఎదబాదుకొనుట, వికటముగా మాట్లాడుట, నోట నురుగుఁ గ్రక్కుట మొదలగు యనుభావములు.

### సుప్తి.

ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క నిశ్చలత్వము. (నిమీలనము మొదలగు యనుభావములు.)

### విబోధము.

శబ్ద, స్పర్శ, ఆహార పరిణామాముల వలన జనించిన గోపావేశము. భుజము, తొడ తట్టుకొనుట, వ్రేలాడించుట, గ్రుద్దుట అను భావములు.)

### అమర్షము.

అధిక్షేపము, అవమానము మొదలుగా గల అనపరాధము వలన గలిగిన మనః ప్రజ్వలనము యొక్క యభీష్టము. (స్వేదము, శిరః కంపము, చింత, ఉపాయాన్వేషణ, ఉత్సాహము అను భావములు.)

### అవహిత్థ.

భయము, లజ్జ, కుటిలత్వము మొదలగువాని వలన గలుగు యానందాది కార్యాకారములను బయలుపరచ కుండుట. (నవ్వుచుండుట, వ్యాజాన్యకథనము మొదలగు అనుభావములు.)

### ఉగ్రత్వము.

పుత్ర, మిత్ర, కళత్ర భృత్యాదులు అపరాధము చేయుచుండగ చూచినపుడు కలుగు కోపము. (తాడనము, వ్రేలాడించుట, కట్టుట మొదలగు అనుభావములు.)

### మతి.

నానావిధ శాస్త్రచింతనము, ఊహ, యర్థనిశ్చయము, శిష్యోపదేశము, సంశయ విచ్ఛేదము, పాండిత్యము మొదలగువాని వలన గలుగు సంతోషము.

### వ్యాధి.

మనస్తాపము, వైషమ్యము, తాపము మొదలగువాటి వలన గలుగు జ్వరము మొదలగునవి. (జ్వరము, చలి, యులుకు అనుభావములు.)

### ఉన్మాదము.

భయము, సన్నిపాతము, ఇష్టజన వియోగము, ధన నాశనము మొదలగువాని వలన గలుగు చిత్త విభ్రాంతి. (కారణము లేని నగవు, అసంబద్ధ ప్రలాపము, నిర్హేతుక కథనము, రోదనము మొదలగునవి అనుభావములు.)

### మరణము.

మరణమునకు యత్నించుట. (అపాయము, యెక్కిళ్ళు శ్వాసా ద్యనుభావములు.)

### త్రాసము.

అకస్మికముగా గలుగు చిత్తక్షోభము. (ఉఱుము, భూకంపము మొదలగువాటి వలన గలుగు కంపము, గాత్ర సంకోచ, రోమాంచ మోహా ద్యనుభావములు.)

### వితర్కము.

సందేహము, విమర్శనము మొదలగువాటి వలన గలుగు వితర్కము. (అత్మేచ్ఛ, భ్రూవిక్షేపము, శిరఃకంపా ద్యను భావములు.)

### కామావస్థలు.

కనులఁ జూచుట, మనస్సు తగులుకొనుట, సంకల్పించుట, ప్రలాపించుట, జాగరము, కార్శ్యము, అరతి, సిగ్గు విడుచుట, జ్వరము, ఉన్మాదము, మూర్ఛ మరణము, అని పండ్రెండు. (ప్రియుల గుణముల స్తుతించుట ప్రలాపము, నిద్ర మేల్కొనుట జాగరణము, శరీరము చిక్కుట కార్శ్యము. ప్రియవస్తు ద్వేష మరతి, తాపాధిక్యము జ్వరము, కండ్లు మొదలగు బాహ్యేంద్రియములు వాటివాటి పనులు మానుట శూన్యాంతఃకరణము మూర్ఛ) ముందు కనుపఱచిన శృంగారాది రసముల నుద్దీపింపఁ జేయు స్థాయీ భావము లేదు

విషయములందు ప్రకటించవలసినది ఈ దిగువ వివరింపఁబడియె.

## రతి.

నాయికా నాయకానుకూలానంద జనిత దర్శనాలింగనాది కర్మ సంభోగము రతి.

## హాసము.

వేష, భాషాలంకార, వికార, విరుద్ధాలంకారము, అస్పష్ట భాషణము, కుబ్జరూపము మొదలగు దర్శన, శ్రవణ జనిత మనో వికారము హాసము.

## శోకము.

ఇష్టజన వియోగము, గ్రహణాద్యనిష్టప్రాప్తి మొదలగువాటి వలన జనించిన దుఃఖము శోకము.

## క్రోధము.

శత్రు గ్రహణమందు, భృత్యువు మొదలగువా రపరాధము చేసినప్పుడు గలుగు కోపము క్రోధము.

## ఉత్సాహము.

లోకోత్తరమైన కార్యము చేయుటయం దుల్లాసము ఉత్సాహము.

## భయము.

రౌద్రమైన శబ్దము విన్నప్పుడు, వికార స్వరూపము జూచినప్పుడు గలుగు శంక భయము.

## జుగుప్స.

నెత్తురు మొదలుగా గల యసహ్యమైన వానిని జూచుట, వినుట వలన గలుగు మనస్సంకోచము జుగుప్స.

## విస్మయము.

అపూర్వ దర్శనము, లోకవిపరీతము మొదలుగల దర్శన, శ్రవణజన్య మనో విస్తారము విస్మయము, (ఆశ్చర్య మనుభావము.)

## శమము.

ఈశ్వరానుగ్రహము, సత్సంగము మొదలగువాటి వలన గలుగు వైరాగ్యము, క్షమ మొదలగు మనోవికారము శమము.

## శృంగారము.

సంభోగ శృంగారము, విప్రలంబ శృంగారము అని రెండు విధములు.

## సంభోగ శృంగారము.

బాహ్య సంభోగ శృంగారము, అభ్యంతర సంభోగ శృంగారమని రెండు విధములు.

## బాహ్య సంభోగ శృంగారము.

సంభాషణము, చుంబనము, ఆలింగనము, స్తనపీడనము, నఖక్షతము, దంతక్షతము, అధరామృతపానము మొదలగు బాహ్య క్రియలు గలిగినది. (కొన్ని ప్రదర్శనానర్హములు.)

## అభ్యంతర సంభోగ శృంగారములు.

నాగరాఖ్యాది నానావిధ బంధనములతో రతిక్రీడ సల్పుట. (ప్రదర్శనానర్హము.)

## విప్రలంబ శృంగారము.

అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసమని నాలుగు విధములు.

## అభిలాష.

పూర్వ మన్యోన్య రాగముతో నుండి, యేదైన కారణాంతరమున విడిపోయి యున్నవారు మరల కలియఁగోరుట, లేక క్రొత్తగాఁ గలిగిన యనురాగాతిశయము వలన గలయఁ గోరుట అభిలాష.

## ఈర్ష్య.

స్వప్రియు లింకొకరితో నన్యోన్యముగా నుండుట, వినుట, చూచుట వలన గలుగు చిత్తవికారము ఈర్ష్య.

## విరహము.

నాయికా నాయకులకు యేదో కొద్దికారణము వలన, మరల కలసికొనునంతవఱకు, జరుగు కాలయాపనము సహింపలేకుండుట విరహము.

## ప్రవాసము.

ప్రియులు దేశాంతరమున నుండగా దినములు యుగములుగఁ గడుపుట ప్రవాసము.

## రసాభాసము.

చుంబనాలింగనాదులఁ జూపుచు, వాటిని మార్చి, వాటికి బదులు కపోతములు, చిలుకలు, జింకలు మొదలగు పశుపక్ష్యాదులు తద్విధమున బ్రవర్తించుచుండగాఁ జూపుట కాని, లేక యటువంటి చిత్రములఁ జూపుట కాని రసాభాసము. (ప్రతాపరుద్రీయము)

(సమాప్తము.)

# నిర్భాగ్యజీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

( అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ., బి.ఎల్., )

( న్యాయశీలుడు — మిరల్. )

(2)

నాటి సాయంకాలముననే, ఆ మూడు వేల ఫ్రాంకులను ఫలానా, ఫలానా ధర్మములకని వ్రాసి, బిషప్ చెల్లెలి కొక చీటీ నిచ్చెను. ఇంటికి చిల్లిగవ్వయు లేదు.

సర్కారు వారిచ్చు జీతము కాక, వేరుగా సంపాదించుట కెన్నియో మార్గము లెన్నో యున్నవి. అవి చట్టమునకును, న్యాయమునకును విరుద్ధము కాదు. అట్లు కూడిన ధనము ధనికుల నుండి కచ్చితముగా వసూలు చేయ సాగి, కుడిచేత పేదలకు పంచి పెట్టును మిరల్.

అచిర కాలముననే విరాళములు రా సాగినవి. కలవారును, లేని వారును బిషప్పు కడకు మూగుదురు — విరాళము లిచ్చుటకు, తీసుకొనుటకు. సంవత్సరము గడువకమునుపే ఆయన ధర్మపరుల ధనపేటికయు, అక్కరగల వారి యందయును య్యెను. ధనము ప్రవాహమై, యతని చేతుల ద్వారా ప్రవహించుచుండెను. కాని ఆయన జీవితములో మార్పు రాలేదు. ఆ నిరాడంబర జీవితమున ఆవగింజంత భోగము అధికము గాలేదు.

ధనికులలోని దయాళుత్వమున కంటె, పేదల దైన్యమధికము. కావున, విరాళములు వచ్చి రాక ముందే పైసలతో పంపకమై, ఎడారిలో పడిన నీటి బొట్లవలె అయ్యెడిది. చేత దమ్మిడీ నిలువదు. దీనికి తోడు తనధనమును కూడ దోచెడి వాడు.

ఇవి యంతయు సరిగా ఆయన చిత్రమని చెప్పుటకు [illegible] లేదు. ఇవి మాచాయ పోలికలు.

(3)

బండి నట్లు దాన ధర్మముల పొత్తేసి, బిషప్పు పర్యటనము మాత్రము మానలేదు. ఆయన తిరుగ వలసిన ప్రదేశము సుకరము కాదు. సమతలము చాల తక్కువ. కొండ ప్రదేశమే ఎక్కువ భాగము. రోడ్లు లేవనియే చెప్పవచ్చును. ఆయన పర్యవేక్షణ క్రింద మత బోధ చేయవలసిన విభిన్నమగు పారిష్ ఖండములు నూట ఇరువది రెండు. ఈ యన్ని చోటులను పరిశీలింపవలెనన్న అతిశ్రమ. అయినను బిషప్పు పనికి మానలేదు. తన యింటి చుట్టు ప్రక్కల నడచియే వెళ్ళును. సమతలమునైనచో, బండిలో పోవును. మిట్టుచోట్ల కంచర గాడిద నెక్కి, తిండి నొక బుట్టలో పెట్టుకొని పయనించును. సాధారణముగ ఆ యూరి వాండ్రును అనుసరింతురు. కష్ట ప్రయాణమైనచో, అతడొకడే పోవును.

ఒక నాడాయన సెనేజ్ కు వెళ్ళెను. అది పూర్వము బిషప్పు పీఠము. ధనమంతయు ముగిసియుండుట చేత, ఆనాడు మిరల్ గాడిద నెక్కి నచ్చట చేరుకొనెను. ఆ నగర మేయర్ బిషప్పును స్వాగతమీయ వచ్చి, ఆ గార్దభ వాహనము గాంచి ఆశ్చర్యమున కొయ్యబారెను. పెక్కురు పౌరులు కూడ నవ్వసాగిరి. "మీరెందు కాశ్చర్య పడుచుండిరో నే నెరుగుదును. ఏసు ప్రభువు ఉపయోగించిన వాహనమును నే నిప్పుడును ఉపయోగించుట పొగరనుకోనని యనుకొనుచున్నారు. అవసరమై యిట్లొనర్చితిని కాని, అహంకారముచే గాదు," అని మిరల్ వివరించెను.

పర్యటన సమయములో శిష్యులతో మిక్కిలి చనువు లిచ్చి, నెమ్మదిగ నుండును. మాటలు తక్కువ. ఉపదేశములు మరియు తక్కువ. ఎక్కడి కారణములనో, ఉదాహరణములనో, [illegible] తీసుక రాడు. ఒక యూరి ప్రజలకు ప్రక్క యూరి నుదహరించును. అతి పేదలను కనికరముగ చూచు యూళ్ళలో "బ్రియాన్సన్ ప్రజలను చూడుడు, అందరి కంటె మూడు నాళ్ళు ముందుగనే పచ్చిక బయిళ్ళనుండి కోసుకొనుటకు పేదలకు, వితంతువులకు, తల్లి తండ్రులు లేని పిల్లలకును అనుమతినిచ్చిరి. ఆయుభాగ్యుల యిండ్లు కూలినపుడు, తామేకరి పెట్టి కట్టింతురు, కావుననే వారిని భగవంతుడు [illegible] చున్నాడు. ఒక శతాబ్దముగా అక్కడ ఒక్క హత్యయైన జరుగలేదు," అని యుద్ఘాటించెను.

[illegible] కాలమున ప్రజలు ధాన్యము యింటనే [illegible] పోసుకొన జాలరని, వారికిట్లు చెప్పును. "ఎంబన్ ప్రజలను గమనింపుడు. పెద్ద కుటుంబము గల వాడైనచో, పొలము కోతల కాలమున, కుమారులను సైన్యములోనికి పంపును. [illegible] మార్తెలను నగరమున పనులకు పంపును. అతనికి జబ్బు చేసినా, గురువు ఉపదేశ సమయమున సిఫారసు చేయును. ఆదివారమునాడు, దైవ ప్రార్థనానంతరము, పల్లె ప్రజలందరును అతని పొలము కోసి, వామి వేసి, గింజలను పాతరలో వేయుదురు."

ఆస్తుల తగాదాలలో, వారసత్వమును గురించి పేచీపడిన వారి కిట్లు బోధించును. "డి—వాల్ని పర్వత ప్రజలను పరికింపుడు. ఆ ప్రదేశమంతయు అరణ్యమై పోయినది. [illegible] యేండ్ల కొక్క సారైన కాకి కూతయు వినబడదు. [illegible]

( మిగత 14—వ పేజీలో )

# ఒక సంజాయిషీ

మా "భారతజ్యోతి" పత్రికలలో శ్రీ జవహరిలాలు నెహురుగారిని తీవ్రముగ విమర్శించుచున్నామని కొందఱు పాఠకులు తెలియజేసి యున్నారు. శ్రీ. జవహరిలాలుగారిని మా 'భారతజ్యోతి' పత్రికలు పొగడునట్లు మఱి యే పత్రికలు పొగడి యుండవనియు; పొగడబోవనియు: మా వ్రాతలపై పొరబాటు అభిప్రాయము కలిగిన పాఠకుల కెల్లరికిని తెలియ జేసుకొను చున్నాము. 'భారతజ్యోతి' పత్రికల ప్రతులును, సంపుటములును, శ్రీ. జవహరిలాలుగారి రాజకీయ జీవితమును తెలియజేయు చరిత్ర పుటలని నిస్సంశయముగ చెప్పగలము. భారత దేశమున కంతయు శ్రీ. జవహరిలాలుగారే ఆశాజ్యోతి యని మా విశ్వాసము. అంతటి మేధావంతుడు, దూరదృష్టి కలవాడు, అంతటి త్యాగి, అంతటి సర్వ సామర్థ్యము కలవాడు, మెత్తని హృదయము కలవాడు, అంతటి సర్వమత సమత్వము, విశ్వమానవ ప్రేమ, నీతిపరుడు, దయాళువు భారత దేశములో నింతవఱకును పుట్టలేదు. ఇక ముందు పుట్టబోడని మా విశ్వాసము. శ్రీ. జవహరిలాలుకు ఆయనయే సాటి. ఆయనకు సాటివచ్చు వారు ఈ ప్రపంచ నాయకులలో ఒక్కరు కూడ ఉండ బోరు. శ్రీ. జవహరిలాలుగారిని గుఱించి వ్రాసినప్పుడంతయు ఇవే భావములను, మా పత్రికలలో వెలిబుచ్చు చున్నాము.

ఇంతటి మహోన్నతమైన నాయకుడు, అపూర్వమైన వ్యక్తి- స్వార్థ పరుల చేతులలోను, అవినీతి పరుల చేతులలోను చిక్కి, ఖైదీగా మారిపోయి యున్నాడనియే మేము నిరంతరము చింతించు చున్నాము. రాష్ట్ర మంత్రులేమి, ఇతర అసంఖ్యాకులైన చిన్న చిన్న కాంగ్రెసు నాయకులేమి, శ్రీ. జవహరిలాలుగారి పేరుపై వ్యాపారము చేయుచున్నారే; శ్రీ. జవహరిలాలుగారి పేరును తమ స్వప్రయోజనార్థమై (ఎక్స్‌ప్లాయిటేషన్) ఉపయోగించు కొనుచున్నారే అని, బుద్ధికలిగిన పౌరులెల్లరు చింతించు చున్నారు. వారి చింతా భావములనే మేము పలుమారు వెలిబుచ్చు చున్నాము.

కాంగ్రెసు సంస్థకు పేరుతోను, శ్రీ. జవహరిలాలుగారి పేరుతోను, రాష్ట్ర మంత్రి వర్గములను సాగించుచున్న మంత్రులలో శ్రీ. జవహరిలాలుగారి యోగ్యతలోకాని, త్యాగములో కాని, మేధాసంపత్తిలోకాని, వెయ్యింటి కొక భాగమైనను సరితూగగల మంత్రి పుంగవులున్నారా యని పాఠకులు యోచింప ప్రార్థించు చున్నాము. మంత్రి పదవులను నిర్వహించుటకు వలయు యోగ్యతలు కలిగి, మంత్రి పదవులలోనికి ఎంతమంది వ్యక్తులు వచ్చియున్నారో పాఠకులు యోచింపవలెను. ఇంతకన్న మేధావంతులు, త్యాగులు, సామర్థ్యులు లేరా, దేశము గొడ్డుపోయినదా అని పాఠకులు యోచింప కోరుచున్నాము. నీతి మార్గముతోనో, అవినీతి మార్గముతోనో; యుక్తి చేతనో లేక కపటోపాయముల చేతనో, స్వతంత్రముగనో లేక ఇతరుల ప్రోద్బలముల వల్లనో పార్టీయంత్రమును చేతులలో వైచుకొని; మంత్రి వర్గములలో చేరుచున్న వారెందరు కలరో, సామర్థ్యము చేతను, స్వయము వ్యక్తిత్వము వల్లను ఎంతమంది మంత్రిపదవులలో ఈనాడు వున్నారో, అర్హత చేత ఎంతమంది వ్యక్తులు మంత్రి పదవులలో ఈ నాడు ఉన్నారో పాఠకులు, ప్రజలు విమర్శించి తెలుసు కొనవలెనని కోరుచున్నాము.

ఏనుగకును, చీమకును ఎంతటి తారతమ్యమున్నదో శ్రీ. జవహరిలాలుగారి యోగ్యతకును, ఈ మంత్రుల యోగ్యతకును అంతి తార

తమ్యమున్నది. ఇట్టి అసమర్థులు మనకు నాయకులని చెప్పుకొనుటయు, వారి ఏలుబడి క్రింద మన మున్నామని చెప్పుకొనుటయు సిగ్గుకాదా? శ్రీ. జవహరిలాలు గారి ఉన్నత భావములు కాని, వారి సంకల్పములు కాని ఆక్షేపించు వారీదేశములో నొక్కరైన నుండజాలరు. వారి సంకల్పములను కాని, అభిప్రాయములను కాని కార్యరూపమున పెట్టు దాతలు, మేధావులు, దేశసేవా తత్పరులు, కాంగ్రెసు నాయకులు లేరే అని మా విన్నపము. శ్రీ. జవహరిలాలు గారి కున్నటువంటి నిష్కళంక బుద్ధిలోను, నిష్కామ సేవలోను వెయ్యింట ఒక్క భాగము ఇతర మంత్రి పుంగవుల రక్తనాళములలో ప్రవహించు చున్నచో, ఈ దినము దేశము ఇంతటి దౌర్భాగ్య స్థితికి వచ్చునా? అన్నమో రామచంద్రా; వస్త్రమో నారాయణా యను ఘోష. దేశము నావరించునా? దేశము రామరాజ్యమైయుండదా?

శ్రీ. జవహరిలాలుగారు 1948 సంవత్సరము జూలై నెలలో చెన్నపట్టణమునకు వచ్చినపుడు కాంగ్రెసు సేవకుల సభలో ఉపన్యసించిరి. 'మంత్రులు నీతిని తప్పనంతవరకు ఎన్నితప్పులు గావించినను ప్రజలు సహించెదరు. నీతిని తప్పి ప్రవర్తించుటకు ప్రారంభించిరా, వారి నొక్కనిమిషము కూడ ప్రజలోర్చుకొనర'ని శ్రీ. జవహరిలాలుగారు చెప్పిరి. శ్రీ. జవహలాలుగారే తాను ఇండియా ప్రధాన మంత్రియై కూడ తన ప్రభుత్వము ఎన్నియో లోపములు కావించినదని బహిరంగముగ చెప్పుచున్నారు. ఆయన పరిపాలనము క్రిందనే, సామాన్య మానవుడు భరింపరాని ఆర్థిక దౌర్భాగ్య మేర్పడినది. కాని ఆయన ఋజుమార్గవర్తనుడను విశ్వాసము ప్రజలెల్లరికిని సంపూర్ణముగ నున్నది. అందువలననే ఈ దినమునకు కూడ ఆయన ప్రభుత్వమును ఓర్చుకొని యున్నారు. ఆయన నాయకత్వమును సహించుచున్నారు. ఇట్టి మహానాయకుడు, యోగ్యుడు—అసమర్థులై, స్వార్థపరులై, అయోగ్యులైన కాంగ్రెసువారి పద్మవ్యూహములో చిక్కుకొని యున్నాడు. వారి చేతులలో ఖైదీయై దేశప్రజలను కష్టముల పాలు గావించు చున్నాడను దృష్టిచేతనే మే మాయనను అప్పుడప్పుడు విమర్శించు చున్నాము. ఈ కపటనాయకుల వ్యూహములనుండి ఆయన వైతొలగవలెననే మా కోరిక.

"మా భారతజ్యోతి" పాఠకులు తమ అభిప్రాయములను ఇప్పటికైనను మార్చుకొని, మాతో ఏకీభవించెదరని ఆశించుచు, ఈ సంజాయిషీని ముగించు చున్నాము.

---

నిర్భాగ్యజీవులు ( 12_వ పేజీ తరువాత )

మరణించిన, కుమారు లదృష్టమును వెదకి కొనుచు పోవుదురు. ఆస్తి యాడు పిల్లల వశమగును. అందు చేతనైన వారికి భర్తలు దొరుకుదురు."

చట్టముపై మోజు కలిగి, స్టాంపు కాగితముల ద్వారా నాశనమగుచున్న ప్రజలు గల పల్లెలలో ఇట్లుదహరించును. "క్వైరా లోయలోని రైతులు బహు మంచి వారు. మూడు వేల మంది కలరు. అది యొక చిన్న ప్రజాస్వామికమే! అక్కడ జడ్జి లేడు — పోలీసు లేడు. అన్ని పనులు — మేయరే చేయును. ఇతింతని అతడే పన్ను విధించును. తనకు న్యాయమని తోచి నట్లు, డబ్బు తీసికొనక తగవులు తీర్చును. ప్రత్రాజ్ఞతములను ఫీజు పుచ్చుకొనక పంచి పెట్టును. అతని కందరు తల యొగ్గుదురు. ఆ సరళ హృదయములలో అతడు న్యాయమూర్తి యగుటే అందుకు కారణము."

ఉపాధ్యాయుడు లేని పల్లెలలో మఠల స్వానే ఉదహరించి, యిట్లు చెప్పును. "వారేమి చేయుదురో నీకు తెలియునా! పదిపన్నెండిండ్లు గల పల్లెలు ఉపాధ్యాయుని భరింపలేవు కదా కావున, ఆ లోయలోని యన్ని పల్లెలును చందా వైచి, పంతులును నియోగించును. అతడు పల్లె పల్లెకును పోయి, వారమో పదిరోజులో యుండి చదువు చెప్పును. ఆ యుపాధ్యాయులు సంతల యందును పాఠము చెప్పుదురు. నేను చూచినాను. వారు బుట్టటోపీలలో ధరించు కలములను బట్టి గుర్తింప బడుదురు. ఒక కలమున్నవారు చదువుపే నేర్పుదురు. రెండున్నవారు చదువు, గణితమును నేర్పుదురు. మూడు కలములున్న వారు చదువుట, గణితమును, లాటిన్ మూడింటిని నేర్పుదురు. ఈ కడపటి తరగతి వారిని పండితులుగా గౌరవింతురు. అజ్ఞానులుగా నుండుట ఎంత అవమానకరము. మీరును క్వైరా ప్రజల వలె చేయుడు."

ఇట్లు గంభీరముగను, పితృభావముతోను పలుకును. ఉదాహరణములు లేనప్పుడు, తక్కువ మాటలతో [illegible], సూటిగా విషయము తెలియ చేయును. ఏసు ప్రభువు [illegible] ఉపన్యాసమట్టిదే కదా! అదియే నచ్చజెప్పి పురికొల్పునది.

నవల

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (15)

[జానకీ, చంద్రశేఖరులు ప్రేమికులగుట, గ్రామమును విడిచి శ్యామలుని సహాయముతో తిరుపతి జేరిరి. శ్యామలుడు చంద్రశేఖరుని తల బగులగొట్టి, తానే జానకిని పెండ్లి చేసికొన ప్రయత్నించెను. జానకి వాని బారినుండి తప్పించుకొనుటకు ఒక మడుగులో దూకెను. బెస్తవానిచే రక్షింపఁబడెను. శ్యామలుడు పిచ్చిబట్టి, జానకిని వెదకులాడుచూ బోయెను. జానకి చంద్రశేఖరుని వెదకుచు, బొంబాయి జేరి, రాధాకృష్ణుని యాశ్రయమున నుండెను. అట్లుండ వ్యాపార నిమిత్తము వచ్చిన మధుసూదనుడు రాధాకృష్ణుని యింట విడిసెను. మధుసూదనుడు మొదట తన్ను పెండ్లియాడ నెంచినవాడగుట, యిప్పుడు తన సంగతి తెలియుచో ముప్పువాటిల్లు నని పారిపోయెను. జానకికి వైద్యము చేసి రక్షించిన డాక్టరు, చంద్రశేఖరుని వెదకి తెచ్చెదనని ప్రమాణము జేసినవాడగుట, బొంబాయి కనతి దూరమున గల పల్లెలో నుండెను. జానకి పురుషవేషమును ధరించి, ఆ పల్లియకు బోయెను. డాక్టరు ఆపెను చంద్రశేఖరుడని భ్రమించెను. జానకి యదార్థమును దెలిపి, డాక్టరుతో సహా మదరాసుకు బయలుదేరిరి. తరువాత ఈ ప్రకరణమున,—]

మదరాసు నగరమున సెంట్రలు స్టేషనుకు సమీపమున 'పెద్దమెట్టు' అను వీధి గలదు. అందొక గదిలో, ఒక ముదుసలి జ్వరపీడితుడై, మంచమున పరుండి బాధపడుచుండెను. అతని కుపచారములు సేయుచూ, ఒక జవ్వని చెంతఁ గూర్చొని యుండెను. తడబడు మాటలతో ఆ ముదుసలి యిట్లు పలుకసాగెను

'జానకీ! నే నీ జ్వరమునుండి బయటపడునట్లు కానుపింప లేదు. నీ మనోహరుఁడగు చంద్రశేఖరుని యన్వేషణము ముగియక మునుపే నే నసువుల బాయుదును. నీవు ధైర్యమును వీడక, ఆ పెట్టెలోఁగల పదివేల రూపాయల సొక్కముతో నీ జీవితమును గడుపుచు, చంద్రశేఖరుని చేరుకొనుము.'

జానకి... 'తాతగారూ! మీరు నిరుత్సాహపడ వలదు. ఈ వీధి యందే తిరుపతి నుండి వచ్చిన యొక డాక్టరు, స్వంతి ఆసుపత్రి పెట్టినట్లు తెలియుచున్నది. నే నాతని గొనివచ్చి, మీకు జౌషధము నిప్పించెదను.'

అని లేచి, తాతకు ముసుగు పెట్టి, గది తలుపును చేరవేసి బయలుదేరెను. జానకి ఆ వీధి కొసను గల డాక్టరు గృహమును జేరెను. తర్వాత డాక్టరుగారికిని, జానకికిని యిట్లు సంభాషణ జరిగెను:

జానకి.— 'డాక్టరుగారూ! మా తాతగారు నిండా అపాయస్థితిలో నున్నారు. మీరు వెంటనే దయచేసి ఔషధ మియ్య వలయును.'

డా.— 'ఏ వీధిలో నున్నాడు?'

జానకి— 'ఇచ్చటికి కొక ఫర్లాంగు దూరమున ఈ వీధి యందే, ఒక గదిలో నున్నాడు.'

డా.— 'నా విజిటింగు ఫీసు రు. 10/- లు; తెలుసునా?'

జానకి.— 'చిత్తము. అటులనే సమర్పించుకొందును. దయచేయుఁడు'

డాక్టరు ముందు, జానకి వెనుక నడచుచు రోగియున్న గది జేరిరి. డాక్టరు రోగిని పరిశీలించి, 'ఈతఁడు విశ్రాంతి లేక కొన్ని యేండ్లు ప్రయాటించి ఈ రోగమునకు గురియైనాడు. వెలగల మందులు వాడిననేగాని జబ్బు నయముగాదు' అనియెను. అందులకు జానకి 'ఆర్యా! ధన మెంతైనను మా తాతగా రిచ్చుటకు వెనుదీయరు. చికిత్స ప్రారంభించుడు' అనియెను. డాక్టరు రోగికి సూది నొకదానిని ప్రయోగించి, రేపుదయమున తిరిగి వచ్చెదనని వెడలిపోయెను. ఆ రాత్రి యంతయు రోగి మూల్గుచూ, నిదురబట్టనందున దొరలుచూ, అప్పుడప్పుడు 'జానకీ! నేను బ్రదుకను, నీవు జాగ్రత. పైకమును జాగ్రతతో వాడుకొనుము' అనుచుండెను. జానకి కండ్ల నీరుగార్చుచు, 'అయ్యో! దైవమా! దిక్కులేని నాకు ఈ ముదుసలిని అండగా జూపి, తుదకు అతనిని గొంపోయెదవా? నీకు నాయెడ కనికరము లేదా?' అని వాపోవుచుండెను. ఇరువురును రాత్రియంతయు నిదుర బోవక జాగరణము సల్పిరి.

తెల్లవారినది. సుమారు తొమ్మిది గంటలు కావచ్చినది. డాక్టరు కారులో వచ్చి, గదిముందు నిలిచెను. జానకి గది తలుపుదీసి, రండి యని డాక్టరు నాహ్వానించెను. డాక్టరు గది ప్రవేశించి, రోగిని పరీక్షించి, 'ఈతనిపై నా మందు పనిజేయలేదు. రోగికి అపాయస్థితి మఱింత హెచ్చినది' అని లేచెను. ఆ మాటతో జానకి హృదయము కోత వడియెను. కంట నీరు కాల్వలై పాఱజొచ్చెను. కాని ధైర్యమును

పీడక 'మహాశయా! నేను దిక్కులేని దానను. మీరు నాయందు దయయుంచి, ఎటులైనను మా తాతను బ్రతికించుడు. మీ ఖర్చు లెంతైనను నేను భరింతును' అని వచించెను. డాక్టరు 'సరే, ప్రయత్నింతును. నీ యదృష్టము' అని సూది వేసి, కారు నెక్కి, 'సాయంత్రము వచ్చి చూచెద' ననుచు వెడలి పోయెను.

తాతకు జ్వరము తగ్గుటకుమారు, క్రమేపి అధికము కాజొచ్చెను. ఆహారము చెంతకు రానీయనందున నీరసము కాజొచ్చెను. జానకి భోజన పానీయముల మాని, రోగి చెంతనే గూర్చుండి ఉపచారములు సేయుచుండెను. ఇరుగుపొరుగు వారొకరైనను తొంగిచూచువారు లేరు. ఇక జానకికి ధైర్యము చెప్పువా రెవ్వరు? అధైర్యము క్షణక్షణమునకు ఎక్కువగుచుండెను. ఇట్లుండ సాయంత్రము మఱల డాక్టరు వచ్చెను. రోగిని పరీక్షించెను. 'ఇక లాభము లేదు. ఈ రాత్రి సుమారు పండ్రెండు గంటలకు రోగి మరణించు' నని చెప్పి లేచెను. జానకి గాద్గదిక కంఠముతో నేడ్చుచు, 'మహాశయా! నాకీ పట్టణములో సలుకరించువారు లేరు. నేను దిక్కులేని దానను. మా తాత మరణించిన నన్ను దరిజేర్చువా రెవరు? కనికరించి, మంచి మందుల ప్రయోగించి బ్రతికింపుడు' అని కాళ్ళమీఁద బడి, యేడువఁజొచ్చెను. డాక్టరు హృదయము ద్రవించి, 'నా శక్తి కొలఁది ప్రయత్నింతును. రేపు ఉదయము వచ్చి పరీక్షింతును' అని ఒక సూది ప్రయోగించి వెడలిపోయెను. జానకి తాత ప్రక్కను పీడక కూర్చొని పాదముల నొత్తుచుండెను. రాత్రి సుమారు పదకొండు గంటలకు, పరుండియున్న తాత ఉవ్వెత్తున లేచి, జానకిని కన్నారా జూచి, 'బిడ్డా! నా కాయువు దీరినది. ఇక నేను బ్రతుకను. నా దొక రహస్యము గలదు. ఏమన నా కౌషధము నివ్వవచ్చు నాతఁడు నా కొమారుఁడు. అతఁడు డాక్టరీ పరీక్ష చదువుచున్నప్పుడు నాతో విరోధించి మిలిటరీకి వెళ్ళి, తిరిగివచ్చి, వైద్యము చేయుచున్నాడు. నా యీ స్థితిలో నన్నాతఁడు గుర్తించి యుండఁడు. నీవు వెళ్ళి, ఆతని దోడ్కొని రమ్ము' అని బోరగిలబడి మూలుగఁ జొచ్చెను. జానకి ఆ మాటలు విని, ఒక్కపరుగున డాక్టరింటికి పరుగిడి, 'డాక్టరుగారూ! డాక్టరుగారూ!' అని కేక వేసెను. నిదురించుచున్న డాక్టరు మేల్కొని, 'ఎవరక్కడ' అని యరచెను. 'డాక్టరుగారూ! మీ తండ్రిగారు ప్రాణాపాయ స్థితిలో నున్నారు. తక్షణము రండి' అని యరచెను. డాక్టరు ఉన్నపాటున లేచి, జానకిని సమీపించి, 'ఎవరు' అనియెను. జానకి 'జబ్బులో నున్న మా తాతగారు మీ తండ్రిగారట. మిమ్ము గుర్తించినాడు. మీ రాయనతో విరోధించి మిలిటరీకి పోయినారట' అని చెప్పెను. డాక్టరు అటులనా అని పరుగెత్తును. బోరగిల బడిన తండ్రిని లేవనెత్తి, గుర్తించి, 'తండ్రీ! తుదకు మీ కీ స్థితి వచ్చినదా?' అని విలపింపఁ జొచ్చెను. తాతగారాతని శిరస్సును చేతితో నిమురుచు, 'నాయనా! నీ మ్రొక్కు చెల్లించుకొంటివి. నీ యిష్టానుసారము మిలిటరీకి పోయి తిరిగి వచ్చితివి. ఇకనైనా ఒక శీలవతిని పెండ్లాడి సుఖింపుము. ఈమె దిక్కులేనిది. ఈమె నాదరింపుము' అని ఒక దీర్ఘ నిశ్వాసమును విడిచి, ప్రాణములు విడిచెను. డాక్టరు కొంత కాలము దుఃఖించి, జానకి నోదార్చి, ఉదయమగుటతోడనే తండ్రికి దహనసంస్కారాది క్రియలు గావించెను. జానకిని తన గృహమునకు దోడ్కొని పోయెను.

కొన్ని దినములకు డాక్టరు, జానకులు దుఃఖోపశమనమును బొందిరి. డాక్టరు జానకి యెడ క్రమక్రమముగా ప్రేమను వృద్ధిజేసికొని, ఒకనాఁడు "జానకీ! మా తండ్రి మరణశయ్యనుండి, ఒక శీలవతిని పెండ్లియాడుమని ఆదేశించెను. నా దృక్కులకు నీవయే పరమ శీలవతివని బోధపడినది. నీ యభిమతము దెలిపెదవా?"

జానకి.— 'సోదరా! మీరు నాకు తోబుట్టువుతో సమానులు. మీ రా తలంపు వీడి, నన్ను దయతోఁ జూడుడు.'

డా.— 'జానకీ! నిన్ను మనసారా ప్రేమించితిని. నిన్ను దప్ప అన్యుల వివాహమాడను. నీవు దీర్ఘముగా నాలోచించుము' అని లేచిపోయెను. జానకి ఇట్టి ఇక్కట్టుల మున్నెన్నిటినో అనుభవించిన దగుట, ధైర్యముతో 'కానిమ్ము, చూత' మని నిశ్చయించి, ఎప్పటివోలె గృహకృత్యముల నెరవేర్చుచుండెను. డాక్టరు క్రొత్తగా కాపురము పెట్టినవాడగుట, నెలసరి ఆదాయము ఖర్చులకు చాలకుండెను. కొన్ని దినముల యనంతరము తిరుపతి నుండి ఒక నూతనవ్యక్తి వచ్చి, ఆఫీసుగదిలో నిట్లు మాట్లాడుచుండెను. జానకి ఈ సంభాషణను చాటున నుండి వినుచుండెను.

డా.— 'ఏమి రామయ్యా! ఇన్ని దినముల కొచ్చితివి.'

రామ.— 'రుక్మిణమ్మగారు మిమ్ముల దర్శించి, ఎప్పుడు వచ్చి పిలుచుకొని పోదురో తెలిసికొని రమ్మని పంపినదండీ.'

డా.— 'ఇక్కడ ఎక్కువ ఆదాయము గాలేదు. ఇకను కొన్ని దినము లచ్చటనే యుండమని చెప్పు.'

రామ.— మన యింటిలో నున్న అమ్మగా రెవరండీ!

డా.— 'ఆమె మన చెలికత్తె. దిక్కులేక వచ్చి పని కొప్పుకొన్నది. చాలా ఉత్తమురాలు.'

రామ.— 'అమ్మగారి అన్నయ్య శ్యామలారావుగారి పిచ్చి ఎట్లున్నది' అని అడుగగా, డాక్టరు 'చాలవరకు నయమైనది. వారము దినములలో రాగలడని చెప్పు' మని, అతని సంపించెను. ఈ సంభాషణ వినుచుండిన జానకికి డాక్టరు గృహము ఒక నరకకూపముగ గోచరించెను. సాధ్యమైనంత త్వరలో పారిపోవ నిశ్చయించెను. (15 వ ప్రకరణము సమాప్తము)

---

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah

REGISTERED No. M. 5285.

POLITICAL WEEKLY.

[illegible]

SINGLE COPY As. 2.

EDITOR: [illegible], B.A.

Vol. IV. | WEDNESDAY, NOVEMBER 7, 1951. | No. 35.

# WILL THE MINISTERS RESIGN?

(By The Editor.)

HOW CAN THERE BE FAIR AND FREE ELECTIONS, so long as the Ministers, who also happen to be contesting candidates, continue in office, till the last date after the elections are over and till the formation of new ministries? It is an erroneous impression to think and feel that any individual is indispensable in this world and much more so with a perpetual Governmental machinery. Ministers may come and Ministers may go, but the Government's work will not stop on their account. With all their professions that they will not allow their official positions as Ministers to influence the voters, human nature being what it is, it is impossible to believe that the Ministers who will be equally anxious to be successful in the contest and strengthen their party, can remain unmoved without making the voters feel that they are super-men better than their rival candidates, through their official paraphernalia. It will be a sight for the gods to see the Ministers surrounded by the official hierarchy and the Police force, saluting them in attention in uniform. It is indeed not possible to draw a line between official duties and private duties, especially during elections and the Ministers feel loath to stand before the public on public platforms and meet the electorate like ordinary citizens or candidates who are not in an official position.

Perhaps security precautions may be necessary only in the case of Pandit Jawaharlal Nehru, the Supreme Leader of the nation. Even the worst enemy, who does not see eye to eye with him in politics in his policies, be he a fanatical Hindu, a Hindu Sabha Member, a R S S member or a member of any other Communal organisation, cannot conceive even in his dreams of harming this darling of the nation. He can travel from one end of the country to the other, without the so called police protection. When this is the case with the Prime Minister of India, it is sheer mockery to say that other Ministers of the Union Government and the Ministers for the States do require security precautions. They are putting too much premium on their lives. No one excepting their henchmen and officials will think of or look at the State Ministers. Excepting to create an impression in the minds of the electorate that they occupy a status superior to their rival candidates, there is no need for the Police force to surround the Ministers either in uniform or in mufti on the pretext of security precautions.

When men being in office as Ministers, contest the elections, naturally the electorate will hesitate to put some straight questions to them and demand a brief summary of their public record, because of the fear that the Ministers who have free command over the Law and order personnel could bring down all their wrath upon the voter's heads and smash them or indirectly make them feel their wrath, so much so that the enlightened citizens do hesitate to question the propriety of their standing as candidates in the elections. This is a tremendous and undue advantage which the Ministers in office have over their rival candidates.

If the Ministers are sincerely anxious that there should be only free and fair elections, and that they are anxious to demonstrate that they can meet any challenge at the polls, on equal footing, they should not hesitate to resign at least before actually filing their nominations.

Thousands of monarchs who fought battles and established empires and ruled large stretches of land, all the world over have faded away into oblivion and thousands of monarchs came and occupied the same seats and faded away in their

turn. Still the world or the Governments have not stopped even for a day. Either for good or bad, mostly for good, there are no Ministers in the Punjab State. The heavens have not fallen on the earth The administration of the State has not come to a standstill. The Governor, under the orders of the President of the Union, has resumed the administration and been running it on more efficient lines and more economically than under the administration of the so-called power-hunting Ministers.

It is within the memory of every one that during the war time, when Congress Ministers resigned in several provinces, in 1938, the Governors resumed the administration and ran much more efficiently with four Advisers and handed over good reserves to their successors—the Congress Ministers. So it is an insult to the intellegence of a common man to say that Ministers are indespensable and that they should be hanging on till they again get into Ministries or are turned down. There are good and very efficient Secretaries and Senior Officers, for example, in our own State, like Messrs. S. K. Chettur, V. S Hejmadi, S. Ranganathan etc., whose integrity, character and capacity are beyond question and who can form an efficient team as Advisers to the Governors, to carry on the day-to-day administration of the State, till the new ministries are formed, after the elections. The Secretaries can inspire confidence among all sections of the people and parties that they can have impartial elections, fair and free elections.

So, unmindful of the administration of the States, if our Ministers volunteer to resign before November 21, (the day for filing nominations) that will surely enhance their prestige in the eyes of the public. It will demonstrate their spirit of sacrifice and the real strength behind them. It also gives an idea to the public that they, as Ministers, are equally anxious for fair and free elections. Though there is no provision under the Constitution for the President to dissolve the ministries and hand over the administration of the States to the Governors, on the eve of elections, nothing prevents the Ministers, known for their self-sacrifice, to resign voluntarily on the eve of elections and set up a healthy and good convention in the country for the future generations to follow. Will the Ministers rise to the occasion and resign?

---

"However much we might sympathise with the hard lot of the common man, the fact remains that we live in two different worlds. By WE, I mean, those who are somewhat more fortunately circumstanced. We live in a different world from the world of the common man, worker or peasant. We sympathise with him and we help him, but we do not understand him."

—SHRI JAWAHARLAL NEHRU, New Delhi, October 27, 1951.

* * * * *

"I think the Library (Delhi Public Library inaugurated by him on October 27,) will give the people, who do not have the opportunity to learn further things or educate themselves, such an opportunity to develop themselves. I hope the authorities will not debar poor people from coming in because of their dirty clothes or lack of general knowledge about things. The Library is meant for such people alone."

—SHRI JAWAHARLAL NEHRU, New Delhi, October 27, 1951.

# THE ENSUING ELECTIONS.

## GREAT EXPERIMENT IN DEMOCRACY.

(Continued from previous issue).

The following table gives the particulars of local Legislatures in respect of each State —

LEGISLATIVE ASSEMBLIES.

| PART A STATES | Total | Scheduled Castes | Scheduled Tribes | Legislative Councils |
|---|---|---|---|---|
| Assam | 108 | 5 | 9 | — |
| Bihar | 330 | 44 | 35 | 72 |
| Bombay | 315 | 27 | 29 | 72 |
| Madhya Pradesh | 232 | 32 | 23 | --- |
| Madras | 375 | 62 | 1 | 72 |
| Orissa | 140 | 21 | 28 | |
| Punjab | 126 | 21 | -- | 40 |
| U. P. | 430 | 83 | | 72 |
| West Bengal | 238 | 40 | 12 | 51 |
| | 2291 | 335 | 140 | 379 |

| PART B STATES | Total | Scheduled Castes | Scheduled Tribes | Legislative Councils |
|---|---|---|---|---|
| Hyderabad | 175 | 31 | 2 | - |
| Jammu and Kashmir | --- | | | |
| Madhya Bharat | 99 | 17 | 12 | . |
| Mysore | 99 | 19 | | 40 |
| Pepsu | 60 | 10 | -- | — |
| Rajasthan | 160 | 16 | 5 | -- |
| Saurashtra | 60 | 1 | 1 | -- |
| Travancore-Cochin | 108 | 11 | -- | -- |
| | 761 | 108 | 20 | 40 |

| PART C STATES | Total | Scheduled Castes | Scheduled Tribes |
|---|---|---|---|
| Ajmere | 30 | 6 | |
| Bhopal | 30 | 5 | 2 |
| Bilaspur | | - | |
| Coorg | 24 | 3 | 3 |
| Delhi | 48 | 6 | — |
| Himachal Pradesh | 36 | 8 | |
| Kutch, Manipur, Tripura | These three States will elect 30 members each for the electoral colleges to be formed | | |
| Vindhya Pradesh | 60 | 6 | 6 |
| | 228 | 34 | 11 |

After all these legislatures are elected, an electoral college formed by all members of the Central Parliament and the State Legislative Assemblies will choose the new President of the Republic.

DELIMITATOIN.

The complexity and vastness of the endeavour necessary to successfully arrange and bring the elections to completion will now be evident. Besides the enrolment of an unbelievably large electorate, a staggering number of constituencies, 2,138 single-member and 666 multi-member, had to be delimited. This had to be done on the basis of the constitutional provisions regarding maximum and minimum number of voters and to the satisfaction of the Parliament, at the same time avoiding gerrymandering or creation of pocket-boroughs and with due regard to administrative feasibility. An interesting point in delimitation is that the number of members of the local Legislative Assembly of a State has been made an exact multiple of the number of members from that State to the House of the People.

Laws and rules under them had to be drafted and passed by Parliament to provide for orderly procedure keeping in regard every aspect from electoral rolls to electoral returns and from qualifications to election offences.

POLLING PROGRAMME

Polling programme for the whole country extending from the Himalayas to Cape Camorin had to be planned keeping in view weather changes like snow and rain and agricultural operations and administrative effectiveness. Special measures had to be undertaken for keeping law and order, for providing postal and other conveniences to the candidates and parties and so on. Officials had to be trained in the mechanics of polling and electoral laws and rules and directed to keep themselves impartial in their election work so as to ensure free and fair elections.

When the country has gone through the colossal election programme without a hitch, the success of this biggest experiment in democracy, it would be found, was no less due to its administrators than to its law-abiding citizens and sound political parties. The responsibility for conducting the elections falls mainly on the officials of State Governments. The superintendence, direction and control of the general elections have, however, been vested by the Constitution in the Election Commission appointed by the President.

# ELECTION FORECASTS— VOTE FOR DESERVING CANDIDATES.

(BY SHRI S. VENKATADRI, M.A.)

Apart from miscalculations of the Political Parties and the candidates based on their own wishful thinking regarding the outcome of the elections, newspapers try to gauge public opinion and give an indication as to the general trend which the majority of voters seem to favour. By what are known as "Gallop polls" and by the results of the bye-elections, the chances of the different political parties at the general elections are surmised But newspapers being also definite party organs or strong supporters of any one of the political parties, they not only publish the results of their observations and close study regarding the chances of the parties at the elections but also directly and indirectly carry on propaganda for the party each newspaper favours. In most of the propaganda truth has been kept out of bounds. If one should read a newspaper supporting the Conservative Party, he would be made to believe that the Conservatives would gain about 50% more seats and that Labour defeat is certain as the electorates are deeply dissatisfied with their bungling in the Middle East. The reader is also unconsciously led to believe what his newspaper has been pouring forth day after day. Therefore election forecasts are usually propaganda stunts than real assessment of the trend of public opinion in the country.

It used to be thought that the Press, especially the more responsible and reliable newspapers are, through their correspondents, able to keep their fingers on the pulse of the nation and are in a position to gauge public opinion fairly accurately. But Truman's election as President upsetting the forecasts of the more powerful newspapers in America has been a great landmark in discrediting the hollow claims of the Press to be the self-appointed sentinels guarding the interests of the public and the mouth piece of the feelings and urges of the people. The newspapers, by publishing the speeches and statements of the Politicians and of important public men representing various interests and the attractive advertisements of those that are interested in pushing the sales of their wares, have gradually become more of propaganda machinery than disinterested purveyors of factual news. In most of the newspapers and especially in the periodicals and dailies in regional languages in our contry, the views and the language are usually what they consider would increase the circulation in the same way as the Cinema producers chief concern is popular attraction and larger collections at the Box Office.

The Municipal elections in Delhi seem to have given great hope to the Congress that what happened at the metropolis is a true indication of the trend of public opinion in the whole country. Many who thought just a month or two before that there would not be the least chance if they stood on Congress ticket and so were planning to join the K. M. P. party or to stand as Independent Candidates are now feverishly running about to influence the Provincial Election Boards and the Central Election Board of the Congress. The forecasts are that in the Punjab and Bengal the Congress Party may not have a majority and that in U. P., Madhya Pradesh, Bihar and in parts of Bombay the electoral alliance between the Socialists and the K M P party may defeat the Congress May the people consider the relative claims of the candidates and vote for the deserving one without being misled by the forecasts and propaganda stunts

"The chief mission of this generation in India, as I know to my cost to-day, seems to be to seek elections to legislatures and get some kind of nomination for them to become candidates. All this is very distressing. It is a legitimate mission, no doubt, but taking it all in all, the picture that I see, not in this country only, is a picture of a generation that somehow does not keep pace with the stirring events that the world is witnessing."

—SHRI JAWAHARLAL NEHRU, New Delhi, October 27, 1951.

# SERVICES USED FOR ELECTION PURPOSES.

HARDLY a month ago, Chief Minister, Kumaraswami Raja very pompously summoned a conference of District Collectors of the Madras State and sermonized to them on the need to observe *strict neutrality* in the General Elections. He told them that they would be failing in their duty, by God and by their country if they did not keep aloof from election meetings and the like. And the papers too obligingly published liberally his speech at that conference. Then followed Prime Minister Shri Jawaharlal's directive to the State Governments to see to it that officials did not get mixed up in the election campaigns on behalf of the Congress or any political party.

Several officials in the districts evidently took these instructions at their face value. They stayed at a safe distance from Ministers going on election-tours, and did not organise these tours in their respective districts, fearing, and rightly so, that it would constitute an immoral interference in the elections. They went to the Ministers only when they were summoned on official business, which has annoyed the Ministers, who are accustomed to being surrounded and fawned upon by officials all the time. So they have sent a circular marked "top secret" to all the district officials concerned, drawing their attention to the horrible offence of impartiality they were committing.

Following is the text of the "top secret" note.

"Now that the political parties in this State have started their election campaigns in connection with the forthcoming general elections to the State Legislature and the Parliament, the Government desire to clarify the position of Government servants in relation to tours of Ministers during the period of election campaign. This period has already commenced *and will continue until the results of these elections have been declared.*"

"It has to be remembered that till they (the Ministers) demit the office, Ministers will be in charge of public affairs and must continue to run the administration and that even when they go out on tour chiefly for election purposes, they must continue to discharge their responsibilities as Ministers.......It follows that District officials concerned must continue to make all normal arrangements to enable the Ministers to carry out their responsibilities as Ministers. The officials must not, however, organise election meetings or be present during these meetings except for discharging their responsibilities for maintaining law and order.. . and for affording normal protection to Ministers. *Even when Ministers are in any place, chiefly or only in connection with their election campaigns, District officers must arrange for normal courtesies and security.*"

"In practice, there will be no difficulty in deciding whether any particular meeting is an election meeting or not, *the Minister concerned will himself settle any doubt on this point* and see that officials are not placed in an embarrassing position on account of their presence at any such meetings."

In other words, officials are clearly told that during the entire election period, officials must be at the beck and call of the Ministers even if the purpose of their visits is purely Congress electioneering. As for the Minister himself settling any doubt as to which are and which are not election meetings, it is tantamount to allowing the accused to play the judge as well. Nobody who knows anything about our Ministers can swallow that wholesale. It is plain from the above communication that the Ministers intend to make use of officials for election purposes and of course, the officials will be protected from trouble arising on that account, as a close study of the last sentence reveals. Even when the Congress selection committees, in which there were Ministers, toured the State, people desiring to protest against the choice of particular candidates had no chance of doing so because of the forbidding police bandobust behind which the Committee members carried on their work. But all this seems but a sample of what is yet to come. VIGIL.

---

"We forget that we have got to gain by an emotional approach an appreciation of the other person who is working in the field, factory or whatever it might be. Unless we do that, we can never really get good work. We can never get that full-blooded co-operation that is necessary in a great undertaking."

SHRI JAWAHARLAL NEHRU, New Delhi, October 27, 1951

# THE ALL INDIA EDUCATIONAL CONFERENCE.

( CONTRIBUTED ).

The All-India Educational Conference which is meeting in Bombay is expected to give a lead on many vital and intricate problems facing the country in the field of education Shri B G. Kher, the Premier of Bombay, while inaugurating the conference, laid stress on the aims and ideals of education under modern conditions and said that while formerly it was held that education was a preparation for life, it is now-a-days recognised as active living facing the realities of life and not as a training, under artificial and controlled conditions. Dr. Kher emphasised how the screen, the Press, exhibitions, museums, the playground and the various activities are all contributing to the education of the people along with schools, colleges, polytechnics, research laboratories, scientific and literary associations In fact, under modern conditions, apart from learning the three R's and certain undigested facts, which though intimately related to life are not useful, in view of their being treated as water-tight compartments, most of the education of the citizen is through other agencies. Whatever high ideals the poor teacher might try to instil into the young minds, are easily evaporated when the young see that society honours the black-marketeer and the hoarder and that with all the fine sentiments and noble ideals, the teacher is starved and is neglected by society and Government. Schools and colleges, by themselves can achieve very little unless the other agencies like the Press, the cinema and the radio and the life and ideals of the community in general are calculated to improve the moral tone and the co-operative spirit.

Acharya Narendra Dev, Vice-Chancellor of Lucknow University, in is presidential address covered many of the urgent problems in the field of education. His observation that the study of one of the South Indian languages should be made compulsory in the Secondary and the University course in Northern India, in as much as Hindi is the national language and that there should be a common script for all Indian languages is well worth considering by the authorities as linguistic rivalries might diminish and the antipathy of the South Indians towards the compulsory study of Hindi might be overcome In his concluding remarks, Acharya Narendra Dev made an impassioned plea for the improvement of the teachers' lot and complained that in many of the plans for national reconstruction, the role of the teacher and the necessity of improving his status have been completely ignored. He warned the educationists and the authorities of the danger in the neglect of making Hindi the medium of instruction in the whole country replacing English.

A number of Sectional Conferences were held during the five-day session of the All-India Conference and problems like pre-primary education, social education, moral and religious education, technical education, adult education etc, were discussed.

It would be very useful if the Central Government could supply the report of the conference to all educational institutions.



IN MEMORY OF GANDHIJI

Can you please [illegible] all [illegible] 5 minutes every day at 5 p.m. ([illegible] Gandhiji's prayer time) and [illegible]

LETTERS TO EDITOR:

## Andhra Province—
## Madras City—Rayalaseema.

SIR,

Every political party in Madras State seems to favour the formation of provinces on linguistic basis. None of the parties questions the demand for the formation of an Andhra province The question is complicated by the protagonists of the Andhra province presenting different forms for acceptance. The Prime Minister rightly demanded facts and not fasts. Can the much talked of Satyagraha movement led by the great Swami force the Government to form the province?

The demands for the formation of the Andhra Province by different groups are roughly as follows - (1) That the area now under the present A. P. C. C. should constitute the proposed Andhra Province with Madras as the Capital. (2) That the Andhras should give up their claim to the city of Madras as indicated by the J. V. P. report and supported by the A. P. C. C. and find their own capital. (3) That Madras should be made the joint capital of both the Andhras and Tamils. (4) That the Rayalaseema and Nellore districts should not be included in the proposed Andhra province till such time as the economic condition of Rayalaseema is raised to that of the coastal Andhra districts (This view is expressed by the Rayalaseema Mahasabha and the Prime Minister referring to their agitation has stated that the objections from the people in the Rayalaseema and the Nellore district could not be brushed aside). (5) That Madras should be made a Chief Commissioner's Province, administered by the Centre that it might continue to be a cosmopolitan city. (6) That Madras with the adjoining districts of Chengleput, Nellore, Chittoor and North Arcot be formed into a Chief Commissioner's province or a separate province with Madras as its capital, the Andhras and the Tamils finding their own capital. (7) That Visala Andhra be formed including the Telangana districts in the Hyderabad State with Hyderabad as the Capital

Opinion does not seem to be divided to have the disputed areas in the bi-lingual districts to the decision of the Boundary commission.

The formation of a separate province has become an obsession with the Andhras in the coastal districts With the people of Rayalaseema and Nellore districts, it is a matter of supreme indifference and opposition

There is no means to assess public opinion The political parties are not coming forward to fight it as an election issue

Madras city seems to be the bone of contention The Andhras in their eagerness to get the province at all costs, lost much ground in their claim for the city. The J. V. P. report wanted the Andhras to give up their claim and the A. P. C. C. endorsed that view. Some Andhras still want the City to be a joint capital if not a Chief Commissioner's province. The people in Rayalaseema do not want to join the Andhra Province and much less, if the city is conceded to the Tamils. The Tamil speaking people in the border areas want to join the Tamil province and the Canarese speaking people want to join the Karnataka province. The opinions of the people can be best ascertained by a plebiscite.

From the point of view of administrative convenience, the people of Rayalaseema and Nellore would prefer to be with Madras, be it with the proposed Andhra province or the residuary Madras Province Language is the only advantage claimed for the linguistic provinces on the plea that the people transact their business in their language, both in public and private business When in 1911 some of the Taluks in the old North Arcot district were transformed into the newly formed Chittoor district and Telugu was made the regional language, those who were transacting business in Tamil switched on to Telugu The people in the Rayalaseema and Nellore have developed a cosmopolitan outlook and would not care to sacrifice their convenience merely to please their sentiments that they are to have a Province, where Telugu will be the medium of expression. No district or State can afford to live by one language only For inter district and inter state purposes, a second common language like English, as at present, and Hindi as the national language, will be essential. Administrative convenience like nearness to the capital and easy facilities for trade and commerce will be the things that will find favour with the people. Appeal to sentiment and passion might carry the people off their feet for the time being, but in their cooler moments they will realise what is in their interest and what is not

Swami Seetharam may fret and fume if the Andhra province is not formed and may even start the much talked of Satyagraha movement to force the hands of the Government to take early steps for the purpose

If Madras is not made the capital of the proposed Andhra state the people of Rayalaseema and Nellore should declare that they will continue to be a part of the residuary Madras State.

G. K. SWAMI B.A.,

Chittoor

# MAKING A BETTER WORLD FOR CHILDREN.

Of all those who have suffered from the fury of war, the children of the world are the most tragic They are so young, so bewildered, so helpless Hungry, cold, deprived in many cases of parents and homes, sometimes maimed and sick, they are desperately in need of help That help, in the form of supplies and services, is coming from the Governments of some 50 countries and from the voluntary contributions of many peoples through the United Nations International Children's Emergency Fund—UNICEF for short

A substantial part of the fund's resources so far have come from the United States. But other countries, such as Iceland, New Zealand, Australia and Canada in proportion to their populations, have given even more

With millions of children needing help every expenditure by the fund has to be considered with the utmost care. "How can the most good be done for the least money?" is the question that always has to be asked.

The first answer was to buy dried skim milk, the cheapest high-protein food available. By the spring of 1951 the fund had shipped 340,000,000 pounds, or enough to make more than 5,000,000,000 cups of milk. This milk was being provided for 8,000,000 children each day. Cheese is bought by the fund in 5,000,000 pound lots, but even so there is never more than a nibble or two a day for all the many children receiving it.

Through UNICEF, cotton has been made into diapers for more than 1,000,000 babies and it has been used for dresses, underwear and stockings for several million children. Codliver oil, blankets, penicillin and streptomycin, X-rays and other equipment, sewing machines, scales and thermometers have also gone to many areas throughout the world. Seventeen hundred shipments have been made from the United States alone.

Millions of children are still in desperate need. This work must go on. First, because it is inhuman to let children suffer and die or live in untold misery when the rest of the world can help them if it will. Second, because the United Nations, through UNICEF, is building a better world by caring for these boys and girls who will be the men and women of tomorrow. Only if the world shows them that someone cares and will help can they be expected to grow up with any hope of kindness in their hearts.

Citizens of all nations should try to see that, no matter what the drain on their funds may be, their country continues to contribute generously to the United Nations International Children's Emergency Fund to help the children of the world.

—(*Parents Magazine*).



Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI" PRINTING & PUBLISHING SYNDICATE.
Printer: K. R. JOSHEE. :: Publisher · V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE: 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah.

REGISTERED No. M. 5265.

# భారత వాణి

[illegible] కృష్ణ, బి.ఏ.

## విషయానుక్రమణిక

నవంబరు 14, 1951.


సంపుటము — 4.

సంచిక — 36.

✳

ప్రతి బుధవారము.

ప్రకటింపబడును.

✳

సంవత్సర చందా రు 9—0—0

విడి ప్రతి ... రు 0—3—0

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 36. | శ్రీ ఖరనామ సంవత్సర కార్తీక బ. ౧, నవంబరు, 14, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## రాజీనామా ఇవ్వవలెను.

ఎన్నికలకుముందు మంత్రులు రాజీనామాల నివ్వవలెనను నిబంధనలు ఇండియా రాజ్యాంగ చట్టములో లేవు. కాని మన కాంగ్రెసు మంత్రులు, మంత్రి పదవులలోనే యుండి ఎన్నికలలో పోటీ చేయుచో, వారి ప్రత్యర్థులకును, ఇతర రాజకీయ పార్టీలవారికిని ప్రబలమైన నిరోధక శక్తిగా పరిణమించెదరని ప్రజలెల్లరు తలచుచున్నారు. ప్రజలలో నిట్టి భావములు వ్యాపించుటకు తగుమైన కారణములు లేకుండవచ్చును. అధికారపదవులను దుర్వినియోగ పఱచిన సాదృశ్యములను చూపలేక పోవచ్చును. కాని కాంగ్రెసు మంత్రులపై ప్రజలకు విశ్వాసము తగ్గినదను విషయములో ఎవ్వరికిని ఎట్టి అభిప్రాయ భేదము ఉండజాలదు. "నిజముగ ప్రజలకు కాంగ్రెసు మంత్రివర్గములపై విశ్వాసము లేనిచో, రాబోవు ఎన్నికలలో మేము జయింతుమో లేదో చూడు" డని పోటీకి నిలిచిన కాంగ్రెసు మంత్రులు సవాలు చేయవచ్చును. అట్టి సవాలుకు నైతిక బలముండబోదు. మంత్రులు, తమ అధికార పదవులకు రాజీనామాల నొసగి, సామాన్య వ్యక్తివలె ఎన్నికలలో పోటీచేసి, జయించినచో, అప్పుడు వారిపై ప్రజలకు విశ్వాస మున్నదని చెప్పిన నమ్ముటకవకాశ ముండును. అప్పుడు వారిశక్తి, ప్రజలపైగల పలుకుబడి ఎక్కువగును. అటులకాక, మంత్రి పదవులలోనే యుండి, సర్వ అధికారములను తమ చేతిలోనే ఉంచుకొని, ఎన్నికలలో పోటీచేసి, గెలిచి చూపించెదమని సవాలు చేసినచో, ఆ సవాలులో అర్థమేలేదు.

ఇండియా రాజ్యాంగ చట్టములో ఎన్నికలకు ముందు మంత్రులు రాజీనామా ఇవ్వవలెనను నిర్బంధము లేనిదానికి తో[illegible]గ, బ్రిటను, అమెరికా దేశముల పార్లమెంటరీ సాంప్రదాయములనుకూడ సాకుగా గైకొని, తాము రాజీనామాల నివ్వకుండుటను, మన కాంగ్రెసు మంత్రులు సమర్థించుకొనవచ్చును. ఈ సమర్థనలోకూడ అర్థములేదు. బలములేదు. పాశ్చాత్య దేశములలోని మంత్రుల నైతిక దృక్పథముతోను, సాంప్రదాయములతోను, మన కాంగ్రెసు మంత్రుల నైతిక దృక్పథమును, సాంప్రదాయములను పోల్చి చూచినచో, ఏనుగకును, చీమకును ఉన్నంత వ్యత్యాస మున్నది. ఈ విషయములో మన కాంగ్రెసు మంత్రులకు తెట్టవు. పాశ్చాత్య దేశములలోని మంత్రులకు ప్రజాసేవయే ముఖ్యము. సిద్ధాంతములే ముఖ్యము. మంత్రి పదవులంత ముఖ్యమైనవి కావు. మన వారికి ప్రజాసేవకన్నను, యోగ్యతకన్నను, అధికార పదవులే ముఖ్యము. దేశమునకు స్వాతంత్ర్యము లభించినప్పటినుండియు, కాంగ్రెసు మంత్రుల చరిత్రలన్నియు ఇట్టి గాథలతోనే నిండియున్నవి.

ఆయుధ నిర్మాణముల నెక్కువ చేయవలెయునని, ప్రజల కుచితముగ ఒసగ బడుచుండిన సులోచనముల పైనను, దంతముల పైనను పెబ

నపుడు, —ఆరోగ్యశాఖా మంత్రి ఆక్షేపించుచు తన మంత్రి పదవికి రాజీనామా యొసగెను. ఇట్టిది ఒక్క సాదృశ్యము మన కాంగ్రెసు మంత్రులలో ఒక్కరైన చూపగలరా? ఇట్టి త్యాగమున కొడ గట్టుకొనగలరా?

"మేము అధికారమును దుర్వినియోగపఱచము. నీతి మార్గముగ సామాన్య వ్యక్తులవలె ఎన్నికల ప్రచారము సాగించెదము. సామాన్య ప్రజలవలెనే మా నియోజక వర్గములో పోటీ చేసెద"మని నూటికి నూరు అభయ వాక్యాలు మన మంత్రి పుంగవులు చెప్పినను, వానిని నమ్మె పరిస్థితులలో ప్రజలు లేరు. ఇతర రాజకీయ పార్టీలులేవు. శ్రీ. జవహరిలాలు నెహ్రూగారొక్కరు ఆ విధముగ ప్రవర్తించెదరని మాత్రమే ప్రజలెల్ల నమ్మగలరు. వారి విషయము తప్ప, ఇతర ఏ మంత్రుల విషయములోను ప్రజలు నమ్మతగిన వాతావర్ణము ఈ దేశములో కనబడుటలేదు. కనుక ప్రధాన మంత్రి సహోదాతో కాంగ్రెసు మంత్రులను, ఎన్నికలకు ముందు రాజీనామాల నివ్వమని కోరజాలకున్నను, కాంగ్రెసు అధ్యక్షులహోదాతో శ్రీ. జవహరిలాలుగారు మంత్రులు రాజీనామాల నివ్వవలెనని కోరుటలో తప్పులేదు. అప్పుడు 'కాంగ్రెసు మంత్రుల' మని చాటుచున్న వారిలో ఎంతమంది విధేయత చూపగలరో బయటపడును. ఎన్ని చేవలు కాంగ్రెసు మంత్రి వర్గములో నున్నవను విషయము కూడ, శ్రీ. జవహరిలాలుగారికి తెలియ నచ్చును. ఒకవేళ ఆయన మాటల యందు గౌరవ ముంచి, మంత్రులెల్లరు నామినేషనులు దాఖలు చేయుటకు ముందు రాజీనామాల నొసగిరా, అది కాంగ్రెసు సంస్థ ప్రతిభను ఎక్కువ చేయును. ఎన్నికలలో కాంగ్రెసు పార్టీకి బలముకూడ చేకూరును.

శ్రీ. జవహరిలాలు నెహ్రూగారి నుండి సలహా వచ్చువఱకును వివిధరాష్ట్రములలో నుండు కాంగ్రెసు మంత్రులెల్లను తమ మంత్రి పదవులకు తోంపలవలె కఱచుకొని యుండక, స్వారంభముగ వారే రాజీనామాల నొసగి, తమ త్యాగబుద్ధిని, స్వశక్తిని, ప్రకటింతురని నాకాంక్షించుచున్నాము.

——)•*•(——

# రాయలసీమ జిల్లాలలో ఆహార ధాన్యము రవాణా.

[illegible]

కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలలో ఒక్క బియ్యము, గోధుమలపైన తప్ప, మిగతా ఆహారధాన్యమైన జొన్నలు, రాగులు, సజ్జలు, కొర్రలు, మొక్కజొన్నలు, పెసలు, సెనగలు, కందులు, అలసందలు మొదలగువానిపై, ప్రభుత్వమువారి అన్ని విధములైన నిర్బంధములను ఈ నెల 4 వ తేదీ నుండి తొలగించి యున్నారు. ఒక జిల్లానుండి మఱియొక జిల్లాకు ఈ ధాన్యమును రవాణా చేసుకొనుటకు ఎట్టి అభ్యంతరమును లేదు. శేషనింగు అమలులో యుండే పట్టణములలో కూడ ఈ ధాన్యమును ఎవరైనను తెప్పించుకొని (దిగుమతి చేసుకొని) బహిరంగ మార్కెటులలో అమ్ముకొనవచ్చును. [illegible]లలో కాని లేక రైళ్ళలో కాని లేక బండ్లలో కాని ఒక జిల్లానుండి మఱియొక జిల్లాకు దిగుమతి చేసుకొనవచ్చును. బహిరంగముగా అమ్ముకొనవచ్చును. పోలీసువారుకాని, ఎక్సైజు [illegible] కాని: టి. యస్. [illegible] కాని లేక ఇతర ఏ అధికారులైనను [illegible] అటంకపఱచుటకు హక్కులేదు. ఏ ఉద్యోగికిని ధనవసూలు [illegible] ములు చెల్లించుకొనవలసిన అవసరము లేదు. [illegible] ధాన్యములను ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు సాగించుకొనవచ్చును. ఈ [illegible] కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలకు మాత్రమే వర్తించును. రాయలసీమ జిల్లాలనుండి వేరు జిల్లాలకు పైన చెప్పిన ధాన్యమును తీసికొని పోకూడదు. [illegible] జిల్లాలనుండి ఈ జిల్లాలకు తెప్పించుకొనకూడదు. ఒక్క బియ్యము, గోధుమలపైననే ఈ నిషేధమున్నదని రైతులు, [illegible] తెలుసుకొందురుగాక యని కోరుచున్నాము.

నవల

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (16)

[జానకీ, చంద్రశేఖరులు ఒకరినొకరు ప్రేమించుకొనిరి. శ్యామలునిచే మోసగింపబడిరి. ఉన్మాదియైన చంద్రశేఖరుడు మధుసూదనుని జేర, జానకి బొంబాయిలో గల రాధాకృష్ణుని యాశ్రమమున నుండెను. జానకి మధుసూదను డచ్చటికి రాగా, తన్ను మొదట పెండ్లియాడ దలంచిన వ్యక్తిగా నెఱిగి పారిపోయెను. చంద్రశేఖరుని వెదకుచున్న డాక్టరును కలిసికొని మదరాసులో నుండెను. డాక్టరు జబ్బునబడి మంచముబట్టి మరణించెను. అతనికి వైద్యము సేయవచ్చిన డాక్టరును చేరియుండ అచటికి రుక్మిణియు, శ్యామలుడును రానున్నారని తెలిసి, యటనుండి పారిపోవ నిశ్చయించెను. తరువాత ఈ ప్రకరణమున,—]

సూర్యుడు పశ్చిమ సముద్రమున మునిగి ఊయలలూగు తరంగములపై విసరు స్వర్ణకాంతులను చెన్నపురవాసులు దిలకించుచు చెలియలికట్టపై గూరుచుండి యానందించుచుండిరి. గుంపులు గుంపులుగావారి వినోదములకు చెలులతో వేళాకోళము లాడువారును, సాయంసమయ ప్రకృతి సౌజన్యమునకు హృదయములు వికసింప కవితాలల్లు కవులును, పోతు పెంటి యలలు ఒకదాని కౌగిట నొకటి విలీనమైపోవుట గాంచి, శృంగారచేష్టావలంబులై ఆనందించు దంపతులును, విలాసినీ విలాసినులును, సముద్రపుటొడ్డునకు శోభ చేకూర్చుచుండిరి. కొంతదూరమున ఒక స్త్రీ ఒంటరిగా గూరుచుండి, సృష్టి విలాసముల దిలకింపక, ఎద్దియో యాలోచించుచుండెను. ఒక్కొక యెడ హృదయమును పెకల్చికొనివచ్చు వ్యసనవీచికల నాపుకొనలేక గంభీరముగా 'స్త్రీగాబుట్టి, ప్రేమించిన మనోహరునికి దూరమై ఇన్ని యిక్కట్టుల బడితిని. ఇక నాకు ఓపిక లేదు. నేడే ఇంటికి రానున్న శ్యామలుడు, రుక్మిణీలు నన్ను గాంచిన మతి యేవిపత్తువ ద్రోయుదురో గదా! ఇక దిక్కులేనిదానవై యెక్కడికి పోగలను? సోదరుడని భావించిన డాక్టరుకూడ మోహావిష్టుడై పెండ్లాడు మనుచున్నాడు. పదివేల రూపాయల నిచ్చిన తాత, దివికరిగి స్వేచ్ఛాజీవియై వెలుగుచున్నాడు. తండ్రి గడించినది తనయు డనుభవింప వచ్చును గనుక పైక మాతనికే వదలితిని. ఏదో సాకుబెట్టి వెలుపడితిని. తిరిగి ఆ యింటికిపోవుట దుస్తరము. సర్వాంతర్యామియగు దైవము నన్ను గమ్మనుచున్నాడు. ఇక ప్రాణములు భరించుట తుచ్ఛకార్యము' అని లేచి, సముద్రపుటొడ్డున కొంతదూర మేగి, సముద్ర ముఖముగా నడచి యలల తాకుడు లెక్కసేయక, మొలబంటి నీటిలోనికేగి అలలయందు విలీనమయ్యెను.

కొంతదూరములో కూరుచుండి చూచుచున్న ఒక యువకుడు ఒక్క బిఱ్ఱున పరుగిడి సముద్రమున లంఘించి, నావనున్న ఆ యువతీమణిని ఒడ్డునకు జేర్చెను. మ్రింగిన నీరును వెలుపలికి వచ్చునట్లుగున పరుండబెట్టి పరిచర్య చేయబూనెను. ఇంతలో గుంపు జేరిరి. గుంపులో నొక్కడా యువకుని గాంచి, 'అయ్యా! ఈమె యెవ్వరు? ఇట్టి ప్రమాద మేల కలిగినది?' అనియెను. అందులకా ప్రాణప్రదాత 'ఈమె నా స్నేహితుని భార్య. అతడు కనుపింపలేదని సముద్రమున దూకి ప్రాణత్యాగము చేయ ప్రయత్నించినది. నేనిక్కడ నుండుటవలన తటస్థించుటచే ఈమె బ్రతికినది. లేదన్న ఈపాటికి సముద్ర గర్భములో నుండెడిది' అనియెను. ఇంతలో ఒక రిక్షా కొనితెబడెను. బీచ్ రోడ్డుమీద నున్న మోటారుకారులో నామె నెక్కించుకొని, నాతనయువకుడు మైలాపూరులో నొకవిడిదెకు తీసికొని పోయెను.

రెండు మూడు దినముల యనంతర మామె స్వస్థత జెందెను. క్రొత్త యువకుడామెను చూచి పరిచితునివలె నుండుట ఎవరైనది జ్ఞాపకమునకు దెచ్చుకొనుటకు ప్రయత్నించుచుండెను. కాని స్ఫురణకు రాలేదు. [illegible] ఆమె నాలోకించి, 'నీ దేవూరు? నీవు [illegible] కారణ మేమి?' అని ప్రశ్నించెను. [illegible] ముఖమెత్తి జూచి, మధుసూదనుడని తెలిసికొని, తన్ను [illegible] పలేకుండుటకు సంతసించి, 'అయ్యా! [illegible] భర్త నన్ను మోసము చేసెను [illegible] దలంచితిని' అని పలికెను. [illegible] డు జానకిని గుర్తించి, [illegible] బొంకుచున్నదని యెఱిగి, 'ఓహో! [illegible] ఈ దినము తిరుపతికి బయలుదేరుచున్నాను. [illegible] లో విడిచి వెళ్లెదను [illegible]', మదరాసు [illegible] పయనించి గూడూరికి తోడ్కొని పోయెను. [illegible] వనికు చూచియుండని కారణమున, [illegible] భ్రమించుచుండెను.

గూడూరులో చంద్రశేఖరుడు పూర్వము ఉన్మాదిగా చికిత్సపొందిన గృహమునందు జానకిని నసింప మధుసూదనుడు

(మిగత 8 వ పేజిలో)

సాహిత్య చర్చలు : విద్యార్థులకు — విద్యార్థినులకు:

# నన్నయ కవితా ప్రశస్తి

(సవ్యసాచి)

కవి సర్వజ్ఞుడు. కవియగు వానియందు నీశ్వర దత్తమగు కవిత అవస్థా విశేషములను బట్టి వికసించును. పరమాణువు మొదలు పరబ్రహ్మము వరకు గల జంగమ, స్థావర రూపకములగు సమస్త విశేషములలో గవి దేనినైన వర్ణింపవచ్చును. నిజమైన కవి రచించిన రచనయందు గవిత్వముండక తప్పదు. బ్రహ్మ యొక్క సృష్టివిశేషమా, కవియొక్క శక్తి విశేషమా అనిపించును.

## సౌందర్యమే కవిత్వము :

సృష్టియందలి ప్రతివస్తువు గవితాత్మకమగు సౌందర్యముచే నిండియున్నది. ఒకానొక వస్తువుకడకు నలుగురు కవులొక్కమారే పోవుట తటస్థించెనేని, తద్వస్తు సంస్థితంబగు కవితా సౌందర్య మానలుగురు కవుల నొక్కమారే యాకర్షించును. కాని యా నలుగురి రచనలు ఒక్కమాదిరిగ నుండవు. సౌందర్యమే కవిత్వము. దానివలె కవిత్వమునకు కూడ నిదమిత్థమగు నాకార నిర్ణయముండదు. కవులవి విభిన్న తత్వములు. వస్తు సౌందర్యము కవి హృదయమునందుబడి, యందుండి వెడలునప్పుడు, వాని హృదయ తత్వమును బట్టి ప్రకాశించుచుండును. ఒక కవి శృంగార పురుషుడు, మతియొక కవి మహా భక్తుడు. ఈ యిరువురి కవితారచనలు పరస్పర భిన్నములై, వారివారి మనస్తత్వముల కనుకూలముగనే యొప్పుచుండును.

'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం.' అట్టి కావ్యము రసాత్మకమైనది. విశ్వనాథకవిరాజు రస స్వరూపమును గుఱించి ముచ్చటించుచు, 'రజస్తమోగుణములచే నస్పృష్టమగు నొక యాంతర ధర్మమే సత్వమనబడు. అట్టి సత్వోద్రేకము వలన నావిర్భూతమై, యవిచ్ఛిన్న స్వప్రకాశానంద చిన్మయమై, లోకోత్తర చమత్కారసారమై, బ్రహ్మానంద సోదరమగు రసము, సహృదయులగు వారిచే నాస్వాదింపబడునది'— అని నిర్వచించెను. బ్రహ్మానంద సదృశమగు నీ కావ్యరసాస్వాదన మొనరించుటకు, పూర్వజన్మ సంస్కారమావశ్యకమనియు, వాసనాశూన్యుడీ ఫలము ననుభవింపజాలడనియు నాలంకారికుల మతము. అట్లని, పూర్వజన్మ సంస్కారమువలె రసాస్వాదనమునకు నైహిక సంస్కారమనావశ్యక మనజనదు. కావ్యామృతము గ్రోలుటకు ప్రాక్తన సంస్కారమునకు దోడుగ, నద్యతన సంస్కారమును నావశ్యకమే యగును.

ఈ విషయముల మనస్సునం దిడుకొని నన్నపార్యుని కవితాప్రశస్తి విచారింతము. నన్నయ ప్రత్యక్షముగ తాను రచించిన మహాభారత భాగమున గాని, కృత్యాది పద్యములలో గాని దిక్కనాదులవలె కవితా తత్వమును గూర్చి తన మతమును విపులముగ విశదీకరించ లేదు. అయినను ఆయా కవుల అభిప్రాయముల బట్టియు, ఆయా ఘట్టముల విమర్శనా దృష్టితో పరిశీలించియు, నన్నయ కవితాశక్తిని, ఆతని నియమములను కొంతవర కూహింపవచ్చును. అనగా External and internal evidence వలన నన్నయ కవిత్వ విశేషమును గ్రహింపవచ్చును.

## నన్నయ 'ఉభయ వాక్ప్రౌఢి' :

నన్నయ కవిత యందు శ్రీనాథుడు గనుపెట్టి అనుకరించిన గుణాతిశయము ఉభయవాక్ప్రౌఢి, "భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కచోట." ఇందు వింత ఏమియు లేదు. నన్నయ కవిత్వమునందు సంస్కృత బాహుళ్యము లేకపోలేదు. లేకపోవుటకు వీలు లేదు. ఇందులకు కారణము తన కావ్యరచనకై యెత్తుకొని మేలుబంతిగా నిడుకొనినది సంస్కృత భారతము. మఱియు, తన రచనాకాలమునకు నన్నయ హృదయము నాకర్షించునట్టి ఇతర గ్రంథము లేవియు నాంధ్రమున లేవు. అందుచే సంస్కృత పదములనే విశేషముగ వాడవలసి వచ్చెను. మఱియు ప్రస్తుత జనసామాన్యమునకంటె, నన్నయనాటివారికి వారి భారత రచన యెక్కువ సులభగ్రాహ్యమైనదై యుండును. తన కాలమునాటిజనుల కగ్రాహ్యమైన రచన నన్నయ సాగింపడు. ఇంకొక విశేషము, సంస్కృతపద ప్రయోగమున నన్నయ మిక్కిలి జాగరూకత వహించె ననవలయును. కఠోరమైన శబ్దములు, సంధికాఠిన్యముగల సమాసములు, గ్రాహ్యముగాని దూరాన్వయములు గ్రహింపక, నాటికి నంతవరకు ప్రచారమున నున్న సంస్కృతపదములను మాత్రమే ఉపయోగించుటచేత నాతని రచనలలో నంతటిదీర్ఘ సమాసములైనను బాపులు తావులు లేకపోవుట కతడు జాగరూకత నర్థమును ప్రకటించుచున్నవి. ఇదె గూర్చుచు —

ఉ॥ ద్వాదశమాసికవ్రతము
ధర్మవిధిం జలుపంగ జేసి యా
గాది మహానది హిమవ
దాది మహాగిరి దర్శనంబు నీ
పాదపయోజదర్శనము
పన్నుగ జేయుట జేసి పూర్వ సం

పాదిత సర్వపాపములు
బాసె భృశంబుగ నాకు నచ్యుతా.

ఇట్టి మృదుపద గుంభితములైన సమాసములకు, బంగారు పతకమునకు వజ్రంపు రవ్వలవలె, తెనుఁగుమాట లానగూర్చు టను, అక్షర రమ్యతా మగ్నుండుగాక, ప్రసన్న కథా కవితార్థయుక్తి యుండే దృష్టి యుంచి, చక్కని శ్రుతి సౌఖ్యమును, దాని వెంటనే యర్థసౌలభ్యమును దఱుముగాఁ గలిగించుట నన్నయ కవితయందలి గుణములలో నొకటి.

ఎఱ్ఱాప్రగడ వంశములోనివాడైన చెదలవాడ మల్లయ, నన్నయ కవిత్వములో 'మాధుర్యమును' ప్రధానముగా నెన్నినాడు. మఱియు 'ఆంధ్రకవితా గౌరవజనమనోహారి నన్నయసూరి' అని పోతనయు; 'అగటిపండొలిచి చేతికిచ్చినకరిణి' అని పింగళి సూరనయూ; 'నవ్యమంజుల వాగ్విభవ నన్నపార్య' అని మొల్లయును, నన్నయ కథా ప్రసన్నతయును, బదసౌష్ఠవమును వాని కవితాగుణములలో ముఖ్యమైనవానిగా బ్రశంసించుచున్నారు.

'భద్రకుంజరగతి'

'భద్రకుంజరగతి' అని యెఱ్ఱాప్రగడ నన్నయ కవిత్వమును గురించి చెప్పినాడు. ఈ సందర్భమున నన్నెచోడుడు తన కవితామతమును గూర్చి చెప్పినదికూడ గమనార్హము.

మ|| పదబంధంబుల నగలించి, బుధ
శబ్దభ్రాంతియై సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనముల్
ఛిందించునపుడు భూరిస
మ్మదకృ[illegible] విలసిల్లి సత్కృతి
జగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుబోలెఁ గాలవలదా
మారెండు లేకుదతిన్.

విశ్వనాథ సత్యనారాయణగారు నన్నయకు ప్రసన్నకథాకవితార్థయుక్తియందును, నానారుచిరార్థసూక్తులయందును ఎంతయభిమానము [illegible] అక్షర రమ్యతయందు గాన [illegible] లేదని, 'నన్నయగారి ప్రసన్నకథాకవితార్థయుక్తి' యను వ్యాసమున [illegible] విమర్శించి విశదీకరించిరి.

[illegible] లక్ష్మీకాంతముగారు నన్నయ కవితయందు 'ప్రసన్న కథాకవితార్థయుక్తియు, అక్షర రమ్యతయు, నానా రుచిరార్థసూక్తులును, వైదిక కర్మాభిమానము మొదలగు వనేక విషయములు గోచరించినవి. నన్నపార్యుఁడే—

ఉ|| సారమతిఁ గవీంద్రులు,
ప్రసన్నకథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు
లక్షరరమ్యత నాదరింప నా
నాయచిరార్థసూక్తినిధి
నన్నయభట్టు తెనుగునన్ మహా
భారతసంహితారచన
బంధురుడయ్యె జగద్ధితంబుగన్.

అని అవతారికయందు రచించెను.

నన్నయ సంస్కృతపదములు సుబోధములు. ఇతరులకే ప్రతిభ యుండదు. వాక్యయోజనయందు (Syntax) సైతము నన్నయ సంస్కృతరీతినే యవలంబించెను. నన్నయ శైలిలో గంభీరత మెండు. ఇతని శబ్దములు వినినంతనే, వేదమంత్రములవలె మనల బవిత్రులను చేయును. ఇటు చూడుడు

చం|| బహువనపాదపాదికుల
పగ్వితపూర్ణసరిత్సరిస్థలీ
సహితమువామహీధర
మజ్రసహస్రసఫణాళిగాల్చి డి
స్పృహతరమూర్తికిన్ జలధ
శాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకు
డనంతుఁడు మాకు బ్రసన్నుఁడయ్యెడున్.

(ఆ, ప్ర, 104) నన్నయ కవితయందు ఇంకొక విశేషము, [illegible] ము స్పష్టముగా నుండవలయుననియు, [illegible] ములు [illegible] గా నుండవలయుననియు నన్నయ భావించినట్లు తోచుచున్నది. కాని నన్నయ కవితయందు [illegible] [illegible] [illegible] నన్నయని [illegible] [illegible].

( [illegible] )

---

# గ్రామీణ ఆదాయ సేకరణ ఫిక్సెడు డిపాజిట్లు.

మూడు రూపాయలు, [illegible] [illegible] (నూర్ల చొప్పున) గ్రామీణ ఆదాయసేకరణ ఫిక్సెడు డిపాజిట్టుగా ఒక సంవత్సరము వాయిదాకు రు. 100_0_0 లకు రు. 3_8_0 వడ్డీ వంతున 31_12_51 వరకు [illegible] [illegible]. [illegible] కడపజిల్లాలో ఆపరేటివు [illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible] [illegible] చున్నాము. [illegible] [illegible] వెంటనే [illegible] [illegible] వారికి వ్రాయవలెను.

కడప, 12_11_1951.

సి. టి. వీరారెడ్డి, ప్రెసిడెంటు.

( జానకి :— 4—వ పేజీ తరువాత. )

ఏర్పాటు చేసెను. ఆమెకు పరిచర్య చేయుటకు సేవకురాండ్రను నియోగించి సర్వసౌఖ్యముల నొనర్చెను. తాను తెలియగా ఆమెను దర్శింపఁబోయిన, ఆమె భయమున పారిపోవునను సంశయమున మధుసూదనుడు ఆమె విడిదికే పోవకుండెను.

చంద్రశేఖరుని చిత్తరువొకటి ఆ గృహమునందుండుట గాంచి, పరమానంద భరితయై జానకి నిత్యము దానిని పూవులతో పూజించుచుండెను. పరిచారికలలో నొకతెయగు సుముఖికిని, జానకికిని ఒకనాడిట్లు సంభాషణ జరిగెను.

సుము.— 'అమ్మా! ఆ పటములోగల చంద్రశేఖరుఁడు నీ కేమి కావలయును?'

జానకి.— 'సుముఖీ! అతఁడు నా మనోహరుఁడు. అతని కొఱకు నేననేక కష్టములకులోనయి తుదకీ నగరమున జేరితిని. భగవంతు డింకను నన్నెన్ని బాధల పెట్టదలచినాడో తెలియదు.'

సుము.— 'అమ్మా! మధుసూదనయ్య సత్యవంతుడు. చంద్రశేఖరుడు పిచ్చిబట్టి యుండగా ఎక్కువ సైకము ఖర్చుపెట్టి నయము చేయించెను. పైగా ఆయనకు ఆస్తిలో భాగమిచ్చి, తనంతవాణ్ణి చేసెను. నీకు ఆయనయందు దొరికినది. నీకేమి భయము లేదు.'

జానకి.— (మధుసూదనుని ఔదార్యమునకు ఆత్మ మెచ్చుకొనుచు) 'సుముఖీ! ఇప్పు డాతఁడు ఎక్కడకు పోయినది తెలియదా?'

సుము.— 'అమ్మా! మధుసూదనయ్య బొంబాయికి పోయి యుండినప్పుడు రాధాకృష్ణయ్య యింటిలో మకాము చేసెనట. అచ్చట నీవుండి కొన్నాళ్ళకు పారిపోయినావట. అది మా యయ్య గ్రహించి, నీవు చంద్రశేఖరుని ప్రేమించిన సంగతి తెలిసికొని, ఇచ్చటికి రాగానే నిన్ను వెదకితెచ్చుటకు అతనిని పంపెను.'

జానకి.— 'సుముఖీ! మధుసూదనుడు నిజముగా మహా సుగుణాత్ముడు. దయాపరుడు. అతనికి మా యావజ్జీవము ఋణపడితిమి. ఒకతూరి నన్నాతనిచెంతకు కొనిపోదువా?'

సుము.— 'అటులనే తల్లీ. ఆ సంగతి వారి కెఱిగించి, తరువాత పిలుచుకొని పోవుదు' నని యందుండి వెడలిపోయెను.

మధుసూదనుడు మొదట తన్ను వివాహమాడ నిశ్చయించినను, క్రోధము వహింపక తనను, తన మనోనాయకుఁడగు చంద్రశేఖరుని ప్రేమతో ఆదరించినందులకు జానకి కీర్తించుచు, నేటికి బాయిదుమలు దీరినవని మురియుచుండెను. ఇంతలో సుముఖి మధుసూదనుని వెంటనిడికొని యట కరుదెంచెను. అతని జూచుటతోడనే జానకి పాదములపై వ్రాలి, 'మహాశయా! నేను మొదటనే నాయభిమతమును దెలుపక, వివాహ మిషతో మీ కమితమగు ఖర్చులగావించి యపరాధ మొనర్చితిని. అయ్యది మనసులో నిడుకొనక నా మనోహరుని గూపత్సముద్రమునుండి దరిజేర్చి యాదరించితిరి. నావమున్న నన్ను బ్రతికించి, నేడు సర్వానుకూలములు గావించి పుణ్యము గట్టుకొంటిరి. నన్ను నా చంద్రశేఖరునియందు జేర్చి కీర్తికాములుగండు' అని దీనముగా ప్రార్థించెను. మధుసూదనుడు 'సోదరీ! లెమ్ము. నీ హృదయము నిష్కళంకము. నీ ప్రేమ నిర్మలము. నీ హృదయాధినాథుడు నీకొరకు బొంబాయినగరమునకు జనియున్నవాడు. త్వరలోనే రాగలడు. అతఁడు వచ్చినదే తడవుగా మీ కిరువురకు కల్యాణము గావింతును' అని లేవదీసెను. జానకి ఆనందబాష్పములు రాల్చుచు, మధుసూదనుని కండ్లలోనికిఁ జూచెను. మధుసూదనుఁడు సోదరివాత్సల్యము తొణికిసలాడ ఆమెను గారవించి, నీ విచట నీయింటనున్న చందమున నుండుమని అభయ మిచ్చి వెడలిపోయెను. నాఁటిగోలె జానకి మనోహరుని సందర్శనార్థమున కుబలాటపడుచు, సుఖముగ కాలము బుచ్చుచుండెను. (16 వ ప్రకరణము సమాప్తము)

---

విద్యార్థులకు:—

## చర్చిల్ మంత్రివర్గము.

విన్‌స్టన్ చర్చిల్ తన మంత్రివర్గమును ఈ క్రింది విధముగా ప్రకటించినాడు.

1 విన్‌స్టన్ చర్చిల్
(ప్రధాని, దేశరక్షణశాఖ)
2 ఆంథోని ఈడెన్
(డిప్యూటీ ప్రధాని, విదేశాంగశాఖ)
3 రిచర్డు బట్లర్ (కోశాంగ శాఖామంత్రి)
4 లార్డ్ ఇస్మే (కామన్ వెల్తు వ్యవహారశాఖ)
5 ఆలివర్ లిటిల్ టన్ (కలోనియల్ మంత్రి)
6 సర్. డేవిడ్ మాక్స్‌వెల్ (హోంశాఖా మంత్రి)
7 లార్డువూల్ టన్
(లార్డ్సుసభ ప్రెసిడెంటు. ఆహార, వ్యవసాయ శాఖల మంత్రి)
8 సర్ వాల్టర్ మాంక్టన్ (కార్మిక మంత్రి)
9 మార్క్విస్ సాలిస్ బరీ
(లార్డ్సుసభ నాయకుడు)
10 కాప్టెన్ హారీ క్రూక్ షాంక్ (ఆరోగ్యశాఖ)
11 హెరాల్డు మాక్ మిలన్
(హౌసింగ్ అండ్ లోకల్ గవర్నమెంటు)
12 జేమ్సు స్టువార్టు
(స్కాట్ లాండు సెక్రటరీ ఆఫ్ స్టేట్)
13 లార్డు లెదర్సు
(ట్రాన్సుపోర్టు, స్యూయల్, పవర్ ల కో-ఆర్డినేషన్ సెక్రటరీ)

---

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త – విక్టర్ హ్యూగో.

(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్.,)

(న్యాయశీలుడు – మిరల్.)

(4)

ఆయన సంభాషణ కరుణా రంజకమై యుండెడిది. తనలో నున్న యిరువురు వృద్ధ స్త్రీల సామర్థ్యమునకు సరితూగెడి వాడే కాని, అతడు నవ్వినా శిశువు నవ్వినట్లుండును.

మగ్లోర్ ఆయనను గొప్ప వాడ నెడిది. ఒకనాడాయన పుస్తకముల గదిలోనికి వెళ్లి ఒకపుస్తకమునకై వెదకుచుండెను. అది పై యటకపై యుండెను. బిషప్పు పొడుగరి కాడు. పుస్తక మందలేదు. చిరునవ్వుతో "మగ్లోర్! ఒక కుర్చీ తీసుకురా. ఈ అల్మారా నా గొప్పను గుర్తించకున్నది," అనెను.

ఆయన దూరపు బంధువు 'లో' ప్రభ్వి. ఆమెకు ముగ్గురు కుమారులు. తన కుమారుల భవిష్యత్తును గురించిన యాశలను ఏకరువు పెట్టు అవకాశము చిక్కిన పోనివ్వదు. ఆమె బంధువుల సంఖ్య పెద్దది. అందరును మిక్కిలి ముసలి వారు. రేపోమాపో అనునట్లుండిరి. ఒక ముత్తవ్వ నుండి, తన కడగొట్టు కుమారునికి లక్ష లివర్లు సంక్రమించును. రెండవ వాడు ఒక దాయాది నుండి "డ్యూక్" బిరుదు పొందును. అగ్రజుడు తాతనుండి "ప్రభుత" గాంచును. ఈ అమాయకపు తల్లి యుబలాటమును నోరు మెదల్పక బిషప్పే వినుచుండును. వేయవసారి ఆమె యీ సంక్రమణములను వివరించుచున్నపుడు, బిషప్పెప్పటి కంటె అన్యాచనలో నుండినట్లు పొడకట్టెను. అది చూచి యామె తటాలున ఆగి, "బాగున్నది! అన్నయ్యా, నీ వేమాలోచించు చున్నావు?" అని ప్రశ్నించెను. అతడును, "ఆగస్టిన్ ఋషి వచనములలో విచిత్రమైన దానిని గురించి ఆలోచించు చున్నాను. ఎవరి స్థానమును ఎవ్వరును పొందలేరో ఆయనపైనే అన్ని యాశలను పెట్టుకొమ్ము" అని పలికెను.

ప్రసిద్ధ ధనికు డొకడు మరణించినప్పుడు, ఆ వార్తను తెలుపుచు బిషప్పుకు ఉత్తరము వ్రాసిరి. దానిలో మరణించిన వాని బిరుదావళియు, చాలదన్నట్లు అతని యందరు బంధువుల ఘనతా గౌరవ చిహ్నములను అక్షరక్షరము పేర్కొనిరి. అది చదివి మిరిల్ "ఆహా, మృత్యువు నీ వెంత విశాలము! ఎన్ని బిరుదముల బరువును సంతోషముతో మోయును! గోరీలోను ఆడంబరములను పెంచు మానవు లెంత నిర్లజ్జులు! అని ఆశ్చర్య పడెను.

అప్పుడప్పు డతడు మృదురీతిని పరిహాసము చేయును. ఆ పరిహాస మెప్పుడును ఉత్తమ భావములతో నిండియుండెడిది. ఒక సారి, నలువది నాళ్ల యుపవాస కాలమున, యువ బోధకు డొకడా యూరు వచ్చి దానమును గురించి, ఉపన్యసించెను. నరకము నందలి ఘోర యాతనలను భయంకరముగ చిత్రించి, స్వర్గ సుఖములను అత్యాహ్లాదముగ వర్ణించి, నరకము త్యజించి, స్వర్గము ప్రవేశింప గోరు ధనికులు పేదలకు దానము చేయుడని యుపదేశించెను. బట్టల వ్యాపారము చేసి, యిరువది లక్ష లార్జించిన యొక వర్తకు డా సభలో నుండెను. అతడు వడ్డీ వ్యాపారము చేయును. గతి చెడిన వారికి ఒక పైసా యివ్వడు. ఈ యుపన్యాసమైన నాటి నుండి, ప్రతి యాదివారమును, ప్రార్థనానంతరము గుడి దగ్గఱ కూర్చుండు ఆర్గురు ముదుసలి భిక్షుక స్త్రీలకును కలిపి ఒక పెన్నీ యిచ్చెడివాడు. ఒక నాడు ఈ దాన కర్మము చూచి చెల్లెలితో "ఈయన పెన్నీ స్వర్గమును కొను చున్నాడు," అని హాసముఖుడై పలికెను.

ఏదేని ధర్మ కార్యములకు సహాయ మర్థించు నప్పుడు, నిరాకరణ మతని నోరు మూసెడిది కాదు. వినువారి మనస్సులలో సంచలనము కలిగించు మాటల కతడు గని. ఒక నాడు ఆ యూర నొక చావిడిలో పేదల కొఱకై ధనము ప్రోగు చేయు చుండెను. ముదుసలి, ధనికుడు, లుబ్ధుడునగు ఒక పెద్ద మనుష్యు డిచ్చట నుండెను. బిషప్పతని దగ్గఱకు వచ్చి చేయి కలిపి, 'మీరును ఏమైన యియ్యక తప్పదు' అని యర్థించెను. ఆ పెద్ద మనుష్యుడు ముడి మొగము వేసి 'స్వామీ, నాకును నా పేద లున్నారు' అనెను. 'వారిని నా కిచ్చి వేయుడు' అని బిషప్పడిగెను.

ఒక నా డాలయమున ఈ క్రింది విధముగ నుపన్యసించెను. 'సోదరులారా! మిత్రులారా! ఫ్రాంసులో లక్ష ముప్పది వేల గుడిసెలు, మూడు ద్వారములు కలవి వున్నవి. రెండు ద్వారములు కలవి లక్ష యెనుబది యొక్క వేలున్నవి. ఒకే ద్వారములు కల పాకలు మూడు లక్షల నలువది యారు వేలున్నవి. కిటికీలపై, తలుపులపై పన్ను విధించిన దాని పరిణామమిది. ఈ దరిద్ర నిలయములలో ముదుసలి స్త్రీలు, పసిపిల్లలు ఎన్ని జ్వరములకు, రోగములకు గుఱి యగుచున్నారు? దేవుడు

(మిగత 12–వ పేజీలో)

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానహక్కులు — హిందూ కోడుబిల్లు.

( శ్రీమతి. యస్. పద్మావతీదేవిగారు. )

( గత సంచిక తర్వాత )

## (4)

హిందూ కుటుంబములలో స్త్రీలకు గౌరవ ప్రదమైన స్థానము కలదని ఇంతవఱకును ప్రకటించిన మూడు వ్యాసములలో దెలిపియున్నాను. పాశ్చాత్య స్త్రీలవలె హిందూ కుటుంబములలోని స్త్రీలకు స్వేచ్ఛ యున్నదా యని కొందఱు స్త్రీలు ప్రశ్నించెదరు. "స్వేచ్ఛ" అను పదముయొక్క అర్థము అతి విశాలమైనది. దానికి హద్దులు నిర్ణయించుట కష్టము. స్వేచ్ఛకు హద్దులు లేనిచో, అది నైతికాభ్యుదయమునకును, దాంపత్య జీవితమునకును భంగకరముగ పరిణమించును. స్త్రీలు పురుషుల కన్నఎక్కువ మనో దౌర్బల్యము కలవారు. వేదయుగమున స్త్రీలకు స్వేచ్ఛఎక్కువగ నుండెడిది. ఆ స్వేచ్ఛను వారు దుర్వినియోగ పఱచిరని చెప్పుట కనేక సాదృశ్యములు గలవు. ఛాందోగ్యోపనిషత్తు నాల్గవ ఖండములో ఒక చిన్నకథ కలదు. జబలా అను ఒక యువతి స్వేచ్ఛా ప్రణయమునకు దాసురాలై, ఒక పుత్రుని కనెను. ఆ కౌమారమున తన కేపురుషునివల్ల సంఘటిల్లినదని మాతృత్వమును వహించిన తనకే తెలియదు. పుత్రుడు పెరిగి, విద్యనభ్యసించు వయస్సు వచ్చెను. వానిని గురువునకు ఒప్పగింప వలెనని ఆ యువతి (జబాల) తలచి, కొడుకును పిలిచి "నాయనా! శ్రేష్ఠుడగు గురువు చెంతకు పోయి విద్య నభ్యసింపుము. గురువు కులగోత్రముల నడుగును. యౌవనమున స్వేచ్ఛా విహారిణినైన నన్ను కనినది. నా ప్రియుడెవరో మా తల్లికే తెలియదు. నాకు సత్యకాముడని పేరు పెట్టెను" అని చెప్పుము నెను. బాలుడు సత్యకాముడనై హరిద్రుమతుడను (గౌతముడను) గురువు దగ్గరకి పోయెను. గురువు కులగోత్రములనడుగ తండ్రి ఎవరైనది తెలియదనియు, తల్లి పేరు మాత్రము చెప్పెను. "బాలుడైనను నిజము చెప్పెను. సత్కుల సంజాతుడై యుండవలె"నని తలచి, ఆ బాలునికి ఆయనయే ఉపనయనము గావించి విద్య చెప్పెను.

ఉపనిషత్తులలో తెలుపబడిన ఈ కథ నిజమై యుండవచ్చునని కాని, అసత్యమని కాని మన సోదరీమతల్లులు తేల్చుకొనవలసిన జరూరు లేదు. స్త్రీలకు స్వేచ్ఛా విహారములవలన తాము బిడ్డల నెవరికి కనినది తెలుసుకొనజాలనంతటి పరిస్థితులు జనింప వచ్చునేమో యని భయపడుట కవకాశమున్నది. ఇట్టి సాదృశ్యము లనేకములు గలవు. వైద్యవృత్తిని సవలంభించి, యువతులైన సోదరీమణుల సేవచేయు చున్నందున నాకు ఎవ్వరికిని తెలియరాని అతిరహస్యమైన విషయము లన్నియు తెలియును. వైద్య వృత్తి నీతిని (ethics of medical profession)అనుసరించి, వానిని నేను ఈ జన్మములో బయలు పెట్టకూడదు. కాని నా యనుభవములకు కొంత గౌరవ మివ్వ పాఠకులను గోరుచున్నాను.

ఎడింబరో (ఇగ్లాండు) పట్టణములో నేను వైద్యవిద్య నభ్యసించు కాలములో ప్రసూతి శాఖలో కొన్ని మాసములు పనిచేసి యున్నాను. అచ్చటి రహస్యములు నాకు తెలియనివి కావు. హిందూ సాంప్రదాయములు, హిందూ సంస్థ చెడిపోక గాపాడబడవలెనని కోరుచో, హిందూ యువతులు "సంపూర్ణ స్వేచ్ఛ"ను కోరకూడదని నా విన్నపము. "దేవుడు" "ప్రకృతి" "సృష్టి"

అనునవి ప్రపంచములో వేరుగా ఎచ్చటను లేవు. అవి అన్నియు స్త్రీలయందే యున్నవి. మాయ అనునది 'స్త్రీ'యే. సృష్టికిని, స్థితికిని, లయమునకు ను స్త్రీలు (యువతులు) కారణభూతులను అంశ మును నా సోదరీమతల్లులకు పలుమారు జ్ఞాపకము చేసుకొందురు గాక. ఉపన్యాస వేదిక లెక్కి బహిరంగ సభలలో నుపన్యసించుట స్త్రీలకు 'స్వేచ్ఛ' కాదు. శాసనసభలలో సభ్యురాండ్రై, ఉపన్యసించుట స్త్రీలకు స్వేచ్ఛ కాదు. పురుషుల తో నేము సమానులమే; రాజ్యాంగ చట్టము స్త్రీ, పురుష విభేదములను పాటింపకూడదని నిర్వ చించినది; పురుషులతో పాటు మాకు ఉద్యోగము లిమ్మని కోరుట స్వేచ్ఛ కాదు. ఇట్లు చెప్పిన, స్త్రీలు చదువుకొన కూడదా. బయటికి రాకూ డదా! ఎప్పుడును ఇంటి గుమ్మము లోపలనే యుండవలయునా యని ప్రశ్నింపవచ్చును.

స్త్రీలు చదువుకొనరాదని ఎవ్వరూ చెప్పరు. చెప్పబోరు. బాగ చదువు కొనవలసినదే. సాహి త్యము, సంగీతము, శాస్త్రవిద్య మొదలగునవి నేర్వవలసినదే. మాతృత్వమునకును, గృహ నిర్వాహణమునకును తగినవిద్య నభ్యసింప వలసిన దే. వైద్యశాస్త్రము, అందుముఖ్యముగ నర్సిం గు (Nursing) ప్రసూతికి సంబంధించిన విద్య (Midwifery) ప్రతి హిందూ యువతికి వచ్చి తీరవ లయుననియే నా యాశయము. ఈ రెండు విద్యలు రానిచో మానవ జన్మము— అందు ముఖ్యముగ ఆడ జన్మము వ్యర్థమైనదనియే నా భావము. అర్థ శాస్త్రము, రాజకీయ శాస్త్రము మొదలైనవి చ దువవలెను. స్త్రీలు ఉపాధ్యాయ వృత్తి నవలం బించి, తమ బిడ్డలను విద్యావంతుల జేయవలెను. వైద్యవిద్య నభ్యసించి, మానవ చికిత్సకు పూను కొన వలెను. ఈ వృత్తులకు స్త్రీలు ముఖ్యముగ తగినవారు. మానవ కారుణ్యము పురుషులకన్న స్త్రీలయందెక్కువ. ఈ రెండు వృత్తులు ఎక్కువగ మానవ కారుణ్యముపై ఆధారపడి యున్నవి. వీనిని స్త్రీలు నిరభ్యంతరముగ అవలంబింప వచ్చు ను. అవలంబింప వలెను. మన హిందూస్త్రీల అభ్యున్నతికై పాటుపడవలెనని నా ప్రార్థన. స్త్రీలు దాంపత్య జీవితములో మాతృస్థానము వహించుచో, తమ బిడ్డలకు తామే గురువులై, వైద్యురాండ్రై తమ కుటుంబములోని బిడ్డల నుద్ధ రించిన వారగుదురు. అందుమూలమున తమ జాతిని, మతమును, దేశమును, సేవించిన వారగు దురు. ఏ విద్యకాని, ఏ ధర్మముకాని పరిమితమైన ఇంటిలో ప్రారంభమై, ఇంట గెలిచి, పరిమి తములేని ప్రపంచమంతయు వ్యాపింప వచ్చును. అందు తప్పు లేదు. స్త్రీ తనబిడ్డలకు తాను అన్న ము పెట్టవలెను కాని, ఇతరులను అన్నము పెట్టని వ్వరాదు. తల్లితన బిడ్డలను తాను పెంచవలెను కాని ఇతరులకు ఒప్పగింప కూడదు. తనే తన బిడ్డ లకు చికిత్స చేసుకొనవలెను తనభర్తను తాను సేవింపవలెను కాని, ఇతర స్త్రీలతో సేవ చేయిం చరాదు. ఇందులో అనేక ధర్మసూక్ష్మములు న్నవి. వానిని రాబోవు వ్యాసములలో చర్చిం చెదను.

—)♦*♦(—

## నిర్భాగ్య జీవులు.

( 10_వ పేజీ తరువాత )

మానవులకు వెలుగు నిచ్చును. చట్టము దానిని విక్రయించు చున్నది. చట్టమును నిందింపను కాని, దేవుని కీర్తింతును.

ఆల్ప్స్ పర్వత ప్రాంతముల ప్రజలకు గోపుడు బండ్లు కూడ లేవు. ఎరువు బుజములపైన మోసికొని పోదురు, దీపము వత్తులు లేవు. కొటేవి కట్టెలనే వాడుకొందురు. కొలు లో అద్దిన త్రాళ్లను కూడ దీపములుగా ఉపయోగింతురు. గ్రా మీన్ ఉపరి ప్రాంతములందెల్లడల నిదేగతి. ఆరు నెలల కొక సారి బ్రెడ్డు చేసికొందురు. దానినైన పొలములందలి గొడ్డు కాళ్ళతో కాల్తురు. చలికాలములలో ఆ రొట్టె పిసికిలి గట్టిపడి పోవును. అప్పుడు దానిని గొడ్డలితో పగులగొట్టి 24 గంటలు నానబెట్టిన గాని, తిన వీలు కాదు. సోదరులారా! కరుణింపుడు. మీ చుట్టును ఎంత వేదన నిండి యున్నదో పరి కింపుడు.

(సశేషము.)

లిటి భాగ్య దేవతలు. వారే మన పాలిటి మిత్రులు. అట్టివారి నాదరించి వారేమి కోరెదరో, కృతజ్ఞతా సూచకముగ దానిని నెరవేర్చుట మన ధర్మము. నీవును, మేమును వారి నీ జన్మములో మఱువ జాలము. వారిని నీవెంట మనయింటికి కేల పిలుచుకొని రావైతి? వని సుమిత్రాదేవి యనెను.

సుధాకరుడు:— అమ్మా! ఆ స్త్రీ లిరువురు ఒక చిన్న కోరికను కోరిరి. దానిని మీ యాజ్ఞను గైకొని నెరవేర్చెదనని ముందు మాట యిచ్చితిని.

సుమిత్ర: 'నాయనా! చిన్న కోరిక కాని, పెద్ద కోరిక కాని, దానిని నెరవేర్చి, వారికి తృప్తి కలిగించుట మన కర్తవ్యము. నీవు వారిరువురి వృత్తాంతము చెప్పినప్పటి నుండియు, వారిని చూడవలెనని మనస్సు తొందరపడుచున్నది. అటువంటి కారుణ్య వ్యక్తు లుండుట వలననే కదా యిట్టి మారణ హోమములు జరుగుచుండినను, భారత భూమిలో అనాథలకు, రక్షణ యివ్వబడుచున్నది. సూర్య చంద్రాదు లుదయించుచున్నారు. జవహరిలాలు ప్రధాన మంత్రిత్వము నిర్వహింప కలిగి యున్నాడు. నీవు ఆ స్త్రీల కే విధమైన ఆశలు కల్పించి యున్నచో, వానిని నెరవేర్చుటకు మే మిద్దరము పూనుకొనెదము. ఎంత మాత్రము లోపము చేయము. మంగళ సూత్రము తప్ప, నా సర్వస్వము వారి కర్పింప మనని యిప్పుడే సిద్ధముగ నున్నాను. నీవు బ్రతికినదే చాలును. అదే నాకు సర్వస్వ'మని మహాతల్లియైన సుమిత్రాదేవి యనెను.

సుధాకరుడు:— 'అమ్మా! వారు ధనము నాశింపలేదు. మఱి దేనిని ఆశింపలేదు. ఆ ఇద్దరిలో తల్లియైన స్త్రీ, తన ఏకైక పుత్రికను నన్ను వివాహము చేసుకొనమని నా చేతిలో ఆ పడుచును పెట్టినది. అర్జునుడు మత్స్యయంత్రమును బాణముతో బడవేసి, ద్రౌపదిని జయించి, తల్లి యాజ్ఞ లేక గైకొనలేదు. అటులనే — నాకు తల్లియైనను మీరే. వదినయైనను మీరే. మీ యాజ్ఞ లేక నే నంగీకరించుటకు వెనుకాడితిని. మీ యాశీర్వచనము, యంగీకారమున్నచో, ఆ దానము నంగీకరింతు' ననెను.

సుమిత్రాదేవి:— నాయనా! వారెంత చిన్న కోరికను కోరిరి. ఆమె ఎంతటి మహా యిల్లాలు. క్రొత్తవానివి. మగ దిక్కు యింట లేని వేళలలో, భయంకర సమయములో, రక్త ప్రవాహములో మునిగియున్న నిన్ను, వారు యింటిలోనికి ఎత్తుకొని పోయి, చికిత్స చేసి, ప్రాణము లొసగుటే కాక, తన కన్న కూతురును కూడ నీ కిచ్చుట కంగీకరించినదా! ఎంతటి విశాల హృదయురాలు. ఆమె చేసినది మహా దానము. దానిని నిరాకరించుటకు నీకు కాని, నాకు కాని హక్కు కలదా? ఇది ఆనందదాయకమైన విషయము. ఇట్టి విషయములలో నీవడుగకనే నా అంగీకారమున్నది. మీ అన్నగారి యాజ్ఞయైనచో, నీవా మహాదానమును దైవదత్తమైన మహా ప్రసాదముగ నంగీకరింప వచ్చును. అట్టి ఔదార్య వతియైన యిల్లాలు కనిన కన్యారత్నమును చేరి, నీవు సుఖింప వచ్చును."

అన్నగారు:— సుమిత్రా! వదినె మరదుల సంభాషణ యంతయు పూర్తిగ వినుచున్నాను. నీవు సుధాకరుని కన్యాదానము చేపట్టమని చెప్పుట; నేను వలదని చెప్పుట: ఇట్లు ఎప్పటికైనా తటస్థించునా? వలదని చెప్పునంతటి క్రూరాత్ముడనా నేను?

సుమిత్ర:— దానము పట్టి తమ్ముని ఒక యింటి వానిని చేయ వలసిన వారు మీరు. మీ కన్న నేను ఎక్కువ చనువై, సిగ్గు లేక సుధాకరుడు నాతో చెప్పినంత మాత్రమున మీ పూర్ణాంగీకారము లేనిది యిది సాధ్యమగునా? ఇప్పుడు మీరు సెల విచ్చితిరి. మంగళ సూచకముగ సుధాకరుని ముఖముపై కుంకుమ రేఖను పెట్టుచున్నా"నని లేచి, సుమిత్రాదేవి కుంకుమ తెచ్చి, మరిది ముఖమున రేఖను దిద్దెను.

సుమిత్ర:— సుధాకరా! ఆ కన్యక రూపముతో నా కక్కర లేదు. గుణము ప్రధానము. కాన మన బీదత్వమును దాపరికము లేక ఏరుకపఱచితివా?

సుధాకరుడు:— అమ్మా! అన్నియు చెప్పినాను. దాపరిక మేమియు యుంచలేదు. వారన్నిటికిని అంగీకరించిరి. వారిని నీవు స్వయముగా చూడ వచ్చును. మాటలాడ వచ్చును. సందేహములను బాపుకొన వచ్చును.

---

# ఎన్నికలు — ఓటర్లకు హెచ్చరిక.

కొన్ని నియోజక వర్గములకు (ఎన్నికల ప్రదేశములలో) రెండు స్థానము లుండును. ఒకటి జనరల్ సీటు, మఱియొకటి రిజర్వు సీటు యుండును. అట్టి ప్రదేశములలో ప్రతి ఓటరుకు రెండు బాలట్ పేపర్లు (ఓట్లు) ఇవ్వబడును. ఈ రెండు బాలట్ పేపర్లకు వరుస నంబరు ఒకటిగానే యుండును. ఒకదాని నుండి మఱియొక దానిని గుర్తించుటకై ఏ, బి అను సాంకేతిక గుర్తులుండును. జనరల్ సీటుకు (అభ్యర్థికి) వేయవలసిన బ్యాలట్ పేపరుపై 0005 అను వరుస సంఖ్య యుండిన, రిజర్వు సీటుకు వేయవలసిన బ్యాలట్ కాగితముపై A. 0005 అని మాత్రమే యుండును. ఈ రెండు బ్యాలడ్ పేపర్లు ఒకే ఓటరుకు ఒకే సారి ఇవ్వబడును. ఒకటి జనరల్ సీటుకు నిలుచు అభ్యర్థులలో తమకిష్టము వచ్చిన వారి పెట్టెలో వేయవలెను. మఱియొకటి రిజర్వు సీటుకు నిలుచు అభ్యర్థులలో తమ కిష్టము వచ్చు వారి పెట్టెలో వేయ వచ్చును.

ఇట్లు చేయక, ఏ ఓటరైనను, రెండు బ్యాలట్ పేపర్లను ఒకే పెట్టెలో వేసినచో, ఒక ఓటు లెక్కింప బడదు. ఎన్నికకు రాదు. సంయుక్త నియోజక వర్గముల ఉద్దేశ్యమే చెడిపోవును. కాన జనరల్ సీటుకు తమ కిష్టమొచ్చిన వారికి ఒక ఓటును రిజర్వు సీటుకు ఒక ఓటును ఇవ్వవలెనని రాష్ట్ర ఎలెక్షను ముఖ్య కమిషనరుగారు ప్రకటించి యున్నారు.

---

## ప్రజాభిప్రాయ వేదిక.

### శ్రీ వెంకటేశ్వర బోర్డ్సు అండ్ పేపరుమిల్లు అమ్మకము.

ఆర్యా,

పారిశ్రామికముగా మన రాయలసీమ జిల్లాలలో భారీ పరిశ్రమలు చాల తక్కువ. (మొత్తమునకు లేవనియే చెప్ప వచ్చును.) పారిశ్రామికాభివృద్ధికై ఎదురుచూడదగు 'శ్రీ వెంకటేశ్వర బోర్డ్సు అండ్ పేపరు మిల్లు' చిత్తూరుజిల్లా సోదరులు గొప్ప ప్రయత్నములో తిరుపతి నగరమున కాగిత ఉత్పత్తిశాలను కట్ట 1946-వ సం॥న పని ప్రారంభించిరి. అందులకు ప్రభుత్వము, ప్రజలు తగు సహకార మొసగియున్నారు.

ఎందుచేతనో ఆ ప్రయత్నము సాధించలేక, సగము యంత్రములు తెప్పించి, సగము కట్టడములు కట్టించి, పూర్తి చేయలేక, మన తెలుగువారికున్న తెగులునుచూపి మిల్లును అమ్మివేయ ప్రయత్నించి, పత్రికలలో ప్రకటించిరి. రాయలసీమకు ఒక భారీపరిశ్రమ,— రాబోవు ఆంధ్రరాష్ట్రములో రెండు కాగిత ఉత్పత్తిశాలలు ఉండునని ఎంతయో ఆనందించితిని. 10 లక్షల మూలధనము చేకూర్చు అధికారముపొంది, పై కంపెనీవారు దాదాపు అంత ధనమునకు వాటాదార్లను చేర్చి, సగముపని చేయకమునుపే ధనము లేదని వేలమునకు తెచ్చిపెట్టిరి.

తిరుపతిలో మంచినీటి వసతి, చౌకగ విద్యుచ్ఛక్తి, కావలసినంతమంది కూలీలు, ముడిపదార్థములు, అన్నియు చక్కగ అమరియుండికూడ, మిల్లు నెలకొనలేక పోవుచున్నదనుట చాల విచారకరముగా నున్నది. మన సీమలో ఇదేగాక, పింగాణి, రంగులు, సిమెంటు, అగ్గిపుల్లలు, సూనెకంపెనీలు, సబ్బు పరిశ్రమ, నూలు మిల్లులు, కర్రి చేయు వివిధ పరిశ్రమల నెన్నిటినైన స్థాపించి నడుప వీలున్నది. త్వరలో తుంగభద్రనుండి విద్యుచ్ఛక్తి రానున్న ఈ సమయములో మన సీమవాసులు భారీపరిశ్రముల నెలకొల్పక, ఉన్న పరిశ్రమలను పై మిల్లువారివలె అమ్మివేయుట చాల హీనమని చెప్ప వచ్చును.

కనుక తిరుపతి కాగితపు మిల్లును అవమానకరముగ ఇతర ప్రాంతీయులు కొనకుండ, ఆ పరిశ్రమ అదే స్థలమందు నెలకొని రాయలసీమకు ఒక ఆదర్శ పరిశ్రమగ — కాగితము, అట్టలు స్వయం సమృద్ధిగ మనసీమకు అందుబాటులో ఉండులాగున చేయుటకై, తగుమైన శ్రద్ధతో ఎవరైన పెద్దలు లేచి అమ్మకములో నున్న పై మిల్లును కొనిగాని, దానికి కావలసిన ధన సహాయము చేసి గాని, కీర్తిని, రాయలసీమలోని క్షామమును తొలగింపగోరి ముందుకు రావలెనని మనవి చేసికొనుచున్నాను.

ఇప్పటికి దాదాపు 6 లక్షల విలువగల యంత్రములు, కట్టడములు ఉన్నవి. ఇక నాలుగు లక్షలు ప్రోగుచేయగల ఆదర్శమూర్తి చేయికలిపిన, అంతయు మన సీమకే చెల్లుబడి కాగలదు. త్వరపడండి. ఈ భారమును వహించి పూర్వపు మనవారి పేరును నిలుపుదురని ఆశించుచున్నాను.

పై కంపెనీ వివరములను శ్రీ. ఐ. మునుస్వామినాయుడు గారు, అడ్వకేటు, చిత్తూరు. అని వ్రాసిన తెలియగలవు.

డిండిగల్లు.

కె. ఎ. దేవరాజు,
పయినీరు బోర్డుమిల్సు.

---

## ప్రకటన.

కడప జిల్లా కాంగ్రెసు సంఘము తరపున తాలూకాకు యిరువురు చొప్పున కాంగ్రెసు ప్రచారకులుగా పనిచేయుటకు మాసమునకు రు. 100-0-0 లు వేతనముపై, కాంగ్రెసుపై భక్తిగలవారు, తెలుగున మంచి వాక్చాతుర్యము గలవారు, ఈ క్రింద కనుపరచిన అడ్రసుకు, ఈ నెల 30 వ తేదీ లోపల దరఖాస్తులు పంపవలెను.

టి. పుల్లారెడ్డి, బి. ఏ., బి. యల్.,
అధ్యక్షులు, జిల్లా కాంగ్రెసు సంఘము,
కడప.

---

### గాంధీజీ జ్ఞాపకార్థము

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

---



---

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE.: : PUBLISHER: V. R. GOPALAKRISHNA

# భారత జ్యోతి

వ్యవస్థాపకులు:... పి. కమలాకరరెడ్డి, బి. ఏ.,    సంపాదకులు:... సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము — 4.

సంచిక — 37.

*

ప్రతి బుధవారము.

ప్రకటింపబడును.

*

సంవత్సర చందా రు 9—0—0

విడి ప్రతి ... రు 0—3—0

## విషయానుక్రమణిక

నవంబరు 21, 1951.

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 37.

శ్రీ ఖరనామ సంవత్సర కార్తీక బ. ౮, నవంబరు, 21, 1951.

ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## మంచి సాంప్రదాయములను ప్రవేశ పెట్టుడు.

ఇండియాకు స్వాతంత్ర్యము లభించిన తర్వాత, కాంగ్రెసు సంస్థ, దాని చరిత్రలో ఇప్పుడే మొట్టమొదటిసారి ఒక రాజకీయపార్టీగామారి, గడచిన ఐదు సంవత్సరములుగ అనుభవించిన అధికారమును బలపఱచుకొనుటకును, ఇంకను ఎక్కువ రాజకీయ అధికారమును చేబట్టుటకును, రానున్న ఎన్నికలలో పోటీచేయుచున్నది. దేశమునకు స్వాతంత్ర్యము రాకముందు కాంగ్రెసు సంస్థ పలుమారులు ఎన్నికలలో జోక్యము కలిగించుకొని పోటీచేసినది. అప్పుడు అది కేవలము రాజకీయ సంస్థగా పోటీచేయక, జాతీయ సంస్థగా పోటీచేసినది. విదేశీయులనుండి రాజకీయ అధికారమును లాగుకొనవలయునను ఒకే ఒక్క ఉద్దేశ్యముతో ఎన్నికలలో పోటీచేయుచూ వచ్చినది. ఈ విషయమును ఎల్లరు స్పష్టముగా తెలుసుకొనవలెను. నైతిక దృక్పథములో ఉత్తమోత్తమమైన స్థానమును అధిష్టించియుండిన వ్యక్తి, మట్టినుండి మనుష్యులను చేయగలిగిన వ్యక్తి — ఆ సంస్థపై అధికారము చెలాయించుచుండెను. అతని శంఖారావమును పూరింపగనే ప్రజాసామాన్యమంతయు ఉప్పొంగిపోవుచుండెను. బ్రిటీషు పరిపాలకుల దాస్యమునుండి స్వతంత్రులగుటకై పచ్చపెట్టెలో తమ ఓట్లను వేయుచువచ్చిరి. అప్పుడు ఏ కోరికపై పచ్చపెట్టెలో తమ ఓట్లను వేసిరో, ఆ కోరిక నెరవేరినది. దేశ స్వాతంత్ర్యమునకై పోరాడవలెనను సమస్యయే ఇప్పుడు లేదు. 'అధికారము'; 'అధికార పదవులలో నుండుటకు అవకాశము'; 'దేశమును పరిపాలించు అధికారము'; అను సమస్యలపైననే కాంగ్రెసుపార్టీయును, ఇతర రాజకీయపార్టీలును ఇప్పుడు ఎన్నికలలో పోటీచేయ ప్రయత్నించుచున్నవి. ఈ పై మూడు సమస్యలు తప్ప మరేలాటి సమస్యలు వానియందు లేవు.

ఇంతకు ముందుండిన ఇతర రాజకీయపార్టీలకన్నను, కుక్కగొడుగులరీతి ఇప్పుడు లెక్కకు లేకుండా పుట్టిన రాజకీయపార్టీలకన్నను, కాంగ్రెసుపార్టీ ఎక్కువ అనుకూలమైనటువంటి స్థానములో నున్నదనుట కెట్టి ఆక్షేపణ యుండబోదు. ఇప్పుడు అధికారములో ప్రత్యక్షముగ నున్న పార్టీ కాంగ్రెసుపార్టీయే. ఏలాటి స్పష్టమైన ప్రణాళికలులేక, అనేక పేర్లక్రింద కుక్కగొడుగుల వలె లెక్కలేనన్ని రాజకీయపార్టీలు ఎన్నికలకు ముందు పుట్టుటకు కారణమేమి? కాంగ్రెసు పార్టీని అధికారమునుండి తొలగించుటే ఈ అన్ని రాజకీయపార్టీల ఉద్దేశ్యమైనటుల తోచుచున్నది. కాంగ్రెసుతో పోటీచేయుచున్న ఇతర రాజకీయ పార్టీలలోను, అభ్యర్థులలోను ఈ ఒక్క విషయమే ఎక్కువ ప్రాముఖ్యముగా నున్నటుల తోచుచున్నది. కాంగ్రెసుపార్టీ విషయమై దేశములో ఒక మూలనుండి మఱియొక మూలవఱకును ఇంతటి తీవ్రమైన వ్యతిరేకాభిప్రాయము ప్రబలుటకు కారణమేమి?

కాంగ్రెసు పార్టీ ప్రభుత్వాధి కారము లోనికివచ్చి ఐదు సంవత్సరములకు పైగా అయి నది. ఈ కాలములో సామాన్య ప్రజలెల్లరు ఆనం దించునటుల దేశపరిపాలనము జరుగలేదు. తెల్ల దొరలు నైతొలగి, వారిస్థానములో కద్దరు ధరిం చుదొరలు మాత్రమే రావడమైనది. ఈ మా ర్పు ఒక్కటి తప్ప బ్రిటీషువారి పరిపాలనకును, ఇప్పటికాంగ్రెసు మంత్రుల పరిపాలనమునకును సామాన్యప్రజలెల్లరికిని కనపడునట్టి మార్పేమియు జరుగలేదు. మీదుమిక్కిలి కాంగ్రెసు సంస్థలో ను, పరిపాలనాశాఖలలోను అవినీతి యెక్కువై నది. కాంగ్రెసు సంస్థలోనే వివిధ వర్గముల మధ్య అధికారపదవులకు, పోటీపందెములు జరిగినవి. తమ యనుచరులు తిరుగుబాట్లుచేసి, అధికారపదవుల నుండి తొలగింపకుండురీతి, తమశక్తిలోనుండిన అవ కాశములెల్లను వారివశము చేయుటలోనే మం త్రులు కాలము గడుపవలసి వచ్చెను. మంత్రి పద వులలోనున్న వారిలో ఎక్కువమంది త్యాగము వల్లను, యోగ్యతవల్లను, శక్తిసామర్థ్యములవల్ల ను వచ్చినవారుకారు. యుక్తులవల్లను, కుట్రలవ ల్లను మంత్రిపదవులలోనికి వచ్చినవారే ఎక్కువ. దినదినమునకును హద్దులేకుండ పెరుగుచున్న ధర లవల్ల సామాన్య ప్రజలయొక్కయు, బీదప్రజల యొక్కయు జీవితములు నికృష్టములై, దుర్భర ముగ పరిణమించు చున్నవి. సామాన్య ప్రజా నండఱిని ఎదుర్కొని పీడించుచున్న సమస్యలేవో అర్థము చేసుకొనుటకైనను ప్రయత్నించిన పా పమునపోయిన మంత్రిపుంగవుడు కనబడుటలేదు. అందువలనవారు ప్రజల విశ్వాసమును కోలుపో యిరి. పరిపాలించుటకు హక్కును కోలుపోయిరి. ఇందుకుగాను. అనేకవిధములైన సంజాయిషీలు యివ్వబడినవి. ఇకముందు సంజాయిషీలు కూడ ఇవ్వబడును. కాని వొట్టి సంజాయిషీలు సహింప రానిస్థితి యందున్న బీదలను ఉద్ధరింప జాలవు. ఆకలిని ఆర్పజాలవు.

కాంగ్రెసు సంస్థ ప్రతినిధులుగా మంత్రిపద వులలో నుండువారు ప్రజలయొక్క సానుభూతిని సంపాదించుకొను బంగారువంటి (మహోదవకాశ మును) అవకాశమును పోగొట్టుకొనిరి. స్వాతం త్ర్యము వచ్చిన ఐదు సంవత్సరముల లోపలనే అన్నిరంగములలోను, క్లిష్టమైన అన్నిసమస్యలను పరిష్కరించుటకు వీలుకాక పోవచ్చునుగాక. దానికి విచారములేదు. ఐదు సంవత్సరములు కొద్దికాలమే. ఎల్లరు దీనిని అంగీకరించెదరు. "ఇప్పుడు ఉన్న పరిస్థితులలో మంత్రులు ఎంత చేయవచ్చునో అంతయు పూర్తిగ చేసియున్నారు. ఇంకనూ కొంత అవకాశము ఇచ్చినచో, ప్రజల కు ఇంకను ఎక్కువసేవ చేయగలరు" అను వాతా వర్ణమును దేశములో కలిగింపజాలరైరి. వారి నైతిక ప్రవర్తనమును, న్యాయదీక్షను, పరిపాల నా సామర్థ్యమును ఎవ్వరు కాని సందేహించుట కట్టి అవకాశము లేకుండు స్థితిమెలగరైరి. మంత్రు లు ఎన్నికలకు నిలుచుటగో, వారికి పోటి పెట్టుట, పోటిచేయుట అన్యాయమనియు, [illegible] ప్రజలు భావించు స్థితి [illegible] కలిగింప జాలరైరి.

పోటిలేకుండగ ఎన్నుకొను [illegible] గౌరవమును, బహుసంఖ్యాకుల ప్రజలనుండి ఏ మాత్ర యు పొందజాలడమ్యెను. ఒక్క జనహారిలాలు తప్ప, తననియోజక వర్గములో సంచలనము సలిపి, ప్రచారము చేసుకొనకనే, తనకు జయము తప్పక కలుగునని చెప్పగల మంత్రి ఒక్కడు కూడ కాన రాడుకదా? ఐదు సంవత్సరములు అధికారపదవుల లో నుండి తమ ప్రచారములో జనహారిలాలుగారి చేసను, మర్యాదను, వారుకొనిన వ్యక్తిగతమైన తమ స్వశక్తితో నిలుప్పను సమీకరింప జాలరైరి కదా? దీనినంతయు [illegible] సంవత్సర మం త్రులు ఎన్నికలలో [illegible] లేక అపజ యమొందుట శ్రీ. జనహారిలాలుగారి వ్యక్తిగత మైన మర్యాదపై సంపూర్ణముగ ఆధారపడి

యున్నదని తేలుచున్నది. అధికార పదవులనుండి తొలగించినచో, ఇతర మంత్రులకు వ్యక్తిగతమైన స్వశక్తి లేదనికూడ తేలుచున్నది. ఇదినిజముకాదని ఎవ్వరైన చెప్పుచో, అట్టివారు, వారి నియోజకవర్గములలో ప్రచారము చేయుటమాని, ఇతర ప్రదేశములకు పోయి కాంగ్రెసు ప్రభుత్వములు సాధించిన ఘనకార్యములను గుఱించి ప్రచారముచేయమనుడు. తమ నియోజక వర్గములో జయమును సంపాదింప మనుడు. ఇండియాకు స్వాతంత్ర్యము లభింపకముందు బెంగాలు రాష్ట్రములోను, ఇతర రాష్ట్రములలోను కొందఱు నాయకులు జయిళ్ళలోనుండియే నామినేషన్‌లను దాఖలుచేసి ఎన్నికలలో జయించిరి. శ్రీ. జవహరిలాలు నెహురు ఒక్కడుతప్ప, ఈ సవాలుకు మఱి ఏ మంత్రియైనను నిలువగలడా? ఎన్నికలలో సాధారణముగ ప్రతి మంత్రికి పోటీచేయుచున్నటుల తెలియుచున్నది. నామినేషన్ దాఖలుచేసినది మొదలు ఎన్నికలు పూర్తి యగువఱకును ప్రభుత్వ కేంద్రస్థానము వదలి, అన్నిపనులను కట్టిబెట్టి, మంత్రులు తమతమ నియోజక వర్గములలో ప్రచారము చేసుకొనవలసి యున్నది. మంత్రులతో పోటీచేయు ప్రత్యర్థులకి జయించుట కెంతమాత్రము అవకాశము లేకుండుగాక. అంతమాత్రముచే మంత్రులు ప్రచారము చేయకుండ మానుకొనుటకు వీలులేదు. ఈ ఎన్నికలలో మునిగి తేలు మంత్రులు, ఈ రెండు నెలలకాలము పరిపాలనకు సంబంధించిన విషయములను ఎంతమాత్రము చక్కగా చూచుకొనగలరో అర్థముకాదు. ఈ రెండు నెలలు టాక్సు పేయర్ల దుడ్డుమాత్రము వీరి జీతాల క్రింద కర్చుపడే తీరును. త్యాగధన్యుడైన గాంధీజీ పేరును, విధి విరామము లేక వాడుచుండు మంత్రులు, ఇట్టి దుబారా కర్చులకు తావివ్వక, బ్రిటీషు, అమెరికా, పార్లమెంటు సాంప్రదాయములను సాకుగా పెట్టుకొనక, తమంతకు తామే ఎన్నికలకు ముందు రాజీనామాల నొసగి, కాంగ్రెసు సంస్థ గౌరవమును కాపాడెదరు గాక యనియు, మంచి సాంప్రదాయము నొకదానిని రాజకీయములలో ప్రవేశపెట్టెదరు గాకయనియు కోరుచున్నాము.

# కడప జిల్లాలో క్షామము.

కడప జిల్లా బోర్డు అధ్యక్షులైన శ్రీ టి. పుల్లారెడ్డి గారు ఈ క్రింది పత్రికా ప్రకటనము గావించుచున్నారు:—

వర్షములు బొత్తిగ లేనందు వల్ల జిల్లా యంతయు పైరులు చెడిపోయినవి. ఎండి పోయినవి. కఱవు పరిస్థితులు యేర్పడినవి. నేను కొన్ని ప్రదేశములను స్వయముగా పర్యటనము చేసినాను. చూచినాను. అన్నములేక అలమటించేవారికి, వ్యవసాయముపై యాధారపడి యుండు వారికి పనులు కలిగించుటకై కొన్ని రోడ్డు పనులను, జిల్లా డివిజనల్ ఇంజనీరు గారితో మాట్లాడి, జిల్లా కలెక్టరు గారికి పంపినాను. వెంటనే పనులను ప్రారంభించుటకు వీలు కలిగింప వలెనని మంత్రులకు వ్రాసి యున్నాను. కాని మేము సూచించిన పనులలో యేమో వివరములు తక్కువగా యున్నవనియు, వానినంతయు రెవిన్యూబోర్డువారు కలెక్టరుగారికి వాపసు చేసి, మరి[illegible] వివరములతో వ్రాయమని తెలిపి యున్నారు. ఇట్టి యఱ్ఱ దారము (Red-tape) పద్ధతు లెప్పుడు పోవునో, చేసిన ప్రయత్నములకు ఫలితము లెప్పుడు త్వరత్వరగా కలుగునో నా కర్థము కాక యున్నది. కలెక్టరు గారు మరలా రెవిన్యూ బోర్డుకు వ్రాసే వఱకు కొంత ఆలస్య మగును. రెవెన్యూ బోర్డు ఆఫీసు వారు వానిని మరలా పరీక్షించి మంత్రుల వద్దకు ఆమోదమునకు పంపుటకు యింకా కొంచెము ఆలస్యమగును. ఇట్లు అడుగడుగునకు ఆలస్యమైనచో, పనులు ప్రారంభించేది ఎప్పుడో; కఱవుతో పీడింపబడు ప్రజలకు పనులు కలిగే దెప్పుడో తెలియుట లేదు. జిల్లా కలెక్టరు గారు యీ విషయములో ప్రత్యేకమైన శ్రద్ధతో రెవిన్యూబోర్డువారికి రిపోర్టును మరల పంపి, సర్కారు వారు వెంటనే క్షామ పనులు ప్రారంభించునట్లు వొత్తిడి చేయ కోరుచున్నాను.

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్.,)

(న్యాయశీలుడు — మిరిల్.)

—(5)—

ఆయన జననము జనపదమున, వివిధ ప్రాంతము లందలి ప్రజల వాడుక భాషను చక్కగా నేర్చుకొన్నాడు. ఎక్కడికి తగినట్లు అక్కడ మాట్లాడును. ఇది జనసామాన్యమునకు ప్రీతి గొల్పి, వారి హృదయములలో ఆయనకు స్థాన మిచ్చినది. తన యింట నెంతో, గుడిసెలో నంతే. కొండపై నంతే. మహోన్నత గంభీర విషయములను సర్వ సామాన్య భాషలో వెల్లడించును. భాషలో యన్ని భేదములును ఆయన యెఱుగును. కావున ఆయన మాటలు వినువారికి నేరుగా హృదయ గతములగును. ఇదిగాక ధనవంతుల యెడ, బీదల యెడ ఆయన ప్రవర్తన యొక్కటే.

దేనినీ తొందర పడి, పరిస్థితుల నెఱుగక ఖండింపడు. "తప్పెట్లు జరిగినదో కనుగొందము." అని సావధాను డగును. తానును తొలుతటి నాళ్ళ పాపియని చిరునవ్వుతో అంగీకరించును. కావున, పుణ్యాత్ములమని బడాయి కొట్టు వారి అస్పృశ్యత ఆయనలో లేదు. భయంకర సుచరిత్రుల బూమ ముడికిని వెఱువక, ఈ క్రింద కనుపరచిన సిద్ధాంతము యించు మించుగా చేసినాడు.

"మనుష్యుని దేహము గొప్ప మోతయు, మరులు గొల్పునదియు. దానిని మానవు డీడ్చుకొని, దానిలో బడు చుండును.

"దానిని హద్దులో నుంచుటకు, అణచుటకు నిరంతరము కనిపెట్టి యుండ వలెను. కడపట, కడవ రానప్పుడే లొంగ వలెను. అప్పుడైనా లొంగుట తప్పు కావచ్చు కాని, మోకాలిపై బడుటై, ప్రార్థనగా పరిణమింప వచ్చును.

"ఋషి యగుటరుదు. సత్యవంతుడుగ నుండుట తప్పనిది. పొరపడ వచ్చు, తప్పటడుగు వేయవచ్చు, పాపము చేయవచ్చు. సత్యము వీడకు.

"సాధ్యమైనంత తక్కువ పాపము సేయుట మానవునికి శాసనము. పాపము సేయకయే బ్రతుకుట దైవ స్వప్నము. ప్రభు సంబంధము గల ప్రతి దానికిని పాపము తగులును. పాపము భూమ్యాకర్షక శక్తి వంటిది."

దేనిని గుఱించియైన ఎవరైన అత్యాగ్రహము చూపి, కేకలు పెట్టి విమర్శించుటను ఆయన వినెనేని, తిన్నని నవ్వుతో "ఓ ఓ! అది మహా పాపము కాబోలు. వారందఱును తామే యీ పాపము చేయుచున్నారు. భయకంపితమగు వంచన తన్నెట్లు సమర్థించుకొనును. ఎట్లు తన్ను కప్పికొనును!" అని పలుకును.

ఆడు వారిపై, బీదలపై సంఘ భారమంతయు పడును. కావున వారి యెడ మిక్కిలి దయాళువై యుండును. "స్త్రీలు, శిశువులు, సేవకులు, దుర్బలులు, దరిద్రులు, అజ్ఞానులు, చేసెడి తప్పులు భర్తలవి, తండ్రులవి, బలవంతులవి, ధనవంతులవి, జ్ఞానులవి" యనును. వేరొకప్పుడు "అజ్ఞులకు వారికి చేతనైనంత బోధింపుము. అందరికిని విద్య ప్రసాదింప కుండుటచే సంఘము శిక్షార్హము. తాను కలిగించిన చీకటి కది యే యుత్తరవాది. ఆత్మను చీకటిలో విడిచిన పాపములు జరుగును. పాపము చేయువాడు అపరాధి కాదు. అజ్ఞానము నిర్మూలింపని వాడు అపరాధి" అని చెప్పును.

విమయ పరిశీలనము నందాయన దొక వింత క్రొత్త పద్ధతి యని మనకు తెలియుచున్నది. దాని నతడు సువార్తల నుండి సంగ్రహించి యుండునని నా యూహ.

ఒక నాడు నలుగురు కూడి మాట్లాడుచున్నప్పుడు విచారణకు రానున్న ఒక నేర వృత్తాంతమును వినెను. ఒకడు భార్య బిడ్డలపైన అతి ప్రేమచే, వారిని పోషించు వేరు విధానము లేకుండుట వలన, కృత్రిమ నాణెములను తయారు చేయ సాగెను. ఆ నేరమునకు శిక్ష ఉరి. అతడు చేసిన మొదటి నాణెమును బజారులో చెల్లించి, భార్య పట్టుబడెను. ఆమెను జెయిలులో పెట్టిరి కాని, ఆమెయే నాణెమును చేసినట్లు ఋజువు లేదు. చేసిన వానిపైన సాక్ష్యమామె

మాత్రమే చెప్పగలదు. శిక్ష కీయ్యగలదు. కాని, అతడపరాధి కాడని భీష్మించినది. అప్పుడు, ఎదుటి వక్కీలు ఒక యుక్తి చేసెను. ఆమె మగడు వ్యభిచారియని చెప్పి, కొన్ని జాబుల ముక్కలను ఇక్కడి వక్కడ, అక్కడి విక్కడ జతపరచి, ఆ యభాగ్యురాలిని నమ్మించెను. ఈర్ష్యాచోదితురాలై, ఉన్నదున్నట్లు వాణ్మూల నేరము నంతయు వివరించి, నిరూపించినది. త్వరలోనే వారిద్దరిని విచారింతురు. శిక్ష తప్పదు. ఇది కథ. విన్నవారందరు ఆ వక్కీలు తెలివితేటలకు మెచ్చుకొని, క్రోధము, సత్యమును బయల్పరిచి, ప్రతీకార చింత న్యాయమునే కలిగించుటకు పాల్గొంచుచుండిరి. ఇది యంతయు బిషప్పు నోరు మెదల్పక విని "వారి నెక్కడ విచారించెద రు?" అని ప్రశ్నించెను.

"న్యాయ సభలో" అని జవాబు.

"వక్కీలు నెక్కడ విచారింతురు?"

డి—లో ఒక విషాద సంఘటనము జరిగెను. ఒకనికి ఉరిశిక్ష చెప్పబడినది. ఆ నిర్భాగ్యుని చదువు చాల తక్కువ. కాని, సంపూర్ణముగ అజ్ఞుడు కాడు. సంతలలో ఇంద్రజాలము చేయుచుండిన వాడు. నిరక్షరకుల కుత్తరము వ్రాసి పెట్టుచుండిన వాడు. అతని విచారణను గురించి ప్రజలెంతో ఔత్సుక్య మగపరచిరి. అతని నురి తీవలసిన నాటికి ముందు రోజు సాయంత్రము, మరణదండన విధింపబడిన వారికి దైవ చింత గలుగుటకని నియమింపబడిన యుద్యోగికి జబ్బుచేసెను. క్యూరేకు చెప్పి పంపిరి. "అది నా పని కాదు." ఆ నీచకార్యములో కాని, ఆ దొంగ వెధవతో కాని నా కక్కరలేదు. అదీకాక నా దేహ స్థితియు బాగలేదు. ఇంకెందుకు, అది నా పని కాదు." అని జవాబు పంపెను. ఈ వార్త విని, బిషప్, 'అతడన్నది సత్యమే. ఆ పని యతనిది కాదు. నాయది' అని పలికెను.

(సశేషము.)

---

# జానకి.

(శ్రీ వాల్మీకి.)

## (17)

మధ్యాహ్న కాలము. సూర్యుడు నడి మింట జేరి తీక్ష్ణకిరణముల బరపుచు పాంథుల పాదపముల క్రీనీడకు జేర్చుచుండెను. ఒక యువకుడు దీర్ఘ ప్రయాణమున బడలిక జెంది, నిర్మానుష్యమగు వనసీమయందు ఒక చెట్టుక్రింద జేరి ఇట్లు తలపోయుచుండెను.

"నడిచి కూర్చొనలేక, నేల విడిచి సాము జేసినట్లు, మధుసూదనుని యండబాసి, జానకిని వెదకుచు విసిగివేసారితిని. బొంబాయి నగరమున గానరాలేదు. పూనాయందు జాలకు వే లేదు. ఇక వెదకుటమాని, ఊరు చేరుకొనుట ఉత్తమము" అని పైనున్న వస్త్రము క్రింద పరచుకొని విశ్రమించెను. శ్రమ జెందినవాడగుట త్వరలో నిదుర జెందెను.

ఈతడు విశ్రమించిన స్థలము కోడూరు నానుకొనియుండు ఒక రసాతల వనము. బొంబాయి, పూనాలలో జానకిని వెదకి విసుపు జెంది, మదరాసునకు పయనించుచు, కోడూరు రమణీయమగు స్థలమని విని, అందు వెదకుటకై దిగెను. వెదకి జానకిని కనుగొనలేక ఈ తోటయందలి వృక్ష చ్ఛాయలో విశ్రమించెను.

ఇట్లుండ ఆ చెట్టునీడయం దాసీనుడగుట కొక నూతన యువకు డొక పెట్టెతో వచ్చి కూరుచుండెను. నిదురించుచున్న చంద్రశేఖరుని పరికించిచూడలేదు. పచ్చికయం దాసీనుడై, పెట్టెను తెరచి, యందున్న పైకమును, బంగారమును, కకన్ని నోట్లను చూచి మహానందపరవశు డయ్యెను. ఆ దులో నొకప్రక్కనున్న ఉత్తరమును దీసి యిట్లు చదువ జొచ్చెను.

"మహాశయా! నేను మీయిల్లు వదలి యెందో పోవుచున్నాను. కారణ మేమన మీ గృహమునకు నేడు నా స్నేహితులగు శ్యామల, రుక్మిణీలు వచ్చుచున్నారు. వారు నన్ను చూచిరేని చంపుదురు. రెండవ విషయము, ఈ పెట్టెయందు పదివేలు చేయగల ధనమున్నది. ఇయ్యది మీ తండ్రిగారు గడించిన దగుట, మీరే యనుభవింప నర్హులు. అందుచే నియ్యది మీకే వదలిపోవుచున్నాను. శెలవు."

ఇట్లు,
జానకి.

అని యున్నది. ఈ కొత్తియువకు డది చదివి, పులకిత గాత్రుడై, 'జానకి యింకను బ్రతికి యున్నదా! నాడు కాలువలో బడి చావలేదా? ఇంకను ఈ నిర్భాగ్యుడ నామె దర్శనమును నోచుకొని యున్నానా?' అని పులకిత శరీరముతో గట్టిగా మాటాడజొచ్చెను. నిదురించుచున్న చంద్రశేఖరుడు మేల్కాంచి, ఈ మాటల వినుచుండెను. ఈ నూతనవ్యక్తి యింకను ఇట్లు తలపోయ మొదలిడెను, 'మోహపరవశుడనై చంద్రశేఖరుని ప్రేమించిన జానకిని బలాత్కరించి, యింత కష్టములపాలయితిని. మిత్రుడగు వానిని ఏమనసాటున

చంపితిని. బ్రతికియున్న ఆమె పాదములపై వ్రాలి నా తప్పు క్షమించుమని వేడికొందును.' కొంత వితర్కించుకొని, మఱలా 'రుక్మిణి డాక్టరును ప్రేమించినది. డాక్టరు మాత్రము రుక్మిణిని ప్రేమింపలేదు. అతడు వేరొకరి నెవ్వరినో ప్రేమించుచున్నట్లున్నాడు. ఈతనికి, జానకికి ఏమి సంబంధమున్నదో తెలిసికొనవలెను' అని లేచి పెట్టె మూతవేసి, చేత బట్టుకొని ఆ వనమున కొంతదూరమేగి, నిదురించుచున్న చంద్రశేఖరుని మఱుగుపఱచి, ఒక చెట్టుక్రింద ఒక గుంటను త్రవ్వుచుండెను. గుంట పూర్తికాగానే, పెట్టె నందులోబెట్టి, మట్టి గప్పి, గురుతు బెట్టుకొని, రైల్వేస్టేషనువైపు బయలుదేరెను. అత డేగుచుండ, చంద్రశేఖరుడు ఆతనికి కనుబడని రీతిగా వెంబడించుచుండెను. ఇట్లిద్దరు రైల్వేస్టేషను జేరిరి. బొంబాయినుండి మదరాసునకు బోవు ఎక్స్‌ప్రెస్ రాకకు ప్లాట్‌ఫారమున ప్రయాణీకులు క్రిక్కిరిసి యుండిరి. నూతన పురుషుడు మదరాసుకు టిక్కెట్టుగొని ఒకచో గూర్చుండెను.

పాఠకమహాశయులారా! ఈత డెవ్వడైనది ఈ పాటికి తెలిసికొని యుందురు. ఈతడే శ్యాములుడు. ఆసుపత్రినుండి విడుదలై, రుక్మిణితో సహా డాక్టరును జేరెను. డాక్టరింటిలో ఒక మూలనున్న ఈ పెట్టెను జూచి, ఇయ్య దేమిటో చూడవలయునని, ఒకనాడు కృత్రిమమైన తాళపుచెవి నుపయోగించి తెఱచి, అందులోనున్న ద్రవ్యమును గాంచి, దానిని అపహరింప నెంచి, పై విధముగా కోడూరునగల ఒక తోటయందు పాతిపెట్టెను. కోడూరు చెన్ననగరమునకు 119 మైళ్ళ దూరమున గలదు. కోడూరు చీనీ పండ్లకు ప్రఖ్యాతిజెందినది. కమలాఫలముల తోటలు గలవు. అందుచే అన్యదేశీయుల సంచారము సాంకర్యముగ నుండును. ఇచ్చట ద్రవ్యము నెందేని దాచియుంచినచో, అవసరమైన తరుణమున ఇచ్చటనే కాపురము పెట్టి, పండ్లవ్యాపారము చేయవచ్చునని శ్యాములుడు తలంచెను.

వెంబడించుచున్న చంద్రశేఖరు డితని చర్యలను గమనించిన వాడగుట రైల్వేపోలీసుల కీ యుదంతము రిపోర్టుచేసెను. వా రాతని వెంటనే అరెస్టు చేసి, చంద్రశేఖరుని సాయమున భూస్థాపితమైన పేటికను దీసి, అతనిని లాకాపునం దుంచిరి.

చంద్రశేఖరుడు బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు చేరెను. సెంట్రలు స్టేషను దిగుసరికి పోలీసు లీ చంద్రశేఖరుని నిర్బంధించిరి. కారణ మేమన, జానకిని గోల్పోయిన లక్ష్మణరావు, శ్యాములుడు పెండ్లిచేసికొనెనని విని తృప్తిపడినను, ఎంతకాలమైనను వారిజాడ కనుబడనందున శ్యామల, చంద్రశేఖర, రుక్మిణులపై పోలీసులకు ఫిర్యాదు చేసెను. పోలీసు దర్యాప్తు సాగుచునే యుండెను. చంద్రశేఖరుడు సెంట్రలుస్టేషనులో దిగగనే పోలీసు లితని గుర్తించి, బంధించిరి.

రుక్మిణి కొఱకు పోలీసు దర్యాప్తు సాగుచుండెను. శ్యాములుడు చోరీకేసులో చిక్కినవాడగుట, ఆ ద్రవ్యము వచ్చినమార్గము నన్వేషింప పోలీసులు ప్రయత్నించుచుండిరి. తుదకు శ్యాములుడా ద్రవ్యమును దొంగిలింప లేదనియు, తన సోదరియగు రుక్మిణిదనియు, చెప్పెను. రుక్మిణి విలాసము తెలిసికొని, ఆమె నడుగ, ఆమెకును ఆ ద్రవ్యమునకును సంబంధము లేదనెను. కాని జానకి అదృశ్యమైన కేసులో లక్ష్మణరావు ఈమెనుకూడా చేర్చెను గనుక, రుక్మిణిని బంధించి, లాకాపునం దుంచిరి.

(17 వ ప్రకరణము సమాప్తము.)

---

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనములక్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని నమ్మి ప్రకటింపవలయునో తెలియకున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాలు తెలుపక వ్రాయు జాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటించుట కెంతమాత్రము వీలుండదని విన్నవించుకొనుచున్నాము—

సంపాదకులు, "భారత జ్యోతి"

## గాంధీజీ జ్ఞాపకార్థము

ప్రతిదినము ఆయన ప్రాణము విడిచిన సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసికొందుముగాక!!

# ఎన్నికలు—అభ్యర్థులు గమనింప వలసిన విషయములు.

ఎన్నికలకు నిలబడు అభ్యర్థి భారతదేశ పౌరుడై, ఓటర్ల జాబితాలో పేరు నమోదైనవాడై వుండవలెను. పోటీచేయునది రిజర్వుడుసీటైన, అతడు షెడ్యూల్డు తరగతులు, షెడ్యూల్డు జాతులకు చెందిన వాడుగా కూడా ఉండవలెను. మతి సరిగా లేనివారు, ఇన్సాల్వెంటు అయి తిరిగి డిస్చార్జి కానివారూ, అభ్యర్థులుగా నిలుచుట కర్హత లేదు. ఆయా ప్రభుత్వముల క్రింద లాభకరమైన ఉద్యోగము చేస్తున్నవారూ, కాంట్రాక్టులు చేస్తున్నవారూ, ఆయా ప్రభుత్వానికి ఏదైనా షేరుగాని, ఆర్థికముగా ఇతర ప్రయోజనముగాని వున్న సంస్థలో డైరక్టరుగానో, మేనేజింగు ఏజంటుగానో వున్నవారూ అభ్యర్థిగా పోటీచేయుటకు తగరు. ఏదైనా ఒక నేరానికి రెండేడ్లకు తక్కువ లేకుండా శిక్షకు పాత్రులైనవారు కూడ ఎన్నికకు అనర్హులే. ఆ నేరము ఎన్నికల నిబంధనలకు సంబంధించినదైన, కొంత కాలము వరకూ అతనికి ఆ అనర్హత ఉండును. ఏ వోటరైనాసరే, పార్లమెంటుకు పోటీచేయదలచినపుడు, భారత దేశములోని ఏ పార్లమెంటరీ నియోజక వర్గమునుండి అయినా పోటీచేయవచ్చు. లెజిస్లేటివ్ అసెంబ్లీకిగాని, లెజిస్లేటివు కౌన్సిలుకుగాని కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకు గాని పోటీచేయదలచిన ఏ స్టేటునుండి తాను ఎన్నిక నభిలషించునో, ఆ స్టేటులో వోటరై యుండవలెను. స్టేటు లెజిస్లేటివు అసెంబ్లీకి గాని, పార్లమెంటుకు గాని నిలబడే అభ్యర్థి వయస్సు 25 ఏండ్లకు తక్కువ వుండరాదు. స్టేటు లెజిస్లేటివు కౌన్సిలుకూ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకూ నిలిచే అభ్యర్థి కనీసపు వయస్సు ప్రమాణము 30 సంవత్సరాలు, ఓట్లు సంపాదించడానికి అభ్యర్థి ఎవరికీ లంచమివ్వరాదు. తన తరపున ఇతరులచేత యిప్పించరాదు—ఓటరును సంఘములోనుంచి వెలివేస్తామనీ, వోటరు దైవము యొక్క ఆగ్రహానికి గురికాగలడని, బెదిరింపులు బెదిరించరాదు. పోలింగు బూతులనుండి బాలెటు కాగితాలను అపహరించడానికతడు ఎవ్వరినీ ప్రోత్సహించరాదు. స్వయముగా ప్రోత్సహించక పోయినప్పటికీ, అపహరించడానికి సాహాయపడినా నేరమే అగును. పోలింగుస్టేషనుకు రాకపోకలకై ఏ ఓటరుకూ అభ్యర్థి బండ్లను, మోటారులను ఏర్పాటు చెయ్యరాదు. అంతేకాదు, అతని పార్టీకూడ ఈ పని చేయడము నేరమే అగును. తనయెన్నిక ప్రచారానికై ఏ ప్రభుత్వోద్యోగి సహాయాన్ని అతడు పొందరాదు. పోటీ అభ్యర్థులు జరిపే మీటింగులో తనవారెవ్వరూ అల్లరి చెయ్యకుండా చూడవలెను. యెన్నికలు జరుగునని ప్రకటించిన తేది మొదలుకొని యెన్నికలు పూర్తి అయ్యే తేదీవరకు ఈ జాగ్రత్తలో అతడు ఉండవలెను. పోలింగు రోజున అతడుగాని అతని తరపువారుగాని ఎక్కడా బహిరంగసభలు జరుపరాదు. జరిగితే హాజరుకారాదు. అతని నియోజక వర్గములో పోలింగు జరిగే అన్ని తేదీలకూ ఈ నియమము వర్తించును. పోలింగు స్టేషనుకు సమీపములో —ప్రయివేటు ఇంటిలోనైనాసరే— కాన్వాసింగులు, ప్రదర్శనాలు మొదలైనవి జరిపించరాదు. [illegible] కర్లను ప్రోగించడము మొదలైనవి పూర్తిగా నిషిద్ధము. ఓటింగు రహస్యముగా జరగవలెననే నియమాన్ని అభ్యర్థిగాని, అతని తరపువారుగాని భంగపరచరాదు. భంగపరచిన 3 నెలల ఖయిదు విధించబడును. దీనితోడు జరిమానాకూడా విధించ వచ్చును. బ్యాలటు పెట్టెలతో ఎవరైనా

(మిగత 11 వ పేజీలో)

మాటలాడుట లేదు. ఆ యేకాంత గదిలోనే కాలము గడుపు చున్నది. నేను ఒంటరి దానినైతిని.

సుమిత్రాదేవి యంతయు గ్రహించెను. కుర్చీపై నుండి లేచి, "అమ్మా! మీరు మా పాలిటి భాగ్య దేవతలు. నా పుత్రుడైన సుధాకరుని రక్షించి, ప్రాణదానము చేసియున్నారు. మీరా తరుణములో గొప్ప మనస్సు చేసుకొని, సుధాకరుని వైపు చూడకుండినచో, అతని పేరు మాసిపోయి యుండెడిది. మాకు కండ్ల చూపులు లేకుండెడివి. చిన్నప్పటినుండియు వీనిని నేను పెంచి, పెద్ద చేసితిని. నా బిడ్డను నాకు దక్కనందులకు నా కృతజ్ఞతను స్వయముగ మీకు తెలుపుకొనుటకై వచ్చియున్నాను. ఈ రోజులలో మత వైషమ్యముల వలన ఘోర దురంతములు ఉత్తర హిందుస్థాన మంతయు జరుగుచుండ, మనుష్యరక్తము వీధులలో కాలువలై పారుచుండ, హిందువుల ముఖములను ముస్లింలును, ముస్లింల ముఖములను హిందువులును చూచుటకు భయపడు చుండ, మీరు గాయపడిన నా కొడుకును యింటిలో నుంచుకొని చికిత్స చేసి, ఆదరించి కాపాడుట సహజాతీతమైన విషయము. ఈ మీ విశాల బుద్ధిని, ఔదార్యమును, ధైర్యమును భారత దేశ చరిత్రలో స్వర్ణాక్షరములతో వ్రాయ దగియున్నది. ఈ విషయ మంతయు గాంధీజీకి తెలిసినచో, ఆయన యెంతయో ఆనందించును కదా? మీ ఋణమును ఎన్ని జన్మములకైన బాపుకొన జాలము. నా కృతజ్ఞతా పూర్వకమైన ప్రణామముల గైకొనుడు" మని హిందీ భాషలో భావగర్భితముగ చెప్పి పాదములకు నమస్కరించెను.

నిరాశచే యేమేమో తనలో తాను యోచించుకొనుచు, తన యేకాంత గదిలో ఆ యువతి నిద్ర పోయెను. తల్లి ఆ గదిలోనికి పోయి సుధాకరుడు, అతని వదినెగారు వచ్చిరని మెల్లగా తట్టి చెప్పెను. గాఢమైన ప్రేమానురాగాలు గల యుద్ధులపట్ల యది యేమి యక్షిణీ విద్యయో కాని, ఈ వాక్కులు చెవిని పడగానే నిస్సారము చెందియుండిన ఆ యువతి ముఖారవింద మొక్కసారి సంపూర్ణ కళలతో వికశించెను. నిద్ర మోము కడుగుకొని, సన్నని నల్లని పట్టు దారముల వంటి కురులను సవరించుకొని, గది బయటికి వచ్చి వినయ విధేయతలు మీర సుమిత్రా దేవికిని, సుధాకరునకును నమస్కరించెను. ఆయువతి నిరాశాభావముచే నిద్రించునపుడు క్షీణించిన ముఖ కాంతిని, సుధాకరుడు వచ్చెనని వినబడగనే తేజోవంతముగ ప్రకాశించిన ముఖకాంతిని, ఛాయా పటము గైకొని వుండి యుండినచో, కళంకరహితమైన ప్రేమ యొక్క ఆ యద్భుత శక్తిని ప్రపంచమునకు వెల్లడించుటకు అనుకూలమైయుండెడిది. ముఖములో ప్రేమ వెలిగిన ప్రభావమును పోతనా మాత్యునివంటి మహా కవులుండినచో, ఎట్లు వర్ణించి యుండెడి వారో కదా?

కండ్లు మిరుమిట్లు గొలుపుచు, ప్రకృతి జన్యమైన దివ్యకాంతితో విద్యుల్లతవలె తన యెదుట వెలుగొందుచు నిలువబడిన యువతినిచూచి, సుమిత్రాదేవి దిగ్భ్రాంతురాలాయెను. కన్నులప్పే ఆ యువతిపై నిలిచి పోయెను. కొన్ని నిమిషముల వరకు యేమి చెప్పుటకును నోరాడదయ్యె. తన యెదుట నిలిచినది మానవ చైతన్యము గల వ్యక్తియా లేక కళానైపుణ్యము గల విగ్రహమా యని కొంతసేపాలోచించెను. తాను లేచి ఆయువతి దగ్గరకు వెళ్ళి కౌగలించుకొని తన హృదయానందమును వెల్లడించెను. దివ్య మంగళ విగ్రహమైన ఈ యువతి యేజాతికి చెందినదైనను, యేమతమునకు జెందినదైనను, తోడి కోడలై యుండుటే మహా భాగ్యమని సుమిత్రాదేవి భావించెను. ఇట్టి మహా ప్రసాదమును చేపట్ట కుండుట ఘోర పాపమని ఈ పావని తలంచెను. ఈ యువతి కుల మతములు చెప్పినచో, వదినగారు చూచుటకైనను వచ్చుటకు ఒప్పుకొందురో లేదో అను భీతిచే సుధాకరుడు వదినెగారికి గాని, అన్నగారికి గాని తెలుపలేదు. కాని సుమిత్రాదేవి వారి వేష భాషలను చూచిన వెంటనే అన్యమతస్థులని గ్రహించెను. కాని వారిరువురు మతాతీతులై అన్యమతస్థుడైన సుధాకరుని ఆయాపత్సమయములో దగ్గరకు తీసి ప్రాణములు కాపాడిన విషయము తెలిసి, తాముకూడ కృతజ్ఞతా భావమును సూచించుటకు మతాతీతులుగాలు కావలయుననియే తట్టెను. ఈ సుకుమారి యైన సౌందర్యవతిని చూచిన వెంటనే వద్దని నిరాకరించుటకు నోరాడకపోయెను. ఇట్టి మంగళ స్వరూపిణియైన గవల కాంత తమకు చిక్కునా యను ఆతురతయే సుమిత్రాదేవిలో నెక్కువయ్యెను.

కొంత యుపాహారమును గైకొని ఆయువతివెంట సుమిత్రాదేవి ఏకాంత గృహము ప్రవేశించెను. అందొకమూల కాళియాహి పడగపై నాట్యమాడుచు, వేణుగానము చేయుచున్న కృష్ణ విగ్రహమును, వెలుగుచున్న జ్యోతులను చూచెను. పరస్పర విరుద్ధమైన మత సాంప్రదాయములను గూర్చి ఆ యువతియు, సుమిత్రాదేవియు, కొంత కాలము చర్చించిరి. ఫీజీ దీవులలో తాను బౌద్ధ సన్యాసుల మధ్యను, హిందూ దేవాలయములలోను తీసుకొనిన ఛాయాపటముల నామెకు చూపించెను. ఫీజీ దీవులలో గల మత సాంప్రదాయములను, వృత్తుల యొక్క స్వేచ్ఛను ఆమెకు తెలియబరచెను. సుధాకరుని లోనికి రమ్మని వదినెగారు పిలిచిరి. ఆ మంగళాంగి తన సొత్తు అగువరకూ గదిలో కాలిడుటకు తనకు హక్కు లేదని చెప్పి మేడ పైకి వెళ్ళిపోయెను.

సుమిత్రాదేవి సనాతన హిందూ స్త్రీ. ఈమె యీ సంబంధము గైకొనునా లేదా యను సందేహము వారికి తట్టెను. ఆమెను వారు అడుగుటకు జంకు చుండిరి. ఈ ధర్మ సందేహమును సుమిత్రాదేవి గ్రహించెను. మతములకును, కులములకు అతీతురాలైన ఆకన్యను అనుగ్రహించుటయా లేక నిరాకరించుటయా యను సమస్య అప్పుడే తీర్మానము చేసుకొనవలసి వచ్చెను. అయాచితముగ చిక్కిన దివ్యాంగనను తమలో కలుపుకొనుటకు తీర్మానించుకొనినందున, అన్నపానీయములు వారి యింటిలో తీసుకొనుట కంగీకరించెను. "మేము శాకాహారులము. శాకాహారముల నంగీకరించుటకు మా కభ్యంతరము లేదని" సుమిత్రాదేవి పలికెను. (సశేషము)

అక్రమముగా జోక్యము కలిగించుకున్నచో, అది ఋజువైన పక్షములో, పెనాల్టీలు విధించబడును. ఎన్నిక రద్దుచేయబడి, క్రొత్త యెన్నిక జరుపబడును. ఎన్నికలకు ఖర్చులు అభ్యర్థి తన ఇష్టము వచ్చినట్లు చేయడానికి వీలులేదు. నిర్ణీత పరిమాణానికి మించి ఖర్చుపెట్టినా; తప్పుడు లెక్కలు దాఖలుచేసినా; ఎన్నిక రద్దయి పోవుటేగాక, తిరిగి అతడు ఎన్నిక కనర్హుడని ప్రకటించడము జరుగును. తానుగాని, తన తరఫువారుగాని పెట్టిన ఖర్చులన్నీ అతడు సరిగా లెక్కవేసి, వోచర్లతో సహా జాగ్రత్త చేసి వుంచవలెను. తన పార్టీ టిక్కెట్టు సంపాదించుటకు అతడు పెట్టిన ఖర్చుకూడా దీనిలోచేరును. డిపాజిట్టు పోతే, అదికూడా ఈ లెక్కలోకి యెక్కవలసినదే. అభ్యర్థి స్వయముగా పెట్టిన ఖర్చులేగాదు. అతని తరఫున అతని పార్టీ పెట్టిన ఖర్చులుకూడా ఈ లెక్కలోకి చేర్చవలసే వుండును. ఎన్నికల ఫలితము గెజటులో ప్రకటితమైన 45 రోజులలోగా ఈ యెన్నికల ఖర్చుల వివరాలు అభ్యర్థి దాఖలు చెయ్యవలెను. అట్లు దాఖలు చెయ్యకపోతే అతని యెన్నిక రద్దయి పోవును. పడిపోతే అతడు తిరిగి యెన్నికకు అనర్హుడుగా ప్రకటించడము జరుగును. నామినేషను పాగములు దాఖలుచేసిన ప్రతివారూ—ఆ నామినేషను కొట్టి వేయబడినా సరే, ఉపసంహరించుకో బడినా సరే,— ఈ దాఖలు చెయ్యడము తప్పదు. ప్రతి అభ్యర్థీ ఒక ఎలక్షను ఏజంటునూ, ఒక గుమాస్తానూ, ఒక వార్తాహరునీ మాత్రము జీతమిచ్చి ఏర్పాటు చేసుకోవచ్చును. [illegible] పార్లమెంటుకుగాని, [illegible] ప్రతి అభ్యర్థికి అయినా ప్రతి 75,000 [illegible] ఒక గుమాస్తానూ, ఒక వార్తాహరునీ పెట్టుకోవచ్చును. [illegible] పెట్టుకొన వచ్చును. [illegible] ప్రతి పోలింగు స్టేషనుకూ, [illegible] ఒక పోలింగు ఏజంటునూ, [illegible] ఒక వార్తాహరుని పెట్టుకోవచ్చును. లంచాలు, నిర్బంధాలు మొదలైనవాని మూలముగా ఎన్నికలు స్వేచ్ఛాపూర్వకముగా జరగలేదనే కారణముచేతగాని, ఇంకా కొన్ని అక్రమపద్ధతుల మూలముగా యెన్నిక ఫలితము అక్రమమయినదన్న కారణము చేతగాని యెన్నికను రద్దుచేయించుటకు ఏ అభ్యర్థి అయినా ఎలెక్షను కమిషనరుకు పిటీషను పెట్టుకోవచ్చును. ఒక్క సీటుమాత్రమేవున్న నియోజక వర్గాలలో అయితే ఎన్నికల ఖర్చులు దాఖలుచేసే ఆఖరు తేదీ తరువాత 14 రోజుల లోపుగాను, ఒకటికంటె యెక్కువ సీట్లువున్న నియోజక వర్గాలలో అయిన 60 రోజులలోగాని ఈ పిటీషను దాఖలు చేయవలెను. పిటీషనుతో పాటు రూ 1000 ల డిపాజిటుకట్టవలెను. పిటీషనులో లంచాలివ్వడము మొదలైన అక్రమాలు జరిగినవని కేవలము సామాన్యముగా ఫిర్యాదుచేయుట చాలదు. ఫలాని వారు ఫలాని విధముగా అక్రమము చేసినారని నిష్కర్షగా నిరూపించవలెను. ఇంతకూ ముఖ్యమైన విషయము ఏమనగా, అభ్యర్థి తన ప్రత్యర్థి ఏలాగున నడుచుకోవలెనని తాను కోరునో, అదే రీతిగా తాను నడచుకోవలెను. పోటి చెయ్యడములో ఆదర్శ ప్రాయమైన చక్కని పద్ధతులనే అవలంబించవలెను. ప్రతివారూ ఈ రీతి నియమబద్ధముగా నడుచుకోనడము నేర్చుకొనినచో ఎన్నికలు బహుసరళముగా జరుగుటకు వీలుండును.

—§—

సాహిత్య చర్చలు : విద్యార్థులకు — విద్యార్థినులకు:

# నన్నయ కవితా ప్రశస్తి

(సవ్యసాచి)

(గత సంచిక తర్వాత)

## ఆఖ్యాన శైలి:

నన్నయశైలి పురాణశైలి. అనగా యాఖ్యానశైలియే గాని, నాటకశైలిమాత్రము గాదు. అందందు స్వల్పముగ సంవాదశైలికి నుదాహరణములు గన్పడినను, మొత్తముమీద నితనిది యాఖ్యానశైలి యనక తప్పదు. అక్షర రమ్యతయందు నన్నయకు అభిమానమున్నను, పోతనయు, నితర ప్రబంధకవు లును వాడిన శబ్దాలంకారముల వలన వచ్చిన శబ్దరమ్యత గాదు నన్నయది. అతని కిది సహజ ప్రవాహము. ఇది చూడుడు:

చం॥ మదమాతంగతురంగకాంచనలస
ద్వస్త్రమాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనివచ్చియిచ్చి
ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగ
మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్ప్రభాస్థితు
జగత్పూర్ణప్రతాపోదయున్.

(సభా. ప్ర. 18)

శ్లేషాలంకారములందు నన్నయ కంత ప్రీతి యున్నటుల గన్పడదు. నన్నయ కవిత్వము అర్థప్రధానమైనదేగాని, శబ్ద ప్రధానమైనది మాత్రము గాదు. భారత కవులకు, ప్రబంధ కవులకుఁగల ముఖ్య తారతమ్య మిదియే.

నన్నయ సమగ్రవస్తు సౌందర్యమందే దృష్టి నిలుపును గాని, ప్రత్యేక ప్రత్యేక విషయములందు దృష్టి నిలుపడు. ఈయన రచించిన కథావస్తువు మిక్కిలి హృదయరంజకముగా నుండును. భావగాంభీర్యమును నిర్వహించుటలో నితడు లక్ష్యభూతుడు. ఆదినుండి తుదివరకు ఒక్క గంభీరతయే (Seriousness) కాక, మధ్య మధ్య కొంత విడుదల గూడ నుండవలయునుగదా. అందులకు హాసము, హాస్యము గూడ నుండుటయు, అది యార్ష సాంప్రదాయికముగ నుండుటయు నన్నయ యభిమతము. అందుకు ఉదాహరణములు……

తే॥ బాలుఁడొక్కఁడు కొండొక కోల చేత
బట్టికొని యేను రక్కసు గిట్టిచంపి
చులుకగావత్తు మీ రేడ్వ వలవదనుచు
గలయ నూరార్చె దన తొక్కుబలుకులొప్ప.

(ఆ॥ ప॥ 260)

తే॥ అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టి కన్నులు లేవనుటంతెకాక
యుత్తముడుగాడె సద్గుణ యుక్తి నతడు.

(ఆ॥ ప॥ 10)

## స్త్రీ 'పాత్రల' వైశిష్ట్యము:

పాత్రచిత్రణమున, నన్నయ స్త్రీపాత్రలనే స్పష్టసౌందర్యముతో చిత్రించెను. ఆయన స్త్రీపాత్రములు మిక్కిలి ప్రశంసాపాత్రములు. నిగ్రహముతోగూడిన గంభీరత గలిగినవి. మితభాషిత్వము గలవి. పురుషపాత్రల చిత్రణమునం దీ నియమములు పాటించినట్లు గన్పడదు. ఈయన కవిత్వము క్రమ వికాస శోభితము.

కవి, తనను తెలియకుండగనే, తన కావ్యమునందు ప్రకాశించుచుండును. కవియొక్క స్వరూప స్వభావములను నిర్ణయించిన, వాని కావ్యగుణములనుగూడ కొంతవఱకు గ్రహింపనగును. అనగా కవియొక్క విజ్ఞానము, ఆచార సంపత్తి, ఐహికప్రవృత్తి మొదలగునవి గుర్తించుట. ఇది గ్రహించుటకు మార్గములు పైనుదాహృతములగు పరుల అభిప్రాయములు, కవి స్వయముగా కథాసందర్భమున తాను చెప్పినవి ముఖ్యములు. అంతియగాక కథారచనయం దంతర్వాహినిగ గూడ నతని తత్వము ద్యోతక మగుచుండును.

ఈ సిద్ధాంతము నన్నయపట్ల నెంతవరకు చెల్లుచున్నదో విచారింతము.—

సీ॥ తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
అనిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యుసుజనునన్న పార్యుఁజూచి,
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణు డిట్లనియె గరుణతోడ.

ఈ పద్యమున నన్నయ పురోహితుఁడనియు, వేదాభ్యాసుడనియు, కర్మపరుఁడనియు, గర్మిష్టియనియు, శ్రోత్రియనియు, నిత్య సత్య వచనుడనియు తెలియుచున్నది. వేదాంతవిదుడైనను సంహితాప్రతిపాదిత కర్మనే ప్రధానముగ నెంచినాడనవలయును. అది కాలమహిమ. నన్నయ భారత మంతయు కర్మపరమే. కుమారిలభట్టు నెలకొల్పిన పూర్వ మీమాంస ధర్మములనే భారతమున విశదీకరించెను. అవతారిక వలన నన్నయ వినయము, కృతజ్ఞత తెలియుచున్నది. దీని వలననే పాండవుల వినయాన్వితులని యుగ్గడించెను. మరియు ధర్మజుని శౌచమునుగూర్చి యనేక ఘట్టములు గలవు.

వైదికదృష్టి:

సంస్కృతమును బాగుగ చదువుటయేగాక వైదిక వాఙ్మయమును గూలంకషముగ జదివి జీర్ణముగావించుకొనిన నన్నయ పరమశాంతుఁడు, గంభీరుడగుటకు సందేహమేమి? గంభీరతయనగా మనసులో బుట్టిన వికారమునుఁ బొంగి పొరలనీయకుండుట. ఆ వికారమునకు లోనుగాకుండుట. ఈ గంభీరత ధర్మరాజు నందును, ద్రౌపదియందును నెంతయు ప్రకాశించుచున్నది. నన్నయ దృష్టియంతయు వైదికమే గాని లౌకికముగాదు. ఇతనికి వైదికకృత్యములయం దున్నంత యనుభవము లౌకికవ్యవహారమున లేదు. ద్రౌపది వేదకాలపు బ్రాహ్మణస్త్రీవలె గాననగునని విమర్శకుల మతము.

రాజనీతిని విశదీకరించుటలో తిక్కనకుగల ప్రతిభ నన్నయ యందు గన్పడదు. ఏది యెట్లున్నను భారతాంధ్రీకరణమునకుఁ బ్రధాన కారణము వర్ణాశ్రమధర్మ రక్షణమును, వేదనిర్దిష్ట కర్మానుష్ఠాన ప్రచార ప్రతిష్ఠలు గావున వేద వేదాంతవిదుడును, నైష్ఠికుండును, కర్మిష్ఠియునగు నన్నపార్యుడు తన విధికృతమును తన కావ్యమునందు నిర్వహించి, తన ప్రభువగు రాజరాజు నిర్దిష్ట ప్రయోజనమును నెరవేర్చి, వాని మన్నన నందుటయేగాక, ఆంధ్రభాషావధూటికి నలంకారములు గూర్చిదిద్ది, అనన్య రూపలావణ్య నొనర్చి, ఆంధ్రభాషావిధులకు గురుపీఠ మలంకరించి యుగకర్తయనం బ్రశస్తిగాంచెను.

(కృష్ణా పత్రిక)

---

# కాంగ్రెసును బలపఱచుడు.

(శ్రీ టి. పుల్లారెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్., జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు.)

రాబోవు యెన్నికలలో కాంగ్రెసు పార్టీ మెంబర్లకే ఓట్లనిచ్చి, కాంగ్రెసు సంస్థను బలపఱచవలెనని నాకు తెలిసిన ఓటర్లను, స్వయముగా తెలియని ఓటర్లను ప్రార్థించుచున్నాను. కాంగ్రెసు సంస్థలో అంతయు ప్రకాశవంతముగ వెలుగుచున్నదని నేను చెప్పజాలను. లోపములు లేవని నేను చెప్పను. "అనేక విధములైన బలహీనతలు కాంగ్రెసులో జనిబడినవి. వానితో పోరాడి, యీ లోపములను సవరించవలెను" అని కాంగ్రెసు సంస్థకును, ఇండియా దేశమునకును నేడు ఏకైక నాయకులైన పండిత జవహర్‌లాల్ నెహ్రూగారే అనేక సార్లు హెచ్చరించినారు చెప్పుచున్నారు. కాంగ్రెసులో లోపములున్నవనుటలో దాపరికము లేదు. కాంగ్రెసు ఏ వర్గానికో కాక సర్వజనుల హితముకొరకై నడుపబడుచున్న సంస్థ. అది ఏ వ్యక్తి సొత్తు కాదు. జాతి, మత, కుల భేదములు లేక, స్త్రీ, పురుష భేదములను పాటించక, దాని తలుపులు అందరికి తెరువబడియున్నవి. దానిలో లోపములున్నవని చెప్పువారు కూడా, వానిని తొలగించుటకై సంస్థలోనే యుండి తీవ్రముగ కృషి చేయవచ్చును. అన్ని దుష్టశక్తులను పార్టీనుండి తొలగించవచ్చును. ఈ సంస్థను వదలిపెట్టుటవల్ల కాని, దూషించుటవల్ల కాని కాంగ్రెసును బాగుచేయజాలము. కాంగ్రెసు సంస్థలోనే యుండి, దానిలోని లోపములను తొలగించినప్పుడే అది నిజముగా ప్రజల యభివృద్ధికి పాటుపడగల సంస్థగా చేయగలము.

ఇప్పుడు ఇండియా దేశములోని రాజకీయ పరిస్థితులను గ్రహించినచో, ప్రజల యందరి సానుభూతి కలిగిన ఒక బలమైన రాజకీయపార్టీ యుండుట యావశ్యకమై యున్నది. ఒక బలమైన రాజకీయపార్టీ లేనిచో ప్రజల రాజకీయ, ఆర్థిక జీవితము అభివృద్ధి కాజాలదు. ఇంతవఱకును కొన్ని యితర రాజకీయపార్టీలు ఈ దేశములో నున్నవి. మీద యెన్నికల సమయములో యనేకపార్టీలు స్థాపింపబడినవి. కాని వీని యన్నింటిపైకిని కాంగ్రెసుసంస్థ యొక్కటే యెక్కువ సభ్యులు కలిగి, దేశవ్యాప్తమై యున్నది. గాంధి మహాత్ముడు, శ్రీ|| శ్రీ|| మోతీలాలు నెహ్రూ, దేశబంధు చిత్తరంజనదాసు, లాలాలజపతిరాయ్ మొదలైన పెద్దనాయకులచే పెంచబడిన వృక్షము ఈ కాంగ్రెసు సంస్థ. ప్రపంచ నాయకులలో నొకరని గుర్తింపబడిన పండిత జవహర్‌లాలు గారు ఈ సంస్థకు నాయకులై యున్నారు. ఇండియా ప్రజలు దీనిని నిరలక్ష్యము చేయవచ్చును. స్వాతంత్ర్యమును పోగొట్టుకొనవచ్చును. పండిత జవహర్‌లాలు నెహ్రూ నాయకత్వమును పోగొట్టుకొనజాలరు.

అందువల్ల రాబోవు జనవరి నెలలో జరుగబోయే యెన్నికలలో కాంగ్రెసుపార్టీ నిలువబెట్టిన మెంబర్లకే వోటు చేసి, జవహర్‌లాల్ పండిట్ గారి నాయకత్వమును సమర్థింపవలెనని సమిష్టిగను, ప్రత్యేక ప్రత్యేకముగను ప్రతి ఓటరును విజ్ఞప్తి చేయుచున్నాను.

---

# అమెరికాలో సోయా చిక్కుళ్లు ఎక్కువగా పండుచున్నవి.

అమెరికాలో ఒకప్పుడు సోయా చిక్కుళ్ళను వృక్ష శాస్త్ర పరిశోధనలకు పెంచేవారు. ఇప్పుడది అక్కడ పండే పంటలలో ముఖ్యమైన వానిలో ఒకటి. 1924 వ సంవత్సరములో కంటె 1950 వ సంవత్సరములో 57 రెట్లు సోయా చిక్కుళ్ళు ఆ దేశములో పండినవి. 1950 వ సంవత్సరములో అమెరికా వ్యవసాయదారులు మొత్తము ఒక కోటి యాభై లక్షల ఎకరాలలో 28,79,00,000 బుషెళ్ళ సోయా చిక్కుళ్ళను పండించిరి. 1924 వ సంవత్సరములో సుమారు 50 లక్షల బుషెళ్ళు పండినవి. 1951 వ సంవత్సరమునకు పూర్వము ఆ దేశములో పశుగ్రాసము కొరకే దానిని రైతులు వేసేవారు. రెండవ ప్రపంచ యుద్ధకాలములో దాని ప్రాముఖ్యము, ఉపయోగములు పెరిగినవి. ఆ చిక్కుళ్ళను నూనెగా తయారు చేయబడును. ఎక్కువ భాగము తినడానికే ఉపయోగపడుచున్నది. ఆ గింజలను తినెదరు. వేయించి పలు రకముల పిండి వంటలు చేయుదురు. ఇక పరిశ్రమలలో కూడ రంగులు తయారు చేయడములోను, కాగితమును నీటిని పీల్చుకొనకుండుటకు, సబ్బులు, చాకిలేట్లు, పానీయము, మొదలైనవి తయారు చేయుటకు అది బాగుగ ఉపయోగ పడగలదు. సోయా చిక్కుడు గింజలనుండి నూనె పిండి వేసిన తరువాత మిగిలే పిండి పశువులకు మంచి ఆహారము. అందువలన అమెరికా రైతులు సోయా చిక్కుడును ఎక్కువగా పండించెదరు. పశువులకు వాడెదరు. ఉత్తర అమెరికాలోని ఇలినాయిస్, అయోవా, ఇండియానా, ఓహాయో, మిస్సోరి, మినెసోటా రాష్ట్రములలోని రైతులు అమెరికాలో పండే సోయా చిక్కుడులో 80 వంతులు పండించుచున్నారు. ఇతర రాష్ట్రములలో కూడ సోయాచిక్కుడు పండిస్తూనే ఉన్నారు. సోయా చిక్కుడు వేసవి పంట. మంచి పంట పండే నిమిత్తము రైతులు సోయా చిక్కుడు పిండిని పొలానికి ఎరువుగా పాళ్ళలో వేస్తారు. మేలురకము సోయాచిక్కుళ్ళు ఎకరాకు 25 నుంచి 50 బుషెళ్ళ వరకు పండగలవు. దీనిలో 29 నుంచి 52 వంతుల వరకు మాంసకృత్తులు 22 నుంచి 30 వంతులు [illegible] పదార్థములు. 3 నుంచి 6 వంతులు లవణాలు, విటమినులు మొదలైనవి కలవు. అందువల్ల అది మంచి ఆహారము.

జపాన్, చైనా, మంచూరియా, కొరియాల నుండి సోయా చిక్కుడు విత్తనములను తెచ్చి, అమెరికా వ్యవసాయ శాఖ వారు చేసిన పరిశోధనల ఫలితముగా ఇప్పుడు ఆ పంట అక్కడ ఎక్కువగా పండుచున్నది. ఇది చాలా పురాతనమైన పంట. క్రీస్తు శకమునకు పూర్వము 2838 వ సంవత్సరములో చైనాను పరిపాలించిన చక్రవర్తి షెంగ్‌నంగ్ దానిని వర్ణించెను. ఇప్పుడు కూడా మంచూరియాలో అది ప్రపంచములోని ఇతర ప్రాంతముల కంటే ఎక్కువగా పండుచున్నది.

(ఇండియా దేశములో కూడ రైతులు ఈ పంట [illegible] ప్రారంభించి దేశమునకు కావలసిన ఆహార [illegible] గించుటకు తోడుపడ వచ్చును.)

ప్రజాభిప్రాయ వేదిక :—

# జమ్మలమడుగు తాలూకా ఓటర్లకు మనవి.

ఆర్యా,

కాంగ్రెసు పార్టీ పక్షమున రాబోవు ఎన్నికలలో, జమ్మలమడుగు నియోజక వర్గమునకు పోటీ చేయుటకై, శ్రీ తాతిరెడ్డి పుల్లారెడ్డి గారిని ఏర్పాటు చేసియున్నారు. ఇతనిని తెలియనివారు కాని, ఈయన పేరు విననివారు కాని, ఈ జమ్మలమడుగు తాలూకాలో నుండరు. విద్యావంతుడు. గుణవంతుడు. నీతి నియమములు కలవాడు. రాజకీయములలో అధికారాపేక్షకులకు లొంగి, తన ఆత్మగౌరవమునకు మచ్చ తెచ్చుకొను వాడు కాడు. ఈ జిల్లాకు కాంగ్రెసు అభ్యర్థులను నియమించు విషయములోనే ఈయన స్వాతంత్ర్య దీక్షత బయట పడినది. నైతిక ప్రవృత్తిలో ఇతనిని వ్రేలు ముడిచి చూపుట కెవ్వరికిని సాధ్యము కాదు. ఈయన కాంగ్రెసు పార్టీకి చేరిన వ్యక్తియని చెప్పుట కాదు. కాంగ్రెసు పార్టీకి చేరియుండు గాక, లేక స్వతంత్ర్య వ్యక్తిగా నిలిచి యుండు గాక. ఇండియా ప్రధానమంత్రియు, కాంగ్రెసు అధ్యక్షులును అగు శ్రీ జవహరిలాలు గారు ఆశించినటుల శాసన సభ్యుడుగా నుండుటకు కావలసిన న్యాయబుద్ధి (integrity) నైతిక ప్రవర్తనము (Honesty) యోగ్యత (ability) అన్నియు శ్రీ పుల్లారెడ్డి గారి యందు మూర్తీభవించి యున్నవి. ఇట్టియోగ్యతలు కలవారు ఏ పార్టీకి చెందినవారైనను, వారికి పోటీగా నిలుచుటకాని, లేక పోటీ చేయుట కాని ధర్మము కాదు. పోటీ లేకుండనే ఇట్టి యోగ్యులైన వారిని శాసనసభలకు పంపుట ప్రజల ధర్మము. ఓటర్ల ధర్మము. ప్రజలకు సేవ చేయవలెనను బుద్ధికన్న ఏదో ఒక విధముగ అధికార పదవులలోనికి రావలెనను చింతయే ఎక్కువగు చున్నది. అందు వలన అభ్యర్థి యోగ్యుడా, అయోగ్యుడా అని యోచించుట ప్రజలు బొత్తిగ మానుకొనియున్నారు. జమ్మలమడుగు నియోజక వర్గమునకు నిలుచు ఇద్దరు అభ్యర్థులలో [illegible] పుల్లారెడ్డి గారికి ఎక్కువ యోగ్యత, రాజకీయములలో ఎక్కువ అనుభవమున్నదని మాత్రము నిర్భయముగ చెప్పగలను. కనుక జమ్మలమడుగు తాలూకా ఓటర్లు అందరు రాబోవు ఎన్నికలలో తమ ఓట్లన్నిటిని శ్రీ పుల్లారెడ్డి గారికే ఇచ్చి తాలూకా గౌరవమును కాపాడవలెనని కోరుచున్నాను.

—— ఏ. లక్ష్మీనారాయణ.

# ప్రజాభిప్రాయ వేదిక

## ముద్దనూరు — రిజర్వాయరు ప్రాజెక్టు.

ఆర్యా!

ముద్దనూరు రిజర్వాయరును నిర్మించుటకుగల అవకాశములను ప్రభుత్వ దృష్టికి తేలవయునని చాలా రోజులుగా కుతూహలముగలదు. పత్రికలలో 'కృష్ణా—పెన్నారు' ప్రాజెక్టు, 'పులిచింతల' ప్రాజెక్టుల యొక్క వాదోపవాదములను గమనించు వారికి, రాయలసీమాభివృద్ధిని సూచించు ప్రాజెక్టులను ప్రభుత్వ దృష్టికి తరలుచ్చుట కష్టమగునేమోయని నిరుత్సాహ పడవలసి నట్లేర్పడు చున్నది. 'గండికోట' ప్రాజెక్టు యేనాడో ప్రారంభించ వలసినది. ఇంత వరకు అట్టి సూచనలు యపపడలేదు. 'గండికోట' ప్రాజెక్టు ఎ, బి, సి, అని మూడు విధములుగా యెస్టిమేట్లను తయారొనర్చిరి. మొదటిది 4,00,000 యెకరముల పైనను, రెండవది 2,00,000 యెకరముల పైనను, మూడవది 1,00,000 ఎకరముల పైనను, పారుదల గాగలదని యెస్టిమేట్లు తయారొనర్చిరి. దాదాపు రెండు లక్షల రూపాయలు వ్యయపఱచిరి, తయారొనర్చిన యెస్టిమేట్లన్నియు బుట్ట దాకలు చేసి, 'మైలవరము' ప్రాజెక్టు యని మరియొక రూపముతో దీనిని 'కృష్ణా—పెన్నార్' ప్రాజెక్టుకు ముడిపెట్టి రాయలసీమోద్ధరణమని స్వలాభాపేక్షతో దక్షిణాది నీటిని తీసుకొనిపోవు యభిప్రాయముతో రాయలసీమ కన్నీటిని తుడవ సను కట్టిరి. 'గండికోట ప్రాజెక్టు' వలన రాయలసీమలోని కడపజిల్లాలో, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము, కోవెలకుంట్ల తాలూకా, సిద్దవటము తాలూకాలో కొంత భూములు పారుదల గాగలవు. కాని ఇప్పుడు తలపెట్టిన 'మైలవరము' ప్రాజెక్టు మూలము 1,00,000 యెకరములకు పైగా పారుట కంటె యెక్కువగా లేదు. కొండను త్రవ్వి ఎలుకను బట్టినట్లు ఎక్కువ వ్యయము పరిపాసములలో కర్నూలుజిల్లా 'సంగమేశ్వరము' నుండి యొక కాలువను త్రవ్వి కృష్ణా నీటిని కాలువ మూలముగ 'మైలవరము'నకు తెచ్చి యిచ్చుట 'పెన్నా'లో కలుపుటకు. ఈ ప్రయత్నము జూడ భగీరథ ప్రయత్నము వలె నున్నది.

ముద్దనూరు రిజర్వాయరు గల యవకాశములు ముద్దనూరు నుండి కొండాపురమునకు బస్సులలోను, రైళ్ళలోను ప్రయాణ మొనర్చు ప్రతి వారును 'ఉత్తర, దక్షిణ, ప్రక్కల కిరువైపుల ఉండు యెత్తయిన రెండు కొండలు పెట్టని కోటల వలె స్వభావ సిద్ధములై, యెత్తయిన కొండలు జూడగలరు. కొండాపురము వరకీ కొండలు యిరువైపుల వ్యాపించి యున్నవి. ఉత్తర, దక్షిణముల రెండు కొండల వెడల్పు మూడు నాలుగు మైళ్ళ కంటె యెక్కువ యుండదు. ముద్దనూరు సమీపమున గల 'యామవరము' వద్ద ఈ రెండు కొండలకు యడ్డముగా 'డామ్' లేక ఆనకట్టను వేసి పెన్నా, చిత్రావతి కలియు గండికోట లోయవద్ద మరియొక ఆనకట్టను వేసి, యిచట నుండి ఒక కాలువ ద్వారా 'మంగపట్నము' నుండి రిజర్వాయరు నీళ్ళు నింపు ప్రణాళికను అమలు పరచుచో, ఈ రిజర్వాయరు యొక్క వైశాల్యము 60 చదరపు మైళ్ళ కంటె ఎక్కువ ఏర్పడును. నీటి పారుదల ఆనకట్ట యొక్క యెత్తును బట్టి కనీసము 1,00,000 యెకరములకు పైన పారుదల గల యవకాశము గలదని సర్వసామాన్య పౌరునికి నైసర్గిక పరిస్థితులు గమనించినచో, యేర్పడగలదని తోచక మానదు.

ఈ ప్రాజెక్టు యేర్పడుచో, రైల్వే మార్గము మార్చ వలసి యుండును. ముద్దనూరు నుండి సింహాద్రిపురము మీదుగా వంగనూరు వద్ద మెయిన్ లైన్‌తో కలుప వచ్చును. లేదా ఎర్రగుడిపాడు నుండి ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, తలమంచిపట్నము మీదుగా తాడిపత్రి పెన్న ఒడ్డున నుండి జూటూరు వద్ద మెయిన్ లైన్ (Main line) తో కలుప వచ్చును. ఈ ప్రాజెక్టుకు గల యవకాశములను రాయలసీమ శాసన సభ్యులకు కాని, రైళ్ళలో ప్రయాణమొనర్చు ఇంజనీర్లకు కాని, మంత్రులకు గాని గోచరించక పోవడము రాయలసీమ యొక్క దౌర్భాగ్యమని చెప్పక తప్పదు. వెంటనే ప్రభుత్వము వారు ప్రిలిమినరీ ఇన్వెస్టిగేషన్ ప్రారంభించి, ఈ ప్రాజెక్టు యొక్క సాధ్యాసాధ్యములను గమనింప యుత్తరువు లొసగునట్లు కడపజిల్లా శాసన సభ్యులు జిల్లా కలెక్టరుగారు పూనుకొందురు గాక యని కోరుచున్నాను.

ఏ. ప్రభాకరుడు.

---

కడప జిల్లా కాంగ్రెసు కమిటీ ప్రకటన.

# కాంగ్రెసుకే ఓటు చేయుడు.

(పండిత జవహరిలాలు గారి విజ్ఞాపన.)

దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తర్వాత, గడచిన నాలుగు సంవత్సరములుగ మేము అనేక కష్టమైన సమస్యలను ఎదుర్కొన వలసి వచ్చినది. అనేక చిక్కుల వలన మేము చేసెదమని చెప్పిన పనులన్నిటిని చేయజాలక పోయినను, కొంత మాత్రమైనను మేము నెరవేర్చి యున్నాము. క్రొత్త యుద్ధము ప్రారంభింప వలసిన కాలము వచ్చినది. ఆ యుద్ధము మనలో మనకు కాదు. విదేశ శత్రువులపై నకాదు. దేశము నావరించిన దారిద్ర్యమును, నిరుద్యోగమును పారద్రోలుటకై యుద్ధము ప్రారంభింప వలసి వచ్చినది. ప్రజలయొక్క జీవిత పరమాణము (Standard of living) వృద్ధి చేయవలెను. వారి కష్టములను తొలగింప వలెను. దేశము వేరు, ప్రజలు వేరు కాదు. అందువల్ల ప్రజలు సౌఖ్యమైన జీవితములను గడుపునపుడే దేశము అభివృద్ధి నొందగలదు. కాంగ్రెసులో అనేక లోపము లుండ వచ్చును. వానిని మనము తొలగింప వలెను. దేశము యొక్క అభ్యున్నతిని కోరి మీ ఓట్లను కాంగ్రెసు పార్టీకే [illegible] చేసెదరని నమ్ముచున్నాను.

——శ్రీ జవహరిలాలు నెహురు, మండి, నవంబరు 1[illegible].

## కడప జిల్లాలో కాంగ్రెసు అభ్యర్థులు.

**పార్లమెంటుకు:—**

1. కడప. ... ... శ్రీ పి. బసిరెడ్డి.
2. చిత్తూరు. ... ... శ్రీ టి. యన్. విశ్వనాథ రెడ్డి, (జనరల్)
   శ్రీ యం. వి. గంగాధర శివ (రిజర్వుడు)

**రాష్ట్ర అసెంబ్లీకి:—**

1. కడప. ... ... శ్రీ కె. కోటి రెడ్డి.
2. కమలాపురము. ... ... శ్రీ ఆర్. రామలింగా రెడ్డి.
3. రాయచోటి. ... ... జనాబ్ యస్. [illegible] సాహెబ్.
4. బద్వేలు. ... ... శ్రీ బి. రామా రెడ్డి.
5. రాజంపేట. ... ... శ్రీ పి. పార్థసారథి, (జనరల్)
   శ్రీ పి. వెంకట సుబ్బయ్య, (రిజర్వుడు)
6. ప్రొద్దుటూరు. ... ... శ్రీ కె. బాలనారాయణ రెడ్డి.
7. జమ్మలమడుగు. ... ... శ్రీ టి. పుల్లారెడ్డి.

కడప జిల్లా కాంగ్రెసు కార్యాలయము,
15—11—1951.

టి. పుల్లారెడ్డి, [illegible]
అధ్యక్షులు.

ADVERTISEMENT — E. 5.

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 38. | శ్రీ ఖరనామ సంవత్సర మార్గశిర శు. ౭, డిశంబరు, 5, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## ఈ కపటమైన మాటలెందుకు?

—)•*•(—

డా॥ భీమరావు రాంజీ అంబేద్కరు గారు అక్టోబరు నెల 10–వ తేదీ వఱకు ఇండియా యూనియన్ ప్రభుత్వ న్యాయశాఖామంత్రిగ నుండిరి. వీరు నవంబరు నెల 26–వ తేది బొంబాయి పట్టణమున ఎన్నికల సమావేశములో మాటలాడుచు:–

"భారత దేశములో లక్షలకొలది ప్రజానీకమునకు అన్న వస్త్రములు కలుగ జేయనందులకు మనము కాంగ్రెసు సంస్థను మన్నింపవచ్చును. బ్రిటీషువారి పరిపాలనము అంతరించిన తర్వాత కాంగ్రెసు పరిపాలనములో తీవ్రముగ వ్యాపించియున్న లంచగొండితనము, బంధువులయెడల పక్షపాతము, కావలసినవారికి ఉద్యోగములు పంచిపెట్టుట, మొదలగువానిని గమనింపకుండుటకు వీలు కాదు. పరిపాలనము కల్మష రహితముగ చేయగలశక్తి కాంగ్రెసు నందున్నది. దేశమునకు ధర్మబద్ధమైన సరిపాలనము ఇవ్వలేదనిన ఆ తప్పు కాంగ్రెసు సంస్థదే"నని చెప్పిరి. ఇతర రాజకీయ పార్టీలకు చెందిన ఏ నాయకుడైనను, లేక ఏవ్యక్తియైనను, ఈ విమర్శన గావించియుండినచో, దానికి కొంచము అర్థముండెడిది. నైతిక బలముండేది. కాని దురదృష్టవశమున ఈ విమర్శ డా॥ అంబేద్కర్ గారి నుండి వెలువడినందున దానిలో ఏలాటి నైతికబలముండదు. ఆచార్య కృపాలనీగారు పలుమారు కాంగ్రెసు పరిపాలనపై ఇవే ఆరోపణలను గావించు చున్నారు. ఆయన కాంగ్రెసు పక్షమున వ్యవహరించు పార్లమెంటు సభ్యుడు. కాంగ్రెసు సంస్థలో అవినీతి ప్రబలినదని కాంగ్రెసు సభ్యుడుగ నుండియే విమర్శించు చుండెను. కాంగ్రెసుపార్టీ కట్టుబాటులకు లొంగక, పార్లమెంటులో అనేకమారులు ప్రభుత్వపు చర్యలను విమర్శించెను. ప్రధాన మంత్రిగారైన శ్రీ. జవహరిలాలుగారి విధానమును ఖండించెను. రాజ్యాంగ నిర్మాణచట్టమునకు సవరణ బిల్లు ప్రవేశపెట్టినప్పుడేమి, ఆహార వస్త్ర సమస్యలు, చక్కెర సమస్యలు చర్చింపబడినప్పుడేమి, ప్రభుత్వమును తీవ్రముగ విమర్శించి, వ్యతిరేకముగ ఓటుచేసెను. ఒక వ్యక్తి, ఒక రాజకీయపక్షమున శాసనసభ్యుడుగ ఉన్నంతమాత్రమున, దేశప్రజానీకమునకు వహింపవలసిన బాధ్యత తొలగి పోదనియు: పార్టీకన్న దేశప్రజలే ఎక్కువనియు, తాను వ్యతిరేకముగ ఓటుచేసి నప్పుడెల్ల తన చర్యను సమర్థించుకొనుచు వచ్చెను. మంచి కాని లేక చెడ్డగాని, తన మనస్సాక్షికి సరిగా నడుచు కొనుచుండెను. ఇదిఅంతయు కాంగ్రెసు పార్టీ సభ్యుడుగా నుండియు, పార్లమెంటు సభ్యుడుగానుండియు చేయుచు వచ్చెను. కాంగ్రెసు సంస్థ లోపలనుండియే దానిని సంస్కరించుటకు ప్రయత్నించెను. కాంగ్రెసు సంస్థను బాగుపఱచుటకు వీలు పడదను అభిప్రాయమునకు ఏవిధముగ వచ్చెనో చెప్పలేము. కాని ఆచార్యకృపాలనీ గారు కాంగ్రెసును సంస్కరించుటకు వీలుకాదని భావించి, కాంగ్రెసు సంస్థతో సంబంధమును పూర్తిగ వదలుకొనిరి. వారి విమర్శనలకు నైతికబలముండును.

సోషియలిస్టు పార్టీ నాయకులైన శ్రీ. జయప్రకాశనారాయణ గారు కాంగ్రెసు పార్టీలో నుండినవారే. ఒక ముఖ్యనాయకుడుగ...

అభిప్రాయ భేదము కలిగి, తనపార్టీ వారితో సహా బయటికి వచ్చెను. ఆయన కూడ కాంగ్రెసు పరిపాలనముపై డా॥ అంబేద్కర్ గారు సూచించిన ఆరోపణలనే చేయుచున్నారు. వీరి విమర్శనలకు కూడ నైతిక బలమున్నది.

ఇండియా ప్రధాన మంత్రిగారైన శ్రీ. జవహరిలాలుగారు విశాలమైన హృదయము కలవారు. దూరదృష్టికల నాయకోత్తముడు. 1946 సం॥ సెప్టెంబరు నెలలో, తత్కాలిక ప్రభుత్వమును నెలకొల్పమని వేవల్ ప్రభువుగారు కోరగనే, ముస్లింలీగు నాయకుడైన జిన్నాసాహెబుగారి దగ్గరకు పోయి తనతో సహకరింపమని కోరిన ఉదారాశయుడు. ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించి, 1947 సం॥ అక్టోబరు నెలలో బ్రిటీషువారు కాంగ్రెసుపార్టీకి అధికారమును ఒప్పగించునపుడు, తన మంత్రివర్గమును కాంగ్రెసు వారితోనే నింపుటకు శ్రీ. జవహరిలాలుగారు ఇష్టపడరైరి, హిందూ మహాసభ ఆశయములతో ఆయన ఏకీభవింపడు. కాని హిందూ మహాసభ నాయకులలో ముఖ్యునిని తన మంత్రివర్గములో చేర్చుకొనెను. క్రైస్తవులకు స్థానమొసగెను. హరిజనులకు స్థానమొసగెను. డా॥ అంబేద్కర్ గారు ఇండియా దేశములో బ్రిటీషు పరిపాలన అంత్యమొందువరకు, గాంధీజీని, కాంగ్రెసును విమర్శించుచునే యుండిరి. కాని దానినన్నిటిని గమనింపక శ్రీ. జవహరిలాలుగారు వీరిని ఆహ్వానించి, మంత్రివర్గములో చేర్చుకొనిరి. 1947 సం॥ మొదలు, ఎన్నికలకు రెండు నెలలు గడచువరకు న్యాయశాఖామంత్రిగ డా॥ అంబేద్కరు గారు వ్యవహరించిరి. రాజ్యాంగ నిర్మాణ చట్టమును తయారు చేయుబాధ్యత అంతయు డా॥ అంబేద్కర్ గారికే ఒప్పగించిరి. వీరుకూడ ప్రతిభతో రాజ్యాంగ చట్టము యొక్క బిల్లును, పార్లమెంటులో ఉపపాదించి, చట్టముగావించిరి. రాజ్యాంగ చట్టముబిల్లు పూర్తిగ ఆమోదింపబడి శాసనమగు సమయములో డా॥ అంబేద్కరుగారు గావించిన అంత్యప్రసంగము భావగర్భితమై, స్వర్ణాక్షరములతో లిఖింప దగియున్నది. ఇండియాకు స్వతంత్రము లభించినది మొదలు మొన్నటివరకును మంత్రివర్గములో సభ్యునిగా ఉండి, పరిపాలనలో ఇంతటి అవినీతి ప్రబలియుండుట చూచియు, తెలుసుకొనియు, ఎందుకు చక్కబరచుటకు ప్రయత్నింపరైరో తెలియదు. అటుల అవినీతిని తొలగించుటకు వీలుకాదని తోచినవెంటనే, ఎందుకు తన మంత్రిపదవికి రాజీనామా యిచ్చి బయటికి రారైరి? అప్పుడుకదా వారియొక్క నైతిక బలము ప్రపంచమునకు వ్యక్తమై యుండెడిది. తాను ప్రభుత్వ మంత్రివర్గములో ఉన్నంత కాలము, ఈ విషయములపై నోరు మెదపక, తీర ఎన్నికలు సమీపించునపుడు బయటికివచ్చి, కాంగ్రెసు ప్రభుత్వముపై ఆరోపణలు గావించుటలో నీతి ఎంతమాత్రము లేదు. ఈ అవినీతికి, ఉన్నదంతా, డా॥అంబేద్కరుగారు కూడ భాగస్వాములే. ఇప్పుడు ఇట్టి ఆరోపణలు గావించుటవల్ల అవి అన్నియు కపటమైన మాటలుగా పరిగణింపబడును. ఎందుకన్న బలము లేని విమర్శనలు?

విద్యార్థులకు:

శ్రీ వినయ రంజనసేన్ గారిని భారతదేశ రాయబారిగ అమెరికా దేశములో శ్రీమతి విజయలక్ష్మీ గారి స్థానములో పని చేయుటకై ఇండియా యూనియన్ ప్రభుత్వము వారు నియమించి యున్నారు. 1947 సం॥నుండి 1949 వరకును వీరు అమెరికాలో ఇండియా రాయబారి కార్యాలయములో కౌన్సిలర్‌గా పనిచేసిరి. గడచిన రెండు సంవత్సరములుగ ఇటలీలో ఇండియా దేశ రాయబారిగ వీరు పనిచేయు చుండిరి.

# కాంగ్రెసు పార్టీకే ఓటు ఇవ్వండి.

శ్రీ టి. పుల్లారెడ్డి గారు, బి. ఏ., బి. ఎల్., జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు.

ఈ ఎన్నికల నాటకములో వివిధ పార్టీలకు చేరిన అభ్యర్థులు, స్వతంత్ర అభ్యర్థులు నామినేషనులు దాఖలు చేయడముతో మొదటి రంగము అయిపోయినది. నామినేషనులు పరీక్షించుట రెండవ రంగము. నామినేషనులు వాపసు తీసుకొనుట, నిఖరమైన అభ్యర్థుల పేర్లను ప్రకటించుట మూడవ రంగము. ఇది పత్రికలలో ప్రకటింపబడు లోపల ఈ రెండు, మూడవ రంగములు పూర్తియై యుండును. నాల్గవ రంగము ఎన్నికలు, ఐదవ రంగము ఎన్నికల ఫలితము ప్రకటించుట మాత్రమే మిగిలి యుండును.

ఏలాంటి నిర్బంధములు లేక, నియమిత వయస్సు వచ్చిన వారందరు రాష్ట్ర శాసన సభలకును, ఇండియా పార్లమెంటునకు అభ్యర్థులుగా నిలిచి, పోటీ చేయుటకు రాజ్యాంగ శాసనము ప్రతి ఒక్క పౌరునికి హక్కు కలుగజేసి యున్నది. ఇట్లు హక్కు కలుగ జేయడము, దేశములోని జను లందరిలోను క్రొత్త ఉత్సాహమును పుట్టించినది. భారత దేశమునకు స్వతంత్రము లభించిన నాలుగు సంవత్సరముల తర్వాత, ఇప్పుడు జరపబడే మొట్టమొదటి జనరల్ ఎన్నికలలో అనేకులు పోటీ చేయుటకు ముందుకు వచ్చియున్నారు. జనులలో యింతటి ఉత్సాహము కనబడుట సంతోషింప వలసిన విషయమే. రాజ్యాంగ శాసనము అమలులోనికి రాకముందు కాంగ్రెసు పార్టీ, సోషియలిష్టు పార్టీ, కమ్యూనిష్టు పార్టీ అని ఈ మూడే జనులకు అందరికిని తెలిసియుండిన రాజకీయ పార్టీలు. హిందూ మహాసభ, ముస్లింలీగు రాజకీయ పార్టీలు కావనియు, ఎక్కువ మత సంబంధమైన సంస్థలనియు జనుల భావము. తీరా ఎన్నికలు దగ్గరికి వచ్చే వేళకు, కుక్క గొడుగుల రీతి ఎన్నో పార్టీలు పుట్టుకొని వచ్చినవి. వానికి నిర్ణీతమైన కార్యక్రమ మనేది లేదు. సరియైన నాయకత్వము లేదు.

భారత దేశములో ఉండే కమ్యూనిష్టు పార్టీ, రష్యా దేశములోని కమ్యూనిష్టు పార్టీ నీడ అని అందరికి బాగా తెలుసును. ఈ పార్టీ సిద్ధాంతములు హింస, అగ్గి పెట్టడము, హత్య చేయడము. ఈ సిద్ధాంతాలు మన ప్రజల అలవాటులకు, దేశ పరిస్థితులకు సరిపోనివి. కమ్యూనిష్టు ఆశను పుట్టించే ఉపన్యాసాలు విని, ప్రజలు మోసపోయి, దేశమును వారికి ఒప్పగింప జాలరు. వారు మన స్వతంత్రమును, మన దేశమును ఒక మట్టి ముంతకు అమ్ముకుంటారు.

సోషియలిష్టు పార్టీ కొంచెము పెద్దదే. దీనికి కొంత పలుకుబడి యున్నది. కాని ఈ పార్టీ సిద్ధాంతాలకును, కాంగ్రెసు పార్టీ సిద్ధాంతాలకును వ్యత్యాసము ఎక్కువగా లేదు. పండిత జవహరిలాలుగారి విదేశ రాజ్యాంగ విధానమును సోషియలిష్టు పార్టీ వారు పూర్తిగ అంగీకరించుచున్నారు. భూమి సంస్కరణము మీదను, భూమి సొంతదారులకు ప్రతిఫలము [illegible] యిచ్చే విషయములోను, కీలక పరిశ్రమలను జాతీయము చేయడములోను, కాంగ్రెసుపార్టీ వారికిని, వీరికిని కొంచెము భేదమున్నది. ఇది చిన్న భేదము. అయితే ఇవి మాత్రమే దేశమును గమ్య స్థానానికి తీసుకొని పోతాయా అను నమ్మకము లేదు. ఇది వొక పరిశోధనే. ఒక్క సోషియలిష్టు పార్టీ మాత్రమే ప్రభుత్వము యొక్క ఛార్జిని తీసుకొని నడుపగల [illegible] లో ఉందా అంటే ఈ పార్టీ చేత కాదు. క్రొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనే శక్తి సోషియలిష్టు పార్టీకే లేకుంటే — కుక్క గొడుగుల వలె ఇంకా పూతి, మొగ్గలలో ఉండే క్రొత్త పార్టీల విషయమై చెప్పవలసిన పనే యుండదు. ఏ పార్టీలుకూడ స్థిరమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకో లేవు.

అన్ని పోగా దేశమునకు స్వతంత్రము సంపాదనము[illegible]లో ముందుకు నిలువబడి, బ్రిటీషు వారి దాస్యమనే కాడిమానును త్రోసి వేసి, లోకోత్తర నాయకుడైన గాంధీ నాయకత్వము క్రింద స్వతంత్రము సంపాదించినది కాంగ్రెసు సంస్థే. దేశమును పరిపాలించుటకై బ్రిటీషు వారినుండి కాంగ్రెసు పార్టీ ఛార్జి తీసుకొన్నది. దేశమునకు స్వతంత్రము రాగానే దేశ విభజన వల్ల అల్ల కల్లోలములు బయలు దేరెను. [illegible] నంతయు కాంగ్రెసు ఎదుర్కొనెను. ఎన్నియో ఏండ్లు కష్టించి, త్యాగముచేసి తెచ్చుకొనిన స్వతంత్రమును, పండిత జవహరిలాలు నెహ్రూ గారును, కీ॥శే॥ సర్దారు పటేలుగారు, [illegible]మైన పునాదులపై యుంచి కాపాడిరి. లక్షల కొలది [illegible]ర్థులకు పునరావాసము కలిగించుట, 650 కన్న [illegible] నుండిన స్వదేశ సంస్థానములను భారత యూనియన్‌లో [illegible]ర్చి వేసి, హిమాలయా పర్వతము [illegible] వరకు, ఒక ముల్లు లేకుండ ఒకే సామ్రాజ్యముగా [illegible] యుట, కేవలము చిన్న పనులు కావు. కాంగ్రెసుపార్టీ [illegible] చేసినను, ఏమి చేయకుండ పోయినా సరే. [illegible] మైన కార్యములు నెరవేర్చినందుకు, [illegible] గుటకు కాంగ్రెసు హక్కును సంపాదించు కొనినది.

దేశ ప్రజలు ఆశించినంతగ కాంగ్రెసు [illegible] కాంగ్రెసు ప్రభుత్వములు కాని చేసినాయని [illegible] ప్రజల జీవితాలకు దిన దిన గండములుగా [illegible]

( మిగత 13-వ పేజీలో )

# సరిగా ఓటు చేయండి — లేకుంటే చావండి.

( శ్రీ బాబూరావు పటేలుగారు, "ఫిలిం ఇండియా" సంపాదకులు, బొంబాయి. )

మన రాజకీయ నాయకులను ఎన్నికల జ్వరము తగిలినది. ప్రతి రాజకీయపార్టీయును దానిదాని విషమును ప్రజల శరీరములలో (ఇంజక్షను) ఎక్కించుచున్నది. అందువలన మనదేశము, అంటురోగులతో నిండిన ఓడగా మారినది. శాంతమును, అన్నమును ఇచ్చు ఒడ్డు (గమ్యస్థానము) ఎప్పుడు చేరునాయని అనుమానముతో, ఆ ఓడలోని రోగులు ఆతురతపడుచున్నారు.

వేలకొలదిగ నా పత్రికాపాఠకులు ('ఫిలిం ఇండియా' పత్రికా పాఠకులు) ప్రతి నెల నాకు రెండు ప్రశ్నలు వేయుచున్నారు. 1. 'మేము ఎవరికి ఓటు చేయవలెను' 2. 'పార్లమెంటు స్థానమునకు నేనెందుకు పోటీ చేయకూడదు' అని.

రెండవ ప్రశ్నకు సులభముగా ప్రత్యుత్తరము నీయవచ్చును. నేను విమర్శకుడను. పత్రికా రచయితను. నా స్థానము శాసన సభలకు వెలుపల నున్నది. విమర్శకులు, రాజకీయ నాయకుల బిడారములను (డేరాలను) చేరి, లూటీలలో భాగమును పుచ్చుకొనినచో, దేశము కుక్కల పాలగును. రాజకీయములలో చేరి, అధికారములను పొందుచుండుటవంటి పత్రికా రచయితలు వ్యాపారస్తులుగ మారెదరు. అట్టివారు పత్రికా రచయితలు అవలంబింపవలసిన నీతిని, రాజకీయముల వల్ల వచ్చు లాభములకు తాకట్టు పెట్టుటకు సంసిద్ధులుగ నున్నారు. నేను ఆ విధముగ ప్రవర్తించుటకు ఇష్టపడుట లేదు.

ఎన్నికల కష్టాలను నేను భరింపగలనని తెలిసి, కొందరు నన్ను కలుసుకొని ఏదో ఒక పార్టీ టికెట్టును ఇచ్చెదమని చెప్పిరి. వారికి లొంగుటకు నిరాకరించితిని. నేను దాచి పెట్టుకొనిన ధనముమీద వారికి కన్ను గలదు. కష్టపడి సంపాదించుకొనిన ద్రవ్యమును [illegible] నా కిష్టము లేదు. రాజకీయ అధికారము ఎంతవారలకైన దానిని కొని పెట్ట దలచలేదు.

సాధారణముగ రాజకీయములు ఒక వృత్తిగా మూడు విధములయిన ప్రజలు గైకొందురు. న్యాయవాద వృత్తియందు భంగపాటు పొంది, లోకముగా గౌరవమును సంపాదింపవలెనువారు కొందరు. ఏమి చెప్పినను చేతులు ఎత్తుటకు పంపినవారిగా నుండు వెట్టివారు కొందరు. స్వలాభము కొరకు అధికారమును కోరు వంచకులు కొందరు. ఈ మూడు తెగలలోను నేను చేరనివాడను గాను.

'రాజకీయములు' 'దేశాభిమానము' (Politics and Patriotism) అనునవి రెండును వేరైన వస్తువులు. ప్రజల అభ్యున్నతికై పాటుపడవలెనను దృష్టితో రాజకీయములలో ప్రవేశము కలిగించుకొనునటువంటి దేశాభిమానులు, నూటికి, కోటికి ఎవరో ఒక్కరుందురు. అట్టి వ్యక్తి [illegible]వలె నైనను చచ్చును, లేదా సన్యాసియైనను నగును. అట్టి మహాపురుషులు చాల కొద్దిగా నున్నారు. అందువల్ల రాజకీయములు వెట్టివారికి వేటవస్తువుగా నున్నది.

ఈ వెట్టివారి వేటవస్తువులో నాకేమి పని? నేను విమర్శకుడు (Critic) గనే యుండుటకు తీర్మానించుకొంటిని. నా విమర్శ కొందరికి మంచిదిగా యుండవచ్చును, కొందరికి చెడ్డదిగ యుండవచ్చును. కాని ఎప్పటికిని న్యాయమైన విమర్శనలుగనే యుండును.

మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తర మియ్యవలె నన్నచో, స్వాతంత్ర్యము లభించిన తర్వాత, ఈ మొట్టమొదటి నాలుగు సంవత్సరముల విషాద చరితను సింహావలోకన మొనర్చక తప్పదు.

బ్రిటీషు పరిపాలకుల నుండి బయటపడుటకై 1947 సం|| ఆగష్టు నెల 15-వ తేదీ నాడు దేశము రెండు ముక్కలుగా కోసితిమి. మన రెండు చేతులను రాజకీయమైన [illegible] తగిలి యుండెను. శేషించిన భాగమును రక్షించుకొనుటకై మన కుడి చేతిని, ఎడమ చేతిని కోసివేసి కొంటిమి. ఎక్కువ రక్తము కారినది. స్వాతంత్ర్యము వచ్చినదను మైకము క్రింద, మనకు ఆ నొప్పి తెలియ లేదు. [illegible] భాగములు పాకిస్థానముగ మారి పోయినవి. మిగిలిన దేహము మాత్రము రోగమునకు సంబంధించిన మూర్ఛయందు (diabetic coma) తెలివి కి రాలేదు. ఈ రోగమునకు ముఖ్య కారణములైన [illegible] పురుగులు ఇంకను మన దేశములోనే యున్నవి. వానికి శక్తి తగ్గినది. బ్రతికేయే యున్నవి.

తెల్లటోపీలు గల కాంగ్రెసు వారు అధిక సంఖ్యాకులుగ నుండిరి. స్వాతంత్ర్య పోరాటములలో ముఖ్యులుగా నుండిరి. ఏమో త్యాగము చేసినామని చెప్పుకొనిరి. వారి సంస్థ వలవలె దేశమంతయు బాగుగ వ్యాపించి యుండెను. అందువలన బ్రిటీషు వారినుండి దేశమును వారు స్వతంత్ర మొందజేసుకొనిరి. మన [illegible] నుండిన వారి స్థానములలో వారు కాపు పెట్టిరి. బ్రిటీషువారి దాస్యమును ద్రోసివేసి, స్వాతంత్ర్యము రావలెను తీవ్రమైన

భావము భారతీయు లందరిలోను, ఏకగ్రీవముగ ఉన్నదని, ప్రపంచమునకు చాటుటకై, "దీపపు స్తంభముల ఎన్నిక"లను నాటకములను గాంధీజీ ప్రదర్శించెను. ఇప్పుడు దేశ పరిపాలకులుగ తయారైన వారిలో 100 టికి 95 మంది ఆ దీపపు స్తంభముల ఎన్నికలకు చేరిన తెల్ల టోపీల వారే. ఈ ఎన్నికలలో గాంధీజీ దీపపు స్తంభములనే నిలువ బెట్టి, తనయొక్క సిద్ధాంతమును ప్రపంచమునకు ఋజువు చేసెను. కాని దీపపు స్తంభముల సాంప్రదాయము మాత్రము కొన సాగుచునే యున్నది. మన శాసన సభలలో ఎక్కువ దీపపు స్తంభములే కలవు. ఈ శమ్మెలలో నూనెలేదు. ఒత్తిలేదు. వెలుగు లేదు. అందువలన దేశమంతయు తీవ్రమైన కఱువు, ఆకలి, లంచగొండితనము అను చీకటితో కప్పబడియున్నది.

తెల్లటోపీలు గల ఈ దీపపు శమ్మెలు అధికారము లోనున్న ఈ నాలుగు సంవత్సరములుగ (1) అపవాదములు, (3) లంచగొండి తనము, (3) బంధువులయెడ పక్షపాతము, (4) ఇష్టులయెడ పక్షపాతము (favourtism) (5) క్షామము, (6) ఆకలి, (7) స్వప్రయోజనమునకై ఉపయోగించుకొనుట (exploitation) అనునవి పుష్టించి, ఫలించినవి. ఈ ముద్దాయిలు గావించిన ఇతర నేరములను ఇచ్చట వివరించుట అనవసరము. దేశాభిమానుల వలె దుస్తులను వేసుకొని, కొంచ మించు మించుగ వీరెల్లరు మన ప్రజలకును, మన దేశమునకును ద్రోహులుగ మారిరని వారంతికు వారే ఋజువు పెట్టిరి. నాలుగు సంవత్సరముల లోపల గాంధీజీ నాయకత్వము క్రింద యుండిన మేకలన్నియు, పెద్ద ఆడంబరము కలిగిన తోడేళ్లగా మారినవి. మన ప్రజల నెత్తురు పైనను, మాంసము పైనను జీవించు చున్నవి.

1949 సం॥ నవంబరు 26-వ తేదీ భారతదేశ ప్రజలమైన మనము సర్వ సంపూర్ణ స్వాతంత్ర్యమైన రిపబ్లిక్ దేశముగ, ఈ దేశమును మార్పుచేయుటకు భక్తి పూర్వకముగ తీర్మానించు కొంటిమి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయమును, భావ స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యములను; ఒకరు ఎక్కువ,మఱియొకరు తక్కువ అనునది లేక, అందఱికిని సమాన గౌరవము, సమానమైన అవకాశములు పెంపొందించుట; వ్యక్తులయొక్క ఔన్నత్యమును, జాతియొక్క ఐక్యతను ప్రజలందరి యెడల సుహృద్భావము కలుగజేయుచే రిపబ్లిక్ ప్రభుత్వము యొక్క ఆశయములని మనము తీర్మానించు కొంటిమి.

న్యాయము (Justice); స్వాతంత్ర్యము (Liberty); సమానత్వము (equality); సౌభ్రాతృత్వము (fraternity) అనునవి నాలుగు పదములే. ఈ నాలుగు పదములను స్పష్టీకరించుటకు మన తెల్లటోపీ దొరలకు రాజ్యాంగ చట్టములో 395 సూత్రములు కావలసి వచ్చినది. ఇటుల స్పష్టీకరణములు చేయుటలో భయంకరమైన మొసలి పండ్లను నాటి యున్నారు. దీని ఫలితమును భావి సంతతివా రనుభవించెదరు.

తెల్లటోపీ దీపపు స్తంభములు మనకు సంకరమైన రాజ్యాంగ చట్టమును తయారుచేసి యున్నారు. ఆ చట్టముయొక్క తల దండ్రులు పశ్చిమ ఖండములో నున్నారు. బిడ్డ తూర్పుఖండములో నున్నది. ఒక్క నిమిష కాలములో ఆకాశము నంటు నటువంటి మహోన్నత భావములు ఈ రాజ్యాంగచట్టములో నున్నవి. "ఈసూత్రములో తెలుపబడిన దేదియు ప్రభుత్వము చేయదలచు చట్టములకు ప్రతిబంధకము కాదు" అను నటువంటి పరస్పర విరుద్ధమైన పదములను(clauses)చేర్చి, మానవ ప్రాథమిక హక్కులకు హద్దులు కలుగజేసిరి. అందు వల్ల ఆకాశమున కఱకు లేచు భావము లెల్ల, మరుక్షణమే అటాలుల క్రింద పడుచున్నవి. కనుక మన రాజ్యాంగ చట్టము గగన మార్గములో సంచారము చేయగలదైనను, దానిలో కావలసినంత పెట్రోలు లేదు. దానికై పలుమారు క్రిందికి రావలసి యున్నది. రాజకీయ నాయకుల చపల చిత్తములను తృప్తిపఱచుటకై, తెల్ల టోపీ దీపపు స్తంభములు 1951 సం॥ జూన్ నెలలో రాజ్యాంగ చట్టమును సవరించిరి. 19 నెలల లోపల ఆకాశమున సంచారము చేయుచున్న రాజ్యాంగ చట్టము క్రిందికి రావచ్చినది.

మన రాజ్యాంగ చట్టము ప్రజా పాలిత ప్రభుత్వము నకు పూటపడు చున్నది.

ఈ ఇరువదవ శతాబ్దములో ప్రజాపాలిత ప్రభుత్వము, (Democracy) ప్రజలెల్లరు తీవ్రముగ కోరు ఫలము ... రణమించినది. ఆ పండుపై నున్న తోలు ఆకర్షవంతముగ ... పలు రంగులు కలదై ఉన్నది. లోపలి గుజ్జు చేదుగ ... ది. ప్రజాస్వామిక ప్రభుత్వమను ఫలముపై గల ... యొక్క రంగు, అమెరికా రాజకీయ నాయకుల నా... ది. దాని విత్తనములను, సారవంతమైన భూములలో ... తోటలలోను నాటుకొనిరి. ఆ పండ్లను తినినవా... చేదును సహింపరైరి. రాజులు, ఫాసిస్టులు పాలించి వదలి ... మడ్డిపైన 'ప్రజాపాలిత ప్రభుత్వ' మను ఆకర్షణీయ ... ములు విస్తారముగ పెరుగుచున్నవి. ప్రజల యొక్క (Rule of the people); ప్రజలకొరకును (For the people); ప్రజల వల్ల కొనసాగు ప్రభుత్వమని, ఆ పండు యొక్క ఆకర్ష... మైన తోలును, రాజకీయ నాయకులు ప్రదర్శించుచు ... యున్నారు. అట్లు ప్రదర్శించుచు, ఆ ఫలములోని గుజ్జులో ... యున్న క్యాపిటలిజమును, ఫాసీజమును ప్రజలకు తినిపి... చున్నారు.

ఈ వర్గపరిపాలనము ( Group rule ) కాని, లేక పార్టీ పరిపాలనము( Party rule ) కాని తెలి కప్పబడిన ఫాసిజము కాక మరి ఏమి? రాజకీయ పార్టీలు వానివానికి నచ్చిన వారిని అభ్యర్థులుగా ఏర్పరచుకొనుచున్నారు. ఐదు సంవత్సరముల కొకసారి అధికారములోనికి వచ్చుటకై, వారికి ఓట్లనిమ్మని కోరుచున్నారు. ఇది ఇప్పుడు ప్రజల నెదుర్కొనుచున్న సమస్య. ఎన్నికలు పూర్తియైన వెంటనే ప్రజలను మఱచెదరు. ముందు సిద్ధము చేసికొనిన ప్రణాళిక ప్రకారము, కాలదోషములు పట్టిన భావములతోను, దురభిమానముతోను, కఠినతరమైన క్రమశిక్షణతోను, పార్టీ పనిచేయుటకు ప్రారంభించును. ఎన్నికయైన సభ్యునియొక్క (మెంబరు యొక్క) వ్యక్తిత్వము ఒక్క నిముష కాలములో వ్యభిచరింపబడుచున్నది. 'ఆశ' అను శ్మశానములో (గోరీలలో) ఓటరు పూడ్చిపెట్టబడుచున్నాడు.

సీతాకోకచిలుకలు గ్రుడ్లు పెట్టినవెంటనే చనిపోవునని చెప్పెదరు. ప్రజాపాలిత ప్రభుత్వములలో కూడ ఓటర్లు ఓట్లువేసిన కొన్ని గంటలలోనే సీతాకోకచిలుకల మాదిరి చనిపోయెదరు.

దీనికి తోడుగ మన భారతదేశములో మతాతీతమైన ప్రజాపాలిత ప్రభుత్వమును కలిగియున్నాము. ప్రజాపాలిత ప్రభుత్వమని చెప్పుటలోనే మతాతీతమైన ప్రభుత్వమను అర్థమున్నది. దేశ విభజనకు పూర్వము ప్రబలియుండిన మత ప్రధానమైన సిద్ధాంతములనుండి దూరులగుటకై, పలుమారు మనది సెక్యులర్ డెమాక్రసీ (మతాతీతమైన ప్రజాపరిపాలిత ప్రభుత్వ) మని చెప్పుకొనుచున్నాము. ఇట్లు పదేపదే చెప్పటము వల్ల అధిక సంఖ్యాకులైన వారిలో కొందఱు అనేక నేరములను గావించిరనియు, అందువల్లనే నాలుగు సంవత్సరముల క్రిందట దేశ విభజన జరుగవలసి వచ్చెననెడు అభిప్రాయము కలుగజేయును. వారసత్వము వల్లను, అధిక సంఖ్యాకులుగా నున్నందువల్లను భారతదేశము వంశపరంపరగముగ హిందువులది. ఇటులుండికూడ గాంధీజీ వర్గమునకు చేరిన దీపస్తంభములు, హిందువులు మత వైషమ్యము కలవారని నిందించుచున్నారు.

ఈ దేశ ప్రజల జీవితములో 18 కోట్లమంది ప్రజలు ఎన్నికలలో ఓటర్లుగా పాల్గొనుటకు ఇదే మొట్టమొదటి పర్యాయము. పైన తెలిపిన రాజకీయవాతావరణములో మన మతాతీతమైన ప్రజాపాలిత ప్రభుత్వము ఎన్నికల పరీక్షకు నిలువనున్నది. ప్రపంచములో ఇంతమంది ఓటర్లు ఏ దేశములోను లేరు. మన దేశములో 18 కోట్ల ఓటర్లుండగ, బ్రిటనులో 1½ కోటి: అమెరికాలో 9½ కోట్లు; రష్యాలో 10 కోట్లు; చైనాలో 16½ కోట్లు ఓటర్లున్నారు. చైనా దేశములోని ఓటర్ల సంఖ్యను తీసికొని మన దేశములో 1½ కోటి చదువురాని ఓటర్లు ఎక్కువగ నున్నారు.

క్రొత్తగ మతమును మార్చుకొనినవారి వలెనే మన తెల్లటోపీలవారు పాశ్చాత్యుల ననుకరింప మొదలిడిరి. పశ్చిమ దేశములలో 'వయోజన ఓటింగు' (Adult franchise) అనిన, ఓటర్లకు ప్రాథమిక విద్య పూర్తియైనదని అర్థము. మన కాంగ్రెసువారు మన రాజ్యాంగ చట్టమును తయారుచేయుటలో పాశ్చాత్యదేశ రాజ్యాంగ చట్టములనే అనుకరించిరి. అంతమాత్రమే కాదు; 'వయోజన ఓటింగు' అను పదములపై ఎక్కువ ఆదరణ చూపిరి. దానిని మన రాజ్యాంగ చట్టములో జొప్పించి, మన దేశమునకు వర్తింప చేసిరి. ఫలితమేమి? పట్టణములలోను, పల్లెలలోను అక్షరముతే తెలియని వారెల్లరు ఓటర్లుగా చేయబడిరి. ఈ చదువురానివారు (గొర్రెలు) జనవరి నెలలో జరుగబోవు ఎన్నికలలో తోడేళ్లను ఎన్నుకొన బోవుదురు. తన చేవ్రాలు చేయుటకు వచ్చినను, రాకపోయినను బ్రిటీషువారు వదలిపెట్టిపోయిన బొటన వ్రేలిముద్ర సాంప్రదాయము వల్ల, 21 సం॥ వచ్చిన ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ ఓటరుగా తయారైరి. వారు తోడేళ్లకు ఓటుచేయుదురు. ఫిబ్రవరి నెల మధ్యకాలములో అర్థదేహమునకైనను గుడ్డలేనివారు, ఆకలితో అలమటించువారు ఎంతమాత్రము రాజకీయములను, లేక ప్రజాపాలిత ప్రభుత్వమును, అర్థము చేసికొనిరో మనము తెలిసికొన వచ్చును.

2వ రాష్ట్రములకును, కేంద్ర ప్రభుత్వమునకును 4000 స్థానములు పోటీచేయబడును. నిరాశచెందిన న్యాయవాదులు, అనుభవగలిగి చెయ్యి ఎత్తమంటే ఎత్తి చిచ్చువారు, స్వలాభములపై దృష్టిగలవారు, 4000 మంది రాజకీయములే వృత్తిగా కలవారు తయారగుచున్నారు. ఈ చిత్రవిచిత్రమైన రంగుగల జనసమూహమును ఎన్నుకొనుటకు 52 కోట్ల బ్యాలటు పేపర్లు, 22 లక్షల బ్యాలటు పెట్టెలు, 1,75,000 పోలింగు బూతులు (గదులు) కావలసి యున్నవి. ఎన్నికల జరుపుటకు 11 కోట్ల రూపాయలు కర్చగును. ఆహారములేని సమయములో రు. 11 కోట్లు, తోడేళ్ళ చక్రముపై వెచ్చింపబడుచున్నది కదా?

భాషారాష్ట్రములనియు, రాష్ట్రీయ స్వతంత్రములనియు చెప్పి, ప్రకృతి స్వభావములైన ధనములను తాత్కాలికముగ మరచిపోండి. 'ఎం. పి.' అను రెండు అక్షరములు పేరు కొనసాగించుకొనుటకు ఎంత కర్చు అగునో చూచెదము గాక. ప్రతి 7,50,000 ప్రజలకు ఒక పార్లమెంటు సభ్యుడు ప్రాతినిధ్యము వహించును. ఎన్నుకొనబడును. ఈ సంఖ్యలో ఓటు చేయుటకు అర్హతగలవారు 3,76,000 మంది ఉండెదరు. ప్రతి ఒక్క ఓటరుకు ఒక్క పోస్టుకార్డు పంపవలెనన్నా పార్లమెంటుకు అభ్యర్థిగా నిలచి, పోటీచేయ దలచిన ప్రతివారికి రు. 17,625/- లు కావలెను. ఎన్నికలు ప్రారంభము కాకముందు పరిచయము చేసికొనుటకై ఒకసారి, ఎన్నికలు దగ్గరకు వచ్చినప్పుడు ప్రచారము చేయుటకు

మఱియొకసారియు, కనీసము రెండుమారులైనను ప్రతి ఓటరు కు పోస్టుకార్డులు పంపవలసి యుండును. రెండు మార్లు పోస్టు కారుడ్లు పంపుటకు కనీసము రు. 35,250/– లు కావలసి యుండును. దీనికి తోడుగ, ముద్రణ, పోస్టర్లు, ప్రచారము, ఏజంట్లు, రాకపోకల కర్చులు, మొదలగునవన్నియు చేరును. ఒక్క పార్లమెంటు స్థానమునకు ఒక్క మనిషి పోటీచేసి, ప్రజాసేవ చేయవలెనన్న ఎంత కర్చు అగునో యోచింపుడు.

ప్రభుత్వమువారు ఎన్నికల కర్చుల క్రింద 15,000 రూపాయలు మొదలు 40,000 రూపాయల వఱకు అవకాశ మొసగియున్నారు. ఈ ఎన్నికల కర్చులను నిర్ణయించుటలో రెండు ముఖ్య విషయములు తెలుచున్నవి. ఎన్నికలు చాల కర్చుతో నిండిన ఆట యని ప్రభుత్వమువా రంగీకరించిరి. ధనికులే ఈ ఎన్నికలలో ప్రమేయము కలిగించుకొనుటకు అర్హులనికూడ స్పష్టపడుచున్నది.

ప్రజాసేవ చేయవలయునని కుతూహలము గల దేశాభిమాను లెల్లరు పేదవారని బాగా తెలిసిన విషయమే. ఇటువంటి వారే సామాన్యప్రజల కష్టములను చూచి, చింతించువారు; వారికి తోడుపడువారు. సెక్యులర్ డెమాక్రెటిక్ ఎన్నికలకు అగు కర్చుభారమే, నిజమైన ప్రజాసేవకులను పూర్తిగ దూరము చేయుచున్నది.

ఇక మాడు రూపములలో నుండు ఈ 4,000 తోడేళ్ళు ఎవరు? వీరు భాగ్యవంతులుగనే ఉండితీరవలెను. లేకున్న వారిక్రింది సలాముదారులుగనైనా ఉండెదరు. ధనికులు ప్రత్యక్షముగనో లేక వారిచేతి కీలుబొమ్మల వల్లనో పరిపాలనమును సాగించుటకు ఈ ఎన్నికలు సహాయపడును. బీదలను, వారియొక్క కష్టములను చూచి, చింతించు ధనికుడు ఈ ప్రపంచమున ఎక్కడనైన ఉన్నాడా?

నిద్రించుచుండిన మేకలగుంపునకు తోడేళ్ళు కాపలాయుండిన ఏమి చేయును? అందుకొని తినును. ఇదే విధమున మన సెక్యులర్ డెమాక్రసి పైన తెలిపిన కారణముల వల్ల నిష్ఫలితమగును.

గాంధీజీ ప్రత్యేక నియోజక వర్గములను ఖండించియుండెను. మత వైషమ్యములకును, దేశ విభజనమునకును అవే ముఖ్యమైన కారణములని ఆయన చెప్పియుండెను. ఆదర్శమైన మన రాజ్యాంగ చట్టములో, విషముతో సమానమైన ఆ పద్ధతిని తొలగించితిమి. సమైక్యతను సాధించుటకై సంయుక్త నియోజక వర్గములను ఏర్పాటు చేసితిమి. ఏ కులము వారికిని ప్రత్యేక స్థానములు లేవు. అందువలన హిందువులు, ముస్లిములు, పారశీకులు, యూదులు, క్రైస్తవులు మొదలగు వారెల్లరు ఒకే ఓటు దగ్గఱకుపోయి, రాజకీయములను నీటిని త్రాగవలసి యున్నది.

ఈ సంయుక్త నియోజక వర్గముల వలన, వివిధ మతములకు చేరినవారమని ప్రజలు తలచుట లేదు. పండిత నెహూరుగారు పదేపదే మతాతీతమైన రాజ్యాంగ సిద్ధాంతముపై ఒత్తిడిగా మాటలాడుటవలన, ఎన్నికలలో ప్రత్యేకముగ వ్యక్తులను ఏరుకొను పద్ధతికి దారితీయుచున్నది. ప్రజాపాలిత ప్రభుత్వమునకును, మన రాజ్యాంగ చట్టమునకును ఒకవైపు ప్రాణముల నివ్వుమని పండిత నెహూరుగారు చెప్పుచున్నారు. ఇంకొకవైపు ముస్లిములకు, అల్పసంఖ్యాకులకు (మైనార్టీలకు), స్త్రీలకు, ఎన్నికలలో స్థానము లివ్వవలెనని తన పార్టీని ఆదేశించుచున్నాడు. ముందుగా అభ్యర్థులను ఏర్పరచుటవల్ల, ఎన్నికలు ఏ ఆదర్శమునకై జరుపబడునో, ఆ యాదర్శమునకు ప్రతికూలమైన ఫలితము కలుగుచున్నది. మత ప్రాధాన్యముపై జరుగు ఎన్నికలు పోయినను, కాంగ్రెసుకు సంబంధించినంతవఱకు, వాని స్థానములో మతములకు సంబంధించినవారిని ఏరుకొను సాంప్రదాయము వచ్చినది. ఇది రాజ్యాంగ చట్టముయొక్క ఆదర్శమునకు వ్యతిరేకముగ నున్నది.

ఎన్నికలకు ముందు ఆకర్షవంతమైన 'డెమాక్రసీ' అను పండునకై మన నాయకులు ఏ విధముగ చెట్టుకొమ్మలు పట్టుకొనుచున్నారో కొంచెము విమర్శించెదము.

14 రాజకీయ పక్షములు వేరువేరు పేర్లతో అప్పుడే పార్టీ చిహ్నములను రిజష్టరు చేయించుకొనినవి. వీనిలో ఆరు పార్టీలు మాత్రమే రాజకీయముగ కొంచము ప్రాముఖ్యతను వచ్చినవి. కాంగ్రెసు: సోషలిష్టుపార్టి; హిందూమహాసభ; షెడ్యూలు క్యాష్టు (తరగతుల) ఫెడరేషన్; కమ్యూనిష్టు కొని ఊగులాడు పార్టి; కె. ఎం. ప్రజాపార్టి.

మనుష్యులే పార్టీల విధానములను నిర్ణయించువారు. కనుక ఏయే పార్టీలకు దేశములో ఎట్టి పలుకుబడి కలదో చూచుటకు, వెఱ్ఱి భ్రమలకును, పొరబాటులకును, లోనైన పార్టి నాయకుల విషయమై, కొంత చర్చింపవలసి యున్నది.

కాంగ్రెసు పార్టి దేశములో ఎక్కువ బలమైన [illegible] అని చెప్పుటకు సందేహము లేదు. అది గాంధీ [illegible] ను, సేవ వల్లను ఏర్పడినది. కేవలము చిన్న [illegible] లేక చిన్న గ్రామములోను ఒక చిన్న [illegible] యను మొక్కను ఆయన నాటినాడు. [illegible] ఈ దినమునకు కూడ పూజింపబడు [illegible] ది. లక్షల కొలది గల ఈ [illegible] చిన్న [illegible] ల నుండి కాంగ్రెసు సంస్థ [illegible] బలమును [illegible] చున్నది. ఈ గాంధీలను పోషించుకొను [illegible] న్నది. [illegible] లను, సోషియలిష్టులు ఇంకను సమీపింపలేదు. వారికి [illegible] ఆధ్యాత్మిక సాంప్రదాయ మున్నను, కమ్యూనిష్టులకు [illegible] ర లేదు. తెల్లటోపీ దొంగల మధ్య ప్రవేశించిన, [illegible] తనము, వారి కడుపులపై దెబ్బ తీయుచున్నది. [illegible] గోడుగ క్రొత్త బాధ చేరినది. కాని వార [illegible] వారి భక్తి చలించ లేదు; ప్రతి కుటుం[illegible] [illegible] పటముున్నది. ఆ [illegible] పటము నుండి [illegible]

హాస్యరస విమర్శనము:

# ఊహాగానము.

—*—

(తు. రా.)

దేశములో యెన్నికల సంరంభము జాస్తిగా ఉన్నది. దీనివల్ల జనానీకము ముఖ్యమైన సంగతులన్నీ మరచిపోయి —ఒక్క ఎన్నికలను గురించే— సర్వకాల సర్వావస్థలలోనూ తలుస్తున్నాగు. దేశం దేశం పరిభ్రమించి పోతూవున్నది. నాయకుల హడావిడి అంతా —దేవతానాయకుడైన వినాయకుడికే తెలియాలి. ఎందుచేతనంటే యెలక్షన్ల దేవుడు వినాయకుడు. ఆయనను మొదటి వేల్పుగా దేవతలంతా యెన్నుకున్నారు. ఆయన అధికారంలోవున్న విషయంగనుకనే యెన్నికలలో యెన్నో విఘ్నాలు వున్నాయి. మొదటిది — పార్టీటిక్కెట్టు లభించే ఘట్టము— రెండోది ఆటిక్కెట్టు అప్పీలులో ఖాయంఅయ్యేఘట్టం. మూడోది —నామినేషను దాఖలు అయ్యేఘట్టం. నాలుగోది: నామినేషను పురుట్లోపోకుండా నిలువ తొక్కుకునే ఘట్టం. ఇట్లాయెన్నో యెన్నో. అందుకని విజయకాంక్ష కలిగిన అభ్యర్థుల కందరికీ మాసలహా యేమంటే "వినాయకవ్రతం" చెయ్యమని. వినాయకవ్రతం చేయుమన్నామని యెవరైనా నవ్వవచ్చు. ఖద్దరు వడుకుతూన్నట్లు, కట్టుకుంటున్నట్లు (అది నిజంకాకపోయినా) ప్రమాణంతో చేసే "కాంగ్రెసు వ్రతం" కన్నా యిది తీసికట్టుకాదుగదా! ఇంకా ఆలోచిస్తే "గాంధీగారి అసలు మానస పుత్రులం" మేము అని ప్రచారం చేస్తున్న కృపాలనీగారి "గాంధివ్రతం" కన్నా ఇహపరలాభ దాయకంకదా! సతతం జాగ్రత్స్వప్నాలు కంటూన్న సోషలిష్టుపార్టీ వారి "నిత్యస్వప్నవ్రతం" కన్నా యిది నిజమైన వ్రతం కదా! హిందూమహాసభ, భారతీయజనసంఘం, రామరాజ్య పరిషత్తు —వీటికంటే యిది సంస్కృతి ప్రధానం కదా! కనుక వినాయక వ్రతంచేసి, జయాభిలాషులైన అభ్యర్థులంతా "విఘ్నేశ్వర పార్టీ" అని ఒకపార్టీ లేవదీస్తే యెన్నికలలో తప్పక గెలుస్తారు. ఈ పార్టీచిహ్నం "మూషికం"— నినాదాలు (Slogans) నెమ్మదిగా జయం జయం" (Slow but sure) — "జయవిఘ్నేశ్వర"! "విఘ్నేశ్వరపార్టీ జిందాబాద్"!

———

కలంతాజా: అనుమానాలున్నవారు మమ్మల్ని అడిగి తీర్చుకోవచ్చును. అనుమానాలు తీర్చి బహుమానాలు యివ్వవలెను. అనుమానాలకు బహుమానాలకు చిరునామా కేర్ ఆఫ్ ఎడిటర్, "భారత జ్యోతి", కడప.

తాజాపై తాజా: ఇది "విఘ్నేశ్వరపార్టీ" వారి ప్రణాళిక (Manifsto) అని అనుమానించవచ్చు.

[ఈ శీర్షిక క్రింద ప్రతివారము హాస్యరసమైన విమర్శనలు ప్రకటింపబడునని మా పాఠక లోకమునకు తెలుపుట కెంతయు సంతసించుచున్నాము: సం|| "భారతజ్యోతి"]

———

స్త్రీలపుట.

# స్త్రీలు — సమానహక్కులు — హిందూ కోడుబిల్లు.

( శ్రీమతి. యస్. పద్మావతీదేవి గారు. )

(14-11-1951 సంచిక తర్వాత)

స్త్రీలకు స్వతంత్రము, సమానత్వము కావలెనని చెప్పునప్పుడంతయు నా కాశ్చర్యము కలుగును. సమానత్వము కావలెనని కోరుటలో 'పురుషులు, స్త్రీలు, వేరు కారు. వారిలో నొకరి కొకరికి భేదములేదు. ఇద్దరు నొకటే' అను భావముతో స్త్రీలు మాటలాడుచున్నారా యని నా ప్రశ్న. స్త్రీలమైన మన మెంతగ ఈ విషయమై వాదించినను, స్త్రీలు పురుషులు కాజాలరు. పురుషులు స్త్రీలు కాజాలరు. ఈ మార్పు గావించుట కెవ్వరికిని సాధ్యము కాదు. ప్రకృతి కే అసాధ్యమైనది. ఒక చిన్న ఉదాహరణము. అనేకులు కోళ్ళను పెంచుచున్నారు. వారు ప్రతి ఒక్క పెట్టకోడికి ప్రత్యేకముగ నొక పుంజుకోడిని పెంచరు. నాలుగైదు పెట్టకోళ్ళను చేర్చి ఒక పుంజు కోడిని పెంచెదరు. ఈ నాలుగైదు పెట్టకోళ్ళకు నొక్క పుంజుకోడి గర్భాధారణము చేయగలదని వారి భావము. ఇటులనే జరుగుచున్నవి. సాధారణముగ అనేకులు దీనిని గమనించి యుందురు. ఇప్పుడు ఏ సంఘములో స్త్రీలు యెంతమంది కలరో పురుషులు కూడ అంతేమంది యుండవచ్చును. నూరు స్త్రీల కొక్క పురుషుని నుంచి, మిగత పురుషుల నందరిని చంపివేసినను, సృష్టి కార్యక్రమము కొనసాగును. గర్భాధారణమునకు కావలసిన బీజదానమును నూరుమంది స్త్రీల కొక్క పురుషుడే చేయగలడు. ఇది సాధ్యమైన కార్యము. నూరుమంది పురుషుల కొక్క స్త్రీని యుంచి, మిగత స్త్రీల నందరిని చంపివేసినచో, సృష్టి కార్యక్రమము నిలిచిపోవును. నూరుమంది గర్భధారణ బీజములను ఒక్క స్త్రీ ధరించి, ఒక్కసారి నూరుమంది బిడ్డలను కనజాలదు. ఇది ప్రకృతికి విరుద్ధమైన కార్యము. ఈ దృష్టితో జూచిన పురుషులతో స్త్రీ లెన్నటికిని సమానులు కాజాలరు.

"స్త్రీలు పురుషులతో సమానమైన వార"ని రాజకీయములలో ప్రవేశించిన కొందరు స్త్రీలు, సులభముగ పలుకుబడి సంపాదించుటకొరకు రాజకీయ నాయకులు పలుమారు చెప్పుచుందురు. ఇది పొరబాటైన అభిప్రాయమని నా మనవి. స్త్రీలు స్త్రీలవలె నుండుటలో గొప్పయున్నది—కాని—స్త్రీలు పురుషులను అనుకరించుటలో గొప్పలేదని నా వ్యక్తిగతమైన అభిప్రాయము.

"స్త్రీలకు స్వతంత్రము కావలెను. స్వేచ్ఛ కావలె"నను కేకలు ఎక్కువగుచున్నవి. స్త్రీలకు "స్వతంత్రము" "స్వేచ్ఛ"యని చెప్పుటలో ఏ విషయములలో స్వేచ్ఛ కావలయునో స్పష్టముగ తెలియుటలేదు. పురుషుల పోషణ (రక్షణ) నుండి స్వేచ్ఛ కావలెనా? సంఘము, సహకారముల నుండి స్వేచ్ఛ కావలయునా? వివాహాది విషయములలో స్వేచ్ఛ కావలయునా? వచ్చిన విషయములకై స్వేచ్ఛ కావలెనా? లేక కుటుంబ పరిపాలనాది కార్యములలో పురుషుల అధికారము నుండి స్వేచ్ఛ కావలెనా? ఈ "స్వేచ్ఛ" "స్వాతంత్రము" అను పదములు వారిలో నిమిడియున్న భావము లగపరింప జేయుచున్నదో నాకు తెలియదు. ఇప్పుడు హిందువులలో నున్న సాంప్రదాయముల ప్రకారము, పురుషుడు ఆ నూరింటాంతరము (పుట్టినది మొదలు గతించువరకు) యవివాహితుడుగ నుండవచ్చును. పెండ్లి చేసుకొని

వలెనను నిర్బంధము లేదు. ఈ విషయములో పురుషులకు సంపూర్ణమైన స్వేచ్ఛ యున్నది. స్త్రీలు కూడ వివాహమాడుటకును, వివాహము లేకుండ, చచ్చువఱకు ఏకాకిగా నుండుటకును స్వేచ్ఛ కావలెనా? వీరి భావమేమి? స్త్రీలు పెండ్లి చేసుకొనుట లేదని చెప్పిన నిర్బంధించుట కేశాసనము లేదు. హిందూ ధర్మశాస్త్రములలో నెచ్చటనైనను నిర్బంధముగ స్త్రీలకు వివాహము చేయవలెనని యున్నదేమో నాకు తెలియదు. కాని వంశ పరంపరముగ వచ్చుచున్న సాంప్రదాయములను చూచినచో, హిందూ స్త్రీలలో అవివాహితులుగ నున్నవారి సంఖ్య చాలతక్కువ. బాల్యమునందే విరాగులై, బ్రహ్మచర్యదీక్ష వహించి, సన్యసించిన స్త్రీలసంఖ్య ఈ దేశములో తక్కువగ కనబడుచున్నది. ఎక్కడనో కోటికి ఒక్కరు కనబడు చున్నారు. పురాణ ప్రసిద్ధురాండ్రై, ఆదర్శ స్త్రీలనియు, మహా పతివ్రతా శిరోమణులనియు, అగ్నితో సమానమైన పవిత్రత కలవారనియు ఖ్యాతిగాంచిన సీత, దమయంతి, చంద్రమతి, లోపాముద్ర, అనసూయ, అరుంధతి, సావిత్రి, మొదలైన తల్లులెల్లను వివాహితులే. దాంపత్య జీవితములలో భాగస్వాములే. మాతృత్వమును వహించిన మహాతల్లులే. శ్రీ. రామకృష్ణ పరమహంస ధర్మపత్నియైన శ్రీ. శారదాదేవి పురుష సంపర్కము తెలియని బ్రహ్మచారిణి. విరాగి. సన్యాసి. కాని ఈమెకు కూడ పెండ్లియైనది. పుట్టుకతోనే పరమహంసగ జన్మించిన శ్రీ. రామకృష్ణ భగవానుని అమెను పెండ్లియాడుట తటస్థించినది. అందువలన ఆ దేదీప్యమానమైన యోగాగ్ని ముందఱ ఆమె భౌతిక వాసన లన్నియు భస్మమై, ఆజన్మ బ్రహ్మచారిణిగ పరిణామ మొందినది. ఇట్టి యవకాశము స్త్రీలకందఱకెని యబ్బునా? స్త్రీ జనంబులెల్ల ఈ రీతి పరిణామ మొందగలరా?

పురుషులలో బాల్యమునందే విరాగులై, ఆజన్మ బ్రహ్మచర్య దీక్షను వహించి, ప్రపంచ భోగములకు దూరులై, సన్యసించిన వారెక్కువగ కనపడుచున్నారు. ఇట్టివారి సంఖ్య కూడ తక్కువే. కాని స్త్రీల సంఖ్యకన్న ఎక్కువగనే యునది. కొందరు నిండు యవ్వన దశలోనే వితంతువులైన వారు నాకు స్వయముగ తెలియును. పునర్వివాహమునకు తల్లిదండ్రులు యనుమతి నొసగినను, వారిలో నట్టియాశ కలుగలేదు. ముందు తమ్ముకట్టుకొనిన భర్తపై వారికి గల యచంచలమైన భక్తియే ఇందుకు కారణము. ఇట్టి వారి జితేంద్రియత్వము ప్రశంసింప దగినది. వారికి నా జోహారులు. కాని ఒక్క విషయము నెవ్వరు మఱువరాదు. ఇట్టి స్త్రీ, పురుషుల సంఖ్య చాల తక్కువ. కోట్లకొలది స్త్రీ పురుషులుగల మన సంఘములో లెక్కకు రాజాలదు.

స్త్రీ, పురుషులమధ్య వివాహమను సాంప్రదాయము ఈ దినము హిందూ సంఘములో క్రొత్తగ వచ్చినది కాదు. ప్రపంచములో నుండు యితర జాతులలోను, ఇతర మతస్థులలోను క్రొత్తగ వచ్చినవి కావు. కొన్ని యుగములుగ నీ సాంప్రదాయము వచ్చుచున్నది. మన పెద్దలు, మనకన్న ముందుండి గతించినవారు వట్టి అవివేకులనియు, మనము మాత్రమే యెక్కువ విజ్ఞానవంతులమనియు భావించుట వెఱ్ఱితనము. గర్వమును సూచించును. వారి జీవితములలో నెంతో అనుభవము గడించి ప్రజల అభ్యున్నతికై ఈ సాంప్రదాయముల నమలులో పెట్టియున్నారు. [illegible] ప్రభుత్వములు చేసిన శాసనములు కావు. వానిని ధిక్కరించిన ప్రభుత్వోద్యోగులు శిక్షింప[illegible]. సాంఘిక మర్యాదలుగ వంశ పరంపరగ వచ్చుచున్నందువలన వానిని ధిక్కరించుటకు నెవరు[illegible]దరు. సంఘముపైనను, సాంప్రదాయముల పైనను, మనకన్న ముందుండిన పెద్దల యనుభవముల పైనను, మనకున్న గౌరవమే యిందుకు ముఖ్యమైన బలము. ప్రసా[illegible]

# రాయలసీమ జిల్లాలలో ధాన్యము రవాణా.

అనంతపురము, కడప, కర్నూలు, బళ్ళారి, జిల్లాలలో పెట్టు ఆహార ధాన్యమైన జొన్నలు, రాగులు, సజ్జలు, కొఱ్ఱలు, అరికెలు, మొక్క జొన్నలు మొదలైన ఆహార ధాన్యమును చెన్నరాష్ట్ర ప్రభుత్వము వారు నవంబరు 4—వ తేది నుండి "డీ—రేషన్" (De-rationing) చేసి యున్నారు. ఇందుకై 1951 సం॥ అక్టోబరు నెల 25 వ తేది 2086 నంబరు గల ఉత్తరువును ప్రకటించి యున్నారు. అనగా నవంబరు 4— తేది నుండి, చట్టబద్ధమైన రేషనింగు అమలులో ఉండే కడప, ప్రొద్దుటూరు, కర్నూలు, నంద్యాల, అనంతపురము, తాడిపత్రి, బళ్ళారి, ఆదవేని మొదలగు పట్టణములలో రేషన్ డిపోల ద్వారా ఈ ధాన్యమును ఒక నియమిత ధరకు, ప్రజలకు అందచేసే బాధ్యతను సర్కారు వారు తప్పించుకున్నారు.

కనుక ఈ పట్టణములలో ఎవరైనను జిల్లా కలెక్టరు ఉత్తరువు లేకుండనే 10 ఇంపీరియల్ మణుగులలోపుగా పై ధాన్యమును నిలువ చేసుకొనవచ్చును. బహిరంగముగ ప్రజలకు అమ్మవచ్చును. ఒక్కసారి 10 ఇంపీరియల్ మణుగుల కన్న ఎక్కువ ఉంచుకొనరాదు.

జిల్లా కలెక్టరునుండి లైసెన్సు పొందువారెల్లరు, వారికి ఇష్టమున్నంత ధాన్యమును తెచ్చుకొని పై పట్టణములలో బహిరంగముగ విక్రయించుకొనవచ్చును. ముందుగా జిల్లా కలెక్టరు నుండి ఉత్తరువు పొందవలెను.

పైన తెలిపిన నాలుగు జిల్లాలలో, ఆయా జిల్లాలలోనే, ఒక ప్రదేశము నుండి మఱియొక ప్రదేశమునకు, చట్టబద్ధమైన రేషనింగు అమలులోనున్న పట్టణముల ద్వారా ఎవ్వరి ఆటంకము లేకుండ రవాణా చేసుకొనవచ్చును. ఆయా పట్టణముల రేషనింగు ఆఫీసర్ల నుండి ఉత్తరువు పొందవలసిన జరూరు లేదు. పోలీసు వారు కాని, ఎఫ్.యస్.ఓలు, టి.యస్.ఓలు ఆటంక పఱచ కూడదు.

ఒక జిల్లానుండి మఱియొక జిల్లాకు ధాన్యమును రవాణా చేసుకొన కూడదు. దీనిపై నిషేధమున్నది. జిల్లా కలెక్టరు నుండి ముందుగా లైసెన్సులు పొంది ఇతర జిల్లాల నుండి ధాన్యము దిగుమతి చేసుకొనవచ్చును.

ఉదాహరణము: జమ్మలమడుగు నుండి చట్టబద్ధమైన రేషనింగు అమలులో నుండు ప్రొద్దుటూరు ద్వారా ఖద్వేలికి పై ధాన్యమును రవాణా చేసుకొనవచ్చును. ఏ సర్కారు ఉద్యోగి ఆటంక పఱచ కూడదు. ఎవ్వరి ఉత్తరువు అవసరము లేదు.

కడప జిల్లా కలెక్టరు నుండి లైసెన్సు పొంది బళ్ళారి, నుండి కాని ఇతర జిల్లాల నుండి కాని పై ధాన్యమును దిగుమతి చేసుకొనవచ్చును.

(1) కలెక్టరు వల్ల ముందుగా లైసెన్సు పొంది ఒక జిల్లా నుండి మఱియొక జిల్లాకు కాని లేక (2) ఒక జిల్లాలోనే ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు కాని, పగలు పూట తప్ప, రాత్రిపూట లారీలలో కాని, బండ్లలో కాని పై ధాన్యమును రవాణా చేయకూడదు. రాత్రిపూట రవాణా చేసుకొనుటకును, జిల్లా కలెక్టరు ఉత్తరువు లేనిదే ఒక జిల్లాలనుండి మఱియొక జిల్లాకు రవాణా చేసుకొనుటకు నిషేధమున్నది.

ఈ నిషేధములు మంచివో, చెడ్డవో వానితో పని లేదు. అవి అమలులో నున్నంత కాలము రైతులు, వ్యాపారస్తులు, రాత్రిపూట లారీలలోను, బండ్లలోను రవాణా చేసుకొనుచు, ప్రజల నౌకర్లైన పోలీసువారి చేతులలోను, ఇతర సర్కారు ఉద్యోగుల చేతులలోను చిక్కి, నలిగి, తమ ఆత్మగౌరవమును పోగొట్టుకొని, న్యాయవాదుల ఇండ్లను వెదకుకొనుచు, పరుగెత్తకూడదని హెచ్చరించుచున్నాము. పగలు ఒక జిల్లాలోనే, ఒక ప్రదేశమునుండి మఱియే ఇతర ప్రదేశమునకైనను రవాణా చేసుకొనవచ్చును. ఎవ్వరు ఆటంకపఱచ రాదు. ఈ హద్దును ఏ భారత పౌరుడు అతిక్రమించి సర్కారు ఉద్యోగుల చేతులలోను, పోలీసువారి చేతులలోను అవమాన పడకూడదని పదే పదే హెచ్చరించుచున్నాము.

## సరిగా ఓటు చేయండి — లేకుంటే చావండి.

(9వ పేజీ తరువాత)

సారములేని వొట్టి నటింపులపై ఆధారపడిన పార్టీ, గౌరవమునుకాని లేక ప్రోత్సాహమునుకాని పొందజాలదు.

హిందువులయొక్క హిందూస్థానములో, హిందూమహాసభ ప్రాముఖ్యమైన పార్టీగా ఉండవలసినది. కాని, అటులలేదు. అది సనాతన బ్రాహ్మణులకును, క్రొత్తగ రాజకీయములలో ప్రవేశించువారికిని, కేంద్రస్థానముగా కనబడుచున్నది. హిందూమహాసభ ఒక చిన్న సంస్థ. ఇంతపెద్ద దేశమునకు సరిపోవునట్టి విశాలదృష్టిగల సంస్థ కాదు. ఈ సంస్థకు నాయకుడైన డా॥ ఖరేగారివైపు ఒక్కసారి చూచినచో, ఆయన ప్రకటనను ఒక్కసారి చదివినచో, ఇండియా రాజకీయముల నుండియేకాక, మతముల కన్నిటికిని తల్లియైన హిందూమతము నుండి, నూర్లకొలది మైళ్ళు పరుగెత్తుకొని పోయెదరు.

జరుగబోవు పది సంవత్సరములపాటు షెడ్యూల్డు తెగ గతులవారికి 72 స్థానములు మన రాజ్యాంగ చట్టములో ప్రత్యేకింప బడినవి. ఈ షెడ్యూల్డు తరగతుల (ఫెడరేషన్) సంఘమునకు డా॥ బి ఆర్. అంబేద్కర్ అధ్యక్షుడు. డా॥ అంబేద్కర్ కావించిన దేశసేవను గుర్తించినందువల్ల కాంగ్రెసు రాజకీయనాయకులు కృతజ్ఞతా సూచకముగ హరిజనులకు ఇంతమాత్రము అనుకూలత చూపియున్నారు. అంబేద్కర్ గొప్ప తెలివితేటలు కలవాడు. నిజ పరిస్థితులను బాగ గ్రహించువాడు. అతనికి సమానమైనవాడు ఈ దేశమున లేడు. అతడు ఉండేవారిలో గొప్ప దేశాభిమాని - రాజకీయ వేత్త. ఋషివంటివాడని అనిపించుకొనుటలో గాంధీజీ హరిజనులను ఉపయోగించుకొనెను. వారికి ఒక [illegible], రాజకీయ ప్రతిష్ఠ సంపాదించుటకై అంబేద్కర్ సింహమువలె పోరాడెను. అగ్రజాతులవారు హరిజనులను తమవారిగ భావింపవలెనని గాంధీజీ ధర్మోపన్యాసముల నొసగుచుండగ, అంబేద్కర్ అగ్రజాతులవారిని లక్ష్యము చేయక, హరిజనులను [illegible]స్థితినుండి పైకి లేవనెత్తెను. గాంధీజీ బోధించుచుండెను. అంబేద్కర్ ఆ బోధనలను ఆచరణయందుంచుచు వచ్చెను. అనేక యుగములుగ రాజ్యాంగ చట్టమును (ధర్మశాస్త్రమును) తయారుచేయుటలో బ్రాహ్మణులకే సంపూర్ణమైన [illegible] ముండెను. అట్టిదానిని అంబేద్కర్‌గారిని తయారుచేయుమని కోరుటలో, కాంగ్రెసువారు ఆయనలోనున్న ఘనతను ఏవిధముగ గౌరవించిరో బుజువగుచున్నది.

ఇట్టి బుద్ధిబలముగల వ్యక్తికూడ, విసుగుతో కాంగ్రెసు మంత్రివర్గమును విడువవలసి వచ్చెను. షెడ్యూల్డు తరగతుల వారికి స్థానములు ప్రత్యేకింపబడినచో, అంబేద్కర్ నిలువబెట్టిన అభ్యర్థులకే ఓటుచేయుమని నిష్కర్షగా [illegible] కోరుచుండెడివాడను. భౌతికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను డా॥ అంబేద్కరు తెలివిలోను, సూక్ష్మబుద్ధిలోను తక్కువవాడు కాడు. కపటబుద్ధి కలవాడు కాడు. అతడు మంచి రాజకీయనాయకుడు. ఎన్ని చెప్పినను, తుట్టతుదకు రాజకీయములు ఒక మురికి ఆటయే.

ఇండియా కమ్యూనిస్టుపార్టీలో ఆంతరంగికముగ ఒకరికొకరికి భేదాభిప్రాయము లున్నవి. రాండివ్, జోషి, డాంజి మొదలగు ఎఱ్ఱబాలురు కట్టెపుల్లలకై ఒకరితో నొకరు తగవులాడుచున్నారు. ప్రతి నెల మాస్కోనుండి వచ్చు ద్రవ్యము విషయమై వీరిలో ఎక్కువ తగాదా యున్నది. ప్రాథమిక సిద్ధాంతములపై బాగుగ ఆధారపడిన పార్టీ అని చెప్పుటకు సందేహము లేదు. ఈ ఎఱ్ఱ [illegible] తగిలించుకొనుటకు సాధారణమైన హైందవుడు సందడిపడుట లేదు. ఆధ్యాత్మిక సాంప్రదాయమువల్ల అతనిని దైవభీతికలవానిగా చేయుచున్నది. ప్రతి హైందవుని ఇంటిలో నుండు దైవ[illegible]మును తొలగించుటకు, కమ్యూనిస్టులకు కొన్నియేండ్లు పట్టును. దేవుడు - స్టాలిన్ ఒకే ప్రదేశములో నివసింపజాలరు.

ఇక ఆచార్య కృపాలనీ దగ్గరకు వచ్చుచున్నాము. రాజకీయనాయకునికన్న ముసలి నటకుడుగ కనపడును. కృపాలనీగారి నాలుగు నెలల బిడ్డయైన, ప్రజాపార్టీ నిరాశ, నపుంసకత్వముల చిహ్నముగ కనబడుచున్నది. చపలబుద్ధిగల రఫీ అహమ్మద్ కిద్వాయిని తన పార్టీకి [illegible]గా తీసికొని, తన నిరాశను ప్రకటించుకొనెను, [illegible] మైన ప్రతిపక్ష పార్టీగా తయారుచేయుటకు, తన ప్రజా పార్టీని కృపాలనీ ప్రారంభించెను. [illegible] సిద్ధాంతములకు [illegible] ప్రయత్నించెను. [illegible] అభ్యాసము గల కిద్వాయి, అప్పుడే ఆయనను వదలిపెట్టెను. [illegible] ప్రజాపార్టీ నిధులుకూడ జారిపోయెను.

కృపాలనీగారి హృదయము మంచిది. మాటలు కఠినమైనవి. కఠినమైన మాటలవల్ల హీనమైన సంకుచితబుద్ధి కలవాడా అని అనిపించును. నిరాశ చెందిన నియంతను పెంచుచున్నారా యేమి అని తోచును. ఇటువంటివ్యక్తి ఒకే దెబ్బతో సృష్టించగలడు; అదే దెబ్బతో నాశనము చేయగలడు. ప్రజా పార్టీ నెలలు పూర్తియై, సరిపక్వము కాకుండ పుట్టిన రాజకీయ బిడ్డ. బిడ్డ ఏడ్చును. దానిని [illegible] చేయుటతో ఆ నేతల కండ్లలో నీరుకారును. ఎంత చెప్పినను కృపాలనీ గాంధీని విడిచిపెట్టి పోయిన వితంతువు.

మన దేశ రాజకీయ చిత్రపటము [illegible], విషాదముగ నున్నదని నేను అంగీకరించక తప్పదు. మన విషాదపూరిత చరిత్రను గుర్తించి నా హృదయము [illegible] తలచెదను.

మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తరముగ [illegible] అభ్యర్థులైన డా॥ అంబేద్కర్; డా॥ జి. వి. దేశముఖ్; హెచ్. వి. కామత్; పండిత కుంజ్రు; ప్రొఫెసర్ కె. టి. షా;

సి. డి. దేశముఖ్ మొదలైనవారి కెల్లరికి ఓటు చేయమని చెప్పుచున్నాను. ఇటువంటి స్వతంత్ర అభ్యర్థులే కాంగ్రెసు వారియొక్క అంతరాత్మను ఎప్పుడు మేలుకొని ఉండునటుల చేయగలరు.

ప్రభుత్వాధికారమును వహించుటకు సరిపోవునంత మంది స్వతంత్ర అభ్యర్థులు లేరు. కనుక మన మెల్లరము కాంగ్రెసుపార్టీకే ఓటు చేయవలెను. అది మన సహకారము ను పొందుటకు యోగ్యమైనదని కాదు. కాని 'చెడ్డ' 'కేవలము చెడ్డ' అను ఈ రెండింటిలోను (కాంగ్రెసుపార్టీని ఇతర రాజకీయపార్టీలతో పోల్చిచూచినచో) కాంగ్రెసు పార్టియే కొంచెము మేలైనదని నా అభిప్రాయము. కాం[గ్రె]సు పార్టీకి ఓటుచేసిన తర్వాత. రాత్రింపగల్ను మనము ప్రార్థన చేయుచుండ వలెను. ఎందుకనగా, శాసన సభ్యులుగ మనకు వచ్చు తెల్లటోపీలవారిలో అనేకులు శిక్షపొందని నేరస్థులు ఉన్నారు.

ఓటు చేయకుండ ఉండుట దేశద్రోహమని జ్ఞాపకము ఉంచుకొందురు గాక!!!

('ఫ్రీలిమ్ ఇండియా' వారి సానుభూతితో ప్రకటింపబడినది.)

---

1952 — 1953 సం॥ ఆహార పదార్థములున్ను, ఆసుపత్రికి కావలసిన ఇతర సామాగ్రిలను సప్లయి చేయుటకు

## టెండరు నోటీసు.

1952-వ సం॥ ఏప్రెల్ నెల 1 వ తేదీ నుండి 1953-వ సం॥ మార్చి నెల 31 వ తేదీ వరకు, ఈ క్రింద కనుపరచిన గవర్నమెంటు ఆసుపత్రులకు ఆహారపదార్థములు, ఆసుపత్రులకు కావలసిన యితర సామగ్రులను సప్లయి చేయుటకు, 1952-వ సం॥ జనవరి నెల 2 వ తేదీ, బుధవారము రోజున సాయంకాలము 2 గంటలవరకు. రెండు టెండర్లను ఒక సీలు కవరులో, సదరు ఆసుపత్రుల డాక్టర్ల వల్ల తీసుకొనబడును.

**ఆసుపత్రి పేరు.**

1. గవర్నమెంటు హెడ్ క్వార్టర్సు ఆసుపత్రి, కడప.
2. గవర్నమెంటు ఆసుపత్రి, ప్రొద్దుటూరు.
3. గవర్నమెంటు ఆసుపత్రి, రాజంపేట.

**టెండరు తీసుకొనువారు.**

1. సూపరింటెండెంటు, గవర్నమెంటు హెడ్ క్వార్టర్సు ఆసుపత్రి, కడప.
2. మెడికల్ ఆఫీసరు, గవర్నమెంటు ఆసుపత్రి, ప్రొద్దుటూరు.
3. మెడికల్ ఆఫీసరు, గవర్నమెంటు ఆసుపత్రి. రాజంపేట.

కడప, 26-11-1951.

ఆర్. షన్ముగం,
డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు, కడప.

---

## నోటీసు.

మా కక్షిదారుడైన, కడపజిల్లా, బద్వేలు తాలూకా, రెంపాడుమజరా, పాపిరెడ్డిపల్లె గ్రామములో యుండే బోయ పాటి సుబ్బయ్య కుమారుడు సుబ్బయ్య, యావన్మందికి తెలియ చేయడము ఏమనగా, మా కక్షిదారుని తండ్రి బోయపాటి సుబ్బయ్య ఇటీవల ఆరు నెలలుగా మతిభ్రమణ కలిగి, అనేక గ్రామాదులు తిరుగుచున్నాడు. మా కక్షిదారుడు, అతని సహోదరులతో పాటి గూండు హిందూ జాయింటు కుటుం[బ]ము గా సుమారు 8 సం॥ లుగా మా కక్షిదారే పెత్తనం[దారు]గా యుండటము, సర్వకార్యములు నిర్వహించుచున్నాడు. మా కక్షి [దారు]ని తండ్రి మా కక్షిదారుని, అతని సహోదరులను జాయింటు కుటుంబమునకు సులు కలుగు ఏలాంటి కార్యము లున్ను చేయుటకు లేదు. ఎవరుగాని మా కక్షి[దారు]ని తండ్రి బోయపాటి సుబ్బయ్యకు బాకీలు ఇచ్చిగాని, వ్రాసుకొని, వ్రాయించుకొన్న గాని, అతని వల్ల ఏలాంటి విక్రయనిర్ణయోగము లు చేయించుకొన్న గాని, మా కక్షి[దారు]ని, అతని సహోదరులను బ[ద్ధు]లు చేయరాలవని తెలుపగో[రు]చున్నాను.

ప్రొద్దుటూరు, 4-12-1951.

సి. నారాయణ[రావు],
అడ్వకేటు.

---

### గాంధీజీ జ్ఞాపకార్థము

ప్రతిదినము ఆయన ప్రాణము విడిచిన సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

---

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road, Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 39. | శ్రీ ఖరనామ సంవత్సర మార్గశిర శు. ౧౪, డిశంబరు, 12, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## కేంద్ర ప్రభుత్వమునకు ధర్మోపదేశములు

చెన్నరాష్ట్ర ఆర్థికశాఖామంత్రి, శ్రీ బి. గోపాల రెడ్డిగారు ఈ నెల 4-వ తేదీ అన్నామలై విశ్వవిద్యాలయములో స్నాతకోపన్యాసము గావించుచు, కొన్ని రాజకీయ ధర్మోపన్యాసములను గావించిరి. కేంద్ర ప్రభుత్వమునకు కొన్ని హెచ్చరికల నొసగిరి. ప్రజాపాలిత ప్రభుత్వము క్రింద ప్రభుత్వ చర్యలను విమర్శించుటకును, సలహాల నొసగుటకును, ప్రతి పౌరునికిని సహజమైన హక్కు కలదు. శ్రీ గోపాలరెడ్డిగారు, వ్యక్తిగతముగ కేంద్ర ప్రభుత్వ చర్యలను విమర్శించి, వారికి సలహాల నొసగియున్నచో, ఎవ్వరు ఏమి చెప్పుటకు వీలులేదు. కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వములు ఒకే రాజకీయపార్టి యాజమాన్యము క్రింద వ్యవహరించ బడుచున్నప్పుడు, రాష్ట్ర మంత్రివర్గములో చేరిన వ్యక్తి కేంద్ర ప్రభుత్వమును విమర్శించి, వారికి హెచ్చరిక ఒసగుట సమంజసమా అను విషయము విచారణీయమైనది.

సేల్సుటాక్సును సమర్థించువారలలో శ్రీ గోపాలరెడ్డిగారు ఉన్మత్తుడైన వ్యక్తి. దినదినమునకును హెచ్చుచున్న ధరలవల్లను, జీవిత వ్యయము ఎక్కువై పోవుచున్నందువలనను, దేశములో కని, విని యెరుగనటువంటి అసాధారణ పరిస్థితులు జనించినవి. బీద ప్రజలును, మధ్యతరగతులవారును, చావుకు సిద్ధమై యున్నారు. శ్మశానభూమి గట్టులను సమీపించుచున్నారు. కొన్ని దమిడీల వఱకైనను, బీదబిక్కలకు పరిహారమిచ్చు ఉద్దేశ్యముతో ఆహారధాన్యముపైనను, మానవ జీవితమున కత్యవసరమైన ఇతర వస్తువులపైనను, సేల్సుటాక్సును తొలగించెదమని కొన్ని నెలలుగ కేంద్ర ప్రభుత్వమువారు చెప్పుచున్నారు. ఇట్లు అవసర వస్తువులపై సేల్సుటాక్సు తొలగించినచో, తన రాష్ట్ర ఆదాయములో ఆరుకోట్ల రూపాయలు లోటు వచ్చుననియు, ఈ సలహాకు సమ్మతించుటకు వీలుండదనియు, బహిరంగముగ ఆక్షేపించుచునే వచ్చుచున్నారు. మద్యపానమువల్ల వచ్చు ఆదాయము కల్మషమైనది. దానితో ప్రభుత్వమును నడుపుటలో నీతిలేదని మన మంత్రులు చెప్పుచున్నారు. మద్యపానము చేయువారినుండి తీసుకొను వరుమానము కళంకమైనది అయినచో, బీదసాదల నుండి, జీవితమునకు అత్యవసర వస్తువులైన ఆహారధాన్యము, గుడ్డ, ఇతర ముఖ్యవస్తువులపై సేల్సుటాక్సు మూలమున వసూలుచేయు ద్రవ్యము కళంకమైన ఆదాయము కాదా? అది బీదల రక్తమును పీల్చుట అని మన మంత్రివర్గమువారికి తోచకపోవుట విషాదకరము కాదా?

మంత్రివర్గమువారు, పరిపాలనా వ్యయమును అత్యవసరమైన అంతరువులకు తెచ్చి, ఆరు కోట్ల రూపాయలు, బీద సాదల రక్తము సేల్సుటాక్సు మూలముగ పీల్చకుండ, మినహాయింపు యివ్వజాలకున్నారు. అవసర వస్తువులపై సేల్సు టాక్సులు రద్దుచేయకూడదను ఆక్షేపణను మొట్టమొదట లేవదీసిన కీర్తి మన గోపాలరెడ్డిగారిదే.

ఇండియా రాజ్యాంగ చట్టములో 371-వ సూత్రములో "'బి' తరగతి రాష్ట్రములు, యూనియన్ ప్రభుత్వ అధ్యక్షుని అధికారమునకు లోనై యుండవలెను. అప్పుడప్పుడు అధ్యక్షులు జారీచేయు ఉత్తరువుల ప్రకారము నడచుకొనవలె" నని నిర్వచింపబడినది. ఎల్. ఎన్. రాజు కేసులో న్యాయము లోపమున్నదని, ఈ పై సూత్రము క్రింద యూనియన్ అధ్యక్షులు ఒక ఆదేశమును మైసూరు మంత్రివర్గమువారి కొసగిరి. ఈ సూత్రము క్రింద 'బి' తరగతి రాష్ట్రములకు ఉత్తరువు [illegible] నొసగుటకు ఇదే మొట్టమొదటిసారి. దీనినే మైసూరు మంత్రివర్గమువారు ఆక్షేపించిరి. దీని సారాంశమేమనగా? 371-వ సూత్రము మైసూరు రాష్ట్రమున [illegible] నిరసించుటకు కేంద్ర ప్రభుత్వమువారు [illegible]. మైసూరు రాష్ట్రమున కొక్కదానికే మినహాయింపు [illegible], ఇతర 'బి' తరగతుల రాష్ట్రములు లోనైయుండునా? [illegible] రేకించును. తుట్టతుదకు రాజ్యాంగ చట్టములో 371-వ సూత్రమునే తొలగించుచూ, [illegible] బిల్లును ఉపపాదింపవలసిన అవసర మేర్పడును. [illegible] ను ప్రభుత్వ ఘట్టములో విషాదమైన ఘట్టము.

ఈ మైసూరు రాష్ట్రముయొక్క తిరుగుబాటు, [illegible] కీయ తత్వములను చర్చించుటకును, రాష్ట్ర ప్రభుత్వముల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనవలదని కేంద్ర ప్రభుత్వమునకు హెచ్చరిక యొసగుటకును, శ్రీ గోపాలరెడ్డిగారికి ధైర్యమిచ్చినది కాబోలు. అన్నామలై విశ్వవిద్యాలయ

పట్టభద్రుల సభలో శ్రీ గోపాలరెడ్డిగారు మాటలాడుచు:

"(1) కేంద్ర ప్రభుత్వమువారు రాష్ట్రమంత్రివర్గముల మొదటి ప్రారంభములను గొంతుపిసికి చంపకూడదు. (2) ప్రతి విషయములోను నిరుత్సాహకరమైన సమత్వ సాధనకే కేంద్రము ప్రయత్నింప కూడదు. (3) అడుగడుగునకు కేంద్ర ప్రభుత్వము ఉత్తరువు చేయుచున్నదను భావము రాష్ట్ర ప్రభుత్వములలో కలిగింపకూడదు. (4) సమానాధికారము, సమత్వము అను పేరులో కేంద్ర ప్రభుత్వము ఉత్తరువులను జారీచేయుచో, రాష్ట్ర ప్రభుత్వములకు కోపము కలిగితీరును. ఇది లేనిపోని అంతరంగిక సంఘటనలకు దారితీయును. (5) కేంద్రములో సమర్థులైన నాయకు లెప్పుడూ ఉండి, ప్రభుత్వయంత్రమును నడుపగలరని తలచుటకు వీలులేదు. అందువలన రాష్ట్రములకు సంబంధించిన విషయములలో అనేకమారులు యోచించిన తర్వాత కానీ, కేంద్ర ప్రభుత్వము ఉత్తరువులను, సలహాలను ఇవ్వకూడదు. కేంద్రములో ఊహాశక్తి లేని పరిపాలకులు రాష్ట్రములపై తప్పు ఉత్తరువులు చెలాయించుచో, ఆస్ట్రేలియాలో రాష్ట్రములు వేరుకావలెనని ఆందోళన ప్రారంభమైన విధముగా, ఈ దేశములోకూడ ఆందోళన ప్రారంభమగును. జాతీయత యను భావము కూలిపోవును. (6) రాష్ట్ర ప్రభుత్వములు తప్పుదారిన పోవుచున్నవని తోచినను, కేంద్ర ప్రభుత్వము శిక్షింపరాదు. చక్కగా నడచుకొనవలసినదని హెచ్చరిక రాష్ట్ర ప్రభుత్వములకు, రాష్ట్ర శాసనసభలనుండియు, ప్రజలనుండియు రావలెను. కేంద్ర ప్రభుత్వమునుండి రాకూడదు. (7) రాష్ట్ర ప్రభుత్వములు రాజ్యాంగ చట్టమునకే వ్యతిరేకముగ ప్రవర్తించునపుడు. సుప్రీముకోర్టు మాత్రమే తీర్పుచెప్పవలెను" అని తెలిపిరి.

150 సంవత్సరములపాటు సాగిన బ్రిటిషు పరిపాలనము, దేశమునకు ఏమి మేలు చేసినను, చేయకపోయినను, కట్టుబాట్లుగల కేంద్రీకృతమైన పరిపాలనా యంత్రమును వదలిపెట్టినది. ఈ యంత్రము క్రింద, భిన్న విభిన్నములైన శక్తులన్నియు పగ్గముగా చేర్చబడినవి. ఈ దేశములో ఒక కొన నుండి మరియొక కొనవరకు ఉండు ప్రజలలో అందరు ఒకే జాతివారను భావము కలిగించినది. దేశ విభజనవల్ల కలిగిన క్లిష్ట సంఘటనములను మొట్టమొదటి స్వాతంత్ర్య ప్రభుత్వము ధైర్యముతో ఎదుర్కొనుటకు, ఈ కేంద్రీకృతమైన పరిపాలనా యంత్రము తోడుపడినది. శ్రీ గోపాలరెడ్డిగారు కేంద్ర ప్రభుత్వముపై, రాష్ట్ర ప్రభుత్వముల తిరుగుబాటుకు మొదటి పతాకమును లేవనెత్తుచున్నారు. రాష్ట్ర అసూయలు, వ్యక్తులమధ్య కలుగు అసూయలు, శ్రీ గోపాలరెడ్డిగారు ప్రారంభించినరీతి, రానురాను ఎక్కువగునను దృష్టితోనే, కొందరు రాజకీయ నాయకులు దేశమునకంతయు బలయుతమైన ఒక్క కేంద్ర ప్రభుత్వము, ఒక్క పార్లమెంటు చాలుననియు, అందు కనుగుణ్యమైన రాజ్యాంగచట్టమును తయారు చేయవలెనని సలహాల నిచ్చిరి. రాష్ట్ర శాసనసభలు ఉండకూడదనియు, ప్రజలయొక్క బాగోగులు, మధ్యనుండు దేవతలకు ఒప్పగింపకూడదనియు హెచ్చరిక చేసిరి. ఈ సలహా అగ్రనాయకులకు అప్పుడు నచ్చకపోయెను. ఎక్కువ అనుభవము, ఊహాశక్తి లేక, స్వగర్వము మాత్రమే ఎక్కువగా ప్రతిబింబించు వ్యక్తుల చేతులకు ప్రజల మాన, ప్రాణములను ఒప్పగించునటువంటి రాజ్యాంగ చట్టమును తయారుచేసిరి. రాజ్యాంగచట్ట నిర్మాతలు గావించిన తప్పు ఇదే. దీనికి తోడుగ లొంగుబాటులకు లోనైన విధానమును కేంద్ర ప్రభుత్వమువారు అనుసరించుచు వచ్చుచున్నందున, భారతదేశ విచ్ఛిన్నమునకు వారు విత్తనములను ఇప్పుడే నాటుచున్నారు.

ఈ దేశములో 100 కి 80 మంది అక్షరజ్ఞానము లేనివారున్నారు. ఇట్టి వారందరికి ఓటింగు హక్కు ఒసగబడినది. ఇట్టి వారిపై ఆధారపడు ప్రజాపాలిత ప్రభుత్వము పేరుకు మాత్రమే డెమాక్రసీ యని పిలువబడునేమో కాని, వాస్తవ పరిస్థితులలో అది ప్రజల ప్రభుత్వము కాజాలదు. మూకలయొక్క (గుంపులయొక్క—మాబొక్రసీ) ప్రభుత్వమే అగును.

శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పినట్లు కేంద్ర ప్రభుత్వయంత్రమును నడుపుటకు సర్వసామర్థ్యముగల వ్యక్తులే లభింపనిచో, రాష్ట్ర ప్రభుత్వ యంత్ర నిర్మాణమును నడుపుటకు వలయు సూక్ష్మబుద్ధి, సామర్థ్యము, న్యాయబుద్ధి, నైతిక ప్రవృత్తి కల వ్యక్తులు చిక్కుట వెయ్యంతలు కష్టమని నిస్సందేహముగ చెప్పవచ్చును. రాష్ట్ర వ్యవహారములలో కలుగు అవమానకరమైన లోటుపాట్లను సవరించుటకే, కేంద్ర ప్రభుత్వమునకు అసాధారణాధికారము ఉండితీరవలెను. కేంద్ర మంత్రివర్గములో ఊహాశక్తిలేని పరిపాలకులు ఉందురనినచో, రాష్ట్ర మంత్రివర్గములో అట్టివారుండజాలరని వెయ్యిమంది గోపాలరెడ్డిగారలుకూడా హామీ ఇవ్వజాలరు. అందుకనే రాష్ట్ర నియంతలను సరియైన మార్గమున నడుపుటకు, కేంద్ర ప్రభుత్వమునకు ఎవ్వరుగాని ప్రశ్నించుటకు వీలులేని అధికారము ఉండవలెనని చెప్పుచున్నాము. ప్రజాసామాన్యమునకు నోరున్నను, అస్పష్టమైనవాక్కులు కలవారే. ఇట్టి అస్పష్ట వాక్కులుగల మూగ ప్రజ లెంతకాలముందురో, ఒక రాజకీయ పక్షము ఎంతకాలము నిరంకుశముగ అధికారము పొందియుండునో.. అంతకాలము ప్రజలనుండి కాని, లేక రాష్ట్ర శాసనసభలనుండి కాని, మంత్రివర్గములకు హెచ్చరికలు ఇవ్వబడునని తలచుట వెఱ్ఱితనము. మంత్రివర్గమువారి ఉత్తరువులకు శాసనసభలు తలలూచు సంస్థలుగనే ఉండును.

(మిగత 16 వ పేజీలో)

# కడపజిల్లాలో క్షామము.

(పి. రమణారెడ్డి.)

కడప జిల్లాలో క్షామపరిస్థితులను గురించి ఈ పత్రికలో జిల్లా కలెక్టరుగారు ప్రభుత్వమునకు పంపిన నివేదికను 10-వ పుటలో ప్రకటించి యున్నాము. పోయిన వారములో రాష్ట్ర ఆరోగ్యశాఖామంత్రి శ్రీ. కళా వెంకటరావుగారు ఈ జిల్లాకు వచ్చి జమ్మలమడుగు, పులివెందుల తాలూకాలలో తిరిగి ఆ రెండు తాలూకాలే "క్షామము" తాలూకాలని ప్రకటింపవలయుననియు, కొన్ని క్షామనివారణ పనులు ఆ రెండు తాలూకాలలోనే ప్రారంభింప వలసినదిగ అధికారులకు చెప్పిరనియు తెలియుచున్నది. వర్షములు లేక జిల్లా అంతయు కఱవుతో మాడిపోవుచున్న సంగతి మంత్రిగారికి తెలియదేమో. ఎవ్వరు తెలిపినవారు లేరేమో మాకు తెలియరాకున్నది. ఇతర తాలూకాలలో తినుటకు అన్నము లేకపోయినా త్రాగుటకు నీరైనా చిక్కుచున్నవి. రాజంపేట తాలూకాలో బావులలో నీరు లేదు. జనులకు, పశువులకు త్రాగుటకు నీరుకూడ లేదు. తోటలలోని ఫలవృక్షముల గతి చెప్పుట అవసరమే లేదు. ఈ తాలూకాస్థితి ఆందోళనకరముగ ఉన్నది. ఒక కడవనీరు ఒక అణాకు అమ్ముచున్నారని మాకు వార్తలు చేరుచున్నవి.

చెయ్యేరుకు కాజ్‌వే కట్టవలెనని ఎన్నోయేండ్లగ ఆందోళన జరుగుచున్నది. అది త్వరలో జరిగే జాడలు కనపడలేదు. కడప—చెన్నపట్టణము రోడ్డు (కడప—బాలపల్లెరోడ్డు) ను హైవేస్ డిపార్టుమెంటుకు తీసుకొని, చెన్నపట్టణమునుండి బళ్ళారి వఱకును మంచి రహదారీ ఏర్పాటు చేయవలెనని కడప జిల్లా బోర్డు వారు చాలాసార్లు ప్రభుత్వము వారిని కోరియున్నారు. దేనికిని వారు చెవి యొగ్గకయున్నారు. ఇప్పుడు రాజంపేట తాలూకాలో కాటకము సంభవించి ప్రజలు పనులులేక, తినే ధాన్యమును కొనుటకు దుడ్డులేక మాడుచున్నారు. ఇప్పుడే చెయ్యేరుపై కాజువే కట్టుటకును, కడప—బాలపల్లె రోడ్డును బాగా మరమ్మత్తు చేయుటకును, క్షామనివారణ కార్యముల క్రింద ప్రభుత్వమువారు వెంటనే పూనుకొనవలెనని కోరుచున్నాము. జిల్లా కలెక్టరుగారు మా సలహాలను పరీక్షించి, వెంటనే ఈ రెండుపనులు ప్రారంభించుటకు ప్రభుత్వముపై ఒత్తిడి చేయుదురని ఆశించుచున్నాము.

## విజ్ఞప్తి

చేవ్రాలు చేయక, పై విలాసమును వ్రాయక, అనేకమంది మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటనార్థము జాబులను, వ్యాసములను పంపుచున్నారు. చేవ్రాలుచేసి, చిరునామాను మాకు తెలుపుటకే ధైర్యము చాలని వారి జాబులను, (వ్యాసములను) పత్రికా శాసనములక్రింద, జవాబుదారి వహింపవలసినవారము, మే మేరీతి వానిని ప్రకటింపవలయునో తెలియకున్నది.

చేవ్రాలు చేయక, చిరునామాను తెలుపక వ్రాయు జాబులను, వ్యాసములను మా "భారత జ్యోతి" పత్రికలో ప్రకటింపబడ కెంతమాత్రము వీలుపడదని విన్నవించుకొనుచున్నాము—

సంపాదకుడు, "భారత జ్యోతి"

రాబోవు ఎన్నికలు — ఓటర్లు గమనింపవలసిన విషయములు:—

# * ఓటర్లు గమనింపవలెను. *

పోలింగురోజున అందరికీ సెలవుండును. రోజులో ఎప్పుడుపోయి — ఓటుచేసినా చేయవచ్చును. కాని, సాధ్యమైనంతవరకు,— 5 గంటలలోపల ఎంతత్వరగా వెళ్ళి ఆ పని పూర్తిగా చేసుకుంటే అంతమంచిది. పోలింగుస్టేషను దగ్గరలోనే ఉండును. కనుక స్వయముగా నడిచివెళ్ళిగాని, స్వంత బండీ ఉపయోగించుకొనిగాని ఓటు చేసి రావలెను.

పోలింగుస్టేషనువద్ద ప్రతి ఓటరుకూ 'ఇతడు ఫలానా' ఓటరు అని తెలియజేసే చీటీ ఇవ్వబడును. అందులో, ఎన్నికల జాబితా యందు ఏ పేజీలో, ఏవరుస నంబరున అతని పేరున్నదో సూచించబడి వుండును. పోలింగుస్టేషనులోని పోలింగు బూతుకు వెలుపల అతడు ఓటు చేయబోయే అభ్యర్థికి నిర్ణయించ బడిన గుర్తులు కనిపించును. ఓటరు పైన చెప్పిన చీటీ తీసికొని, ఒక వరుసగా ఆ పోలింగు బూతులో ప్రవేశించవలెను.

అక్కడ పోలింగు ఆఫీసర్లు ఆచీటీని సరిచూచి, అతని యెడమ బొటనవ్రేలికి, తుడిచివేయుటకు వీలుకాని ఒక సిరా రాచి, పిమ్మట బ్యాలెటు కాగితము ఇచ్చెదరు. అతడు అసెంబ్లీ బ్యాలటు పెట్టెలున్న ఆవరణ సమీపములో నిలువబడక, జవానుకు పై చీటీని ఇచ్చివేసి, లోపలికి వెళ్ళి, తానభిమానించే అభ్యర్థి బ్యాలటు పెట్టెను, పైన చిత్రించబడిన గుర్తువలన సరిపోల్చుకొని, దానికేర్పరచబడిన సన్నని కంతద్వారా, తన బ్యాలెటు కాగితాన్ని నలపకుండా, అందులో వేయవలెను.

బయటికి రాగానే అతనికి పార్లమెంటరీ సీటుకు సంబంధించిన బ్యాలెటు కాగితాలు ఇస్తారు. అప్పుడతడు పార్లమెంటు బ్యాలటు పెట్టెలున్న ఆవరణములోకి పోయి, పైన చెప్పిన విధముగానే ఓటుచేసి బయటికి రావలెను. ఇక అక్కడనుండి ఇంటికి చేరుకోవడము తప్ప పనేమీ లేదు.

ఒకటి కంటె ఎక్కువసీట్లు యేర్పాటైన నియోజక వర్గములో, ఈ ఓటింగు పద్ధతి కొంత వేరుగా ఉండును. ఓటరు తనకిచ్చే బ్యాలట్ పేపర్లను– రెండుగాని మూడుగాని— వేర్వేరు పెట్టెలలో వేయ్యవలెను. ఒక్క పెట్టెలోనే అన్నీ వెయ్యకూడదు. అట్లా వేస్తే అందులో ఒకటిమాత్రమే సక్రమమని ప్రకటించబడును.

అభ్యర్థు లేర్పాటుచేసే ఏ ఎలెక్షన్ మీటింగులలోనూ ఓటరు అల్లరి చెయ్యరాదు. అట్లా చేసినవారికి కఠినమైన పెనాల్టీలు విధించమని చట్టములో వున్నది.

ఓటరు తన ఓటును అమ్ముకోవడము నైతికముగ దోషము కావడమే కాక, చట్టరీత్యా కూడ నేరము. అదేవిధముగ ఇతరులను ఫలాని విధముగా ఓటుచేయుమని నిర్బంధించినా, బెదిరించినా కూడ నేరమే అవును.

పోలింగురోజున ప్రచార మీటింగులూ, కాన్వాసింగులు జరపరాదు. పోలింగుస్టేషనుకు 100 గజాల దూరములో ప్రయివేటు స్థలంలో నైనాసరే ఇట్లాటివి జరిగిన, వారంటు లేకుండా అరెస్టుచేసి, రు 250 లు వరకూ జరిమానా విధించవచ్చును.

అభ్యర్థిగాని, అభ్యర్థిపార్టీగాని పంపిన బండ్లు ఎక్కి వెళ్ళి ఓటరు ఓటు చెయ్యరాదు. బాడుగ జాయింటుగా ఇచ్చుకుంటే తప్ప, రెండు కుటుంబాలవారు ఒక బండిలో కలిసి వెళ్ళకూడదు. ఒక ఓటరు తనబండిలో ఇంకొక ఓటరును గాని, అతని కుటుంబమునుగాని తీసుకొని వెళ్ళకూడదు.

మరొక ముఖ్య విషయము. ఓటరు తానెవ్వరికి ఓటు చేసినదీ; తన ఆప్తవర్గములో గూడ చెప్పకూడదు. అట్లు చెప్పిన అతనికి మూడు నెలల వరకూ ఖైదు విధించవచ్చును. జరిమానా కూడా వేయవచ్చును.

పోలింగు ఆవరణలో ఓటరు యెక్కువసేపు నిలువరాదు. అనుమానము కలిగితే పోలింగు ఆఫీసర్లు ఆవరణలోకి వచ్చి చూడవచ్చు. బ్యాలెటు కాగితాలు తస్కరించబడినా, ఇంకేవిధమైన అక్రమ చర్యకు పాల్పడినా, ఓటరు ఒక సంవత్సరము ఖైదుకూ, రు 500 ల జరిమానాకూ పాత్రుడు కావడమేకాక, ఇక ముందెన్నడూ ఎన్నికల్లో పాల్గొనడానికి వీలులేకుండా అతని పేరు ఓటర్ల పట్టికలోనుంచి కొట్టివేయబడును.

# ఎన్నికలు — భారతీయుల కర్తవ్యము.

హిందూదేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత, ప్రజలు శాసన సభ్యులను ఎన్నుకొనుట కిదియే ప్రథమము. ఈ శాసన సభ్యులే దేశ ప్రజలయొక్క ఆర్థిక–రాజకీయ–సాంఘిక–నైతిక విషయములను, వారి విద్యా సంస్కృతి విషయములను కూడ, నిర్ణయించి నిర్మించువారుగా నుందురు. కనుక మనము వారిని ఎన్నుకొనుటయందు బహుజాగ్రత్తగా నుండవలయును.

మన దేశ రాజ్యతంత్ర నిర్మాణము యితర స్వతంత్ర దేశములయొక్క (ముఖ్యముగా పాశ్చాత్య స్వతంత్ర దేశముల నిర్మాణముచే) ప్రస్తుతము అనుసరించినది. దీనిని మనము ప్రజాతంత్ర ప్రభుత్వమని పిలుచుచున్నాము. రెండువేల సంవత్సరముల క్రిందట నుండి, అనగా పరదేశరాజులు మన దేశముపై దండెత్తుటకు ప్రారంభించిన నాటికాలమునుండి, మన దేశమునందు నిజమైన ప్రజాతంత్ర ప్రభుత్వములున్ను, యీనాడు పాశ్చాత్యుల అనుకరణచే యేర్పడిన ప్రజాప్రభుత్వములకును చాల భేదమున్నది. ఆ భేదముయొక్క కారణముగనే మన దేశమునందు మన ఆర్థిక–రాజకీయ–సాంఘిక–నైతిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక విషయములను మనము నెరవేర్చుకొనలేక, మన మొకరితో నొకరు ఘర్షించుచు, కష్టపడుచున్నాము. మన మొకసారి అంతర్ముఖులమై, మన ఆధ్యాత్మిక సత్యమును, సంస్కృతిని గ్రహించితిమేని, మన సర్వ సమస్యలు పరిష్కరించుకొను శక్తి మనకు కలుగును.

ఇప్పటిలో మనదేశ ప్రజలు మార్క్సన్, లెనిన్‌ల యొక్క మత నిరోధ వాదమగు కమ్యూనిజమో లేక వ్యక్తి స్వాతంత్ర్యమును అరికట్టి సర్వమును ప్రభుత్వాధీనము జేసుకొని డిస్పేట్ సోషియాలిజమో, లేక వ్యక్తి స్వాతంత్ర్యమును పేరుతో క్రింది వర్గములను పైకిరానీయక యున్నతవర్గముల స్వాధీనములో అన్ని అధికారములు నిలుపుకొనుటకు వారు ప్రచారము కావించెడి డెమొక్రిటిక్ రిపబ్లికానిజమో, నగు నీ మొదలగున వన్నియు పాశ్చాత్యదేశములనుండి మనదేశమునకు దిగుమతి కావింపబడినవి. వారిది బహిర్ముఖముతో గూడిన భౌతిక దృష్టి. మనది అంతర్ముఖముతో కూడిన ఆధ్యాత్మికదృష్టి. ఈ రెండువేల సంవత్సరములుగా ముఖ్యముగా బుద్ధదేవుని కాలమునుండి, ఆధ్యాత్మిక దృష్టి యనుటకు అర్థము ప్రపంచమును వీడి, సన్యాసులగుటయే యని మనదేశమునందు తలంపబడుచున్నది. కాని నిజముగా ఆధ్యాత్మిక దృష్టి యనుటచే, పృథ్వీ జీవిత మంతటిని ఆధ్యాత్మికతచే జీవవంత మొనరించి, ఉన్నతము కావించుటయే యని అర్థము. ఇట్టి ఆధ్యాత్మిక దృష్టి సమస్తమానవ జీవితమును తనయందు చేర్చుకొని శక్తివంతి మొనరించును.

రెండువేల సంవత్సరముల క్రిందటి వరకు మన దేశము రాజులచే పరిపాలింపబడుచున్నను, లేక ప్రజాతంత్ర ప్రభుత్వముచేత పరిపాలింపబడుచున్నను, పరిపాలిత యగు ప్రజలు పూర్ణాధికారమును గలవారై, తమ ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక, ఆధ్యాత్మిక విషయములను, తామే నిర్ణయించుకొని, వ్యవస్థీకరించుకొను చుండిరి. మనము కూడా ఇప్పుడు అంతర్ముఖులమై వారి విధానములను కనుగొని, వానిని తగినట్లు మార్చి, ప్రస్తుత మన జీవిత విధానమును వ్యవస్థీకరించుకొంటిమేని, మనము సర్వవిధముల సామరస్యముతో కలిగి అభివృద్ధి కావించుకొందుము.

మానవుని సమస్యలన్నియు వ్యక్తికిని, సమష్టికిని గల సంబంధమును, సామరస్యముగా నిర్మించుకొనుట యందే గలదు. ప్రభుత్వముల కార్యమంతయు ఈ సంబంధములను సరిగా వ్యవస్థీకరించి, సమష్టికిని, వ్యక్తికిని తగిన పరస్పర

సంబంధము లేర్పరిచి, వ్యక్తి సర్వవిధముల అభివృద్ధి పొందుటకు అవకాశములను కల్పించుటయందే గలదు. మానవ సమిష్టియన, మానవ సముదాయములలో అన్నింటికన్న గొప్పదియగు విశ్వమానవకోటి మాత్రమే కాదు. వ్యక్తికిని, విశ్వమానవకోటికిని మధ్య ప్రత్యేక దేశమునకు చెందిన జాతులును, ఉపజాతులును అట్లే పట్టణములు లేక పల్లెలు, కుటుంబములు అను మానవ సముదాయములుకూడా గలవు. ఇవి కాక కులములు, తరగతులు అను మానవ సముదాయములు కలవు. కాని ప్రస్తుతము ఈ కులములు, తరగతులకు ప్రాముఖ్యత అంతగా లేదుగనుక మిగత ఐదువిధములైన మానవ సముదాయములనే మన మిప్పుడు గమనింతము. భారతజాతి, ఆంగ్లజాతి, ఫ్రెంచిజాతి, పర్షియాజాతి యని ఈ విధముగా వివిధ జాతులు ప్రపంచమునందు ఈ మధ్యకాలము నుండియే, అనగా కొన్ని నూర్ల సంవత్సరముల నుండియే, యేర్పడినవి. మరియు విశ్వమానవజాతి నంతటిని ఐక్యపరచు భావము, కొలది సంవత్సరములనుండి మాత్రమే కలిగినది. కనుక జాతీయ భావము కొన్ని నూర్ల సంవత్సరములకు మునుపు ప్రత్యేక ప్రత్యేక ప్రజలయందు యేర్పడుటకు మునుపు, పృథ్విపై మానవుడు కుటుంబమును, కులమును, తరగతిని, పల్లె, పట్టణమును, ప్రాంతీయ ప్రదేశమును తన దృష్టియందుంచుకొని, తన జీవిత విధానము నిర్మించుకొని, మిగత ప్రజా సముదాయముతో, — అనగా మిగతా దేశములతో, ప్రజలతో — మైత్రినో, విరోధమునో కలిగియుండెడివాడు. కాని ఈ నాడు వ్యక్తికి కుటుంబముతోను, గ్రామముతోను, తన రాష్ట్రమునకు చెందిన ఉపజాతితోను, తన దేశమునకు చెందిన జాతితోను, విశ్వమానవ సమిష్టితోను, సరియగు సంబంధము నేర్పరచుకొని అందరితో సామరస్యముగ, సమైక్యతతో జీవించుటయందే గలదు, అట్లయిననే ప్రపంచ యుద్ధములు, ఘర్షణలు తొలగి, మానవునకు శాంతిజీవనము యేర్పడును. ఇట్టి శాంతిజీవనమును మానవునకు కల్పించి, అతనిని వ్యక్తిగతముగా సర్వవిధముల వికాసము పొందుటకవకాశము ఇచ్చుటయందే ప్రభుత్వముల కర్తవ్యము గలదు. ఈ కార్యము నొనరించని ప్రభుత్వములు నిజముగా ప్రభుత్వములు గావు. జాతి జీవనమందు ప్రతి వ్యక్తియు, సర్వ విధముల వికాసమును పొంది, ప్రభుత్వముతో పనిలేకుండ, మానవులు పరస్పరము వృద్ధిగాంచు పరిస్థితి యేర్పడుచుండినచో, అదియే నిజమైన ఆదర్శ మానవ సమాజస్థితి. అట్టి స్థితికి మానవ సమాజమును కొనిపోవుటయే నిజమగు పరిపాలనా ఉద్దేశ్యము. మానవుడు కూడా ఇందుకు తన్నుగా నంతర్ముఖముచేసుకొని, తన నిజాత్మను కనుగొని, స్వకీయాత్మయందు ప్రతిమానవుని ఆత్మను కనుగొనుటచే సామరస్యత యేర్పడును. ప్రతిబంధమున ఈ పనును పీడింపజేసుకొన జాలరు; అవసరమును లేదు. కాని కొందరు గాని, అందరుగాని తమ్ము తాము అంతర్ముఖ మొనర్చుకొని, తన అంతర్ముఖతచే, నితరులతో ఐక్యముపొంది జీవించుటకు అవసరమగు, తగిన రాజ్యాంగ నిర్మాణమును, దేశప్రజలు లేక జాతి యేర్పరచుకొన వలెను. ప్రస్తుతపు మన రాజ్యాంగ నిర్మాణము అట్టిది కాదు.

మన పూర్వులు వ్యక్తికిని— కుటుంబమునకును— గ్రామమునకును సరియైన పరస్పర సంబంధ మేర్పరిచి, వానిని స్వయం పూర్ణములగు సముదాయములగు జాతితో, దేశముతో సరియగు సంబంధమును, బాధ్యతను కలిగించుటచేతనే అవి చక్కగా జీవవంతముగా నుండెడివి. ఇప్పటి రాజ్యాంగము సర్వమును కేంద్రీకృత మొనర్చి, రాష్ట్రములకును, పట్టణములకును, గ్రామములకును, కుటుంబములకును, వ్యక్తులకునుకూడా స్వాతంత్ర్యమును, బాధ్యతను విడక, వానిని స్వయంపోషకముగ చేసుకొనక పోవుటచేతనే, మన ప్రజల కిట్టి కష్టములు యిప్పుడు యేర్పడినవి. మన దేశ ప్రజలయందలి జాతీయ శక్తికి భంగము కలుగునట్లు చేస్తూ, సర్వాధికారము కేంద్రీకృత మొనర్చుటకు కేంద్రనాయకులు సిద్ధపడిరి. ఇది అనర్థదాయకము.

కుటుంబమును, గ్రామమును స్వయంపోషకముగా చేయుటచే, ఈ స్థానములు, ఈ అనైక్యత, ఈ అవినీతి మన ప్రజలనుండి తొలగిపోవును. దేశవ్యాప్తిగానుండు పరిశ్రమలను కేంద్రప్రభుత్వము, రాష్ట్రవ్యాప్తిగానుండు పరిశ్రమలను రాష్ట్రప్రభుత్వము నడుపుచు, గ్రామముల, పట్టణములను స్వయంపోషక మొనర్చుచో, మనమిందు కష్టములలో నూటికి తొంబై ఐదు పోవును. ప్రస్తుత గ్రామ పంచాయితీబిల్లు ఈ కార్య మొనరింపజాలదు. గ్రామమును ఆర్థికముగా స్వయంపోషక మొనర్చి, సాంఘికముగా వ్యక్తి స్వాతంత్ర్యమును, సమత్వమును కూర్చి, రాజకీయముగా రాష్ట్రముతో, దేశముతో ఐక్య విధానముల నేర్పరచి, సాంస్కృతికముగా ప్రపంచ మానవకోటితో సమ్మేళన మొనర్చి, ఆధ్యాత్మికముగా వ్యక్తి వృద్ధిపొందు విధానము ఈ పంచాయితీ బిల్లు అవకాశ మివ్వదు. ప్రతి గ్రామమునందును పై కార్యమును సాధించగల పంచాయితీలను, వానిని చక్కగా నడిపించు వ్యక్తులను నేర్పరచుటయందే నిజమైన పంచాయితీ శాసనముయొక్క విశిష్టత కలుగును. అధికార వాంఛతో కూడియుండిన కాంగ్రెసు దీనిని చేయుటకు ఇష్టపడక, అలక్ష్యముచేసి, కరపత్రిక కావించిన శాసనము, పూర్వ మానవ కాక, సర్వవిధముల లోపభూయిష్టమై యున్నది. ఏ గాంధీ సంపత్తును ఇదిమాదట రాజ్యతంత్రమును స్వాధీనము జేసుకొన్నను, పై విధానమును నెరవేర్చనిచో, ఇంకా సంవత్సరములలో దేశమందలి అవినీతి, ఆర్థికక్షోభ తొలగదు. కాని కమ్యూనిజమునకు గల లెనిన్ మార్క్సు సిద్ధాంతముచేతనే వారు దీనిని చేయజాలరు. వారికి ఆధ్యాత్మిక, అంతర్ముఖ జీవితములందు నమ్మిక లేదు. ఆర్థిక సమత, సాంఘిక స్వాతంత్ర్యముపైననే వారి దృష్టి

యంతయు నిలిచినది. భారతీయ సాంస్కృతి, ఆధ్యాత్మిక దృష్టి వారికి అర్థముకాని అంశములు. మరియు వారు రాజ్య తంత్రమును స్వాధీనము పరచుకొనునంతవరకు వ్యక్తి స్వాతంత్ర్యమును ఘోషించుచు, ఆ తర్వాత నిరంకుశత్వముచు ప్రయోగించుటకు వారు వెనుదీయ్యరు. వారు కోరునట్టి ఆర్థిక సమత, సాంఘిక స్వాతంత్ర్యములు ఇందు చెప్పబడిన నూతన విధానమువలన సిద్ధించుటచే వారి వాదనమునకు ప్రజలయందు వెలయుండదు. కనుక ఆ పక్షమును అధికారములోనికి రానీయకుండ, ప్రారంభమున దేశమును కాపాడుకొనుటయందే దేశరక్షత కలదు. దేశము చక్కగా వ్యవస్థీకరింపబడిన తర్వాత వారి ప్రబోధములకు ప్రజలు మోసపోరు. కాంగ్రెసు పక్షమునందు అధికార వాంఛితలను లేకుండ జేసికొనుటయందే వారి విజయము కలదు. దేశమునందు సోషలిష్టు పక్షములు, వ్యక్తి స్వాతంత్ర్యములను పట్టి మాటలచేకాక, కార్యములచే ఆచరించినచో దేశమున కనర్థము లేదు. మిగత మత విషయిక రాజకీయ పక్షములు, (రామరాజ్యపార్టీ, హిందూమహాసభ, భారతజనసంఘము) తమ మతమును నితర మతములవారిపై నారోపింపక, తమ మతములకు ఆధ్యాత్మిక మొనరించుకొనుటయందే తమయొక్కయు, నితరులయొక్కయు, దేశముయొక్కయు క్షేమము గలదు. వారిని ప్రస్తుతము జవహారిలాలు పండితునివలె దూషించక, వారి మతముల నితరులపై నారోపించనంతవరకు, వారికి స్వాతంత్ర్యమును సర్వవిధముల నిచ్చుటచే దేశము బాగుపడును. అందుచే దేశమునందు నూతనఆదర్శములు, సత్యహృదయత నేర్పడును.

కనుక పై నిర్మాణ విధమును, సర్వ రాజకీయపక్షములు అంగీకరించి, దీనిని అంగీకరించలేని కమ్యూనిజమును ఓడించి, ఏ పక్షము గెలిచినను పై నిర్మాణ విధానమును నాచరణయందుంచుటయందే దేశమునకు ముక్తియు, భుక్తియు, సిద్ధియు గలదు. ఇట్లన్ని రాజకీయ పక్షములు తమ్ముతాము అంతర్ముఖ మొనర్చుకొనుటచే విశుద్ధము కావించుకొని, తమ్మును, దేశమును వృద్ధికావించుకొనుచుండ, వేరొకవంక దేశమునందు అక్కడక్కడ వ్యాపించియుండిన ఆధ్యాత్మిక సంస్థలు, ప్రజల జీవితమునందు చేయికలుగజేసుకొని, సంఘ జీవితమును విశుద్ధ మొనరించి, ఆధ్యాత్మికతను సంఘజీవితముపై నారోపించి, మానవకోటి నిత్యజీవితమును మార్చుటకు ప్రయత్నించవలెను. ఈ కార్యము ఏనాడు స్థిరముగా, దృఢముగా కొనసాగించుటకు ఆధ్యాత్మిక వ్యక్తులకు శక్తి కలుగునో, ఏనాడు ప్రజలు వీరిని సరిగా అర్థముచేసుకొని, వీరి భావములచే తమ్ముతాము నడిపించుకొనుటకు సిద్ధముగనుండగలుగుదురో అనాడే దేశ జీవితమందు క్రొత్త అధ్యాయము, క్రొత్త చరిత్ర ఏర్పడును. ప్రజలకు, ఉన్నత సత్య జీవితమును గడుపుటకు ఏర్పడగల సత్కాంక్షయందును, నాయకులకు అట్టి జీవితమును సిద్ధింపచేయగల శక్తియందును మానవకోటి కల్యాణ మాధారపడియున్నది.

ప్రజలును, నాయకులును ఈ సత్యమును గుర్తిరుంగగలరా? స్వామి వివేకానందుని ప్రబోధవాక్యమును, ‘ఉత్తిష్ఠత, జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత’ యను సివాదమును అనుసరించగలరా!

శ్రీ అరవిందాశ్రమము,
పాండుచేరి.

చీ॥ నారాయణరెడ్డి.

---

ప్రజాభిప్రాయ వేదిక.

## జమ్మలమడుగు తాలూకాలో క్షామము.

ఆర్యా,

ఈ జమ్మలమడుగు తాలూకాలో వర్షము లేనందువల్ల యీ పత్తు పైరులు బొందు పోవడము, ఎండిపోవడము, ఈ పరిస్థితులు యేర్పడి రాబోవు సంవత్సరమును జనులకు, రైతులకు యావన్మందికి తినుటకు ధాన్యము కొరతగా యేర్పడుచున్నది. ప్రతి పల్లెలో ధాన్యము లేదని మొరపెట్టుకొనుచున్నారు.

తక్షణము ప్రతి గ్రామములో ధాన్యము చౌక డిపోలను ఏర్పాటు చేయుచు, కటువు పనులను అనగా రోడ్డు పనులను, చెఱువు పనులను, చిన్న చిన్న కాలువ పనులను, బావుల పనులను ఏర్పాటు చేసి, జనులకు పనులు చూపిననే తప్ప, విషమ పరిస్థితులు యీ తాలూకాలో ఏర్పడును. లేని యెడల శాంతికి భంగము కలుగవచ్చును.

మరియు ఈ తాలూకాలో శిస్తులు వసూళ్ళు నిలుపుదల చేసి, పూర్తి రమిషన్ యివ్వవలయును. తాలూకాలో చాల అధ్వాన్నము పరిస్థితులలో వున్న తెలమంచి పట్నము ఫిర్కాలో, వెంటనే ప్రభుత్వము వారు గంజి కేంద్రములను ఏర్పాటు చేయవలయునని కోరుచున్నాము. ఈ తెలమంచి పట్నము ఫిర్కాలో మలేరియాజ్వరమువల్ల ఏగ్రామములో చూచినను, పిల్లలు — పెద్దలు బాధపడుతున్నారు. మలేరియా నివారణకు ప్రభుత్వమువారు సత్వరమే తగు శ్రద్ధ తీసుకొనవలయునని కోరుచున్నాము.

బి. యస్. వెంకటరెడ్డి,
తా॥ కా॥క॥ అధ్యక్షులు.

జమ్మలమడుగు.

# కడప జిల్లాలో క్షామము.

కడపజిల్లా కలెక్టరుగారైన శ్రీ సి.వివేకానందమూర్తి గారు, జిల్లాలో క్షామ పరిస్థితులను గూర్చి ఈ క్రింది విధముగ ప్రభుత్వము వారికి తెలిపి యున్నారు:—

"ప్రజలలో ధాన్యమును కొను శక్తి లేదు. వర్షాభావము వల్ల పైరులు లేనందున ప్రజలలో దుస్థితి ప్రబలినది. చిన్న చిన్న భూస్వాముల యొక్కయు, వ్యవసాయ కూలీల యొక్కయు, స్థితి అర్ధాన్న దశకు వచ్చినది. వ్యవసాయ కూలీలకు పనులు లేవు. ఇందువలన ప్రజలకు ద్రవ్య వసతి కలుగుట కష్టమైనది. చౌకడిపోలలో ఆహారధాన్యమును కొనుటకై కావలసిన ద్రవ్యముకూడ ప్రజలకు లేదు. ఈ జిల్లాలో 1385 ఫసలీ నుంచి కాలమాన పరిస్థితి బాగలేదు. 1358 ఫసలీలో వర్షాలు లేనందున జమ్మలమడుగు, రాయచోటి, బద్వేలు, సిద్ధవటము, కమలాపురము మెట్టమాగాణి పొలాలకు 879502-7-0 రెమిషన్ యివ్వవలసి వచ్చినది. 1359 లో వరదలు వచ్చినవి. శిస్తు రెమిషన్ యేమీ యివ్వకపోయినా ఈ వరదలు రైతుకు గోరుచుట్టుపై రోకటి పోటైనవి. 1360 ఫసలీలో మరలా వర్షాలులేనందున జమ్మలమడుగు, పులివెందుల, బద్వేలు, సిద్ధవటము, కమలాపురము తాలూకాల్లో మెట్టమాగాణి పైరులకు 236063-12-5 రెమిషన్ యివ్వవలసి వచ్చినది. ఈ సంవత్సరము అక్టోబరు వరకు కురిసిన వర్షము మామూలుగా యేటా కురిసే వర్షము కన్నా చాలా తక్కువ. ఒక్క పులివెందుల తాలూకాలో తప్ప, మిగతా తాలూకా లన్నిటిలోను చాలినంత వర్షము లేదు. ఆ చాలీచాలని వర్షముకూడ కొర్ర, వేరుశనగ మొదలగు పైరులు వేయుటకు వీలుగా సకాలములో కురవలేదు. పైరువేసే భూమి విస్తీర్ణము తగ్గిపోయినది. ఫలసాయము కూడ చాల తక్కువగా ఉండును.

"బీదప్రజల దుస్థితి నివారించుటకు, నిరుద్యోగులకు పని చూపుటకు, చౌకధాన్యము దుకాణాల్లో ధాన్యము కొనుగోలు శక్తి ప్రజలకు కల్పించేందుకు గ్రామ ప్రాంతాలలో, మైనరు ఇరిగేషన్ పనులనేకములు ప్రారంభింపబడినవి. 110 చౌకధాన్యము దుకాణాలు 112 గంజి కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. 1,12,500 విటమిన్ బిళ్ళలు, ఆస్ట్రేలియన్ పాలపొడి ఆరోగ్యాలయాలలో పిల్లలకు పంచి పెట్టబడినవి. గ్రామప్రాంతాలలో మైనరు ఇరిగేషన్ పనులు ప్రారంభించి, అనేక చెరువులను మరమ్మతు చేసినప్పటికీ, వ్యవసాయ కూలీల పరిస్థితి అంత ఆశాజనకముగా లేదు. కాబట్టి జిల్లా బోర్డు, హైవేస్ డిపార్టుమెంటు వెంటనే, ప్రభుత్వము పూర్తి గ్రాంట్లు యిచ్చే రోడ్ల నిర్మాణానికి పూనుకొనవలెనని కోరుచున్నాను."

◆◆ ◆◆ ◆◆

పశువులకు చాలినంత మేత దొరకడము లేదు. రిజర్వు అడవిలో పశువులను మేపు కొనుటకు అనుమతి నివ్వవలసినదని, అడవిలో రైతులను గడ్డికోసి తీసికొని పోనివ్వవలసినదని, జిల్లా కలెక్టరు, దక్షిణ కడప జిల్లా అటవీ శాఖోద్యోగికి వ్రాశినారు. బళ్ళారిజిల్లా హగారి ఫారమునుంచి మేత తెప్పించడానికి తగు యేర్పాట్లు జరుగుచున్నవి.

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

( అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్., )

( న్యాయశీలుడు — మిరిల్. )

(21—11—1951 సంచిక తర్వాత)

ఆ క్షణముననే మిరిల్ కారాగారమునకు వెళ్ళి, ఆ దొంగ వెధవయున్న చీకటికొట్టు ప్రవేశించి, అతనిని పేరున బిలిచి, చేయిపట్టుకొని మాట్లాడెను. దిన మంతయు, అతనితోనే గడిపెను. నిద్రాహారములు అతని జ్ఞప్తికైన రాలేదు. శిక్షితుని ఆత్మోన్నతికై ఈశ్వరుని ప్రార్థన సల్పి ప్రార్థించుమని అతనిని కూడ బుజ్జగించెను. ఉత్తమములు, సులభతమ సాధ్యములునైన సత్యములను, అతి సులభముగా సాధింప వీలైనవి యగు ధర్మములను వివరించెను. తండ్రి, అన్న, స్నేహితుడువలె ఆదరించెను. ఆశీర్వదించుటకు మాత్రమే బిషప్ ధైర్యము గలిపి, సమాశ్వాయించి, యెన్నో నీతులు బోధించెను. శిక్షితుడు నిరాశాహతుడై యుండెను. చావతనికి యొక అగాధకూపము. భయోత్పాదకమగు ఆయంచున నిలబడి, గడగడ యదరి, అతడు వెనుకకు తిరుగుచుండెను. లెక్క నేయకుండుట కతడంత తెలివి యనివాడు కాడు. మనము జీవితమనునది, అగోచరమై, అందని పరలోకమునుండి వేఱుసేయు గోడవంటిది. ఉరిశిక్ష ఆ గోడ నిక్కడక్కడ పగుల గొట్టి, అతని యంతర్గతమును ఘోరముగ మోదెను. ఆ పగుళ్ల నుండి, ఈ ప్రపంచమున కావల నేమున్నదాయని యతడు చూడ, చీకటి తప్ప మరేమియు కనపడుట లేదు. బిషప్పు వెలుగు చూపించెను.

మఱునాడు, పోలీసులు వచ్చి చూడగా, బిషప్పు అతనితో కూడ నుండెను. బిషప్పు అతని వెంబడించెను. మెడలో సిలువ, పాదములు తాకుచున్న పొడవాటి గౌను ధరించిన బిషప్పును. ఆ నీచుని ప్రక్కన జనుల గుంపు కనగొనెను.

అతని ప్రక్కన బండిలోనే వెళ్ళి, అతనితో కూడ వధ్యశిలను కూడ బిషప్పు ఎక్కెను. ముందునాడు విషాదభయ విచేష్టితుడై యుండిన శిక్షితుడు ఆనాడు వికాస వదనుడై యుండెను. తన ఆత్మలో ఆశ, మనస్సున సమాధానము తోచినది. ఈశ్వరునిపై విశ్వాసము కలిగెను. బిషప్పు అతనిని కౌగలించుకొని, గొడ్డలి మెడపై పడబోవు ముందు 'మానవునిచే చంపబడిన వానికి దేవుడు [illegible]. సోదరా వంచితుడవు, [illegible] పొందుము. నాయనా! ప్రార్థింపుము. విశ్వసింపుము. జీవితము [illegible] ప్రవేశింపుము. అక్కడ తండ్రి యున్నాడు," అని అన్నను [illegible] వచనముల సమాశ్వాసము గొలిపెను. వధ్యశిలనుండి బిషప్పు క్రిందికి దిగి వచ్చినపుడు అతని ముఖము [illegible] యొక అపూర్వ కళ [illegible] గాంచి ప్రజలు [illegible] కొనిరి. ఆ ముఖము నందలి వైవర్ణ్యమూ, స్తిమితమూ ఆశ్చర్యము గొలుపునది! చెప్ప వీలుకాదు. తాను భవనమని చెప్పుకొను తన చిన్ని [illegible] చేరి, చెల్లెలితో 'అమ్మా, ప్రధానాచార్యత్వము నెరపి వచ్చితిని', అని నగుమొఖము పెట్టి చెప్పెను.

మహోన్నత విషయములు మనస్సున [illegible] మిక్కిలి యగును. కావున నగరవాసులు బిషప్ చేసిన దంతయు నటన యనిరి. కాని, అట్లన్న వారు పైపై వర్గములకు చేరిన వారు. జనసామాన్యము పవిత్రకార్యములలో స్వార్థోద్దేశ్యములను చూడరు. వారు బిషప్పును మెచ్చుకొనిరి. ఆర్ద్ర హృదయులు [illegible].

ఆ వధ్య దృశ్యము బిషప్పుకు తీవ్ర హృదయ ఘాతము కలిగించి [illegible]. [illegible]

వధ్యశిల నిర్మించి నిలువబెట్టినపుడు చిత్తక్షోభము గొల్పును. మనము స్వయముగ ఆ పనిని చూడనంతవరకు ఉరిశిక్షను గురించి, ఉపేక్షా భావముతో వుండవచ్చును. ఒక్కసారి చూచితిమా, [illegible] హృదయము సదలగొట్టును. [illegible] కొందరు దానిని మెచ్చుకొందురు. కొందరు గర్హించెదరు. వధ్యశిల శాసనమూర్తి [illegible] యని దాని నందురు. అది పక్షవిచ్ఛేదము చేసెడి [illegible]. [illegible] దానిని కర్త [illegible], [illegible] చే గడగడలాడి పోవును. సకల సాంఘిక ప్రశ్నలును ఈ గొడ్డలిని గురించి [illegible] యున్నవి. వధ్యశిల వట్టి చట్టము కాదు. యంత్రము కాదు. [illegible], [illegible], [illegible] కాదు. అది యొక [illegible]. దాని [illegible] తో చరున్నది. ఈ చట్టము [illegible]. [illegible] చేసికొనును. [illegible], ఇనుముకు, [illegible] అని చెప్పవచ్చును. [illegible] అ [illegible] కార్యము [illegible]. అది కబళించును. మాంసము [illegible], పని

(మిగత 16 వ పేజిలో)

# ప్రజాభిప్రాయ వేదిక.

## కడప పట్టణము — సాహిత్యోత్సవములు.

ఆర్యా,

ప్రస్తుతము దేశములో యున్న 'ఎన్నికల సంరంభము' లో సామాన్యప్రజానీకము కల్లోలిత మవుతూయున్నది. ప్రతి నాలుగైదు సంవత్సరములకు వచ్చు ఈ ఎన్నికలకు ప్రజానీకము యెందుకు కలవరములో ముంచవలసి వచ్చినదో రాజకీయ నాయకులమని అనుకొనుచున్న వ్యక్తులే చెప్పవలయును. ప్రస్తుతము దేశములో తాండవించుచున్న 'కాటకము' సంగతికూడ మరచిపోయి, కూడు, గుడ్డ, లేని సామాన్యులుకూడ ఈ కల్లోలములో సంక్షోభపడడము విచిత్రముగ నున్నది. దేశాన్ని అభ్యుదయ మార్గములకు నడిపించునది ఈ రాజకీయవేత్తలు కాదు కదా? క్రిందటిసారి ఎలెక్షను సమయములో మహానాయకులు ఇప్పుడు మహానాయకులు కారు కదా! ఇప్పటివారి బ్రతుకులు నాలుగైదు సంవత్సరములే కదా! జాతిని, దేశమును అభ్యుదయ మార్గములకు తీసుకపోయేది— ఆ జాతియొక్క సంస్కృతిని జీర్ణించుకున్న మహారచయితలు కదా! వారే జాతికి నిజమైన నాయకులు. వారి రచనలేకదా జనమంతా నిజముగ ఆదరించే చట్టాలు. పార్లమెంటులో స్థానము కాకపోయినా, వారి రచనలలో వుండే ఉదాత్తభావాలే జాతిలో ప్రతివారికి హత్తుకొనిపోయి— ఒక ప్రత్యేకతను సంపాదించ గలవు. కనుక ఈ అనవసర సంక్షోభము నుండి దేశమును రక్షింపవలెనన్న సాహిత్యపూజయే శరణ్యము. కనుక ముఖ్యముగ మీవంటివారు పూనుకొని, మన కడప పట్టణములో ఈ సాహిత్యోత్సవములు చేయించినచో బాగుండునని నా యభిప్రాయము. ప్రస్తుతము ఆంధ్ర మహారచయితలలో అగ్రగణ్యులని ప్రసిద్ధిపొంది,— ఆచార్య నరేంద్రదేవ్, సర్ సి. పి. రామస్వామి అయ్యర్, హరీంద్రనాథ చటోపాధ్యాయ వంటి అన్యభాషావేత్తలచేత కూడా ప్రశంసలు పొంది,—కలకత్తా, ఢిల్లీ, ఖర్గపూరు, లక్నో వంటి ఇతర ప్రాంతములలో కూడా అఖండ సన్మానములు పొందిన 'విశ్వకవినాథ' కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సన్మానముతో యీ ఉత్సవములు ప్రారంభింపవలెనని నా సలహా.

కడప. సి. కె. మహేశ్వర్.

## ఈడిగ, బలిజ విద్యార్థులకు సగము జీతము.

ఆర్యా,

ప్రభుత్వము యింతవరకు యీడిగ, బలిజ విద్యార్థుల నుండి అర్థజీతము తీసుకొను చుండిరి. కాని ఉన్నట్లుండి హఠాత్తుగా ఇటీవలనే ఆ అవకాశమును రద్దుచేస్తూ, వారు ఈ సంవత్సరము ప్రారంభమునుండి పూర్తిజీతము కట్టవలెనని అన్ని హైస్కూళ్ళకు ఉత్తరువు పంపిరి. వారు ఈ మినహాయింపును నమ్ముకొని హైస్కూళ్ళలో ప్రవేశించిరి. మధ్యలో పూర్తి జీతము కట్టవలెనంటే వారిగతి ఏమి? ఇదేనా ప్రభుత్వము వెనుకబడిన జాతులకు చూపే ప్రత్యేక ఆదరణ? ఒక్క కమలాపురము హైస్కూల్లోనే 40 మంది ఈడిగ, బలిజ విద్యార్థులు యీ మినహాయింపును నమ్ముకొని చేరిరి. దీనిని అమలుపరచడ మనిన, వారి నందరిని చదువుచాలించుకొని యిండ్లకు పొమ్మని చెప్పడమే అవుతుంది. కాబట్టి ఈ ఉత్తరువును రద్దుచేయవలెను.

కడప జి. చెన్నారెడ్డి.

గ్రంథపరిచయము:

## తేనెతెట్టె.

గ్రంథకర్త: శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు.
ప్రకాశకులు: సాహితీసమితి, రేపల్లె.
వెల రు. 1—0—0.

ఇది తేనెతెట్టె, పతంగయాత్ర, స్వయంవరము, పరాగమనము— అన్న నాలుగు నాటికల సంపుటి. ఇందులో మొదటిది 'మీటర్ లింక్' వ్రాసిన అదే పేరుగల నాటిక చదివిన మీదట కలిగిన అభిప్రాయాల సంపుటి అని శాస్త్రిగారే వ్రాసియున్నారు. ఈ నాలుగున్ను, నాటికలు అని వ్యవహరింపబడినవి. కాని ఒక్కటికూడా ప్రదర్శించుటకు అనుకూలత ఉన్నది కాదు. శాస్త్రిగారికి దేశములో ఉన్న సాహిత్య ప్రతిష్ఠకు— ఈ రచనలు దోహదము చేయునవిగా లేవు. ఇతివృత్తాలుకాని, శిల్పముకాని, [illegible]దాత్త్యము కలిగినట్లుగా లేవు. ఇవి శాస్త్రిగారి చిన్నతనములో జరిగిన [illegible] సాధనలుగా భావించుకో వచ్చును.

స్త్రీలపుట.

# స్త్రీలు — సమాన హక్కులు — హిందూ కోడుబిల్లు.

(శ్రీమతి. యస్. పద్మావతీదేవి గారు.)

—(6)—

స్త్రీ పురుష, సంబంధములు సున్నితములైన దారములతో అల్లబడి యున్నవి. ఆ దారములలో నైతిక బలము తప్ప మరేమియు లేదు. ఒకసారి కట్టుకొనిన మగవానిని విడిచిపెట్టినచో, ఏమో పాపమను భీతి స్త్రీలలో నాటుకొని యున్నందునను: ఒకసారి కట్టుకొనిన స్త్రీని విడిచిపెట్టుట పాపమని మగవానిలో ఒక విధమైన తలంపు ఉండుట వల్లను, ఈ దినము వరకు హిందూ కుటుంబ జీవితములు కొంత వరకైనను ఆనందకరముగ ఉన్నవి. స్త్రీ పురుష అన్యోన్య సంబంధ విషయములలో, స్త్రీలకు స్త్రీలకును, పురుషులకు పురుషులకును సర్వసంపూర్ణమైన స్వేచ్ఛ యున్నదను భావము మాత్రము పెట్టినచో, ఆ భావము మనస్సునకు కలుగజేసినచో, మన నైతిక దాంపత్య జీవితము యొక్క పునాదులు ఒక్కపెట్టున కదలును. భగవంతుడనువాడు (అనునది) ఉన్నాడో (ఉన్నదో) లేడో (లేదో) ఎవ్వరు దృఢముగ చెప్పజాలరు. చూపజాలరు. ఋజువు పెట్ట జాలరు. భగవంతుడనునది ఆత్మాశ్రయ వస్తువైన విషయమును. వారి వారి భక్తి, జ్ఞాన, వైరాగ్యముల పై ఆధారపడి యుండును. "భగవంతుడను వాడొకడు (ఒక శక్తి) యున్నాడు. మానవులు చేయు పాపకార్యములను శిక్షించు"నను భీతి అనేక వేల కొలది సంవత్సరములుగ జనులలో వ్యాపింపజేయుచు, "సత్యము చెప్పవలెను: శస్త్రమును విడనాడరాదు; పరదారా ధనాదులను కోరకూడదు; పరపురుషుని కోరరాదు." అను ఆదర్శములను ఎన్నో విధములుగ ఎదుట పెట్టుచు వచ్చుచున్నను, అసత్యమును చెప్పువారు; వ్యభిచారకార్యములను చేయువారు; పరస్త్రీలను ఆశించువారు; దొంగతనమును చేయువారు; పరపురుష గమనము చేయువారి సంఖ్యయే ప్రజలలో ఎక్కువగ నున్నది. నీతి, నియమములను సున్నితమైన దారములతో కట్టుబడియుండు వారి సంఖ్య మానవ సంఘములో అత్యల్పముగ ఉన్నది.

గాంధిజీ శల్యమాంస రక్తమయ శరీరమును కలిగి ఉండిన మానవ వ్యక్తి కాని, మానవాతీతమైన వ్యక్తి కాదు. మానవాతీతమైన శక్తులు, యక్షిణీవిద్యలు, గారడీ విద్యలు అతనియందేమియు లేవు. కాని సత్యమునే భగవంతునిగ భావించెను. మనస్సాక్షికి వ్యతిరిక్తముగ నడువ జాలడయ్యెను. తాను మంచి అనికాని, చెడ్డ అనికాని నమ్మినటుల నిర్భయముగ ఆచరించుచు వచ్చెను. ఇతరుల నాచరింపుమని ప్రబోధించుచు వచ్చెను. ఈ సామాన్య నైతిక గుణములు తప్ప మరేమియు అతని యందు లేవు. అధిక సంఖ్యాకులగు ప్రజలెల్లరు తమ మనస్సాక్షి (అంతరాత్మ) చెప్పు ప్రకారము నడుచుకొను మనోధైర్యము, శక్తి, లేనందువలన — మనమందరము గాంధిజీని ఆదర్శ పురుషునిగను, యుగ పురుషునిగను, ఋషిపుంగవునిగను భావించుచున్నాము. ఈ ఆదర్శములన్నియు అధిక సంఖ్యాకులైన మానవులు తమ దైనందిన జీవిత వ్యవహారములలో బహిరంగముగ ఆచరించుచున్నచో, గాంధిజీకి కాని, అతని ముందు గతించిన గొప్పవారని మనమందరము చెప్పుకొను వారికిగాని, మానవ సంఘములో గౌరవస్థానము యుండదు. స్త్రీలెల్ల పాతివ్రత్య ధర్మమునే ఆచరించుచుండిన, పురాణ ప్రసిద్ధురాండ్రైన సీత మొదలగు వారి పేర్లను అనుకొనువారు ఉండరు. ప్రజలెల్లరు సత్యసంధులై, ఏకపత్నీ వ్రతులై ఉన్నచో, సత్యహరిశ్చంద్రుని పేరును, శ్రీరామచంద్రుని పేరును. ఈ భారతభూమిలో,

ఎప్పుడో మాసిపోయి యుండెడిది. అనుకొనువారే యుండరు. లక్షమంది ప్రజలలో ఒక్కరుకూడ పైన తెలిపిన నైతిక ధర్మములను ఆచరణయందుంచనందు వలన, వారి పేర్లన్నియు ఈ దేశములో ఈ దినమునకుకూడ వినబడుచున్నవి.

కొన్ని ఆదర్శములను స్త్రీ పురుషుల ఎదుటపెట్టి, ఎన్నివిధములుగనో భయ భక్తులు కలిగించినను, వానిని ఆచరణ యందుంచువారు కనపడుటే కష్టముగ ఉన్నది. "ఈ ఆదర్శమువల్ల మానవజీవితమును సంపూర్ణముగ అనుభవించుటకు ప్రతిబంధకముగ నున్నది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము సర్వప్రాణుల సహజహక్కు. దానికి అడ్డుగనుండు వానినెల్ల అతిక్రమించిన పాపమనునది లేదు. పుణ్యమనునది లేదు. ప్రభుత్వముకూడ అందుకు తోడుపడు"నని చెప్పినచో, ఇక సంఘజీవితము, దాంపత్య జీవితము, ఏ దారుల పట్టునో చెప్పలేము. వివాహకాలమందు తన మెడలో కట్టిన మంగళసూత్రమును (తాళిబొట్టును) ఇతర పురుషులు చూడకూడదను నియమము వంశపరంపరగ వాడుకలో వచ్చుచున్నందున, ఈ వాడుకకు కట్టుబడి, భార్యా భర్తలమధ్య అభిప్రాయ భేదములు కలిగినను, సర్దుబాటులు కావించుకొనుచున్నారు. ఒక గుడిసె నీడ (యింటినీడ) క్రింద నివసించుచున్నారు. ఒక పురుషుడు కట్టిన తాళిబొట్టును తెంపివేసి, మఱియొక పురుషునితో తాళిబొట్టుకట్టించుకొనవచ్చునని చెప్పినచో, ఆ మార్పుకు నియమమనునది ఉండజాలదు. నాలుగైదు ఏండ్లలో ఐదారుగురి పురుషులనుండి స్త్రీలు వివాహ విచ్ఛేదములను (డైవర్సులను) పొందిన సాదృశ్యములు పాశ్చాత్య దేశములో ఎన్ని కావలయు నన్నను చూపవీలగును. సూక్ష్మదృష్టిలో నిది కూడ వ్యభిచారమే (Prostitution). అయినను, న్యాయస్థానములనుండి స్త్రీ పురుషులు. తమసంబంధమును తెంచుకొనుటకు ఉత్తరువులు పొందుచున్నందున, దానిని 'వివాహవిచ్ఛేదమని' (డైవర్సు-Diverse) గౌరవ ప్రదమైన మాటలలో వ్యవహరించుచున్నారు.

ఇది చట్టములు ఒప్పిన వ్యభిచారము. పురుషునినుండి (భర్తనుండి) స్త్రీ (భార్య) వేరుకావలెనను బుద్ధి ఒక్కసారి పుట్టినచో, కారణములు చిక్కవా? భర్త నపుంసకుడని చెప్పిన కోర్టు డైవర్సు ఉత్తర్వు యివ్వవచ్చును. పురుషుడు నపుంసకుడా లేక పుంసకుడా అని ఋజువు చేయుటెట్లు? ఇంతకన్నను నీచమైన సాకు కావలెనా? పురుషుడు హింసించుచున్నాడని చెప్పుటకు ఏమి ఋజువు కావలెను?" నన్ను పడకటింటిలో గొంతుపిసికివేయుటకు వచ్చినాడు. ఈ భర్తదగ్గఱ నేనుండజాల"నని నింద ఆరోపించి, డైవర్సు కోరు స్త్రీకి, ఋజువేమి కావలెను? ఇట్టి నీచమైన సాకులు ఎన్నియో చిక్కును. సహజమైన దాంపత్య జీవితమునకు, నాగరీకత పేరుక్రింద అనేక ప్రతిబంధకములు కలుగును. మానవత్వము నశించును. మానవ జీవితము ప్రారంభదశలో వావి వరుసలు లేక మృగములవలె ఎట్లుల మెలగుచుండిరో, ఆ దేపరిస్థితికి మన నాగరీకత దారిచూపును.

వితంతువులు వివాహము చేసుకొనవచ్చును. అట్టివారికి ముందుండిన భర్త ఆస్తిలో భాగము వచ్చును. స్త్రీకి భర్త ఆస్తిలో, కొడుకులతో సమానమైన భాగము ఉన్నది. పదునాలుగు సంవత్సరముల లోపల స్త్రీలకు వివాహము చేయరాదు. స్త్రీలు యిష్టముండిన పెండ్లి చేసుకొనవచ్చును. ఇష్టము లేకున్నచో పెండ్లి చేసుకొనకనే ఉండవచ్చును. ఎవ్వరు పెండ్లి చేసుకొనవలెనని నిర్బంధించకూడదు. కొన్ని కారణములపైన వివాహమును రద్దుచేసుకొనవచ్చును. రెండవసారు వివాహము చేసుకొనవచ్చును. అది సరిపడనిచో దానిని కోర్టుద్వారా రద్దుకావించుకొని; మఱియొక పెండ్లి చేసుకొనవచ్చును. పెండ్లి చేసుకొనకనే ఉండవచ్చును. మగవారితోబాటు ఆడవారు ఏ విద్యనైనను అభ్యసింపవచ్చును. స్త్రీల

నవలంభింపవచ్చును. పురుషులతో సమానముగ స్త్రీలకు ఓటింగు హక్కుగలదు. శాసన సభలకు సభ్యురాండ్రుగ నిలువ వచ్చును. వీని కన్నిటికిని యిప్పుడు చట్టసమ్మతమైన అవకాశము లున్నవి. సగోత్రులలో పెండ్లి చేసుకొనవచ్చును. దీనికి కూడ మన ప్రభుత్వచట్టము అనుమతి ఇచ్చినది. తండ్రి ఆస్తిలో కొడుకులతో సమానముగ భాగము యిప్పుడు లేదు. ఇది త్వరిలో లభించును.

వీని అన్నిటి యొక్క సమిష్టి ఫలితము, మన హిందూ సంఘముపై ఎట్లు పరిణమించునో ఇప్పుడే చెప్పలేము. మగవారిలో దేవుడు, దైవము లేకున్నను, మన హిందూ స్త్రీలలో ఇంకను ఈ దేవుడు, దైవము అనే పిశాచము లున్నవి. దీపారాధన వేదిలున్నవి. పండగలు, పబ్బములనునవి యున్నవి. ఈ పిచ్చిభావములు పూర్తిగ నశింపలేదు. దేవాలయములు శిథిలములు కాకుండ ఇంకను అక్కడక్కడ కనబడుచున్నవి. ఈ వెర్రి భ్రమలంతయు మన హిందూ స్త్రీలలో పోయి, నూతన స్వతంత్ర భావములు, స్వేచ్ఛలు, హక్కులు, అను తలంపు లెప్పుడు వెలుగునో, ఆ దినమునుండి హిందూ సంఘ విచ్ఛిన్నము ప్రారంభమగును. నైతిక పతనము పూర్తియగును. ఈ విషయములన్నిటిని మన హిందూ యువతులు బాగుగ యోచింప కోరుచున్నాను. మంచిచెడ్డలను చర్చింప కోరుచున్నాను.

—*—



# రాజంపేట-సిద్ధవటము తాలూకాల ఓటర్లకు విజ్ఞాపన.

శ్రీ పి. వెంకటసుబ్బయ్యగారు కాంగ్రెసుపార్టీ పక్షమున రిజర్వు హరిజన స్థానమునకు, రాజంపేట నియోజక వర్గమునకు అభ్యర్థిగా పోటీచేయుచున్నాడు. 'భారత జ్యోతి' పత్రికను చదువారికి ఇతని పేరు క్రొత్తకాదు. అనేక విషయములపై వ్యాసములు, కథలు వ్రాసియున్నాడు. పద్యకావ్యములను కూడ రచియించి యున్నాడు. కొన్ని అచ్చువేయబడినవి. ఇంకకొన్ని అచ్చువేయలేదు. ఇతడు వ్రాసిన వ్యాసములను, పదకావ్యములను చదివినచో, షెడ్యూలు తరగతులు అని వ్యవహరింపబడు, నిర్లక్ష్యము చేయబడిన బీదజాతులలో, నిట్టి విజ్ఞానముకల వ్యక్తి ఒకడు ఉన్నాడా అని అందరికి ఆశ్చర్యము కలుగక పోదు. ఇది నేను కావలసి పొగడుటకాదు. ఈ వ్యక్తిలో నున్న విజ్ఞాన వికాసమును బహిరంగమొనర్చుచున్నాను.

ఇతడు యువకుడు. కో_ఆపరేటివ్ డిపార్టుమెంటులో సీనియర్ ఇన్‌స్పెక్టరుగ పనిచేయుచు, పెద్ద కుటుంబమును పోషించుకొనుచుండెను. పర్మనెంటు నౌకరిలో నుండినచో, క్రమక్రమముగా డిప్యూటీ రిజిస్ట్రారు హోదాకు తప్పక వచ్చెడివాడు. షెడ్యూలు తరగతులలో ఇట్టివారు కొద్దిమంది గనుక, ఇట్టి జాతులవారికి ప్రత్యేక విధమైన ప్రోత్సాహము ఇవ్వవలెనని కూడా కాంగ్రెసు ప్రభుత్వమువారి ఆశయమై యున్నది. స్వతంత్ర వ్యక్తిగ, క్రిందపడిన తన జాతివారిని ఉద్ధరింపవలెననియు, చేతనైనంతవరకు దేశసేవ చేయవలెనను ఆశతో,_ తనకు ఉద్యోగమువల్ల లభించు గొప్ప అవకాశములను పోగొట్టుకొన్నాడు. తనకు నిత్య జీవనమునకు ఆధారముగయుండు ఉద్యోగమునకు రాజీనామా ఒసగి, దేశసేవకై తనలో నున్న త్యాగబుద్ధిని చూపియున్నాడు. నామినేషన్ దాఖలు చేసిన తేదీనుండి ఇతని కుటుంబపోషణ భారము దైవముమీద పడినది. ఈ కష్టకాలములో దీనికి భయపడ లేదు.

నిమ్న జాతులలో ఇట్టి యువకుడు కనుపడుట జిల్లాకు గౌరవము. జిల్లాప్రజలు నిజముగ గర్వింపవలసిన విషయము. విజ్ఞానవంతుడు, కవి, రచయిత, త్యాగబుద్ధికలవాడు. కనుక రాజంపేట_సిద్ధవటము నియోజక వర్గములోని ఓటరు లెల్లరు తమ ఓట్లను తప్పకుండ శ్రీ పి. వెంకటసుబ్బయ్యగారి కిచ్చి, షెడ్యూలు తరగతుల పక్షమున సరియైన అభ్యర్థిని ఎన్నుకొన్నారనే గౌరవమును దక్కించుకొన వలెనని ప్రతి ఓటరును ప్రార్థించుచున్నాను.

కడప. పి. రమణారెడ్డి, బి. ఏ.

Space donated.

## కేంద్ర ప్రభుత్వమునకు ధర్మోపన్యాసములు.

(3-వ పేజీ తరువాత)

సుప్రీముకోర్టు యొక్క తీర్పులను గౌరవింపవలెనని శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పుచున్నారు. వీరు చెన్నరాష్ట్ర మంత్రివర్గములో ఒకరు. రాజ్యాంగ చట్టము క్రింద కొన్ని వ్యవహారములలో హైకోర్టులున్ను, సుప్రీము కోర్టున్ను తీర్పులను గావించి యుండినవి. ఆ తీర్పుల నన్నిటిని భ్రష్టు పట్టించుటకై, చెన్నరాష్ట్ర మంత్రివర్గమువారు న్యూఢిల్లీ పట్టణమునకు, శ్రీ గోపాలరెడ్డిగారితో సహా తీర్థయాత్రకు వెళ్ళిరి. శ్రీ రాజగోపాలాచార్యులగారిద్వారా శ్రీ జవహరిలాలుగారిపై లేనిపోని ఒత్తిడి తెచ్చి, వారి కనుకూలమగు రీతి, రాజ్యాంగ చట్టమునే సవరింప జేసిరి. వీరికి న్యాయస్థానముల తీర్పులపై ఎంతటి చులకనైన గౌరవము కలదో, అప్పుడే ఋజువు చేసిరి. యూనియన్ ప్రభుత్వ అధ్యక్షుల ఉత్తరువును మైసూరు మంత్రివర్గమువారు తిరస్కరించిన అవకాశమును గైకొని, కేంద్ర ప్రభుత్వమునకు 'ఏ' గూప్రు రాష్ట్రముల నుండి కూడ హెచ్చరికల నిచ్చుటకు శ్రీ గోపాలరెడ్డిగారు అంకురార్పణ గావించి యున్నారు.

ఇండియాలో జనసామాన్యమంతయు, "ప్రభుత్వ"మని తలచినప్పుడంతయు శ్రీ జవహరిలాలుగారిని, డా॥ రాజేంద్ర ప్రసాద్ గారిని ప్రభుత్వమని తలచెదరేకాని, రాష్ట్రముల లో నుండు ఏ మంత్రినికూడ తలచరు. వారి దృష్టికి రారు. ఈ దినము ఓటర్లు పోలింగు స్టేషన్లకు పోయి, కాంగ్రెసు పార్టీ అభ్యర్థులకు ఓటు చేయుచో, వారు శ్రీ జవహరిలాలుగారిపై గల గౌరవమువల్ల మాత్రమే ఓటు చేయుచున్నారు. ఈ దేశములో నుండు మఱి ఏ వ్యక్తి కొరకు కాదు. సోషియలిష్టుపార్టీ నాయకుడైన శ్రీ జయప్రకాష్ నారాయణగారు ఇటీవల చెన్నపట్టణములో బహిరంగసభలో ఉపన్యసించుచు, "దేశమునంతయు ఒక త్రాటిపై ఒక్క జవహరిలాలు నడప గలిగి యున్నాడు. అట్టి సామర్థ్యము, అంతటి ఔన్నత్యము గల వ్యక్తి కాంగ్రెసులో ఒక్క జవహరిలాలును తప్ప, మరె వ్వరినైన చూపగలరా?" అని కాంగ్రెసు వారికిని, కాంగ్రెసు మంత్రులకును ఒక సవాలు చేసిరి. రాష్ట్రములలోనే ఇట్టి మహోన్నతమైన వ్యక్తులుండినచో, ఎన్నికలకై, ఆంధ్ర దేశ సంచారమువల్ల కలుగు శ్రమనుండి శ్రీ జవహరిలాలుగారిని తప్పింపమని, కాంగ్రెసులోని తమ సహచరునికి శ్రీ గోపాలరెడ్డిగారు సలహా ఇచ్చెదరా? వారి వ్యక్తి గౌరవములపైననే ఎన్నికల ప్రచారమును సాగించెదరా? ఎన్నికలలో జవహరిలాలు పేరు వాడక, శ్రీ జయప్రకాష్ నారాయణగారి సవాలును చేపట్టగల మంత్రి యున్నాడా? అది సాధ్యముకానిచో, కేంద్ర ప్రభుత్వమునకు అనవసరమైన ధర్మోపన్యాసములను కావించుట ఎందుకు?

## నిర్భాగ్య జీవులు.

(11-వ పేజీ తరువాత)

వాండ్రను సృష్టించిన ఘోర రాక్షసి వధ్యశిల. దానిలో అవాచ్యమైన ప్రాణహార ప్రాణమున్నది. అది కావించిన ఆ సంఖ్యామారణ కర్మలనుండి దాని ప్రాణము బలపడినది.

ఇట్టిది భయంకరమగు శాశ్వత భావము కలిగించినది. ఉరి జరిగిన మఱునాడును, తరువాత చాలా వరకును, బినప్ప చింతా నిమగ్నుడై యుండెను. ఆ యంత్యక్షణము కలిగించిన ప్రశాంతిలో యేదో యుగ్రత్వమున్నది. ఆ ప్రశాంతి యంతరించిన సంఘ న్యాయమును శూన్య భ్రమ ఆయనను వేధింప సాగెను. తానుచేసిన అన్ని పనులకు సింహావలోకనము చేయునప్పుడతని కుజ్వలమగు తృప్తి కల్గెడిని. ఈ పని మాత్రమాత్మ నిందాకరముగ తోచినది. అప్పుడప్పుడు తనలోనే మాటాడుకొనును. అస్వాగతములు, విషాద భరితములై యుండును. ఒక సాయంకాలమున అతని చెలియలు విని, చిన్న దానిని వ్రాసి పెట్టినది. "అది యంత పైశాచికమని నేను నమ్మి యుండలేదు. దైవ శాసనము పరిశీలింపకుండుట తప్పు. మృత్యువును దైవము నిర్ణయింప వలయును. తామెరుగని దానిని మానవులే [illegible] కారములో స్పృశింతురు?"

కాలక్రమేణ ఈ భావములు సన్నగిలినది. [illegible] తుడిచివేయబడియు ఉండును. అయినను, అటుపిమ్మట బినప్ప ఆ వధ్యస్థానముపైనే యెన్నడును పోలేదని చెప్పుకొందురు.

రోగులు, మరణశయ్యాగతులు నైన వారి చెంతకు పిలిచిననే వెళ్ళెడివాడు. తన యుత్తమ ధర్మము, ఘనతమ కార్యమును అందే కలదని ఆయనకు బాగుగ తెలియును. భర్తను, మాతాపితరులను గోల్పోయిన వారు చెప్పికొనవలసిన దే లేదు. తానై యచ్చటికి వెళ్ళును. ప్రియభార్యను కోల్పోయిన వాని ప్రక్కనో, వినుకను గోల్పడిన వాని ప్రక్కనో నూరు మెదల్పక గంటల పర్యంతము కూర్చుండును. [illegible] సమయ మెఱిగినవాడై మాట సమయమును ఎఱిగినవాడు. ఎం[illegible] యద్భుత సమాశ్వాసకుడు! దుఃఖమును మరిపించి [illegible] డు. మఱి యాశాకల్పనచే, దాని కొన్నతిని గౌరవము [illegible] చ్చును. "మృతులను గుఱించి చింతించు విధానము [illegible] గా నుండుము. ఎట్లుగా యుండి ఉండునని తెలుసుకొనుము. [illegible] దృష్టిని చూడుము. స్వర్గధామ మధ్యమున, [illegible] డుడై యుండి మృతి చెందినవారు, [illegible] పొడకట్టును" అని పల్కును. విశ్వాసము [illegible] ఆయన నమ్మకము. నిగారా పీడితునికి, [illegible] యొగ్గిన వానిని చూపి, మనశ్శాంతి నిచ్చును. [illegible] పులు బలుప్ర శోకమును, [illegible] ము జూపి మార్చి వేయును.

(సశేషము)

Printed at the "BHARATHA JYOTHI" Printing Press. Published and issued at 257, Trunk Road Cuddapah, for the "BHARATHA JYOTHI PRINTING & PUBLISHING SYNDICATE.
PRINTER: K. R. JOSHEE : : PUBLISHER: V. R. GOPALAKRISHNA.
EDITORIAL OFFICE : 16/92, Sunnapurallapalli, Railway Station Road, Cuddapah

# భారత జ్యోతి

సహాయ సంపాదకులు:— పి. రమణారెడ్డి, బి. ఏ.,          సంపాదకులు:— సి. రామకృష్ణ, బి. ఏ.,

సంపుటము — 4.

సంచిక — 40.

*

ప్రతి బుధవారము

ప్రకటింపబడును.

*

సంవత్సర చందా రు. 9-0-0

విడి ప్రతి ... రు. 0-3-0

## విషయానుక్రమణిక.

డిశంబరు 26, 1951.



—o—

# భారత జ్యోతి.

సంపుటము. 4. సంచిక 40. | శ్రీ ఖరనామ సంవత్సర మార్గశిర బ. ౧౩, డిశంబరు, 26, 1951. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.

## ఆటమ్ శక్తి — పోలీసు శక్తి.

డా॥ రాజేంద్ర ప్రసాదుగారు న్యూఢిల్లీ పట్టణములో ఈ నెల 21-వ తేది కామన్‌వెల్తు విశ్వవిద్యాలయ సంఘమును ప్రారంభించుచు, "అణుశక్తి మానవునికి పరిమితి లేని అంతశ్శక్తిని ఇవ్వగలదు. నిర్మాణాత్మకమైన ఉత్పత్తిని అపరిమితముగా పెంపొందించుటకు ఈ అణుశక్తి ఉపయోగపడును. ఇదే శక్తి ప్రపంచమును విధ్వంసము చేయుటకు కూడ పనికివచ్చు"నని తెలిపిరి. ...న పోలీసుశాఖకు ప్రభుత్వమువారు అణుశక్తికి సాటివచ్చునటువంటి శక్తిని కలుగజేసి యున్నారు. ఆ శక్తిని పోలీసువారు సక్రమముగ వినియోగించిరా, దేశక్షేమము, ప్రజలక్షేమము పెంపొందును. దుర్వినియోగపఱచిరా ప్రజలలో సంక్షోభమును కలిగించుటకు తోడుపడును. ప్రభుత్వపరిపాలనమునకు సంబంధించిన ఇతర శాఖలు ఏవి ఎటులుండినను, ఒక్క పోలీసుశాఖ దాని బాధ్యతలను గుర్తెరిగి నీతిమార్గమున నడుచుచో, మిగత అన్ని ప్రభుత్వ శాఖలు విధిలేక, నీతిమార్గముననే నడిచి తీరవలసి యుండును. పోలీసుశాఖలోనే నీతి క్షీణించినచో, మిగత ఏ ఇతర శాఖలలో నీతియున్నను, నీతి లేకపోయినను లాభములేదు. ఆ ప్రభుత్వము రాణింప జాలదు. ఈ ముఖ్యమైన సూత్రమును మన మంత్రులుకాని, ప్రజలుకాని పూర్తిగ గ్రహించలేదు.

బ్రిటీషువారు ఇండియా దేశముపై సాగించిన పరిపాలనము పోలీసు పరిపాలనము. వారి పరిపాలనము క్రింద ప్రజలు వేరు, ప్రభుత్వము వేరు. ప్రజల దృష్టి విదేశ పరిపాలనమును పారద్రోలవలెనని యుండెను. బ్రిటీషువారికి ఏదో ఒక విధముగ తమ అధికార ప్రాబల్యమును స్థిరపఱచుకొనవలెనను దృష్టితప్ప మరేమియు లేకుండెను. ప్రజలు స్వాతంత్ర్యమును కావలెనని చెప్పినచో రాజద్రోహము. దేశద్రోహము. ప్రభుత్వముపై ప్రజలు తిరుగుబాట్లు చేయకుండ కాపుదలయుంచుటకే బ్రిటీషువారు ముఖ్యముగ పోలీసుశాఖను నెలకొల్పిరి. తోడి ప్రజలు, తమ దేశీయులను భావములేక ఎవరిని కొట్టమనిన వారిని దయా దాక్షిణ్యములేక కొట్టుటకు, ప్రజలలో భయమును కలిగించుటకు ఎట్టివారు తగినవారని తోచుదురో అట్టివారినెల్ల పోలీసుశాఖలో చేర్చుకొనుచు వచ్చిరి. వారి విద్యతోకాని, యోగ్యతతో కాని, నీతి ప్రవర్తనముతో కాని బ్రిటీషు అధికారులకు ప్రమేయము లేకుండెను. ఎవరు ఎక్కువ నేరములను రికార్డులో చూపగలిగిరో అట్టివారి — యోగ్యతా యోగ్యతలు గమనింపక — ప్రమోషనులు — (క్రింది పదవులలో నుండు వారికి పెద్దపదవులు ఇచ్చుట) ఇచ్చుచు ప్రోత్సహింప జొచ్చిరి. ఇందువలన, ఏదో ఒక విధముగ అమాయకులైన ప్రజలపై కేసులు పెట్టి, తామేమో పెద్ద పెద్ద కుట్రలు, పెద్ద పెద్ద నేరములు పత్తాతీసినటుల డైరీలను వ్రాసుకొని, నేరముల సంఖ్యను ఎక్కువ చేసుకొని —ఎ, బి, సి, డి,

రాని కానిస్టేబిల్సు, సబ్ ఇన్స్పెక్టర్ల హోదాలకు వచ్చిరి. సెకండరీ విద్య పూర్తియై పూర్తికాని వారు సర్కిల్ ఇన్స్పెక్టర్లు, డి. ఎస్. పి. లుగా ప్రమోషన్లు పొందుచు వచ్చిరి. మనస్సాక్షికి విరుద్ధముగ, అమాయకులైన ప్రజలపై అక్రమ కేసులను పెట్టజాలక, తమ తమ స్టేషనులలో నేరముల సంఖ్య ఎక్కువ చూపజాలని హెడ్ కానిస్టేబిల్సు, సబ్ ఇన్స్పెక్టర్లు, విద్యా యోగ్యతలందు గొప్పవారైనను, అట్టివారికి ఏలాంటి ప్రమోషన్లు, బహుమతులు (రివార్డులు) లేక, హెడ్ కానిస్టేబిల్సుగనే, సబ్ ఇన్స్పెక్టరుగనే ఉద్యోగములనుండి విరమించుకొనవలసి వచ్చెను (రిటైరు కావలసి వచ్చెను).

ఇదియునుగాక బ్రిటీషువారు పోలీసు శాఖ వారికి ఎక్కడలేని అసాధారణమైన అధికారములను, రక్షణలను కల్పించిరి. పోలీసు డైరీలు రహస్యమైన రికార్డులు. ప్రజలు వానిని పరీక్షించుటకు కాని, అందులోని విషయములను సవాలు చేయుటకు కాని వీలులేదు. ఒక గౌరవమైన పెద్ద వ్యక్తిని పోలీసువారు అగౌరవ పరచి, భ్రష్టు పట్టించవలెనన్న — ఆశక్తి పోలీసువారి చేతిలో ఉన్నది. ఏవ్యక్తినైనను, అనుమానముపై (కారణములు తెలుపవలసిన పనిలేదు) 24 గంటల కాలము లాకప్‌లో పెట్టవచ్చును. ఎవరో ఒకరు ఆ వ్యక్తిపై నేరము ఆరోపించినట్లు డైరీలో వ్రాసుకొని, దానిని దరియాప్తు చేయుటకై లాకప్‌లో ఉంచవలసి వచ్చినదని చెప్పవచ్చును. ఒక వ్యక్తిని గురించి, విప్లవాత్మకమైన చర్యలను, విధ్వంసక చర్యలను, దౌర్జన్య చర్యలను గడంచు చున్నటుల తమకు ఎవరో కొందరు రహస్య చారులనుండి వర్తమానము వచ్చుచున్నదని డైరీలో ప్రతి వారము వ్రాయుచు, కొంత రికార్డును తయారు చేసి, జిల్లా మేజస్ట్రీటుకు, ఛీఫ్ సెక్రెటరీకి పంపి, "ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము" క్రింద అరెస్టు చేసి, విచారణలేకనే నిర్బంధమున ఉంచవచ్చును. తాను అట్టి అక్రమ చర్యలు, నేరములు చెయ్యలేదని ఋజువు పెట్టుకొనవలసిన భారము పౌరులపైన (ప్రజలపైన) ఉన్నది. ఋజువుభారము పోలీసువారిపై లేదు. ఛీఫ్ సెక్రెటరీకాని లేక హోంశాఖ మంత్రికాని ఏమి చేయగలరు? పోలీసువారు పంపించిన రిపోర్టులు అసత్యమని ఎటుల ఖండింప గలరు? అట్లు ఖండించుటకు వారికి ఆధారములు ఎక్కడనుండి చిక్కును? అరెస్టుకు వారంటు యియ్యనిచో పోయినచో ఏమికేసు మారునని యని, న్యాయమునందు బుద్ధిగల ఎటువంటి ఛీఫ్ సెక్రెటరీకాని, విధిలేక వారంటు జారీచేయవలసినదే యుండును.

ఈ విషమైన పరిస్థితుల్లో కొనసాగిన బ్రిటీషువారి పరిపాలనముక్రింద ఎందరో అమాయకపు ప్రజలు, దేశభక్తులు పోలీసువారి చేతులలో చిక్కి, పడరాని కష్టములను అనుభవించినారు. 1818 సం॥ మూడవ బెంగాలు రెగ్యులేషన్ చట్టము క్రింద వంగరాష్ట్రములో ఎందరో యువకులు, యువతులు, విద్యార్థులు నిర్బంధముల పాలై, ఏండ్లకొలది కారాగృహములలో జీవితములను గడిపి యున్నారు. ఈ కష్టములను కాంగ్రెసువారు అనుభవించి యున్నారు. పోలీసువారి అక్రమ దారుణ చర్యలు వారికి క్రొత్తగాదు.

అదృష్ట వశమున బ్రిటీషు పరిపాలనము తొలగినది. బ్రిటీషువారి దృష్టిలో మొదటి శత్రువుగ పరిగణింపబడుచుండిన శ్రీ జవహర్లాలు నెహరుగారే ఇండియా ప్రధానమంత్రిగా ఉన్నారు. ఇప్పుడు ప్రజలు సేవకులు కాదు. పోలీసువారు సేవకులు కాదు. ప్రజలే ఇప్పుడు దేశమునకు నిజమైన అధికారులు. పెద్ద పెద్ద ఉద్యోగములలోగాని, లేక చిన్న చిన్న ఉద్యోగములలోగాని పని చేయుచున్న వారందరు ప్రజల సేవకులుగాని, ప్రజలకు అధికారులు కారు. ప్రజాసేవకులుగాని, ప్రజలకు యజమానులు కారు. ఈ భావము ఇంకను ప్రభుత్వ

(మిగత 7 వ పేజీలో)

వ్యవసాయదారులకు:—

# "కుడ్జువైన్" గడ్డి—దాని ఉత్పత్తి.

"కుడ్జువైన్" గడ్డి ఒక మేలు రకపు పచ్చిక పైరు. వేసిన చోట అనేక ఏండ్ల పాటు పెరిగి, పచ్చికను లభింపచేయును. దీనిని అమెరికాలో భూమి బిగుతనానికి, పచ్చికకు, విశేషముగా పెంచుచున్నారు. మొక్క నలువైపులకు వ్యాపించును. ఒక్కొక్కసారి దాని కాడ పొడవు 50 అడుగుల వరకు ఉండును. కాడ యొక్క ప్రతి గెనుపు దగ్గర వేరు పూసి, భూమిలోకి చొచ్చుకొని, మరుసటి సంవత్సరము వేరొక మొక్కగా మారును. ఈ విధముగా వేర్లు భూమిలో దట్టముగా అల్లుకొని, భూమిపైని సారవంతమైన మట్టిని కొట్టుకొని పోకుండ ఆపుదల చేయును. అందుచేతనే అమెరికాలో ఈ లాభకరమైన గడ్డిని, పెద్ద కాలవ కట్టలు, చెఱువు కట్టలు, రైలుకట్టలు కోత పడకుండ, గట్టిగా నిలుపుటకు విశేషముగా వుపయోగించుచున్నారు. ఈ గడ్డి యొక్క వేర్లు లోతుగా వుండుటచేత, భూమి లోతుకు చొచ్చుకు పోవడము వల్ల, నీటి అభావము లేకుండ వేసవి కాలములో కూడ పెంచవచ్చును. ఈ మొక్క సామాన్యముగా శీతాకాలములో ఎండిపోయి, నేలకు పచ్చి యెరువును అందజేయును. ఆ విధముగా భూమి సారవంతమై మరల మొక్క వసంత కాలములో చిగురించునప్పుడు బలము నిచ్చును. ముఖ్యముగా వేసవి కాలములోను, వర్షా కాలము లోను ఎంతో పచ్చగా వుండి, చూచుటకు కన్నుల పండువుగ నుండును. ఇది ఎంతో శ్రేష్ఠమైన పచ్చిక పైరు. ఒకే చేలో అవలంభించే పంటల మార్పిడి విధానములో ఈ పైరును ప్రవేశపెట్టిన, భూమిలో బలము అధికమై, తరువాత వేసే ధాన్యపు పంట అధికముగా పండును.



ఈ పచ్చిక ఒక మాదిరి సారవంతము గాని, ఎక్కువ సారవంతముగా గాని వుండే అన్ని రకముల నేలల యందు, భారాళముగా పెరుగ గలదు. మురుగు పోని ప్రాంతములలో అంత వృద్ధిగా పెరుగదు. నిస్సారమైన భూములలో ఎరువు వేసిన ఈ పైరు పుష్కలముగా పెరుగ గలదు. సామాన్యమైన వర్షపాతము గల తేలిక భూములు ఈ పైరుకు ఎంతో అనుకూలమైనవి.

ఈ మొక్క పేరుకొనిన మంచును తాళజాలదు. శీతకాలములో ఎండి, ఆకులు రాల్చి, ఎండలు ముదిరిన కొద్ది మరల చిగుర్చును.

**విత్తనములు లేకుండ పెంచుట:—**

"కుడ్జు" తక్కువ విత్తనములు ఉత్పత్తి చేయుటచే, దీనిని సాధారణ పద్ధతులలో పెంచవచ్చును. వేరు పూసిన చిన్న చిన్న కాడ ముక్కలను, భూమిలో నాటి ఈ పైరును వృద్ధి చేయవచ్చును. ఈ పద్ధతుల వల్ల గడ్డి భూమిలో అతి త్వరితముగా వ్యాప్తి చెందదు. అన్నిటికన్న ఉత్తమమైన మార్గము జనవరి, ఫిబ్రవరి మాసాలలో, ఈ గడ్డి జాతి దుబ్బ పిలకలలో నాటి, ఈ పైరును పెంచుట. ఈ పద్ధతి ఎక్కువ తృప్తికరమైన ఫలితములు కలిగినవి. ఈ దుబ్బు కాడలోని లావైన కణుపు భాగము. ఇది త్రికోణాకారముగా వుండి, రెండు, మూడు పుష్టికరమైన వేర్లు, కొన్ని చిన్న చిన్న మొగ్గలు కలిగి యుండును. పుష్టికరమైన వేర్లు లేకుండ, ఒక లావైన కణుపు ముక్కనే నాటిన లాభము లేదు. ఒకటి రెండు సంII ముల వయస్సు గల లేత పిలకలు, ముదురు దుబ్బుల కన్న శ్రేష్ఠమైనవి. డిశంబరు మాసాంతరములో కాని, జనవరి ప్రారంభములో కాని "కుడ్జువైన్" మోడుగా ఉన్నప్పుడు, దుబ్బు ముక్కలు నాటవలెను. భూమినుండి తీసిన తరువాత, నాలుగైదు రోజుల వరకు, ఈ దుబ్బులను నాటుటకు పనికి వచ్చును. కాని వీనికి

(మిగత 6-వ పేజీలో)

రాత్రి వీరెల్లరు భోజనము చేసుకొని, మాటలాడుకొనుచు ఈ భిన్న మతస్థులైన ఈ యువతీ యువకులకు మధ్య ఏర్పడిన ప్రేమను గాంధీజీకి తెలిపి, వారిని ఒకటిగ చేయు విధానమును సూచించుటకై సలహా నడుగ వలెనని తీర్మానించుకొనిరి. మఱు దినము ఉదయముననే అందరును ఢిల్లీలో గాంధీజీ కుటీరమునకు వెళ్ళి జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగ తెలిపిరి. వీరి చరిత్ర అంతయు గాంధీజీ విని, ఆనంద పరవశుడై సుధాకరుని, ఆ యువతి తలలపై ఎన్నో మారులు చెయ్యి పెట్టుచు, "నీవు ఆదర్శ యువతివి. మతమునకు జాతికిని అతీతురాలవు. మీ ఫీజి దీవుల సాంప్రదాయము ప్రకారము ఈ యువకుని వివాహమాడి సంతానవతివై భారతదేశ శిరోమణివై కీర్తి గాంచు"మని దీవించెను. మేఘదత్తు సుమిత్రా దేవులను పిలిచి మీరు సందేహింపకుడు. లక్ష్మీనారాయణ దేవాలయమునకు సమీపమున శ్రీ అభేదానందస్వామి వారున్నారు. వారి యనుజ్ఞపొంది వారి యెదుటనే ఈశ్వర సాక్షిగా వీరిద్దరికిని వివాహము చేయు"డనెను. వారెల్లరు సెలవు తీకొను నపుడు గాంధీజీ నాలుగు అడుగులు నడిచి వచ్చి సుధాకరుని, ఆ యువతిని దగ్గఱగ చేతులు పట్టుకొని నిలువబెట్టి తన ఆశీర్వాద మొసగెను.

పరిశుద్ధ ప్రేమ ప్రాబల్యముచే, భిన్న మతస్థులైన ఈ యువతీ యువకులు మాలతీ సుధాకరులు, భార్యాభర్తలై గృహస్థ జీవితములో ప్రవేశించిన విషయము, గాంధీజీ పలుమారు జరుపుచుండిన ప్రార్థన సభలలో తెలుపుచు, ఆ దంపతులను పౌరుల కెఱుక పఱచు చుండిరి. పవిత్రమైన ప్రేమ జాతి మతముల కతీతమైనదగునని వీరి సాదృశ్యమును సూచించుచు, చెప్పుచుండిరి. మాలతి పలుమారు గాంధీజీ బసకు వెళ్ళి వారిని దర్శించుకొని మాటలాడి వచ్చుచుండెడిది. ఈ దంపతులిప్పుడు "ఫీజీ" దీవులలో సెంట్రలు ఆస్పత్రి యందు వైద్యులుగ పనిచేయుచున్నారు.

మాలతీ సుధాకరుల అన్యోన్య ప్రేమ దినదినాభివృద్ధి గాంచుచు, పరిపూర్ణత నొందెను. కల్మష రహితమైన ప్రేమ మతమును జయించెను. ప్రేమయే దైవము. ప్రేమయే ఆనందము. ప్రేమయే ఈశ్వర కల్పితమైన అనుభూతి. ప్రేమకు మించిన దీలోకమున వేరొండు కలదా! (సమాప్తము)

---

కుడ్జువైన్ గడ్డి — దాని ఉత్పత్తి. (5—వ పేజి తరువాత)

తేమగా వున్న గోనె సంచులలో చుట్టి యుంచుట మంచిది. ఈ విధముగా ఏంత దూరప్రదేశములకు కూడా ఎగుమతి చేయవచ్చును. ఆ విధముగా ఎగుమతి చేసిన వానిలో, నూటికి 70 దుబ్బులు బ్రతికినట్లు కూడ ఆధారములున్నవి.

వేళ్ళ పరిమాణమును బట్టి గుంతలను త్రవ్వి, దుబ్బులను నాటవలెను. తేలిక భూమిగాని, ఇసుక భూమిగాని అయినట్లయితే దుబ్బు ముక్కలను ½ అం. మేర వరకు మన్నుతో కప్పుట మంచిది. సట్టు భూములలో పెంచవలెనన్న దుబ్బులు సరిగా భూమిమట్టముతో వుండునట్లు నాటవలెను. బొరకలు పడకుండ, దుబ్బు చుట్టు మన్నుతో గట్టిగా త్రొక్కవలెను.

భూమి కొంచెము తేమగా వుండునట్లు ఈ దుబ్బులకు ప్రతి మూడో రోజు, నాలుగో రోజు నీటిని పెట్టుట అవసరము. ఎక్కువ నీరు మాత్రము పెట్టకూడదు. ఈ విధముగా జనవరి ప్రారంభములో నాటిన "కుడ్జువైన్" ఉష్ణత అనుకూలముగా వున్న, మూడు వారములలోనే అంకురించుట ప్రారంభించును.

నీటి సదుపాయము లున్న భూమిలో త్వరగా ఈ గడ్డి దుబ్బులను నాటుట మంచిది. లేకపోయిన, లేత మొక్కలు వేసవి కాలమంతటను, తట్టుకోవలసి యుండును. అప్పుడు కొన్ని దెబ్బ తినకుండ జరుగును. నీటి సదుపాయములు లేని చోట, 12 అం.ల వ్యాసముగల మట్టి తొట్లలో వుంచి, ప్రతి రోజు నీరుపోసి పెంచుట మంచిది. తొట్లను వేడి గాలులు తగులకుండ చూడవలెను. ఇప్పటి వఱకు తొట్లలో నాటి పెంచిన దుబ్బులను ఋతుపవనము ప్రారంభము నుండి, కావలసిన భూములలో తిరిగి నాటవచ్చును. మొక్కకు, మొక్కకు మధ్య 15 ను 20 అడుగుల దూరము వుండవలెను. కలుపు మొక్కలు లేకుండ చూచుట అవసరము.

ఈ "కుడ్జువైన్" గడ్డి, మూడు సంవత్సరముల త[illegible] వాత కొద్దిగ విత్తనములను వుత్పత్తి చేయును. [illegible] క్క పై పొట్టు గట్టిగ వుండును కాబట్టి, మంచి[illegible] లను బాగుచేయవలెను. వ్యవసాయ పరిశోధన కేంద్రము, న్యూఢిల్లీలో యీ విత్తనములను, మామూలు [illegible] నాటుటవల్ల తృప్తికరమైన ఫలితాలు [illegible]. [illegible] లను ముందుగా తయారుచేసిన తొట్లలో, [illegible] రెండు మూడు రోజులు నీరుపోయుచుండవలెను. [illegible] కాలము మే, జూన్ మాసములు. ½ అం. [illegible] 1 అం. [illegible] పైన లోతుగా నాటకూడదు. తొట్లను [illegible] సంచులతో కప్పవలెను. సస్యములు, ఎలుకలు [illegible] చూడవలెను. ఆరు వారాల తరువాత, ఈ మొలకలు [illegible] నుండి 6 అం. ఎత్తు పెరిగితే, 12 అం. వ్యాసము గల [illegible] మట్టి తొట్లలో ఈ మొలకలు తిరిగి నాటవలెను. నీటిని [illegible] చగా చల్లవలెను. లేకపోయిన ఈ మొలకలు ఎక్కువ నీటిలో చనిపోవుటకు అవకాశమున్నది.

మొక్కలను మనకు కావలసినచోట నాటిన తరువాత, 4 ఔన్సుల అమ్మోనియము ఫాస్ఫేటు, ఎరువు వేయవలెను. భూమి ఎండిపోయి [illegible] గా వున్న [illegible] గా చూచుచుండవలెను. వాలు భూములలో ఈ గడ్డిని నాటిన, నీటికి కొట్టుకొని పోకుండా [illegible] గట్టు వేయవలెను. [illegible] స్థితులన్ని అనుకూలంగా వుంటే రెండుమూడు సంవత్సరములలో దట్టముగా పెరుగును. ఒకసారి పెరిగిన తరువాత దానికి నీటి ఆధారము అవసరము లేదు.

మట్టి తొట్లలో దుబ్బుల నుండి పెంచిన, "కుడ్జు" మొక్కలు వ్యవసాయ పరిశోధన కేంద్రాలయందు, న్యూఢిల్లీలో, మొక్క 1-కి 1—8—0 చొ॥న దొరుకును. దుబ్బు మొక్కలు డిశంబరు, జనవరి నెలలలో, సప్లయి చేయుదురు. అదే కేంద్రము నుండి మాదిరి విత్తనములు కూడ సప్లయి చేయుదురు.

## ఆటము శక్తి — పోలీసు శక్తి.

(3-వ పేజి తరువాత)

మును సాగించుచున్న మంత్రులలోను, అధికారులలోను, పోలీసుశాఖవారిలోను, ప్రజలలోను కలుగకున్నది.

పోలీసు పరిపాలనమును గూర్చి 1950 సం॥ నివేదిక ఒకటి ఈ డిశంబరు నెల మొదటివారము లో ప్రకటింపబడినది. దానిని ఎంతమంది పాఠకులు చదివియుందురో, దాని ప్రాముఖ్యతను ఎంతమంది గ్రహించి యుందురో, చెప్పలేము. దానిలో అన్నివిధములైన నేరములు, హత్యలు, దోపిడులు, దొంగతనాలు, 1949 సం॥ కన్న 1950 సం॥ లో ఎక్కువైనవని తెలుపబడియున్నవి. శాంతి భద్రతలను కాపాడుటకై పోలీసువారు 97 సారులు ప్రజలపై కాల్పులు జరిపిరని ప్రకటింప బడినది. కారణములతోను, సంజాయిషీలతోను పనిలేదు. అణుశక్తి రీతి పోలీసువారికి కల్పించిన అధికారము ప్రజలకు మంచి చేయుటకును, ప్రజలలో క్షోభ కలిగించుటకును ఉపకరించును. బ్రిటీషువారు వారి అధికార ప్రాబల్యమునకై గావించుకొని యుండిన పోలీసు చట్టములు, రూల్సులు, పద్ధతులు మన కాంగ్రెసు మంత్రులు రద్దు చేయవలెను. ఇప్పటికి కూడ పోలీసువారననిన ప్రజలలో ముందుండిన అసూయ, భయము పోలేదు. ప్రజల సేవకుల మను భావము పోలీసువారిలో ఈ దినము వరకును కలుగలేదు. వారికి ముందుండిన దృష్టి మారలేదు. ఏ ప్రదేశములోకాని, ఏ విధమైన నేరములు జరిగినను అందుకు పోలీసువారే బాధ్యులయి యుండవలెనని కఠినమైన ఉత్తరువులు జారీచేయవలెను. చీమచిటుక్కు మనినచో, ఆ ప్రాంతములోని పోలీసులు శిక్షార్హులని చాటవలెను. ఏ పోలీసు స్టేషన్ ఆవర్ణములో నేరములు తక్కువగ యుండునో, ఆ స్టేషనులోని అధికారులకు పోలీసు ప్రోత్సాహము లివ్వబడునని ప్రోత్సహింపవలెను. లంచగొండితనము, చీకటి మార్కెటులు నిర్మూలించువారికి ప్రత్యేక బహుమతు లివ్వబడునని తెలుప వలెను. విద్యావంతులను, నీతి ప్రవర్తన గలవారినే పోలీసు శాఖలో చేర్చుకొనుటకు కట్టుదిట్టము లేర్పరుప వలెను. అప్పుడే పరిపాలనము శ్రేయోదాయకమైన (వెల్ ఫేరు స్టేట్ — రామరాజ్యముగ) పరిపాలనముగ మారొందగలదు. మంత్రివర్గమువారి ఘనత శ్లాఘింప బడును. ఈ మార్పులు పోలీసు పరిపాలనములో తెచ్చుటకు మంత్రులు ప్రయత్నించెదరా!

---



**గాంధీజీ జ్ఞాపకార్థము**

ప్రతిదినము ఆయన ప్రార్థనకాలమగు సాయంకాలము 5 గంటలకు, అన్ని పనులను 5 నిమిషములు ఆపి, ఆయనను జ్ఞాపకము చేసి కొందురుగాక!!

# పాఠకులకు నా కృతజ్ఞత.

(శ్రీమతి. యస్. పద్మావతీదేవి గారు)

ఇటీవల "భారతజ్యోతి" పత్రికలో— "స్త్రీలు—సమానహక్కులు—హిందూ కోడు బిల్లు" అను శీర్షిక క్రింద ఆరు వ్యాసములను వ్రాసితిని. ఆ వ్యాసములు పాఠకులకు విసుగు కలిగించి యుండునేమో; కోపముపుట్టించి యుండునేమో, యని భయపడు చుంటిని. కాని వానిని గుఱించి నాకు పాఠకులనుండి వచ్చుచున్న ప్రోత్సాహకరమైన ఉత్తరములను చూడ, ఆ వ్యాసములను పాఠకులు విమర్శన దృష్టితోను, వాత్సల్య భావముతోను చదువుచున్నారను సంతసము కలిగినది. నాలో ఏమాత్రము గొప్పతనము లేదు. నా వ్రాతలలో నెంతమాత్రము క్రొత్త విషయములు లేవు. నేను వైద్యవృత్తి నవలంభించుచు, నా అక్క చెల్లెండ్ర సేవ జేయుచు, కొంచము ప్రపంచ అనుభవమును గడించితిని. ఆ యనుభవమును నా తల్లులఎదుటను, నా అక్కగారి యెదుటను పెట్టవలయునను సంకల్పమే ఆ వ్యాసములు వ్రాయుటకు నన్ను పురికొల్పినది. నాకు యోగ్యత లేకున్నను, నా వ్రాతలను ప్రశంసించుచు, వ్రాసిన సోదర సోదరీమణులకు వినయముతో నా కృతజ్ఞతను తెలుపుకొను చున్నాను.

రాయలసీమ కంతయు పెద్దలును; విద్యావంతులును, విజ్ఞానవంతులైన శ్రీ. తాడిమఱ్ఱి భుజంగరావు పంతులుగారు కూడ నా వ్యాసములపై మంచియభిప్రాయ మొసగినటుల పత్రికా సంపాదకులు నాకు వ్రాసియున్నారు. నా వ్రాతలలో గొప్పతనమేమి లేకున్నను, వారికి నాపై అయాచితముగ, కలిగిన ప్రేమయే నా వ్యాసములపై సంతృప్తిని వెలిబుచ్చుటకు కారణమై యున్నదని తలచెదను. ఈ పత్రికా ముఖమున బహిరంగముగ ఆ పెద్దలకు ఈ జోహారు లర్పించుకొనుటకు నా కవకాశ మివ్వ సంపాదకులను ప్రార్థించుచున్నాను.

నా వ్యాసములు తేలికైనవి కావనియు, హాస్యరహితమై, విపరీత భావములు కలిగి, బరువుగానున్నవనియు; చదువరుల నాకర్షింప జాలినవి కావనియు కొందరుపాఠకులు అభిప్రాయమును వెలిబుచ్చినటుల సంపాదకులు నాకు సందర్భవశమున వ్రాసియున్నారు. ఇదికూడ నాకు సంతోషమే. ఎవరి వ్రాతలుకాని పాఠకులందఱిలోను [illegible]సిద్ధమైన అభిప్రాయమును కలుగ జేయ గలవని చెప్పుటకు వీలు లేదు. పాఠకుల సహజ మనోప్రవృత్తులపై కూడ వారి భావములు ఆధారపడి యుండును. కొందఱికి హాస్యరస మిష్టము; కొందఱికి కథలు యిష్టము; కొందఱికి శాస్త్రవిజ్ఞానమునిన యిష్టము; కొందఱకు ఆటపాటలనిన యిష్టము; కొందఱికి సంగీతమిష్టము; కొందఱికి రాజకీయములిష్టము. మఱికొందఱికి భక్తి వైరాగ్యము లనిన యిష్టము. అందఱికిని, అన్నియు యిష్టములు కావు. నా వ్రాతలలో శృంగార హాస్యరసములు బొత్తిగా లేవని నే నంగీకరించెదను. మన హిందూ సంఘము నైతిక పునాదులపై పెంచబడినది. జాతి యొక్కయు, సంఘము యొక్కయు, వ్యక్తిగతమైన కుటుంబముల యొక్కయు పవిత్రత (గొప్పతనము) స్త్రీల నైతిక జీవితముపై ఆధారపడి యున్నది. ఆ పవిత్రతను హిందూ స్త్రీలు కాపాడుకొనగలిగినంతకాలము, ఎన్ని యుగాంతరములు కలిగినను, ఎన్ని తుపానులు వచ్చినను, ఎంతటి భూకంపములు కలిగినను, హిందూ సంఘము చెడకుండునని నా విశ్వాసము.

స్త్రీలు మాతృత్వము వహించి, ఉన్నత స్థానములో నుండవలసిన మహాశక్తులుకాని, శల్య,మాంస, రక్తముల కంటుకొనియున్న ఇంద్రియ పటుత్వమునకు లోనై, నైతిక జీవితములకు కళంకము తెచ్చుకొనకూడదని తీవ్రమైన అభిప్రాయము గలవారలలో నేనొకదానను. స్త్రీలు తమయొక్క అవయవ నిర్మాణములో గల ప్రత్యేకమైన ప్రాముఖ్యతను, తమ తమసహజ శక్తులయొక్క హద్దును గుర్తెరిగి, జాతి ఔన్నత్యమునకును, స్వకుటుంబ గౌరవ ముగ్యాదలకును అనుగుణ్యముగ ప్రవర్తింపవలెనని నా యాశయము.

భావములకు (తలంపులకు) కాళ్ళున్నవని నమ్ము పిచ్చి వారలలో నేనొకదానిని. నా అక్కచెల్లెండ్ర వ్యక్తిత్వమునకై మంచివని నాకు దోచు భావములను పత్రికా మూలమున వెలిబుచ్చినచో అవి నూటికి ఒక్కరినైనను ఆకర్షించినచో, వారి నుండి క్రమ క్రమముగ స్త్రీ సంఘములో ప్రచారమునకు రావచ్చునని నా తలంపు. దానిని దృష్టియం దుంచుకొని వ్యాసములను వ్రాయుచున్నాను. నా పాండిత్యము కాని, నాలోని గర్వమును కాని, ప్రతిబింబింప జేయుటకై నేనీ వ్యాసములను వ్రాయులేదు. నా వ్రాతలలోని చెడ్డలను, లోపములను దెలిపినచో సవరించుకొందును. వైద్యవృత్తిలో సేవ చేయుటయేగాక, పత్రిక మూలమున సేవచేయ కుతూహలముతో వ్రాయుచున్నాను.

"భారతజ్యోతి" పత్రికలలో నేను ప్రకటించిన వ్యాసముల నన్నిటిని ప్రత్యేకముగ ఒక పుస్తక రూపమున ప్రకటించి, తెలుగు తెలిసిన ప్రతి హిందూ కుటుంబమునకు ఉచితముగనో లేక అత్యల్ప వెలతోనో అందచేయ వలెనని తలంపు కలదు. నా ఆర్థిక స్థితి అందు కవకాశ మివ్వ లేదు. రాయలసీమలో గల పెద్దలు, ధనవంతులు యిందుకు ప్రయత్నించినచో, నేనెంతయో కృతజ్ఞురాలనై యుండగలనని విన్నవించు చున్నాను. స్త్రీలు, యువతులు నా వ్యాసములను చదివి, నిర్మాణ దృష్టితో చర్చించి, విమర్శించి, అందులోని మంచి చెడ్డలను తెలిపినచో, అట్టి వారికి ఋణస్థురాలనై యుండగలనని మనవి చేసుకొను చున్నాను.

---

## ఎన్నికలు – ఓటరు గమనింపవలెను.

ఓటర్లు ఎవరైనను, ఎన్నికలకు నిలుచు అభ్యర్థులకు (కాండిడేట్లకు candidates) ఏజంట్లుగా (Agents) తాము నివసించు ప్రదేశమున గాక, తాము ఓటర్లుగా రిజిష్టరు చేయబడిన ప్రదేశమునగాక, ఇతర ప్రదేశములకు పోవలసియుండినచో – తాము ఓట్లను ఎక్కడ ఏజంట్లుగా పనిచేయుదురో ఆ ప్రదేశము నుండియే పోస్టు ద్వారా ఓటుచేయుటకు ప్రభుత్వము వారు అనుకూలము గావించియున్నారు. అట్టి వారు పోలింగు ప్రారంభమగు కాలమునకు 7 దినముల ముందుగా ఆయా నియోజక వర్గముల రిటర్నింగు ఆఫీసరు గారికి పూర్తి వివరములతో వ్రాసుకొనవలెను. ఒక నియోజక వర్గము నుండి – వేరొక నియోజక వర్గములోనికి పోవలసియున్నచో, తాము ఏ నియోజక వర్గములో ఓటరుగా రిజిష్టరయి యున్నారో ఆ నియోజక వర్గముయొక్క రిటర్నింగు ఆఫీసరు ద్వారా – తాము ఏజంటుగా పనిచేయు నియోజక వర్గము లోని రిటర్నింగు ఆఫీసరు గారికి పోష్టలు ఓటింగుకై వ్రాసుకొనవలెను. (పార్లమెంటు) అసెంబ్లీకి ఓటు చేయుటకు ప్రత్యేకమైన జాబును, పార్లమెంటుకు ఓటు చేయుటకు మరొక జాబును పంపుకొనవలెను.

ఉదాహరణము:– కోడూరులో "అ" అను వ్యక్తి రాజంపేటలో ఒక అభ్యర్థికి ఏజంటుగా పనిచేయవలసి యుండినచో, కోడూరు రాయచోటి – రెండు చేరి ఒక రిటర్నింగు ఆఫీసరు హద్దులోనే యున్నది కనుక, రాజంపేట రిటర్నింగు ఆఫీసరుగారికి రాయచోటిలో నుండి పోష్టు ద్వారా ఓటుచేయుటకు జాబు వ్రాసుకొనవలెను.

"ఇ" అను వ్యక్తి కోడూరు నుండి జమ్మలమడుగులో ఒక అభ్యర్థికి ఏజంటుగా పనిచేయవలసి యుండినచో, రాజంపేట రిటర్నింగు ఆఫీసరు వేరు; జమ్మలమడుగు రిటర్నింగు ఆఫీసరు వేరు కనుక, రాజంపేట రిటర్నింగు ఆఫీసరు ద్వారా జమ్మలమడుగు రిటర్నింగు ఆఫీసరు గారికి పోష్టలు ఓటుకై జాబు పంపుకొనవలెను.

◆◆ ◆◆ ◆◆

చంటి బిడ్డలు గల స్త్రీలు, తమ బిడ్డలను ఎత్తుకొని పోలింగు బూతులలోకి పోయి ఓటుచేయుటకు సర్కారు వారు అనుమతి యొసగియున్నారు. ఎవ్వరుకాని బిడ్డలను చంక నెత్తుకొని వచ్చు స్త్రీలను అభ్యంతరము చేయరాదు.

# నిర్భాగ్య జీవులు.

గ్రంథకర్త – విక్టర్ హ్యూగో.
(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు గారు, బి.ఏ.,బి.ఎల్.,)

(న్యాయశీలుడు — మిరియల్.)

(21—11—1951 సంచిక తర్వాత)

సాంఘిక జీవితమునందెట్టి అభిప్రాయములు మిరియల్‌కు కలవో సరిగా గృహ జీవితమునందును అట్టివే కలవు. ఇంట తానై తెచ్చి పెట్టుకొన్న దారిద్ర్యమును చూచిన వారికి, అది యొక గంభీర మనోహర దృశ్యముగా నుండెడిది. అందరు వృద్ధులు చింతన పరులవలె ఆయనకూడా చాలాకొద్దిగా నిద్రించును. కాని అది గాఢ నిద్ర. ఉదయ మొక గంట ప్రొద్దున అతడు ధ్యాన మొనరించెను. తరువాత గదిలోనో, తన యింటనో, సమూహ ప్రార్థనానంతరము రొట్టెయు, పాలును సేవించును.

బిషప్పు ప్రతి దినమును చేయవలసిన పనులెన్నో కలవు. ఊపిరి సలుపు నవకాశముండదు. ఏరవంత వీలు దొరకినను, బీదలకు, రోగులకు దుఃఖితులకు సేవ చేయుటకై వినియోగించును. ఇంకను వ్యవధియున్న కాయకష్టము సేయును. ఇంకొకప్పుడు వ్రాయుటయందో, చదువుటయందో నిమగ్నుడగును. ఈ వ్రాత, చదువులను తోటపనిగనే గణించెడు వాడు. "ఆత్మ యొక తోట"యనును.

మధ్యాహ్న వేళ, వాతావరణ మనుకూలముగ నుండిన, వాహ్యాళి వెళ్ళును. అప్పుడును గుడిశలలో నివసించువారిని దర్శించును. యోచనా నిమగ్నుడై, నేల చూచుచు, పొడుగాటి చేతికఱ్ఱ యూతతో, బిషప్పు దుస్తులతో, కాళ్ళీడ్చుకొని నడచును.

ఆయన దారి నడచుటొక ఉత్సవము కలిగించును. త్రోవ నడుచునప్పుడాయన విజ్ఞాన జీవమును వెదజల్లుచు పోవు ననవచ్చును. ఉదయసూర్య భగవానుని చూచుటకు వలె, వృద్ధులును, శిశువులును ఆయన దర్శనమునకై ద్వారముల కడకు పరుగువెట్టుదురు. ఆయన వారిని దీవించి, వారి శుభాశంసనములను పొందును. ఎవరికేమి కావలశియున్నను, ఆయన యిల్లు చూపుదురు.

అప్పుడప్పుడు మార్గ మధ్యమున నిలిచి పసి పిల్లలతో సంభాషించి, వారి తల్లుల గాంచి స్మితము కావించును. డబ్బున్నప్పుడు బీదల యిండ్లకును, లేనప్పుడు ధనికుల యిండ్లకును వెళ్ళును.

ఆయన చొక్కా, సర్వేసు చాలా యెక్కువైనది. దానిని మరుగు సేయుటకై ఉడా నిలువు గౌను లేక ఇలుపిడ జాలడు. వేసవి కాలమందిది కొంతచిక్కే.

మరలివచ్చి మధ్యాహ్న భోజనము సేయును. అది యు రొట్టె, పాలే.

రాత్రి యెనిమిదిన్నరకు చెలియలి పంక్తిలో భోజనము. మగ్లోరు వెనుక నిల్చుని, వడ్డించును. ఇదియు అతిమిత భోజనమే. ఎవరైన అతిథులుండిరా, సమీప సరస్సునుండి చేపలు తెప్పించియో, పరిసర సత్రాల వంటి మాంసము [illegible]యో, మగ్లోర్ మృష్టాన్నము పెట్టెడిది. ప్రతివ్యారే అతిథియైనప్పుడును, ఇట్టి భోజనమునకు సాకు. బిషప్ అడ్డు చెప్పడు. ఇట్టి యవసరములదప్ప, ఉడికిన శాకములును, నూనె వేపుడు రొట్టెయు దప్ప ఇతరముండదు. కావున "క్యూరేటు విందు సేయని సమయములలో బిషప్ ట్రాపిస్టుకు (అనన్య సామాన్య మితభోజనమే నియమము గాగల క్రైస్తవ పరివ్రాజకులు) విందు కుడుపును," అని నగరవాసులు నవ్వుకొందురు.

రాత్రి భోజనానంతరము బాప్టిస్టినాతో, మగ్లోర్‌తో మాటాడుచు, ఆ గంట గడుపును. తరువాత తన గదికి పోయి యేమేని వ్రాసికొనును. ఆయన బండితుడు. తాను వ్రాసిన అయిదారు వ్రాత ప్రతి గ్రంథములను అట్లే పెట్టిపోయినాడు.

కొన్ని వేళల, ఏ పుస్తకము చదువుచున్నప్పటిని [illegible] న్నట్లుండి ధ్యానమగ్నుడగును. మరల బాహ్య జగత్తునకు రాగానే, ఎదుటనున్న పుటపై తోచినది వ్రాయును.

ఈ వ్రాతకును, ఆ పుస్తకమునకును సంబంధమేమియు నుండదు. ఒక పుస్తక పుటంచున యిట్లు వ్రాసియున్నాడు.

"ఓ కాలానవచ్చిన్నా! నిన్నుకొందరు సర్వశక్తిమంతుడందురు. స్రష్టయని, స్వాతంత్ర్యమని, సమస్తము, జ్ఞానము, పవిత్రము, వెలుగు, ప్రభువు, విధి, సామ్రాజ్యము, న్యాయము, దేవుడు, తండ్రి, అనుకంప — అని యిన్ని విధముల నామకరణము చేసియున్నారు. కడపటిది అన్నిటికన్న మనోహరమైనది."

తొమ్మిది గంటలు కాగానే, ఆ స్త్రీలు మేడమీది తమ గదులకు వెళ్ళిపోదురు. అతడొంటరిగ క్రిందనే నిలుచును. ఇక్కడ ఆయన యింట నున్న దున్నట్లు చెప్పవలెను.

# ప్రపంచ రాజకీయములు.

ప్రపంచములో నుండు వివిధ దేశముల నుండి, రేడియోల వల్లను, వార్తాపత్రికల వల్లను చేయు వార్తలనుపట్టి చూచిన, ఆటంబాంబులు నిషేధింప బడుననియు, ప్రపంచ శాంతికి హాని కలుగుననియు, తలచుటకు వీలులేకున్నది. రష్యాదేశము పదే పదే ఆటంబాంబులు ఏ షరత్తులేక నిషేధింప వలెనని చెప్పుచున్నదెల్ల, రష్యాదేశములో ఆటంబాంబులు లేవనియు, అమెరికాదేశములోనే అవి యెక్కువగ యున్నవనియు, అందువల్లనే మొట్టమొదట వానిని నిషేధింప వలెనని రష్యాదేశము ప్రచారము చేయుచున్నదని అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు మొదలైన పెద్దదేశములు తలచుచున్నవి. ప్రపంచములో నుండు అన్ని దేశములకన్న రష్యాదేశములోనే ఎక్కువ ఆయుధములున్నవి. సైనిక బలము ఎక్కువగ యున్నది. రెండు సంవత్సరములలోపల పశ్చిమదేశము లన్నియు తమ సైనిక బలమును, ఆయుధ బలమును ఎక్కువ చేసి కాని రష్యాదేశమును ఎదిరింపగల శక్తిని పూర్తిగా సంపాదించుకొను వరకును, ఆయుధ బలమును, సైనిక బలమును తగ్గించు విషయమే చర్చింపకూడదని, ఈ పెద్ద దేశములు తలచుచున్నవి. అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు దేశములు ఒక పక్షముగ చేరియున్నవి. రష్యాదేశము మాత్రము వేరుగా నున్నది. రష్యాదేశమును అమెరికా దేశము నమ్ముటలేదు. అర్థము చేసికొన వలెనని ప్రయత్నించుటలేదు. అమెరికా దేశమును రష్యాదేశము నమ్ముటలేదు. అర్థము చేసుకొనుటలేదు.

ఫ్రాన్సు పట్టణములో ఈసారి ప్రపంచ ఐక్యదేశ సమితిసభ జరిగినది. ఆ కూటమిలో అంతర్భాగమైన రాజకీయ సభలో ఆయుధ విసర్జన సమస్యపై, అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, రష్యా దేశ ప్రతినిధులు నాలుగురోజులు చర్చలు జరిపిరి. ముఖ్యాంశముపై ఏకాభిప్రాయమునకు రాజాలక పోయిరి. ఐక్యదేశముల కూటమికి అధ్యక్షులైన డా॥ పడీల్లా నిర్వోగాయు శక్తిసామర్థ్యముల నుపయోగించి, ఈ నాలుగు దేశముల ప్రతినిధులను ఒక్క చోటుకు దగ్గరకు చేర్చియున్నారు. ఆయుధ విసర్జనసంఘ నిర్మాణమునకై ఈ నాలుగు దేశములు అంగీకరించినటుల ఒక సంయుక్త ప్రకటనను ప్రచురింపజేసి యున్నారు. ఆ చెంబులోని నీటిని ఈ నాలుగు దేశములవారు త్రాగుదురా అను ప్రశ్నకు ఎవ్వరు సమాధాన మివ్వజాలకున్నారు.

అణుశక్తితో సంబంధముగల మారణాస్త్రముల నన్నింటిని ఏవిధమైన షరత్తులు లేకుండ తక్షణమే నిషేధింపవలెను. ఏయే దేశములలో ఇప్పుడు ఎంతెంత సైనిక బలమున్నదో, ఆయుధ బలమున్నదో దానిలో మూడవ భాగమును వెంటనే తగ్గించివేయ వలెను. ఇవి రష్యాదేశము చేయుచున్న ముఖ్య సూచనలు. ఈ ప్రతిపాదనలపై రష్యాదేశము పాశ్చాత్య దేశములను పదే పదే సవాలు చేయుచున్నది.

పాశ్చాత్య దేశములలో చెప్పుకో గలిగినంత సైనిక బలముగాని, ఆయుధ బలముగాని లేదు. ఈ దేశము లన్నియు తమ రక్షణకు, అమెరికాదేశములో తయారుచేసి పెట్టబడియుండు అటంబాంబులపైనను, రాకెట్లు, షెల్సు, అణుశక్తితో నడచు సబ్‌మెరైనులపై ఆధారపడి యున్నవి. ఇదే ఇందులోని రహస్యము. అందువలన వెంటనే ఆయా దేశములలోని సైనిక సంఖ్యను, ఆయుధ సంఖ్యను బయలుపెట్టి, మూడవ భాగము తగ్గించుటకుమారు, మెట్టు మెట్టుగా తగ్గించుకొనుట కంగీకరించెదమని పాశ్చాత్యదేశములు చెప్పుచున్నవి.

బ్రిటిషు ప్రతినిధి సెల్విన్‌లాయిడ్ మాటలాడుచు, "రష్యాదేశములో సైనిక బలము, ఆయుధ బలము, ఎక్కువగ నున్నది. ప్రపంచ శాంతికి భంగము కలుగుచున్నది. అంతర్జాతీయ సంఘ యాజమాన్యము క్రింద మొదలు రష్యాదేశము ఆయుధములను, సైన్యమును తగ్గించినచో కాని, శాంతి రక్షణకు అత్యవసరమైన పనికరములను (అటం బాంబులను) మేము (అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు) నాశ చేయజాల' మని స్పష్టమైన పదములతో తెలిపెను. ప్రపంచ శాంతికి ఈ అటంబాంబులు అవసరమని ఈ పాశ్చాత్యదేశముల తత్వమైయున్నది.

ఒక్క విషయములో ఈ పాశ్చాత్యదేశములు పొరబాటు చేయుచున్నవి. రష్యాదేశములో అటంబాంబులు లేవని భావించుచున్నవి. ఇదే పొరబాటు. అమెరికా మొదలైన దేశములలో అటంబాంబులను వేసి, విధ్వంసము చేయగల శక్తి రష్యాదేశమునకు గలదు. ఇవి సాధారణములైన ఆయుధములు కావు. ఒక్క ప్రేలుడుతో దేశములే బూడిదగ మారిపోవును. ప్రపంచ శాంతి కొఱకు రష్యాదేశమే ఈ మారణాస్త్రములను, ఏలాటి షరత్తులు లేక, నిషేధించుటకు ముందుకు వచ్చునప్పుడు, శాంతి స్థాపనకు స్తంభములని చెప్పుకొను అమెరికా దేశము ఇందుకు ఆక్షేపింపకూడదు. రష్యాదేశముయొక్క ప్రతిపాదనలను అంగీకరించియే తీరవలెను.

◆◆◆ ◆◆◆ ◆◆◆

ఐరాన్ (పర్షియా) దేశములో ఆర్థిక దుస్థితి యెక్కువైనది. నూనె బావులలో పనిని ప్రారంభించుటకు యెక్కువ ఆతురత పడుచున్నది. నూనెను ఎగుమతి చేసుకొని, తమకు కావలసిన వస్తువులను దిగుమతి చేసుకొనుటకై ప్రయత్నించుచున్నది. ఈ ఆర్థిక కష్టముల వలన ముఖ్యమంత్రి మొసాదిక్

(మిగతా 14-వ పేజీలో)

# ప్రజాభిప్రాయ వేదిక.

## శ్రీ బాలనారాయణరెడ్డిగారికే మీ ఓటు.

ఆర్యా,

మీ పత్రిక ద్వారా ప్రొద్దుటూరు తాలూకా వోటర్లకు ఎన్నికల సమయములో వొక విజ్ఞాపన చేసుకొనేందుకు అవకాశ మివ్వవలెనని కోరుతాను.

రాష్ట్ర శాసన సభకు ప్రొద్దుటూరు నియోజక వర్గము నుండి చాలమంది పోటీచేయుచున్నారు. కాంగ్రెసుపార్టీ పక్షమున శ్రీ కె. బాలనారాయణరెడ్డిగారు పోటీచేయుచున్నారు. ఈయనతో పోటీచేయు ఇతర అభ్యర్థులను వ్యక్తి పరముగ విమర్శించడమునకు నేను దిగను. అది అందరి గౌరవమునకు లోపము. కాని ఇందులో ఒక్కమాట ఉన్నది. శ్రీ. బాలనారాయణరెడ్డిగారు పెద్ద ధనవంతుడైన రైతు కాకపోవచ్చును. ఇప్పుడు పోటీచేసే వారందరి పైకి ఎక్కువ చదువుకున్నవాడు. దీనిని ఎవరుకాని లేదని చెప్పరు. చెప్పజాలరు. కాంగ్రెసు పాలనక్రింద కంట్రోళ్ళు మొదలైనవాని మూలమున ప్రజల కందరికి కొన్ని కష్టములు యేర్పడినవి. ధరలు యెక్కువైనవి. కాని యెదుటిపార్టీ అభ్యర్థులు శ్రీ బాలనారాయణరెడ్డిగారి యోగ్యతకు మించినవాండ్లుగా ఉంటే, సరే బాగుండేది. అట్టివారు ఒక్కరులేరు. అందువల్ల ఈ తాలూకాలోని వోటర్లందరు శ్రీ బాలనారాయణ రెడ్డిగారికే వోట్లను ఇవ్వవలెనని ఉన్నారు. ఇదేమాట ప్రతి గ్రామములోను వినవచ్చుచున్నది. పోటీచేసే మిగత క్యాండిడేట్లందరు, పోటీలేకుండా—కర్చులేకుండా ఊరక బాలనారాయణరెడ్డిగారికి జయము కలిగించడమా అనే మూర్ఖమైన పట్టుదలతో, న్యూసెన్సు విలువను కలుగజేయుటకై పోటీచేయుచున్నారు. అందుకై ఆయనకూడ కర్చుపెట్టుకొని తిరుగవలసి వచ్చినది. ఎవరిని అడిగినా 'నాకే బాగుంది, నాకు బాగుంది' అని చెప్పే కాండిడేట్లేగాని, 'నేను ధృఢముగ అయితా' నని చెప్పే క్యాండిడేటు నాకు కనుపడ లేదు. శ్రీ బాలనారాయణరెడ్డిగారికి దృఢముగ అయితానిసే నమ్మకము ఉన్నది. కాని మిత్రులు, ఓటర్లు ప్రశ్నించిన 'ఇంతమంది పోటీలో నేనెట్లు చెప్పగలను. నా గెలుపు ఓటర్ల చేతులో ఉంది. నాపై నమ్మకముంటే వాండ్లు నాకే ఇస్తారు. నేను ఎం. ఎల్. ఏ. గా ఉండి, వ్యక్తిగతముగా ఏమీ సాధించలేక పోయినా పార్టీ రూల్సుకుకాని, నీతికికాని వ్యతిరేకముగా నడుచుకోలేను. పార్టీకి చేరినవారింతా ప్రతి ఒక్కరిని నీవేమి చేసినావు అని అడిగితే యెవ్వరు ఏమీ చెప్పలేరు. కాంగ్రెసుపార్టి అంతా ఏకముగా మన రాష్ట్రములో కొంత చేసినది. ముందు చేస్తుంది' అని వినయముగ చెప్పుకొనుచున్నారు.

కనుక ప్రొద్దుటూరు నియోజకవర్గమునకు చేరిన ఓటర్లు అందరును, విద్యాబుధులందు ఇతర అందరకాండిడేట్లకన్న యోగ్యుడుగా నున్న శ్రీ బాలనారాయణరెడ్డిగారికే ఓటు చేసి, వ్యక్తి పరముగా ఆయనకు, పార్టీపరముగా కాంగ్రెసునకు జయము కలిగింప వలెనని ప్రార్థించుచున్నాను.

ప్రొద్దుటూరు. యస్. శ్రీనివాసులు.

---

## కాంగ్రెసు చేసిన తప్పిద మేమిటి?

ఆర్యా,

ఎన్నికలు సమీపించుకొలది కాంగ్రెసును నిందించుట, కాంగ్రెసు అభ్యర్థులను తూలనాడుట ప్రతిపక్ష సంఘ సభ్యులకు నిత్యకృత్యమైనది. ఎన్నికలలో జయమొంది, జనాళిని బోల్చగలమని దెల్పు, నేటి క్రొత్త సమాజములు కాంగ్రెసును తిట్టి, బజారున పెట్టి అవమానపరచి, తమ స్వార్థమునకు, సంకుచిత భావమును 'ఎన్నికల ప్రచారి' నను [illegible] దాడుచున్నారు. కారణ మేమి? అధికారవాంఛయే గదా? ...... అట్టి పరిస్థితిలో కాంగ్రెసు వాదులే స్వార్థపరులు, అనికారవాంఛాపరులు యని నిందించుటలో గల సత్య మేమి?

నేను గాకపోయిన, రేపైన కాంగ్రెసువాదులే ప్రస్తుత అధినాయకులు తీసివైచి, నిర్మలముగ చేయువగలను [illegible] గలదు. కాని అట్టి ఆశ నేడు కేవలము అధికారవాంఛతో ఎన్నికల సమయమున ఉద్భవించిన సంఘములందు గలదా? ఎన్నికల ప్రణాళికయందు కనుపించిన విధముగ [illegible] కన్న మరే సంస్థయందు ఎక్కడుగ గలవు?

చిన్న అధికారులను మోసగించుకొని పెద్ద ముద్రగులవలెనే మనమే లంచగొండి తనము నేర్పించుచున్నాము. బస్సు కండక్టరు టికెట్టు లేదనిన రెండింతలు [illegible] ను. ఎట్లయిన టికెట్టు యివ్వమని మనమే కోరుచూ [illegible] ము. "ఓనరు గాడు" యుండని ప్రార్థించునపుడు [illegible] ర్చు గలమని సమాధానము చెప్పుచూ యున్నాము. మనము యిచ్చు దబ్బుకు ఆశపడి, మన తెల్లని బట్టలకు భయపడి, ఎవడైన నోరు వచ్చిన ప్రయాణీకుడు యుండిన వానిని దింపి,

మనల శిక్షించును. కండక్టరు టిక్కెట్టు లేదనినప్పుడే మనము వెళ్ళిపోయిన ఏపేచీ యుండునది కాదు. కాని, మన ధనము — అవసరము రెండు ఏకమై, న్యాయవర్తిగ యుండగోరు అధికారిని లంచగొండితనమునకు ప్రోత్సాహపరచునని చేయును. మరొక పర్యాయము మనము టిక్కెట్టు కోరిన, ఎటులైనను రెండింతలు చార్జి యిచ్చుకోగలవారమని తెలిసి, మానవ సహజగుణమగు ఆశతో, వెంటనే 'భర్తీ అయినది' అనును. తర్వాత కార్యక్రమము మనము నేర్పినదే.

'తాగ వద్దు — తాగనివ్వ వద్దు' అని ప్రభుత్వము శాసించితే, తాగి తందనాలాడి, తాగినవారిని దాచిపెట్టి, అంతటితో ముగించక, ఆ వ్యాపారము సాగించి, అన్ని విధాలా ప్రభుత్వమును మోసము చేయుచున్నాము. ఎక్కువగ పంటలు పండించి గాజులు నింపుతున్నా, గ్రామోద్యోగులను కూడగట్టుకొని, తక్కువ లెక్కలు వ్రాయించి, అనవసరముగ క్షామమును కల్పించి, రెండింతలు, మూడింతలు ధరలకు దాపరికముగ అమ్ముకొనుచున్నాము. ప్రభుత్వము చేయు చట్టము లెప్పటికీ అన్యాయముగ నుండవు. మన హృదయము మంచిదైన, చట్టములు సక్రమముగ అమలు జరుగును. మన ప్రభుత్వమని చెప్పిన నోటి వెంట అనుచూ, మన ప్రభుత్వపు శాసనములనే చేతులారా నాశనము చేయ సంకల్పించిన ఎవనిది అన్యాయము? ఎవనిది న్యాయము? ప్రజలదా? ప్రభుత్వముదా?

కాంగ్రెసు ప్రభుత్వమును నిందించుచున్న పెద్దలంతా నేడు పై నగ్న సత్యాన్ని గుర్తించవలసి యున్నది. ఒక్కసారి తమ హృదయమును నిష్కపటముగ విమర్శించుకొనవలసినదిగా కోరుచున్నాను. కాంగ్రెసు ప్రభుత్వము చేసిన తప్పిదమేమియు లేదు. వారిని అన్ని విధముల వ్యాకులపరచుచు కొనసాగుచుండు వారే ఈ పాపాలన్నీ చేయునది.

భిన్నాభిన్నమైన దేశమును ఒక త్రాటిన గట్టి, గట్టి పునాదులు వేయదలచుకొనియున్న సమయమున మన ఓటును కాంగ్రెసు అభ్యర్థుల కివ్వక, 'ఎండమావులను చూపి, నీటి పట్టని' భ్రమింపజేయు నూతన సంఘములకు వేయూతనిచ్చి, పైకి తెచ్చుట, మనలను, మన సంతతిని గోతిలో పాతిపెట్టి కొనినట్లగును.

కడప. శ్రీధర రామనాథశర్మ.

## ముస్లిము ఓటర్లకు మనవి.

ఆర్యా!

ఇప్పుడు జరుగనున్న ఎన్నికలలో జాతి, మత, కుల భేదములు లేక, వయస్సు వచ్చినవారి కందరికీ ఓటుచేయు అధికారము ఇవ్వబడినది. ఎన్నికల కాలము దగ్గరకు వచ్చేవరకు ఎన్నో క్రొత్త పార్టీలు పుట్టినవి. వాని నన్నిటిని జ్ఞాపకము పెట్టుకొనుటయే కష్టముగ ఉన్నది. ముస్లిములు అందరు ఈ ఎన్నికల సమయములో ఒక్క విషయము జ్ఞాపకముంచుకో వలెను.

గాంధిమహాత్ముడు ముస్లిముల కొఱకై, ఏసుక్రీస్తు వలె తన ప్రాణములను అర్పించినాడు. గాంధి మహాత్ముడు చంపబడిన తర్వాత, పండిత జవహర్‌లాలు నెహ్రుగారు ఇండియా యూనియన్‌లో నివసించే ముస్లిముల కందరికి ఒక గొప్ప పోలీసు అధికారిగా యుండి, వారి రక్షణమును, మంచిచెడ్డలను చూచుకొనుచున్నారు. ఎన్నికలలో ముస్లిములకు తగుమైన ప్రాతినిధ్యము ఇవ్వవలెనని, రాష్ట్ర కాంగ్రెసు సంఘములకు, సెలెక్షన్ బోర్డులకు ఉత్తరువులనంపి, మైనార్టీగా ఉన్న ముస్లిములపై గాఢమైన ప్రేమను ఋజువుచేసి యున్నారు.

సిరియా నూతన తగాదా విషయములో, నూతన పరిశ్రమను జాతీయము చేసుకొనుటకు సిరియా ప్రభుత్వమునకు సర్వహక్కులు ఉన్నవని బహిరంగముగ ప్రకటించి యున్నారు. ఈజిప్టు స్వాతంత్ర్యమునుగూర్చి మాటలాడుచు, ఈజిప్టు స్వతంత్రదేశ మగుటకు ఎవ్వరు ఆక్షేపించకూడదని తెలిపి యున్నారు. టర్కీ దేశముతో స్నేహ సంబంధమైన ఒడంబడికను, ఇటీవలనే ఇండియా ప్రభుత్వము — టర్కీ ప్రభుత్వము గావించుకొని యున్నారు.

ఇట్లు ఇండియా యూనియన్‌లోయున్న ముస్లిములపైనను, ఇండియాకు వెలుపల నున్న ముస్లిము దేశములపైనను, పండిత జవహర్‌లాలు నెహ్రుగారు ప్రతినిత్యము తమ స్నేహ భావమునే ప్రకటించుచున్నారు. రాజకీయములలో పండిత నెహ్రుగారి నాయకత్వము క్రింద కాంగ్రెసు సాధింపలేని కార్యములు, ఇంక యే యితర రాజకీయ పార్టీలు సాధింపలేవు. ఇండియాలోఉన్న ముస్లిములందరు పండిత నెహ్రు గారికి ఎంతో ఋణపడి యున్నారు. వీరు ముస్లిములకు తండ్రిగా ఉన్నారు. ఇట్టివారి నాయకత్వముపై ముస్లిములందరు విశ్వాసము ప్రకటించుట ధర్మమై యున్నది.

కనుక ఈ ఎన్నికలలో ముస్లిము సోదరులెల్లరు పండిత నెహ్రుగారు నిలిపిన కాంగ్రెసు అభ్యర్థులకే తమ ఓట్లను ఇచ్చి, తమ కృతజ్ఞతను ప్రకటింపవలెనని ప్రతి ముస్లిము సోదరుని, సోదరీమణిని ప్రార్థించుచున్నాను.

కడప. కాదర్ మొహిదీన్.

## బస్సులలో ప్రయాణికుల కష్టములు.

ఆర్యా,

కడప — టంగుటూరు — రాజంపేట రూటులో నాలుగు బస్సులు తిరుగుచున్నవి. బస్సులలో యుండు డ్రైవర్లు, కండక్టర్లు బస్సులలో ప్రయాణముచేయు ప్యాసింజర్లను, వారు చేరవలసిన స్థలములకు సరియైన కాలమునకు చేర్చుట లేదు. వీరికి అనుకూలముగయుండు చోట్లయందు — అనగా

కాఫీ హోటళ్ళు, వీరి సొంత పనుల కొరకు గంటలకొద్ది బస్సులను నిలబెట్టి ప్యాసింజర్లను కష్టపెట్టు చున్నారు. మరియు వారి పనుల కొరకు ఎక్కువ కాలము వృథా చేయు చున్నారు. ప్యాసింజర్లు వారు చేరు స్థలమునకు సరియైన కాలమునకు చేరుటలేదు. పైన కనుపరచిన విషయములు మా గ్రామము వారికే కాకుండా, మా ప్రాంతముచుట్టుపట్ల గ్రామస్తులు అందరు, యీ కష్టములకు గురియగుచున్నారు. కావున వెంటనే వీరికి సరియైన క్రమ శిక్షణ యివ్వవలయును.

భోయునపల్లె. జానపాటి శేషయ్య.

## ప్రపంచ రాజకీయములు.

( 5-వ పేజీ తరువాత )

నాయకత్వము పోవుననియు, క్రొత్త మంత్రివర్గము వచ్చినచో తమ కనుకూలమైన షరత్తుల నంగీకరించుననియు బ్రిటీషువారు ఆశ పెట్టు కొనుచున్నారు. ఎవ్వరు తలవని తలంపుగ గడువు మీరక ముందే ఎన్నికలను జరిపి, తన నాయకత్వమును బలపఱచు కొనవలెనని మొసాదిక్ ఆలోచించుచున్నాడు. అప్పుడు అమెరికావారి సహాయమును ఎక్కువ గౌరవ స్థానమునుండి పొందవచ్చునని తలచుచున్నాడు. నూనె పరిశ్రమను తాత్కాలికముగ ప్రపంచ బ్యాంకు స్వాధీనము చేయుటకు ముఖ్యమంత్రి అంగీకరించినట్లు తెలియుచున్నది. ఈ ప్రపంచ బ్యాంకి ఆ నూనె నంతయు, ఆంగ్లో ఇరేనియన్ కంపెనీకే విక్రయించి, న్యాయమైన ధరలకు ప్రపంచములోని దేశముల కన్నిటికిని పంచుటకు ఏర్పాటు చేయవచ్చును. ప్రపంచములో ఉండు ఇట్టి భారీ పరిశ్రమలు ప్రపంచ బ్యాంకుల పరిపాలనలోనికి వచ్చుట చాలా మంచిది.

## గ్రంథ పరిచయము:—

భారత కథలు: గ్రంథకర్త: శ్రీ కైప రామమూర్తిగారు, క్రొత్తపూరు, అనంతపురము. వెల రు. 0—4—0.

“భారత కథలు” అను శీర్షిక క్రింద ఆర్య సాంప్రదాయమునకు చేరిన నలచరిత్ర, సావిత్రి చరిత్రలు క్లుప్తముగ నిందు వ్రాయబడినవి. కీ॥ శే॥ బహుగ్రంథ నిర్మాతలగు వావిలికొలను సుబ్బరావుగారి “ఆర్య కథానిధి” అను చిన్న చిన్న కథల పుస్తకములవలె బాల బాలికల కత్యంతోపయుక్తముగ నుండు రీతి వ్రాయబడినది. శైలి సులభమై మనోహరముగ నున్నది. బాల్యప్రాయముననే పిల్లల యెదుట గొప్ప ఆదర్శములను పెట్టి, వానిపై మనస్సును జొప్పించుట కిట్టి గ్రంథము లుపయోగపడును. ఇట్టి ఆదర్శవంతములైన కథల నింకను గ్రంథకర్తగారు వ్రాయుదురు గాక యని కోరుచున్నాము.

# రూపాయలు విలువ తగ్గుట — మన దేశ దౌర్భాగ్యము హెచ్చుట.

(శ్రీ. యస్. వెంకటాద్రి, ఎం. ఏ.,)

మన దేశములో ఇప్పుడు ఏపైపు చూచిన యెక్కడలేని దౌర్భాగ్యము ఏర్పడడము, బీదవారు, మధ్యతరగతుల వారు, అన్న వస్త్రములులేక మలమల మాడిపోవడము ముఖ్యముగ రూపాయకు ధర తగ్గిపోవుట వల్ల యేర్పడిన కష్టములే. దేవుడుకాని, ప్రకృతి పరిస్థితులుకాని తెచ్చిపెట్టిన కష్టములు, కావు. రూపాయకు విలువ తగ్గుటవల్ల యేర్పడిన కష్టములు. ఒకరిని బాధించి, మఱియొకరిని విడుచుట లేదు. 35 కోట్ల మంది భారతీయులను దయ్యమువలె పట్టి పీడించుచున్నది. రక్త మాంసములను తినివేయుచున్నది. ఈ దయ్యమును తరిమివేయకుండ నెహురు ప్రభుత్వమువారుగాని — ముందు రాబోవు ప్రభుత్వమువారుకాని, తలలు క్రిందబెట్టి, కాళ్ళు పైకెత్తి తపస్సు చేసినా బీదల కష్టములు బాపలేరు. దినము లు గడుచుకొలది బీదవారందరు చచ్చిపోవలసి యుండును. ప్రాణములతో యుండుటకు వీలుండదు.

ఇండియా ప్రభుత్వ ఆర్థికశాఖామంత్రి శ్రీ సి. డి. దేశముఖ్ గారు డిశంబరు నెల 10-వ తేదీ కలకత్తాలో వాణిజ్య సంస్థలో మాటలాడుచు, ‘దేశములో ప్రజల జీవిత కర్చులు 100 కి 457.5 వఱకు కడచిన ఏప్రెల్ నెలలో పెరిగె’ నని (Price index number) చెప్పిరి. సామాన్యమైన ప్రజలకు దీని అర్థము తెలియదు. దీని రహస్య అర్థము ప్రజల కందరికి తెలియక భావమలో ఆర్థిక మంత్రులు, ఆర్థిక శాస్త్రవేత్తలు మాటలాడరు.

1939-వ సంవత్సరములో ధరలు (ఆహార ధాన్యము ధరలు, జీవితమునకు అవసరమైన యితర వస్తువుల ధరలు—ప్రజల జీవిత కర్చులు) 100 గా ఉండెనని తలచినచో, 1951-వ సం॥ ఏప్రెల్ నెలకు 457.5 అంతలు ఎక్కువగ పెరిగినవని అర్థము. రూపాయి యొక్క విలువ కొంచెను యించుమించుగ 450 అంతలు తగ్గినదని అర్థము. 1939 సం॥ నాలుగు అణాలకు ఎంత ధాన్యము చిక్కుచుండెనదో, ఎంత గుడ్డ చిక్కుచుండినదో, ఇతర అవసర వస్తువులు ఎంత చిక్కుచుండెనవో, అంతే పరిమాణముగల వస్తువులు 1951 సం॥ లో కొనవలెనన్న ఒక్క రూపాయకు కొంచెము ఎక్కువ అగు

తున్నది. వస్తువుల పరిమాణములో ఎక్కువయేమీ లేదు. కాని ధరలలో 450 అంతలు ఎక్కువ పెరిగినదని అర్థము. 1939 సం॥ లో 4 అణాలకు కొనగలిగిన వస్తువును, 1951 సం॥ లో కొనుటకు 12 అణాలు ఎక్కువ కావలెను. 1939 సం॥ లో ఒక్క రూపాయకు చిక్కుచుండిన వస్తువులు, 1951 సం॥ లో 4½ రూపాయలు పెట్టినకాని చిక్కదని దీని అర్థము. అనగా రూపాయధర 450 అంతలు తగ్గినదని తెలుసుకొనవలెను. కడచిన 12 సంవత్సరముల లోపల రూపాయ ధర 450 అంతలు తగ్గిపోయినది. 1939 వ సం॥లో ఒక కుటుంబము రు. 100—0—0 తో జీవనము గడుపుచుండినచో, అదే కుటుంబము ఇప్పుడు 1951 సం॥లో జీవింపవలెనన్న, కనీసము రు. 450—0—0 లు కావలెను. ఇది అధికారులు చెప్పెడి లెక్కలవల్ల తేలిన పరిస్థితులు.

నిజమైన పరిస్థితులు దేశములో యింకను భరింపరానివిగ నున్నవి. 1939 సం॥లో రూపాయ విలువ 450 అంతలు మాత్రమే తగ్గలేదు. 800 అంతలు తగ్గినది. 1939 సం॥లో రూపాయ ధరలో ఇప్పుడు రూపాయ ధర 2 అణాలకు వచ్చినది. అనగా 1939 సం॥లో ఒక్క రూపాయకు వచ్చెడి వస్తువులు ఇప్పుడు యెనిమిది రూపాయలు ఇచ్చినకాని రావు. ఇందువలన ఒకే నియమితమైన ఆదాయము— జీతములు వచ్చు, స్త్రీ, పురుషుల జీవితములు తారుమారై పోవుచున్నవి. వారి బిడ్డల జీవితములు చూచుటకు [illegible] కాదు. తల్లిదండ్రులు బిడ్డలను అమ్ముకొనుచున్నారు.

1939 సం॥ ఈ దేశములో చెలామణియందు ఉండిన కరెన్సీ నోట్లు, రూపాయలు అన్నియు చేరి రు. 172 కోట్లు ఉండెను.

1945 సం॥ ఈ చెలామణి 1,200 కోట్ల రూపాయలకు పెరిగెను.

1946 సం॥ సెప్టంబరు మొదలు 1947 సం॥ మార్చి నెల ఆఖరుకు ఇంకను 55 కోట్ల రూపాయలు ఎక్కువ చేయబడెను. 1947 సం॥ సెప్టబరు నెల మొదలు, 1948 సం॥ మార్చి నెల ఆఖరులోపల మరలా 128 కోట్ల రూపాయలు ఎక్కువ చేయబడెను.

అనగా 1939 సం॥ లో 172 కోట్లు చెలామణిలో ఉండిన రూపాయలు 1948 సం॥ మార్చి నెల లోపల 1,283 కోట్ల రూపాయలకు పెంచబడెను. కొంచము ఇంచుమించుగ ఒక్క వెయ్యికోట్ల రూపాయలు 10 సంవత్సరముల కాలములో ఎక్కువ చెలామణికి వచ్చెను. 600 అంతలు పెరిగెను. దీనికి అనుగుణ్యముగ రూపాయ విలువ 600 అంతలు తగ్గెను. రూపాయ విలువ 1948 సంవత్సరమునకు 2 అణాలు 8 పైసలకు దిగినది. ఈ విషయములు సామాన్య ప్రజలందరు చాలా అర్థము చేసుకొనవలెను. ఇప్పుడు ఒక రూపాయ విలువ 32 పైసాలు (దమిడీలు) మాత్రమే.

ధరలకును — చెలామణిలో యుండు ద్రవ్య పరిమాణమునకును ప్రత్యక్ష సంబంధ మున్నది. ధరలు ఎక్కువైనవంటే— దేశములో చెలామణిలో యున్న ద్రవ్య పరిమాణము ఎక్కువైనదని అర్థము. ఉదాహరణకు మన దేశములో నివసించు ప్రజలందరి దగ్గరను, ప్రభుత్వపు బొక్కసములోను ఉన్న ద్రవ్యమంతయు చేర్చి లెక్కించిన 100 రూపాయలు ఉన్నవనుకొనుడు. ఈ దేశములో పండు వరిధాన్యమంతయు చేర్చి లెక్కించిన 10 పుట్లు మాత్రమే ఉత్పత్తి అగుననుకొనుడు. అప్పుడు ఈ వరిధాన్యమును కొనవలెనన్న ఒక పుట్టి వెల రు. 10 లు అగును. 100 రూపాయలకు 10 పుట్ల ధాన్యము వచ్చును. ప్రభుత్వము బ్యాంకులలో అప్పు చేయుట వల్లనో, లేక ఎక్కువ కరెన్సీ నోట్లను అచ్చువేయుట వల్లనో, మరి రు. 100 లను ఎక్కువ చేసిన దనుకొనుడు. అప్పుడు చెలామణిలో యుండు ద్రవ్యము రు. 200 అగును. దేశములో 10 పుట్ల ధాన్యమునకు బదులు 20 పుట్ల ధాన్యము పండినచో, అప్పుడుకూడ ఒక పుట్టి ధాన్యము ధర రు. 10 లే యుండును. అట్లుగాక చెలామణిలో రు. 200 ఉండి, ధాన్యము మాత్రము 10 పుట్లు మాత్రమే ఉత్పత్తి అయినచో, అప్పుడు ఒక పుట్టి వెల రు. 20 లు అగును. వడ్ల ధర రు. 10 నుండి రు. 20 లకు పెరిగినది. పెరిగినది, నూరంతలు ఎక్కువైనది. వస్తువుల పైనను, కూలివారి కిచ్చు వేతనముల పైనను ధరలు పెరిగిన వని చెప్పినచో, చెలామణిలో ఉన్న ధనము యొక్క ఉత్పత్తి పెరిగిన దనియు, అందు కనుగుణ్యముగ పదార్థముల ఉత్పత్తి పెరుగలేదనియు అర్థము.

## ( 2 )

చెలామణిలో నున్న ద్రవ్య పరిమాణమును (కరెన్సీ నోట్లను, రూపాయలను) ఎక్కువ చేయరాదనిన, రూపాయ విలువపై (నాణ్యము విలువపై) దౌర్జన్యము చేయరాదని అర్థము. చెలామణిలో నున్న నాణ్యముతో ఏ ప్రభుత్వము వ్యభిచరించుచూ, ఆ ప్రభుత్వము చాలకాలము నిలువ జాలదని ఒక ఆర్థిక సూత్రమున్నది. కొంతమంది రాజకీయ నాయకులు "ధరలను అదుపులో నుంచవలెను. పనివాండ్ల కూలీలను (వేతనములను — wages) కంట్రోలు చేయవలెను" అని కేకలు వేయుచుందురు. ఈ రెండు పద్ధతులు అవలంభించినను, అధిక చలామణివల్ల కలిగిన చెడ్డ ఫలితము తొలగదు. చెలామణిలో ఉన్న ద్రవ్య పరిమాణము ఎక్కువకాకయుండి, వస్తువుల ఉత్పత్తి ఎక్కువైనచో, రూపాయకు విలువ హెచ్చును. ఎక్కువ పరిమాణముగల అవసర వస్తువులు తక్కువ ధరలకు చిక్కును. మంచి వస్తువులు